# ఆంధ్ర సంస్థానములు : సాహిత్యపోషణము

(సాహిత్య అకాడమీ బహుమతినందిన రచనము)

డా. తూమాటి దోణప్ప, ఎం.ఏ., పిఎచ్.డి.



కృతిస్వీకర్త



ఆంధ్రప్రదేశ ముఖ్యమంత్రి మాన్యశ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు

## అంకితము

ఆంధ్రప్రదేశ ముఖ్యామాత్యులు

ఆనంద నిలయులు

కళాపోషక మూర్ధన్యులు

మాన్యులు

శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారికి

# మనవిమాటలు

ఆంధ్రసాహిత్యము నిన్నమొన్నటి దాఁక రాజాశ్రయమున మూఁడు పూవు లాఱుకాయలుగా వర్ధిల్లుచు వచ్చినది. నేఁడు ఆ రాజులులేరు; అట్టి రాజ్యములులేవు. ఆ రాజ్యముల స్థానమున నూతన లక్షణములుగల ప్రభుత్వము లేర్పడినవి. సాహితీపోషణ నిర్వహణ భారము సంస్థానముల నుండి 'సాహిత్య అకాడమీ' వంటి సంస్థలకు సంక్రమించినది.

ప్రాచీనమును వర్తమానముతో సమన్వయించి, భవిష్యత్తునకు పథకములు రచియించుట ప్రగతికి ప్రథమ సోపానము. ఈ పరమార్థము ప్రధాన లక్ష్యముగాఁ గలిగిన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారు పోటీకి ప్రకటించిన వ్యాసవిషయమును పురస్కరించికొని రూపెత్తిన రచన మిది. ఈ రచనమునకు అకాడమీ బహుమానము లభించినది. తదుపరి విజయనగర సంస్థాన చరిత్రము మాత్రము దీని కదనముగా అనుసంధానితము.

ఆంధ్రప్రదేశమునందలి సంస్థానములు, ఎస్టేటులు మొత్తము నాలుగు వందలపైఁబడి. సాగరాంధ్రమునందలి జమీందారీలు, పశ్చిమాంధ్రమునందలి పాళయములు, తెలంగాణమునందలి సంస్థానములు నిందు ప్రసక్తములు. వీనిలో విద్యలను, కళలను పోషించినవి లెక్కకు నూఱున్నొక్కటి. వీని చరిత్రాదికములు అకారా ద్యనుక్రమమున నీ గ్రంథమున సంగ్రథితము.

వీనిలో గద్వాల, గొడే, జటప్రోలు, దోమకొండ, నూజివీడు, పిఠాపురము, పెద్దాపురము, బొబ్బిలి, ముక్త్యాల, వనపర్తి, వెంకటగిరి, సురపురము — వంటి సంస్థానములు విజయనగర సంస్థానమునకువలె ప్రత్యేక గ్రంథరచనమునకు పలసినంత విషయవైశాల్యము, వస్తువైవిధ్యము కలవి. గ్రంథవిస్తరభీతివలన వీనిని గుఱించి యిందు కుదిమట్టముగా కూర్పవలసి వచ్చినది.

మధుర, పుదుక్కోట, తంజాపురాదులు ఆంధ్రనాయకుల వలన రాజ్యములేగాని సంస్థానములు కావు. ఇప్పుడుగాని, మఱియొకప్పుడుగాని అవి అచ్చపు టాంధ్రభూములలోని సీమలు కావు. అందువలన నవి ప్రకృత చర్చా

పరిధిలోనికి రావు. జయపుర సంస్థాన చరిత్రమును విడిగా రచియించు ప్రణాళిక సిద్ధముగా నున్నందున దాని ప్రసంగము నిందుఁ గానరాదు.

నిర్దిష్ట విషయ పరిధి చాల యెక్కువః ఉన్న వ్యవధి మరీ తక్కువ. అందును ఉలుకుల పరుగులమీఁద పని సాగించుటవలన వెనుదిరిగి చూచి కొనుటకు ఉసులుబాటు దొరకినదికాదు. ఉన్నంతలో విలువయిన విషయ విన్నంత కన్నంత తెలియ వచ్చినంత తేటపఱుచుటకే యెత్తుగడ. పొరపాట్లు, కూర్పులు మలి ముద్రణమున జతనుపడఁ గలవని మనవి.

జూన్ 19, 1969

రచయిత

## కృతిపరిచయకర్త



ఉత్తరప్రదేశ రాజ్యపాలకులు, ఆంధ్రప్రదేశసాహిత్య అకాడమీఅధ్యక్షులు
మాన్యశ్రీ డా. బెజవాడ గోపాలరెడ్డిగారు

# కృతిపరిచయము

ఆంధ్రదేశమునందలి జమీందారీవ్యవస్థ మన చరిత్రములో ఒకభాగమయి పోయినది. ఈ వ్యవస్థ రద్దయి దాదాపు ఇరువది సంవత్సరము లయినది. నాటినుండి జమీందారుల బరువులు, బాధ్యతలు, సమస్యలు, సాధకబాధకములు — అన్నియు ప్రజాప్రభుత్వముల పరమయినవి. అయినను ఇటీవల జరిగిన కొన్ని ఎన్నికలలో వెనుకటి జమీందారులలో కొందరిపట్ల, ఈ నాటికిని ఆయా జమీల ప్రజలకెట్టి భక్తివిశ్వాసములుగలవో వెల్లడి అయినది. జమీందారీ వ్యవస్థ గర్హింపదగినదే అయినను కొందరు జమీందారులు ఉన్నత సంప్రదాయములను పోషించుచు, సాహిత్య సంస్కృతులకు పరిరక్షకులుగా కావించిన సేవమాత్రము విస్మరింపరానిది. వీరిలో స్వయముగా కవులును, పండితులును అయిన సంస్థానాధిపతులు సైతము ఎందరో కలరు. కర్తలు, కారయితలు అయిన సంస్థాన పాలకుల ఆశ్రయములో ఎందరో పండితులు, కళాకారులు పలురీతుల కళారాధనము గావించిరి. కవులు తమకృతులను పోషకులగు ప్రభువులకు అంకితము చేయుచుండుట, కావ్యముతోపాటు తమ కీర్తి కూడ సాహిత్య చరిత్రమున సుస్థిరము కావలెనని కొన్ని కొన్ని సందర్భములలో ప్రభువులే కృతియిమ్మని కవులను అర్థించుచుండుట పరిపాటిగ ఉండినది. సంస్థానాధిపతులు కవిపండితుల ప్రతిభా పాండిత్యములను గుర్తించుచు అగ్రహారాది భూరి దానములతో వారిని సమ్మానించుచుండిరి. కొందరు జమీందారులు భోగలాలసులై స్వీయవిలాసముల కొరకే తమసర్వస్వమును వెచ్చించుచుండ, మరికొందరు సంగీత సాహిత్యాది కళల పోషణమునకు కంకణము కట్టుకొని తమ సంస్థానములను సుప్రసిద్ధ సంస్కృతి కేంద్రములుగ తీర్చిదిద్దుకొనిరి.

1. తెలుగు సాహిత్యమునకు విజయనగర సంస్థానము చేసిన సేవ, 2. ఇతర సంస్థానములు చేసిన తెలుగుభాషాసాహిత్యసేవ — అను ఈ రెండు విషయములపై రచింపబడు ఉత్తమ గ్రంథములకు రెండు బహుమతులను ఈవలెనని నాసూచనమీద ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాడమీవారు ప్రకటించినారు. శ్రీకాకుళము మొదలుకొని మహబూబ్‌నగరమువరకు చిన్న, పెద్ద కలసి —

అసంఖ్యాకములయిన సంస్థానములు ఉండినవి. కొన్ని శతాబ్దులుగ ఆంధ్రభాషా సాహిత్యములకు అవి ప్రశంసనీయమైన సేవచేయుచు వచ్చినవి.

డా. తూమాటి దొణప్ప — రీడర్, ఆంధ్రశాఖ, ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, వాల్తేరు — విశేష శ్రమకోర్చి, విపులమైన కృషిచేసి ఆవశ్యకమైన సామగ్రి నంతటిని సేకరించి, అకాడమీ బహుమతికొరకు పోటీ చేసినారు. విషయ సంగ్రహణమునకై అనేక సంస్థానములను ఆయన స్వయముగా దర్శించినారు. పరిశోధక పండితులను ఎందరనో సంప్రతించినారు. ఎన్నెన్నో ముఖ్యమైన విశేషములను సమకూర్చుటే కాక, అట్లు సేకరించిన విషయములను సమ్యగ్రుచిరముగా సమన్వయించి హృదయంగమమైన శైలిలో ఆయన తీర్చినారు. డాక్టర్ దొణప్ప సుప్రసిద్ధ విద్వాంసులు. అటు సాహిత్యములోను, ఇటు భాషాశాస్త్రములోను కూలంకషమైన ప్రజ్ఞను సాధించి, వాని మేలికలయిక లోని సారమును సరసముగా ఆస్వాదించుట ఆయనలోని విశిష్టత. ఆయన వ్రాసిన 'ఆంధ్ర సంస్థానములు : సాహిత్య పోషణము' అను ఈ గ్రంథమును అకాడమీ నియమించిన న్యాయ నిర్ణేతలు అత్యుత్తమైనదిగా ఏకగ్రీవముగా నిర్ణయించినారు.

ఈ గ్రంథమును ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు తమ ప్రచురణములలో ఒకటిగా ప్రకటింప నిశ్చయించిరని విని, నేను చాల ఆనందించినాను. ఈ తరమువారి స్మృతిపథమునుండి అప్పుడే జారిపోవుచున్న విద్వత్సంస్థానాధిపతుల సాహిత్యసేవను గూర్చిన ఎన్నోవివరములను ఈ గ్రంథము వెలుగులోనికి తెచ్చినది. సంస్థానముల సాహిత్యసేవకు సంబంధించిన అంశముల నన్నిటిని ఒకచోటచేర్చి గ్రంథరూపమిచ్చిన మొట్టమొదటి రచనమిది. పాఠకులకు విభ్రమముగొలుపు ఎన్నో అద్భుతాంశము లీగ్రంథమున గలవు. స్వాతంత్ర్యము సిద్ధించిన తరువాత మనదేశములో సంభవించిన ఆర్థిక రాజకీయ సంక్షోభములో చిక్కుకొని, మనము సంస్థానాధిపతులు సాహిత్యమునకు చేసిన గణనీయమైన సేవను విస్మరించినాము. ఇప్పుడు డాక్టరు దొణప్ప వ్రాసిన ఈ గ్రంథమువలన సాహిత్యపోషణమునందును, సంగీతాది కళాసముద్ధరణమునందును సంస్థాన పాలకులు ఎంత ఉదారముగ వ్యవహరించిరో మరల మన స్మృతిపథమున ప్రత్యక్షమగును.

ప్రామాణిక విద్వాంసులుగా డాక్టర్ దొణప్ప ఇదివరకే సుప్రసిద్ధులు.

ప్రస్తుత ప్రచురణము ఆయన స్థాయిని ఇనుమడింప జేయగలదని నమ్ముచున్నాను. పరిశోధనముపై ఆయనకుగల ప్రీతి నిరుపమానము. విస్మృత విషయ సంగ్రహణము నందును, తత్ సమన్వయము నందును ఆయనకుగల ప్రజ్ఞా పాటవము గణనీయము.

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారికి ఈ గ్రంథము కృతి ఈబడుచున్నదని, కృతిస్వీకారమునకు ఆయన ఆమోదించిరని తెలిసి నేను చాల ఆనందించినాను.

మన రాష్ట్రములోని మూడు అకాడమీల కార్యకలాపముల పట్లను శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు విశేషమైన శ్రద్ధాసక్తులను ప్రదర్శించుచున్నారు. జమీందారులు సుస్థితిలో ఉన్న రోజులలో వారు చేయుచుండిన కళాసాహిత్య సముద్ధరణముల పట్ల ఇప్పుడు ముఖ్యమంత్రి ప్రత్యేకాభిమానము ప్రకటించుచున్నారు. రాష్ట్రముఖ్యమంత్రి సాహిత్య కళాపోషకుడు కూడ కావుట ఆ పదవికి అత్యంత గౌరవదాయకము.

ఈ గ్రంథమునకు తొలిపలుకుగా ఈ నాలుగుమాటలు వ్రాయుట నాకెంతో సంతోషముగా ఉన్నది. ఈ అవకాశము నాకు కలిగించి, నన్ను గౌరవించిన డాక్టరు ద్రోణప్పగారికి నేను కృతజ్ఞుడను.

రాజభవన్
లక్నో
డిసెంబరు ౬, ౧౯౬౭

బెజవాడ గోపాలరెడ్డి

# కృతజ్ఞతానివేదనము

ఈ యంశము మీఁద పోటీ వ్యాసమును విరచింప నిర్దేశించిన ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ, హైదరాబాదువారు –

ఈ కృతిని అంకితము స్వీకరింప దయతో నంగీకరించిన ఆంధ్రప్రదేశ ముఖ్యమంత్రి మాన్యశ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు –

కృతిపరిచయమును సంతరించిన సాహిత్య అకాడమీ అధ్యక్షులు, ఉత్తరప్రదేశ రాజ్యపాలకులు మాన్యశ్రీ డా. బెజవాడ గోపాలరెడ్డిగారు –

విశ్వకళాపరిషత్ప్రచురణముగా దీనిని వెలయించుట కామోదించిన ఆంధ్ర విశ్వకళాపరిష దధికారవర్గమువారు, ముఖ్యముగా పరిషదుపాధ్యక్షులు, విద్యావ్రత దీక్షాదక్షులు శ్రీ యల్. బుల్లయ్యగారు –

నా యీ రచనోద్యమమును ప్రోత్సహించిన శ్రీమంత్ రాజా శ్రీ యార్లగడ్డ రామకృష్ణప్రసాదు బహద్దరువారు, ఆంధ్రప్రదేశ ఖాదీ గ్రామీణ పరిశ్రమల బోర్డు అధ్యక్షులు శ్రీ భాట్టం శ్రీరామమూర్తిగారు, మా గురువర్యులు ఆంధ్ర విశ్వకళా పరిషదాంధ్ర భాషా శాఖాధ్యక్షులు ఆచార్య శ్రీ కాకర్ల వేంకట రామ నరసింహముగారు, ఆంధ్ర విశ్వకళా పరిషద్ దర్శన పీఠాచార్యులు ఆచార్య శ్రీ కొత్త సచ్చిదానందమూర్తిగారు, విజయనగరము సంస్కృత కళాశాలాధ్యాపకులు శ్రీ గూడపాటి సాంబశివరావుగారు –

హైదరాబాదు నందలి ఆంధ్ర సారస్వత పరిషద్గ్రంథాలయమును ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ గ్రంథాలయమును పరిశీలించుట కనుమతించిన అకాడమీ కార్యదర్శి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు, తణుకు పట్టణము నందలి నరేంద్రనాథ సాహిత్య మండలి గ్రంథాలయమును పరిశీలించుట కవకాశ మొసఁగిన ఏతన్మండలి వ్యవస్థాపకులు, నిర్వాహకులు సాహితీవల్లభ శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుచౌదరిగారు, విజయనగర మహారాజ సంస్కృత కలాశాలా గ్రంథాలయమును పరిశీలించుటకు వీలు కల్పించిన ఏత త్కలాశాలా ధ్యక్షులు శ్రీ మానాప్రెగడ శేషశాయిగారు, ఆయా సంస్థాన గ్రంథాలయములను

సంప్రతించుటలో సహకరించిన సంస్థానోద్యోగులు, పండితులు, రాజబంధువులు, కురుపాము, గొడే సంస్థానాధిపతులు సేకరించిన ప్రాచీన గ్రంథ రాశిని నా యధీనము నందుంచిన విశాఖపట్టణము వాస్తవ్యులు శ్రీయుతులు మంగళగిరి బలరామస్వామి కోదండరామయ్యగారలు, విశాఖపట్టణము పరవస్తువారి ఆర్ష గ్రంథాలయ గ్రంథ సమూహమును ఉపయోగించికొనుటలో తోడ్పడిన శ్రీ పరవస్తు ఎంబారుగారు, విశాఖపట్టణము స్వసంఘ గ్రంథాలయ నిర్వాహకులు శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు, శ్రీ పురిపండా అప్పలస్వామిగారు, ఆంధ్ర విశ్వకళాపరిష ద్గ్రంథాలయపాలకులు డాక్టరు కోనేరు రామకృష్ణరావుగారు, శ్రీ కలగర వెంకటరత్నముగారు —

వివిధ దశలలో దీని సాపు ప్రతిని వ్రాసి పెట్టిన మా పరిశోధక విద్యార్థులు డా. లకంసాని చక్రధరరావు, రాళ్ళబండి శ్రీరామశాస్త్రి, నండూరి రాధాకృష్ణ, ఆంధ్ర మలయవాసిని, మా విద్యార్థులు చిరంజీవులు తాతా రాంబాబు, నేరళ్ళ రామకృష్ణారావు, సూరి అప్పయ్య ప్రభృతులు —

ముఖచిత్రమునకు ఔచిత్య సుందరమయిన రూపకల్పనము చేసిన కళాకారులు ఏలూరు వాస్తవ్యులు శ్రీయుతులు వై. రామన్‌సూరి, వెల్చేరు నారాయణరావుగారలు —

దీని నిట్లు సర్వాంగ సుందరముగా ముద్రింపించి సకాలమున కందఁ జేసిన విశ్వకలా పరిష న్ముద్రాలయ దర్శకులు, సౌజన్య మూర్తులు, మా గురువరేణ్యులు శ్రీ బొమ్మసముద్రము ముత్తుస్వామిగారు, ముద్రాలయోద్యోగులు, సుహృద్వర్యులు శ్రీ యం. ఆర్. బి. నరసింహారావుగారు —

ఇంకను ఎందఱో ఈ రచన మీ రీతిగా నవతరించుటలో నవనవోన్మేష మయిన నేపథ్యమును సవదరించినవారు ;

అందఱకును కృతజ్ఞతాభివందనములు.

తూ. దొ.

# విషయానుక్రమణిక

# ముఖబంధము

'జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః'

## ప్రస్తావన

ధర్మములలో ఉత్తమ ధర్మము నిస్సంశయముగా సత్కావ్య నిషేవణము.

'తటాకమ్ ధననిక్షేపో బ్రహ్మ స్థాపనమేవచ
వనమ్ దేవాలయః కావ్యమ్ సుతశ్చ స్వర్గదా నృణామ్'

—శంభు రహస్యము, చతుష్షష్ట్యుత్తర ద్విశతతమోధ్యాయః, 89.

అని యిట్లు సప్త సంతానములలో కావ్య సంతతియే అత్యుత్తమమైనదని పెద్దలు వచించుట ప్రశస్తోపపత్తికము. కావ్యనిర్మాతలు ఋషికల్పులని, ఋషులు కానివారు కావ్య నిర్మాతలు కాలేరనియు సూక్తు లుద్ఘోషించుచున్నవి. వేద ఋక్కులను దర్శించిన ఆర్యఋషులు సైతము ఉత్తమ కవులని విమర్శకుల యభిప్రాయము. ఋగ్వేదమునందలి దానస్తుతులు విద్యాపోషకులగువారికి సంబంధించినవి, దేవతా స్తుతి సంబంధములగునవి యించుమించుగా వేయికి పైమాటయని పరిశోధకులు నిర్ణయించినారు.* విజ్ఞానవ్యాప్తికి పాటుపడువారికి తోడ్పడుట దేశపాలకుల పవిత్ర విధి. సత్య పదార్థ తత్త్వాన్వేషకులగు ఋషులు తాము సమ్యగ్రుచిరముగా సందర్శించినదానిని శిష్యపరంపరద్వారమున విశాల విశ్వ వీథుల వ్యాప్త మొనర్చుచుండుట అనూచానముగా నంటివచ్చుచున్న సంప్రదాయము.

రాజ్యమునకు సంకేతమూర్తి ప్రభువు. ఆర్యర్షులు నిరంతరము పారమార్థిక చింతనలో మునిఁగి యుండినప్పటికిని అక్కఱ గలిగినపుడు పాలకులకు హితమును బోధించుచు జగద్ధితము నాపాదించెడివారు. ధర్మమునకు గ్లాని యొదవినపుడు వీరు చేయిచేసికొని దానిని పునరుద్ధరించెడివారు. తమ నిత్యానుష్ఠానములును, శాస్త్ర సాహిత్యముల పఠన పాఠన ప్రచారములును నిరాతంకముగా సాఁగుటకు ఆర్యఋషులు దేశ పాలకులపై నాధారపడియుండుట సహజము. ఇట్లు ఉభయతారకముగా రూపొందిన యీ వ్యవస్థ అవిచ్ఛిన్నముగా వర్ధిల్లుచు వచ్చినది.

* Dr. C. Kunhan Raja, 'Seats of Learning and their Patrons in Ancient India, *Rajah Sir Annamalai Chettiar Commemoration Volume*, pp. 733–742.

ఆదికవి వాల్మీకి కీర్తించిన మహావ్యక్తి ధర్మపాలకుఁడగు భూపాలకుఁడే కదా!

'ఆదిరాజ యశోబింబ మాదర్శం ప్రాప్య వాఙ్మయమ్
తేషా మ సన్నిధానేపి నస్వయమ్ పశ్యనశ్యతి'

అని దండ్యాచార్యులు నిరూపించిరి.

'భూపాల స్సర్వదా పూజ్యో మనోవాక్కాయ కర్మభిః
యో రక్షతి ప్రజానిత్యమ్ ధనధాన్యాది సంపదా'

అను నభియుక్తోక్తియు మీఁది యభిప్రాయము నామ్రేడించుచున్నది.

'సత్కులీనుల సరసుల సజ్జనులను
సన్నుతించుట కవులకు సహజగుణము'

అని నానారాజ సందర్శన కర్తలు నిర్వచించిన విషయము ప్రత్యక్షర సత్యము.

ధర్మ విషయము లతి సూక్ష్మము లయినవి. విశేషించి ధర్మ మనునది వ్యవస్థానుగుణమని చరిత్రకారులయు, తాత్త్వికులయు నభిప్రాయము. వ్యవస్థా భేదము ననుసరించి రుచిభేదము, రుచిభేదము ననుసరించి మతభేదమును, మతభేదము ననుసరించి ధర్మ స్వరూప నిరూపణమును జరుగుచుండును. ఇట్లిది యొక పరంపరగా ప్రవర్తిల్లుచుండును. ఏదేని యొక వ్యవస్థలో స్వార్థము పాలు పెరిగినపుడు అనర్థములు దాఁపురించుట తప్పనిసరి. సాహితీ స్రష్టలయు, సాహితీ పోషకులయుమధ్య రూపొందిన వ్యవస్థలో మంచి తటిఁగి యుండవచ్చు: చెడ్డ కొంత చేరి యుండవచ్చు. ఈ యుభయవ్యక్తులుకాక—తక్కిన విశాలమైన లోకము—రసకలా సామ్రాజ్య సంజీవని యగు పరిషత్తున్నది. ఈ యిద్దఱ మీఁదను ఎన్నెన్నియో యపప్రథలు లోకమున విస్తరించి యున్నవి. కవులు, కవిపోషకులును లోకమును విస్మరించి రనియు, వీరి పరిశ్రమము కేవలము అన్యోన్య ధన్యతాపాదకమనియు కొందఱు విమర్శింతురు.

ముఖ్యముగా కవిపోషకులగు దేశపాలకులమీఁదనున్న యభాండము పెద్దది. దేశపాలకులలో ప్రజలను కన్నబిడ్డలుగా పాలించినవారు లేకపోలేదు. కాని ఆధునిక వ్యవస్థలో పాలక—పాలిత సంబంధములు అంత నసిగా కన్పట్టవు. పాలకులు కొందఱు ప్రజలను దోఁచి యుండవచ్చు, దుర్భర దారిద్ర్యమున ముంచి యుండవచ్చు, ఇంకేదో యేదో చేసి యుండవచ్చు; కాదన్నవాఁడు కర్కోటకుఁడు. ఇందలి మంచి చెడ్డలను గుఱించి మనము క్రుమ్ములాడుకొనుట వలన ప్రయోజనమేమియు నుండదు. ఒకానొక చారిత్రక సంఘటనను వాస్తవిక దృష్టితో వివేచించి అందలి బాగోగులను బేరీజువేయుట తప్పుకాదు.

వైదిక యుగమునందే కాక జైన, బౌద్ధ యుగముల యందును, తద ర్వాచీన యుగములయందును దేశపాలకులు ధర్మరక్షణమును, ధర్మవ్యాపనమును గావించుటకు దీక్షాకంకణధారులై యుండిన మాట వాస్తవము. ధర్మ వ్యాపక

సాధనములు రెండు తెఱఁగులు. ప్రత్యక్షముగా ఆచార్యుల రూపమున విధి నిషేధములను ప్రజలకు బోధించుట మొదటి పద్ధతి. పరోక్షముగా కావ్య రూపమున కర్తవ్య బోధను సలుపుట రెండవ పద్ధతి. మొదటిది ప్రభుసమ్మిత మగు వేదాదికము; రెండవది కాంతాసమ్మితమగు కావ్యాదికము. రెండవ పద్ధతిలో ధర్మరక్షణ పరతంత్రులకు తోడ్పడువారు కవులు. కేవలము విధి నిషేధముల నెఱిఁగి మంచిగా మనుగడను సాఁగించుటయే కాదు మానవ జీవిత పరమార్థము—జీవితమును స్వాదువుగా, హ్లాదైకమయముగా సాఁగించుటకూడ నావశ్యకము.

మానవ మేధా వికసనమునకు సాహిత్యము చక్కని దోహదకారి. కావ్య నిషేవణమునకు రసానంద నిష్పత్తి ప్రధాన హేతువు. తదానంద ప్రకటన సమర్థమయిన ధర్మరూప ప్రవృత్తి రెండవది. తదావిష్కరణ పటిష్ఠమయిన సాధన సంపత్తి మూఁడవది. అందులకే సాహిత్యము సర్వ లలితకళలలో శిరశ్శేఖరముగా సాహిత్యదార్శనికులచే సంభావ్యము. లౌకికమైన ఆవేదనలను మఱపించి మానవునిలో మానవతమీఁద మమతను ప్రేరేపించునది సాహిత్యము. ప్రాచీనులు, సాహిత్యమును విశ్వశ్రేయము కొఱకని, జగద్ధితము కొఱకని, శివేతరక్షతము కొఱకని యుద్ఘాటించుచు వచ్చిరి. ఇట్లు కావ్యముల పరమ ప్రయోజనము లోకకల్యాణమనుట నందఱు అంగీకరించిన విషయము.

## ఆంధ్ర కవితావిర్భావము

ఆంధ్రభాషలో ప్రామాణిక సాహిత్యము పూర్వ మెంత సృష్టియైనదో కాని నన్నయనాఁటినుండియే మనకు ప్రామాణిక రచనలు లభ్యములగుచున్నవి. నన్నయను ఆదరించిన చాళుక్య చక్రవర్తులకు పూర్వము తెలుఁగు నేలను పాలించిన శాతవాహనులుకాని, వారి యనంతరము పాలకులైన ఇక్ష్వాకులు, శాలంకాయనులు, ఆనందగోత్రజులు, విష్ణుకుండినులు మొదలగు రాజవంశముల వారెవ్వరును తెలుఁగుభాషలో కావ్యములు వ్రాయించినట్లుగాని, కనీసము తెలుఁగును రాజభాషగా స్వీకరించినట్లుగాని నిదర్శనములు కానరావు. మీఁదు మిక్కిలి సంస్కృత ప్రాకృత భాషలనే వారు రాజభాషలుగా, వైజ్ఞానిక విషయ వాహకములుగా నవలంబించినట్లు తార్కాణము లున్నవి. అనాఁటికి తెలుఁగుభాష సాహితీ విషయములలో అతి గూఢార్థతత్త్వ వ్యక్తీకరణ పటిష్ఠముగా రూపొంది యుండలేదని కొందఱు వాదింతురు. ఇది నిలువనేరని మాట. తెలుఁగునకు సజాతీయ భాషగా సంభావిత మగుచున్న తమిళములో అనాఁటికి అపూర్వము లైన స్వతంత్ర కావ్యములు అనేకము నిర్మితములై యుండఁగా తెలుఁగున కట్టి శక్తిలేదని వాదించుట యుక్తి యుక్తముగాఁ దోఁపదు. ఆనాఁటి తెలుఁగుదేశమును పాలించిన యేలికలకు తెలుఁగుమీఁద మక్కువ యేర్పడ

లేదని సరిపెట్టుకొనవలసి యున్నది.

పూర్వ చాళుక్య వంశీయుల కించుక పూర్వులై రేనాటి సీమను పాలించిన రేనాటి చోడవంశీయులు తెలుఁగునకు రాజాజ్ఞప్తులలో స్థానమిచ్చిరేగాని వారును సాహిత్య సృష్టికి దోహద మిచ్చినట్లు కన్పట్టదు. చాళుక్యులకు పిమ్మట కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగర చక్రవర్తులు, గోలకొండ నవాబులు, దక్షిణ దేశమునందు నాయకరాజులు తెలుఁగు సాహిత్యమును తామరతంపరగా పెంపొందించినవారు.

విజయనగర సామ్రాజ్యము పతనమైన తరువాత ఆ సామ్రాజ్యావశిష్టముల మీఁద పరిశిష్టములుగా తలెత్తిన చిన్నచిన్న సామంత రాజ్యములు, సంస్థానములు సాహిత్య పోషణ భారమును వహించినవి.

## చారిత్రక నేపథ్యము

ఓరుగల్లు పతనముతో నొకవైపున విజయనగర సామ్రాజ్యమును, వేఱొక వైపున బహమనీ సామ్రాజ్యమును, మఱియొకవైపున గజపతుల ప్రభుత్వమును నాంధ్రదేశమును మూఁడు ముఖ్య విభాగములుగా నొనర్చినవి. విజయనగరము వారికి నరపతులనియు, బహమనీ సుల్తానుల కశ్వపతులనియు, ఒడ్డె రాజులకు గజపతులనియు వారివారి సేనా ప్రాశస్త్యములనుబట్టి బిరుదనామము లుండినవి. ఈ ముప్వురు రాజులకును మోహమును పుట్టించు గుఱుతైన యుర్వితాడుగా కొండవీటి సామ్రాజ్యము ఏర్పడియుండి యీ యుద్ధతుల మధ్య నలుఁగుచుండినది. రెడ్డిరాజులు మధ్యాంధ్ర మహీమండల ప్రభువులు. బహమనీ సామ్రాజ్యము బద్దలై బిజాపురము, గోలకొండ, అహమ్మద్ నగరము మొదలగు అయిదు విభాగములుగా మాఱి అయిదుగురు సులతానుల వశమున నుండినది. ఈ సులతానుల పరస్పర కలహములు ఆసరాగా అళియరామరాయాదులు కొంత కాలము పైచేయిగా నుండిరి. 1565 లో జరిగిన తల్లికోట యుద్ధముతో విజయ నగర సామ్రాజ్యము విచ్ఛిన్నమైనది. విజేతలైన బిజాపురము, గోలకొండ సులతానులు విజయనగర సామ్రాజ్యములోని యుత్తర సీమలను పంపకములు చేసికొని యుండిరి. గోలకొండ సుల్తానుల సార్వభౌమాధికారము అత్యుచ్ఛ దశకు వచ్చిన తరువాత చంద్రగిరి, రాయవేలూరుల నంటిపెట్టికొనియున్న విజయనగర సామ్రాజ్య శేషములుకూడ నామమాత్రావశిష్టములైనవి. ఇంచు మించుగా నాంధ్ర మహీమండల మంతయు గోలకొండ, బిజాపూరు సులతానుల గొడుగు నీడకు వచ్చినది.

## గోలకొండ పతనము

ఇట్టి దశలో గోలకొండమీఁద మొగలు పాదుషాల కన్ను పడినది.

ఔరంగజేబు (1618–1707) సేనానులు తండములు తండములుగా వచ్చి గోలకొండను ముట్టడింపఁగా గోలకొండ 1686 లో పడిపోయినది. గోలకొండ సులతానుల విశాలరాజ్యము మొగలు పాదుషాల సామ్రాజ్యములో నొక సుబా అయినది; ఇదే దక్కను సుబా. దీనికి కొంతకాలము గోలకొండయును, ఆ పిమ్మట హైదరాబాదును రాజధానులుగా నుండినవి. పాదుషాకు ప్రతినిధిగా కమురుద్దీన్ ఆసఫ్‌జా దక్కను సుబాను పాలించుచుండినవాఁడు. ఆసఫ్‌జా సమర్థుఁడు. అతని కుమారుఁడగు ఘజీరుద్దీను మొగలు పాదుషాల కొలువులో నుండెను. ఆసఫ్‌జాకు దక్కను సుబామీఁదకంటె ఢిల్లీ సింహాసనముమీఁద ప్రత్యేక దృష్టి యుండినది.

అది మొగలు సామ్రాజ్యమునకు క్షీణదశ. ఔరంగజేబు అవలంబించిన కుటిలరాజనీతి మొగలు సామ్రాజ్య పతనమునకు మూలమైనది. ఔరంగజేబు 1707 లో మరణించెను. ఆ పిమ్మట ఏఁబది యేండ్ల కాలములో బహదూర్‌షా, జహాందర్‌షా, ఫరూక్‌షియార్, మొహమ్మద్‌షా—ఈ నలుగురును 1748 దాఁక పాలించిరి. మొహమ్మదుషా దుర్బలుఁడు. ఈతని కాలమున ఆసఫ్‌జా ఢిల్లీకి నామమాత్రపు ప్రతినిధిగానుండి సర్వతంత్ర స్వతంత్రుఁడుగా వ్యవహరింపఁ జొచ్చినాఁడు. ఆ పిమ్మట ఢిల్లీని అహమ్మదుషా (1748–1754), రెండవ అలంగీరుపాదుషా (1754–1759) పాలించిరి. షా ఆలమ్ 1759 లో మొగలు సింహాసన మధిష్ఠించినాఁడు.

## నిజాము హయాము

క్రీ. శ. 1713 లో మొగలు పాదుషా అయిన ఫరూక్ షియార్, కమురుద్దీన్ ఆసఫ్‌జా యను విశ్వాసపాత్రుఁడైన ముసల్మాను సర్దారునకు 'నిజామ్-ఉల్-ముల్క్' అను బిరుదము నిచ్చి దక్కను సుబాదారుగా నియమించెను. ఆ పిమ్మట ఆసఫ్‌జా మొహమ్మదుషా చక్రవర్తి (1719–1748) కాలమున ఢిల్లీ దర్బారులో వజీరుగా నియమితుఁడై యుండెను. ఢిల్లీకోటలోని కుట్రలు, కుటిల నీతులు చూచి 1724 లో ఆసఫ్‌జా దక్కనునకు తిరిగి వచ్చి హైదరాబాదు సుబాదారీని ఇంచుమించు స్వతంత్రుఁడై పాలింపఁ దొడంగెను. మొగలు సామ్రాజ్య విచ్ఛిత్తికి ప్రబలకారకులైన మహారాష్ట్రులకు తన సుబాలో చౌత్, సర్దేశముఖీ పన్నులను వసూలుచేసికొను అధికారము నిచ్చి వారి చెలిమిని సంపాదించి నిజాము నానాఁటికి ప్రబలుఁ డగుచున్నను మొగలు చక్రవర్తి కింకర్తవ్యతా విమూఢుఁడై, చూచియు చూడనట్లు కాలము గడపుచుండెను. 1739 లోని నాదిర్‌షా దండయాత్రలతో గట్టిదెబ్బ తిని మొగలు చక్రవర్తి మఱింత దుర్బలుఁడయ్యెను. దండయాత్రలతో, కుటుంబ కలహములతో క్రిందు మీఁదగుచు ఢిల్లీ సామ్రాజ్యము ప్రాబల్యము క్షీణించుచుండఁగా వివిధ

సీమలను పాలించుచున్న సుబాదారులు ప్రబలులయి స్వతంత్రులు కాఁ జొచ్చిరి. నిజాము పేరునకు మాత్రము మొగలు పాదుషాల సుబాదారుఁడుగా నుండి సర్వస్వతంత్రుఁడుగా ప్రవర్తింపఁ దొడఁగెను.

దక్కను సుబాలో ఆర్కాటు, కర్నూలు, రాజమహేంద్రవరము, శ్రీకాకుళము అను నాలుగు నవాబుగిరీ విభాగములుండినవి. రాజమహేంద్రవరము, చికాకోలు పరగణాలకు అన్వరుద్దీనను వాఁడు సుబాదారు ప్రతినిధిగా నియమితుఁడై యుండెను. ఈ అన్వరుద్దీను క్రింది యధికారియగు జిల్లాదారు రుస్తుంఖాను (1732–1739) లోక కంటకుఁడుగాఁ బ్రవర్తించి ఉత్తరు సర్కారులలోని జమీందారులను గడగడలాడించినాఁడు.

ఆసఫ్‌జా 1748 లో మరణించెను. ఘజీరుద్దీన్, నాజర్‌జంగ్, సలాబత్ జంగ్, నిజామలీ యని ఆసఫ్‌జాకు నలుగురు కుమారులు. ముజఫర్‌జంగ్ అనువాఁడు ఆసఫ్‌జా దౌహిత్రుఁడు. మరణకాలమునాఁటికి ఇతని పెద్దకుమారుఁడు ఢిల్లీ దర్బారులో నుండెను. రెండవ కుమారుఁడైన నాజర్‌జంగ్ తనను దక్కను సుబాదారునిగాఁ బ్రకటించికొని ఆసఫ్‌జా దౌహిత్రుఁడును, తన మేనల్లుడును, సుబాదారు పదవికి తన ప్రతిస్పర్ధియును నగు ముజఫర్‌జంగ్‌ను ఆర్కాటు కోటలో ఖైదుచేసి యుంచెను. ఇట్లు నిజాము పదవికొఱకు పెద్ద రగడ పుట్టినది.

## పాశ్చాత్య వర్తక సంఘములు

ఇంతకు ముందొక శతాబ్దమునకు పూర్వమునుండియు వర్తకము చేసికొను నిమిత్తము భారతదేశమునకు వచ్చిన పాశ్చాత్య వర్తక సంఘములవారు స్వలాభ పరులయి ప్రవర్తించుచు ప్రబలు లగుచుండిరి. దక్షిణ భారతమునందలి పాలకులు — రాజులు, నవాబులు — పరస్పరము కలహించుకొనుచుండుటయు, ఈ పాలకుల సేనలు సుశిక్షితములును, సుపరిపాలితములునుగాక, తాత్కాలికముగా ప్రోగు చేసిన అల్లరిచిల్లర మూఁకలతోడను, దినరోజు బంటులతోడను, నాసిరకపు యుద్ధపరికరములతోడను నిండియుండుటయు పాశ్చాత్యులు పరిశీలించిరి. సుశిక్షితులగు సైనికులతోడను, సుపరీక్షితములగు నవీన యుద్ధపరికరముల తోడను, సుస్పష్టలక్ష్యము కల్గిన సేనానులతోడను కూడి దుర్నిరీక్ష్యములైన పాశ్చాత్య సేనలముందు దేశీయ పాలకుల కిఱుదరకపు కిరాయి దండులు ప్రతిఘటించి నిలువలేవనియు వారు గ్రహించిరి. దేశీయ ప్రభువుల పరస్పర కలహములలో నేదోయొక పక్షమును వహించి సుశిక్షితములగు తమ సేనల తోడ్పాటుతో రెండవ పక్షము నోడించి మొదటి పక్షమువారినుండి హిరణ్యాక్ష వరములను వీరు పొందుచుండిరి. ఇట్టి రాజనీతిలో ఆనాఁటికి పేరుపొంది విశేష లాభమునందిన పాశ్చాత్యుల కుంపిణీలు రెండు. ఒకటి ఇంగ్లీషువారిది, రెండవది పరాసువారిది. ఇంగ్లీషు కుంఫిణీవారి ముఖ్య కార్యస్థానము చెన్న

పట్టణము. పరాసు కుంఫిణీవారి కార్యస్థానము పుదుచ్చేరి. ఈ కుంఫిణీవారికి మచిలీపట్టణములోకూడ నొక వర్తకపు గిడ్డంగి యుండినది. వీరి గవర్నరు జనరలు డూప్లే.

దక్కను సుబాదారు పదవికేర్పడిన పై వివాదములలో నాజరుజంగునకు ఇంగ్లీషు కుంఫిణీవారి తోడ్పాటును, ముజఫర్ జంగునకు పరాసు కుంఫిణీవారి తోడ్పాటును లభ్యమైనవి. నాజర్ జంగ్ హత్యచేయఁబడినందువలన పరాసువారి మిత్రుఁడగు ముజఫర్ జంగ్ 1750 లో సుబాదారుఁడయ్యెను. ఇతఁడును 1751 లో హత్యచేయఁబడఁగా ఆసఫ్ జా మూఁడవ కుమారుఁడగు సలాబత్ జంగ్‌ను పరాసువారు గద్దెనెక్కించిరి. ఉత్తరసర్కారులలోని బూసీదొరగారి చర్యలు మనకు కొట్టిన పిండికదా! సలాబత్ జంగ్ పరాసువారితో పడలేక వారిని వదలి 1759 నుండి ఇంగ్లీషు కుంఫిణీవారితో సఖ్యము గావించుకొనెను. సలాబత్ జంగు తమ్ముఁడు నిజామలీఖాను (1761-1803) అన్నను పదభ్రష్టుని గావించి 1761 లో సుబాదారీ నాక్రమించెను. పదేపదే అటునిటు మాఱుచుండిన అధికారచక్రము అదృష్టవశమున తుట్టతుదకు ఆంగ్లేయుల హస్తంగత మయినది.

## ఇంగ్లీషు కుంఫిణీ

ఉత్తరసర్కారుల నవాబును, ఆర్కాటు నవాబును హైదరాబాదు సుబాదారునకు లోఁబడినవారు. నిజామునకు వలయునప్పుడు సేనలు పంపుటకును, అట్టిసేన అనావశ్యకమైన సంవత్సరము కపులు పైకముగా 9 లక్షల రూపాయలు నిజామునకు చెల్లించు ఒడంబడికమీఁద ఇంగ్లీషు కుంఫిణీవారు 1766 లో నిజామలీఖాను నుండి మూర్తిజాన్నగర్ (గుంటూరు), ముస్తఫానగర్ (కొండవీడు), ఏలూరు, రాజమహేంద్రవరము, చికాకోలు పరగణాలను కవులునకు తీసికొనిరి. మచిలీపట్టణములో కుంఫిణీవారి దుబాసీయైన కాంద్రేగుల జోగిపంతులు నిజామునకును, కుంఫిణీకిని ఈ యొడంబడికను కుదిర్చినవాఁడు.

ఉత్తర సర్కారులలో చెలరేఁగు పితూరీల నణఁచి నిజామలీకి సేనలతో కుంఫిణీవారు తోడ్పడునటులును, అయిదు సర్కారులమీఁద వెరసి 9 లక్షల రూపాయల పేష్కషు నిజామలీకి చెల్లించునట్లును, ఈ అయిదు సర్కారులను ఇంగ్లీషువారికి కవులున కిచ్చునట్లును 1766 లో ఒప్పందము కుదిరినది. కాని పూర్వపు సన్నదుల ప్రకారము నిజామలీ అన్నయగు సలాబత్ జంగునకు మూర్తిజాన్నగరుసర్కారు సొంత జాగీరుగా ఈఁబడియుండినది. అతని మరణానంతరమే మూర్తిజాన్నగరు సర్కారు కుంఫిణీకి స్వాధీనమగునని ఒక నిబంధన సేర్పఁబడి యుండినది. ముస్తఫానగర్, ఏలూరు, రాజమండ్రి సర్కారుల లోని నవాబు ఈ సర్కారులకు బాధ్యుఁడు. విజయనగర సంస్థాన పాలకుఁడు బాధ్యుఁడుగా నుండిన చికాకోలు సర్కారుమీఁది అధికారమును స్థాపించుకొను

భారమును కుంఫిణీకే వదలఁబడినది. నిజామునకు చెల్లింపవలసిన కప్పము కుంఫిణీ మూఁడు వాయిదాలలో నిజామలీకి చెల్లింపవలసి యుండెను. కొల్లూరు లోని వజ్రాల గనులు మాత్రము నిజామలీ ప్రత్యేకాధికారములో నుండెను. ఈ షరతులతో ఉత్తర సర్కారులు కుంఫిణీకి ధారాదత్తము చేయఁబడెను. ఆటు పిమ్మట 1768, 1779 లలో జరిగిన క్రొత్త యొడంబడికలవలన సర్కారు సీమలమీఁద కుంఫిణీవారి యధికారము స్థిరపడినది. 1783 లో మూర్తిజానగరు సర్కారు జాగీరుదారగు సలాబత్ జంగ్ మరణింపఁగా 1768నాఁటి ఒడంబడికకు విరుద్ధముగా మూర్తిజాన్నగర్ సర్కారును నిజామలీ తనవశము చేసికొనుటకు ప్రయత్నించెనుగాని 1788 లో మూర్తిజాన్నగరు (గుంటూరు) పూర్తిగా కుంఫిణీవారి అధికారము క్రిందికి వచ్చినది.

## జమీందారీల యవతరణము

ఇట్లు నిజామలీనుండి కవులునకుఁ దీసికొనిన ఉత్తర సర్కారులలో కొంత భాగమును కుంఫిణీవారు తమ మిత్రులకు కవులునకిచ్చుచు వచ్చిరి. రాజమహేంద్రి సర్కారును 383 వేల మద్రాసు వరహాలకు జోగిపంతులు, హుసేనలీఖానులకు జాయింటు కవులున కిచ్చిరి. ఏలూరు, ముస్తఫానగర్ సర్కారులను హుసేనలీ కొకనికే 4 లక్షల మద్రాసు వరహాలకు కవులున కిచ్చిరి. ఈ యీ ప్రాంతములలోని స్థానిక పాలకులు ఈ కవులుదారులకే కప్పములు చెల్లింపవలసియుండెను. వీరిద్దఱును ఇంచుమించు దళారీలవంటివారు. 1769 లో ఈ పద్ధతి రద్దయినది. 1769 నుండి ఏలములో హెచ్చు పాటపాడినవారికి కవులున కిచ్చుటకు మొదలు పెట్టిరి. ఆ పిమ్మట కవులు వ్యవధిని మూఁడేండ్లకు పెంచిరి. 1778 లో రాజమహేంద్రి సర్కారునకు చెందిన పెద్దాపురము, పిఠాపురము, కోటరామచంద్రపురము పాలకులును; ఏలూరు, ముస్తఫానగర్ సర్కారులకు చెందిన మొగల్తుర్రు, నూజివీడు, చార్‌మహల్, దేవరకోట పాలకులును హెచ్చు పాటపాడి ఆ యా ప్రాంతములను కవులునకు తీసికొనినవారు. ఆ పిమ్మట ఈ పాలకుల ఏలములతో పేష్కషులు సరిగా చెల్లక, బకాయిలు పెరిగి, ఖర్చులు దుబారా అయి కుంఫిణీకి గొప్ప లుక్సాను వచ్చినది. ఈ రెవిన్యూ పద్ధతులను పరిశీలించి ఉత్తమమైన పద్ధతిని సూచించుటకు నిపుణులతోకూడిన సంఘమును కుంఫిణీ వారు నియమింపఁగా వారు శాశ్వతకర నిర్ణయ పద్ధతిని పరిష్కార మార్గముగా సిఫార్సు చేసిరి. ఆ పద్ధతిని 1802 నుండి ఉత్తర సర్కారులలో ప్రవేశపెట్టిరి. ఈ శాశ్వతకర నిర్ణయము మేరకు సర్కారులలోని జమీందారీ లన్నియును రూపొందినవి.

కుంఫిణీవారీ సీమలకు క్రొత్తవారు; ఈ సీమల యాచార వ్యవహారముల నంతగా నెఱుఁగనివారు. దేశీయ పాలకుల సహకార సానుభూతులులేనిదే తమ

సార్వభౌమాధికారము భద్రముగా కొనసాగుట దుస్సాధమని గుర్తించినవారు. విశేషించి దేశీయప్రజలు పూర్వ రాజ కుటుంబములమీద విశేష భయ భక్తి ప్రపత్తులు కలవారు. 'నా విష్ణుః పృథివీ పతిః' అనికదా సూక్తి. దీనిని గమనించి అనుస్యూతముగా నంటివచ్చిన పాలకవంశములను దొలగింపకుండ వారి యండదండలతో కుంఫిణీదొరలు తమ ప్రభుతను నిమ్మకు నీరెత్తినట్లు నిలువబెట్టుకొన నెంచినారు.

ఈ రాజనీతి ఆంగ్లేయు లవలంబించిన సరిక్రొత్త రీతి కాదు. కుంఫిణీ వారికి పూర్వము సుబాదారులును, వారి ప్రతినిధులగు నవాబులును, వారి యుద్యోగులగు సర్లష్కరులును, జిల్లాదారులును ఇట్టి నీతినే యవలంబించి తమ పాలనమును సాగించి యుండిరి. పూర్వపు సుబాదారులు తమ కాలము నాటికి ప్రబలులుగా, స్థానిక పాలకులుగా, పూర్వ రాజన్యుల ఔరసులుగానో, ప్రతినిధులుగానో ఉన్నవారి యధికారములను ధ్రువపఱుచుచు, వారికి బిరుదాదులను ప్రసాదించుచు, శిస్తులను వసూలు చేసి, కప్పము కట్టుటకుగాను సన్నదులను, ఫర్మానాలను జారీచేయుచుండిరి.

## శాశ్వతకర నిర్ణయము

స్థానిక ప్రభువుల వశమునగాక సుబాదారు ప్రతినిధులగు నవాబులయు, వారి యుద్యోగులయు నధీనము నందున్న భూఖండములను 'హవేలీ' ఖండము లని వ్యవహరించెడివారు. క్రీ. శ. 1802 లో ఇంగ్లీషు కుంఫిణీవారు శాశ్వతకర నిర్ణయము (Permanent Revenue Settlement) ను రూపొందించి ప్రాత జమీందారుల రాచఱికమును ఖాయపఱుచుచు సన్నదుల నిచ్చుటయేగాక హవేలీ ఖండములను సైతము బహిరంగముగా ఏలమునకు పెట్టించిరి. జమీందారీ భూములయు, హవేలీ ఖండములయు అయిదాఱేళ్ళ మహసూళ్ళు వివరము లను జాగ్రత్తగా క్రోడీకరించి వాని సగటు విలువను బేరీజువేసి లెక్కలు తయారుచేసిరి. మహసూళ్ళు విలువలో మూడింట రెండు వంతులు కుంఫిణీ సర్కారునకు, మిగిలిన యొక వంతు జమీందారునకును చెందునట్లు నిర్ణయించిరి. హవేలీ ఖండముల మహసూళ్ళు విలువనుబట్టి హెచ్చు పాటపాడినవారిపేర సన్నదులను ప్రసాదించిరి. విజయనగరము, పెద్దాపురము, బొబ్బిలి, పిఠాపురము, నూజివీడు, అమరావతి మొదలగు సంస్థానాధీశ్వరులు ఇట్టి హవేలీ ఖండము లనుగూడ ఖరీదుచేసి తమ తమ సంస్థానములలో గలిపికొనుటయో లేక తమ చుట్టపక్కములపేర నమోదు చేయించుటయో లేక తమ యాశ్రితులకు ననుయాయులకు ప్రసాదించుటయో చేసిరి. స్థానికులగు శ్రీమంతులు, దేశీయులగు కుంఫిణీ కార్యకర్తలుకూడ కొన్ని హవేలీ ఖండము లను ఖరీదుచేసి జమీందారులయిరి. ఇట్లు ప్రాత సంస్థానములుగాక, క్రొత్త

ప్రొప్రయిటరీ ఎస్టేటులు, హుండాపులు నేర్పడినవి.

## పడమటి పాళయములు

ఇట్టి యేర్పాటులు యావదాంధ్రమున నొక్కరీతిని జరుగలేదు. సర్కా-రాంధ్రమున నించుమించుగా పూర్వోక్తమగు జమీందారీ పద్ధతి స్థిరపడినది. పడమటి పాళయములగు వేంకటగిరి, ముత్యాలపాడు, కాళహస్తి, కార్వేటి నగరము, పుంగనూరు మొదలగు సంస్థానములవారు ఉత్తర సర్కారులలోని జమీందారులవంటివారు కారు. ఈ పాళయముల నిర్మాణ విన్యాసమంతయు 'అమర నాయంకరము' పద్ధతికి చెందినవి. సార్వభౌములకు యుద్ధావసరముల యందు సొంత సేనలతో తోడ్పడు నిబంధనమీఁద ఈ సామంత రాజ్యములు తొలుత నేర్పడి యుండినవి. గోలకొండ, ఆర్కాటు నవాబులు ఈ పద్ధతినే పాటించిరి. కుంఫిణీవారుకూడ తమ పరిపాలనమునందలి తొలిదశలో పూర్వపు సంప్రదాయమునే కొనసాగించుచుండిరి. కాని అపారమైన సేనాబలము గలిగిన ఈ సంస్థాన పాలకులు నిరంతరము పరస్పర కలహములలో మునిఁగి యుండుట వలన శాంతి భద్రతలు సుస్థిరము కావనియు, బలవంతులైన సంస్థానాధిపతుల ఉనికివలన ఎప్పుడో యొకప్పుడు తమ యసలు మనుగడకే ముప్పు కలుగవచ్చు ననియు కుంఫిణీవారు దృఢనిశ్చయులయి ఈ యమరకము పద్ధతిని రద్దుపఱచి, సైనిక దళములను తొలఁగించిరి. పాళయము పాలకులకు ఏఁటేఁట ప్రతి వ్యయమున కగుచుండిన వ్యయమును లెక్కగట్టి దానికి అనురూపమగు మొత్తము పేష్కషుగా సాలీనా కుంఫిణీ సర్కారునకు జమకట్టవలెనని నూతన పద్ధతి మేరకు నిర్ణయించిరి. ఇందుమూలమున ఈ పాళయము లన్నియును సర్కా-రాంధ్రములోవలె జమీందారీల స్థాయికి వచ్చినవి.

## నిజాము సంస్థానములు

తెలంగాణమునందలి సంస్థానము లన్నియు నిజాము సర్కారునకు సామంత రాజ్యములు. వీనిలో కొన్ని బహమనీ సుల్తానుల కాలముననను, కొన్ని గోలకొండ–బిజాపూర్ సుల్తానుల కాలముననను, మఱికొన్ని మొగల్ పాదుషాల పాలనమునందును, తక్కినవి నిజాము హయామునందును రూపొంది పెంపొందు వట్టివి. ఇవన్నియును అర్వాచీన యుగములందు నిజామునకు కప్పము చెల్లించు చున్న అధీన రాజ్యములు. వీనిలో కొన్నింటికి సివిల్, క్రిమినల్ అధికారములును, సొంతముగా నాణెములను ముద్రించుకొను నధికారమును నుండినవి. కొన్ని సంస్థానములు నడుమంతరముగానే అంతరించినవి. మిగిలిన వన్నియును పోలీసుచర్యకు పిమ్మట జరిగిన ఒప్పందములతో హైదరాబాదు రాష్ట్రమున ఐక్యమై, ఆ పిమ్మట విశాలాంధ్రమున విలీనమైనవి.

## జమీందారీల వివరణ

ఆంధ్ర దేశమునందలి సంస్థానములు కొన్ని పెద్దవి, కొన్ని చిన్నవి. కొన్ని పురాతనములు, మఱికొన్ని అధునాతనములు. కొన్ని శాశ్వతకర నిర్ణయమునాఁటికే వర్ధిల్లుచుండినవి, కొన్ని అస్తమించి యుండినవి. శాశ్వత కర నిర్ణయముతో నూతనమగు ఎస్టేటులు కొన్ని అవతరించినవి. జమీందారీ రద్దు చట్టమునాఁటికి కొన్ని అంతరించినవి. ఈ యన్ని తెగల ఎస్టేటులును కలిసి కొన్ని వందల పైమాట. 1938 నాఁటికి ఆంధ్ర జిల్లాలలోని జమీందారీల సంఖ్య 448. ఇందులో సాహిత్య పోషణమును గావించినవాని సంఖ్య నూటికి బొటాబొటి.

## ఆంధ్ర జిల్లాలలోని గ్రామములు

(1931 లెక్కల ననుసరించి)

| వరుస | జిల్లా | రైత్వారీ గ్రామములు | పూర్తి ఇనాము గ్రామములు | జమీందారీ గ్రామములు | మొత్తము |
|---|---|---|---|---|---|
| ౧. | విశాఖపట్టణము | ౩౮౯ | ౨౦ | ౮,౫౯౭ | ౯,౦౦౬ |
| ౨. | తూర్పు గోదావరి | ౪౩౭ | ౭౯ | ౩౩౧ | ౮౪౭ |
| ౩. | పశ్చిమ గోదావరి | ౩౫౯ | ౧౪౬ | ౨౭౨ | ౭౭౭ |
| ౪. | కృష్ణా | ౪౦౬ | ౨౦౭ | ౪౩౩ | ౧,౦౪౬ |
| ౫. | గుంటూరు | ౭౫౮ | ౧౬౧ | ౬౪ | ౯౮౩ |
| ౬. | నెల్లూరు | ౫౩౧ | ౨౮౬ | ౯౨౭ | ౧,౭౪౪ |
| ౭. | కడప | ౭౫౮ | ౨౧౮ | ... | ౯౭౬ |
| ౮. | కర్నూలు | ౬౯౫ | ౮౯ | ... | ౭౮౪ |
| ౯. | బళ్ళారి | ౯౬౨ | ... | ... | ౯౬౨ |
| ౧౦. | అనంతపురం | ౭౫౨ | ౧౩౪ | ... | ౮౮౬ |
| ౧౧. | చిత్తూరు | ౪౬౯ | ౪౯౮ | ౧,౬౪౧ | ౨,౬౦౮ |
| | | ౬,౫౧౬ | ౧,౮౩౮ | ౧౨,౨౬౫ | ౨౦,౬౧౯ |

నూటి కఱువది వంతులకు పైఁబడిన గ్రామములు జమీందారుల వశమున నుండినవి. రైత్వారీ గ్రామములు నూటికి ముప్పదిమూఁడు చొప్పున నుండినవి. విశాఖ, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, నెల్లూరు, చిత్తూరు మండలములలో ఈ శాతము మఱీ యెక్కువ.

## స్వదేశ సంస్థానములు

భారతదేశమునందు ఇంచుమించుగా 500 స్వదేశ సంస్థానము లుండినవి. ఇందులో హైదరాబాదు, మైసూరు, తిరువాన్కూరు, భోపాల్, ఇండోర్.

గ్వాలియర్, ఉదయపూర్, జయపూర్, పాటియాలా మొదలగు నేఁబది పెద్ద సంస్థానములు కలవు. తక్కినవానిలో కొన్ని ఆంధ్ర ప్రదేశమునందలి జమీందారీలలో పెక్కింటికంటె విస్తీర్ణమునందును, రాఁబడియందును చాలచిన్నవి. 1895 నాఁటికి 4 కోట్ల రూపాయల రెవిన్యూ ఆదాయముకల నైజాముతోపాటు 500 రూపాయల రెవిన్యూకల కథియవాడు సంస్థానాధిపతికూడ స్వదేశ సంస్థానాధిపతిగా పరిగణింపఁబడినాఁడు.* వీరు జమీందారులు కారు. రాజకీయ స్థాయిలో, భూస్వామ్య వ్యవస్థలో, మహసూలు వసూళ్ళలో సంస్థానాధిపతులకును, జమీందారులకును చాల వ్యత్యాసము కలదు. సాలీనా రూ. 500 లు రెవిన్యూకల కథియవాడు స్వదేశ సంస్థానాధిపతికంటె సాలీనా 25 లక్షల రూపాయల రాఁబడి కలిగి, ఇంచుమించుగా రూ. 8 లక్షలు పేష్కష్ చెల్లించుచుండిన విజయనగరము జమీందారుల హోదా తక్కువ. స్వదేశ సంస్థానాధిపతులకున్న విశేషగౌరవములు, రాజలాంఛనములు జమీందారుల కుండవు.

ఆంధ్రదేశమునందు ఒక్క బనగానపల్లి సంస్థానము మాత్రమే స్వదేశ సంస్థానాధిపతుల స్థాయికి చెందినది. తక్కిన జమీందారులు ప్రభుత్వమునకు పాలుసరి పేష్కష్ చెల్లించువారు. స్వదేశ సంస్థానాధిపతులు రాష్ట్రప్రభుత్వములకుగాని, కేంద్ర ప్రభుత్వమునకుగాని ప్రతినిధులుగా పన్నులు వసూలు చేసి పేష్కష్ చెల్లించువారు కారు. నిర్ణీతమైన కప్పమును మాత్రము చెల్లించెడివారు. ఈ కప్పము చెల్లించు పద్ధతినుండికూడ బనగానపల్లి సంస్థానము మినహాయింపఁబడి యుండినది. ఈ వ్యాసమునందు సంస్థానములనఁగా స్వదేశ సంస్థానములు కాక జమీందారీ ఫాయాకుఁ జెందిన సామంత రాజ్యముల పాలక ప్రాంతములను నర్థమున వ్యవహరింపఁ బడినవి. దీనికాక బనగానపల్లి సంస్థానము మాత్ర మపవాదము.

## సంస్థానములు — సాహిత్య పోషణము

ప్రభునాశ్రయమును, పరిషదవలంబనమును లేనిదే సాహితీలత చిగురు వెట్టుట దుస్సాధము. 'నిరాశ్రయానశోభన్తే పండితా వనితా లతాః' కదా! ప్రాచీను లగు చక్రవర్తులు, సార్వభౌములు, వారి సామంతులు, తక్కిన శ్రీమంతులు మొదలగువారి యాశ్రయాలవాలముననే సాహితీ వృక్షము శాఖోపశాఖలుగా విస్తరించి బహు ద్విజసంతతుల కాశ్రయమై కావ్య పుష్ప ఫల సౌరభములను సీమాంతములదాఁక వ్యాపింపఁ జేసినది. రాజోపప్లవాదుల మూలమున నడుమ నడుమ ఆకులపాటు కలిగినను ఎప్పటికప్పుడు సరిక్రొత్తగా చిగిర్చి, రెమ్మలెత్తి, కొమ్మలు పుట్టి, పూచి, కాచి, ఫలించి రసికజన స్వాదుఫలముల ప్రసాదించినది.

* Jadabchandra Chakravarti, *The Native States of India*, Calcutta, 1895; ఆంధ్రపత్రిక, 1918, పుటలు 81-92.

ఇట్టి ప్రాచీన సాహితీ వృక్షమును యథాశక్తిగా పోషించినవారు సంస్థాన ప్రభువులు. పండువంటి విజయనగర మహాసామ్రాజ్య మంతరించిపోఁగా దాని నాశ్రయించి వర్ధిల్లిన సాహిత్యలక్ష్మి ఆంధ్రదేశమునందలి చిన్నచిన్న సంస్థాన పాలకుల యాస్థానములను జేరినది. చావ చిరిగి చదర అయినది. ఈ చిన్నచిన్న పాలకులలో పెక్కురు తమ చేతికిఁ జిక్కిన ముక్కలను కాపాడుకొనుటయందే జీవితమును గడపినవారు. రాజకీయపు రగడలలో నలుఁగుచుండిన వీరిలో చాల మందికి సాహిత్య గోష్ఠులు నిర్వహించుటకు సందు లేకపోయినది.

> 'ధన ముండుట పరిపాటియె
> ధనమే సర్వంబు గాదు, ధన ముండియు స
> ద్వినియోగ బుద్ధిఁ గలిగిన
> మనుజుని భాగ్యంబె లోకమాన్యతఁ గాంచున్'
>
> —దువ్వూరి రామిరెడ్డి.

అను కవి వాక్యమును బాటించిన సంస్థానపాలకులలో కొందరు పురాణేతిహాసముల నావిష్కరింపఁ జేసినవారు ఆలవాలమును పునరుద్ధరించినట్టివారు. సాహితీవృక్షమునకు అంతస్సారము—ఎరువు, గెత్తములు—సమకూర్చి దాని ఎదుగుదలను ఏపుచేసినవారు శాస్త్ర వాఙ్మయమును సంరక్షించినవారు. గీర్వాణ విద్యాప్రవాహము నీ యాలవాలములోనికిఁ ద్రిప్పి మూలమునకు దార్ఢ్యమును జేకూర్చినవారు కొందఱు. ఉత్తమ విమర్శకలవిత్రములచే క్షుద్రలక్షణములగు కలుపుమొక్కలను కత్తిరించినవారు కొందఱు. సీమలనుండి క్రొంగ్రొత్తయంట్లు తెప్పించి కొందఱు అంట్లుగట్టిరి. ఫలాదులను క్రిమికీటకముల బారినుండి కొందఱు రక్షించిరి. కొందఱు చోరబాధలను తొలఁగించిరి. కొందఱు వీని పుష్పసారమును తీసి లోకమున గుబాళించునట్లుచేసిరి. అందఱకు సాహితీఫలము లందుబాటులో నుండునట్లు కొందఱు తోడ్పడిరి. అనంతజీవయాత్రా పథిశ్రమమైన అశేషాంధ్ర జనత దీని చల్లని నీడల నాశ్రయించి మనోవికాసోల్లాసములను సంపాదించికొనినది, రసహృదయమును పెంపొందింపఁ జేసికొనినది. ఇట్టి సాహితీవృక్షము సరససాహితీ విమర్శక భృంగసంతానముల నిరంతర ప్రశంసాధ్వనులతో అనంతనవవసంతముల సంతరించినది.

## జమీందారుల సమష్టికృషి : సింహావలోకనము

ఆంధ్ర సంస్థానాధీశ్వరులు అందఱునుగారు కాని పెక్కురు సాహితీ పోషకులు. లోకములో అందఱును ధీరోదాత్తులు, ధీరోద్ధతులే ఉండరు. భోగ లంపటులయిన ధీరలలితులును కొందఱుందురు. వీరిలో స్వాయత్త బుద్ధులు కొందఱు; సచివాయత్తచిత్తులు కొందఱు. ఇది యిట్టిదని వేర్పఱుపలేము. ఇఁక ప్రభువునుబట్టికదా పరివారము! యథా రాజా తథా ప్రజా. కొందఱు కర్తలు;

కొందఱు కారయితలు. సమరాంగణమునందేకాక సాహితీ రంగమునందును సవ్యసాచిత్వమును నెఱపి సెహబా సనిపించుకొనినవారు కొందఱు. హాలహర్ష చక్రవర్తులు మొదలగు ప్రాచీనులేకాక నన్నెచోడుఁడు, ప్రతాపరుద్రదేవుఁడు, బుద్ధారెడ్డి, సర్వజ్ఞసింగ భూపాలుఁడు, శ్రీకృష్ణదేవరాయలు, బైచరాజు వేంకట నాథుఁడు, రఘునాథ నాయకుఁడు మొదలగు కవిరాజులవంటి రాజకవులు చర్చా యుగమునందలి రాజకవులకాద్యులు; ఆరాధ్యులు. వీరు ధర్మైకాయత్తచిత్త వృత్తి, అమృతోపమాన వాగ్వృత్తి, సత్కార్య ప్రవృత్తికల మహనీయులు. 'రాచ కవిత్వ బాధ పడరాదు పరామరిసింపు దైవమా' అని యెక్కడో దిక్కుమాలిన వారెవరో యొక్కరు వాపోయినంత మాత్రమున రాజకవుల సాహితీసృష్టికి వచ్చిన నష్టము లేదు.

జటప్రోలు సురభి మాధవరాయలు, బిక్కనవోలు కామినేని యెల్లారెడ్డి, విజయనగరము పూసపాటి తమ్మ భూపాలుఁడు, గద్వాల ముష్టిపల్లి సోమ భూపాలుఁడు, వనపర్తి అష్టభాషాకవిగోపాలరాయలు, పెద్దాపురము వత్సవాయ బలభద్ర జగపతి, కాళహస్తి దామెర్ల వెంగళ భూపాలుఁడు, బొబ్బిలిరావు రాయఁడప్ప రంగరాయ నృపాలుఁడు, సాలూరు బలారిసింహ నరసింహ రాజసింహుఁడు, సురపురము రాజా బహిరీపామ నృపాలుఁడు, నూజివీటి వెంకటాద్రి అప్పారాయ ప్రభువు, సంగమవలస రాజా మృత్యుంజయ నిశ్శంక బహద్దరు, మొగల్తుఱ్ఱు రాజా కలిదిండి రామరాజ బహద్దరు, పాచిపెంట రాజా త్యాడ పూసపాటి వీరపరాజు, పోలవరము కొచ్చెర్లకోట వేంకట రామచంద్ర కృష్ణారావు, జగ్గమపేట చినవేంకట రాయణింగారు, పానగల్లు రాజా పార్థసారథి నాయనింగారు, లక్కవరము మంత్రిప్రెగడ భుజంగరావు—మొదలగు సంస్థా నాధీశ్వరులు కృతికర్తలుగాకూడ చరిత్ర కెక్కిన చరితార్థులు. వీరి సరస సారస్వతాభిలాషయును, సాహితీ సముద్ధరణచణత్వమును ప్రశంసాపాత్రములు.

సంస్కృతాంధ్ర భాషా కవులను పోషించుటయే కాక విద్యావ్యసనులును, వితరణగుణ విలసనములునగు నీ సంస్థానాధీశ్వరులు వేదశాస్త్ర పండితులను సంగీతాదీతర లలితకళానిపుణులను సమ్మానించి జాతికి జీవగఱ్ఱలైన శాస్త్రాభ్యుదయమునకు, కళావిజ్ఞాన వికాసములకును దోహద మొనర్చిరి. సాహితీ వ్యవసాయమునకు అంతస్సారమువంటిదిగదా శాస్త్రవికాసము!

అమరావతి, ఉర్లాము, కిర్లమపూడి, కోలంక, చల్లపల్లి, పిఠాపురము, మాడుగుల, వనపర్తి, విజయనగరము, సాలూరులవంటి సంస్థానములు సంస్కృత విద్యాలయములను స్థాపించియు, సంస్కృత భాషాపండితులను ప్రోత్సహించియు, వేదధర్మవాహకమగు సంస్కృతమును, ఆర్షవిజ్ఞానమును విస్తరింపఁజేసియు చిరయశమును సముపార్జించిన వారు. భాషా సాహితీ సేవాపరాయణములగు సాహితీసంస్థలకు, గ్రంథప్రచురణ మండలులకు,

గ్రంథాలయములకు, సాహిత్య పత్రికలకు, తదితర విద్యాసంస్థలకు భూరిగా విరాళము లొసంగి భాషోద్ధరణ మొనర్చిరి. ఎర్నగూడెము, కపిలేశ్వరపురము, జయంతిపురము, పోలవరము, ముక్త్యాల, లక్కవరము మున్నగు జమీందారులు పత్రికలను స్థాపించి సాహితీప్రచారమునకుఁ దోడ్పడిరి.

ఉంద్రాజవరము, ఎర్నగూడెము, కపిలేశ్వరపురము, గద్వాల, దోమకొండ, పాపన్నపేట, బొబ్బిలి, ముక్త్యాల, వనపర్తి, విజయనగరము, పుయ్యూరు, వేంకటగిరివంటి జమీందారులు కొందఱు అచ్చుకూటముల స్థాపించియు, ప్రాచీనార్వాచీన గ్రంథముల ననేకము ప్రచురించియు భాషోపకార మొనర్చిరి. చల్లపల్లి, పాల్వంచ, పిఠాపురము, ముక్త్యాల, వల్లూరులవంటి జమీందారులు ఇతరులు స్థాపించిన ముద్రణాయంత్రశాలలకు ఆర్థిక సాహాయ్యము గావించిరి. అష్టావధానాశుకవితా శతావధానాది సాహితీప్రచారక రూపములకు చేయూతనిచ్చి, సర్వాంధ్రలోకమున సాహితీజిజ్ఞాసను నవనవోన్మేషముగ నిషేవణ మొనర్చిరి. ఆస్థాన కవిపండితుల నాదరించుటయేకాక తెలుఁగుదేశము నాలు గంచుల నుండియు, ఇతర రాష్ట్రములనుండియు తమ యాస్థానములకు వచ్చు కవి పండితులచే శతావధానాదికములు, శాస్త్రార్థములు చేయించి వారిని సత్కారములు, వార్షికములు, భూదానాదికములు, అగ్రహారప్రదానము, గజారోహణాది సమ్మానములు మొదలగువానిచే గౌరవించి పురాభారత సంప్రదాయములను పునరుద్ధరించిరి. ఉర్లాము, పిఠాపురము, వనపర్తి—వంటి సంస్థానములలో వేదశాస్త్ర పరీక్షలు నిర్వహించి ఆర్షధర్మ విజ్ఞానజ్యోతి ఆరిపోకుండ నిలిపిరి. కార్వేటి నగరము, గద్వాల, నూజివీడు, పిఠాపురము, బనగానపల్లి, బొబ్బిలి, ముక్త్యాల, వల్లూరు, విజయనగరము—మున్నగు సంస్థానములు సంగీత నృత్యాది లలిత కళలనుగూడ ప్రోత్సహించినవి. అనకాపల్లి, ఉంద్రాజవరము, కపిలేశ్వర పురము, చల్లపల్లి, పానుగల్లు, పిఠాపురము, బొబ్బిలి, వనపర్తి, విజయనగరము, పుయ్యూరు—మున్నగు జమీందారులు విశ్వవిద్యాలయముల అధ్యక్షకల్పుగానో, ఉపాధ్యక్షులుగానో, సెనేట్, సిండికేట్ సభ్యులుగానో విద్యారంగమున విశిష్టమైన సేవను సలిపినవారు. అనకాపల్లి, ఉంద్రాజవరము, కపిలేశ్వరపురము, కురపాము, చల్లపల్లి, దోమకొండ, పానుగల్లు, పిఠాపురము, పోలవరము, బొబ్బిలి, మునగాల, వనపర్తి, విజయనగరము, పుయ్యూరు—మున్నగు జమీందారులు రాజకీయ రంగమునందును, సాంఘిక సేవా క్షేత్రమునందును నిర్వహించిన పాత్రము విస్మరింపరానిది. స్వయముగా సాహిత్య పౌరోహిత్యమును నిపుణముగా నిర్వహించిన సంస్థానాధీశ్వరులు లెక్కకు మిక్కిలిగా కలరని యితః పూర్వమే నిరూపింపఁబడినది.

ఈ యుగమునందలి చివరిభాగమునందు ఆంధ్రసంస్థానములను పాలించిన వారిలో చాలామంది స్త్రీలుండుట గమనింపఁదగిన యంశము. వీరందఱును

ఇంచుమించుగా నొక కాలమునకు చెందినవా రగుటయేగాక కవిపండిత పోషణము నందు, సాహితీ సముద్ధరణమునందు విశేషాదరమును ప్రదర్శించుట యీమాన్యస్త్రీల సంఘటమయినను వింతలలో వింతగ గోచరింపక పోదు. అనకాపల్లి జమీందారిణి మహారాణి గొడే చిట్టి జానకయ్యమ్మా గజపతిరావు, ఆత్మకూరు సంస్థాన ప్రభ్వి శ్రీ సర్వైరాణీ భాగ్యలక్ష్మమ్మదేవి, ఉర్లాము సంస్థానాధీశ్వరి శ్రీ కందుకూరాడు మహాలక్ష్మమ్మ. కోలంక—వీరవరము జమీందారిణి రావు రామయమ్మారావు, గద్వాల మహారాణి ఆదిలక్ష్మీదేవమ్మ, గూటాల జమీందారిణి మన్యం మహాలక్ష్మమ్మ, గొల్లప్రోలు జమీందారిణి రావు రామయమ్మారావు, తునిమహారాణి సత్యవాడ వెంకట సుభద్రయ్యమ్మా జగపతిరావు, పాపన్నపేట సంస్థానాధీశ్వరి రాణీ వెంకట లక్ష్మమ్మసర్దేశాయి, మునగాల జమీందారిణి రాణీ లచ్చమ్మారావు, [illegible] సంస్థానాధీశ్వరి రాణీ సరళాదేవి మున్నగువారు తమ పూర్వులు పోయిన త్రోవల విద్వత్పోషణము గావించిన సాధ్వీమణులు. సరియైన ఆశ్రయములేని కవి పండితాదుల నాదరించి, తత్కాలమున సుఖయులను అమరులయిరి. ఈ యుభయుల సమష్టికృషిని సరిగా సమన్వయించికొని ఆంధ్రవాఙ్మయ అమృత హృదయమును బెంపొందించుకొనుట మిగిలియున్నది.

ఉభయ తారకమగు నీ మార్గము సర్వ శ్రేయోదాయకము. ఈ సన్నివేశమును—

'మణినా వలయం వలయేన మణి
ర్మణినా వలయేన విభాతి కరః,
కవినా చ విభు ర్విభునా చ కవిః
కవినా విభునా ప్రతిభాతి సభా'

అను సూక్తి చమత్కారముగా నిరూపించుచున్నది.

## సంస్థానకృషి ప్రశంస

ఆంధ్రసంస్థానాధీశ్వరుల సాహితీకృషిని ప్రశంసించుచు పండిత విమర్శకులు చేసిన ప్రసంగములు కొన్ని పరిశీలించుటావశ్యకము.

'ఇట్టి యంధకారములో మిణుకు మిణుకు వత్తిదీపాలవలె వెలిగి గద్వాల, వనపర్తి వంటి సంస్థానములు ప్రాచీన సంప్రదాయములను చెడిపోకుండ దాచినట్లుగ దమకున్న శక్తిమేరకు పోషించుచు వచ్చినారు.' *

'..........19 వ శతాబ్దారంభము నుండియు పండితులకు, విపులకు, సాహిత్య ప్రియులకు, నిర్మాతలకు తావొసంగి, తాము సాహిత్యప్రియులై ఆంధ్ర సారస్వతమును సముదార ప్రవర్తనముతో రక్షించి, నేటి

* సురవరము ప్రతాపరెడ్డి, వనపర్తి ప్రభు ప్రకాశితమగు శాస్త్రీయ విజ్ఞానమను గ్రంథము, పీఠిక, పు. 7.

ప్రజాయుగము వచ్చువఱకుఁ బోషించిన యాంధ్ర జమీందారులందరికిని మన మెంతయో ఋణపడియున్నాము.'[1]

'హైదరాబాదు రాష్ట్రములో సాంస్కృతిక దీపమును ఆరిపోకుండ కాపాడిన గౌరవము సంస్థానాధీశ్వరులకు చెందుచున్నది. ఈ సంస్థానాలలో ప్రత్యేకముగా ప్రశంసింపదగినవి గద్వాల, వనపర్తి, ఆత్మకూరు సంస్థానాలు. ఈ మూడు సంస్థానాలు తెలుగుభాషకు గొప్ప సేవచేసినవి. 1880 ప్రాంతములో గద్వాల, వనపర్తి సంస్థానాలలో తెలుగు అచ్చు యంత్రాలు స్థాపితమై గ్రంథాలు ముద్రిత మయ్యేను........కవులను, గాయకులను, పండితులను పోషించి యీ సంస్థానాలు సంస్కృతాంధ్రములను కాపాడినవి. ఈ సంస్థానాల పోషణలో ఉద్దండులైన పండితులు, కవిచక్రవర్తులు ఉండిరి ...'[2]

'ప్రభుత్వ విధానము ప్రజల భాషల అభివృద్ధికి ప్రతికూలముగ నున్న సందర్భమున నిజాముకు సామంతులై యున్నప్పటికిని గద్వాల, అమరచింత మొదలైన సంస్థానాధీశ్వరులు తెలుగు కవులను ఆదరించి పోషించినారు. ఆధునిక యుగ నిర్మాతలైన శ్రీ తిరుపతి కవుల వంటివారు తమ సారస్వత జైత్రయాత్రల సందర్భమున ఈసంస్థానాలకు అరుగుదెంచి సన్మానములను పొందినట్లు 'నానారాజ సందర్శనము' తెలుపుచున్నది. ఈ ఆస్థానాలు మినుకుమినుకు మని తెలుగు భాషాదీపములు వెలుగుచున్న ప్రమిదలలో కొంత చమురుపోసి, అవి ఆరిపోకుండునట్లు కాపాడిన గౌరవమును సంపాదించుకొనినవి.'[3]

'ఈ రాష్ట్రము (నిజాము) నందలి యాంధ్ర సంస్థానములలో వాఙ్మయ చరిత్రమున సువర్ణాక్షరములలో వ్రాయఁదగినవి గద్వాల, వనపర్తి, ప్రాగటూరు, సురపురము, ఆత్మకూరు, దోమకొండ, జటప్రోలు సంస్థాన చరిత్రములు. ఈ సంస్థానాధీశ్వరులలోఁ బేరెన్నికఁగన్న కవులు గలరు. వారి పోషణమున విరాజిల్లిన వాఙ్మయ మెంతయేని కలదు. బొంతి, నారాయణపురము, పాపన్నపేట, గోపాలపేట సంస్థానములు విబుధుల నాదరించి కవితాకళను బెంపొందించెను గాని యా సంస్థానముల లోని రాజకవుల పేరులు, నాఁటి కవుల గ్రంథములు, ఆంధ్రుల దురదృష్ట వశమున నేఁటిదనుక మిగులకపోవుట సంతాపకరము.'[4]

1 బిల్లూరు వెంకట నారాయణరావు, వీరేశలింగ యుగము, పు. 19.

2 దేవులపల్లి రామానుజరావు, తెలుగుసీమలో సాంస్కృతిక పునరుజ్జీవనము, పు. 93.

3 దేవులపల్లి రామానుజరావు, తెలంగాణలో జాతీయోద్యమాలు. పుటలు 64, 65.

4 శేషాద్రి రమణకవులు. పూర్వకవిపరిచయపీఠిక, గోలకొండకవులసంచిక, పు.391.

'ఈ దేశమునగల సంస్థానములన్నియు పెద్ద స్వాధీనమున నున్నవి. ఈ సంస్థానముల అధీశ్వరుల నాశ్రయించుకొని అనేకులు సంస్కృతాంధ్ర పండితులును, కవులును, సంగీతవిద్యా నిపుణులును ఎప్పుడును సత్కారములను పొందుచుందురు.'[1]

కవులు కడుపుకక్కుఱితిగాళ్లు కావునను, విమర్శకులు ప్రభులోని వైతాళికులు కావునను ఇట్టి సర్టిఫికెట్టుల నిచ్చిరని పూర్వపక్షమువారు వీనిని కొట్టి వేయవచ్చు. కాని జమీందారీ రద్దు చట్టమును సాధించిన కాంగ్రెసు పెద్దలు నేఁడు ఉద్గ్రంథ ప్రచురణమునందును, విజ్ఞాన విస్తరణమునందును, లలిత కళా పోషణమునందును, రాజకీయ సంస్కరణమునందును, ధర్మసంస్థల నిర్మాణ నిర్వహణములందును తెలుఁగు జమీందారులు నిర్వహించిన పాత్రమును హర్షించియుండుట గమనార్హము.[2]

## సాహిత్య స్థాయి

సంస్థానాధీశ్వరుల సద్బుద్ధియును, వారి యాశ్రితులగు కవిపండితుల సద్యత్నమును అట్లుండనిచ్చి, యీ యుభయుల పరిశ్రమమువలన సృష్టింపబడిన సాహిత్యపు విలువలను ఖరీదు కట్టుటగూడ మిగుల నావశ్యకము. ఈ యుగమును సాధారణముగా సాహిత్య విమర్శకులు బహూపపత్తికముగా క్షీణ యుగమని పేర్కొనుట కలదు. 'ఈ కాలపు కవుల అనుకరణ పరాయణత శ్లేష కావ్యములలో నెక్కువ కాన్పించును. తత్పూర్వము ఎనిమిది శతాబ్దుల కాలములో రెండు మూఁడుకంటె నెక్కువగాలేని శ్లేషకావ్యములు ఈ శతాబ్దిలో ఒక్క పెట్టున నిరువదివరకు పెరిగినవి. వానిలో రెండర్థములే కాక మూఁడర్థములు గలవియుఁ గొన్ని యున్నవి. తాళపత్ర గ్రంథపరిశోధనలవల్ల నాలుగర్థములు గలవియుఁ గొన్ని ఎక్కువైన కాకనేమో?'[3] అని ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు పలికిన పలుకులు ప్రత్యక్షర ప్రమాణ బద్ధములు. ఈ యుగములో వెలసిన సాహిత్యములో చాలపాలు కాలపరీక్షకు ఆఁగలేకపోవచ్చు. కాని, సాహిత్య వ్యవసాయము చేయువారిని పోషించి, ప్రోత్సహింపవలెనను సత్సంప్రదాయమును నిలువఁబెట్టినందులకైనను మన మీ ప్రభువులను శ్లాఘింపక తప్పదు. పూర్వాపర యుగములలోని యెంతెంత చెత్త కొట్టుకొనిపోయి యుత్తరోత్తర యుగములయందు నికరమైన సరుకెంత నిలిచినదో మనము పరికించుచున్నాము.

[1] కంభంపాటి అప్పన్నశాస్త్రిగారు, నిజాము రాష్ట్రాంధ్రుల స్థితి, ప్రబుద్ధాంధ్ర, 1923. [illegible], సంపుటి 3, సంచిక 5, పు. 76.

[2] [illegible], ఆంధ్ర సర్వస్వము, 1961, 'జమీందారులు ఆంధ్రదేశమునకు చేసిన సేవ', పు. 181.

[3] గౌతమ వ్యాసములు, ద్వితీయ ముద్రణము, పుటలు 48, 49.

ండ్లకెత్తపలపిసంత చెత్త పోఁగా ఉత్తమపదార్థము చిన్నమెత్తు నిలుచుట సహజము. ఈ యుగమునందు పాండిత్యపు పదను హెచ్చి, కవిత్వపు కదను తగ్గినమాట వాస్తవము. రసనిర్భరమైన కవితారీతులకంటె సమస్యాపూరణములు, అవధాన విధానములు, ఆశుకవితా రీతులు సంస్థానాధీశ్వరులను, వారి యాస్థాన ముఖ్యులను మిక్కిలిగా నాకర్షించినట్లున్నవి.

'అవధానంబు లనేకము న్నెఱపి రాజాస్థానము ల్చేరి వా
దవిధిన్ ధీరులునై చతుర్విధ కవిత్వ ప్రౌఢిమల్ చూపి భూ
ధవ దత్త ద్విప ఘోటకాది బహుసత్కారంబు....' లను గైకొనుటకే

కవులు ప్రయత్నించుచుండిరి. చిత్ర, బంధ, గర్భ కవిత్వములు, బహ్వర్థక కావ్యములు, ఆశుకవితలు ప్రబలుటకు సాహిత్య స్రష్టలలో కళాదృష్టి తక్కువయి. శాస్త్రదృష్టి యెక్కువగుటయే హేతువు. సమస్యా పూరణాదులు చమత్కార కారులైనను అవి తాత్కాలికానంద సంధాయకములు. శాస్త్రపండితులు పెక్కురు కవితారంగమున దిగుటచేత పాండితీప్రాగల్భ్యము ప్రబలి అక్షర నియమ రచనలు నిరోష్ఠ్య, నిరూష్మ, అపంచవర్గీయ, నిర్గద్య, శుద్ధాంధ్ర రచనలు— అక్కఱలేని నియమములతో, గారడీ కసరత్తులతో సంతరించిన కృతులు ఈ యుగమున నసంతముగా వెలువడినవి. శతకాదులును, కొన్ని ప్రబంధములును ద్రాక్షాపాకమున సంతరింపఁబడినవి. ప్రౌఢకవులు చేయివేసిన ప్రబంధములు కొన్ని నారికేళపాకమున పడినవి. కొన్ని ప్రబంధములలో ని పాకము ముదిరి పాషాణపాకముగా మాఱినది. నారికేళ పాకములయిన కొంత నయము. కొన్నింటి రీతి పిశాచనారికేళ పాకము. వీనిలో పట్టి శబ్దాడంబరము తప్ప రససూర్తి శూన్యము.

'సుకవి కవిత్వము తార్కిక
నికరంబులలోన నెట్లు నిల్వఁగ నేర్చున్
మకరాంకు కేళి కోర్చిన
ముకురానన మల్లయుద్ధమున కెట్లోర్చున్' —ఒక చాటువు.

తర్క కర్కశ బుద్ధులగు పండితులు కవితా క్షేత్రమునఁ బ్రవేశించినపు డిట్టి మల్లవిద్యా ప్రదర్శనములచే కవితాకన్యను గోదాలోనికి దింప ప్రయత్నింతురు.

'గాఢాలింగన సౌఖ్యముఁ
బ్రౌఢాంగన యెఱుఁగుఁగాక బాలే యెఱుఁగున్
మూఢుం డెఱుఁగునె సత్కవి
గూఢోక్తుల సారమెల్లఁ గోవిదుని వలెన్' —ఒక చాటువు.

అని పండితకవులు పతితల యధికారమును గుఱించి ప్రశ్నింపవచ్చు. అట్లే—

'కవితా లక్షణ మెఱుఁగని
యవివేకికిఁ బద్యమిచ్చి యడుగుటకంటెన్

ము సంస్థానాశ్రితులు కొంతి భద్రాద్రిరామశాస్త్రి రచించిన జగన్నాథ క్షేత్ర
ాత్మ్యమును, మునగాల సంస్థానాశ్రితులు వరదరాజ నందికేశ్వరశాస్త్రి
ిత సేతు మాహాత్మ్యమును, కాళహస్తి సంస్థాన సమ్మానితులు శిష్టు కృష్ణమూర్తి
సంతరించిన పీఠారణ్య వేంకటాచల మాహాత్మ్యములును క్షేత్ర మాహాత్మ్య
ులలో ప్రశస్తము లయినవి.

## చారిత్రక కావ్యములు

ఈ యుగమునందు చారిత్రక కావ్యములు పెక్కులు వెలసినవి. ఆర్వీటి
ండరామరాయల యాశ్రితుఁడగు అందుగుల వెంకయ్య రచించిన రామ
యము, నరసరావుపేట సంస్థానకవి చిట్టకవి నారాయణకవి కృతమగు
రాయ కదనరంగ చరిత్రము, వల్లూరు సంస్థానకవి మతుకుమల్లి నరసింహ
ప్రణీతమగు చెన్నపురీ విలాసము, చత్రాతి లక్ష్మీనరసకవి పద్మనాభ
త్తము, సంగమువలస సంస్థాన సమ్మానితులు వరవస్తు వేంకటరంగాచార్యుల
శ్రీ మన్నిశ్శంక చరితము, వెంకటగిరి సంస్థాన విభూషితులు మండపాక
్వతీశ్వరశాస్త్రి సంధానించిన రాధాకృష్ణ సంవాదము, పిఠాపుర సంస్థానాస్థాన
దేవులపల్లి తమ్మన్నశాస్త్రి సంతరించిన రాఘవంశ ముక్తావళి. అమరావతి
స్థానకవి అమరవాది రామకవి కైసేసిన వాసిరెడ్డీయము, బొబ్బిలి పండితులు
డలేముల సీతారామశాస్త్రి సంధానించిన బొబ్బిలివారి వంశావళి, గొడేవారి
ాదరణమున వెలసిన వైవజ్ఞ సార్వభౌమ విజయము, చెళ్ళపిళ్ళ వెంకట
స్త్రిగారి బొబ్బిలి పట్టాభిషేకము పరిగణింపఁదగినవి.

## పురాణములు

పరంపరగా వచ్చిన పురాణాంధ్రీకరణ రీతికూడ నీ యుగమునందు
గణింపఁదగిన ప్రాధాన్యము కలిగియున్నట్లు స్పష్టమగుచున్నది. సురపుర
స్థానాశ్రయమునందలి కాశాదము పెద్దన సోమయాజి యాంధ్రీకరించిన
త్స్య పురాణమును, సురపుర పాలకులు రాజా బహిరీ పామనృపాలుఁడు
ించిన భార్గవ పురాణమును, వెంకటగిరివారి యాశ్రయమునందలి ముడుంబి
ప్పయ్య దీక్షితులు రచించిన విష్ణు పురాణమును, విజయనగరము మండ
మేశ్వరకవి కూర్మ పురాణమును, వెంకటగిరి ప్రభువుల సమాదరణమున
కాశితమైన పిసుపాటి చిదంబరశాస్త్రి శతావధానిగారి పద్మ పురాణమును
ుత్తరములయిన రచనలు.

## ప్రబంధములు

ఆంధ్ర సాహిత్య శాఖలలో ప్రచురమైనది ప్రబంధ శాఖ. సంస్కృతము

నందును తక్కిన దేశీయ భాషలయందును 'ప్రబంధ' శబ్దము సర్వకావ్య సామాన్య వాచకముగ ప్రయుక్తమయినను ఆంధ్రమునందు ప్రబంధ శబ్దమొక విశిష్ట కావ్యరీతిని వ్యక్తీకరించు పరిమితార్థమునందు ప్రయుక్తము. వర్ణన ప్రధానమును, నాటకీయ శిల్ప ప్రచురమును నయి ప్రాయికముగా ఏక నాయకాశ్రయమయి వస్త్వైక్యము కలిగిన కావ్య రచనా పక్కిని ఆంధ్ర సాహితీ విమర్శకులు ప్రబంధమని పేర్కొనిరి. నన్నెచోడాది ప్రాచీన కవీంద్రుల రచనములయందే యీ పోకడలు కన్పట్టుచున్నను, శ్రీనాథాది మహాకవుల సాహితీ సృష్టిలో నీ రీతి వర్ధిల్లినను రాయల యుగమునే విమర్శకులు ప్రబంధ యుగమను పేర వ్యవహరించిరి.

ఆంధ్ర సాహిత్య శాఖలలో శతకములకును, ప్రబంధములకును గల ప్రాముఖ్యము తక్కినవానికి వేనికిని లేదు. అర్వాక్కాలిక రాయలయుగము నందును అనేక ప్రబంధములు వెలసినవి. సర్వాంధ్ర ప్రబంధ పరంపరకును మను, వసు చరిత్రములు ఆదర్శ మూర్తులు. వాని యొరవడిలో పిల్ల మనుచరిత్రములు, పిల్ల వసుచరిత్రములు అనేక మవతరించినవి. వీనిలో చాల పాలు ప్రత్యేక వ్యక్తిత్వములేని అంధానుకరణములు. అక్కడక్కడ పూర్వుల ననుకరించినను మొత్తముమీద విశిష్టతను వెలార్చి, నాజూకు పోకడలు పోయిన నవ్య ప్రబంధములుకూడ లేకపోలేదు. ఈ యుగమునందు వెలసిన పరశ్శతములగు ప్రబంధములలో శిరశ్శేఖరములగు రచనలలో కొన్ని : జటప్రోలు సంస్థానాధీశ్వరులు సురభి మాధవరాయలు నిర్మించిన చంద్రికా పరిణయము, నూజివీడు సంస్థానకవి కుమార ధూర్జటి సంధానించిన ఇందుమతీ పరిణయము, గద్వాల సంస్థానాధీశ్వరుల కవి కాణాదము పెద్దన సోమయాజి నిబంధించిన ముకుంద విలాసము, దోమకొండ పాలకుల యాశ్రయమునందలి రాపాక లక్ష్మీపతి రచించిన భద్రాయురభ్యుదయము, వెంకటగిరి కవిరాజు రెంటూరి రంగరాజు సంతరించిన భానుమతీ పరిణయము, అమరావతీశ్వరుల యాస్థానకవి ములగు పాపయారాధ్యులు కైసేసిన అహల్యా సంక్రందన విలాసము, మొగల్తుర్రు రాజా కలిదిండి రామరాజు బహద్దరు సంతరించిన వరసావిత్రీ చరిత్రము, బోరవెల్లి సంస్థానాస్థానకవి చింతలపల్లి ఛాయాపతి ప్రణీతమగు రాఘవాభ్యుదయము, బొబ్బిలి సంస్థాన కవీశ్వరులు కొటికెలపూడి వేంకటకృష్ణకవి కృతమగు దిలీపచరిత్రము, నూజివీటి సంస్థాన సమ్మానితులు మాడభూషి నృసింహాచార్యకవి రచించిన వల్లవీపల్లవోల్లాసము, పిఠాపురము రావువారి యాస్థానకవి వక్కలంక వీరభద్రకవి నిర్మించిన వాసవదత్తా పరిణయము, వల్లూరి జమీందారుల విద్యాధికారి మతుకుమల్లి నృసింహ విద్వన్మణి విరచించిన అజ చరిత్రము, గోడేవారి యాశ్రితులు అక్కినేపల్లి నృసింహకవి రచించిన ఓఘవతీ పరిణయము, కాకరపర్తి బుచ్చిపాత్రకవి రచించిన సత్యవతీ పరిణయము,

పాల్వంచ సంస్థానమువారు కృతినందిన శిష్టా వెంకటసుబ్బయ్యగారి హృదయాభిరామము ప్రబంధ వీథుల పయనించు రసిక పాంథజనులకు అమృత చషకముల నందించు ప్రపాశాలలు.

## శతకములు

ఈ యుగమునందు వెలసిన శతకము లసంఖ్యాకములు. సాహిత్య క్షేత్రమునందు పరిశ్రమించిన ప్రతి కవియును నేదోయొక శతకమల్లినట్లు సాహిత్య చరిత్ర సాక్ష్యము. కాసుల పురుషోత్తమకవి, గోగులపాటి కూర్మనాథకవి, మండపాక పార్వతీశ్వరకవి, అడిదము బాలభాస్కరకవి, అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి, కూచిమంచి తిమ్మకవి, మదిన సుభద్రయ్యమ్మ, మృత్యుంజయ నిశ్శంక బహద్దరు, పాచిపెంట పూసపాటి వీరపరాజు, తాడికొండ మల్లనారాధ్యులు, ఏనుఁగు లక్ష్మణకవి మొదలైనవారు శతకశాఖలో చక్కని కృషి సల్పినవారు.

## చతుర్విధ కవితలు

చాటు కవిత్వము, సమస్యా పూరణము, అవధానాశుకవితా విధానము, చిత్ర, బంధ, గర్భ కవిత్వములు, బహ్వర్థక కావ్యములు ఈ యుగ విశిష్టతకు ముఖ్యహేతువులు. మోచర్ల దత్తప్ప, మోచర్ల వెంకన్న, తిరుపతి వేంకట కవులు, కాశీ కృష్ణాచార్యులు, మాడభూషి వెంకటాచార్యులు, శిష్టు కృష్ణమూర్తి, కొప్పరపు సోదర కవులు, వెంకట రామకృష్ణ కవులు ఆశుకవితలో అందె వేసినవారు.

ఈ యుగమునందు వెలసిన బహ్వర్థక కావ్యములలో మాడుగుల యాశ్రితులు మంత్రిప్రెగడ సూర్యప్రకాశకవి రచించిన కృష్ణార్జున చరిత్రము, నూజివీటి నాశ్రయించిన తిరుమల బుక్కపట్టణము వెంకటాచార్యులు రచించిన అచలాత్మజా పరిణయము, పిఠాపురమువారి సమ్మానితులు పిండిప్రోలు లక్ష్మణ కవి రచించిన లంకా విజయము, విజయనగరమువారి ఆశ్రితులు ఓరుగంటి సోమశేఖరకవి కూర్చిన రామకృష్ణార్జున రూపనారాయణీయము, వనపర్తి విద్వాంసులు చెన్నకృష్ణకవి నిర్మించిన యాదవ భారతీయము, గద్వాల విద్వత్కవి పోకూరి కాశీపతి సవదరించిన సారంగధరీయము, లక్కవరము జమీందారుల యాస్థానకవి కొత్తపల్లి సుందర రామకవి కృతమగు వసుస్వారోచిషోపాఖ్యానము మున్నగునవి లబ్ధ ప్రతిష్ఠము లగునవి.

చిత్ర కవిత్వము చమత్కారాపాదకమగు కావ్య రచనా శిల్పము. ఇది బుద్ధి సంబంధి. సామాన్యులకును, అంతగా సరసులకును సంబంధించినది కాదు. పాండితీ శౌండీర్యమును బ్రకటించు పండితప్రకాండుల గమ్మత్తయిన

గారడీ కసరత్తుల సాము గరిడీలు ఈ చిత్ర కవిత్వ రీతులు. నిర్గద్య, నిరోష్ఠ్య, నిరూష్మ, అపంచవర్గీయ నియమములతోడను, గర్భ బంధ రీతులతోడను ఈ కవిత్వము పండిత హృదయ పరితోషకముగ పరిఢవిల్లినది. కాణాదము పెద్దన సోమయాజి, మాడభూషి వెంకటాచార్యులు, వెళ్ళపిళ్ళ నరసకవి, శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి, మండపాక పార్వతీశ్వరశాస్త్రి మొదలైనవారీ రీతిని పెంపొందించినవారు.

## యక్షగానములు

దేశి సాహిత్యములో విశిష్ట స్థానము నాక్రమించిన యక్షగాన శాఖ యీ యుగమునం దతివేలముగ విస్తరించినది. రాయదుర్గం పాళయగాఁడు కర్ణాటక రాయ దళవాయి తిమ్మభూపాలుఁడు (క్రీ. శ. 1730 ప్రాంతము) రచించిన ప్రసన్న వేంకటేశ్వర విజయ విలాసము, కాకరపర్తి నృసింహకవి కృతమగు సంగీత సారంగధర, రాజా మృత్యుంజయ నిశ్శంక బహద్దరువారి పారిజాతము, తణికెళ్ళ ప్రకాశకవి గుణనిధి చరిత్ర ముఖ్యములైనవి.

## నాటకములు

సంస్కృత దృశ్య ప్రబంధములను శ్రవ్య ప్రబంధములుగా నాంధ్రీకరించు పద్ధతి యొకనాఁడుండినది. ఈ పద్ధతియే ఈ యుగమునందలి పూర్వ భాగమునం దనుసరింపఁబడినది. ఉత్తర భాగమునందు సంస్కృత దృశ్య కావ్యములను యథాతథముగా నాంధ్రీకరించు పద్ధతి ప్రచారమునకు వచ్చినది. సంస్కృత నాటకములు పెక్కులు తెనిఁగింపఁ బడినవి. కొన్ని స్వతంత్ర కృతులును వెలసినవి. వుయ్యూరు రాజా వేంకటాద్రి అప్పారావుగారి జ్యోతిర్లీల లేక ఆంధ్ర వీరలక్ష్మి విజయము, గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కము, మందసా సంస్థానమునకు చెందిన జి. సి. వి. శ్రీనివాసాచార్యుల కమలాపహరణము, బొబ్బిలికి చెందిన చెలికాని వెంకట సూర్యారావుగారి చినరంగరాయ నాటకము, నరసరావుపేట వెంకట పార్థసారథి కవుల విచిత్ర రాఘవము, మునునూరి ప్రభువు లంకితము పొందిన విశ్వనాథ సత్యనారాయణగారి అనార్కలి, గద్వాల సమాశ్రయమున వెలసిన చిదంబరకవి కృష్ణ సందేశము, వెంకటగిరివారి మన్ననలను బొందిన బాలాంత్రపు వెంకటరాయకవి రచితమగు యాచ శూరేంద్ర విజయము, పోలవరము సంస్థానాస్థాన కవులు తిరుపతి వేంకట కవులు తీర్చిన భారత కథానాటకములు, ఎడ్వర్డు పట్టాభిషేక నాటకము, పానుగల్లురాజా పార్థ సారథి రాయణింగారి కమలా కల్యాణము, పిఠాపురము నాశ్రయమునందలి పానుగంటివారి నాటకములు, కిర్లమపూఁడి కవి సత్యవోలు కామేశ్వరకవి యాంధ్రీకరించిన అనర్ఘ రాఘవము, కోలంక—వీరవరము జమీందారిణుల

పోషణమున నుండిన తిరుపతి వెంకట కవులు సంతరించిన ప్రభావతీ ప్రద్యుమ్నము, మైలవరమువారి యాశ్రితులు మల్లాది అచ్యుతరామశాస్త్రి రచించిన అహల్య, గంపలగూడెము జమీందారు కోటగిరి వెంకటకృష్ణారావుగారి నాటక సంపుటములును, పిఠాపురము యువరాజాగారి నాటకములును పేర్కొనఁ దగినవానిలో కొన్ని.

## తాత్త్వికరచనలు

వీనిలో ఉర్లామువారి ప్రత్యూష ప్రబోధమను ఆంధ్ర శారీరక మీమాంస, కురపామువారి మహావాక్య రత్నావళి, జయంతిపురమువారి ధమ్మపదము, బొబ్బిలివారి హిందూమతము, వెంకటగిరివారి సర్వమత సార సంగ్రహ, సందిగ్ధ తత్త్వ రాద్ధాంత, నాస్తికధ్వాంత భాస్కర, నిర్గుణవాద నిరాకరణాది రచనలు, లక్కవరమువారి తత్త్వమీమాంస, విజయనగరమువారి ఆంధ్రీకృత ధర్మసింధు మనుధర్మశాస్త్రాదులు పరిగణింపఁ దగినవి.

## విమర్శనములు

చారిత్రక విమర్శనములలో జటప్రోలు సంస్థాన పండితులు వెల్లాల సదాశివశాస్త్రిగారి ఆంధ్ర చరిత్ర విమర్శనము, ఆంధ్ర దశరూపక విమర్శనము, తుని సంస్థాన విద్వాంసులు కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి పెద్దాపుర సంస్థాన చరిత్ర విమర్శనము మున్నగునవి చక్కని రచనలు.

## ఆంధ్రీకృతులు

ఆంధ్రీకృత కావ్యములలో జటప్రోలునకుచెందిన ఎలకూచి బాలసరస్వతి మల్లభూపాలీయము, కార్వేటి నగరమునకుఁ జెందిన ఋగ్వేది వేంకటాచలకవి గీతగోవిందము, నూజివీటికి చెందిన మాడభూషి వెంకటాచార్యుల పుష్పబాణ విలాసము, పిఠాపురమునకుఁజెందిన దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి మల్హణస్తవము, వుయ్యూరు రాజా వెంకటాద్రి అప్పారావుగారి గీతగోవిందము, కాళహస్తికి చెందిన శిష్టు సర్వశాస్త్రి ఆంధ్రామరుకము, ముక్త్యాల ప్రభువుల పోషణము లోని శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి శ్రీకృష్ణభారతము, బొబ్బిలి మండపాక పార్వతీశ్వరకవి కాంచీపుర మహత్వము, వెంకటగిరి చింతలపల్లి నరసింహ శాస్త్రి శృంగార కాదంబరి, కిర్లమపూఁడి సత్యవోలు కామేశ్వరరాయకవి ఆంధ్రధూర్త సంహారము, పిఠాపురము నాశ్రయమున వెలువడిన గిడుగు సీతాపతి రత్నపాంచాలిక మొదలయినవి ప్రసిద్ధములు.

## వేద వాఙ్మయము

ఇఁక శాస్త్ర ప్రపంచము మాట. సంస్థానాధీశ్వరులు కేవలము సాహిత్య

మునేగారి షట్ఛాస్త్రములను సైతము సమాదరించిరి. వేద విషయముగా ఉర్లాము, చల్లపల్లి, పిఠాపురము, రాచూరు, వనపర్తి, విజయనగరము, సాలూరు మొదలయిన జమీందారులు విశిష్ట ప్రోత్సాహ మిచ్చినవారు. బులుసు పాపయ్య శాస్త్రి, బొమ్మకంటి వెంకట నృసింహశాస్త్రి, బొమ్మకంటి రామస్వామి అవధాని యడవల్లి అప్పావధాని, మద్దూరి కృష్ణావధాని, సామవేదము అన్నప్పశాస్త్రి, బంకుపల్లె మల్లయ్యశాస్త్రి, టి. గోపాలాచార్యులు, గంటి సీతారామావధాని, దువ్వూరి శ్రీరామావధాని, తాతా జానకిరామయ్య, తాతా జగన్నాథస్వామి మున్నగువారు ఆయా సంస్థానాధిపతుల యాశ్రయమున వర్ధిల్లి వేదధర్మమును ప్రచారము నొనర్చినవారు.

## తర్కము

తర్క శాస్త్రమునందు పిఠాపురము — ప్రతివాద భయంకర రాఘవాచార్యులు, శ్రీపాద లక్ష్మీనృసింహశాస్త్రి, ఉర్లాము — ఆదిభట్ల రామమూర్తిశాస్త్రి, పేరి కాశీనాథశాస్త్రి, గుమ్మలూరి సంగమేశ్వరశాస్త్రి, అమరచింత — తిరుమల బుక్కపట్టణము శ్రీనివాసాచార్యులు, జటప్రోలు — వెల్లాల సదాశివశాస్త్రి, అకింతల సింగరశాస్త్రి, బొబ్బిలి — పీసపాటి వెంకటేశ్వర్లు, నుసర్ల సీతారామ శాస్త్రి, వనపర్తి — నంబాకం రాఘవాచార్యులు, వనం సీతారామశాస్త్రి, ఆంధ్ర — గంటి సూర్యనారాయణశాస్త్రి, కురపాము — నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి చల్లపల్లి — అద్దేపల్లి సోమనాథశాస్త్రి మొదలగు పండితులు దృఢ వ్యుత్పత్తి గౌరవము కలవారు.

## అలంకారము

అలంకార శాస్త్రమునందు జటప్రోలు — వెల్లాల సదాశివశాస్త్రి, గద్వాల — పురాణం నృసింహాచార్యులు, ఆత్మకూరు — హారతి దీక్షాచార్యులు, నూజివీడు — అజివిళ్ళ వెంకటశాస్త్రి, సురపురము — బుచ్చి వెంకటాచార్యులు, తుని — చావలి రామశాస్త్రి, గోపాలపురము — అద్దేపల్లి కృష్ణ సూరి, విజయనగరము — తాతా సుబ్బరాయశాస్త్రి ముఖ్యులు.

## నిఘంటువులు

విజయనగరమువారి సమాదరణమున రూపెత్తిన వాచస్పత్యము, ఫర్హంగ్ ఆనంద్ రాజ్, గొడేవారి ప్రోత్సాహమున పరవస్తు శ్రీనివాసాచార్యులుగారు రచించిన సర్వశబ్దసంబోధిని. పాచిపెంట జమీందారు సోదరుఁడు రాజా త్యాడ పూసపాటి వీరపరాజు కూర్చిన ఆంధ్రపదాకరమును, గొల్లప్రోలు జమీందారిణుల యాశ్రయమునందలి కూచిమంచి సుబ్బారావు సంధానించిన హిందీ-తెలుగు

నిఘంటువును, పిఠాపురమువారి సూర్యరాయ నిఘంటువును, గద్వాల, దోమ కొండవారి రాజబంధువులు తాటికొండ తిమ్మారెడ్డి దేశాయి గారి ఉర్దూ-తెలుగు నిఘంటువును ఈ యుగమునందలి నిఘంటు సంబంధి కృషికి నిదర్శనములు.

## వ్యాకరణము

ఇందు ఉర్లాము — తాతా సుబ్బరాయశాస్త్రి, లక్కవరము — శొంఠి భద్రాద్రిరామశాస్త్రి, గోపాలపేట — బుక్కపట్టణము రాఘవాచార్యులు, వనపర్తి — ఖండవల్లి నరసింహశాస్త్రి, పిఠాపురము — వేదుల సూర్యనారాయణశాస్త్రి, బుచ్చిరెడ్డిపాళెము — కొండూరి తాతయాచార్యులు, వల్లూరు — మతుకుమల్లి నరసింహ శాస్త్రి, విజయనగరము — భాగవతుల హరిశాస్త్రి, తాతా సుబ్బరాయశాస్త్రి, నూజివీఁడు — మంత్రవాది రామస్వామిశాస్త్రి, మరింగంటి వెంకట రంగాచార్యులు మున్నగువారు ముఖ్యులు. ఆంధ్ర వ్యాకరణ వ్యాఖ్యాతలలో ప్రసిద్ధులయిన కవిజనాంజన కర్త కిమ్మూరి నరసింహరాజు సాలూరునకును, కవిశిరోభూషణ కర్త అహోబలపతి నరసరావుపేటకును, హరికారికావళీ కర్త శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి కాళహస్తికిని, అహోబల పండితీయాంధ్రవివరణ కర్తలు శొంఠి భద్రాద్రిరామశాస్త్రి లక్కవరమునకును, రామకృష్ణీయ నామక చింతామణి వ్యాఖ్యాన కర్త అల్లమరాజు రామకృష్ణకవి పిఠాపురమునకును చెందినవారు.

## జ్యోతిషము

జ్యోతిష విభాగమునందు బొబ్బిలి — కొటికలపూడి కోదండరామకవి, కొటికలపూడి వేంకట కృష్ణసోమయాజి, ఆంధ్ర — నిష్ఠల సింహాచల సిద్ధాంతి, తాతా అక్కాజీ రామయ్య, గోదే — రాణి మహాగ్ని చిన్నృసింహకవి ముఖ్యులు.

## దర్శనములు

దర్శనములయందు ఆత్మకూరు—ముదిగొండ నాగలింగశాస్త్రి, గూటాల—పుల్య దక్షిణామూర్తిశాస్త్రి, నరసరావుపేట—మతుకుమల్లి కనకాద్రిశాస్త్రి, సంగమ వలస—పరవస్తు వెంకటరంగాచార్యులు పేరుపొందిన పండితులు.

## విశిష్టాద్వైతము

విశిష్టాద్వైతమునందు సురపురము—తిరుమల బుక్కపట్టణము సోదరులు, వనపర్తి—వీరరాఘవాచార్యులు, పిఠాపురము--కిళాంబి ధర్మాచార్యులు ప్రసిద్ధులు.

## సంగీతము

జంత్ర గాత్రముల రాల్గరగించు విమల గాంధర్వమును వెన్నతోపెట్టిన

విద్యగా అభ్యసించిన వాద్య వాదకులు, గాయకులు, శాస్త్రకారులు, వాగ్గేయ కారులు అనేకులు సంస్థానాధిపతుల సమాదరణమున వెలసిరి. బొబ్బిలివారి యాస్థాన విద్వాంసులగు వాసా దాసయ్య, కామయ్య, సాంబయ్య, నందిగానం వెంకయ్య జగమెఱిఁగినవారు. కార్వేటినగర సంస్థానమునందలి కూావస సామయ్య, గోవింద సామయ్యలు, సారంగపాణి పద రచయితలలో ప్రసిద్ధులు. ముక్త్యాల సంస్థానమునకుచెందిన సుసర్ల దక్షిణామూర్తి, చల్లపల్లి సమాశ్రయము నందలి గరికిపర్తి కోటయ్యదేవర, విజయనగరము పాలకుల సమ్మానము లందిన దూర్వాసుల సూర్యనారాయణశాస్త్రి, గురాచార్యుల వెంకటరమణ దాసు, ఆదిభట్ల నారాయణదాసు, ద్వారం వెంకటస్వామినాయఁడు, పిఠాపురము వారి సమ్మానమునందిన తుమురాడ సంగమేశ్వరశాస్త్రి, వల్లూరు జమీందారుల సత్కారములను బొందిన హరి నాగభూషణము, అశ్వధాటి రామమూర్తి సంగీత ప్రపంచమున పేరు పెంపులు గడించినవారు.

## చిత్రకళ

ముక్త్యాల, పిఠాపురము, నూజివీడు, వల్లూరు, చల్లపల్లి, సంగమవలస మున్నగు జమీందారులు చిత్రకళయందు విశేషాభిమానము గలవారు.

ముక్త్యాల, సంగమవలస, వుయ్యూరు జమీందారులు స్వయముగ చిత్రకారులు. పిఠాపురమువారు దామరూర భాష్యకారులుగారిని, విజయనగరము వారు అంట్యాకుల పైడిరాజుగారిని, ముక్త్యాలవారు ఆత్మూరి రామమోహన రావ్‌గారిని ప్రోత్సహించినవారు. జటప్రోలు, తుని, మైలవరము, వల్లూరు, విజయనగరము జమీందారులు నాటక ప్రదర్శన సమాజములను ప్రోత్సహించిరి. చల్లపల్లి, వల్లూరు జమీందారులు జాతీయ క్రీడల నాదరించిరి.

ఈ యుగమునందలి విశిష్టతలలో రాజకవయిత్రులు వెలయుటొక విశేషము. గొడేవారి యాఁడుఁబడుచగు మదిన సుభద్రయ్యమ్మ, మహారాణీ గొడే చిట్టి జానకయ్యమ్మ, చెలికాని చెల్లయ్యమ్మ, పాపన్నపేట సంస్థానాధీశ్వరి రాణీ వేంకట లక్ష్మియమ్మ సర్దేశాయి మున్నగువారు చక్కని కవిత్వమును జెప్పి యాంధ్ర లోకమును మెప్పించినవారు.

ఈ యుగమునందలి సాహిత్య శాఖలను బహుముఖములుగ విస్తరింపఁ జేసిన కవి పండిత వంశము లనేకము సంస్థానాధీశ్వరుల యాశ్రయమునఁ బెంపొందినవి. ఇట్టి కుటుంబములలో అల్లమరాజు, ఆణివిళ్ళ, ఏనుఁగు, కాకర పర్తి, కూచిమంచి, కొటికెలపూడి, కొల్లూరి, చద్రాతి, చింతలపల్లి, తిరుమల బుక్కపట్టణము, దిట్టకవి, దేవులపల్లి, పరవస్తు, పేరి, మండ, మండపాక, మతుకుమల్లి, మాడభూషి, ముడుంబి, వక్కలంక, వెల్లాల, శిష్టు, సత్యవోలు, హారతి మొదలగు గృహనామములుకల కవిపండిత వంశములవారు ఆంధ్ర భాషా

సాహిత్యములను తమ జీవితములను వెలవోసి సృష్టించి, అధీతిబోధాచరణ ప్రచారణముల జాతికి నూతన శక్తిని సమకూర్చిన ధన్యజీవనులు. వీరి కాంధ్రలోక మెంతయును ఋణపడియున్నది.

'దృష్టం కిమపి లోకేఽస్మిన్ ననిర్దోషం ననిర్గుణం
ఆవృణుధ్వ మతో దోషాన్ వివృణుధ్వం గుణాన్ బుధాః'

ఆంధ్ర సాహితీ విమర్శక లోకమున ఇందాఁక సాఁగిన కావ్యావలోకన రీతిని సాహిత్య శాఖలనో, తత్పోషకులనో, కొందఱు ప్రసిద్ధ కవులనో దృష్టి యందిడికొని ప్రచురముగా ప్రవర్తితమయినది. ప్రస్తుత మొక నవ్యదృక్పథముతో సాహితీ వ్యవసాయమును పరికించుట యుక్త మనిపించుచున్నది. సాహితీ స్రష్టల కుటుంబములు ప్రాతిపదికగా ఒక క్రొత్తచూపుతో సాహిత్య చరిత్రమును నిర్మించి, ఆయా కుటుంబములు నిర్వహించిన ప్రముఖ పాత్రమును నిరూపించుట పరిశోధకుల ముఖ్యకర్తవ్యమై యున్నది. సాహితీమూర్తి సర్వాంగీణ సౌందర్యమును సమ్యగ్దర్శన మొనర్చుటకీ నూతనరీతి యెంతేని తోడ్పడఁ గలదు.

'సారస్వతాని సరసాని కవీశ్వరాణాం
మాత్సర్య దిగ్ధ హృదయాన కలంకయంతు'

—రత్నపాంచాలికా.

# అమరచింత : ఆత్మకూరు

## ప్రవేశిక

ఇది మహబూబ్ నగరము మండలములోనిది. వైశాల్యము 190 చ.మై. నిజామునందలి పురాతన సంస్థానములలో నొకటి. ఇది పూర్వము అమరచింత, వర్ధమాను అను రెండు పరగణాలు గలదిగా నుండినది. దీనికి మొదటి రాజధాని తిప్పుడంపల్లె : ఆతరువాతి రాజధాని ఆత్మకూరు. గద్వాలకు మిక్కిలి సమీపమున ఆత్మకూరు ఉన్నది. రెండింటికిని మూఁడు క్రోసుల దూరము. నడుమ కృష్ణానది మాత్రమే యడ్డు..

## సంస్థాన చరిత్రము

సంస్థాన పాలకులు పాకనాటి రెడ్లు. వీరి యింటిపేరు ముక్కరవారు. వీరి మూలపురుషుఁడు గోపాలరెడ్డి. ఈయన తొలుత తిరుపతి ప్రాంతమునఁగల చంద్రగిరిపట్టణ వాస్తవ్యుఁడు. కాకతీయ చక్రవర్తులకు సామంతుఁడగు గోన బుద్ధారెడ్డి సపరివారముగా తిరుపతి యాత్రకేఁగినపుడీ గోపాలరెడ్డి బుద్ధభూపతి కెన్నో సపర్యలు గావించి మెప్పింపఁగా బుద్ధారెడ్డి గోపాలరెడ్డిని తన రాజధానికిఁ బిలిపించి మక్తల నాఁడగౌడటికమును ప్రసాదించి గౌరవించెనఁట. ఇది క్రీ. శ. 1292 నాఁటి మాట. ఇతని కుమారుఁడగు చిన్నగోపిరెడ్డి క్రీ. శ. 1363 లో పంచమహల్ తాలూకా సర్నాడగౌడ వతను కాటభూపతి సన్నదు వలన సంపాదించెనఁట! ఈలోఁగా ఓరుగల్లు పతనమై బహమనీ రాజ్య స్థాపనమునకు పునాదులు లేచినవి. బహమనీ సుల్తానులకు సాయపడిన చిన్నగోపిరెడ్డి ఫిరోజ్‌గడునకు చెందిన సర్కారు ముజఫర్‌నగర్ పరగణాలోని ౨ దేహాతులలో నాడగౌడు, సర్నాడగౌడు, దేశముఖి, దేశాయిగిరి, దేశపాండ్యగిరి మున్నగు రుసుములు సులతానుల సన్నదు ద్వారమునఁ బడసెను. వీరి కుమారులు చంద్రారెడ్డి కురుమూర్తి దేవాలయ నిర్మాత.

చంద్రారెడ్డి ప్రపౌత్రుఁడు ఇమ్మడి గోపిరెడ్డి గోలకొండ సులతాను అబ్దుల్లా కుతుబ్‌షాకు సమకాలికుఁడు. గుత్తిముగడ్డ దుర్గము నాక్రమించిన గోపాలరావును నతనిని గోలకొండ సులతాను నానతిపై పట్టి యప్పగించిన ఇమ్మడి గోపిరెడ్డి సాహసమునకు, ప్రభుభక్తికిని సులతాను సంతోషించి ముచ్చింతల, అల్లిపురము అను జాగీరులను ప్రసాదించి పాన్‌సౌ మన్‌సబ్‌దార్ బిరుదము, 200 సవారుల నుంచికొనుటకు హుకుములు జారీచేయించిరి. గోపిరెడ్డి భాగమునకు అమర

చింత, వడ్డెమానులు వచ్చినవి. గోపిరెడ్డి యన్నయగు సాహెబురెడ్డికి కడేచూరు, ముక్తల మొదలగు పైతృక సీమలు సంక్రమించినవి. గోపిరెడ్డి కిద్దరు కొడుకులు. వారు తండ్రి జాగీరును బంచుకొని పాలించిరి. గోపిరెడ్డి యనంతరము సర్వారెడ్డి పాలకుడు. సర్వారెడ్డి పౌత్త్రుడు ఇమ్మడి సర్వారెడ్డి ఆలంగీర్ ఔరంగజేబ్ సేనానికి తోడ్పడుటవలన సంస్థానము విస్తరించుటయు, దుప్పల్లి గ్రామము జాగీరుగా లభించుటయు, జెండా, నగారా, 500 సవారులు మున్నగు గౌరవరాజ చిహ్నములు సంక్రమించుటయు జరిగినవి.

ఇమ్మడి సర్వారెడ్డి కుమారుడగు మొదటి తిమ్మారెడ్డి కాలమునాటికి పీష్వాల ప్రాబల్యము హెచ్చు కాజొచ్చినది. పీష్వాల యాజ్ఞచే నీ సీమలకువచ్చిన రాజా చంద్రసేన జిల్లేదారు తిమ్మారెడ్డికి అమరచింత, వడ్డెమాను పరగణాలను 1702 లో నేబది వేలకు గుత్తకిచ్చి, తనపేర చంద్రగడము, తన భార్యపేర ధర్మపురము నను గ్రామములను నిర్మించి వాని దేశముఖి వగైరా రుసుములు వీరికే యొసగెను. తిమ్మారెడ్డి మనుమని మనుమడయిన రెండవ సాహెబు రెడ్డి కాలము (క్రీ. శ. 1748) న అసఫ్‌జాహి ప్రభుత్వము స్థాపింపబడినది. ఆసఫ్ జాహీకి కర్ణాటక దండయాత్రలలో సాయపడి యిమ్మడి సాహెబు రెడ్డి సవైరాజా బిరుదమును సంపాదించెను. పూర్వపు సనదులను ఖాయపఱుచుటగూడ జరిగినది. ఇమ్మడి సాహెబురెడ్డి కేడవు తరమువాడయిన పెద్ద వెంకటరెడ్డికి హిజరీ 1235 లో సికిందర్‌జా నిజాము (క్రీ. శ. 1803–1829) నుండి అమరచింత, వడ్డెమాను పరగణాల పట్టాను, సనదులను నిజాము దివానగు రాజా చందూలాల్ గారిప్పించిరి. ఇతని కాలమునందే రాజధాని తిప్పుడంపల్లెనుండి నేటి ఆత్మకూరునకు మాఱినది.

వెంకటరెడ్డిగారి పుత్త్రులు బాలకృష్ణారెడ్డి. వీరి పుత్త్రులు రాజా సోమభూపాలరావుగారు. వీరికి సురాజుద్దౌలా మంత్రిగా నున్నపుడు రు. 52,201 ల మాఫున అమరచింత, వడ్డెమాను పట్టీలను శాశ్వతముగ బిల్‌మక్తాగా సనదు లీబడినవి. సర్ సాలార్ జంగ్ హయాములో నీ మొత్తము 70 వేలకు పెరిగినవి. సోమభూపాలరావుగారి కుమారులు రాజా సీతారామ భూపాలరావుగారు. తమ జీవితకాలమునందే తమ కుమారులగు శ్రీమంత్ సవైరాజా శ్రీ రామ భూపాల బల్వంత్ బహద్దరుగారికి పట్టాభిషేక మొనర్చిన రాజర్షివర్యులు సీతారామ భూపాల బహద్దరుగారు. శ్రీ రామ భూపాలుగారు క్రీ. శ. 1888 సర్వధారి సంవత్సరములో జన్మించి, విశ్వావసు సంవత్సరమున పట్టాభిషిక్తులై, ప్రమోదూత సంవత్సరమున పరమపదించిరి. శ్రీ రామ భూపాలరావుగారి పట్టపురాణి శ్రీమంత్ సవైరాణి భాగ్యలక్ష్మమ్మగారు. ఈమె దోమకొండ సంస్థానాధీశుల యాడుబిడుచు. విద్యావివేకములు, రాజనీతి నైపుణ్యము గల శ్రీ రాణీ బహద్దరుగారు నిజాము ననుమతిని ఫసలీ 1343 భావ సంవత్సరమునందు

అమరచింత - ఆత్మకూరు సంస్థాన పట్టమునకు వచ్చిరి.

## సాహిత్యపోషణము

వితరణ గుణమునను, విద్వత్పోషణమునను, కావ్యకళా మర్మజ్ఞత్వమునను గద్వాల-అమరచింత పాలకు లుభయులును ప్రతిభటత్వమునెఱపి సాహితీ క్షేత్రమున బంగారు పంటలు పండించిన విద్వత్ప్రభువులు. ఒక్క తెలుఁగేకాక సంస్కృతమును, ఒక్క సాహిత్యమేగాక సర్వశాస్త్రములును, సంగీతాదీతర కళలును వీరి ప్రాపును ప్రోపును బడసి పెంపొందినవి. ఆత్మకూరు సంస్థానము నందు ఏఁటేఁట ఫాల్గున శుక్ల పక్షమున సాహిత్య సభలు, శాస్త్ర గోష్ఠులు, కవి గాయక సమ్మేళనములు, నృత్యనాటక ప్రదర్శనములు ప్రవర్తిల్లుచుండెడివి. కవి పండితాదులకు అర్హరీతిని సత్కారములు జరుగుచుండెడివి.

నిజామురాష్ట్ర నివాసియగు సురపురము కేశవయ్య ఆత్మకూరు సంస్థాన కవులలో ముఖ్యుఁడు. ఇతఁడు 1760 ప్రాంతము వాఁడు. ఈతని నిరోష్ఠ్య రామాయణమను ప్రౌఢకావ్యము ఆత్మకూరు సంస్థానాధీశ్వరులు శ్రీ రాజా సోమభూపాలున కంకితము. ఈ కృతి పూర్తిగా లభ్యము గాలేదు.

తిరుమల బుక్కపట్టణము రంగాచార్యులుగారు ఆత్మకూరాస్థానమునందలి విద్వత్కవులు. ఈయన బాలసరస్వతి బిరుదాంకితులగు తిరుమల బుక్కపట్టణము శ్రీనివాసాచార్యులుగారికి పితృవ్యులు. గుణరత్నాకర, పద్మినీ పరిణయ చంపువు లను గీర్వాణకృతు లీయన రచనలు.

తర్కతీర్థ, బాలసరస్వతీత్యాది బిరుద విరాజితులగు తిరుమల బుక్కపట్టణము శ్రీనివాసాచార్యులుగారు (1863—1919) ఆత్మకూరాస్థానకవులు, పండితులు. చిన్నారిపొన్నారి చిఱుతవయసునుండియే కవిత నల్లనేర్చిరి. శత ఘంటా కవనమున అద్వితీయ ప్రతిభా పాండిత్యములను బ్రదర్శించిన పండితుఁడు. ఎనిమిది తరములుగా నీతని వంశీయులు విద్వత్కవులుగా, శాస్త్ర పండితులుగా, విశిష్టాద్వైత ధర్మ ప్రతిష్ఠాతలుగా ప్రసిద్ధులయినవారు. శ్రీనివాసా చార్యులుగారు ఇందోరు, గ్వాలియర్, దర్భంగా, ధారానగరము మొదలగు సంస్థానములయందు తమ వైదుష్యమును బ్రదర్శించి మెప్పులందినవారు. అవధానములు, సంస్కృత ప్రాకృతాంధ్రములలో ఆశుకవితా ప్రదర్శనములు వీరి కభిమాన విద్యలు. శతావధానులు తిరుపతి వెంకట కవులతో శాస్త్రార్థముచేసి ఆఱు నెలలవరకు ప్రథమసత్కారము నొందనీని మహాపండితులు. వీరిని గుఱించి తిరుపతి వెంకట కవులలో నొకరయిన కళాప్రపూర్ణ శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారు ప్రకటించిన యభిప్రాయము నిచ్చట నుదాహరించుట సుసంగతము :

'ఆ (ఆత్మకూరు) సంస్థానంలో ఒక పండితుఁడున్నాఁడనిన్నీ ఆయన నాలుగు శాస్త్రాలు వచ్చినవారనిన్నీ, ఆశుకవిత్వము చెప్పేవారనిన్నీ,

చాలా సమర్థులనిన్నీ చెప్పడం మాత్రం వింటూ వున్నాము. ఆయన
కున్నంత పేరు ఆ ప్రాంతంలో యెవ్వరికిన్నీ లేదు... ....'

శ్రీనివాసాచార్యులుగారు జాంబవతీ పరిణయము, తత్త్వమార్తాండ ప్రభామండలము, దుర్మదనిర్మథనము, నంజరాజ చంపువు, రాజశేఖర చరిత్రము, సురపుర వేంకటగురు చరిత్రము మున్నగు కృతులను రచించినవారు.

ఆత్మకూరు సంస్థానమునందలి మఱియొక విద్వత్కవి దీక్షితుల నరసింహ శాస్త్రిగారు. సంస్థానమువారు వీరికి మహాకవి బిరుదమును ప్రసాదించిరి. లక్ష్మీ పరిణయము, విదురాశ్వత్థ మాహాత్మ్యము, శ్రీరంగ మహోత్సవ వర్ణమాలిక, సత్యనారాయణ వ్రతకల్పము మున్నగునవి వీరి కృతులు.

అలంకార మణిమాల, ఆచార్య వింశతి, మహాంతర్లాపమాల మున్నగు గ్రంథములను రచించిన హారతి దీక్షాచార్యులుగారును, లక్ష్మీసహస్ర వ్యాఖ్యా కర్తయగు అరిశాణపాలము వెంకటాధ్వరియును, ఆశుకవితా విశారద జాతకవి విద్వన్మణి తిరుమల వేంకటాచార్యులును, చెంచునాటక హనుమచ్ఛతకాది కావ్యకర్తయగు దీక్షితుల పాపాశాస్త్రియును, వ్యాకరణ వేదాంత శాస్త్ర విశారదుడగు తిరుమల బుక్కపట్టణము బుచ్చి వేంకటాచార్యులును, వ్యాకరణ మీమాంసా వేదాంతాదిశాస్త్ర పారీణుఁడగు ముదిగొండ నాగలింగ శాస్త్రియును, తిరుమల బుక్కపట్టణము కృష్ణ దేశికాచార్యులును ఆత్మకూరు సంస్థానాస్థాన విద్వత్ పండితులలో కొందఱు.

అటు గద్వాలిటు చెన్నపట్టణము దాఁకం గల్గు సమస్తాంధ్రోర్వర యందుఁ బ్రసిద్ధిఁ బొందిన తిరుపతి వెంకట కవులకు ఆత్మకూరు సంస్థాన పాలకులు సలిపిన సమ్మానములు జగత్ప్రసిద్ధములు. నాఁటి యాత్మకూరు ప్రభువు ముక్కర సీతారామ భూపాలుఁడు. ఆంధ్ర దేశమంతట ఆబాలగోపాలము రసనాగ్రము పై చిందులాడిన రసనిష్యందితుంచిలములగు పద్యములు,

'వేసవి దగ్గఱాయె మీసము పెంచుటకున్ మన సొగ్గదాయె........',
'ఏనుఁగు నెక్కినాము ధరణీంద్రులు మ్రొక్కఁగ నిక్కినాము........'.
'దోసమటం చెఱింగియును దుందుడు కొప్పఁగఁ బెంచినార మీ
మీసలు రెండు భాసలకు మేమె కవీంద్రుల మంచుఁ దెల్పఁగా........'*

మున్నగునవి ఆత్మకూరి సంస్థాన గోష్ఠులలో నవతరించి సంస్థానపాలకుల సాహిత్యమూర్తికి కీర్తి పతాకలయినవి. తిరుపతి వెంకటకవుల శ్రీనివాస విలాస కావ్యము సీతారామ భూపాలున కంకితము. ఈ కృతి సమర్పణ సందర్భమున తమకు జరిగిన సమ్మానాదికముల గుఱించి నానారాజ సందర్శన సందర్భమున తిరుపతి వెంకట కవులు ఆత్మకూరు పాలకులపై విహావారములు కైవారములుగా చెప్పిరి :

* కథలు—గాథలు, సంపుటము 1, పుట 496.

'సరసత నాత్మకూరు నృపసత్తముఁడొక్క ప్రబంధరాజమున్
విరచన చేయఁజేసి యది విద్వదుపాస్యమఁటంచు మెచ్చి యీ
దరముసఁ జంద్రహారములు ద్రవ్యము సేలుప లట్టులుండ వి
క్కరికెనయైన యేన్గుపయి గ్రంథముతో మము బాదుకొల్పి త
త్పురపరమేఁగఁజేసి యిడె భూమియు........'

—నానారాజ సందర్శనము, పు. 102—103.

'ఆత్మకూరు రాజు నడిగిన నిచ్చె మేల్ వసతి రెండు నూర్లు వచ్చునదియు'

—పైది, పు. 113.

'తగనాత్మకూరు సీతారామ భూపాలుఁ డేన్గు నెక్కించి యూరేఁగఁజేసె'

—పైది, పు. 115.

'ఆత్మకూర్సామ్రాజ్య మదేభముల నెక్కి వీథులలో విఱ్ఱవీఁగి చనుట'

—కథలు-గాథలు, సంపుటము 1, పు. 505.

శ్రీనివాస విలాసము మహాపరకాల నామక కవిసార్వభౌమ కృతమగు చంపువు. దీనిని ఆత్మకూరు నృపాలుని యాజ్ఞమీఁద తిరుపతి వెంకట కవు లాంధ్రీకరించి సీతారామ భూపాలునకంకితమిచ్చిరి. ఆత్మకూరు రామభూపాలుని మీఁద తిరుపతి వేంకట కవులు చెప్పిన పద్యము :

'ధరణీనాథులు రాజరాజనుచు, విద్వాంసుల్ బుధుండంచు, సుం
దరులెల్లన్ మదనుండఁటంచుఁ, గరుణాధారుండఁటంచున్ ప్రజల్
సరసుండంచుఁ గవీశ్వరుల్ పొగడ రాజ్యశ్రీలపర్థిల్లు ము
క్కరపంశాంబుధి చంద్ర! నిస్తుల యశస్కా! రామభూపాలకా!'

—నానారాజ సందర్శనము, పు. 71.

కార్యముపూఁడి రాజమన్నారు కవి (1846—1917) ఆత్మకూరు సంస్థానాధీశ్వరుల కోరికమేరకు శ్రీ సీతారామ భూపాల విలాసమను కావ్యమును గైసేసిరి. వీరు గుంటూరు మండలమువారు. అవధానతలో ససమాన ప్రజ్ఞ గలవారు; ఆత్మకూరు సంస్థాన సమ్మానితులు.

ఆత్మకూరు పాలకులు శ్రీమంత్ సపై రాజా సీతారామ భూపాలరావుగారు విద్వత్కవుల కుటుంబములకు పెక్కింటికి తమ సంస్థానమునం దాశ్రయము కల్పించిన విద్యాపోషకులు. రాజా శ్రీరామ భూపాలరావు బల్వంత్ బహద్దరుగారి పట్టపురాణి శ్రీ భాగ్యలక్ష్మమ్మగారు తమ మామగారును, భర్తగారును నడచిన త్రోవలో విద్యాపోషణమును గావించి, సాటివారిలో మేటియని పేరందిన సాధ్వీమణి.

నిజామురాష్ట్ర కవి జీవిత పరిచయ గుచ్ఛమగు గోలకొండ కవుల సంచిక శ్రీ భాగ్యలక్ష్మమ్మ బహద్దరువారి సమాదరణమునఁ బ్రకాశితమయిన బృహద్గ్రంథము. సంచికా సంకలన సదుద్యమమును విని యామె ప్రచురణ భారమును

వహించి ఆంధ్ర భాషాభిమానమును నిరూపించిరి. ఇది శ్రీ రాణీ బహద్దరుగారి నిర్మల యశస్సౌరభము నిఖిలాంధ్ర ప్రపంచమున చిరస్థాయిగా ప్రసరించునట్లు సమర్పితము. ఈః సందర్భమునందు కవి పండితు లొసఁగిన ఆశీః పూర్వక పద్యములలో కొన్ని :

'శ్రీమద్దివ్యరథాంగ శంఖ సుమహా పద్మాది సర్వాయుధైః
శ్రీమత్కౌస్తుభ దివ్య హారమణిభి శ్శ్రీవత్స చిహ్నాదిభిః
యుక్త శ్రీపతి రేష నిత్య మవతు శ్రీ భూమి నీళాదిభిః
శ్రీ రామావనిపాలమౌళి మహిషీమ్ శ్రీ భాగ్యలక్ష్మ్యంబికామ్'

—తిరుమల బుక్కపట్టణము వేంకటాచార్యులు.

'స్థిర సామ్రాజ్యమనామయంబు జయలక్ష్మీ వ్యాప్తి శశ్వద్యశ
స్స్ఫురణం బండిత పోషణాభిరతి సంపూర్ణానుకంపాప్తియున్
బరమౌదార్యము నైజపాదభజన వ్యాసంగమున్ గూర్చి శ్రీ
కర కుర్మార్తి గిరీశుఁడోము నిను దీక్షన్ భాగ్యలక్ష్మ్యంబికా !'

—దీక్షితుల నరసింహశాస్త్రి.

## ఉపజీవ్య గ్రంథసూచి


1. సురవరము ప్రతాపరెడ్డి, గోలకొండ కవుల సంచిక, ఆత్మకూరు సంస్థాన చరిత్ర.

2. సురవరము ప్రతాపరెడ్డి, నిజాము రాష్ట్రములోని ఆంధ్ర సంస్థానముల చరిత్ర, శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయ రజతోత్సవసంచిక, పు. 49.

3. తిరుపతి వేంకట కవులు, నానారాజ సందర్శనము, పుటలు 52—61, 71—78 102, 103, 113, 115, 120.

4. తెలుగు విజ్ఞాన సర్వస్వము, సంపుటము 3.

5. దేవులపల్లి రామానుజరావు, తెలుగు సీమలో సాంస్కృతిక పునరుజ్జీవనము పుటలు 94, 95.

# అమరావతి

## ప్రవేశిక

పదునేడవ శతాబ్దాంతమున మాగల్లు సీమలో రూపెత్తి ఆ పిమ్మట జ్ఞాతుల రాజ్యములగు రాఘవపురము, చింతలపాడు జమీలు కలిసి విస్తరించిన వాసిరెడ్డి వారి సంస్థానమిది. రమారమి వేయి గ్రామములు కలది. అనాఁటి పేష్కషు ఏడు లక్షల పైచిల్లర. వెంకటాద్రినాయని కాలమున దీని రాజధాని అమరావతి. 1802 లో వాసిరెడ్డివారి విస్తృత సంస్థానము రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయని వారిపేర నమోదయి యుండినది. పేష్కషు బకాయిక్రింద 1846–49 లో కుంఫిణీవారిచే ఐదువేలరూ. లకు సంస్థానము కొనుగోలు చేయఁబడి వారసులకు భరణము లేర్పడినవి.

## సంస్థాన చరిత్రము

వీరు కమ్మవారు; పల్లుట్ల గోత్రము వీరిది. వీరి మూలపురుషుఁడు సదాశివయ్య. ఈయన అనవేమారెడ్డి కొలువులోనుండి అనితరసాధ్యములగు సాహస కార్యములచే ఆయనను మెప్పించి వాసిగాంచి 'వాసిరెడ్డి'యను పౌరుష నామమును రెడ్డి రాజులనుండి పొందినవాఁడు—

'మఱి మున్నుర్వి ధరించినట్టి యనవేమస్వామి లోనైన లా
వరి రెడ్లందఱు గృష్ణరాయ నృప కర్ణాటక్షమానాథులం
దఱు పాద్షా మొదలైన ఖానులు దమున్ సన్మానమున్ జేయ శ్రీ
కరమై వాసికి నెక్కు రాద్యులగు వారి వ్వాసిరెడ్డ్యన్వయుల్'

—ద్రౌపదీ పరిణయము, 1–61.

'పెనఁకువ కోర్చి శాత్రవుల బిట్టరిగాఁపులఁ జేసి రాజ రా
జనియెడి వాసి రెడ్డికలరార్చుటఁ దానల వాసిరెడ్డి నాఁ
దనరె సదాశివప్రభుఁడు ధాత్రి; క్రమంబున వాసిరెడ్డి వా
రనఁగఁ దదీయ వంశభవులందఱు విశ్రుతికెక్కిరున్నతిన్'

—వాసిరెడ్డీయము.

సదాశివనాయని కుమారుఁడు గిరిమల్లికార్జున నాయఁడు. ఇతని కుదురు నందలివాఁడు చంద్రమౌళీశ్వరుఁడు; హైదరాబాదు నవాబుగారి సుబాదారుని మెప్పించి నూతక్కి, తాటికొండ మఱికొన్ని గ్రామములు గలిగిన ఒక జాగీరును సంపాదించెనఁట: చంద్రమౌళీశ్వరుని కుమారుఁడు దేశముఖు పిరప్పనాయఁడు.

ఇతఁడు గోల్కొండ నవాబులనుండి సన్నదును సంపాదించినవాఁడు. వీరపనీనికి రాఘవయ్య, రామన్న, చంద్రమౌళి యని ముగ్గురు కుమారులు. వీరు మొగలు చక్రవర్తి షాజహానును మెప్పించి నందిగామ పరగణాలను సంపాదించిన వారఁట। 1686 లో ఈ ముగ్గురును నందిగామ జమీందారీని పంచికొనిరఁట: రాఘవయ్య మాగల్లునందును, రామన్న రాఘవపురమునందును, చంద్రమౌళి చింతలపాడునందును స్థిరపడి రాజ్యముచేయుచు వచ్చిరి.

వీరపనేని ద్వితీయ కుమారుఁడును రాఘవ పురాధిపతియు నగు రామన్న సమర్థుఁడైన పరిపాలకుఁడని—

'భూమి పరిపాలనము పా
ద్షా మెచ్చఁగఁజేసి ముర్తుజానగరున తా
రామన పాదుషాహాచేఁ
బ్రేమనుపార్జించెఁ జౌదరి యనెడి బిరుదున్' —1–155

ద్రౌపదీపరిణయము పరికీర్తించుచున్నది. రామన్నకు భవానీదేవి యను భార్య వలన వీరపనీఁడు, రాఘపనీఁడు, చినపద్మనాభుఁడు, చంద్రమౌళి, రామ లింగన్న, నరసన్న యని ఆర్వురు పుత్రులు. జ్యేష్ఠుఁడగు వీరపనీనికి సూరిన్న కుమారుఁడు. ఈతనికి చిన నరసింహన్న, చిన రామలింగన్న యని ఇద్దఱు కుమారులు. పాతూరు పట్టణాధికారి మల్రాజు సూరభూపాలునితో 1748 లో తటస్థించిన సరిహద్దు తగాదాలలో చిన నరసన్న గొప్ప పరాక్రమమును ప్రదర్శించెనని తెలియుచున్నది.

'ధన మాద్యన్మతి నాత్మ రాజ్యపు ప్రాతిన్గావించు మల్రాజు సూ
రన శీర్షంబు వధించి ఘోర రణగోత్రన్ బ్రేలఁగట్టించెఁ బెం
పెనయన్ దద్గ్రిహికాత్మ సీమ దిరుగా నే మన్నెహంవీరుఁ డౌ
సన సాధించె నతండు చిన్న నరసక్ష్మాధీశ్వరుం డల్పుఁడే'
—ద్రౌపదీ, 1–166.

చిన రామలింగన్న దేవరకోట సంస్థానపాలకులగు కోదండరామన్న దేశాహిగారి అల్లుఁడని వినికిడి. ఈ చిన రామలింగన్న 'శృంగార ధామ' మను కావ్యమునకు కృతి ప్రేరకుఁడు. ఈయన 1760 లో నిస్సంతుగా మరణించెను. ఇట్లు రాఘవపురాధిపతియగు రామన్నగారి సంతతి 1760 లో అంతరించినది. రామన్న జమీ తక్కిన రెండు కోవల సంతతివారికి సంక్రమించినది.

ఇఁక పెద్ద కోవకు చెందిన మాగంటి పురాధిపతి రాఘవయ్యగారి వంశావతార వర్ణనము. రాఘవయ్యగారి కుమారుఁడు పెదపద్మనాభుఁడు ఢిల్లీ శ్వరుని మెప్పించినవాఁడు. పాదుషానుండి పెనుగంచిప్రోలు, బేతవోలు, మాగల్లు సీమలకు క్రొత్తగా పట్టాలు సంపాదించెనని మెకంజీ కథనము. అంతేకాక 1710లో కొండవీటి సర్కారులో 3వ వంతును ఆర్కాటు నవాబు

వాసిరెడ్డి పద్మనాభునకు పట్టా సన్నదిచ్చెనఁట! ఈయనకు పెదరాఘవయ్య, చంద్రమౌళి, రామన్న, లక్ష్మీపతి, నాగన్న, బుచ్చెన్న యని ఆఱుగురు కుమారులు. ఈ యార్వురిలో నాగన్న రాజ్యమునకు వచ్చెను. నాగన్నకు రామన్న, జగ్గయ్య, వెంకటాద్రి యని ముగ్గురు కుమారులు. మొదటి వాఁడగు రామన్న నందిగామ పరగణాకు పాలకుఁడు. రెండవ కుమారుఁడగు జగ్గయ్య చింతపల్లి పరగణా కేలిక. జగ్గయ్యకు అచ్చమాంబ వలన జన్మించిన కుమారుఁడే అతి ప్రసిద్ధుఁడైన రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయఁడుగారు (1761*—1816) ఈ వేంకటాద్రి నాయఁడు గారికి పెద్దెమాంబ, పార్వతి యని ఇర్వురు భార్యలు. సంతతి లేనందున తన పినతండ్రియగు వెంకటాద్రి కుమారులైన చంద్రమౌళి గారి ద్వితీయ పుత్రుఁడగు జగన్నాథ బాబును 1798లో దత్తు తీసికొని రెండవ భార్యయగు పార్వతి పెంపకము నందుంచిరి. తన పెత్తండ్రి కుమారుఁడగు పాపయ్యగారి ద్వితీయ పుత్రుఁడైన రామనాథ బాబును 1807లో దత్తు తీసికొనిరి. ఈ రామనాథ బాబును పెద్దభార్యయగు పెద్దెమాంబగారు పెంచిరి.

వెంకటాద్రి నాయఁడుగారు తలిదండ్రుల పేర అచ్చమ్మపేట, జగ్గయ్యపేటలను పట్టణములను గట్టించి 101 శివాలయములను నిర్మించి అనేక పర్యాయములు తులాభారము తూఁగి వేదవిదులకు, పేదసాదలకు రెండు చేతుల దానములిచ్చి హితులకు వశంకరుఁడయి, అహితులకు భయంకరుఁడయి రాజ్యమును (1778—1816) పాలించి 1816లో పరమపదించిరి. మరణమునకు పూర్వమే తన జమీని రెండు భాగములు చేసి 314 గ్రామములు కలిగిన చింతపల్లి ఎస్టేటును జగన్నాథ బాబునకు, 237 గ్రామములు కలిగిన చేబ్రోలు ఎస్టేటును రామనాథ బాబునకును చెందునట్లుగా ఏర్పాట్లు చేయించియుండిరి.

పాలక జనకుఁడు మరణించిన పిమ్మట ఆయన పంచి యిచ్చిన రాజ్యభాగములతో సంతృప్తి పడక దత్తపుత్రు లిర్వురును ఎవరికివారే సంస్థానమంతయును తమకే చెందవలెనని కోర్టులకెక్కి సంస్థానమును రిచ్చకీడ్చిరి. ఈ తెగని తగవులలో ఖర్చులు పెరిగి, జమీ అంతయును 1846లో కంపెనీ పాలనములోనికి వచ్చినది. ఈలోగా జగన్నాథబాబు 1825లో మరణించెను. వీరికి అచ్చమ్మ, రంగమ్మ అని ఇర్వురు భార్యలు. జగన్నాథబాబు మరణముతో 1831లో రామనాథబాబున కనుకూలముగా దావా పరిష్కారమయి రూ. 1200ల మాసభృతి యేర్పడినది.

అచ్చమ్మ మరణించిన పిమ్మట దావవారి అఁడుఁబడుచగు రంగమ్మ

*ఈయన పుట్టుక ఫసలీ 1174, క్రీ.శ. 1765 సర్వజిన్నామ వైశాఖ బహుళైకాదశీందు వాసరము అనూరాధా నక్షత్రమని వాసిరెడ్డి వంశచరిత్రము (చూ. 2—320); క్రీ. శ. 1761 ఏప్రిల్ 20, వృష చైత్రబహుళ అష్టమీ సోమవారమని రామేశంగారు, చూ. ఆంధ్రపత్రిక, 1967 ఆగష్టు 13, ఆదివారము, పు. 5.

తన పినతల్లి కుమారుఁడగు చావ లక్ష్మీపతిని దత్తత తీసికొనెను. లక్ష్మీపతి భార్య చిరుమామిళ్ళ సూరయపుత్రి వేంకట లక్ష్మమ్మాంబ. ఈ దత్తత 1841లో ప్రీవీకౌన్సిలు సమ్మతి నందుటవలన మాసభృతి లక్ష్మీపతికి ఇచ్చిరి. వీరికి సంతతి లేనందున తుమ్మపూఁడి వాసిరెడ్డి వెంకయ్య తృతీయ పుత్రుఁడగు వేంకట లక్ష్మీనరసింహనాయనిని దత్తుగా స్వీకరించిరి. చిరుమామిళ్ళ రాముడు తనయ లక్ష్మీనరసమాంబ ఈయన ధర్మపత్ని. వీరి దత్త కుమారులు వాసిరెడ్డి హరిహర ప్రసాద బహద్దరుగారు (1903—1957). వీరు శ్రీ రాజా వాసిరెడ్డి వెంకట లక్ష్మీనరసమాంబా బహద్దరు మన్నె సుల్తాను రాణీవారి దత్త పుత్రులు. ఉన్నత విద్యా పట్టభద్రులు. 1927లో చిరుమామిళ్ళ కోదండ రామయ్యగారి ప్రథమ పుత్రిక పార్వతీ దేవమ్మ గారిని పెండ్లియాడిరి. వీరికి శ్రీరామ భానుప్రసాదు, వెంకటనృసింహప్రసాదు, విజయప్రసాదు, బాలశంకరప్రసాదు అని నలుగురు కుమారులు. వీరు నలుగురును సజీవులు.

వెంకటాద్రినాయని ద్వితీయ దత్త పుత్రుఁడగు రామనాథబాబుగారు చేబ్రోలు సంస్థానాధిపతి. ఈయనకు దాశరథి ప్రసాద నాయఁడు, శివాజీప్రసాద నాయఁడు అని ఇద్దరు కుమారులు. సంస్థానము కుంఫిణీ స్వాధీనమైన తరువాత వీరిరువురకును చెరి రూ. 150 లు భరణము వచ్చుచుండినది. దాశరథిప్రసాద నాయనిగారి కుమారులు రామనాథబాబుగారు. యార్లగడ్డ మల్లికార్జున ప్రసాదుగారి పుత్రి రాజ్యలక్ష్మి యీయన భార్య. వీరి కుమారులు బాలచంద్రశేఖర ప్రసాదు గారు.

## సాహిత్యపోషణము

వాసిరెడ్డి వారిలో పెద్దకోవకు చెందిన మాగంటి పురాధిపతులు అనంత కాలమందు చింతపల్లి ప్రభువులనియు, రాజా వెంకటాద్రి నాయని కాలమునుండి అమరావతి ప్రభువులనియు పేరుపొందినవారు. సంస్థాన స్థాపకులగు రాఘవయ్య, వారి కుమారులగు పెద పద్మనాభుఁడు, పెద పద్మనాభుని ... కుమారులు వీరి కాలమునందు సాహిత్య వినోదములను సందులేక పోయెను. పెద పద్మనాభుని మనుమఁడగు జగ్గయ్య గొప్ప సాహసి. అమరావతి రాజు (1840—1918) పూర్వులకు జాలేమట్టు అను అగ్రహారమును ప్రసాదించి రి. ఇతఁడు అన్నదమ్ములతోడను, సమీప జ్ఞాతుల తోడను నిరంతరము యుద్ధములు చేయుచు యుద్ధముల యందే మరణించెను. జగ్గయ్య కుమారుఁడు రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయఁడుగారు వీరి కుదురునందతి ప్రసిద్ధుఁడు. ఈయన గొప్ప వ్యవహార దక్షుఁడు. సంస్కృతాంధ్ర తురుష్క భాషలందు మంచి పాండిత్యము కలవాఁడు. అశ్వారావు, ఇమ్మనేని, రలిదిండి, బూసి సూజివీడు, మలరాజు, మాణిక్యారావు, మానూరు, యార్లగడ్డ, పత్సవాయి

వెలుగోటిరావు మొదలయిన సంస్థానాధీశ్వరుల నాహ్వానించి, రాజ[illegible] సభల నేర్పఱిచి, యా రాజబృందము వలన సమస్త యశః ప్రాప్తిఁ జెందినవాఁడు* రెండవ కోవకుఁ జెందిన రాఘవపురాధిపతుల జమీందారీతోపాటు మూఁడవ కోవకుఁ జెందిన చింతలపాటి వంతు జమీందారీని కూడ ఆక్రమించి సంస్థానమును విస్తరింపఁజేసెను. పెద్దాపురము సంస్థానములోని [illegible] లను ఏలము వేసినపుడు వెంకటాద్రి నాయఁడుగారు వలివెల మొకాసు రూ. 78 వేలకును, నగరము ముతాను రూ. 73 వేలకును కొనిరి. కృష్ణానది యొడ్డున అమరావతి యను పట్టణమును గట్టించి, నందనవనమను ఉద్యాన వనమును వేయించి, భూలోక దేవేంద్రుఁడను బిరుదముతో సంస్థానమును బాలించినవాఁడు.

అమరావతీ పట్టణాధివాసంబును
  విబుధపాలనమున వేడ్కఁ గలిగి
సుమనో మనోజ్ఞ సుక్రమము సుధర్మాను
  వర్తనేష్టతయును వరుసఁగలిగి
నందనవన ఖేలనము దివ్య సంతాన
  సందర్శనేచ్ఛయుఁ జాల గలిగి
శతకోటి శక్తి సంతత వైభవంబును
  నాకరాజ్య ప్రాప్తి పేర్కఁ గలిగి
బ్రహ్మహత్యాఘమును, దుష్ట వర్తనంబు,
సత్ర భుక్త్వంబు, వేశ్యా ప్రసక్తి, గోత్ర
భిత్త్వమును లేక భూమిపై వెలసినట్టి
వేంకటాద్రీంద్రుఁ బొగడనౌ వేయినోళ్ళ.

—ఆంధ్ర[illegible]

'సకల కవీంద్ర సంచయ భాగ్యరాశి....వేంకటాద్రి [illegible]'

—ద్రౌపదీ పరిణయము, 1—123.

ద్రౌపదీ పరిణయమునందు వేంకటాద్రినాయని గుణగణములు విపులముగా వర్ణింపఁ బడినవి.

బలికోడి నాకంబు బాసిపోవుటఁ జేసి
  సకలాభియాతి రాజ్యంబు గొనఁగఁ
దపసి యిల్లాలిని దమి రమించుటఁ జేసి
  యన్యాంగనల మాతలట్లు సూడ
బ్రహ్మహత్యైక సంప్రాప్తి నొవ్వుటఁ జేసి
  సతత సుకృత సుఖోన్నతి వహింప

* ఆంధ్రపత్రిక, సంవత్సరాది సంచిక, 1911, పు. 238.

నవసంపుడజిఁ జేయిసాచి మనుటఁ జేసి
పలు జన్మముల బుధావళుల మనుపఁ
గోరి తొల్లింటఁ దనకైనకొాఱత ల్లెఁ
బాపుకొనఁబూని లోకసంభావ్య లీల
నవని నుదయించు నింద్రుఁడో యనఁగ వేంక
టాద్రి నాయఁడు భూపాలుఁ డతిశయిల్లె' —పైది. 1–131.
'శతకోటి సాధన శక్తి నాఁడును నేఁడు
వృత్రభూభృద్బల విహృతి నడఁచె
భవ్య సుధర్మానువర్తియై నాఁడు నేఁ
డమర మహారాజ్య మనుభవించె
ధృత సుమనోవల్లభత నాఁడు నేఁడును
నందనవన ఖేలనంబు సలిపె
నమరావతీ నాథుఁడై నాఁడు నేఁడును
నానావిబుధపాలనం బొనర్చె
నాఁడు నేఁడును దివ్య సంతానమందుఁ
గళ్యపునకింద్ర సంజ్ఞ జగ్గనరపతికి
వేంకటాద్రీంద్ర సంజ్ఞచే విశ్రుతముగ,
సంభవించె నయారె నిర్జర విభుండు' —పైది, 1–132.
'సుమనస్తతి సుమనోబృం
దము ; జాహ్నవి కృష్ణ ; నందనము నందన ; మ
య్యమరావతి అమరావతి ;
అమరేంద్రుఁడు వేంకటాద్రియై యతఁడలరెన్' —వాసిరెడ్డీయము.
వాసిరెడ్డి వెంకటాద్రి నాయఁడు భూలోక దేవేంద్రుఁడని చెప్పుటయే యిందలి పరమార్థము. వెంకటాద్రి నాయఁడుగారు దేవ బ్రాహ్మణ భక్తి తత్పరులు. సప్తసంతాన నిర్మాణ ప్రశస్తిని గాంచినవారు. ఆయన పాలనమునందు బ్రాహ్మణ జీవన మెట్లుండెనో తెలుపు పద్యము :
'అరగింపఁగ నేర్చి రశనంబు కిటకిట
యను నోళ్ళ నిష్టమృష్టాన్న సమితిఁ
గట్ట నేర్చిరి నక్తకములు గట్టు కటీత
టంబులఁ జీని చీనాంబరములు
హాయి నేర్చిరి బూది పూసెడు మేనులఁ
జందన మృగమద సాంకవములుఁ
దాల్పనేర్చిరి రుద్రాక్షమాలల దాల్చు
మెడమునఁ దారహారోత్కరములు

పండ నేర్చిరి కఠినోర్విపైఁ బరుండ
తా రమల హంసతూలికా తల్పములను
వివిధ కృష్ణానదీతీర విప్రవరులు
వేంకటాద్రీంద్రుఁ డతిదయావృష్టి ముంప'  —ద్రౌపదీ, 1–134.

పై పద్యము శ్రీనాథుని 'ధరియింప నేర్చిరి దర్భ వెట్టెడు వ్రేళ్ళ' యను కాశీఖండ పద్యమున కనుకరణము. వేంకటాద్రి నాయఁడు బహుభాషా కోవిదుఁడు. అద్యతన భోజరాజ బిరుదాంకితుఁడు. కవి పండిత పోషకుఁడు. 'సరసులపాలి జీవనము........'గా సుధీజన నీరాజనము లందినవాఁడు. వేంకటాద్రి నాయని కించుమించుగా సమకాలికుఁడయిన ఏనుగుల వీరస్వామయ్య తన కాశీయాత్ర చరిత్ర 1830–1831 నాఁటి దినచర్యలో వాసిరెడ్డి వేంకటాద్రి నాయని ధర్మకార్యములనుగూర్చి ప్రశంసించి యున్నాఁడు.[1]

వెంకటాద్రి నాయఁడుగారు—
'సంపువులు విద్వజ్జనములు
పరివేష్టింపఁ జదివింప భగవద్గీతల్
నిరతము శంకర పూజా
పరతంత్రుండగు నతండు పండితుఁడగుటన్'
—ఆంధ్రాభ్యుదయము, 5–35.

వీరి యాస్థాన పండితుఁడు ములుగు పాపయారాధ్యులు. అక్కమాంబా సంగమేశ్వరారాధ్యుల పౌత్రులు; భ్రమరాంబా వీరనారాధ్యుల పుత్రులు. పరదేవతోపాసనాదక్షులు. బ్రహ్మవిద్యాపారంగతులు. వేంకటాద్రి నాయనివారి యాస్థాన పండితులగుటయేగాక విద్యాగురువులు, ఆప్తులును. ఒకసారి పాపయారాధ్యులు గారు కృష్ణానదీ తీరమున సాంధ్యోపాసనాకృత్యములఁ దీర్చి అమరావతిలోని అమరేశ్వరాలయమునకు దర్శనార్థము విచ్చేయునంతలో అర్చకులు తలుపులు మూసి చనఁగా 'ముక్తి ద్వారము తల్పుదీయఁగదె చాముండా! జగజ్జీవనీ' యని చాముండికాదేవిని పిలువఁగా ఆమె వచ్చి తలుపు దీసెననియు, మఱునాఁటి యుదయముదాఁక తలుపులు తెఱచియే యుండఁగా ప్రభువీ యుదంతము సాంతము నెఱిఁగి పాపయగారిని రావించి ఇనుమిక్కిలిగా సత్కరించిరని యైతిహ్యము కలదు.[2] కుమార ప్రభులైన జగన్నాథ నాయనివారి ప్రేరణముచే పాపయారాధ్యులు కాశీవిశ్వనాథస్వామివారి కంకితముగా దేవీభాగవతము నాంధ్రీకరించిరి. పాపయారాధ్యులు సంస్కృతాంధ్రములయందు శతాధిక గ్రంథకర్తలు. సంస్కృతమునందు ఆర్యాశతి శివస్తోత్రము, ఏకాదశి చంపువు, శ్రీకళ్యాణ చంపువు అను కృతులను రచించిరి. ఆంధ్రమునందు అహల్యా సంక్రందనీయము, ఇంద్రాత్మజా పరిణయము, ఘూర్జర చరిత్రము, శంతను చరిత్రము, శ్రీ దేవీ భాగవతము.

[1] కాశీయాత్ర చరిత్ర, 1941, పు. 350. [2] ఆంధ్రపత్రిక, సంవత్సరాది సంచిక, 1921.

దత్తజననీజనకులు చిరకాలము కాంచీపురిమునందలి వరదరాజస్వామి సన్ని-
ధానమునఁ గడపుటచే వీరిలో ఆస్తికబుద్ధి పెంపొందినది; కాంచీపురము-
నందలి విద్వజ్జనులతోడి సమాగమమువలన బహుభాషా పరిచయము, కావ్య-
కళామర్మజ్ఞతయు సిద్ధించినవి. ద్రౌపదీపరిణయాది బహుప్రబంధ నిర్మాతయగు
అమరవాది రామకవి (1840–1918) వీరి యాశ్రయము నందుండినవాఁడు.
రామకవి రచనయగు వాసిరెడ్డీయము అను చారిత్రక కావ్యము వీరి ప్రోత్సాహ-
మువలన రూపొందినది. ద్రౌపదీపరిణయ కృత్యవతారికలో వాసిరెడ్డివారి వంశ-
చరితము విపులముగా వర్ణితము. ఈ వర్ణనముతో తనివితీరని వెంకటాద్రి
నరసింహనాయఁడు రామకవిని రావించి—

'ఘన వాక్ప్రౌఢిమ ద్రౌపదీ పరిణయగ్రంథాది మా వంశవ-
ర్ణనముం జేసితివంచు వింటి; మఱియున్ మా [illegible]
ణ నరేంద్రుల్ గయికొంట. దానికగు నానాకారణంబుల్ [illegible]
బున నీ వాక్ప్రబంధమార్యపరు లామోదింపఁ గావింపుమా'

అని కోరుటచే, కవి వాసిరెడ్డీయమను రెండాశ్వాసముల కృతిని నిర్మించినాఁడు.
వెంకటాద్రినాయని పాలనము దాఁకఁగల చరితము ప్రథమాశ్వాసమున ప్రౌఢ-
ప్రబంధపక్కిని సంధానితము. వెంకటాద్రినాయని దత్తపుత్రుని పాలనము,
కుంఫిణీ గొడవలు మున్నగునవి అన్యదేశ్యపద భూయిష్ఠముగా ద్వితీయాశ్వా-
సమున సంగ్రథితము. కృతి రచనా కాలము 18[illegible]1. ఈ కావ్యము ముద్రితము.
గుంటూరు మండలమునందలి సత్తెనపల్లి తాలూకాలోని [illegible]
రివి యభిజనము.*

వాసిరెడ్డి వారి కోవకుఁ జెందిన శ్రీ రాజా [illegible] ప్రసాద
బహద్దరుగారు ఉన్నత విద్యాపట్టభద్రులు. సంస్కృతాంధ్ర భాషా పండితులు.
1925లో పొన్నూరు భావనారాయణస్వామివారి సన్నిధిని [illegible] పాఠశాలను
స్థాపించిరి. అదే క్రమముగా వృద్ధిచెంది ప్రాచ్యకళాశాలగా మారినది. ఆంధ్ర
విశ్వకళా పరిషత్తువారిచే గుర్తింపఁబడినది. వీరికి [illegible] మక్కువ.
ఆశుకవితారీతి యన్నను అభిమాన మధికము. అష్టావధాన, శతావధాన ప్రదర్శ-
నములలో పృచ్ఛకులుగా పాల్గొని తమ పాండిత్యమును, సాహిత్య ప్రియత్వ-
మును ప్రకటించెడివారు. 1956 లో విశాలాంధ్ర కవిపండిత సమ్మేళనము-
జరిపి సంస్కృతాంధ్ర భాషాభివృద్ధిని గుఱించిన చర్చలను నిర్వహించిరి.
సమావేశమునందుఁ బాల్గొనిన కవిపండితులను భూరి దానములచే సత్కరించిరి.
వీరి కుమారులు శ్రీ రామభాను ప్రసాదుగారు తండ్రి తరువాత భావనారాయణ-
స్వామి వారి దేవాలయమునకు ధర్మకర్తలుగా నున్నారు. వీరును

* అమరవాది హనుమచ్ఛాస్త్రి, వాసిరెడ్డీయము, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక,
అంగీరస, 1932, పుటలు 78–87.

సంస్కృతాంధ్ర సారస్వత పరులు.

వాసిరెడ్డివారి రెండవ కోవకుఁజెందిన రాజన్య ప్రాధిపతులలో రామన్న మొదటివాఁడు. ఈయన ప్రపౌత్రుఁడు చిన రామలింగన్న (1725 1760). ఈయన నిరంతర యుద్ధములలో మునిఁగియుండినప్పటికిని సాహిత్యాభిరుచి అలవాటగుటచే దివి రమణకవి యను కవిని పోషించి అతనిచే శృంగారధామము అను రెండాశ్వాసముల ప్రబంధమును రచియింపించినవాఁడు. ఇది మంగళగిరి నృసింహస్వామి కంకితము. కవి, కృతి ప్రేరకుఁడగు చినరామలింగ ప్రభుని కావ్యావతారికయం దిట్లు వర్ణించి యున్నాఁడు :

'ఏధన్యు వంశేశుఁ డెఱిఁగి సుమనాథు
  పావన సఖిస్ఫూర్తి పంపఁ దయ్యె
నేమేటి కూటస్థుఁ డెసఁగ నేమున్నృపాలు
  ప్రీతిచే ధరి వాసిరెడ్డియయ్యె
నేమహాత్ముని తండ్రి యందెఁ గుతుబుషా నృ
  పాలుచేతను గజాందోళికంబు
లేయయ్య యగ్రజుఁ డెలమి క్షాత్రపవీర
  గజరాజసింహతఁ గలన నమరె
నతని వంశజుఁ డతని కూటస్థజాతుఁ
డతని సత్పుత్రుఁ డాతని తమ్ముఁడగుచు
నమరె చిహ్నాగుణరత్న రత్నాకరుండు
కదనవిజయుండు రామలింగ ప్రభుండు.'

ఈతని కవిత్వము మొత్తముమీఁద రసహీనమైనది గావని కవి చరిత్రకారులు వ్రాసిరి. ఇందలియొక పద్యము మాదిరికి :

'అలరుల పేటికిం బ్రియుఁ డనంగనృపాలుఁడు దాఁచిపేసి యీ
యలతికి నేఁడు వేయదని వాసిగ రాఁగలఁడంచు బాల్యమున్
గళవళమంది చింతిలఁగఁ గన్పడెఁ బద్మకరాజ చిహ్నముల్
కలికి పయఃప్రకాశితపటాంతమయు బాల్యవయస్సు సంధిగన్'

— ప్రబంధము

వాసిరెడ్డివారి పదుమునకు చెందిన వెంకటసుబ్బదాసు — తుమ్మలపల్లె వాస్తవ్యుఁడు — 'వాసిరెడ్డి వంశ చరిత్రము' అను నయిదాశ్వాసముల చారిత్రక పద్యకావ్యమునకు కర్త. ఈతఁడు దేఁబదియేండ్ల క్రిందటివాఁడు. వాసిరె వేంకటాంబా గారియుల పుత్రులు మువ్వురలో రదగొట్టువాఁడు. తెనా వాస్తవ్యులగు భాగవతుల అప్పయశాస్త్రి శిష్యుఁడు. ఆంజనేయోపాసకుఁడు ఈఁస్కృతి తుమ్మలపల్లెలో వెలసిన శ్రీరామచంద్రమూర్తి కర్పితము. వాసి ప్రాపకుఁడగు మల్లికార్జుననాయఁడు వంశకర్తగా వర్ధిల్లిన వాసిరెడ్డివారి వం

చరితమందు విపులముగా వివృతము. శాసనములనుండి చారిత్రకాధారములను స్వీకరించి, తనకాలమునాఁటికి తామరతంపరగా విస్తరించిన వాసిరెడ్డివారి కోవల అట్టుపుట్టానవాళ్ళను క్రోడీకరించి, పరంపరాయాత ప్రతీతిలోనున్న కట్టుకథలను, పుక్కిటి పురాణములను జోడించి కవి ఈకృతిని నిర్మించినాఁడు. ఆకాశవాణీ భాషితము, ఉమామహేశ్వరులు వెంకటాద్రినాయని కొసఁగిన తత్త్వోపదేశము మున్నగునవి యీకావ్యమునందలి అతిలోక విషయములు. చక్కని ధారాశుద్ధి కలిగిన చారిత్రిక కావ్యమిది. మాదిరికొక పద్యము :

'సంపత్తి ప్రోలికేఁగుతఱి నచ్చిన పేరిమి వారకామినుల్
సరసతరంపునాట్యములఁ జక్కనిగీతుల సప్రమోదలై
పరఁగిరి; భూసురాంగనలు భవ్యతరంబయియొప్పు దీవనల్
గరిమనొసంగి; రెల్లరు సఖండశుభోక్తులఁ బల్కిరంతటన్'

—3-55.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. శ్రీరాం వీరబ్రహ్మకవి, నానారాజన్య చరిత్రము, పుటలు 46—82.

2. బరువూరి వీరయ్య, గుంటూరుమండలసర్వస్వం, వాసిరెడ్డివారి వంశచరిత్ర, పుటలు 121—130.

3. కొత్త భావయ్యచౌదరి, కమ్మవారి చరిత్రము, పుటలు 262—268.

4. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, ఆంధ్రాభ్యుదయము, పుటలు 294—298.

5. వాసిరెడ్డి వెంకటసుబ్బదాసు, వాసిరెడ్డివంశచరిత్రము, 1914.

6. ముదిగొండ బసవయ్యశాస్త్రి, ముఱుగు పాపయారాధ్యులు, ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక, దుర్మతి, 1921.

# ఆంధ్ర

## ప్రవేశిక

ఇది శ్రీకాకుళమండలము గజపతినగరము [illegible]. విశాఖ పట్టణమున కుత్తరమున 18 కోసుల దూరమునను, గజపతినగరమునకు [illegible] దిశలో 4 కోసుల దూరమునను ఆంధ్ర యున్నది. జమీందారీలో [illegible] ముప్పదిమూఁడు గ్రామము లుండెడివి. ఇందులో రెండు అగ్రహారములు, [illegible] జిరాయితీ గ్రామములు, ఇరువదిరెండు మొఖాసా గ్రామములు. ఆంధ్ర జమీందారు[illegible] నివాసస్థానము. ఇది చిన్న పల్లెటూరు. కొండ జమీందారీలలో [illegible] ప్రాచీనమైనది. పేష్కషు రూ. 1,386 లు.

## సంస్థాన చరిత్రము

వీరు తాము చంద్రవంశము వారమనియు, భారద్వాజస [illegible] మనియు చెప్పుదురు. ఈ జమీందారుల మూలపురుషుఁడు గారయదొర. [illegible] కొండదొర జాతమువాఁడు.

'ఆంధ్ర ప్రతాపరాయఁడఁటన్న బిరుదంబు
తోడను గారయదొర కొసంగె'

ప్రతాపసింహ [illegible]

జయపురము మహారాజు విశ్వంభరదేవుగారిపాలన [illegible] చెందిన కిమ్మూరివారి జ్యేష్ఠుఁడగు గారయదొరగారు 'ప్రతాపరాయ' [illegible] ఆంధ్రకు అధిపతులుగా నియమితులయి యుండిరి. వీరి [illegible] ఆంధ్ర [illegible] (క్రీ.1798) దొర చాల ముఖ్యుఁడు. ఇతఁడు జయపురమువారిని [illegible] నగరమువారి పరివారములో చేరెను. రామన్నదొర తమకు పరమాప్తుఁడై [illegible] విజయనగరము జమీందారుల లోతుగడ్డ ముఠాయును, సరవపల్లి [illegible] సాలీనా రూ. 600 లు కప్పము చెల్లించురీతిలో ప్రసాదించియుండిరి. [illegible] [illegible] ఆంధ్ర జమీందారు విజయనగరమువారిపై [illegible] జమీందారుల పితూరీలో చేరలేదు. మంత్ర తంత్రాంగములలో [illegible] విజయనగరము కోటనుండి పిలుపు వచ్చినప్పుడు ఆంధ్ర జమీందారులు [illegible] పల్లకీలో విజయనగరము పోయి వచ్చెడివారు. రామన్నదొరగారి కొడుకు [illegible] [illegible] గారయదొరకు అయిదుగురు కుమారులు. జ్యేష్ఠుఁడు [illegible] [illegible] 'పండువాబు' అను నామాంతరము గల రామమూర్తి [illegible] తండ్రి తరువాత జ్యేష్ఠుఁడగు రామన్నదొర జమికి వచ్చినను సంతతి [illegible]

రామమూర్తిదొరగారి కుమారుఁడగు గారయదొరను దత్తు స్వీకరించిరి. ఈ గారయదొరగారి కాలమున ఆంధ్ర సంస్థానము సమస్తము సాలీనా ఇరువది వేల రూపాయలు జమీందారునకు చెల్లించు రీతిలో సంస్థానము దివానగు వెంకటర ముప్పిడి కామయ్యగారికి సర్వస్వామ్యములను దఖలుపఱచఁబడినవి. కామయ్య గతించువరకు ఇట్లు జరిగినది. కామయ్య కుమారుఁడు బంగారయ్య కాలమున సంస్థాన పాలనమును గారయదొరగారి కుమారుఁడగు రామ ప్రతాపరావు బహద్దరుగారు (క్రీ. శ. 1910–1955) స్వీకరించి సర్వాధికారములను తామే స్వయముగా పరిశీలింప నారంభించిరి. ఓరుగంటి సుబ్బారావు పంతులుగారు క్రొత్త దివానుగా నియమితులైరి. ఆపిమ్మట చామర్తి ప్రసాదరావుగారు కొంత కాలము దివానుగా పనిచేసిరి. వీరి కాలమున ఆంధ్ర సంస్థానము బాగుపడినది. పేర్లవారి సంస్థానము నుండియు, ఉర్లాం సంస్థానము నుండియు అనేక గ్రామములను కొని సంస్థానమును విస్తరింపఁజేసిరి. సాలుసరి ఆదాయము రెండు లక్షలకు పైగా పెరిగినది. రామప్రతాపరావు బహద్దరుగారి భార్య చంద్రావతీదేవి. ఈమె ధారాకోట సంస్థానాధిపతులగు మదనమోహనసింహదేవుగారి తనయ. రామప్రతాపరావు బహద్దరుగారు తమ నలుబదియైదవ యేట 1955 లో మరణించిరి. వీరి కుమారులు గారయ ప్రతాపరావు బహద్దరు దొరగారు. వీరు ఆంగ్ల విద్యా పట్టభద్రులు. ఆంధ్ర సంస్థానమునందు గనుల త్రవ్వకము, ఖనిజముల యెగుమతి మొదలగు విషయములలో మంచి అభిరుచిగలవారు గారయదొరగారు. వీరి తండ్రిగారి కాలముననే సంస్థానము ప్రభుత్వపరమైనది. ఆంధ్ర జమీందారులకును, మేరంగి జమీందారులకును సంబంధబాంధవ్యములు గలవు.

## సాహిత్యపోషణము

ఆంధ్ర రామస్వామిదొరగారి కుమారులైన గారయదొరగారు పండిత పోషకులు. ఓలేటివారికి లక్ష్మీపురాగ్రహారమును, పోలుపెద్దివారికి గరివిడిలను అగ్రహారమును ఇచ్చి సమ్మానించినవారు. శిష్ట్ల రామయ్యశాస్త్రిగారు, పంతుల బ్రహ్మయ్యశాస్త్రిగారు, తాతా రామావధానులు, తాతా వైద్యనాథస్వామిగారు వీరి యాస్థాన పండితులలో ముఖ్యులు. ఈ తాతా సోదరుల ప్రపితామహుఁడును, సుప్రసిద్ధులగు తాతా సుబ్బరాయఁడుశాస్త్రిగారి ముత్తాతయును ఏకోదరులు. కృష్ణారామ పురాగ్రహారికులుకూడ వీరి జ్ఞాతులు.

గారయదొర తరువాత జమీకివచ్చిన ఆయన జ్యేష్ఠపుత్రుఁడు రామందొర తటాకారామాదిక ప్రతిష్ఠలను సల్పినవాఁడు. ఇంగిలాపల్లి వాస్తవ్యులగు శిష్ట్ల కామయశాస్త్రి, చిట్టివలస వాస్తవ్యులగు పంతుల బ్రహ్మయ్యశాస్త్రి, చల్లపేట వాస్తవ్యులగు తాతా పెదకామయ్య, తాతా విశ్వనాథశాస్త్రి, తాతా

దాసులు, తాతా జానకిరామయ్య, తాతా జగన్నాథస్వామి, తాతా వరహాలు మొదలగువారు వీరి యాస్థానపండితులు. 'శ్రావణి' ఉత్సవములలో ఆస్థాన పండితులతోపాటు ఇతరపండితులకుఁగూడ సమ్మానములు జరుగుచుండెడివి.

ఆంధ్ర సంస్థానాధిపతులు శాస్త్రవిద్యలను ఎక్కువగా పోషించిరి. తృణ కాష్ఠ జల సమృద్ధి కలిగినప్పటికిని ఆంధ్ర నివాసయోగ్యము కానందున ఆస్థాన పండితులెవ్వరును హమేషా అచ్చటనుండెడివారు కారుట! ఆంధ్ర యంతయును మన్నెపు సీమ. ఎక్కడ చూచినను ఎత్తైన కొండలు; దాటిపోదుగునను దట్టమైన అడవులు, అడుగడుగున అడవి జంతువుల బెడద. ఈ యిబ్బందులవలన ప్రత్యే కోత్సవ సందర్భములఁ దప్ప పండితు లెవ్వరును ఆంధ్రలో నుండెడివారుకారు.

ఆంధ్రవారి ఆశ్రయమును బడసిన నిష్ఠల సింహాచల సిద్ధాంతిగారు భద్రాచల మాహాత్మ్యము, లక్షణాపరిణయము, త్రిపురవిజయము నను గ్రంథము లను రచించిరి. లక్షణాపరిణయము మూఁడాశ్వాసముల శృంగార ప్రబంధము. ఇది శివాంకితము. కవి గొట్యంబా సీతారామస్వామి పుణ్యదంపతుల పుత్త్రుఁడు. హారితముని గోత్రజుఁడు, ఆపస్తంబసూత్ర పవిత్రుఁడు, జ్యోతిషాయుర్వేద విద్యలలో అందెవేసిన చేయి. సింహాచల సిద్ధాంతిగారి పితామహులును, తర్క శాస్త్ర ప్రవీణులును, ఆశుకవితాధురీణులును నగు నిష్ఠల సుబ్రహ్మణ్యశాస్త్రి గారును ఆంధ్రవారి యాదరమును బడసిన విద్వాంసులు. లక్షణాపరిణయము నుండి మచ్చున కొక పద్యము :

'గాడుపు పట్టివాఁడు గమికాఁడయి ముంగల రాఁ దిరప్రజం
బోడక చుట్టునుం డిటుగఁ బూవిలు హస్తమునందు వ్రాల నీ
వాడెదు జిల్క నెక్కి వనజారి వసంతుల నెయ్యమొప్ప నీ
రేడు జగాల గెల్తు భళిరే యశరీరుఁడవయ్యు దర్పకా!'

—లక్షణా. 2–112.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. విశాఖపట్టణముజిల్లా వృత్తాంతసంగ్రహము, పుటలు 533–535.

2. మా విద్యార్థియును, ఆంధ్ర సంస్థానాస్థానపండితుల వంశమువాఁడును నగు చిరంజీవి తాతా రాంబాబు, ఎం.ఎ., సమకూర్చి యిచ్చిన యంశము లీ సంస్థానచరిత్ర రచనకు ముఖ్యములగు నాధారములు.

3. M. A. M. P., III, p. 31.

4. A. Vadivelu, The Aristocracy of Southern India, Vol. II.

# ఆనెగొంది

## ప్రవేశిక

దీనికి నరపతి సంస్థానమనియు నామాంతరము గలదు. రామాయణ [illegible]
కాలమునాఁటి 'కిష్కింధ' యిదియే యని కొందఱందురు. ఇది నిజాము [illegible]
లోఁబడిన సంస్థానము. నిజాము రాష్ట్రము నైఋతి దిశలో తుంగభద్రానది [illegible]
ఉత్తరతీరమున, హొసపేట తాలూకాలోని కమలాపురమునకు [illegible]
ఆనెగొంది గ్రామమున్నది. ఇది నేఁటి మైసూరు రాష్ట్రమునందలి [illegible]
మండలమునకుఁ జెందినది. ఆనెగొంది యనఁగా ఏనుఁగు గొంది [illegible]
యర్థము. ఏనుఁగులవలెఁ గానవచ్చు మూఁడు కొండల నడుమ [illegible]
దీనికీపేరు వచ్చెనఁట. క్రీ. శ. 14 వ శతాబ్ది ప్రథమ భాగమున [illegible]
మండలములోని కుమ్మటము రాజధానిగా ఈ ప్రాంతము నేలుచుండిన [illegible]
రాయలను రాజు మూఁడేనుఁగుల సంధి యను పేరుగల యీ కొండల [illegible]
యందు శత్రుజనదుర్గమమైన 'హొసమలె' యను దుర్గమును నిర్మించెనఁట. [illegible]
యీ పేరు మాటునపడి యానెగొంది యను పేరే దీనికి రూఢముగా [illegible]
పోయినది.*

విజయనగర సామ్రాజ్యమునకు మూలకందమని భావింపఁబడు [illegible]
ఆనెగొంది యనేక శతాబ్దములనుండి రాజాశ్రయ కేంద్రమై విలసిల్లుచు [illegible]
పారసీక దేశీయుఁడగు ఫెరిస్తా వ్రాఁతలవలనఁ దెలియుచున్నది. పూర్వ [illegible]
నించుమించుగా ఏడువందల యేండ్లు రాజ్యము చేసినట్లు నిర్ధారిత [illegible]
'రాయ వంశావళి' యను గ్రంథమునందు క్రీ. శ. 1014–1076 నాఁటి [illegible]
మొదలుగా చాళుక్యరాజు, విజయధ్వజుఁడు, అనయరాజు, నరసింహ [illegible]
రాయలు, రామదేవరాయలు, ప్రతాపరాయలు, జంబుకేశ్వరుఁడు (1297–13[illegible]
ఆనెగొందిని పాలించినట్లు నిరూపింపఁబడినది. కాకతీయులకు కోశాధ్యక్ష [illegible]
యుండిన హరియప్ప, బుక్కప్పయను సోదరులు ఓరుగల్లు పతనముతో [illegible]
గొందికి వచ్చి జంబుకేశ్వర రాయల నాశ్రయించి మంత్రులుగా కుదురుకొని [illegible]
తుఘ్లకు చక్రవర్తుల దాడిలో జంబుకేశ్వరరాయలు మరణింపఁగా హరి [illegible]
బుక్కప్పలు ఖైదీలుగా పట్టువడిరి. ఆనెగొంది ఢిల్లీచక్రవర్తుల వశ [illegible]
పిమ్మట హరియప్ప యానెగొంది పాలకుఁడుగా బుక్కప్ప యతని మంత్రి [illegible]

* నేలటూరి వేంకటరమణయ్య, తెలుగువిజ్ఞానసర్వస్వము, సంపుటము [illegible]
పు. 725.

స్థిరపడిరఁట. అటుతరువాత విజయనగర నిర్మాణము జరిగి యానెగొందికి గల ప్రాముఖ్యము క్రమక్రమముగా క్షీణించుచు వచ్చినది.

ఆ నాఁడు ఆనెగొంది సంస్థానము తుంగభద్ర కటునిటు దక్షిణోత్తర పార్శ్వములయందు విస్తరించియుండినది. అళియరామరాయల సంతతికిఁజెందిన పంద్రెండు తరములవారు నరపతి సంస్థానమును పాలించిరి. క్రీ.శ. 1786 దాఁక ఆర్వీటి వంశమువారు దీనిని పాలించిన పిమ్మట, చిక్కదేవరాయని తిరుమలదేవరాజు (1756 – 1786) సోదరియగు చెల్లమ్మ సంతతి వారును, ఆ పిమ్మట పై తిరుమలదేవరాజు దౌహిత్రియగు దేవమ్మ సంతతి వారును ఈ సంస్థానమును పాలించిరి.

సాలుసరి రాఁబడి రెండు లక్షలు. కప్పము 5 నుండి 10 వేలు.

## సంస్థాన చరిత్రము

17వ శతాబ్ది మధ్య భాగమున మహారాష్ట్రులు ప్రబలులై ఆనెగొంది సంస్థానము నుండి కప్పమును వసూలు చేసెడివారు. అళియరామరాయల కయిదవతరమువాఁడగు పెద్దవేంకటరాజు కాలమున ఆనెగొంది సంస్థానము నందలి యనేకసీమలు మరాఠీల వశమైనవి. 1657లో పెదవేంకటరాజు కుమారుఁడగు రామరాజు, వకీలు వేంకటకృష్ణప్పతో కలిసి మరాఠా ప్రభువు శివాజీని దర్శించి తమ అట్టుపుట్టానవాళ్ళ నెఱిఁగింపఁగా శివాజీ ఆనెగొంది సంస్థానమును సర్వస్వామ్యములతో ననుభవించు [illegible] శాసనమును దయచేయించిరి*. ఈ రామరాజునకు ప్రపౌత్రుఁడు తిరుమలదేవ రాజు. నరపతి సంస్థాన పాలకులలో చివరి పాలకుఁడును, మొదటి పింఛను దారుఁడును ఈ తిరుమలదేవరాజే!

మైసూరు సుల్తాను హైదరాలి యీ సంస్థానముపై దాడిచేసి కప్పమును రెండింతలు పెంచెను. నిజామును ఎదిరించు నిమిత్తము 1786లో టిప్పు సుల్తాను హంపిని, ఆనెగొందిని ఆక్రమించి యనేకదేవాలయములను, శిల్పకళా చక్కని కట్టడముల నెన్నింటినో నేలమట్టము గావించి, రాజ సౌధమును పరశురామప్రీతి జేసి సంస్థానపాలకుని అడవులకు వెడలఁగొట్టెనఁట. టిప్పు సుల్తాను మంత్రియగు పూర్ణయ్య ఆనెగొంది పాలకునిపై జాలిగొని నెలకు రూ. 2,000 ల భరణము నేర్పాటు చేయించెనఁట. టిప్పు సుల్తాను చేయుచున్న దురంతములు బ్రిటిష్, మరాఠా, నిజాము సమ్మేళనమునకు మార్గము చూపినవి. టిప్పును శిక్షించి యతఁడాక్రమించిన పూర్వ రాజ్యములను యథాపూర్వముగా స్థాపించుట యీ సమ్మేళనము వారిముఖ్యమగు నాశయము. [illegible] యొడంబడికలో ఆనెగొంది పరిపాలకుని విషయము కూడ ఉట్టంకింపఁబడియుండినది.

*నూతలపాటి పేరరాజు, విజయనగర చరిత్రము, పు. 206.

[illegible] రాణి కుప్పమ్మ. ఈమె మరణముతో దత్తపుత్రులకు పింఛనీయఁబడదని 1884 [illegible] ప్రభుత్వము ప్రకటించి యుండెను. కుప్పమ్మ దత్తుఁడగు [illegible] శ్రీరంగదేవరాయలవారు తనను తొలిపించనుదారుఁడైన [illegible] రాజువనుకు గల గ్రాంథమును మద్రాసు ప్రభుత్వమువారు సరిగ గుర్తింపలేదు. మొదటి [illegible] వారసుఁడుగా, రాణి కుప్పమ్మకు [illegible] సంస్థానముపై తనకు హక్కు కలదని మద్రాసు ప్రభుత్వమునకును ఇండియా ప్రభుత్వము వారికిని విజ్ఞప్తులు పంపించిరి. 1902లో కర్జను ప్రభువు [illegible] నున్నపుడు పింఛను పునర్వ్యవస్థీకృతమయి నెలకు రూ. 500 ల [illegible] ఇచ్చుట కంగీకరించిరి.

19వ శతాబ్దము చతుర్థపాదమున నిజాము ఈ జాగీరును లాగికొని, [illegible] నిర్ణయించిన కిద్దఱకు చిన్న మొత్తములు పదేండ్ల పాటుగా [illegible] ఇచ్చుచు వచ్చిరి. 1872 – 1886 మధ్య నీ సంస్థానము నిజాము [illegible] నుండినది. ఈలోఁగా నిజాము సర్కారువారు నిజాము రాష్ట్రమున [illegible] చేర్పఁబడిన యానెగొంది సంస్థాన స్థితిగతులను పరిశీలించి దాని [illegible] ఉండవలెనో నిర్ణయించుటకు 'డన్‌లప్' దొరగారిచేత నొక నివేదికను [illegible] చేయించిరి. సంస్థానమునకు సమీపజ్ఞాతులు కాని, దత్తత తీసికోఁదగు [illegible] కాని కన్పట్టుటలేదని 'డన్‌లప్' దొరగారి నివేదిక సూచించినది. కాని [illegible] నిజాము దివానగు 'సర్ ఉస్మాన్ జా' దూరదృష్టియును, ఆనెగొంది [illegible]సముపట్ల సానుభూతియును కలవారు. అతి ప్రాచీనమగు నరపతి సంస్థా[illegible] నిజాము రాష్ట్రపటము నుండి తుడిచివేయుట కాయన మనసొప్పలేదు. [illegible] పట్టుదల మీఁదనే పంపాపతి రాజు పురిష్ శ్రీరంగ దేవరాయలను రాణి కుప్పమ్మగారు దత్తు తీసికొనుటకు నిజాము సర్కారంగీకరించినది. 1906లో ఫర్మానా ప్రసాదించుచు సంస్థానపు ఋణములు తీరుదాఁక కప్పము [illegible] రూ. 5,000లు గాను ఆ పిమ్మట రూ. 10,000 గాను నిర్ణయింపఁబడినది.

శ్రీరంగ దేవరాయలు 1902లో జమికి వచ్చిరి. వీరి జ్యేష్ఠ కుమారులు శ్రీమంత్ సర్కార్ శ్రీకృష్ణదేవరాయలు. శ్రీకృష్ణదేవరాయల భార్య లాల్ [illegible] బాయి సాహేబా. ఈమె నరసింఘర్ సంస్థాన రాజపుత్రి. 1918లో శ్రీరంగ దేవరాయలు మరణించుటతో శ్రీకృష్ణదేవరాయలు మైనరయినందున రాణి కుప్పమ్మగారు సంస్థాన పాలనమును నిర్వహించిరి. ప్రాజ్ఞత వచ్చిన తరువాత కృష్ణదేవరాయలు గద్దె నెక్కిరి. వీరికి సంతతిలేదు. 1950లో తక్కిన నిజాము సంస్థానములతో ఆనెగొంది కూడ హైదరాబాదు రాష్ట్రములో నైక్యమయి విశాలాంధ్రావతరణముతో మైసూరు రాష్ట్రములో కలిసిపోయినది.

## సాహిత్యపోషణము

నరపతి సంస్థానమును పాలించిన యార్వీటి వంశము వారు కవి పండిత పోషణమునందు పెద్ద పేరు పెంపులు కలవారు. అళియరామరాయల తండ్రి శ్రీరంగరాజునకు అన్నయయిన తిరుమలరాజు దోనూరు కోనేరు కవి రచితమగు బాల భాగవతమునకు కృతిభర్త. అళియరామరాయల యాస్థాన కవీశ్వరుఁడు రామ రాజభూషణుఁడు. అళియరామరాయల పౌత్రుని పౌత్రుఁడగు 'కోదండ రామరాజు' అందుగుల వెంకయ్య రచించిన 'రామ రాజీయ'మను నామాంతరముగల నరపతి విజయమను చారిత్రక కావ్యమును అంకితము పొందినవారు. కృతిభర్త దాఁకఁగల ఆర్వీటి వంశీయుల చరిత్ర మిందభివర్ణితము. ఈ కోదండ రామరాయల తమ్ములగు ఆరవీటి తిమ్మరాయలు, ద్విపద రామాయణ కావ్య కర్త. ఇది విరూపాక్షస్వామి కంకితము.* కోదండరామరాయల ద్వితీయ కుమారులగు చిన వేంకట రాయలు, కుమార ధూర్జటి శ్రీరాముని కంకితముగఁ గూర్చిన 'కృష్ణరాయ విజయ' కృతి ప్రేరకుఁడు.

"....కర్కశ తర్క వ్యాకరణ వేదాంతాది శాస్త్రార్థ పరిజ్ఞాన ఘనులగు విద్వజ్జనులును, కావ్య నాటకాలంకార సారజ్ఞ రచనా గరిష్ఠులగు సత్కవి శ్రేష్ఠులును, సరస మృదుల సంగీత విశారద పరాజిత నారదముని నాయకులగు గాయకులును....కొలువ....చిన్న వేంకటరాయ దేవేంద్రుఁడు.... పేరోలగంబుండి ...."

—కృష్ణరాయ విజయము, 1—20.

కవియగు కుమార ధూర్జటియను వాడుకపేరుగల వేంకటార్యుని పిలిపించి-

'....పద్యకావ్య ఫణితిన్ జెపుమా శ్రీకృష్ణరాయ చరితము, నీ కవితా
ప్రౌఢి సుకవి నికరము మెచ్చన్' పైది. —1-30.

అని కోరఁగా నాలు గాశ్వాసములుగల కృష్ణరాయ విజయమను నీ ప్రబంధము నను ప్రబంధపఙ్క్తిలో కవి నిబంధించినాఁడు. విజయనగర సామ్రాజ్యము నను పాలించి సాహితీ సమరాంగణ సార్వభౌములను సార్థక నామమును పొందిన శ్రీకృష్ణదేవరాయల జైత్రయాత్రలు, కళింగరాజపుత్రియగు తుక్కా రమణిని ఆయన పరిణయ మాడిన విషయమును నిందు వర్ణింపఁ బడినవి.

వీరి తరువాత ఆరవీటి వారి వంశము పెక్కు ఇక్కట్టులకు లోనైనది. ఒక వైపున మహారాష్ట్రులు, మఱియొకవైపున మైసూరు సుల్తానులు, వేఱొక వైపున నిజాము ఆనెగొంది సంస్థానమును అదుముచు వచ్చిరి. ఉద్ధతులమధ్య నెవరి కుండఁదరమా?

ఆనెగొంది సంస్థానమున నాశ్రయించిన కవి వంశములలో అంబాళ వారి

*నరపతి విజయము, పు. ౩౯౫

వారి కుటుంబము ప్రసిద్ధమైనది. వీరు 19వ శతాబ్దము ఉత్తరార్ధమున నీ సంస్థానమున నుండిరి. అంబాళం రాఘవాచార్యులు భారత చంపువునకు వ్యాఖ్యను రచించిరఁట! ఆ గ్రంథము ముద్రితమైనను లభ్యమగుట లేదని తెలియుచున్నది.[1] అంబాళం కుటుంబమునకు చెందిన మఱియొక కవి నరసింహాచార్యులు. ఈయన విశ్వగుణాదర్శ వ్యాఖ్యాత. ఆనెగొంది సంస్థానములోఁ గల కవి పంకజాల యొద్ద నీ గ్రంథము కలదఁట.[2] క్రీ.శ. 1860 ప్రాంతము వాఁడగు కొండ రామకవి 'గవి రంగనాథ శతక' కర్త. 'గజపురంధామ శృంగార కలిత సోమ — మంగళోద్దామ! శ్రీ గవి రంగధామ' యను మకుటముగల సీసపద్య శతకమిది. గజపుర మనఁగా 'ఆనెగొంది' యని నిడుదవోలు వారు వివరించిరి. ధర్మపురి నరసింహ శతకము ననుసరించిన రచన. 1878లో ముద్రితము. 'గురుకృపాలబ్ధ వరముచే గూఢ భక్తి — నిన్ను నుతి సేయఁబూనితి నీరజాక్ష' యని కవి తన వినయసంపదను బ్రకటించినాఁడు. తిరుమల దేవరాయల కాలము (1831—1866) వాఁడు.[3]

రాణి కుప్పమ్మగారి దత్త పుత్రుఁడగు శ్రీరంగరాయ లాంధ్ర సాహిత్య పోషకుఁడు. ఆంధ్ర సాహిత్యములో మంచి పరిశ్రమ చేసినవాఁడు. 1915లో బళ్ళారిలో జరిగిన ఆంధ్ర సాహిత్య పరిషత్సభకు ఆనెగొంది రాజా శ్రీ శ్రీరంగ రాయలధ్యక్షులయి యాంధ్ర భాషాభివృద్ధి కమూల్యమైన సూచన లిచ్చిరి. కుప్పమ్మ మామగారగు తిరుమల దేవరాయలు (1831—1866) గొప్ప సాహితీ ప్రియుఁడు. తిరుమలదేవరాయలయొద్ద నాంధ్రవిద్యావిశారదుఁడగు కోలాచలం సేతుపతిశాస్త్రిగారు కొంతకాలము దివానుగా నుండిరఁట! బళ్ళారిలో ప్రసిద్ధ నాటకకర్తలుగా పేరుపొందిన కోలాచలం శ్రీనివాసరావు (1854-1919) సేతుపతి శాస్త్రిగారి పుత్రుఁడు.

శ్రీరంగదేవరాయల కాలమున దివాన్ బహద్దరు టి. కోదండరామ నాయఁడుగారు సంస్థానపు దివానుగా నుండిరి. పిఠాపురము రాజావారి యాశ్రితులుగా, ప్రసిద్ధాంధ్రనాటకకర్తలుగా పేర్వడసిన పానుగంటి లక్ష్మీనరసింహారావుగారును కొంతకాలము ఆనెగొందిలో దివానుగా పనిచేసినవారు.

1904 నుండి ఇమ్మానేని వేంకట గోవిందరావు నాయనివారు ఆనెగొంది సంస్థానాస్థాన పండితులుగా నుండిరి. వీ రాదివెలమకులోద్భవులు. పూర్వద ఋషి గోత్రజులు, ఇమ్మానేని బాపనయ్యనాయని వారి పుత్రులు. వనము గురుస్వామి వారి శిష్యులు. సంస్కృతాంధ్రములలో చక్కని ప్రవేశము గలవారు.

1 గోలకొండ కవుల సంచిక, పు. 407.

2 పైది, పు. 401.

3 నిడుదవోలు వేంకటరావు, శతకకవులచరిత్రము — అనుబంధము, పుటలు 845, 846.

వారి కుటుంబము ప్రసిద్ధమైనది. వీరు 19వ శతాబ్దము ఉత్తరార్ధమున నీ సంస్థానమున నుండిరి. అంబాళం రాఘవాచార్యులు భారత చంపువునకు వ్యాఖ్యను రచించిరఁట! ఈ గ్రంథము ముద్రితమైనను లభ్యమగుట లేదని తెలియుచున్నది.[1] అంబాళం కుటుంబమునకు చెందిన మఱియొక కవి నరసింహాచార్యులు. ఈయన విశ్వగుణాదర్శ వ్యాఖ్యాత. ఆనెగొంది సంస్థానములోఁ గల కవి పంకజాల యొద్ద నీ గ్రంథము కలదఁట.[2] క్రీ.శ. 1860 ప్రాంతము వాఁడగు కొండ రామకవి 'గవి రంగనాథ శతక' కర్త. 'గజపురంధామ శృంగార కలిత సోమ — మంగళోద్ధామ! శ్రీ గవి రంగధామ' యను మకుటముగల సీసపద్య శతకమిది. గజపుర మనఁగా 'ఆనెగొంది' యని నిడుదవోలు వారు వివరించిరి. ధర్మపురి నరసింహ శతకము ననుసరించిన రచన. 1878లో ముద్రితము. 'గురుకృపాలబ్ధ వరముచే గూఢ భక్తి — నిన్ను నుతి సేయఁబూనితి నీరజాక్ష' యని కవి తన వినయసంపదను బ్రకటించినాఁడు. తిరుమల దేవరాయల కాలము (1831—1866) వాఁడు.[3]

రాణి కుప్పమ్మగారి దత్త పుత్రుఁడగు శ్రీరంగరాయ లాంధ్ర సాహిత్య పోషకుఁడు. ఆంధ్ర సాహిత్యములో మంచి పరిశ్రమ చేసినవాఁడు. 1915లో బళ్ళారిలో జరిగిన ఆంధ్ర సాహిత్య పరిషత్సభకు ఆనెగొంది రాజా శ్రీ శ్రీరంగ రాయలధ్యక్షులయి యాంధ్ర భాషాభివృద్ధి కమూల్యమైన సూచన లిచ్చిరి. కుప్పమ్మ మామగారగు తిరుమల దేవరాయలు (1831—1866) గొప్ప సాహితీ ప్రియుఁడు. తిరుమలదేవరాయలయొద్ద నాంధ్రవిద్యావిశారదుఁడగు కోలాచలం సేతుపతిశాస్త్రిగారు కొంతకాలము దివానుగా నుండిరఁట! బళ్ళారిలో ప్రసిద్ధ నాటకకర్తలుగా పేరుపొందిన కోలాచలం శ్రీనివాసరావు (1854-1919) సేతుపతి శాస్త్రిగారి పుత్రుఁడు.

శ్రీరంగదేవరాయల కాలమున దివాన్ బహద్దరు టి. కోదండరామ నాయఁడుగారు సంస్థానపు దివానుగా నుండిరి. పిఠాపురము రాజావారి యాశ్రితులుగా, ప్రసిద్ధాంధ్రనాటకకర్తలుగా పేర్వడసిన పానుగంటి లక్ష్మీనరసింహారావుగారును కొంతకాలము ఆనెగొందిలో దివానుగా పనిచేసినవారు.

1904 నుండి ఇమ్మాననేని వేంకట గోవిందరావు నాయనివారు ఆనెగొంది సంస్థానాస్థాన పండితులుగా నుండిరి. వీ రాచవెలమకులోద్భవులు. పూర్వవద ఋషి గోత్రజులు. ఇమ్మాననేని బాపనయ్యనాయని వారి పుత్రులు. వనము గురుస్వామి వారి శిష్యులు. సంస్కృతాంధ్రములలో చక్కని ప్రవేశము గలవారు.

1 గోలకొండ కవుల సంచిక, పు. 407.

2 పైది, పు. 401.

3 నిడుదవోలు వేంకటరావు, శతకకవులచరిత్రము — అనుబంధము, పుటలు 845, 846.

ఆంధ్ర[illegible]ము. భాషా పరిణామము వీరి రచనలు.*

శ్రీరంగదేవరాయల కుమారులగు శ్రీమంత్ దర్బారు శ్రీకృష్ణదేవ రాయలవారు రాణీ కుప్పమ్మ మరణించిన పిదప ఆనెగొంది తఖ్తు నెక్కిరి. వీరు ఆంధ్ర కర్ణాటక భాషాభిమానులు, కవిపండిత పోషకులు. వీరి ఆస్థాన కవి రాజకవి కృతమగు 'విజయనగర చరిత్రము' శ్రీ కృష్ణదేవరాయలవారికి అంకితము. ఇది మృదుమధురమగు శైలిలో సంతరింపఁబడిన వచనరచన. రాజకవి ఉత్తమ శ్రేణికిఁజెందిన చరిత్ర జిజ్ఞాసువు. విజయనగర సామ్రాజ్య చరిత్రము మొదలునుండి తుదివఱకు సమగ్రముగ నిరూపింపఁబడిన రచన. కృతి సమర్పణమునందలి 'భాస్కరమాల'లో నందవరీక శాఖీయుఁడను కవి

'నందవరీకుఁడు పెద్దన
యుం బొసఁగఁడె యొకచరిత్ర మా కృష్ణునకున్
నందవరీకుఁడనగు నే
నుం బొసఁగెద నొక చరిత్ర మీ కృష్ణునకున్'

అని చమత్కరించినాఁడు.

'శ్రీ సుధాకరవంశభానుని మూర్తికి
సత్రిసమ్మిచంద్ర గోత్రజునకు
శ్రీ రంగరాయ కుమారరత్నమునకు
నాగలింగమ గర్భ నవ్యమణికిఁ
[illegible]రాద్యాదుల వర సహోదరునకు
శ్రీమతి లాల్కుమారీ విభునకు
వినయ సౌజన్యాది వివిధ సద్గుణునకు
మానిత విద్యాభిమానమతికి
ఘనుఁడగు కృష్ణదేవరాయాధిపునకు
అత్రిగోత్రుఁడఁ దేరాజనెడు కవిని
విజయనగర చరిత్రాఖ్య వెలయు నాదు
కృతిని సమ్మదమొదవ నంకితమొనర్తు.

అని కృతిసమర్పణమునందలి పద్యము.

శైవశక్తి పరిణయము, హంపీశిథిలములు, దశకుమారచరితము [illegible] వీరి యితరకృతులు. అనంతపురమండలమున గ్రంథపఠనాసక్తి [illegible] పెనుకొండ మారుతిగ్రంథమండలికి పేరి రాజకవి వ్యవస్థాపక[illegible] ప్రస్తుతము వీరు 'శ్రీశైలప్రభ' సంపాదకులు.

* [illegible] పరిణయము, రెండవ భాగము, పు. 309.

## ఉపజీవ్య గ్రంథసూచి


1. నూతలపాటి పేరరాజు, విజయనగర చరిత్రము, పుటలు [illegible].

2. తొగర్చేటి భాస్కరశాస్త్రి, హంపీక్షేత్రము, పు. 18.

3. నేలటూరి వేంకట రమణయ్య, తెలుగు విజ్ఞాన సర్వస్వము. సంపుటము 4, పు. 725.

4. అందుగుల వెంకయ్య, రామరాజీయము.

5. కుమార ధూర్జటి, కృష్ణరాయ విజయము.

6. సురవరము ప్రతాపరెడ్డి, గోలకొండ కవుల సంచిక.

7. నిడుదవోలు వేంకటరావు, శతక కవుల చరిత్రము – అనుబంధము.

8. V. L. Sastri, Encyclopaedia of the Madras Presidency and the Adjacent States, pp. 448–450.

# ఉంద్రాజవరము

## ప్రవేశిక

పశ్చిమ గోదావరి మండలములోని నవీనమయిన ప్రొప్రయిటరీ ఎస్టేటు లలో ఉంద్రాజవర మొకటి. ఇది చాల చిన్న యెస్టేటు. పందొమ్మిదవ శతాబ్దము ఉత్తర భాగమునందీ జమీ ఖరీదు చేయఁబడినది.

## సంస్థాన చరిత్రము

ఈ యెస్టేటుదారులు ముళ్ళపూడివారు. వీరు కమ్మవారు; తణుకు పట్టణము నందలి భూస్వాములలో తలమానికము వంటివారు. ముళ్ళపూడి వారి పూర్వులలో తిమ్మన్నగారు బ్రిటిష్ ప్రభుత్వము వారి మన్ననలకు పాత్రులయి ఎస్టేటు గ్రామములను ఖరీదుచేసి జమీందారులయిరి. పశ్చిమగోదావరి జిల్లాలోని దొమ్మేరు జమీందారు పెండ్యాల రాయఁడుగారు తిమ్మన్నగారి బంధుకోటికిఁ జెందినవారు. తిమ్మన్నగారికి పుత్రసంతతి లేనందున పెండ్యాలవారి దౌహిత్రుఁ డగు వెంకటరాయఁడు గారిని దత్తుఁడుగా స్వీకరించిరి. వెంకటరాయఁడుగారి భార్య పెండ్యాల అచ్యుతరామయ్యగారి పుత్రికయగు అక్కమాంబగారు. వెంకటరాయఁడు గారికి గంపెఁడు సంతానము. అఱుగురు తనయులు; ఒకేయొక పుత్రుఁడు. ఈ పుత్రుఁడే తిమ్మరాజుగారు. ఇట్లు దత్తపుత్రుని వలన తిమ్మన్న గారి కుదురు తామరతంపరగా విస్తరించినది. ఎలవర్తివారు, కాట్రగడ్డవారు, చిట్టూరివారు, పెండ్యాలవారు ముళ్ళపూడివారి ముఖ్యబంధువులు.

తిమ్మరాజుగారికి మొదటిభార్య యందు అచ్చాయమ్మ, హరిశ్చంద్ర ప్రసాదుఅను పుత్రికాపుత్రులు కలిగిరి. తిమ్మరాజుగారి రెండవ భార్య కమలా దేవిగారు గుంటూరు మండలము కాట్రగడ్డ శ్రీరాములు నాయఁడుగారి పుత్రిక. వీరికి కమలాదేవిగారివలన ముగ్గురు కుమార్తెలు, ఒక కుమారుఁడును కలిగిరి. ఆ కుమారునిపేరు నరేంద్రనాథుఁడు. ఈ బాలుఁడు ఋషివాలీ పాఠశాలలో విద్యార్థిగానుండి చదువుచు చిన్నతనముననే కన్నవారి కడుపున చిచ్చుపెట్టి పరమ పదించెను. ఈ బాలునిపేరు శాశ్వతముగా నిలుపు నిమిత్తము తిమ్మరాజుగారు తణుకు పట్టణమున నరేంద్రనాథ సాహిత్య మండలిని స్థాపించిరి.

తిమ్మరాజుగారు రాజకీయరంగమునందు చాణక్యనీతి నవలంబించిన యోధులు. తణుకు పట్టణమునందును, తణుకు తాలూకాయందును ముఖ్య పదవులను ఆక్రమించి రాజకీయములలో మంచి పేరు పొందినవారు. తిమ్మరాజు

గారి కుమారులు హరిశ్చంద్రప్రసాదుగారు అటు పారిశ్రామిక రంగమునను, ఇటు రాజకీయరంగమునను కీర్తిప్రతిష్ఠలను సంపాదించినవారు. చాలకాలము ఆంధ్రప్రదేశ శాసనసభాసభ్యులు. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు సెనేట్‌లో యావజ్జీవ సభ్యులు. తణుకులోని పంచదార మిల్లులు, కొత్తగూడెము నందలి ఎరువుల ఫ్యాక్టరీ మొదలగునవి వీరు నెలకొల్పిన ముఖ్యపారిశ్రామిక సంస్థలు.

## సాహిత్యపోషణము

తిమ్మరాజుగారికి ఆంధ్రాంగ్ల హిందీభాషలనిన మిక్కుటముగు నభిమానము. కవి పండితులు, ఉపాధ్యాయులు ఆయనకు చిన్నప్పటినుండియు కూర్చు మిత్రులు. కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు, రాజమండ్రి ఆంధ్రేతిహాస పరిశోధక మండలి, రాజమండ్రి గౌతమీ గ్రంథాలయము, వేటపాలెము సారస్వత నికేతనము, హైదరాబాదు దక్షిణభారత హిందీప్రచార సభ— మున్నగు సంస్థలకు వీరు యావజ్జీవ పోషక సభ్యులు. ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ, పూనా భారతీయేతిహాస మండలి, పూనా భండార్కార్ ఇన్స్టిట్యూట్, హైదరాబాదు సంగీత నాట్యమండలి, చెన్నపురి దివ్యజ్ఞాన సమాజము—— మొదలగు సంస్థలలో తిమ్మరాజుగారు సభ్యులు. దేశచరిత్ర, ప్రాచీన గ్రంథ సంపాదనము, తత్పరిశీలనములు వీరికి అభిమాన విషయములు. ఆంధ్రాంగ్ల హిందీ భాషలలో కొన్నివేల ఉత్తమకావ్యములను, గ్రంథములను చేకూర్చి ఒక పెద్ద గ్రంథాలయమును రూపొందించినారు. ఉత్తమ రచనలను ప్రకటించు నిమిత్తము తణుకు పట్టణమున రాయల ముద్రణాలయమును నెలకొల్పినారు. సర్వతోముఖమైన సాహిత్య వికాసమునకు తోడ్పడు రీతిలో తణుకు పట్టణమున నరేంద్రనాథ సాహిత్య మండలి స్థాపించినారు.

తిమ్మరాజుగారు సత్సంతానమును బడయుటయేగాక సప్త సంతానములలో విలముగాని ప్రశస్త కృతులను పండితకవులనుండి అంకితము పొందిరి. జయపుర సంస్థానాస్థాన కవులగు పండిత పెన్మెత్స సత్యనారాయణరాజుగారి 'రాజానందము' అను సలంకార కృతి తిమ్మరాజాంకితము. చంద్రాలోకమున కాంధ్రీకరణమైనను స్వతంత్ర కృతివలె విద్వదాదరణ పాత్రమయి వెలసిన రచన మిది. శ్రీ తిమ్మరాజు గారి కీర్తి కిది యొక దివ్యమూర్తి.

'పంటపొలముల గట్టుల భాగవత వి
మర్శ మొనరించు పోతనామాత్యుఁడితఁడు
పరమ ధన్యుండు తిమ్మభూపాలుఁ డితఁడు....'

అను పండితుల యభినందనము తిమ్మరాజుగారి వర్తనమువల్ల ప్రత్యక్షర సత్యము. రాజానందము వాస్తవముగా తిమ్మరాయ యశోభూషణము. అలంకారము లన్నింటికి లక్ష్యలక్షణములను నిరూపించుచో లక్ష్యము తిమ్మరాజు

గారి చేవిరేటిణమునుండి స్వీకరింపఁబడినవి. కొన్ని యుదాహరణములు :

'అన్యోన్యాలంకారం
బన్యోన్యోపకృతి గల్గనగు గృతిపతి స
మ్మాన్యుండు కవులచేతస్
మాన్యులు సుకవులును తిమ్మ మహిపు చేతన్'

'కొలఁది వానినిచ్చి గొప్పది కొనుటయు
గొప్పదిచ్చి కొనుట కొలఁదిదాని
సమమునిచ్చి కొనుట సమమునౌ పరివృత్తి
తెలుఁగురాజమంత్రి తిమ్మరాజ'

కృతికర్తయగు సత్యనారాయణరాజుగారికి 'తెలుఁగు రాజు' అని బిరుదము.

తిమ్మరాజుగారు 'సరస్వతీకంఠాభరణ' బిరుదాంకితులగు శ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారి రైతురాయఁడు, నరేంద్రుఁడు, బుద్ధగీత, ఆర్య చాణక్యుఁడు, కాకతీయ చరిత్రము, కాకతి ప్రోలరాజు అను కృతులను అంకితము పొందిరి. జమ్ములమడక మాధవరామశర్మగారాంధ్రీకరించిన 'ఔచిత్య విచార చర్చ' యను నాలంకారిక గ్రంథము తిమ్మరాజుగారికి కృతి యీఁబడినది. ఇది క్షేమేంద్రుని గీర్వాణ కృతికి వివరణ రూపమయిన ఆంధ్రానువాదము. ఆంధ్రాలంకార గ్రంథకోటిలో నీ యౌచిత్యవిచారచర్చ యొక విశిష్టస్థానము నాక్రమింపఁ గలదు.

త్రిపురనేని సుబ్బారావుగారి 'కవిరాజ జీవితం — సాహిత్యం' అను పరిశోధక గ్రంథమును, రావూరి భరద్వాజగారి 'కరిమింగిన వెలగపండు' అను నవలను, డా. త్రిపురనేని వేంకటేశ్వరరావుగారి 'సాహిత్య సమ్రాట్టు' అను పద్యకావ్యమును శ్రీ తిమ్మరాజుగారు కృతినందిరి ; శ్రీ త్రిపురనేని వేంకటేశ్వరరావుగారిని కనకాభిషేకముతో సత్కరించిరి.

సుప్రసిద్ధ సంస్కృతాంధ్ర పండితులు ఏలూరిపాటి అనంతరామయ్యగారి 'జంఘాలశాస్త్రి ఆత్మలోకయాత్ర' యను గ్రంథము తిమ్మరాజుగారికి కృతి యొసంగఁబడినది. ఇది పానుగంటివారి సాక్ష్యపన్యాసములను బోలిన చక్కని వచనరచన. ఇట్టి సాహిత్యశాఖను స్వీకరించుటలో అనంతరామయ్యగారు పానుగంటివారి ననుకరించినను, విషయ స్వీకారమునందును, వివరణము నందును, శైలియందును తమ విశిష్టతను అడుగడుగున ప్రదర్శించినారు.

తిమ్మరాజుగారు నెలకొల్పిన రాయల ముద్రణాలయమునందు నరేంద్ర నాథ సాహిత్యమండలి పక్షమున ప్రాచీనార్వాచీనములగు ప్రశస్తకృతు లెన్నియో ప్రచురితము లయినవి. బద్దె భూపాలుని నీతిశాస్త్ర ముక్తావళి, కొలని గణపతి దేవుని శివయోగ సారము — పూర్వభాగము (ప్రథమాశ్వాసము), కూచిమంచి జగ్గకవి సోమదేవరాజీయము, గోగులపాటి కూర్మనాథకవి సింహాద్రినారసింహ

శతకము, కార్యముపూడి రాజమన్నారుకవి రచితమగు కొరముచేటి మాధవ స్వామి శతకము, కొత్త భావయ్యచౌదరిగారి కమ్మవారి చరిత్రము, పశ్చిమ చాలుక్యరాజ్య చరిత్ర (పద్య కావ్యము), నన్నెచోడుని కుమారసంభవము ప్రథమ ముద్రణమునకు మానవల్లి రామకృష్ణకవిగారు సంతరించిన పీఠికాభాగమును, యం.వి.యస్. కృష్ణమూర్తిగారు రచించిన మునునూరి కాపయనాయకుఁడు, శ్రీహర్ష శీలాదిత్యుఁడు, రాజా వీరబల్ అను చారిత్రాత్మక నవలలును నరేంద్ర నాథ సాహిత్యమండలి పక్షమున ప్రకటితము లయినవి. ఇవికాక తిమ్మరాజుగారు కృతి పొందిన పెక్కు గ్రంథములు నరేంద్రనాథ సాహిత్య మండలి సమాదరణ మునఁ బ్రకాశితములు.

నరేంద్రనాథ సాహిత్య మండలి కేవలము గ్రంథ ప్రకాశక సంస్థమాత్రమే కాదు. ఇది వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారి అగ్రాసనాధిపత్యమున వెనుకటి మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ పూసపాటి కుమారస్వామిరాజాగారి చేతి మీఁదుగా నవతరించిన ఉత్తమ సాహితీసంస్థ. వారము వారము నేడోయొక సాహిత్య చర్చయో, శాస్త్ర సంబంధమైన గోష్ఠియో, కవి సమ్మేళనమో జరుగుచునే యుండును. ఈ మండలి పక్షమున కవి పండితులు పెక్కురకు ఘనమైన సమ్మానములు జరిగినవి. తాతా సుబ్బరాయశాస్త్రి, మల్లాది సూర్య నారాయణశాస్త్రి, వేదుల రామశాస్త్రి, కాశీ కృష్ణాచార్యులు, వెంపరాల సూర్య నారాయణశాస్త్రి, తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి, ఏటుకూరి వెంకటనరసయ్య, తుమ్మల సీతారామమూర్తిచౌదరి, జమ్ములమడక మాధవరామశర్మ, భారతుల మార్కండేయశర్మ, పుట్టపర్తి నారాయణాచార్యులు, రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ, దివాకర్ల వెంకటావధాని, అమ్మిశెట్టి లక్ష్మయ్య, పెన్మెత్స సత్యనారాయణ రాజు, వేదుల సూర్యనారాయణశర్మ, నాదెళ్ళ కృష్ణమూర్తి, వడ్లమాని సోమ శేఖరము మొదలగు విద్వన్మణులు నరేంద్రనాథ సాహిత్య మండలి పక్షమున సమ్మానము లందినవారు.

తిమ్మరాజుగారి షష్టిపూర్తి సందర్భమున జరిగిన అభినందనసభలో కవి పండితులు తిమ్మరాజుగారి సాహితీసేవలను గుర్తించి పుట్టపర్తి నారాయణా చార్యులుగారి ముఖమున తిమ్మరాజుగారికి 'సాహితీవల్లభ' యను బిరుదము నిచ్చిరి. ఆ సమావేశమునందే ఆంధ్రదేశీయులగు కవి పండిత విమర్శక ప్రముఖుల ఉత్తమ రచనలతో నొక సంధాన గ్రంథమును అభినందన సంచికగా 'సాహితీవాల్లభ్య' మను పేరు సంకలనము సేయుటకు నిర్ణయింపఁ బడినది. వివిధ సాహితీశాఖలలో విశిష్టకృషిని సలిపిన యాంధ్ర విద్వన్మణుల రచనములు రెండు వందలకు పైగా సమకూర్పఁబడినవి. ఆ యా రచయితల జీవిత వివరములతో సయితము ప్రచురితముకానున్న 'సాహితీవాల్లభ్యము' ఆధుని కాంధ్రవాఙ్మయ స్వరూప నిరూపణముగా, తత్స్రష్టల జీవిత వృత్తాంత

దర్పణముగా వెలయఁగలదు. అచిరకాలముననే ఇది యావిష్కరింపఁబడుటకు సన్నాహములు చురుకుగా సాఁగుచున్నవి. ఈ సాహితీవాల్లభ్యము తిమ్మరాజు గారికి శాశ్వతకీర్తిని సంపాదించి పెట్టఁగలదు.

ఉత్తర ప్రదేశ రాష్ట్రము గవర్నరును, ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ అధ్యక్షులును నగు డా. బెజవాడ గోపాలరెడ్డిగారి యగ్రాసనాధిపత్యమున తణుకు పట్టణమున గడచిన వేసవిలో జరిగిన ఒకానొక కృతిసమర్పణోత్సవ సందర్భమున కవిపండిత సమక్షమున తిమ్మరాజుగారు 'ఆంధ్రభోజ' బిరుద విభూషితులయిరి.

దొమ్మేరు జమీందారు పెండ్యాల శ్రీరామచంద్ర వెంకటకృష్ణ రంగారావు గారు తిమ్మరాజుగారి యల్లురు :

'అతని కుడిచేతి దానమ్ము నతని యెడమ
చేయి యెఱుఁగదు మఱియింక చెప్పుటెట్లు'

అని పండితకవుల పొగడ్తను బొందినవారీయన. ఏలూరు కళాశాల వీరి వితరణ గుణమువలన వికాసమందినది. రంగారావుగారు ఆమరణము ఈ కళాశాల పాలకసంఘాధ్యక్షులుగా నుండినవారు.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. కొత్త భావయ్యచౌదరి, కమ్మవారి చరిత్రము, పుటలు 275–283.
2. జమ్ములమడక మాధవరామశర్మ, ఔచిత్యవిచారచర్చ, పీఠిక.
3. పెన్మెత్స సత్యనారాయణరాజు, రాజానందము.
4. వేదుల సూర్యనారాయణశర్మ — రంగరాయ చరిత్ర.

# ఉర్లాము - దేవాది (దేవిడి)

## ప్రవేశిక

ఉర్లాము సంస్థానము గంజాము మండలములోనిది. శ్రీకూర్మమునకు దాపున ఉర్లామను గ్రామము కలదు. దానికి సమీపముననే దేవాది గ్రామమును కలదు. దీనినే నేఁడు 'దేవిడి' యని కొందఱందురు. ఉర్లాము గ్రామము చాల ప్రాచీనమైనది. దీని పూర్వ నామము ఉరామల్ల. గాంగ కులోద్భవుఁడగు హస్తివర్మ ఉరామల్ల నివాసియగు జయశర్మకు ఈ గ్రామమునే దానమిచ్చినట్లు, హస్తివర్మ ఉర్లాము తామ్రశాసనము పేర్కొనుచున్నది. గాంగ వంశమునకు సంబంధించిన శాసనములలో నివియే మొదటిదని చరిత్రకారుల భావము. ఇది సంస్కృత భాషామయము.

ఉర్లాము సంస్థానము ప్రాచీనమైనదికాదు. శాశ్వత పరిష్కార కాలమున ఒకానొక హవేలీ ఖండమునుండి రూపొందిన ప్రొప్రయిటరీ యెస్టేటిది. ఉర్లాము, దేవాది గ్రామములను, వాని పరిసరములందుఁగల మఱి యైదు బేచిరాకు గ్రామములను కుంఫిణీవారు ఏలము వేయఁగా కన్నేపల్లి కూర్మనాథ సర్వతోముఖ యాజులు గారను వెలనాటి వైదిక బ్రాహ్మణులు దీనిని 1803లో ఖరీదుచేసి తమపేర సన్నద్-ఇ-మిల్కియత్ ఇస్తిమిరార్ సంపాదించి యుండిరి. దీని పేష్కషు పండ్రెండున్నరవేలు. యాజులుగారి కుమారులు కన్నేపల్లి రామావధానులుగారు. ఈయన ఈ గ్రామములను బాగుచేయించి, నాడు నాడులనుండి ప్రజలను రప్పించి, నీటి వసరులు కల్పించి భూములను సాఁగుచేయించి సర్కారు శిస్తులను గట్టుచు అనుభవించుచునుండిరఁట! కొంతకాలమునకు అదనున వానలు కురియక, పెద్దపఱపు పట్టి, పంటలు పండక, కఱవు వచ్చినది; బరువు హెచ్చిన రైతులు పన్నులు సరిగా కట్టలేదు; సాలుసరి సర్కారు పేష్కషు చెల్లలేదు. సర్కారు పైకమంతయు బకాయి పడినది. ఎస్టేటు అప్పుల పాలైనది. కుంఫిణీ సర్కారు వారూరకుందురా? జమీందారీని సివిలు జప్తుచేసి ఏలము వేయుటకు నిర్ణయించిరి. ఈ యేలములో చికాకోలులో ప్రైవేటు ప్లీడరుగానుండిన బుద్ధిరాజు బసవరాజుగారనువారు తమపేర పాటపాడి జమీందారీని తమ వశము గావించికొనిరఁట!

ఈ యేలము విషయమున దేశమునం దనేకవదంతులు వ్యాపించి యున్నవి. బుద్ధిరాజు బసవరాజుగారు కన్నేపల్లివారి ప్లీడరఁట! సంస్థానమువారి కోర్టు వ్యవహారములు చూచిపెట్టుటకు నెలసరి జీతము నిచ్చుచుండిరఁట!

కన్నేపల్లి రామావధానులుగారు అప్పో సప్పోచేసి తమయొద్ద వకీలుగానున్న యీ బసవరాజుగారికి వలయు పైకమిచ్చి యేలమునాటికి చికాకోలు కోర్టునకు పంపఁగా బసవరాజుగారు ఏలము పాటను తనపేర పాడి ఆ పిమ్మట సంస్థానమును రామావధానులుగారికి స్వాధీనము చేయుటకు నిరాకరించిరఁట! ఇది యొక కథ! రామావధానులుగారితో నిమిత్తము లేకుండ బసవరాజుగారు తమ సొంత డబ్బుతో ఈ సంస్థానమును కొని దఖలుపఱిచికొనిరని యింకొక కథ!! ఇందేదినిజమో ఎవరికిని దెలియదు. నిజము నిలుకడమీఁద నిష్కర్షకాఁగలదు.

## సంస్థాన చరిత్రము

కన్నేపల్లి కూర్మనాథ సర్వతోముఖయాజులుగారు సంస్థాన సంస్థాపకులనియు, ఆయన కుమారులు కన్నేపల్లి రామావధానులుగారి కాలమున సంస్థానము కన్నేపల్లివారి చేతులనుండి జాఱిపోయినదనియు చరిత్ర సాక్ష్యమిచ్చుచున్నది. వాస్తవస్థితి యిట్లుండఁగా, ప్రియాగ్రహార వాస్తవ్యుఁడగు కన్నేపల్లి రామావధానియే సంస్థానసంపాదకుఁడని శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు వ్రాయుట కాధారమేమో తెలిసినదికాదు (చూ. ఆంధ్రాభ్యుదయము,తృతీయా. 158–167). కన్నేపల్లివారి తరువాత నీ సంస్థానమును పాలించినవారు బుద్ధిరాజు బసవరాజుగారు. ఈయన చికాకోలులో పేరు పొందిన ప్రైవేటు ప్లీడరు. బసవరాజుగారు జమీందారుగా ఉర్లాములో నడుగువెట్టినది మొదలుకొని యేదో దుష్టగ్రహమా దేవిడీ నాశ్రయించి పెక్కు బాధలు పెట్టుచుండెనఁట! తచ్ఛాంతికై వేద పరీక్షలు, కార్తీకసత్తములు, దానములు, ధర్మములు, సమారాధనములు చేయించెడివారు (చూ. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి స్వీయ చరిత్రము, పు. 70). వీరికి పుత్రసంతతి లేకపోవుటచే ఈయన యనంతర మీయన భార్య ఆదిలక్ష్మమ్మగారికి జమీ సంక్రమించినది. ఈమె పెద్దకూఁతురు వియ్యామ్మ. వియ్యామ్మగారు కందుకూరి పేరయలింగముగారి భార్య. వీరి కుమారులు కందుకూరి బసవరాజుగారు తరువాతి వారసులుగా ఉర్లాము జమీందారులైరి. ఈయన ఏకైక పుత్రుఁడగు విశ్వేశ్వరరావు అను నామాంతరముగల వేంకట విశ్వనాథరావు పంతులుగారు తండ్రి చనిపోవు నాఁటికి మైనరు. బసవరాజుగారు పుత్రుని యుపనయనమును పూర్తిచేసి 1878లో మరణించిరి. సంస్థానము కోర్ట్ ఆఫ్ వార్డ్స్ పర్యవేక్షణమున నుండినది. విశ్వేశ్వరరావునకు బుద్ధిరాజువారి ఆఁడుఁబడుచు మహాలక్ష్మమ్మ నిచ్చి పెండ్లిచేసి యుండిరి. విశ్వేశ్వరరావును అతని తల్లియును అతని చదువుల నిమిత్తము చికాకోలులో కాఁపురముండిరి. విశ్వేశ్వరరావు స్థానిక పాఠశాలలోఁ జదువుకొనుచు నొక్కనాఁడు గుఱ్ఱపుబండి మీఁద నుండి క్రిందఁబడి డొక్కలో చిన్నరాయి గ్రుచ్చుకొని పదునాలేండ్ల ప్రాయమున అకాలమరణము నందెను. తరువాత నీతని భార్య మహాలక్ష్మమ్మగారు మేజరైన

పిమ్మట ఎస్టేటు పాలనాధికారమును వహించిరి. మహాలక్ష్మమ్మగారి బంధుగులు దత్తు విషయముగ వీలునామా నొకదానిని విశ్వేశ్వరరాయకృతముగా కల్పించి రఁట ! కాని విశ్వేశ్వరరావుగారి ప్రపితామహుని పౌత్రుఁడును, కందుకూరి బసవరాజుగారి సోదరుని కుమారుడునునగు కందుకూరి సన్యాసిరాజుగారు మర ణించిన విశ్వేశ్వరరావునకుఁ దాను దగ్గఱి వారసుఁడనియు, వీలునామా కేవలము కూటసృష్టియనియు వ్యాజ్యము తెచ్చి క్రిందికోర్టులోను, పై కోర్టులోను విజయ మును పొందిరి. సన్యాసిరాజుగారును, ఆయన కుమారులు బాలసూర్యప్రసాద రావు లక్ష్మీప్రసాదరావులును ఈ మహాలక్ష్మమ్మగారి కనంతరము సంస్థానము నకు వారసులని ఆ నాఁడు జరిగిన ఔరసత్వపు దావాలలో నిర్ణయింపఁబడినది. మహాలక్ష్మమ్మగారు 1860లో జమీకి వచ్చి పూర్వులు నిర్వహించుచుండిన ధర్మకార్యములన్నియు సక్రమముగా సాఁగించుచు, వేదవిద్యల నుద్ధరించి, ఉర్లాము సంస్థాన కీర్తిని తెలుఁగు నేల నాలుగంచుల వ్యాపింపఁజేసి ఉభయకుల పవిత్రగా పేరు పొందినది. అచిరకాలముననే మహాలక్ష్మమ్మగారు పరమ పదించిరి.

సన్యాసిరాజుగారి కుమారులు బాలసూర్యప్రసాదరావు, లక్ష్మీప్రసాదరావు లను వారు కలెక్టర్ సాయముతో నెట్టి యిక్కట్టులు లేకుండ ఎస్టేటును స్వాధీన పఱచికొనిరి. వీరికి యెస్టేటు స్వాధీనము కాకమునుపు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు సన్యాసిరాజుగారి కుటుంబమును రాజమహేంద్రవరములో కాఁపుర ముంచి ఆదరించినట్లు తెలియుచున్నది (చూ. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి స్వీయచరిత్ర, పుటలు 70—75). కనిష్ఠ సోదరులైన లక్ష్మీప్రసాదరావుగారికి కృష్ణమూర్తిశాస్త్రిగారు బాలామంత్రము నుపదేశించిన గురువులఁట ! ఎస్టేటు దఖలుపడిన పిమ్మట సోదరు లిద్దఱకును సరిపడక ఎస్టేటును దేవాది (లేక దేవిడి), ఉర్లాము అని రెండుభాగములు గావించి పంపకములు చేసికొని పాలిం చిరి. పెద్దవారగు బాలసూర్యప్రసాదరావుగారికి 'దేవాది' భాగమును, చిన్న వారగు లక్ష్మీప్రసాదరావుగారికి 'ఉర్లాము'ను వచ్చినవి.

## సాహిత్యపోషణము

తెలుఁగుదేశమునందలి తక్కిన జమీందారీలతో పోల్చి చూచినపుడు వానికిని, ఉర్లామునకును వైశాల్యమునందును, వైభవమునందును, ఐవేజు నందును, ఐశ్వర్యమునందును హస్తిమశకాంతరము కలదు. కాని విద్యా విషయముగా ఉర్లాముసంస్థానము ప్రథమశ్రేణిలో అగ్రస్థానము వహించునంతటి ఉత్తమకృషిని సలిపినది. ఉర్లాముసంస్థాన పాలకుల పండితసత్కారాదులను గుఱించి కొందఱు పెద్దలు వ్రాసిన వ్రాఁతలను పరిశీలింపుఁడు :

'ఉర్లాం పేరుకు చిన్న జమీయే అయినా పండిత సత్కారం పరీక్షించి

చేసేది కావడంచేత మనదేశంలో దాని పేరుప్రతిష్ఠలు చాలా వ్యాపించాయి. ఏ యూనివర్సిటీకికూడా దానికున్నంత అధికారము లేదు. ఇచ్చేదేమో సాలు ఒకటికి 12 రూపాయలు మాత్రమే కాని చేసేపరీక్ష మాత్రం నూటికి నలభై మార్కుల బాపతు గాదు. నూటికి నూరూ రావడం విధి. దీనిలో ఏమాత్రం తగ్గినా దానిలోటు ఇచ్చే 12 రూపాయలలో అణో, అర్ధణో, కానో తుదకు పైసో తగ్గించి మరచటి సంవత్సరం ఆ లోటు భర్తీ అయిన తరువాతే పూర్తివార్షికం యిచ్చేవారు. ఆ సంస్థానంలో పరీక్షాధికారులుగా వుండే పండితులకుమాత్రం నూటపదహార్లు వార్షికం వుండేది. రంగాచార్యులవారు శాస్త్రాలకు పరీక్షాధికారులు....జమీందారు బసవరాజుగారు....మంత్రవాది లక్ష్మీనారాయణశాస్త్రులుగారు రంగాచార్యులవారికి అభిమానశాస్త్రమైన తర్కంలోనే రంగాచార్యులగారితో శాస్త్రార్థం చేసి పండితులను మెప్పించినట్లు చెప్పుకోగా విన్నాను'.

ఇది చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి సర్టిఫికెట్టు (చూ. కథలు-గాథలు, సంపుటము 1, పుటలు 369-370).

మఱియొక యోగ్యతాపత్రము :

'ఆంధ్రదేశమున ఉర్లాము సంస్థానము వేదవిద్యకు ఇచ్చిన చేయూత వైదికచరిత్రమున ధ్రువతారాతుల్యముగఁ బ్రకాశించును. ఉర్లాము సంస్థానాధీశ్వరి ఇచ్చు పారితోషికములకును, చేయు ప్రశంసలకును ముగ్ధులై అనేకులు వేలకువేలు యువకులు అవధానులైరి. ఉర్లాముపండితుఁ డనిన ఢిల్లీకి వెళ్ళినను చేమోడ్పులు లభించెడివి.

ఉర్లాముపండితుఁ డనిన దిగ్గజము. ఇఁక అతనికి పరీక్ష లేదు, అడ్డు లేదు '(ప్రబుద్ధాంధ్ర, 1921, సంపుటి 2, సంచికలు 2, 3, పు. 27).

'చిరకాలమునుండి యుర్లాము జమీందారులు వేదవిద్యను పోషించుచున్నారు.'

—వంగూరి సుబ్బారావుగారి ఆంధ్ర వాఙ్మయచరిత్రము, పు. 111.

'పరీక్షితా యత్ర చ వేదవిద్యా యత్రాన్నదానం చ జగత్ప్రసిద్ధం
ఉర్లాంపురీం తాం సమతీత్య సద్యః శ్రీదేవిడీపట్టణమావిశామ'.

---280, చెన్నపురి రాజధానీ ధూమశకట తీర్థయాత్రా చరితమ్,
వడ్లమాని లక్ష్మీనరసింహశాస్త్రి కృతము.

ప్రాసంగికముగా ఉర్లాముప్రశస్తి యిట్టికృతిలో ప్రస్తుతింపఁబడినది. ఇట్లు పండితవిమర్శకుల ప్రశంసలను పొందుటయేగాక కొందఱు కథకుల కథలలో కూడ ఉర్లాముసంస్థానము ప్రస్తుతింపఁబడుట విశేషము.

'ఉర్లాంలో వాడికి పట్టా పుట్టింది, నాకు లేదు. అంతేనా ?' అని యొక

పాత్రమునోట ఉర్లాము పట్టాప్రశస్తిని పలికించినాఁడు కథకుఁడు (చూ. శ్రీపాద వారి చిన్నకథ, బ్రాహ్మణాగ్రహారం, పు. 62).

ఉర్లాము జమీందారు కందుకూరు బసవరాజుగారిచే సమ్మానితుఁడైన పంతుల బ్రహ్మదేవకవి ఆనాఁటి విద్వత్కవి. భళ్ళమూడి లక్ష్మణశాస్త్రి ఆస్థాన పండితుఁడు. బసవరాజుగారు కాశీయాత్ర కరిగినపుడు కాశీలో అనేక పండితులకు సమ్మానములు చేసిరఁట! (చూ. చెళ్ళపిళ్ళవారి కాశీయాత్ర చరిత్ర, పు. 22).

## వేద పరీక్షలు

ఉర్లాము వేదశాస్త్ర పరీక్షలకు కేంద్రము. ఉర్లాముపేరు వినఁగానే యీ ప్రాంతపు వృద్ధపండితులకు 'శ్రావణి' తలంపునకు వచ్చును. ప్రతివర్షము శ్రావణశుద్ధ పూర్ణిమాదినమున వేనవేలు బ్రాహ్మణుల వేదఘోషముతో ఉర్లాముసంస్థానము పవిత్రమగుచుండెడిది. 1856 నుండి ఈ శ్రావణి ఉత్సవములు ఉర్లాము సంస్థానమున ప్రసిద్ధములు. శ్రావణమాసములో నీ సంస్థానము వారు వేదవేదాంగములలో, సకలశాస్త్రములలో పరీక్షలు నిర్వహించి నెగ్గినవారికి పట్టాలు, బహుమతులు, వార్షికములు ఇచ్చెడివారు. అర్హులగు పండితులను ఉచితరీతిని సత్కరించెడివారు. వేలకువేలు వెచ్చపెట్టి దిగ్దంతులవంటి వేదశాస్త్ర పండితులను పరీక్షకులుగా నియమించి ఈ శ్రావణీ విద్వత్సభాపరీక్షల నేఁటేఁట నిర్వహించెడివారు.

## పరీక్షకులు

గీర్వాణాంధ్రభాషలలో మహాపండితులును, షట్శాస్త్రములలోను, షడ్దర్శనములలోను పరినిష్ఠిత పాండిత్యము కలవారును, భారతీయులలో ప్రప్రథమముగా మహామహోపాధ్యాయ బిరుదమును పొందినవారును నగు శ్రీమత్పరవస్తు వేంకటరంగాచార్యులవారు ఈ పరీక్షలలో ముఖ్యపరీక్షాధికారిగా నుండెడివారు. వీరికి పిమ్మట మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ తాతా సుబ్బరాయశాస్త్రిగారు (1867—1944) ప్రధాన పరీక్షకులుగా పని చేసిరి. వ్యాకరణ విభాగమునకు చిలుకూరి చతుష్టయమునందలి చిలుకూరి సోమనాథశాస్త్రి, చిలుకూరి పాపయ్యశాస్త్రి పరీక్షాధికారులుగా నుండెడివారు. తర్కవిభాగమునకు అపరగౌతమ విఖ్యాతులు, సంగమేశ్వర క్రోడపత్ర నిర్మాతలు, కాశీపండితులునైన గుమ్మలూరి సంగమేశ్వరశాస్త్రి (1863—1903) గారును, తర్కతీర్థ బిరుదాంకితులు, కాశీపండితులునైన ఆదిభట్ల రామమూర్తి శాస్త్రి (1861—1920) గారును పరీక్షకులు. వేదవిభాగమునకు బొమ్మకంటి సోదరషట్కమునందలి వేంకట నృసింహశాస్త్రి (1850—1925), రామస్వామి అవధాని (1852—1931) గార్లు పరీక్షాధికారులు. న్యాయవేదాంత తర్కాలంకా

రములకు పేరి కాశీనాథశాస్త్రి (1858–1920) గారు పరీక్షకులుగా నుండినవారు. ఇఁక ఉర్లాము పరీక్షలలో విజయమందిన పండితులలో మంత్రవాది లక్ష్మీనారాయణశాస్త్రి, పేరి లక్ష్మీనారాయణశాస్త్రి, వీటూరి వెంకటరామశాస్త్రి, ఉపాధ్యాయుల వేంకటేశ్వరశాస్త్రి, బంకుపల్లి మల్లయ్యశాస్త్రి, పేరి వెంకటేశ్వరశాస్త్రి, వడ్లమాని సుబ్బావధాని, గంటి శంకరసూర్యనారాయణావధాని (మద్దివలస), కాశీ ప్రకాశము (చల్లపేట), కొత్తూరి సుబ్బయ్యదీక్షితులు, గోరుగంతు వెంకటరమణశాస్త్రి మొదలగు వారు ప్రసిద్ధులు. బంకుపల్లి మల్లయ్యశాస్త్రి ఉర్లాము సంస్థానాస్థాన సంస్కృత పండితులగు భళ్ళమూడి లక్ష్మణశాస్త్రిగారి శిష్యులు.

'తామసవృత్తి లేక శతధా బహుధా కళలభ్యసించి యు
ర్లాము పరీక్షలిచ్చి యవలన్ మఱి పీఠపురాధినాథును
ద్దాము దయావిశేషమున స్థాపిత శాస్త్రపరీక్షలందుఁ దా
నీ మహనీయుఁ డున్నతివహించి తరించెనఁటెంత పుణ్యమో!'

—దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారి పేరి వేంకటేశ్వరశాస్త్రి జీవితచరిత్రము. ప. 41.

ఉర్లాము సంస్థానమువారిచే వార్షికములచేతను, ఇతర సమ్మానములచేతను బహూకృతులైనవారిలో కొంతి భద్రాద్రిరామశాస్త్రి, మహామహోపాధ్యాయ పేరి కాశీనాథశాస్త్రి, తిరుపతివేంకట కవులు, బులుసు మల్లు సోమయాజులు, భమిడిపాటి సుబ్బావధానులు మొదలగువారు కలరు.

సంస్థానకవులలో పంతుల బ్రహ్మదేవకవి, కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, చాగంటి సీతయ్యశాస్త్రులు, కొత్తూరి సుబ్బయ్యదీక్షితులు, నేమాన సూర్యప్రకాశకవి, బి. ఈశ్వరప్ప, వడ్లమాని లక్ష్మీనరసింహశాస్త్రి మొదలగువారు ముఖ్యులు.

'రాణగఁగందుకూర్బసవరాజు సభాంతరమందుఁబండిత
శ్రేణులు సత్కవీశ్వరులు........నాంధ్రగీ
ర్వాణ కవీంద్రుఁడన్ బిరుదు పంతుల బ్రహ్మనశాస్త్రిగై కొనెన్'*

ఉర్లాము జమీందారిణి కందుకూరు మహాలక్ష్మమ్మగారు పండితుల సన్నిధిని పంచకావ్యములు చదివిన విదుషీమణి. విజయనగర పండితులు తర్క వేదాంతనిధి కూరెళ్ళ సూర్యనారాయణశాస్త్రిగారిని ఉర్లాము రప్పించి వారియొద్ద మహాలక్ష్మమ్మగారు సంస్కృతమున దృఢమైన వ్యుత్పత్తిని సంపాదించిరి.

మహాలక్ష్మమ్మగారి ఆస్థాన విద్వత్కవులు చాగంటి సీతయ్యశాస్త్రులు గారు. వీరు భళ్ళమూడి లక్ష్మణశాస్త్రి శిష్యులు; బంకుపల్లి మల్లయ్యశాస్త్రికి సతీర్థ్యులు. వీరు రచించిన శ్రీ పురాతన శంకరవచనములు అను గ్రంథము

*కల్పలతపత్రిక, విశాఖపట్టణము, 1921 మార్చి, పు. 15.

శైవవాఙ్మయము నందొక విశిష్ట స్థానము కలది. శంకరవిన్నపములని వీనికి నామాంతరము. శంకర వచనార్థ సర్వస్వమను అష్టోత్తరశతసంఖ్యాకములగు పద్యావళితో కూడినది. వీని మూలకర్త శంకరయతీంద్రులఁట: 'రక్షింపవే భవానీ మనోహరా' యను మకుటముగల వచనము. ఈ వచనసారముకల పద్య మొకటి దీని కనుబంధముగా సంధానితమగుచుండును. ప్రతివచనమును నానావిధ శైవపురాణగాథలతోడను, బహువిధ లోకోక్తులతోడను నిండి యుండును. మచ్చున కొకటి రెండు పద్యములు :

'నటజనశేఖరుండ వని నమ్ముచు నేనొక నర్తకుండనై
పటు భవరంగభూమి నతిభంగుర జన్మసమాఖ్య వేషముల్
దిటముగఁదాల్చి నీకు బహులీలల మోదముజేయుచుంటి న
న్నెటు దయఁజూచి కట్నములనేమి యొసంగెదొ చంద్రశేఖరా !'—66.

మఱియొక పద్యము :

'తొల్లి గిరీంద్రకన్యకను దోడ్కొని భక్తులతోడ శాంబరీ
భిల్లత నొంది యాశ్రమము భీతిల పందినిఁ గూలనేసి నీ
కెల్లిదమైతిమే యనుచు నేఁచి నినుం దెగటార్చనెంచు నా
మల్లుని నర్జునుం దివిజమాన్య నిజాస్త్రమునిచ్చి గావవే !' —76.

ప్రసిద్ధులు తిరుపతి వేంకట కవులు ఉర్లాము సంస్థానమును దర్శించి నపుడు మహాలక్ష్మమ్మగారిని ప్రశంసించుచుఁ జెప్పిన పద్యములు :

'శ్రీవయ్యున్ గడువాసిఁ జెన్నలరి కాశీసేతు మధ్యస్థ వి
ద్యావంతుల్ నుతియించు కీర్తిఁగను నీ యౌన్నత్యమున్ విన్నచో
నేవారే శిరసావహింతు, రిదియేమీ క్రొత్తయే, మున్ను శ్రీ
దేవిన్ విన్నదిలేదొ రాణిఁగనమో, శ్రీల్గారె లక్ష్మ్యంబికా !'[1]

'శ్రీ పరిపాలనమ్ముగల చిన్న జమీనులుఁ బెద్దచోట్ల నె
న్నో పరికించి చూచితిమి, యొక్కెడ నిక్కడ గల్గినంత వి
ద్యాపరిశీలనంబు, మఱి దాతృతయుంగనఁబోల దింతయున్
శ్రీపతి సాక్షి, నిక్క, మిటు చెప్పుట మీ స్తుతిగాదు, లక్ష్మమా !'[2]

మహాలక్ష్మమ్మగారి తరువాత సంస్థానము కందుకూరి సన్యాసిరాజుగారి కుమారులగు బాలసూర్య ప్రసాదరావు, లక్ష్మీప్రసాదరావుగారలకు దఖలు పడినది. ఈ సోదరు లిరువురును సాహితీపోషణ విషయమున అహమహమికతో నడుగువేసినవారు. వీరి పూర్వులు '...కావ్యకలనా కర్తృత్వ భర్తృత్వ శోభనులై పండిత మండల ప్రణుత శుంభత్ సప్తసంతాన సంజనితోద్యద్యశులై........' (శ్రీమత్ప్రసాదరాయ యశోవిలాసము, 1—23) శైవ బ్రాహ్మణ శ్రేష్ఠులై........

[1] నానారాజ సందర్శనము, ఉత్తరార్ధము, 107.

[2] పైది, 113.

ద్విజరక్ష పరతంత్ర చిత్తులయి యుర్విన్ బొల్చిరఁట' (పైది, 1–24).

'భవ్యమై సుకవిసంస్తవ్యమై వసుధ న్వ
రలు చెన్నబసవ పురాణవరము
పూతమై నవరసోపేతమై లోకవి
ఖ్యాతమై తగుఁ గువాలాశ్వచరిత
చిత్రమై త్రిజగత్పవిత్రమై మించు పం
చాక్షరీమంత్రమాహాత్మ్య సుకృతి
సత్యమై సజ్జనస్తుత్యమై నిత్యమై
దీపించు సత్యవతీపరిణయ
మలఘు శివలింగ సూర్యోదయాభిధాన
రమ్య సంస్కృత నాటకరాజము మఱి
ఎన్నియో గ్రంథములకు నధీశులై యు
దార యశమొందినా.... ...' (పైది, 1–25) రఁట వీరి కొలము

సాములు. కువలయాశ్వ చరిత్ర కృతిపతి కందుకూరి మల్లికార్జున మంత్రియును, పంచాక్షరీ మంత్ర మాహాత్మ్యమును* గృతివడసిన కందుకూరి వీరేశలింగమంత్రియును, సత్యవతీపరిణయము నంకితమొందిన కందుకూరి బసవరాజుగారును, అత్తలూరి పాపకవి రచితమగు అయిదాశ్వాసముల చెన్నబసవ పురాణ మను పద్యకావ్యమును కృతిగొన్న కందుకూరి అమృతలింగముగారును, ఉర్లాము సంస్థానాధీశ్వరులకు మూలపురుషులఁట: బసవరాజు మేనల్లుఁడగు బుద్ధిరాజు వీరనయే సత్యవతీపరిణయకర్త. చెన్నబసవపురాణ కృతిభర్త అమృత లింగముగారి పెదతండ్రియైన సాహవపతి ఢిల్లీశ్వరుల మెప్పులనందిన మేటియఁట !†

ఇట్టి విశిష్టగుణపరిపుష్టులగువారి సంతతికి చెందిన దేవిడి సంస్థానాధిపతులు ఇజ్జితాసార్ శ్రీ కందుకూరి బాలసూర్య ప్రసాదరావు బహద్దరుగారు తామును సకలసంపదలను ఘటించు నొక కృతి నంకితముగొనఁదలఁచి —

'....ఒక దండ పండితప్రకరమ్ము పరమార్థ
బహుశాస్త్ర రీతులుపన్యసింప

*పంచాక్షరీమంత్ర మాహాత్మ్యమను లఘుకృతి అసమగ్ర ప్రతి యొకటి మదరాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయమున డి. నెంబరు 2117గా నున్నది. ప్రతిచరణాంతమున 'పంచాక్షరి' యను పద మావృత్తియగునటులు రచితమైన దెబ్బదిపంక్తుల రచనమిది, స్త్రీ బాలవృద్ధులకు పారాయణయోగ్యము. దీనికర్తృత్వమవిజ్ఞాతమని పరిష్కర్తల యభిప్రాయము. చూ. Bulletin of the Oriental Manuscripts Library, Madras, Vol. XIII, No. 1, 1960, pp. 82–88

†ఆంధ్రకవుల చరిత్రము, తృతీయభాగము, పుటలు 1661-70.

నొకచెంత సత్కవినికరంబు లత్యంత
సరసకవిత్వ వైఖరులు నెఱప....
దేవిడీనామ సంస్థాన దివ్య భవ్య
పీఠికాసీనుఁడై కడుఁబెంపెలర్పు' —పైది, 1–17.

'....నేమాన కులోద్భవున్ గృతి హితున్ సూర్యప్రకాశాహ్వయున్
ఘనకీర్తిన్ బిలిపించి గౌరవము సత్కారంబు గావింపుచున్'
—పైది, 1–18.

తన యభీష్టమును కవి కెఱిఁగించి సజ్జనప్రశస్తిని గాంచిన లోకోక్తిసమితిని –

'సరసోక్తుల్ సెలువొంద నంచిత కథాసందర్భమింపొంద ను
ర్వర సత్కావ్యరసజ్ఞులైన కవు లౌరా యంచు నగ్గింప భా
స్వర పద్యావళియం దిమిడ్చి తుద నస్మన్నామ సంబోధన
స్ఫురణం బొప్ప రచింపు....'—(పైది, 1–29) మని కోరిరఁట! ఇది

వాస్తవముగాఁ గృతికర్త సంభావించినట్లు నవీనకృతియే.

'కవితాతత్త్వ మెఱింగిన
యవనీశ్వరచంద్రు నిస్తులాస్థానమునన్
గవియై యుండుటకన్నన్
బ్రవిమల భాగ్యంబు గలదె పండితున కిలన్' —పైది, 1–35.

అని కవి తన యదృష్టమును బొగడికొనినాఁడు.

బాలసూర్యప్రసాదరావుగారు పేరుపొందిన కృతికర్తకూడ. ఈ కృతి నామము 'శ్రీ మత్ప్రసాదరాయ యశోవిలాస మను ఆంధ్రలోకోక్తి ముక్తావళి'. కృతికర్త కవిరాజబిరుద విరాజితుఁడు; నిశ్శంక మహీపాల చరిత, ధన్వంతరి క్షేత్ర మాహాత్మ్య, వాసంతికా వసంతాహ్వయాది కావ్యకర్త.

భారతరామాయణాది పురాతన కావ్యవీథులలోని కథాఘట్టముల నుదాహరించుచు తత్తదుచితములగు లోకోక్తులను వాని కనుసంధానించుచు ప్రసాదరాయ భూపాలముద్రతోఁ గూర్పఁబడిన పద్యముక్తావళి యీ కృతి. మాదిరికిఁ గొన్ని పద్యములు :

'రాజ్య మొసంగ నేను, సమరంబొనరించి జయించి లోక సం
పూజ్యుఁడ నౌదునంచుఁ గురుభూపతి పల్కె సమీరపుత్ర! సా
మ్రాజ్యము లేదు మీ కిఁక నరణ్యమె పొమ్మని కృష్ణుఁ డగ్నియం
దాజ్యము వోసినట్లు పరిహాసమొనర్చెఁ బ్రసాదభూవరా'. —2–5.

'అల దశకంఠుఁ డుగ్రుఁడయి యంగద! ఛీ! నలుసంత లేవు నీ
కాలఁదికి వచ్చినట్టి పలుకూఁతలు గూయుచు లేనిపోని శ
క్తులు ప్రకటించి మా కిపుడు గూర్చితి కోపము, గ్రుద్దువచ్చి పి
ల్లల బెదరించినట్లని చలంబునఁ బల్కెఁ బ్రసాద భూవరా' —3–45.

'వాటము దప్పెఁ, బాండవులు వచ్చిరి, పౌరుష ముజ్జగించి యి
చ్చోట నడంగి తేల, తలచూపుము కౌరవరాజ ! యయ్యయో
ఁోట శిరంబు బెట్టియును రోకటిపోటున కోడనౌనె, జా
గేటికి లెమ్ము, రమ్మని యుపేంద్రుఁడు వల్కెఁ బ్రసాద భూవరా'.

—4—45.

బాలసూర్యప్రసాదరావుగారి మఱియొక యాస్థానకవి వడ్లమాని లక్ష్మీ నృసింహశాస్త్రిగారు. వీరు దేవాది సంస్థానాధీశ్వరులవెంట దక్షిణదేశయాత్రల కేఁగి, యీ యాత్రావిశేషములను సంస్కృతమున శ్లోకరూపమున రూపొందించినారు. ఈ కృతి 'చెన్నపురి రాజధానీ భూమశకట తీర్థయాత్రా చరిత్రమ్' అను పేర ప్రచురితమైనది. ఇందు బాలసూర్యప్రసాదరావుగారు ఇట్లు వర్ణింపఁబడినారు :

'చాణక్యః ఖలు నీతిశాస్త్ర విషయే సుగ్రీవ ఆజ్ఞావిధౌ
సాముద్రీక సులక్షణాంకిత తను ర్లోకజ్ఞ చూడామణిః
జ్యోతిశ్శాస్త్ర నిధిః సహస్రనయనో భూపాలనే సర్వథా
కావ్యాలంకరణాదిషు ప్రథిత ధీ ర్వేదాంత విద్యాపరః'

బాలసూర్యప్రసాదరావుగారు మంచి పండితులు. వీరు తెలుఁగునఁ గూర్చిన ఆంధ్రవిజ్ఞాన మను ఏడుసంపుటముల విజ్ఞానసర్వస్వము పండితలోకప్రసిద్ధమైనది. ఈ యాంధ్రవిజ్ఞానము ఏడు సంపుటములును అనుబంధముతో కలిసి యించుమించు నాలుగువేల పుటల బృహత్కోశము. దీనికాంగ్లమున కట్టమంచి రామలింగారెడ్డిగారు పీఠికవ్రాసిరి. శ్రీ రెడ్డిగారు ఈ యాంధ్ర విజ్ఞానమును బ్రశంసించుచు దీనిని 'బాలసూర్యప్రసాద ఆంధ్రవిజ్ఞాన సంహిత' యని వ్యవహరించుట యుచితమని సూచించిరి. సోమవారవ్రత మాహాత్మ్య కథాత్మకమగు సీమంతినీపరిణయము, శ్రీనాథుని వీథిని బోలిన వీథినాటకము, శృంగారాత్మకమగు మాతులసుతోద్వాహము, మూఢవిశ్వాసములమీఁది ప్రహసనమగు ప్రబోధము, ఆంధ్రవిజ్ఞానానుబంధమగు సాంఖ్యాదర్శము మున్నగునవి వీరి యితర కృతులు.

దేవిడిసంస్థానాధిపతులు బాలసూర్యప్రసాదరావుగారు గంటి సూర్యనారాయణశాస్త్రిగారి సంపాదకత్వమున విజయనగరమునుండి వెలువడుచుండిన 'కల్యాణి' యను సాహిత్య మాసపత్రికకు మహారాజపోషకులుగాను, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారి ఆర్యభారతీ గ్రంథమాలిక (పరశువాకం, మద్రాసు) కును, రాజమహేంద్రవరము ఆంధ్రేతిహాస పరిశోధకమండలివారి కళింగదేశ సంపుటమునకును రాజపోషకులుగా నుండిరి. వీరు కళింగమండలము నందలి గ్రంథాలయోద్యమమునందు ప్రధానపాత్రము వహించుచుండిరి. బారువాపట్టణములో జరిగిన గంజాముమండల తృతీయ గ్రంథాలయ మహాసభ

కగ్రాసనాధిపతులుగా వీ రొసంగిన యుపన్యాసము చిన్నపుస్తకము రూపమున నచ్చొత్తింపఁబడినది. మాతృభాషాభివృద్ధి, విద్యాప్రశస్తి, సద్గ్రంథ పఠనము, గ్రంథాలయముల ప్రాముఖ్యము మున్నగు ననేకాంశము లిందు నిరూపింపఁ బడినవి. వీరు 'కల్యాణి' మొదలగు సాహిత్యపత్రికలలో తఱచుగా సాహిత్య వ్యాసములు వ్రాయుచుండెడివారు. విశాఖపట్టణమునందలి 'సెంచరీ క్లబ్బు'నకు వీరు భూరిగా విరాళ మిచ్చుటచే ఆ క్లబ్బు వీరిపేర నేఁటికిని వెలయుచున్నది.

శ్రీ బాలసూర్యప్రసాదరావుగారి తమ్ములగు లక్ష్మీప్రసాదరావుగారు ఉర్లామసంస్థాన పాలకులు. కాకినాడ ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాలకు ప్రధాన రాజపోషకులు. వీరి యాస్థానకవి పేరి కాశీనాథాచార్యుఁడు. ఈ కవి రచించిన 'శ్రీ మదాంధ్ర శారీరక భాష్య సహిత పత్యాషప్రబోధ మననము' బ్రహ్మ సూత్రములను విషయవాక్యములుగఁగూర్చి వాని యర్థమును వివరించు శంకర భాష్యమున కాంధ్రీకరణము. ముముక్షువుల యుపయోగార్థ మాంధ్రభాషయందు సులభబోధార్థము వ్యాఖ్యానింపఁబడినది. కవి పేరివంశీయుఁడు, గౌతమ సగోత్రజాతుఁడు, మహోపాధ్యాయ పేరి వేంకటశాస్త్రి పుత్రుఁడు. కావ్యావతారికయందు కవి కృతిభర్తయగు లక్ష్మీప్రసాదరాయల నిట్లు భూషించినాఁడు :

'తులనాతీతుఁడు, కందుకహరిదుల పాథోరాశి గాకానిశా
లలనాకాంతుఁడు, సజ్జనాశ్రయుండు, శ్రీ లక్ష్మీప్రసాదావనీ
తలనాథుండు, కృపారసంబునఁ గడుంద్రవ్యంబు వెచ్చించి భూ
రి లసత్కీర్తి చెలంగఁ దత్కృతిని ముద్రింపించుచుండెందగన్'.

కొంతి భద్రాద్రిరామశాస్త్రి కైసేసిన 'శ్రావణమహోత్సవ తారావళి'యు పేర్కొనఁదగినది.

ఉర్లామసంస్థానమునకు చెందిన బి. ఈశ్వరప్ప పంతులుగారు 'కలియుగ మాహాత్మ్యము', 'లౌకిక వైదిక సంవాదము', 'గ్రామ నగర నివాస తారతమ్యము' మొదలగు విషయములను పరిహాసజనకముగా సంవాదపక్కిని గద్యరూపమునను, 'ఇళా మాధవ విలాసము', 'స్త్రీవిద్యా సమర్థనము', 'స్త్రీపునర్వివాహ విషయము' మున్నగు నంశములను బద్యరూపమునను సంపుటీకరించి 'చమత్కార రత్నాకర' మను పేర ప్రకటించియున్నారు.

## ఉపజీవ్య గ్రంథసూచి


1. విశాఖపట్టణముజిల్లా వృత్తాంతసంగ్రహము.
2. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, శ్రీకృష్ణ స్వీయచరిత్రము, పుటలు 70–75.
3. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, ఆంధ్రాభ్యుదయము, తృతీయా. 158–167.

4. అనంతపంతుల రామలింగస్వామి, శ్రీకృష్ణ కవిజీవితము, 1965, పుటలు 115–122.

5. తిరుపతి వేంకటకవులు, నానారాజ సందర్శనము, పుటలు 110—113.

6. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, కథలు - గాథలు, 1, పుటలు 369, 370.

7. వంగూరి సుబ్బారావు, ఆంధ్ర వాఙ్మయ చరిత్రము, పు. 111.

8. మంత్రిప్రెగ్గడ భుజంగరావు, హైమవతీ పరిణయము.

9. తెలుగువిజ్ఞాన సర్వస్వము, సంపుటము 3.

10. Encyclopaedia of the Madras Presidency and the Adjacent States, Madras, 1920-21, pp. 373, 374.

# కపిలేశ్వరపురము-కేసనకుఱ్ఱు

## ప్రవేశిక

ఈ యెస్టేటులు శాశ్వతకర నిర్ణయమునాఁటికి మఱియొకరి స్వాధీనములో నుండినవి. మొట్టమొదట పెద్దాపురము సంస్థానమునందలి తేకి, తాణేలంక ముఠాల లోని భాగము లీయెస్టేటులు. 1818లో కపిలేశ్వరపురము ఎస్టేటు నేఁటి కపిలేశ్వర పురము జమీందారుల పూర్వులచే ఖరీదుచేయఁబడినది. దీనిలో కేదారిలంక, నారాయణలంక, బోళ్ళంక, వాడపాలెము, వీధివారిలంక యను నయిదు శివారు గ్రామము లుండెడివి. కపిలేశ్వరపురము క్రయధనము రూ.99,463లు. పేష్కషు రూ. 8,523 లు. 1874లో దీని ఆదాయము రూ. 19,255 లు. 1936లో ఆదాయము రూ. 75,335 లు. 1852లో ఆఱు గ్రామములు కలిగిన కేసనకుఱ్ఱు ఎస్టేటును ఖరీదుచేసిరి. ఇందు అన్నంపల్లి, కేసనకుఱ్ఱు, కొండకుదురు, గాడి లంక, తిళ్ళకుప్ప, మురుమళ్ళ అను గ్రామములుండినవి. కేసనకుఱ్ఱు ఎస్టేటు పేష్కషు రూ. 11,311లు. 1874లో దీని రాఁబడి రూ. 18,430లు. 1936లో రాఁబడి రూ. 34,340లు*. 1916లో హసన్‌బాదా గ్రామము చేర్పఁబడినది. తూర్పు గోదావరిమండలములోని దక్షారామమునకు నాలుగు కోసుల దూరమున కపిలేశ్వరపురమున్నది, 'జబ్దతుల్ అక్రాన్' ఈ జమీందారుల బిరుదు.

## సంస్థాన చరిత్రము

ఈ సంస్థాన పాలకులు కమ్మవారు. వీరి గృహనామము 'బలుసు'వారు, 'ఏరువాకల' అనునది వీరి గోత్రనామము. మొదటి నాగినీఁడు, బిక్కనీఁడు, ఇమ్మడి నాగినీఁడు వీరి మూలపురుషులు. బుచ్చయ్యగారి కుమారులగు బలుసు పెదసర్వారాయఁడుగారు మొదటి సంస్థానసంపాదకులు. 1818లో ఉప్పలపాటి రామరాజుగారినుండి కపిలేశ్వరపురమును కొనిరి. వీరు దేవబ్రాహ్మణ భక్తితత్పరులు; ఆలయారామ తటాకాది నిర్మాతలు. ఈయన 1847లో చనిపోఁగా వీరి కుమారులు బుచ్చి కృష్ణయ్యగారు జమీకి వచ్చిరి. వీరు 1852లో కేసనకుఱ్ఱు ఎస్టేటును దంతులూరి విజయగోపాలరాజుగారి ద్వితీయ పుత్రులగు బుచ్చి కృష్ణమరాజుగారి యొద్దనుండి విక్రయించికొనిరి. ఇతఁడుకూడ బ్రాహ్మణ పూజా తత్పరుఁడు; బ్రాహ్మణులకు సమారాధనలు చేయుచు, వర్షాశనముల నిచ్చుచు, దేవతారాధనలు సల్పుచు మంచి పేరును సంపాదించి 1853లో

*జమీందారీకమిటీ రిపోర్టు, పు. 175.

పరిపాలించిరి. వీరికి పిమ్మట వీరి సోదరులగు పట్టాభిరామయ్యగారు పాలకు లైరి. వీరు సత్కాలక్షేపములందు నిమగ్నులై 1866 వరకు పాలించిరి. [illegible]లో బుచ్చి కృష్ణయ్యగారి కుమారులగు బుచ్చి సర్వారాయఁడుగారు జమీ పాలనమును స్వీకరించి మూఁడేండ్లు మాత్రమే పరిపాలించి అకాలమరణము నొందఁగా సంస్థానము కోర్ట్ ఆఫ్ వార్డ్స్ పరమైనది. పిమ్మట జమీ, సర్వా రాయఁడుగారి సతీమణి రామలక్ష్మమ్మగారి చేతికి వచ్చినది. ఈమె 40 వేల రూపాయలు ఖర్చుపెట్టి గొప్ప సత్రమును కట్టించిరి. ఈమె మైనారిటీలోనే భర్త చనిపోయినందునను, కుమారులు లేనందునను సమీపజ్ఞాతులు సంస్థానపు హక్కునకై దావాతెచ్చిరి. వ్యాజ్యము ప్రీవీకౌన్సిలుదాఁక పోయినది. సర్వా రాయఁడుగారి విధంతువగు రామలక్ష్మమ్మగారికి దత్తతాధికారము కలదని ప్రీవీ కౌన్సిలువారు తీర్పుచెప్పిరి. ఈమె దత్తపుత్రుఁడు పట్టాభిరామయ్య (1870–1896). సంస్థానసంపాదకులగు పెదసర్వారాయఁడుగారి పినతండ్రియగు అచ్చయ్యగారి రెండవ కుమారులైన చినతిమ్మయ్యగారి పౌత్రుఁడగు సర్వారాయఁడుగారి పుత్రుఁడీ పట్టాభిరామయ్య. వీరి కిరువురు కుమారులు. ఈయన 1896లో దివంగతులైరి. పసికందుల మైనారిటీలో సయితము వీరి పితామహి రామ లక్ష్మమ్మగారే జమీని పాలించిరి. 1906లో ఈమె మరణింపఁగా మనుమఁడగు బుచ్చి సర్వారాయఁడు బహద్దరువారికి జమీ సంక్రమించినది. కాని ఆనాఁటికి వీరు మైనరైనందున మైనారిటీకాలములో తల్లియగు జానకమ్మగారు సంస్థాన వ్యవహారములను పర్యవేక్షించిరి. ప్రాజ్ఞతవచ్చిన బుచ్చి సర్వారాయఁడుబహ ద్దరుగారు [illegible]లో జమీ పాలనమును స్వీకరించిరి. ఈయన బందరు నవాబగు [illegible] వాహపల్లీఖానుబహద్దరు యింతిజారుజంగు కుమారుల [illegible]లో హసన్‌బాదా గ్రామమును 2 లక్షలకు కొని జమీలో కలిపి సంస్థానమును విస్తరింపఁజేసిరి. వీరు తూర్పుగోదావరి జిల్లాబోర్డు అధ్యక్షులుగా, [illegible] ఆఫీసరుగా పేరుపొందినవారు. 1945లో బ్రిటిష్ ప్రభుత్వమువారు వీరికి 'రావు బహద్దర్' బిరుదమునిచ్చి గౌరవించిరి. వీరి కుమారులు ప్రభాకర పట్టాభిరామారావు, వెంకటాచలపతిరావు, సత్యనారాయణరావు మొదలగు వారు. పట్టాభిరామారావుగారు ఉన్నతవిద్యా పట్టభద్రులు. మద్రాసు రాష్ట్రము నందును, ఆంధ్ర రాష్ట్రమునందును మంత్రిగా పనిచేసినవారు. ఆంధ్ర విశ్వవిద్యాలయము సిండికేటు సభ్యులుగాను, ప్రో ఛాన్సలర్‌గాను ఉండిరి. [illegible] యూదేపల్లి వాస్తవ్యులు రాజావాసిరెడ్డి చూడామాణిక్యప్రసాదరావు [illegible]బహద్దరుగారి పుత్రిక కనకరాజేశ్వరమ్మ వీరి భార్య. రాజావాసిరెడ్డి వెంకటాద్రినాయని మొదటి దత్తపుత్రులగు జగన్నాథబాబుగారి జనకసోదరులగు [illegible]గారికి చూడామాణిక్య ప్రసాదుగారు ప్రపౌత్రులు; చల్లపల్లి రాజా [illegible] మల్లికార్జుననాయఁడుగారికి అల్లుఁరు. చండి సంస్థానములోఁ

చేరియుండిన చెరుకూరు గ్రామమును మల్లికార్జుననాయఁడుగారు కొని తమ తనయయగు త్రిపురసుందరమ్మగారికి అరణముగా నిచ్చియుండిరి. సత్యనారాయణరావుగారు ప్రస్తుతము తూర్పుగోదావరి జిల్లాపరిషత్తు అధ్యక్షులు. కొంత కాలము ఆంధ్రవిశ్వవిద్యాలయ సెనేట్ సభ్యులు.

## సాహిత్యపోషణము

సంస్థానస్థాపకులగు పెదసర్వారాయఁడుగారు బ్రాహ్మణులకు, బట్రాజులకు భూములను, గోవులను దానములనిచ్చుచు వచ్చిరంటగాని సాహిత్యసేవా సంబంధములైన వివరము లేవియును అందిరాలేదు. వీరి కుమారులగు పట్టాభిరామయ్యగారు పండితగోష్ఠిలో కాలము గడపినట్లు వమ్మవారి చరిత్రము తెలుపుచున్నది గాని ఆ వివరము లేవియు తెలియవు.

పట్టాభిరామయ్య (1870–1896) గారు వీణావాదనమున మంచి నేర్పరియఁట. వీరు కొంతకాల మొక పక్షపత్రికను నిర్వహించిరఁట। 1908లో జమీపాలనమును స్వీకరించిన బుచ్చి సర్వారాయఁడు బహద్దరుగారు దేశభాషాభిమానులు, కవితాప్రియులు, సాహిత్యపోషకులు. వీరు కపిలేశ్వరపురమున పది వేల ధనముతో ఉన్నతపాఠశాలను స్థాపించిరి, ఇంకను ప్రజోపయోగకరములైన పనులను చేయించిరి. వీరు విమర్శాదర్శకులగు నడకుదుటి వీరరాజ పంతులుగారి పీఠికాపరిష్కారములతో చింతలపూఁడి యెల్లనార్యుని రాధామాధవ ప్రబంధమును*, విష్ణుమాయా విలాస నాటకమును ముద్రింపించిరి. 'పూర్వకవి విరచితములై, కాలగర్భమున దాఁగియున్న ఆంధ్రప్రబంధములఁగొన్నింటి నైనను యథాశక్తిని బ్రకటింపవలయునను నుద్దేశము....' గల శ్రీబుచ్చి సర్వారాయఁడుగారికి రాధామాధవ కృతి తాళపత్ర మాతృక లభ్యముకాఁగా, దానికి ప్రతులువ్రాయించి శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి, ఓలేటి వేంకటరామశాస్త్రి గారలచేత పరిష్కరింపించిరి. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి విపులమైన పీఠికతో కందుకూరి రుద్రకవి రచితమగు సుగ్రీవవిజయ యక్షగానమును బ్రకటించిరి. దుర్గేశనందిని, రాధారాణి, విశ్వప్రయత్నము, నవాబునందిని, హిందూ లా—మొదలగు గ్రంథములను రచించి ప్రకటించిన చాగంటి శేషయ్యగారు వీరి యాస్థానోద్యోగులు. బుచ్చి సర్వారాయఁడుగారి గ్రంథాలయము ఆంధ్రదేశ సంస్థానాధీశ్వరుల ఉత్తమ గ్రంథాలయములలో ప్రథమశ్రేణికి చెందినది. ముద్రితాముద్రిత సంస్కృతాంధ్ర గ్రంథములు కొన్నివేలు కపిలేశ్వరపురాధి నాయకుల గ్రంథాలయమున నేఁటికిని చెక్కుచెదరకుండ నున్నవి. తాళపత్ర గ్రంథములను వివిధ సీమలనుండి వ్యయప్రయాసములకు లెక్కింపక బుచ్చి సర్వారాయఁడు

*గాడిచెర్ల హరిసర్వోత్తమరావు, చింతలపూఁడి యెల్లనార్యకవి, గ్రంథాలయ సర్వస్వము, సంపుటి 11, సంచిక 2, పుటలు 59, 60.

గారు సేకరించి భద్రపఱిచి యుంచిరి. ఇట్టి ఉత్తమ గ్రంథాలయము అందు బాటులో నుండుటవలననే చాగంటి శేషయ్యగారు తలపెట్టిన 'ఆంధ్ర కవి తరంగిణి' రచనోద్యమము చాలవరకు సమగ్రముగా, శాస్త్రీయముగా కొనసాఁగుచు వచ్చినది. శేషయ్యగారు సరళ గ్రాంథికభాషలో సంధానించిన 'విశ్వ ప్రయత్నము' అను సాంఘిక నవల శ్రీ బుచ్చిసర్వారాయఁడుగారి కంకితము. శ్రీ సర్వారాయఁడుగారు హిందూధర్మశాస్త్ర గ్రంథనిలయము, కాకినాడలోని ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల మొదలగు గ్రంథప్రచురణ సంస్థలకు రాజపోషకులు.

బుచ్చిసర్వారాయఁడు బహద్దరుగారి కుమారులు శ్రీ ప్రభాకర పట్టాభి రామారావుగారు కూడ శ్రీ చాగంటి శేషయ్యగారి గ్రంథరచనోద్యమమునకుఁ దోడ్పడినవారు. ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనేట్ సిండికేట్ సభ్యులుగా, ప్రోఛాన్సలర్‌గా, విద్యాశాఖామాత్యులుగా వీరు విద్యారంగమునకు చేసినకృషి ప్రశంసనీయము. ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వమున విద్యాశాఖామాత్యులుగానుండి మన రాష్ట్రమునందు సాహిత్య అకాడమీ, సంగీత నాటక అకాడమీ మొదలగు సంస్థల అవతరణ వికాసములకు మూలకారకులైరి. హైదరాబాదునందలి ఆంధ్ర సారస్వత పరిషత్తు మొదలగు సాహిత్యసంస్థలు వీరి సమాదరణమున నభ్యుదయమును సాధించినవి.

వీరి సోదరులు శ్రీ సత్యనారాయణరావుగారు పట్టభద్రులు, విద్యాపోషకులు. పెద్దాపురమునందలి మహారాజ్ఞీ వత్సవాయ బుచ్చి సీతయ్యమ్మ కళాశాల పాలకసంఘాధ్యక్షులు.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. కొత్త భావయ్య చౌదరి, కమ్మవారి చరిత్రము, పుటలు 273–275.

2. కొమాండూరి శఠకోపాచార్యులు, జమీందారీ కమిటీ రిపోర్టు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘ ప్రచురణము, కాకినాడ ముద్రాక్షరశాల, కాకినాడ, 1939.

3. నడకుదుటి వీరరాజు, మునిపలుకు, శ్రీ రాధామాధవ ప్రబంధము.

4. K. Bhavaiah Chowdari, A Brief History of the Kammas, pp. 88, 89.

# కార్వేటినగరము

## ప్రవేశిక

ఇది పురాతనమయిన పదమూడి పాళయములలో నొకటి. తొండ మండలము, తుండీరమండలము అని ఈ ప్రాంతమునకు పూర్వవ్యవహారము. తూర్పు కనుమల చాలులో చిట్టడవులతో, చిఱుగుట్టలతో నిండిన ప్రదేశమిది. దీనికి దక్షిణ దిశయందును, వాయవ్య దిశయందును ఉత్తరార్కాడు తాలూకా యును, తూర్పు దిక్కున చెంగల్పట్టు మండలమును, ఈశాన్య దిశలో కాళహస్తి జమీందారీయును కలవు. కాళహస్తికి దాపుననున్న నారాయణవనము మొదటి రాజధాని. పిమ్మట కార్వేటినగర సంస్థాన పాలకుఁడగు మొదటి వెంకట పెరుమాళ్ళురాజు పాలనకాలము (క్రీ. శ. 1719—1732) లో కార్వేటినగర నిర్మాణము మొదలయి యతని సోదరపుత్త్రుఁడయిన వావేటిరాజు కాలమున ముగిసినది. నాఁటినుండి కార్వేటినగరము రాజధాని యయినది. దీనికి పశ్చిమమున నున్న ప్రాఁత శివాలయమునొద్ద 'నగరము' అను పేరుగల ఒక యూరుండెనఁట! ఇప్పుడూరున్నచోట 'కార్వేడు' అనునొక పల్లె యుండెనఁట! ఇది కార్వేడు కాఁబోలు! అడవిపల్లె యని దీని యర్థము. పల్లెగానున్న 'కార్వేడు' ప్రభువుల ప్రసాదమువలన పట్టణమయినది. ఆ పిమ్మట శివాలయమునొద్ద కాఁపురమున్న వారు సయితము మీపట్టణమునకే వచ్చి చేరినందున జనులీ రెండుపేళ్ళనుగలిపి 'కార్వేడు నగర' మని పిలువనారంభించిరఁట. అదియే కాలక్రమమున 'కార్వేటి నగరము' గా మాఱినదని కొందఱ యభిప్రాయము*. ఇది పుత్తూరునకు పడమరగా మూఁడు కోసుల దూరమున నున్నది. ఈ సంస్థానములోని నగరి, నారాయణవనము మున్నగు నదులు చాల చిన్నవి. వానల తతిలో పొంగిపొరలి తతిమ్మాకాలములో ఎండిపోవుచుండును. కొంత ఉత్తరార్కాడు మండలము లోను, కొంత చిత్తూరు మండలములోను నీ సంస్థానము వ్యాపించియుండినది. పుత్తూరు తాలూకాలో 542 చ.మై. ను, తిరుత్తణి తాలూకాలో 401 చ.మై. ను, మొత్తము 943 చ.మై. వైశాల్యము కలది యీ సంస్థానము. ఋణబాధల పాలయిన ఈ సంస్థానమునందలి 120 గ్రామములు విడదీసి 'చెట్టినాడు' అను జమీందారీ నొకదాని నేర్పఱిచిరి. కార్వేటినగర సంస్థానములోని కొంత భాగమును తిరుమల తిరుపతివారు విక్రయమునందు కొనిరి. దీనియందలి

*తిమ్మావజ్ఝల కోదండరామయ్య, కార్వేటినగర రాజుల కళాసాహిత్య పోషణ, ఆంధ్రప్రభ, ఆదివారము సంచిక, 1964 జూన్ 14.

మొత్తము గ్రామములు 792. తిరుత్తణి, పల్లిపట్టు, నారాయణవనము అని మూఁడు రెవిన్యూ విభాగములు. 1882 లో పేష్కషు 187 వేలు. సాలీనా ఆదాయము 1885 లో నించుమించుగా ఏడెనిమిది లక్షలు.

## సంస్థాన చరిత్రము

పూర్వమీ సంస్థాన మేదోయొకకోఁపకు చెందిన రెడ్లదఁట! వీరికి పూర్వ పాలకులు సాళువ వంశీయులు. ఉత్తర సర్కారులనుండి వచ్చిన క్షత్రియ వంశీయులగు మాకరాజు, బొప్పరాజు అనువారు ఈ సంస్థానాధిపతుల కొలువులో నుండిరఁట! మాకరాజు చిట్టచివరి రెడ్డిపాలకునొద్ద మంత్రిగానుండి ఆయన నిస్సంతుగా మరణింపఁగా పాలెమును కైవసము చేసికొనెనఁట! రెండవ శ్రీరంగరాయల (1614—1617) ప్రభుత నంగీకరింపని విజయనగర సామంతు లలో మాకరాజ నామకుఁడగు కార్వేటి నగరపాలకుఁడొకఁడు కలఁడు.* ఈ సోదరులిరువురును సంస్థాన విషయమున విశేషశ్రద్ధాసక్తులు ప్రదర్శించి నానాఁటికి విస్తరింపఁజేసిరఁట! వీరు సూర్యవంశ క్షత్రియులు. కరికాల చోడుఁడు వీరి మూలపురుషుఁడని చెప్పుదురు. కాళహస్తి ప్రభువులతోపాటు కార్వేటి నగరాధిపతులును చంద్రగిరి పాలకులకు సామంతులుగానుండి కప్పములు చెల్లించుచుండిరి. ఆపిమ్మట కర్ణాటక నవాబునుండి సంస్థానాధి పత్యమునకు సన్నదును సంపాదించి ఈ వంశీయులు సంస్థానమును పాలించుచు వచ్చిరి.

అక్కాఁటి కలిగినపుడు సేనలతో తోడ్పడు నిబంధనమీఁద కార్వేటి నగరా ధీశులు కర్ణాటకపు నవాబునకు సామంతులుగా నుండిరి. ఆనందరంగపిళ్లైతో మైత్రి నెఱపిన పాళయపుపట్టుదొరలలో మాకరాజువారు ముఖ్యులు[1]. కర్ణాటకపు నవాబు మహమ్మదాలీ తనయను ఒక పిల్లపాళయగాఁడు నిర్బంధించిన నేరమునకు నవాబు నానతిమీఁద కాళహస్తి—కార్వేటి నగరసంస్థానాధిపతు లిద్దఱును కలిసి యీ సాకుతో చిన్నచిన్న పాళయగాండ్ర నందఱ నోడించి వారి పాళయము లను తమ రాజ్యములలో చేర్చికొనిరి. ఈ సందర్భమున జరిగిన యుద్ధములను 'నత్తేరి' యుద్ధములని చరిత్రకారులు పేర్కొందురు.

కర్ణాటకపు నవాబుతో ఇంగ్లీషుకుంఫిణీవారు చేసికొనిన 1792 నాఁటి యొడంబడిక మేరకు పడమటి పాళయములన్నియును నవాబునకు ప్రతినిధులుగా గుర్తింపఁబడిన కుంఫిణీవారి పాలనముక్రిందికి వచ్చినవి. 1801 నాఁటి ఒడంబడిక ప్రకారము సంపూర్ణముగా నీ పాళయము లన్నియును కుంఫిణీవారికి దఖలు

*C.R. Srinivasachari, A History of Gingee and its Rulers, p. 138.

[1] కస్తూరి రంగకవి, ఆనందరంగరాట్ఛందము, పీఠిక, 114.

పడినవి. 1790—99 లలో కాళహస్తి, కార్వేటినగర సంస్థానాధిపతులు పరస్పరము కలహించుచుండుటచే దేశమున శాంతికి భంగము వాటిల్లుచుండినది. 1801 లో కుంఫిణీవారు రూపొందించిన సంధి నిబంధనల ప్రకారము ఈ రెండు సంస్థానములవారును తమతమ సైనికదళములను రద్దుచేసికొనిరి. అంతకుముందు వీరు విస్తారములగు సేనలను కలిగి పరస్పరము కలహించుచుండుటచేత ఈ సైనికదళములవలన ఎప్పుడో ఒకప్పుడు తమకును ముప్పుకలుగుననుభయము కుంఫిణీవారి కుండినది. సైనికదళములను రద్దుచేయుటవలన పరస్పర కలహములు మాసిపోయినవి; కుంఫిణీవారి భయమును అంతరించినది. 1802 లో కార్వేటినగర పాళయమువారికి జమీందారులుగా సన్నదులు ప్రసాదింపఁబడినవి. 19 వ శతాబ్ది మధ్యభాగమున రాజా కుమార వేంకట పెరుమాళ్ళరాజు బహద్దరుగారు కార్వేటినగరమును పాలించిరి. వీరు 1884 లో మరణించిరి. 1885 లో వీరి కుమారులు రాజా బొమ్మరాజు బహద్దరుగారు జమీకి వచ్చిరి. 1885 నాఁటికి ఈ జమీందారీ పుట్టెఁడప్పులలో మునిఁగియుండినది. ఆ పిమ్మట అప్పుసప్పులను తీర్చు నిమిత్తము జమీందారీలోని అనేకప్రాంతములు ఇతరుల కమ్మివేయవలసి వచ్చినది. ఇట్లమ్మివేయఁబడిన యొక భాగమునుండి ఏర్పడినదే 'చెట్టినాడు' జమీందారీ.

ఈ శతాబ్దారంభమున కార్వేటినగరము నేలిన తిరుమలరాజు బహద్దరుగారి పట్టపురాణి మట్లివారియాఁడుబిడ్డ. వీరి జ్యేష్ఠపుత్రులు కుమార వేంకట పెరుమాళ్ళరాజు. కార్వేటినగర రాజులలో కడపటివాఁడీ పెరుమాళ్ళరాజు. వీరితమ్ములు కుమారస్వామిరాజు శాసనసభా సభ్యులుగానుండి ఏడెనిమిదేండ్ల క్రితము పరమపదించిరి.*

## సాహిత్యపోషణము

కార్వేటినగర పాలకులు మధురసాహితీ సేవధులనియు, గానవిద్యానిధులనియు కవిపండితకోటివలన కైవారము లందినవారు. వీరు కళాపోషకులగుటయేకాక, స్వయముగా కళారాధకులు. సప్తసంతాన ప్రతిష్ఠాపకులు. వీరి ప్రాపుప్రోపులను బడసి కార్వేటి నగరము మొన్నమొన్నఁటిదాఁక కళలనగరముగా విలసిల్లినది.

'శబ్దతర్కాది శాస్త్రప్రసంగములఁ జె
 రెక్కెస విద్వాంసు లొక్కవంకఁ
ప్రాకృత మాగధ ప్రముఖ భాషలఁ గబ్బ
 మొనరించు కవిరాజు లొక్కవంక

*వేదము వేంకటకృష్ణశర్మ, తెలుగుచోళభూపతులు: మట్లసామంతులు, భారతి, 1960 మార్చి, పుటలు 17—24.

రామ భారతకథా ప్రస్తావపటిమఁ జె
న్నొందు పౌరాణికు లొక్కసంకి
గీతప్రబంధాది చాతురీ విస్ఫూర్తి
నొరవుమీఱినగాణ లొక్కపంక్తి ....'

వీరి యాస్థానము నలంకరించి, దానిని 'వర కవిరాజ [illegible]
విరాజిల్లఁ జేసిరఁట !

తమ ఆస్థానములలో అష్టదిగ్గజకవుల నుంచికొని [illegible]
దాయము రాయలయుగమునుండియు వాడుకలో [illegible]
సమ్రాట్టుల సత్సంప్రదాయములు సామంతకోటిలో [illegible]
కాదు. కార్వేటినగర సంస్థానమునను అష్టదిగ్గజకవి సంప్రదాయము [illegible]
బడినట్లు తెలియుచున్నది. సంస్థానపాలకుఁడగు మాకరాజు [illegible]
రాజు కాలమున అష్టదిగ్గజకవులు వెలసియుండిరఁట ! [illegible]
నారాయణకవి, పోలిపెద్ది వెంకటరాయఁడు, పాలమంగలము [illegible]
సారంగపాణి, శ్రీశైలకవి, ముదుంబ అప్పయాచార్యులు, [illegible]
వీరరాఘవకవి, అనంతరాజు సుబ్బరాయకవి....అను [illegible]
అష్టదిగ్గజకవులఁట !

ఈ సంస్థాన పాలకుల పూర్వులలో నొకరగు మాకరాజు [illegible]
తిరుమలరాజునకు (క్రి. శ. 1620) చదలువాడ మల్లన రచించిన [illegible]
చరిత్ర కృతి యీఁబడినది. తిరుమలరాజు తమ్ముఁడగు లక్ష్మీపతిరాజు '[illegible]
చరితము'ను గృతి నందినట్లు 'పరునఁ జెప్పించుకొనిరె [illegible]
మెలమి మాకయ లక్ష్మీపతీశ్వరుండు' అను మల్లన ప్రస్తావనమునఁ [illegible]
చున్నది. ఇదియు మల్లన కృతమే కాఁబోలు ! మల్లన తండ్రియగు [illegible]
పెక్కు కావ్యములు రాజాంకితములుగా సంతరించినట్లు [illegible]
అవతారిక పేర్కొనుచున్నది. కావ్యనామములు, కృతిభర్తల [illegible]
మాత్రము తెలియరాకున్నవి. 'కవిరాజ కంఠీరవ' బిరుదాంకితుఁడగు [illegible]
వేంకటాచలకవివరేణ్యుఁడాంధ్రీకరించినట్టి ఎనిమిదాశ్వాసములు [illegible]
రామాయణము వెల్లంటి కసవరాజున కంకితము. కసవరాజు [illegible]
పుత్త్రుఁడు. పదునెనిమిదవ శతాబ్ది పూర్వార్ధ మితని కాలము. [illegible]
'....హరిణాంకమౌళి కరుణాసముపాత్త రసప్రసాదపద్మనతర సంస్కృతాంధ్ర
కవితాధనుఁడు'.

'తరణి సమప్రతాపనిధి దామెర యక్కనృపాలుసన్నిధిన్
వరకవిగంధ సింధురమువచ్చెనటంచు, వచించువాని క్రొ
వ్వర గజరాజకేసరి నఁటంచుఁ బఠించితి వాఙ్మయవైఖరిన్
సరసులు మెచ్చ వాఙ్మఖవిశంకట వేంకటశైలసత్కవీ'

కవికృతము, కావేరిరాజున కంకితము. రామభద్రరాజు మొదలుగా కావేరిరాజు వరకుఁ గల ఈ రాజన్యుల వంశచరిత్రమిం దభివర్ణితము. టీకాకారులెవరో తెలియదు.

వాసుదేవయజ్వ తనయుఁడగు కచ్ఛపేశ్వర దీక్షితులు పరిచ్ఛేద త్రయ యుక్తమగు రామచంద్ర యశోభూషణ కర్త. ఇది ప్రతాపరుద్రీయమును బోలిన అలంకార గ్రంథము. కార్వేటి నగర పాలకుఁడగు బొమ్మరాజీతని పోషకుఁడు. కచ్ఛపేశ్వరదీక్షితుల పూర్వుఁడగు కాళహస్తీశ్వరయజ్వ సంస్కృత భాగవత పురాణ వ్యాఖ్యాత యఁట!

ముడుంబై వేంకటకృష్ణమాచార్యులు శ్రీవైష్ణవశాఖ వారు. శ్రీవత్స గోత్ర పవిత్రులు, వేంగళాంబా వేంకటరమణ కవుల పుత్రులు. తిరుత్తణి తాలుకాలోని నగరముగ్రామ వాస్తవ్యులు. క్రీ. శ. 1800 ప్రాంతము. కార్వేటి నగర సంస్థాన ప్రభువుల యాశ్రిత వర్గములోనివారు. అధ్యాత్మ రామాయణము, ద్విపదోత్తర రామాయణము, పోలేరమ్మ దండకము, శ్రీ రామస్తవ చూర్ణిక, 'కృష్ణా! దీనరక్షామణీ' యను మకుటముగల ఒక శతకము ఈయన కృతులు.

పోలిపెద్ది వేంకటరాయకవి కార్వేటి నగర ప్రభువులైన రాజా కుమార వేంకట పెరుమాళ్ళురాజు బహద్దరుగారి ఆస్థానమందలి విద్వత్కవి (క్రీ. శ. 1800–1875). ఈయన వేణుగోపాలస్వామి భక్తుఁడు. వేణుగోపాల శతకము, లావణ్య శతకము అను సీసపద్య శతకములను రచించెను. తిట్లదండక మొకటి యేతత్కవికృతము కలదఁట*!

వేంకటరాయకవికి సమకాలికుఁడగు అనంతరాజు సుబ్బరాయకవి (క్రీ. శ. 1825–1845) చిత్రకవితా ప్రియుఁడు. కార్వేటి నగరాధీశుల యాశ్రితుఁడు. సంస్థాన ప్రభువగు రాజా కుమార వేంకట పెరుమాళ్ళురాజు బహద్దరుగారి ప్రేరణమున నీ కవి సదాశివశతకమును రచించెనఁట!

ఇంచుమించుగా నీ కాలమునకే చెందిన గరుడాద్రి సుబ్రహ్మణ్యకవి 1864లో శత్రుఘ్నవిజయమను ప్రబంధమును సంధానించినాఁడు. మొదటి కుమారవెంకటపెరుమాళ్ళురాజు బహద్దరు సవతితమ్ముఁడయిన తిరుమలరాజునకీ గ్రంథ మంకితము. ఇది యముద్రితము.

పెరుమాళ్ళురాజు కుమారుఁడయిన బొమ్మరాజు కూడ కవితాప్రియుఁడు. ఇతఁడు కసవరాజున కేడవతరమువాఁడు. సంస్కృతమున సంతరింపఁబడిన పద్మావతీ పరిణయ మను చంపూప్రబంధమున కీ బొమ్మరాజు కృతిపతి. ఇది 1890లో కార్వేటినగరాధీశుల స్వకీయ శ్రీ భారతీలీలాసదన ముద్రాక్షరశాలలో బొమ్మరాజు నాజ్ఞ ననుసరించి ముద్రితము. కార్వేటినగరపాలకులు తమ

*రావూరి దొరసామిశర్మ, దండకవాఙ్మయము, ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక, హేమలంబ, 1957.

ముద్రాక్షరశాలలో అనేక గీర్వాణాంధ్ర భాషాగ్రంథములను ప్రచురించిరి. కోటిశ్రీరాయరఘునాథతొండమహీపాలుని సరసకృతియగు పార్వతీపరిణయ ప్రబంధము వీరిప్రచురణమే.

కార్వేటినగరాధీశులు సాహిత్యమునకేగాక సంగీత నాట్యములకుఁ గూడ సమప్రాధాన్యము నిచ్చి వానిని సయితము పెంపొందించినవారు. కురవి రామకవి సంతరించిన దశరూపకపద్ధతి యను 110 పద్యముల గీర్వాణకృతి నాట్యశాస్త్ర మర్యాదలను ప్రదర్శించునట్టిది. కువలయానంద విశ్వగుణాదర్శ చంపువుల కీతఁడు వ్యాఖ్యానములు రచించెనని వినికిడి. అనంతుని భారతచంపువునకు 'లాస్య' నామక వ్యాఖ్యాన మీతని రచనయే. ప్రసిద్ధ పదరచయితయగు సారంగ పాణికిని కార్వేటినగర సంస్థానమే పట్టుగొమ్మయని ప్రతీతి. నాయికానాయకుల సంభృత ప్రేమమున కాలవాలములు సారంగపాణి పదములు. వేణుగోపాల శతకకర్త యీసారంగపాణియే యనికొందఱ విశ్వాసము*. ఇతఁడు మాకరాజు కార్వేటిరాజు నాస్థానకవియఁట. కార్వేటిరాజు ప్రస్తావముకల మూఁడు శృంగార పదములను సారంగపాణి కృతములగువానిని తిమ్మావజ్ఝలవారు పేర్కొనినారు. గోవింద సామయ్య (1680–1710), కూవనయ్యలు కార్వేటినగర సంస్థానాస్థాన సంగీత విద్వాంసులు. వేంకటపెరుమాళ్ళురాజుచే సమ్మానితులు. కేదారగౌళ, నవరోజు, నాటకురంజి, మోహనరాగములలో సుప్రసిద్ధములైన చౌకవర్ణములను వీరు రచించిరి. గోవింద సామయ్య తెలుఁగుపదము లనేకము రచించెనఁట!

కార్వేటినగర సంస్థానామాత్యులగు కనవరాజు రామకృష్ణమరాజు (క్రీ. శ. 1810) విద్యావినోదములయందాదరము కలవాఁడఁట! ఆయన సాహిత్య సౌహిత్యమును నిరూపించు గాథలు కావ్యరసికప్రపంచమున ప్రపంచితములయి యున్నవి. వానిలోనొకటి: సంస్థానవిద్వత్కవి పాలమంగలము అప్పయకవి సాహితీగోష్ఠీసందర్భమున—'శరసంధానబలక్షమాది....' యను పెద్దన పద్యమును చదివి, దీనికి కృష్ణరాయలు నాలుగువేల వరాలిచ్చెనని చెప్పఁగా, రామకృష్ణమరాజుగారు 'పెద్దనవలె కవిత్వము చెప్పువారుకలరా', యని యడిగిరఁట! 'కృష్ణరాయలవలె నిచ్చువారున్నచో పెద్దనవలె కవిత్వము చెప్పువారు కల'రని అప్పయకవి అదరుబెదరుమాని జవాబు చెప్పెనఁట! దీనిని విని రాజసము మూర్తికట్టిన రామకృష్ణమరాజుగారు కొంత కోపముతో 'రాయలిచ్చినరీతి నిత్తుము, పెద్దనచెప్పిన పద్యమునుబోలిన పద్యమును జెప్పు వారినిఁజూపు'డని గద్దించిరఁట! అపు డప్పయకవి—

> 'వసుసంపత్తి, సువృత్తి, భూభృతి, దయావైదగ్ధ్యముల్ గల్గి మే
> ష సదుచ్ఛత్వ ఖగత్వ జాడ్య బుధశిక్షా చౌర్యముల్ మానినన్
> గసవక్ష్మాధర రామకృష్ణులను బల్కన్వచ్చు నీసాటిగాఁ

*రావికంటి కళావతి, కల్పలత పత్రిక, విశాఖపట్టణము, 1921, ఏప్రిల్, పు.11.

గగనక్షేత్రధర రామకృష్ణనృపతీ! కాంతామనోజాకృతీ!'

అని ఆశువుగా చదివెనఁట! ఇందలికల్పనా చమత్కృతిని, శిల్పసంపత్తిని రామకృష్ణమరాజు మెచ్చి, కవికి నన్నూఱు వరాలిచ్చి యాదరించెనఁట!* అప్పయ కవి యొనర్చిన గ్రంథములు మృగ్యములు.

కార్వేటినగర రాజబంధువులు రాజా బొప్పరాజు రామకృష్ణరాజుగారు సంగీతసాహిత్యముల సమానాసక్తికల సరసులు. కవితాపోషకులు. కొంత కాలము ఆంధ్రప్రదేశసంగీత నాటక అకాడమీ అధ్యక్షులు. చిరకాలముగా చిత్తూరు రామవిలాససభకు శాశ్వతోపాధ్యక్షులు; సభానాటకశాఖా పర్యవేక్షకులు.

*ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, 1911, పు. 51.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. నిడుదవోలు వేంకటరావు, ఆంధ్ర సంస్థానములు – సాహిత్యసేవ, తెలుగు విజ్ఞానసర్వస్వము, సంపుటము 3, పుటలు 1171–1175.

2. డా. దివాకర్ల వేంకటావధాని, తెలుగువిజ్ఞానసర్వస్వము, సంపుటము 6, విశ్వసాహితి, పు. 782.

3. తిమ్మావజ్ఝల కోదండరామయ్య, కార్వేటినగరరాజుల కళాసాహిత్య పోషణ, ఆంధ్రప్రభ, ఆదివారము సంచిక, 1964, జూన్, 14, 21, 28.

4. తిమ్మావజ్ఝల కోదండరామయ్య, కార్వేటినగర పాలకులు – కళాసాహిత్య పోషణ, ఆంధ్రప్రభ, ఆదివారము సంచిక, 1964, అక్టోబరు, 4.

5. Imperial Gazetteer, Provincial Series, Madras, p. 20.

6. M.A.M.P., I, p. 58, II pp. 294–301.

7. Imperial Gazetteer of India, Vol. XV, Oxford, New Edition, 1908, p. 64.

# కాళహస్తి

## ప్రవేశిక

ఇది పురాతనమైన సంస్థానములలో నొకటి. పూర్వపు తొండమండలము నందలి పొత్తపినాడులోనిది. కొంత నెల్లూరు మండలములోను, కొంత ఉత్తర ఆర్కాడుమండలములోను, కొంత చెంగల్పట్టుమండలములోను ఈసంస్థానము విస్తరించి యుండినది. ఈ జమీందారీలోని పామూరు విభాగము మాత్రము నెల్లూరు మండలములోనిది. ఉత్తర ఆర్కాడుమండలమునందు 406 గ్రామములు, చెంగల్పట్టు మండలమునందు 206 గ్రామములును, నెల్లూరు మండలము నందు 201 గ్రామములును మొత్తము 813 గ్రామములు ఈ సంస్థానమునందుండి నవి. వైశాల్యము 736 చ.మై. 1802లో పేష్కషు ఇంచుమించుగా 55వేల పూల వరహాలు. అనగా రూ. 190వేలు. సాలుసరి ఆదాయము 5 లక్షలు. రాజనివాసమగు కాళహస్తి నగరికొండల చాలున సువర్ణముఖినది కుడిగట్టున నెలకొనియున్నది. ఈ సంస్థానమునందు పాలారు, స్వర్ణముఖి ముఖ్యనదులు. 1920లో ఈ సంస్థానమునుంచి విడదీసి విక్రయింపఁగా నేర్పడినది పామూరు జమీందారీ.

## సంస్థాన చరిత్రము

సంస్థానపాలకులు వెలమతెగకు చెందినవారు. వీరిది ఇనగాల గోత్రము. వీరు ప్రాచీన కాలమునుండియు విజయనగరము చక్రవర్తుల మేని కావలివారుగా నుండినవారు. కామినేని రామానాయఁడు వీరి మూల పురుషుఁడని బోయల్ దొరగారి కథనము. ఇతఁడు కృష్ణదేవరాయలచేత ఈ ప్రాంతమున కధికారిగా నియమితుఁడఁట! విజయనగర రాజులకు వీరుచేసిన సేవలకు పారితోషికముగా నిది లభ్యమైనదఁట! వీరి సంతతిలో ముఖ్యుఁడు చెన్నప్ప. విజయనగర రాజ్య పతనానంతరము వీరు పరిసర సీమలపై దాడులు జరిపి సంస్థానమును నాలుగు చెఱఁగుల విస్తరింపఁజేసిరి. పదునేడవ శతాబ్ది మధ్యభాగమున వీరి రాజ్యము తూర్పున చెన్నపట్టణముదాఁక, దక్షిణమున కాంచీపురముదాఁక వ్యాపించి యుండినది. కాళహస్తి పాలకులలో నొకఁడైన దామెరల వెంకటాద్రి నాయఁడు గారినుండి ఇంగ్లీషు కుంఫిణీ అధికారియగు డే దొర మైలాపురమున కుత్తరముగ నేఁడు సెయింట్ జార్జికోట వెలసిన 'చెన్న కుప్పం' అను జాలరుల పల్లెపట్టును కొలునకు సంపాదించెను. ఈ దానము కాళహస్తి ప్రభువుల సార్వభౌముఁడగు

చంద్రగిరి పాలకునిచే సైతమ మామోదింపఁబడియుండినది. జింజిపాలకుఁడగు కృష్ణప్పనాయకుఁడు రాయలపై తిరుగఁబడినపుడు ఈ వెంకటాద్రియే రాయల సేనానిగా వెడలి కృష్ణప్పనోడించి, చెఱపట్టి కొంతకాలము జింజిదుర్గమును పాలించెను. ఈతనిసోదరుఁ డయ్యప్ప చెన్నపట్టణమునకు పడమటఁగల పూనమల్లిదేశమును పాలించినవాఁడు. పందవాసిసీమకూడ వెంకటాద్రినాయని పాలనములో నుండినది. కుంఫిణీ రికార్డులలో ముద్దు వెంకటప్పనాయకుఁడని, [illegible] పాలకుఁడని పరికీర్తితుఁడయిన వాఁడితఁడే।*

[illegible]లో వామర్ల తిమ్మానాయనింవారు ప్రసిద్ధులు. వీరి తనయులు కుమార వేంకటప్పనాయనివారు (1745–1795). వీరి కుమారులు తిమ్మానాయనింవారు. వీరి తనూజులు పెదవేంకటప్పనాయనింవారు. వీరి పుత్రులు తిమ్మానాయనింవారు. వేంకటప్ప వీరి కుమారులు. ముద్దువెంకటప్ప, తిమ్మానాయఁడు, చెన్నప్ప, రామానాయఁడు, శేషాచలపతి, చిన్నవెంకటప్పయని వేంకటప్ప కాఱుగురు కొడుకులు. వీరిలో ద్వితీయులగు తిమ్మానాయనింవారి కుమారులగు వేంకటలింగమనాయనింవారు చివరి పాలకులు.

జోసెఫ్ బోరగారి వ్రాఁతల ననుసరించి కాళహస్తి పాలకుల మూలపురుషుఁడగు యాచనేని రామానాయనికి మునిమనుమని మనుమఁడగు అయ్యప్పనాయఁడు గోలకొండ సుబాదారయిన అబ్దుల్‌హసన్ కోరికపై చుండి సుబాలోని [illegible] నేఁటి సుబావారు మన్ననలను సంపాదించినవాఁడు. ఇతని కొడుకు తాతానాయఁడు. తాతానాయని కుమారుఁడు శేఖరనాయఁడు. ఇతని కొడుకు [illegible]నాయఁడు. ఇతని కొడుకు ముత్తరాజు. ముత్తరాజు నాలుగవ కుమారుఁడు [illegible]నాయఁడు. ఇతని కొడుకు ముత్తరాజు. ఈ ముత్తరాజు కుమారుఁడు అంకప్ప. అంకప్ప కొడుకు ముత్తరాజు. ఇతని కొడుకు కుమార ముత్తరాజు. కుమారముత్తరాజు 1827లో మరణించెను. ఇతని కుమారుఁడు వీరవెంకటప్ప. ఇతని జ్యేష్ఠపుత్రుఁడు యాచనేని బంగారుముత్తరాజు 1842లో జమీకి వచ్చెను. ఇతఁడు 18[illegible]లో మరణింపఁగా కొడుకు బంగారు అంకప్పనాయనింగారు [illegible]. కాని ఈ కథనముతో కాళహస్తి జమీందారుల వంశవృక్షము సరిపడుటలేదు. కారణమును చరిత్రకారులు వివరింపవలసి యున్నది.

[illegible]నప్పు డయిదువేల సేనతో నవాబునకు తోడ్పడు నిబంధనపై [illegible] నవాబునకు సామంతుఁడుగా నుండ నియమించుచు మొగలు [illegible] జారీచేసిన సన్నదు కాళహస్తి ప్రభువంశీయుల యొద్దనున్న [illegible] కుంఫిణీవారి గవర్నరు డూప్లేవార దుబాసియగు ఆనందరంగ

*C. R. Srinivasachari, A History of Gingee and its Rulers, Annamalai University Publication, Annamalai Nagar, 1943, pp. 93-95.

పిళ్ళైతో మైత్రి నెఱపిన పాళయపుపట్టు ఏరలలో దామర్లవారుకూడ కలరు.* ఆర్కాడు నవాబు కొమార్తెను అవమానించిన నేరమునకుగాను నవాబు ఫర్మానా మేరకు కాళహస్తి పాలకులు, కార్వేటి నగరమువారితో కలిసి చుట్టుపట్లనున్న చిన్నచిన్న పాళయగాండ్ర నందఱ నోడించి వారి సీమలను తమ పాళయములకు దఖలుపఱిచికొనిరి. ఇరుగుపొరుగు పాలకులగుట వలన కాళహస్తి—కార్వేటి నగర పాలకులకు చాలకాలము పోరు జరుగుచుండినవి. సైనికబలము దృష్టిలో నిద్దఱును బలవంతులు. ఈ యదనున ఆర్కాడు నవాబుతో ఇంగ్లీషు కుంఫిణీ వారు చేసికొనిన ఒడంబడిక ప్రకారము కాళహస్తి సంస్థానము తక్కిన పడమటి పాళయములతోపాటు కుంఫిణీవారి పాలనముక్రిందికి వచ్చినది. కాళహస్తి, కార్వేటినగర సంస్థానపాలకుల పరస్పర యుద్ధములతో విసిగి వేసారిన కుంఫిణీ వారు 1801లో ఒక క్రొత్త యొడంబడిక నేర్పఱిచి దాని ప్రకారము ఈ రెండు సంస్థానముల సైనిక దళములను రద్దుచేసిరి. ఇట్లు 1801 నుండి కాళహస్తి సంస్థానము సంపూర్ణముగా కుంఫిణీవారి స్వాధీనమునకు వచ్చినది. 1802లో శాశ్వత పరిష్కారము జరిగి సన్నద్-ఇ-మిల్కియత్ ఇస్తిమిరార్ జారీచేయఁ బడినది. 1875లో కాళహస్తి జమీందారైన దామెర్ల కుమార వేంకటప్పనాయని గారికి రాజాబిరుదము ప్రసాదింపఁబడినది. 1876లో రాజాగారికి సి.ఎస్.ఐ. గౌరవము లభించినది. వీరి తరువాత కాళహస్తి జమీందారీని రాజా ముత్తు వెంకటప్పనాయని బహద్దరువారు, రాజా తిమ్మానాయనింబహద్దరువారు పాలించిరి. రాజా దామరల కుమార వేంకటలింగమనాయనింబహద్దరువారు చివరివారు.

విజయనగరాధీశులు వెంకటపతిరాయలతో, వెంకటగిరి సంస్థానాధిపతు లతో వీరికి వియ్యములుండినవి. బహుళాశ్వచరిత్ర కృతికర్తయగు వెంగళ భూపాలుని సవతియన్న చెన్నభూపతి. ఇతనిభార్య వెలుగోటి కస్తూరిరంగ నాయకుని కుమార్తెయును, వెలుగోటి బంగారుయాచమ నాయకుని సోదరియునగు తిమ్మాంబ.

## సాహిత్యపోషణము

కాళహస్తి ప్రభువులు విజయనగర చక్రవర్తుల సేనానులుగా, సామం తులుగా మెలఁగినవారు కావున విజయనగర చక్రవర్తుల సాహిత్యవాసన వీరికిని కొంత అబ్బినది. కాళహస్తి పాలకులలో సాహిత్యపోషకులే గాక, సాహిత్య నిర్మాతలు గూడ కొందఱు కలరు. శైవక్షేత్రములలో నొకటిగానే కాక సాహిత్యక్షేత్రములలో నొకటిగా కూడ కాళహస్తికి విశేషప్రశస్తి కలదు.

దామెర్ల వెంగళభూపాలుఁడు కాళహస్తి సంస్థానాధీశ్వరుల పూర్వులలో

*కస్తూరి రంగకవి, ఆనందరంగరాట్ఛందము, పీఠిక, 114.

నాఁడు. వీరు ఆయిదాశ్వాసములఁ గల బహుళాశ్వచరిత్ర మను ప్రశస్త ప్రబంధమును రచించినవారు. పదునాఱవ శతాబ్ది ఉత్తరార్ధమున నుండినట్లు పరిశోధకుల నిర్ణయము. వీరు ఇనిగెల గోత్ర పావనులు, గురువమాంబా వేంకటాద్రుల పుత్రులు. ఈ కావ్యము కృతికర్త తండ్రియగు వెంకటాద్రి రచితము. చంద్రగిరి పాలకుఁడైన వెంకటపతిరాయలకు యుద్ధరంగములందు సాయపడి వెంకటగిరి సంస్థానమును బహుమానముగాఁ బడసిన వెలుగోటి కస్తూరిరంగనాయకుని కుమారుఁడు బంగారు యాచమనాయఁడీ కవికి మేనత్తకొడుకని బహుళాశ్వ చరిత్రము పేర్కొనుచున్నది. కకుత్స్థ విజయకర్త మల్లి అనంతభూపాలుఁడీ కవికి సమకాలికుఁడు.

బహుళాశ్వచరిత్ర కృత్యవతారిక ప్రకారము వెంగళభూపాలునిది 'హరిచరణాంబుజోద్భవమగు పద్మనాయకవంశము'. ఈ వంశమునందొక మణిగా జనించిన శ్రీపాదప్రభువు వీరి మూలపురుషుఁడు. ఇతని తనయుఁడు అబ్బనృపాలుఁడు. ఇతని కుమారుఁడు ధర్మనృపతి. ఇతనిభార్య వెలుగోటి తిమ్మనృపాలుని తనయయగు వెంగళాంబిక. వీరికి వరద, వెంగళ, తిమ్మ, కోనయలు అను నల్గురు కుమారులు. వీరిలో వెంగళప్ప ప్రసిద్ధుడు. వెంగళప్పకు భార్యయగు లక్ష్మమ్మవలన ధర్మనృపాలుఁడు, వరదప్రభువు, వేంకటేంద్రుఁడు, తిరుమలశౌరి అని నలుగురు కుమారులు. వీరిలో మూఁడవవాఁడైన వేంకటేంద్రుఁడే బహుళాశ్వచరిత్ర కృతిపతి; వెంగళభూపాలుని తండ్రి.

ఈ నలువురి సోదరియగు వేంకటాంబికను—

'కదనకిరీటి యాచవిభు కస్తురిరంగనృపాలవర్యుఁడిం
పొదవ వరించికాంచె విభవోజ్జ్వలు రంగయయాచభూవరున్ ....'

—బహుళా, 1-35.

'మున్నె తోపూరి జగ్గరాణ్ముఖులనొంచి
మధురవార వెంచి మన్నీని మదమడంచి
తిరిచినాపలి చౌదవోలు తేజముగల
మేటి వెలుగోటి యాచని సాటిగలరె'

—పైది, 1-36.

కృతికర్తయగు వెంగళభూపాలుఁడు తన వంశము నిట్లు పొగడికొనినాఁడు :

'ఈ మన్నీలంగను రాఁ
తామజే పుట్టినిలు దానధర్మదయాల
క్ష్మామహిమల పుట్టిల్లఁట
చామర్లాన్వయముఁ బొగడఁదగదే ధాత్రిన్'

—పైది, 1-37.

కృతికర్తయగు వేంకటాద్రివిభుఁడు వెలుగోటి యాచనృపాలుని మేనమామ. వేంకటాద్రికి అయ్యమాంబ, గురవమాంబ, కేసమాంబ యని ముగ్గురు భార్యలు. కృతికర్తయగు వెంగళభూపాలుఁడు వేంకటాద్రి రెండవ

భార్యయగు గురవమాంబ జ్యేష్ఠకుమారుఁడు. వేంకటాద్రి మొదటిభార్యయగు అయ్యమాంబ కుమారుఁడు చెన్నభూపతి. వెలుగోటి యాచనృపాలుని చెలియ లగు అక్కమాంబ వెంగళభూపతి సవతియన్నయగు నీ చెన్నభూపాలుని భార్య.

వెంగళభూపాలుఁడు బహుళాశ్వ చరిత్ర రచనమునకు పూర్వము శ్రీరామాంకితముగా 'కృష్ణకథ'ను చెప్పినట్లు బహుళాశ్వ చరిత్ర కృత్యవ తారికామూలమున తెలియుచున్నది.

> 'దామర వేంకటప్రభువతంసుని వెంగళభూప! మా పయిన్
> శ్రీ మెఱయంగ కృష్ణకథఁ జెప్పితి....' —పైది, 1-15.

ఆ కాలమునందు కృతులను తమ తండ్రుల కంకితమిచ్చు అభ్యాసము ప్రచురముగా నుండినట్లూహింపవచ్చు. మట్లి అనంతభూపాలుఁడు కూడ తన కకుత్స్థవిజయ మను నైదాశ్వాసముల ప్రబంధమును తన తండ్రియగు ఎల్లి భూపాలున కంకితమిచ్చెను. వెంగళభూపాలుని తండ్రియును, బహుళాశ్వ చరిత్ర కృతిభర్తయునగు వేంకటాద్రి కులీకుతుబ్‌షా (1550—1560) వలన సత్కరింపఁబడినవాఁడఁట!

దామెర్ల అంకభూపాలుఁడు, మీఁది వెంగళభూపాలుని సవతియన్నయగు చెన్నభూపతి తనయుఁడు. ఇతనితల్లి అక్కమాంబ వెలుగోటివారి యాఁడుఁ బడుచు. అయిదాశ్వాసములు గల ఉషాపరిణయ ప్రబంధము అంకభూపాలుని రచన. ఇది శ్రీరామచంద్రునకు కృతి.

> 'అలరఁ జేయఁగ నేర్తు వసహాయశూరత
> ఘటికాశతగ్రంథ కల్పనంబు
> సవరింపనేర్తువు సర్వతోభద్ర కం
> కణబంధముఖ చిత్రకావ్యరచన
> ప్రకటింపనేర్తువు వికజపంకజబృంద
> మకరందనిష్యంద మధురఫణితి
> ఘటియింపనేర్తువు కమనీయపదబంధ
> సంధాన సరసవిస్తరణసరణి
> నీకు తగు నౌనుచు నుచితార్థైకతాన
> జాతి వార్తాఢ్య కవనలీలాతిరూఢి
> యరి నృపా ఖర్వగర్వ సంహరణ....
> ........దామెర్ల యంకభూప'

అని సంస్థాన పండితులు ప్రకటించిన యభిప్రాయములు సత్యదూరములుకావని యీతని కృతి సాక్ష్యమీఁగలదు. ఇది యముద్రితము. ముద్రితము కావలసిన మేలి రచన.

## ధూర్జటి లింగరాజకవి

ఇతఁడు కుమారధూర్జటియను వ్యవహార నామముకలిగిన వెంకటరాయ కవి పుత్రుఁడు. భారద్వాజగోత్ర పవిత్రుఁడు. ఇతనిని పోషించినవారు కాళహస్తి పాలకులగు దామెర్ల అక్కప్పనాయఁడను నామముగల అక్కరాజు గారికి కుమారుఁడైన వెంకటపతినాయనివారు. ఈ ప్రభువు పదునెనిమిదవ శతాబ్ది మధ్యభాగమువాఁడు. పంద్రెండాశ్వాసములుగల కాళహస్తి మాహాత్మ్యమను క్షేత్ర మాహాత్మ్య కృతి వేంకటపతినాయని వారికి (క్రీ. శ. 1730) కృతియిచ్చి నాఁడు. ఇది కృష్ణరాయల అష్టదిగ్గజములలో నొకఁడగు ధూర్జటి మహాకవి రచించిన శ్రీ కాళహస్తి మాహాత్మ్యము కంటె భిన్నమైనది. ధూర్జటి మహాకవి రచన స్కాంద పురాణమునందలి షడధ్యాయి కథ యాధారముగా రూపొందినది. లింగరాజకవి రచించిన కాళహస్తి మాహాత్మ్యము కృత్యవతారికయందీ విషయము విశదీకరింపఁబడినది :

'విను కాళహస్తి మహిమం
బనుపమమై వెలయ మును షడధ్యాయి కథన్
మెనుఁగునఁ గావ్యముగ నొన
ర్చెను బెదధూర్జటికవీంద్రశేఖరుఁడనఘా'

మఱి లింగరాజకవి సంధానించిన కాళహస్తి మాహాత్మ్యకృతి శివరహస్య ఖండమను పురాణమునందలి యుత్తరభాగమునందలి 120 అధ్యాయములోని కథ యాధారముగా వెలసినది.

'బహుపురాణమథిత భవ్యార్థ శివతత్త్వ
సారమెల్లనైన సరణిబొదవి
జగతి శివరహస్యసంగ్రహమను నితి
హాసమొనరు విబుధు లభినుతింప'

'ఆ యితిహాసంబు నందలి యుత్తర
భాగంబునందు భాస్వన్నిరూఢిఁ
గాళహస్తిమహత్వ కథ నూటయిర్వది
యధ్యాయములఁ జెలువమరుచుండుఁ
దత్కథఁ దెనుఁగున ద్రాక్షారసోర్మికా
పరిపాక విస్ఫూర్తిఁ బరిఢవిల్లఁ
గృతిమొనర్పుము మదంకితముగ శబ్దచ
మత్కృతిఁ బండితుల్ మది గణింప....'

అని కృతిపతి లింగరాజకవికి వివరించి కావ్యరచనకు ప్రోత్సహించెను. కవి తనకుల గోత్రాదికములను గూర్చి యిట్లు వివరించినాఁడు :

'శ్రీకాళహస్తీశ సేవనాన్వితచిత్త
చిత్తజాకార లక్ష్మీవిహార
రమణీయశీల భారద్వాజగోత్రప
విత్ర యాపస్తంబసూత్ర మహిత
ధూర్జటివంశపాథోధిచంద్ర కుమార
ధూర్జటినామ విస్ఫూర్జితాంక
స్తుతమతి వేంకటపతి తనూభవ లింగ
రాజకులేంద్ర ధైర్యాచలేంద్ర....'

లింగరాజకవి కుమారుఁడును రత్నావళీపరిణయ కర్తయునునగు ధూర్జటి వేంకటపతికవి తన తండ్రిని గూర్చి క్రిందివిధముగాఁ బ్రస్తుతించి యున్నాఁడు :

'ఘన గౌరీశకటాక్షలబ్ధి కవితా గాంభీర్య సంతుష్ట భూ
జనరాడ్దత్త సువర్ణచేల మణిభూషా గ్రామ పల్యంకికా
ఘన దంతావళ ఘంటికాది బహుసత్కార ప్రతిష్ఠాత్మ మ
జ్జనకున్ ధూర్జటి లింగరాజకవిరాజశ్రేష్ఠుఁ గీర్తించెదన్'

లింగరాజ కవి కృతిలో దేశీయమగు సత్కారకవి చరిత్రములేదు. సంస్కృతమున సంధానితమయిన కాళహస్తి మాహాత్మ్య మొకటి వెంకటగిరి సంస్థానాధీశ్వరుల కనిష్ఠసోదరులు రాజా శ్రీ వెలుగోటి ముద్దుకృష్ణయాచేంద్ర బహద్దరువారిచే ముద్రితమై ప్రకటితమైయున్నది. ఇందలి కథలును లింగరాజ కవికృత కాళహస్తి మాహాత్మ్యము నందలి కథలును నొక్కతీరున నున్నవఁట ! దేని కేదిమూలమో విజ్ఞులు వివరింపవలసియున్నది.

లింగరాజ కవి రచియించిన మఱియొక కృతి ద్విపద భాగవతము. ఇది యముద్రితము. దీని తాళపత్రప్రతులు తిరుపతి విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధక సంస్థలోఁగలవని తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు వ్రాసిరి*. ద్విపద భాగవతము నందలి తృతీయ స్కంధాంతగద్యలో —

'శ్రీదామరాన్వయ క్షీరాంబునిధి మ
హోదయ పూర్ణచంద్రోదయరూప
లలితదానక్షాత్ర లావణ్యాగణ్య
కలిత తిమ్మనృపాలక ప్రభుతనయ
సుకుమార వేంకటక్షోణీశదత్త
వికసత్కనకరత్న వృత భవ్యకటక
హారాగ్రహార మహాహయ భద్ర
వారణ కౌశేయ పల్యంకికాది

*క్షేత్ర రాజ్యమైన కాళహస్తిని సారస్వత క్షేత్రంగా శోభిల్లజేసిన ప్రసిద్ధకవులూ. పండితులూ — ఆంధ్రప్రభ, ఆదివారము సంచిక, 1964 అక్టోబరు, 4.

బహుమాన సంగత పాండిత్య సత్య
సహిత వేంకటపతిసత్పుత్ర మిత్ర
కుశల భారద్వాజగోత్ర పవిత్ర
విశద సత్కవిరాయ విద్వద్విధేయ
ధూర్జటి సత్కుల తోయజమిత్ర
ధూర్జటి సద్భక్తి ధుర్యతావార్య
వినయ జయోపాయ విభవసహాయ
ఘనగుణవిధేయ లింగయ నామధేయ
వరకవికృత భాగవతపురాణమున
అరుదైన ద్విపద కావ్యమునందు సూక్తి
హరువు మీఱఁగ తృతీయస్కంధమయ్యె
ధరణి యాచంద్రార్క తారకంబుగను'

అని కలదు.

'ఇప్పటికిని కాళహస్తిరాజాగారి దర్బారులో ధూర్జటివారిదని యొక యాసనము కవిస్థానములలో నేర్పడి యున్నదఁట'[1]

## మునిపల్లె సుబ్రహ్మణ్యకవి (1760—1820)

ఈయన తంజాపురప్రాంత నివాసియఁట; ములికినాటి వైదికుఁడు; హరితసగోత్రుఁడు. కాళహస్తి సంస్థానాధీశులగు శ్రీ రాజా దామర కుమార వెంకటప్పనాయకుని (1745—1795) యాహ్వానముమీఁద కాళహస్తి సంస్థానమున కేతెంచి కాళహస్తిలోనే స్థిరపడెనఁట. ఈయన సుప్రసిద్ధ సంకీర్తనాచార్యుఁడు. 'శ్రీ శేషగిరిపతి' ముద్రతో అధ్యాత్మ రామాయణ కీర్తనలను శేషశైలేశాంకితముగా రచించిన కవి. రాజా కుమారవెంకటప్పనాయనింవారు కాళహస్తికి పశ్చిమదిశలో మూఁడుకోసుల దూరమునఁ గల కృష్ణంపల్లె, రామానుజపల్లె యను గ్రామములను కవికి 1760లో ధారవోసిరఁట; ఆ పిమ్మట రామానుజపల్లె అన్యాక్రాంతమయినదఁట కాని కృష్ణంపల్లె మాత్రము కవిసంతతి వారి హక్కుభుక్తములలో నున్నదఁట![2] తన పోషకులైన దామర కుమార వెంకటప్పనాయనిమీఁదను, ఆయన కుమారులగు కుమార కృష్ణస్వామిగారి మీఁదను కొన్ని శృంగారప్రచురములైన పదములను కూడ సుబ్రహ్మణ్య కవిగారు రచించిరఁట:

[1] కొ. వేంకటపద్మనాభశాస్త్రి, శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యము, 1895, పీఠిక, పు. 7.

[2] మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ, అధ్యాత్మరామాయణకర్త సుబ్రహ్మణ్యకవి, ఆంధ్రపత్రిక, సంవత్సరాది సంచిక, క్రోధన, పుటలు 239, 240.

'మనసు నచ్చితే రమ్మనవే
దామరల కుమార వేంకటేంద్రుని....'
మొదలగు నిట్టిపదము లనేకము లోకమున వాడుకలో నున్నవి.

## శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి (1790—1870)

వీరు బహుముఖ పాండిత్యము కల విద్వత్కవులు. 1860—1880నాటి కాళహస్తిపాలకులగు దామెర్ల వెంకటపతినాయనింగారు చక్కని వైదుష్యము, సరసహృదయము కలవారు. వీరు కృష్ణమూర్తిశాస్త్రిగారిని తమ యాస్థానమున పదునాలేండ్లపాటు నిలిపికొని సకల సత్కారములుచేసి పోషించిరి. కృష్ణమూర్తి శాస్త్రిగారి కుమారులు సర్వశాస్త్రిగారు (1830—1880). సర్వశాస్త్రియును, లక్ష్మీ నారాయణీ యాంధ్రనిఘంటుకర్తయగు కొట్ర లక్ష్మీనారాయణశాస్త్రియును కృష్ణమూర్తిగారి శిష్యులు. ఈ కొట్రశాస్త్రిగారికి సర్వశాస్త్రిగారు మేనబావ. సర్వశాస్త్రి పండితకవి, అవధాని కూడ. అయినంపల్లి, కాళహస్తి, జగ్గంపేట సంస్థానములలో శతావధానములొనర్చి సమ్మానము లందినవాఁడు. 1860లో అమరుకమును పద్యరూపమున నాంధ్రీకరించి కాళహస్తిపాలకులగు వెంకటపతి నాయనింగారికి అంకితమిచ్చిరి. జ్ఞానప్రసూనాంబికాశతకము వీరి మఱియొక కృతి. ఇదియును కాళహస్తి సంస్థానాశ్రయమున నున్నప్పుడు రచించిన కృతి.

'శ్రేయస్సంతతధామ దామెరకుల శ్రీ వేంకటేంద్రాజ్ఞఁ బ్ర
జ్ఞా యత్యాచిత సర్వశాస్త్రి యిటు లాజ్ఞం జేసె జ్ఞానాంబికా
గ్రీయానుగ్రహలీలఁ బద్యశత మీ రీతిన్ బఠింపన్ జనుల్
ధీయుక్త స్థితి నన్ని విద్యలఁ బ్రశస్తింజెంది పెంపెక్కరే'.

## విక్రాల రాఘవాచార్యులు (1840—1890)

వేదప్రామాణ్యము, శిక్షాభాష్యము, శుల్బసూత్రభాష్యము, రహస్యత్రయ భాష్యము, సూర్యసిద్ధాంత వ్యాఖ్యానము, గ్రహాదర్శము, ధర్మనిర్ణయము, వృత్తి సంగ్రహము, ఆంధ్రదేశ భాషామహిమావర్ణనము మున్నగు గ్రంథములను రచించి కాశీపండితులతో వాదించి 'షడంగవేదజ్ఞ' యను బిరుదునందిన శ్రీమాన్ కళత్తూరు విక్రాల రాఘవాచార్యులుగారు కాళహస్తిసంస్థానమున ప్రధాన పండితులుగా నుండినవారు.*

మహామహోపాధ్యాయ కొకొండ వేంకటరత్నం పంతులుగారికి విద్వత్కవీశ్వరపట్టము నొసంగి కాళహస్తిపాలకులు రెండేండ్లపాటు తమ యాస్థానమున నిలిపిరి. సుప్రసిద్ధ లాక్షణికులు, వేదవిదులు నగు వేమూరి లక్ష్మీ

*విక్రాలశేషాచార్యులు, విక్రాలరామచంద్రాచార్యులు, ఆంధ్రప్రభ, ఆదివారము సంచిక, 1967 ఏప్రిల్ 10, పు. 6.

నారాయణ పౌండరీకయాజులుగారు కాళహస్తిసంస్థానమున చిరకాల మాస్థాన విద్వాంసులుగ నుండిరి.

నిన్నమొన్నటిదాఁక ఆంధ్రప్రదేశ ప్రభుత్వాస్థానకవియగు మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యులవారి పూర్వులగు విద్వద్వరేణ్యులకు కాళహస్తిప్రభువులు నాఁటి వారి యేలుబడిలోని పామూరితాలూకాలో ఎనుబది యెకరాల పైచిలుకు మాన్యమును ప్రసాదించియుండినట్లు తెలియుచున్నది. శ్రీ కృష్ణాచార్యులుగారి చిన్ననాఁటికిం ఇరువదియే యెకరములు మాత్రమే మిగిలినవఁట ! కృష్ణాచార్యులు గారు ప్రాజ్ఞత వచ్చినతరువాత కాళహస్తినేతయగు రాజా తిమ్మభూపాలుని దర్శించి చెప్పిన క్రింది పద్యములు దీనికి సాక్ష్యము :

'సనదు చుండాలాల సహమాన్యభిక్ష మా
  పిల్లపిల్లతరానఁ బెట్టినారు
పామూరిలో దివ్యభవ్యమౌ మిద్దె క
  ట్టించి మాతాత నందుంచినారు
కడుపులోపల చల్లఁ గదలకుండఁగ మాకు
  మంచి సౌఖ్యమ్ము గల్గించినారు
మాచేతి రాగిదమ్మ్యేని పడకుండ
  నెల్ల మాపనులు చేయించినారు
తిమ్మభూపాల ! మా యింటి దీపకళిక
దినదినము నిప్పటికిని దేదీప్యమాన
మగుచు వెలయించుచుండె మీ యశము దెసల
నట్టి మిముఁజూచి యానందమందుచుంటి'

'మీతాత లిడిన మాన్యము
లేతావన్మితములనుచు నెఱుగఁ డెవండున్
మాతాత యెఱుఁగునేమో
మాతండ్రియు నెఱుఁగఁడయ్య మనుజాధీశా'[1]

శ్రీ కాళహస్తి ప్రభువుల దానములను గూర్చి కృష్ణాచార్యులుగారి ప్రశంస యీ క్రింద నుదాహరింపఁబడినది :

'శ్రీ కాళహస్తి ప్రభువుల దానపద్ధతి యెట్టిదన – భూస్వామి యెన్నేండ్ల వఱకు రాకున్నను వానికి రావలసిన వార్షికఫలము నగరములో దాచి యుంచి భూస్వామి ఎప్పటికోవచ్చి 'మహాప్రభూ ! ఈ భూములకు నేను సొంతదారుఁడను' అని రుజువు చూపించినచో శ్రోత్రియమును మాత్రము మినహాయించుకొని తక్కిన అన్నేండ్ల ముక్తా వడ్డీతోఁ గూడ

[1] కాశీ కృష్ణాచార్యులు, అవధానయాత్ర. పుటలు 130–132.

భూస్వామికిచ్చి తాజాపట్టాలిచ్చి భూస్వామిని బంపుదురు శ్రీ కాళహస్తి ప్రభువులు........'*

## దామెర వేంకటరాయభూపాలుఁడు

ఈయన కాళహస్తి ప్రభువంశీయుఁడు. సేతు మాహాత్మ్య మను పర్యాయ నామముకల సేతుఖండ మను కావ్య మీతని కృతి. రామేశ్వర సేతు మాహాత్మ్య మిందభివర్ణ్యము. స్కాందపురాణాంతర్గతమగు సేతుఖండమున కాంధ్రీకరణము. బొబ్బిలి వేణుగోపాలస్వామి కంకితము. బొబ్బిలి సంస్థానాధిపతియగు రావు శ్వేతాచలపతి రంగారావున కాశ్రితుఁడు. విశేషించి బంధుకోటిలోనివాఁడు. ఇనకాల గోత్రుఁడు. తిమ్మయ్య పౌత్రుఁడు, వేంకయ పుత్రుఁడు. ఇది అముద్రితము. లిఖితప్రతి మద్రాసు ప్రాచ్య లిఖితగ్రంథాలయములో ఆర్.నెం. 543 గాఁ గలదు.

## వేదాంతి షణ్ముఖదాసు

ఈయన అక్షంతల గోత్రుఁడు. గంగయ పుత్రుఁడు. నీలకంఠం యల్లమందయ్య దేవరగారి శిష్యుఁడు. కాళహస్తి ప్రభువులలో నొకరగు శ్రీ రాజా దామర్ల కుమార వెంకటప్పనాయనిం బహద్దరుగారి కాశ్రితుఁడు. షణ్ముఖదాస కృతమగు 'శ్రీరామ వసిష్ఠసంవాద' మను నధ్యాత్మ గ్రంథము కాళహస్తి పాలకుల సమాదరణమునఁ బ్రకాశితము. వైరాగ్య ప్రశంస, శుశ్రూషలు, కామాదులు, మహావాక్య వివరణము మొదలగు నంశములు వసిష్ఠరామ సంవాద రూపమున నిందు విపులీకృతమైనవి. ఉపోద్ఘాతమునందు కాళహస్తి పాలకుల యభ్యుదయమును నాకాంక్షించు నాశీర్వాద పద్యమొకటి యున్నది :

'శ్రీ మద్దామరవంశరత్నమును, లక్ష్మీకుండు సౌందర్య జి
తాఙ్గుముం డల్ల కుమారవేంకటపతిక్ష్మాపాలుఁ డశ్రాంతమున్
క్షేమాయుర్విభవాన్వితుండు నగుచున్ శ్రీ కాళహస్తీశు ను
ద్దామప్రేమకటాక్షదృష్టికలనన్ ధాత్రిన్ విరాజిల్లతన్'.

* పైది, పు. 132.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. ఆంధ్ర విజ్ఞానము, సంపుటములు 3, 6.

2. తెలుగువిజ్ఞానసర్వస్వము, సంపుటము 3, నిడుదవోలు వేంకటరావు. ఆంధ్ర సంస్థానములు - సాహిత్య సేవ, పుటలు 1171 – 1175.

3. కాశీ కృష్ణాచార్యులు, అవధానయాత్ర, పుటలు 130 – 132.

4. Encyclopaedia of the Madras Presidency and the Adjacent States, Ed. by V.L. Sastri, Madras, 1920–21, pp. 439–442.

5. Boswell, John A.C., A Manual of the Nellore District in the Presidency of Madras, Madras, 1873. Chapter XXVII, pp. 712–740 by J.A. Boyle, pp. 724–725.

6. Imperial Gazetteer, Provincial Series, Madras, Vol. II, p. 20.

7. The History of the Imperial Assemblage at Delhi, London.

8. Celebrations of the Jubilee of the Queen Empress, London, 1887.

9. M.A.M.P., I, pp. 58, 59, II, 294–301.

10. W. W. Hunter, Imperial Gazetteer of India, New Edition, Oxford, 1908, Vol. XV, p. 64.

# కురుపాము

## ప్రవేశిక

శ్రీకాకుళముమండలమునందలి పార్వతీపురమునకు పదిమైళ్ళ దూరమున నీ సంస్థాన ముండినది. ఇది పార్వతీపురము, గుణుపురము తాలూకాలలో విస్తరించి యుండినది. దీని విస్తీర్ణము 700 చ. మైళ్ళు. ఇందులో 450 చ. మైళ్ళు ఏజెన్సీ ప్రాంతము. సంస్థానమునందలి 274 గ్రామములలో రమారమి 200 ఏజెన్సీ గ్రామములు. మిగిలినవానిలో 48 జిరాయితీగ్రామములు, 10 అగ్రహారములు, 8 మొఖాసా గ్రామములు చేరియుండినవి. మొత్తము గ్రామములలో 164 ముస్తాజరీపద్ధతి గ్రామములు, 66 రైత్వారీ గ్రామములు, 26 మొఖాసా గ్రామములు, 18 అగ్రహారములు ఉన్నవి. గుమ్మహుండాభాగము తప్ప తక్కిన కురుపాము జమీందారీ జయపురమువారేర్పఱిచినది. సంస్థానము ఏవుగా విస్తరించుచున్న దశలో అనఁగా పదునెనిమిదవ శతాబ్దము మధ్యభాగమునందు గుమ్మహుండాభాగము కలిసినది. దీని పేష్కషు 14 వేలు. శాశ్వతపరిష్కారము నాఁటి సగటు సాలీనా రాఁబడి ఇరువదియైదు వేలు. పూర్వ మిది నందాపురమను పేరుగల జయపురసంస్థానమునందు అంతర్భాగముగా నుండినది. జయపురముప్రభువు విశ్వంభరదేవుగారివలన నీ సంస్థానము రూపొందినది. పర్లాకిమిడి పాలకులు గోపీనాథదేవుగారి దయవలన గుమ్మహుండా విభాగము కురుపాము జమీందారీలోఁ జేర్పఁబడినది. జమీందారీకమిటీ రిపోర్టునాటికి పేష్కషులో మార్పులేదు. కాని సాలుసరి రాఁబడి 1,30,000 లకు పెరిగినది.

## సంస్థాన చరిత్రము

వీరిది చంద్రవంశమునందలి శిలావంశమఁట. వీ రోఢ్రజాతీయులగు కొండరాజులవంశమువారని విశాఖపట్టణముజిల్లావృత్తాంతసంగ్రహమునందు పేర్కొనఁబడినది. వైరిచెర్ల యనునది వీరి కులబిరుదము. వీరి కూటస్థుఁడు సన్యాసిదొర.

'కురపాము సన్యాసిదొరకు నొసంగెను
వైరిశల్యుండను పేరుతోడ' —ప్రభాసశాప.

వీరి మూలపురుషుఁ డగ్నివీరుఁడఁట. 1676లో వైరిచెర్లవారికి జయపురాధీశ్వరుఁడగు విశ్వంభరదేవుగారివలన నొసంగఁబడిన దేవతాస్వరూపిణి పైఁడిమారమ్మ కురుపాముకోట శక్తియఁట!

జయపురమువారి యామోదమునకు పూర్వమే కురపాము జమీందారుల పూర్వులు ఈ ప్రాంతమును పాలించుచు ప్రబలులై యుండిరఁట ! కటకములోని గజపతుల పతనముతో 1435 లో వీరు స్వతంత్రులయిరఁట. ఆ పిమ్మట జయపురాధీశ్వరులు వీరిని గుర్తించి కురుపాము సంస్థానాధిపత్యమును స్థిర పఱిచిరని మఱియొక కథనము*.

వైరిచెర్ల పెదసన్యాసిరాజుగారు అగ్నివీరున కొఱవతరమువారు. ఇతని కొడుకు శివరామరాజు. కళింగ విజయనగరరాజుల కెదురుతిరిగినపాలకులలో శివరామరాజు కూడ ముఖ్యుఁడు. శివరామరాజు వాస్తవముగ విజయనగరము నెదిరించిన కుట్రదారులలోఁ జేరకపోయినను, విజయనగరమువారి సేనలును కప్తాను మాత్యూస్‌దొరగారితోఁ గూడ కుంఫిణీ పటాలములును విజయనగరము దివాను సీతారామరాజుగారి యాధిపత్యమున జయపురమును ముట్టడించుటకు పూని చేసిన సందర్భమునందు సదరు సేనల వెనుకతట్టున మోహరించి వారికి రస్తుసామగ్రి అందకుండచేసి చిక్కుపఱిచెనఁట. అందువలన సీతారామరాజు మాత్యూస్‌దొరగారితో కూడ కురుపామునకుపోయి మోసముతో శివరామరాజును సకుటుంబముగా చెఱపట్టి తెచ్చి విజయనగర మిలాకాలోఁ గల ఆయా కోటలలో వారిని వేర్వేఱుగా ఖైదుచేసెను. వారిలో కొందఱు విజయనగరపాలకులు విజయరామరాజుగారు 1794 లో మరణించువరకు ఖైదులోఁ గడపిరి. కాని యంతకు కొంతముందే విజయనగరప్రభువగు విజయరామరాజు కల్పించి కొనుటచేత శివరామరాజుగారిని విడుదలచేసి యాయన పోషణకొఱకు పింఛను నిచ్చుచు వచ్చిరి. 1778 లో శివరామరాజు కురుపాములోని సుబేదారుకు లంచ మిచ్చి సంస్థానమును వశపఱిచికొనెను. 1779 లో కుంఫిణీసేనలు, విజయ నగరముసేనలు కలిసి ఒక్కటిగా మోహరించి కురుపాముకోటను తిరిగి స్వాధీనపఱిచికొనినవి. శివరామరాజు 1794 లో మరణించెను. 1796 లో నార్తరను డివిజను కలెక్టరుగారివలన ప్రాచీన కుటుంబమునకే జమీందారీ తిరిగి ప్రసాదింపఁబడెను. శివరామరాజు కుమారుఁడగు చినసన్యాసిరాజుతో కుంఫిణీ వారు 1803 లో శాశ్వతపరిష్కారమును నిర్ణయించిరి. చినసన్యాసిరాజు తన జ్ఞాతి యొక్క కుమారుఁడగు సీతారామరాజును తాను దత్తత చేసికొందునని మరణ కాలమున కలెక్టరుగారికి తెలియపఱిచియుండెను. చినసన్యాసిరాజు 1820 లో మరణింపఁగా సీతారామరాజు జమీకి వచ్చెను. ఇతఁడు 1830 లో చనిపోఁగా ఇతనిభార్య సుభద్రమ్మ 1841 దాఁక పాలించి మరణించెను. ఈమె తన మరణమునకు పూర్వమే తన దౌహిత్రుఁడగు సూర్యనారాయణరాజును దత్తు చేసికొనియుండెను. ఈమె మరణకాలమునాఁటికి సూర్యనారాయణరాజు

* Encyclopaedia of the Madras Presidency and the Adjacent States, p. 421.

మూఁడేండ్ల పసివాఁడు. 1841—57 మధ్య మైనరుజమీందారుగారి పక్షమున కోర్ట్ ఆఫ్ వార్డ్స్ వారు సంస్థానపాలనమును పర్యవేక్షించిరి. ఇతఁడు కోర్ట్ ఆఫ్ వార్డ్సువారి ఏర్పాటు ప్రకారము విశాఖపట్టణములోనుండి ఆంధ్రాంగ్లేయ భాషల నభ్యసించి ప్రాజ్ఞత వచ్చిన పిమ్మట 1858 లో జమీకి వచ్చెను. కాని వెనుకటి చినసన్యాసిరాజుగారి సోదరులలో నొక సోదరునియొక్క యౌరస పుత్రుఁడగు పైరిచెర్ల జగన్నాథరాజు సంస్థానమును తనకు స్వాధీనపఱుప వలసినదని 1858 లో ఒక దావా తెచ్చెను. గవర్నరు ఏజెంటు రాబర్ట్సన్ దొరగారు 'సదర్—అదాలతు' న్యాయస్థానమునందలి పండితులసాయముతో శాస్త్రచర్చలు చేసి వాదివాదము అశాస్త్రీయముగా తోఁచుటవలన సంస్థానముపై ఆయనకు ఎట్టి హక్కును లేదని కేసును కొట్టివేసిరి. ఈ తీర్పుపై మఱియొక్క అప్పీలు చేయఁబడినది కాని అది నిలువలేదు. 1889 లో సూర్యనారాయణరాజు గారు చెముడు ఎస్టేటును విక్రయించికొని సంస్థానమును విస్తరింపఁజేసికొనిరి. ఈయన 1891 లో మరణించెను. ఈయనకుమారుఁడు వీరభద్రరాజు తండ్రి మరణకాలమునాఁటికి పదుమూఁడేండ్ల పసివాఁడు. వీరభద్రరాజు 1877 లో జన్మించి, 1898 లో జమీపాలనమును చేపట్టెను. 1891 నుండి 1898 దాఁక కోర్ట్ ఆఫ్ వార్డ్స్ వారి పాలనము. ఈయన విశాఖపట్టణములోని అనకాపల్లి జమీందారు మహారాజా సర్ గొడే నారాయణగజపతిరావుగారి రెండవకూఁతురు శ్రీ రాజకుమారి లక్ష్మీనరసాయమ్మగారిని 1897 లో వివాహమాడిరి. ఈయన ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌లోను, మద్రాస్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌లోను సభ్యులు. 1901 లో ఈయన భార్య లక్ష్మీనరసాయమ్మ పురిటిలో మరణించినది. విశాఖపట్టణములోని ఎడ్వర్డ్ కారొనేషన్ మార్కెట్టును రాజా వీరభద్రరాజు గారు ఇంచుమించు లక్షరూపాయలు వెచ్చించి నిర్మించిరి. నేఁడిది 'కురుపాము మార్కెట్టు' పేర వ్యవహరింపఁబడుచున్నది. విశాఖపట్టణములోని రాణీ లక్ష్మీ నరసాయమ్మ ఆసుపత్రికి భూరిగావిరాళ మిచ్చిరి. 1900 లో విశాఖపట్టణములోని జాలరులకు సముద్రపుటొడ్డున నివేశనములను కొని ఉచితముగా పంచిపెట్టిరఁట। వీరభద్రరాజుగారు 1918 లో మరణించిరి.

వీరి కుమారులు నరసింహ సూర్యనారాయణరాజు, నారాయణగజపతి రాజు అనువారలు. వీరికి కురుపాము సంస్థానముతోపాటు మాతామహుని మూలమున కుప్పిలి, గొట్టుపల్లి మొదలగు ఎస్టేటులుకూడ సంక్రమించినవి.

## సాహిత్య పోషణము

ఈ సంస్థాన పాలకులలో పూర్వులంచఱును నిరంతర యుద్ధములలోను, ఎడతెగని కోర్టు వ్యాజ్యములలోను మునిఁగియుండుటవలన వారికి సాహిత్య పోషణమున కవకాశము చిక్కినట్లు లేదు. అయినను, కురుపాము సంస్థానాధీ

శ్వరులు తూర్పు గోదావరి మండలములోని ముంగండ అగ్రహారమువెంతఁగల గన్నవరము గ్రామమునుండి వేఁగినాటి బ్రాహ్మణులును, యజుర్వేది కౌండిన్య గోత్రోద్భవులును, సకల శాస్త్ర సంపన్నులును, నడిమింటి యను నింటిపేరుగల పండితుల కుటుంబమును దమ సంస్థానమునకు రప్పించి, వారి కగ్రహారాదు లిచ్చి సమ్మానించిరఁట.* నడిమింటివారికి కురుపాము పాలకులు నాగూ రగ్రహారము, తురకనాయుఁడువలస అగ్రహారములను దయచేసి యుండిరి. నాగూరు నాగావళీ నదీతీరమున పార్వతీపురమునకుఁ దూర్పుగా నాలుగు కోసుల దూరమున నున్నది. వీరి మూలపురుషులు నడిమింటి విశ్వపతిశాస్త్రిగారు. సర్వమంగళేశ్వర శాస్త్రిగారి (1759–1836) జనకులగు పేరుచయనులుగారు విశ్వపతిశాస్త్రిగారి నాలవతరమువారు.

నడిమింటి చినగుంపస్వామి కురుపాము సంస్థానాస్థాన పండితుఁడు: కురుపాము వాస్తవ్యుఁడు. నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి పౌత్రులగు గోపాలశాస్త్రి, నృసింహశాస్త్రిగారల శిష్యుఁడు. వీరభద్రరాజుగారి తండ్రిగారు శ్రీ సూర్యనారాయణరాజుగారు సాహిత్యాభిరుచికలవారఁటగాని, ఆయన జీవిత కాలమంతయు ప్రీవీకౌన్సిలుదాఁక దేఁకిన పలు వ్యాజ్యములలో గడచిపోయినది. వీరభద్రరాజుగారి కాలమునాఁటికి సంస్థానము స్థిరపడి, సర్వమును నిమ్మకు నీరెత్తినట్లు నిమ్మళముగా నుండినది. విశేషించి వీరభద్రరాజుగారికి పిల్లనిచ్చిన మామగారు మహారాజా సర్ గొడే నారాయణగజపతిరావుగారు గొప్ప సాహిత్యపోషకులు. వీరభద్రరాజుగారి భార్య శ్రీ రాజకుమారి లక్ష్మినరసా యమ్మగారు సంస్కృతాంధ్రాంగ్లముల యందును, సంగీతాది లలిత కళల యందును చక్కని ప్రవేశము సంపాదించియుండిరి. ఈ సంబంధమువలన వీరభద్రరాజుగారు సరససాహిత్యాభిరుచిని పెంపొందించికొనిరి. వీరభద్ర రాజుగారు ఉత్తమమైన గ్రంథాలయమును తమ యంతఃపురమున నెలకొల్పిరి. దీనిపేరు జ్ఞానలక్ష్మి విలాసము. అంతఃపురోద్యానమున కుత్తర దిక్కున నిది యుండెడిదఁట.

వీరభద్రరాజుగారి యాస్థానమునందు పులుగుర్త నృసింహామాత్యుఁడు, గురుదంతి వేంకటాచలశర్మ మొదలగువారు పండితులుగా నుండిరి. పులుగుర్త నృసింహామాత్యుఁడు సంతరించిన 'మహావాక్య రత్నావళి' కురుపాము సంస్థానాధీశ్వరులగు శ్రీ రాజా వైరిచెర్ల వీరభద్రరాజు బహద్దర్‌గారి యభీష్టానుసారము ప్రచురితమైనది. ఇది ఈశాద్యష్టోత్తరశతోపనిషద్రత్నాకరమునుండి యుద్ధృతమైన మహావాక్యముల సంపుటీకరణము. ఇవి విధివాక్యములనియు, బంధమోక్ష వాక్యము లనియు, అవిద్వన్నిందా వాక్యము లనియు, జగన్మిథ్యా

* నడిమింటి పతంజలిశాస్త్రి. నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి జీవిత చరిత్రము. పు. 2.

వాక్యము లనియు పదుమూఁడు తెఱఁగులుగా వర్గీకృతములై యున్నవి. సర్వం ఖల్విదం బ్రహ్మ, సర్వత్రా ద్వైతబ్రహ్మబుద్ధిం కుర్యాత్, సంకల్ప మాత్ర సంభవోబంధః, నతుద్వితీయ మస్తి, తత్త్వమసి త్వం తదసి — మొదలగు 1008 వాక్యముల అర్థ విచారము సంక్షేపరీతి నిందుఁ జేయఁబడినది. వీనిని పఠించుటకును, మననము సేయుటకును ముముక్షువులే సదధికారులు. సంస్థానాస్థాన పండితులగు గురుదంతి వేంకటాచలశర్మగారిచే పరిష్కృతమైనది. సుప్రభాఖ్య టీకా సహితమిది.

ఈ గ్రంథమునందలి అవతారికాభాగమునందు వీరభద్రరాజుగారి ఉత్తమ గుణములు కీర్తింపఁబడినవి.

'....ఎ.గీ. ఈతులు దొలంగ నీతుల రీతులదర
నేలు కురుపాము సంస్థాన మేగుణాఢ్యుఁ
డతఁడు వెలుగొందు వైరిచెర్లాన్వయాబ్ధి
జాలభానుండు శ్రీ వీరభద్రనృపతి'
'పార్థివలింగ పూజయును బండిత గోష్ఠియు నాగమాంత వా
క్యార్థవిచారమున్ శ్రితజనావనమున్ వెలయన్ బరోపకా
రార్థమిదం శరీరమను నార్యుల వాక్యముఁబూని మెచ్చ న
భ్యర్థులు వీరభద్రవసుధాధిపశేఖరుఁ డొప్పునెప్పుడున్'
'వేదాంతము దాఁ జదువును
వేదాంతంబొరుల కెపుడు వినిపించు రహిన్
వేదాంతగ్రంథంబులఁ
బ్రోదిగఁ దెలిఁగింపఁజేయ బుద్ధి వొడమఁగన్'
'ఆ నృపోత్తముఁ డొక్కనాఁ డాదరమున
నన్నుఁ బొడఁగాంచి యిట్లను : నారసింహ !
యాంధ్రమున మహావాక్య రత్నావళికి స్ఫు
టార్థముండినఁ దద్ జ్ఞానమలవడునని'
'బలువయి నారికేళఫలపాక విధంబున సంస్కృతంబునన్
వెలయుఁ దదర్థమున్ దెలియనేరక కుందు తెలుంగువారికిన్
తెలియఁగఁదేటమాటలను దెల్గునఁ డీక యొనర్పు మెల్లవా
రలు మదిమెచ్చ వా యనుఁగురాజికి నంకిత మిచ్చి యీ యెడన్'

—మహావాక్యరత్నావళి, అవతారిక, 4, 6—9 పద్యములు.

ఈ గ్రంథరచననాఁటికి వీరభద్రనృపతి భార్య లక్ష్మీనరసమాంబ పరమపదించియుండినది. ఆమె కంకితముగ నీ కృతిని సంతరింపుమని వీరభద్రనృపతి కవిని కోరినాఁడు. లక్ష్మీనరసమాంబ గుణసంకీర్తన మీ క్రిందిపద్యమున నొనర్పఁబడినది :

'పుట్టె నేధవళాక్షి భువనమోదంబుగ
 శ్రీ గొదే వంశంబు చెన్నుమీఱ
మెట్టె నే చార్వంగి మేదురయశముతో
 వైరిచెర్ల కులంబు వన్నెకెక్క
పట్టె నే సతి వీరభద్రేశ భూభార
 వహనదక్షంబైన వామపాణి
కట్టె నే తనుమధ్య కర్పూరనీహార
 కిరణరమ్యంబైన కీర్తిచేల
మా మె కురుపాము రాణి........
సద్గుణకదంబ చదువుల శారదాంబ' — పైది, అవతారిక, 12.

గ్రంథాంతమునందు లక్ష్మీనరసమాంబా వీరభద్రావనీశ్వరుల కీర్తిమూర్తిగా నొక పద్యము సంధానింపఁబడినది :

'స్థిరసంపద్యుత వైరిచెర్లకులజ శ్రీ వీరభద్రావనీ
శ్వరలక్ష్మీ నరసాంబికామలయశశ్చంద్రాతపం బెప్పుడున్
వర విద్వత్కవి భూసురప్రకర నిస్వత్వాంధకారచ్ఛటన్
హరియించున్ దగవెల్గుతన్ గువలయామోదంబు తోరంబుగన్'.

ఈ గ్రంథమునకు కురుపాము ఆస్థానపండితుఁడగు గురుదంతి వేంకటాచల శర్మగారు సుప్రభాఖ్యయగు టీకను జోడించి యున్నారు.

'సుప్రభాఖ్యా మహావాక్యరత్నావల్యాః కృతామయా
టీకేయ మనయా సమ్యక్ తుష్యతాం పరమేశ్వరః'.

కృష్ణామండలము గుడివాడ తాలూకా అంగలూరు వాస్తవ్యులును, ఆశ్వలాయనసూత్ర విశ్వామిత్ర గోత్రజులును, శేషమాంబా వేంకట నారసింహుల పుత్రులును అగు మధ్వశ్రీ నందగిరి వేంకటప్పారావు పంతులుగారు కురుపాము సంస్థానాధీశ్వరుల దర్బారులో జరిగిన సాహిత్య చర్చలలో రాజాగారి మెప్పును పొంది అనేక బహుమానములను స్వీకరించిరి. ఆంధ్ర మేఘ సందేశము, నిర్గద్య చతురముఖీ విలాసము, మైరావణ చరిత్ర, సీతారామ, ఆదికేశవ, గోపికా ప్రియ, చండమార్తాండ, దీన సంరక్షణి, రామలింగేశ్వర, శ్రుతశైల హనుమచ్ఛతకాదు లీ కవిగారి కొన్ని కృతులు.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. విశాఖపట్టణముజిల్లా వృత్తాంతసంగ్రహము, పుటలు 548 – 551.

2. Encyclopaedia of the Madras Presidency and the Adjacent States, Ed. by V.L. Sastri, Madras, 1920–21, pp. 421–424.

3. M.A.M.P., III, p. 217.

4. A. Vadivelu, The Aristocracy of Southern India, Vol. I, pp. 105–120, Vol. II, pp. 19, 22.

5. Report of the Madras Estates Land Act Committee, Part II, pp. 43, 44.

# కోలంక-వీరవరము

## ప్రవేశిక

పిఠాపుర సంస్థానమునందలి గొల్లప్రోలు పరగణాలోని కొన్ని గ్రామములతోఁ గూడినది 'కోలంక' ఎస్టేటు. వీరవరము పెద్దాపురము సంస్థానము నుండి 1844లో పిఠాపురముసంస్థానమువారు ఖరీదుచేసిన ఎస్టేటు. 1935 నాఁటికి కోలంక ఎస్టేటును, వీరవరము ఎస్టేటునందలి 'ఎ' భాగమును రాజా శ్రీ ప్రద్యుమ్నకృష్ణ మహీపతి సూర్యారావుబహద్దరుగారిపేర నుండినవి. వీరవరము ఎస్టేటునందలి బి. సి భాగములకు రాజా శ్రీ రామాయమ్మరావు బహద్దరుగారు జమీందారిణి. 1938 లో వీని రాఁబడి రూ. 1,43,647 లు. పేష్కషు రూ. 37,000 లు.

## సంస్థాన చరిత్రము

పిఠాపుర సంస్థానమును 1793—1828 మధ్య పాలించిన రావు వెంకట నీలాద్రిరాయణింగారికి (1770—1828) రావు వేంకటసూర్యరాయణింగారు (1824—1850), రావు వెంకటమహీపతిరాయణింగారు అని ఇద్దఱుకుమారులు. ఈ యిర్వుర తల్లి బొబ్బిలివాస్తవ్యులు చెలికాని రామారాయణింగారి తనయయగు భావయాంబ. తండ్రియనంతరము జ్యేష్ఠుఁడగు వెంకటసూర్యరాయణింగారు (1844—1850) సంస్థానపాలనమును స్వీకరించిరి. వీరి తమ్ములైన కుమార వెంకటమహీపతిరాయణింగారు తమ కుటుంబపోషణము నిమిత్తము అర్థించుటచేత సంస్థానమునందలి గొల్లప్రోలు పరగణాలోని తొమ్మిదిగ్రామములు కుటుంబవ్యయమునకై ప్రసాదింపఁబడినవి. ఇట్లు సంస్థానమునుండి విడఁదీయఁబడిన ఈ గ్రామములు 'కోలంకముఠా' అనుపేర ప్రత్యేకముగా నొక జమీగా రూ. 14,352 లు పేష్కషుతో రూపొందినది.

వెంకటమహీపతిరాయణింగారికి చెలికానివారి ఆఁడుఁబడుచగు లక్ష్మీనరసయ్యమ్మగారివలన సూర్యరాయణింగారు, ధర్మారాయణింగారు అను నిరువురు కుమారులుండిరి. ధర్మారాయణింగారు 1881 లో మరణించియుండిరి. జ్యేష్ఠుఁడైన సూర్యరాయణింగారు తమ పితామహియైన శ్రీ రాణీ భావయమ్మారావు వలన నొసంగఁబడి రూ. 26,876 లు పేష్కషు గలిగిన వీరవరము పరగణాయును, తమ జనకులగు కుమారవెంకటమహీపతిరాయణింగారికి తమ పెత్తండ్రిగారైన శ్రీ రాజా వెంకటసూర్యరాయణింగారి వలన నీఁబడిన

కోలంక ఎస్టేటును గలిపిన 'కోలంక-వీరవరము' లకు జమీందారులయిరి. సూర్యరాయణింగారిభార్య చెల్లయ్యమ్మ భర్త అనంతరము 1887లో జమీందారిణి యయినది. సంతతి లేనందున ఈమె భర్తఅనుజ్ఞచే కుమారమహీపతిరావు గారిని దత్తుతీసికొనిరి. కుమారమహీపతిరావుగారి భార్య రామాయమ్మ. ఈమె చెలికాని భావన్నారాయణింగారి తనయ. ఎర్నగూడెము ఎస్టేటుదారులు, కావ్య కలానిధి లచ్చారావుగారి సోదరి. బాల్యమునందే 1897 లో నిస్సంతుగా ఈమెభర్త మరణించెను. 1932 లో వెంకటగిరిరాజాగారి నాలుగవ కుమారుఁడు దత్తుఁడుగా వచ్చి జమీందారీకి పాలకుఁడయినాఁడు. కోలంక సివారుగ్రామ మగు లక్ష్మీనరసాపురము జమీందారుల వాసస్థానము.

## సాహిత్యపోషణము

మహీపతిరాయణింగారి భార్యయగు లక్ష్మీనరసయ్యమ్మగారు చెలికాని లచ్చారావుగారి మేనయత్త. ఈమె అనేక ధర్మకార్యములు చేసియుండిరి. భవశేశ్వరమున చర్ల బ్రహ్మయ్యశాస్త్రులవారిచే సంస్కృతపాఠశాలను స్థాపింపఁ జేసి బాలుర భోజనాదికములకు భూవసతిని కల్పించిన పుణ్యశాలిని. అద్యత నాంధ్రకవిప్రపంచనిర్మాతలు తిరుపతివేంకటకవు లీ బ్రహ్మయ్యశాస్త్రిగారియొద్దనే చదివినది.

ఈ యాస్థానమునందు కొత్తపల్లి లచ్చయ్య, కూచిమంచి సుబ్బారావు మొదలగువారు ఆస్థానకవులుగా నుండిరి. కొత్తపల్లి లచ్చయ్య (1863—1898) పిఠాపురము సమీపమునఁగల చెందుర్తి గ్రామవాస్తవ్యుఁడు తెలగాణ్య వైదికబ్రాహ్మణుఁడు ; కౌండిన్యసగోత్రుఁడు ; ఆపస్తంబసూత్రుఁడు. సుబ్బా మాంబా రామనల పుత్రుఁడు. కొత్తపల్లివారు చిరకాలముగా పిఠాపురముపాలకు లగు రావువారి సంస్థానమున కాశ్రితులు. ఎనమండుగు చిన్నదమ్ములలో లచ్చయ్య నాల్గవవాఁడు. ఈతఁడు రాణి లక్ష్మీనరసయ్యమ్మారావుగారి కోడలగు శ్రీ చెల్లయ్యమ్మారావుగారి ఆశ్రితుఁడు. కవి తన పోషకురాలిపై 'చెల్లయ్యమ్మా' అను మకుటముగల కందపద్యములతో 'చెల్లయ్యమ్మారావు శతకము'ను రచించినాఁడు. ఉదాహరణమునకు కొన్ని పద్యములు :

'శ్రీ వెలయ సార్వకాలము
మీ విమలాన్వయసమృద్ధి మీఱ సదయుఁడై
దీవన లొసఁగుచు వరల
క్ష్మీవిభుఁడు దలంచునమ్మ చెల్లయ్యమ్మా'.
'ఎట్టి కులంబునఁ బుట్టిన
నెట్టి గుణాగుణవిభేద మెఱిఁగిన నరు దొ

బ్బుట్టునఁ బొట్టిన కర్మము
నెట్టు కుడుపకుండదమ్మ చెల్లయ్యమ్మా'.
'భూసుర కవిసుజనమనో
ల్లాసతకై క్రొత్తపల్లి లచ్చయ పేర్కన్
జేసి యొక శతకరత్నము
జేసెం గడు మెచ్చవమ్మ చెల్లయ్యమ్మా'

ఇతఁ డింకను ఆరోగ్యప్రాప్తి నిమిత్తము దుష్కరప్రాసఘటితమగు సూర్య శతకమును, తిరుపతివేంకటేశ్వరస్వామి కంకితముగ దాశరథీవిలాసమును రచియించెనఁట ! ఆశుకవనమునందును, సమస్యాపూరణమునందును చక్కని నేర్పు కలవాఁడఁట కవి. సూర్యశతకమునందలి కొన్ని పద్యములు :

'శ్రీ భ్రాజితకర విమతా
ఘాభ్రోద్ధూత ప్రభంజనాఖిల మహో
ద భ్రానుకంప మహితన
దాభ్రాగ్య విహార తోషితార్యా సూర్యా.'
'బ్రధ్న చతురాగమాగమ
బుధ్న ప్రభాకర దినేశ పూషణ నామా
గ్రుధ్న నిరాకరణ యహి
ద్బుధ్నాచ్యుత విధిమస్వరూపా సూర్యా'

పిఠాపురముసంస్థానాస్థాన విద్వత్కవులు శ్రీ దేవులపల్లి సుబ్బరాయ శాస్త్రిగారు (1853–1909) రచించిన 'శ్రీ మహేంద్రవిజయము' అను ఆఱాశ్వాసముల కావ్యము 'కోలంక-వీరవరము' జమీందారులైన శ్రీరాజా రావు చెల్లయ్యమ్మారావు బహద్దరువారిచేఁ బ్రకటితము. బ్రహ్మకైవర్తపురాణము నందలి యొకభాగమగు నుపమాకామాహాత్మ్యము మహేంద్రవిజయకృతికి మూలమఁట. మూలమునందలి నూటనుష్టుభశ్లోకములలోని గాథ ఆఱాశ్వాసముల విపులప్రబంధముగా నాంధ్రమున నవతరించినది. వాస్తవముగా నిది ఉపమాకాక్షేత్ర మాహాత్మ్యము. త్రివిష్టపరాజ్యభ్రష్టుఁడైన మహేంద్రునకు భగవత్కటాక్షమునఁ దుదకుఁ గలిగిన విజయమునుబట్టి మహేంద్రవిజయ మను పేరు పెట్టఁబడినది. ఇది శ్రీరామున కంకితము.

రాణీ చెల్లాయమ్మారావు బహద్దరువారు ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల మున్నగు సాహితీగ్రంథప్రకాశక సంస్థలకు రాజపోషకులుగా నుండిరి. చెల్లయమ్మారావు, రామయ్యమ్మారావు బహద్దరు వారలసంస్థానమునలంకరించిన పేరొక కవి కూచిమంచి సుబ్బారావు. వీరు ప్రసిద్ధులగు కూచిమంచి తిమ్మకవి వంశమునకు చెందినవారు. కూచిమంచి తిమ్మకవి, జగ్గకవి, రెండవ తిమ్మకవి, వెంకటరాయకవి మొదలైనవారు కూచిమంచి కుటుంబమందలి కవులు. సుబ్బా

రావుగారు మహోవ్యక్తి జీవితచరిత్రలు వ్రాయుటలో మిగుల నేర్పుగలవారు. రాణీ రావు జగ్గమాంబ జీవితచరిత్రము, రాణీ రావు రమణయాంబా జీవిత చరిత్రము వీరు రచించిన జీవితచరిత్రలలో ప్రధానమైనవి.

'శ్రీ రాణీరావు జగ్గమాంబ' అను గ్రంథము 1762—1776 మధ్య పిఠాపుర సంస్థానమును పాలించిన రావు నీలాద్రి రాయణింవారి భార్య యగు జగ్గమాంబగారి జీవిత చరిత్రము. ఈమె కసింకోట వాస్తవ్యులు, పద్మనాయక వంశ విభూషణులు శ్రీ చెలికాని రామారాయణింగారి ద్వితీయపుత్రిక. ఈమె అగ్రజయగు మల్లమ్మదేవిగారు బొబ్బిలి పాలకులలో ఆఱవతరమువారగు రాజా గోపాలకృష్ణరంగారావు బహద్దరుగారి పట్టమహిషి. జగ్గమాంబ పిఠాపురము పాలకునివలన వార్షికభరణమును గొనుచున్న రాజవంశీయుని అర్ధాంగి. పిఠాపురసంస్థానమునకు దాపురించిన యాపదలనెల్ల సహనముతో నెదుర్కొని చివరకు ప్రభువైన భర్తకు పట్టపుమహిషి కాఁగలిగిన యదృష్ట జాతకురాలు జగ్గమాంబ. ఈమె సకల భోగభాగ్యముల ననుభవించి యుద్ధభూమియందు వీరస్వర్గమలంకరించిన భర్తతోపాటు సహగమనమొనర్చిన సాధ్వీమణి. సుబోధమగు వచనమున నీ గ్రంథరచనము సాఁగినది.

సుబ్బారావుగారు హిందీ భాషయందుకూడ మంచి ప్రావీణ్యము గలవారు. వీరు 'హిందీ—తెలుగు నిఘంటువు' నొకదానిని సంధానించి ప్రకటించిరి. కవికి పోషకురాలగు రావు రామయమ్మారావుగారు దీనిని ముద్రింపించిరి.

ప్రసిద్ధులగు తిరుపతి వేంకటకవులు రావు రామయ్యమ్మారావుగారి యాస్థానమున నుండిరి. పోలవరము జమీందారు మరణానంతరము తిరుపతి శాస్త్రిగారు రెండేండ్లు జీవించిరి. ఆ కాలమున తిరుపతిశాస్త్రిగారిని రాణీ రామయాంబగారు సబహుమానముగ రావించి సర్వవిధముల నాదరించి పోషించిరి. తిరుపతిశాస్త్రి మరణానంతర మాతని కుటుంబమునకు నూటపదియాఱుల వార్షికమిచ్చుచు వచ్చిరి. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారికి నెలకిరువదియైదు రూప్యములిచ్చి గౌరవించుచుండిరి. వెంకటశాస్త్రిగారు తమ పాండవరాజసూయమునందు —

'కోలంక వీరవరముల
నేలు జమీందారురాలు హితమతితో నేఁ
డాలంబమగుచుఁ గవితో
ద్వేలుం బోషించుచుండె వెంకటశాస్త్రిన్'

అని రామయాంబగారి దాతృత్వమును గొనియాడిరి.

తిరుపతి వేంకటకవి ప్రణీతమగు ప్రభావతీ ప్రద్యుమ్నమను నయిదంకముల నాటకము రాణీ రామయాంబగారి సాహాయ్యమున ప్రచురితము. ఇది ఆమె కంకితముకూడ. ఈ నాటకమునందలి ప్రస్తావనలో —

'శ్రీరావు రామయాంబిక
శ్రీ రత్నము కీర్తికాంత దిక్కుల కాలం
కారికయగుగాత సదా
పేరైన కవీంద్రులెపుడు వినుతి యొనర్పన్'

అని రామయాంబగారిని నాటకకర్తలు కీర్తించిరి. రాణీ రామాయమ్మారావు బహద్దరువారు రాజమహేంద్రవరమునందలి ఆంధ్రేతిహాసపరిశోధకమండలికి 1927లో భూరిగావిరాళమొసఁగి, తత్పోషకవర్గమున సభ్యురాలయిరి. ఈ మండలి వారు 1922లో ప్రచురించిన రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచికకు శ్రీ రాణీ రామాయమ్మారావు బహద్దరువారు రాజపోషకులుగా నుండిరి. వీరి యన్నగారు చెలికాని లచ్చారావుగారు స్థాపించిన శ్రీరామవిలాసగ్రంథమాల కీమె పోషకురాలు. ఈమె సంస్కృతాంధ్ర భాషావిశారద. లచ్చారావుగారి సాహితీ పరిశ్రమము సమస్తమీమె చేతిచలువవలన సాధ్యపడినదన్న అత్యుక్తికాఁజాలదు.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. శ్రీరాం వీరబ్రహ్మకవి, శ్రీ పీఠికాపుర సంస్థాన చరిత్రము.
2. చెలికాని సూర్యారావు, శ్రీ లచ్చారాయ జీవితచరిత్రము, 1924.
3. కూచిమంచి సుబ్బారావు, రాణీ జగ్గమాంబ చరిత్రము.
4. Report of the Madras Estates Land Act Committee, Part II, p. 56.
5. C. A. Sonter & K. N. K. Ayyar, Gazetteer of the East Godavari District, Vol. II, Madras, 1935.

# గద్వాల

## ప్రవేశిక

దీనికి కేశవనగరమనియు పర్యాయనామము గలదు. దీని వైశాల్యము 864 చ. మై. ఇందు 214 గ్రామములుండినవి. జనాభా లక్షకు పైమాట. రాఁబడి ఆఱు లక్షలు. సాలుసరి కప్పము 86,840 హాలీసిక్కా నాణెములు. రాయచూరునకు తూర్పుగా ముప్పదిమైళ్ళ దూరమునఁ గల గద్వాల ఈ సంస్థానమునకు ముఖ్యపట్టణము. కృష్ణా, తుంగభద్రానదుల సంగమస్థలమునకు పడమరగానున్న సారవంతమయిన నేలలతో నీ సంస్థాన మమరియుండినది. విజయనగర చక్రవర్తులకును, బహమనీ సులతానులకును వైరకారణమయిన భూమి 'దో ఆబ్' గద్వాలసంస్థానమునందలిది. ఇంచుమించుగా మూఁడు శతాబ్దులపాటు బహమనీ–విజయనగర సామ్రాజ్యసేనాసమూహముల వీర రక్తముచే తడిసిన నేల యిది. అంతకుపూర్వ మిది కాకతీయులపాలనము లోనిది. ఆ పిమ్మట విజయనగరపాలకులకును, బహమనీ సులతానులకును చేతులు మాఱుచుండెడిది. ఓరుగల్లు పతనముతో ఈ సీమ విజయనగర చక్రవర్తుల గొడుగునీడకు వచ్చినది. 1565 నాఁటి తళ్ళికోటయుద్ధము తరువాతి పంపకములలో 'దో ఆబ్' బిజాపూర్ సులతాను వంతునకు వచ్చినది. పిమ్మట ఔరంగజేబుకాలమున మొగలుచక్రవర్తుల యేలుబడిలోనికి పోయినది. మొగలు చక్రవర్తుల క్షీణదశలో దక్కను సుబాదారయిన ఆసఫ్‌జా నిజామునకు సామంతరాజ్యముగ మాఱినది. సైనికవ్యయము నిమిత్తము నిజాము 1853 లో రాయచూరు – దోఆబ్ ప్రాంతములను తాత్కాలికముగా బ్రిటీషు కుంఫిణీవారికి స్వాధీనపఱిచినాఁడు. దీనిమేరకు కుంఫిణీవారు నియమించిన కమీషనరు అధికారమునందు ఇంచుమించు ఎనిమిదియేండ్లపాటు గద్వాల ప్రవర్తిల్లినది. కాని గద్వాలవారి సివిల్, క్రిమినల్ అధికారములు యథాపూర్వముగా చెల్లుబడి యగుచుండినవి. 1857-58 నాఁటి సిపాయీల పితూరీ సందర్భమున నిజాము చేసిన తోడ్పాటునకు బ్రిటీషువారు సంతోషించి రాయచూరు - దో ఆబ్ ప్రాంతము లను తిరిగి నిజామునకు దఖలుపఱిచిరి. ఇట్లు మరల గద్వాల నిజాము నధికారముక్రిందికి వచ్చినది. నిన్న మొన్న నిజామునకును, భారతప్రభుత్వము నకు జరిగిన ఒడంబడికమేరకు గద్వాల హైదరాబాదురాష్ట్రమునం దొకభాగమై నేఁ డాంధ్రప్రదేశమునందంతర్భూతముగ నున్నది.

## సంస్థాన చరిత్రము

కాకతీయుల కాలమునాఁడు గద్వాలపాలకుల పూర్వులలో నొకరికి కృష్ణా, తుంగభద్రా నదుల మధ్యనున్న కొన్ని సీమలపై 'నాడగౌడగి' అధికారము సంక్రమించియుండెనఁట! ఆ పిమ్మట విజయనగర చక్రవర్తులకు వీరి పూర్వులు కొంతకాలము సామంతులుగా నుండిరఁట. విజయనగర సామ్రాజ్య పతనముతో సార్వభౌమాధికారము చేయి మాఱుటవలన వీరి పూర్వులు బిజాపూరు సులతానులనుండి 'నాడగౌడు', 'సర్‌నాడగౌడు' అధికారములను బడసియుండిరఁట. కర్నూలుమండలమునందలి పెక్కు కోట కొత్తళములపై గద్వాలవారి జెండా ఎగురుచుండినదఁట! కర్నూలునవాబుల వలనఁగూడ కప్పములు వసూలుచేయుచు వీరి పూర్వులు ప్రాధాన్యమును వహించియుండిరి.

గద్వాలప్రభువుల గృహనామము ముష్టిపల్లివారు. వీరిది ముడిమిళ్ళ గోత్రము. ప్రసిద్ధమగు పాకనాటి రెడ్లవంశము వీరిది.

'శ్రీ ముష్టిపల్లినామ
గ్రామ ప్రాముఖ్య నాడగౌడు కులమునన్
క్షేమను మాధవసేవా
శ్రీమంతుఁడు వెలసె పెద్దనృపవరుఁడెలమిన్' —1—35.

కాణాదము పెద్దన సోమయాజికృతమగు ముకుందవిలాసము కృత్యవతరణిక యందలి పైపద్యమువలన ముష్టిపల్లి పెద్దన నృపుఁడు గద్వాలప్రభువుల మూల పురుషుఁడుగా సంభావింపనగుచున్నాఁడు. ఇతనిభార్య పూడూరి నాడగౌడు వీరారెడ్డి తనయయగు బక్కమాంబిక.

'అతఁడు పూడూరు నాడగౌడైన వీర
ఘనుని తనయను బక్కాంబికన్ ముదమునఁ
బెండ్లియాడెఁ బులోమజఁ బ్రేమ నింద్రుఁ
డెలమి సంతోషమున వరియించినటుల'

— యథాశ్లోకతాత్పర్య రామాయణప్రబంధము, కృత్యవతారిక, పు. 7.

గద్వాలవారి మూలపురుషుఁడగు పెద్దన వీరారెడ్డిగారి యిల్లటపుటల్లుఁడుగా నుండి నాడగౌడు అధికారమును విశాలభూములకు విస్తరింపఁజేసినవాఁడు.

'కందనవోలు ముఖ్యముగఁ గల్గిన సీమల నాడగౌడు కీ
ర్తిం దగి తుంగభద్రకును కృష్ణకు మధ్యమసీమ రాజ్యల
క్ష్మిం దగి ముష్టిపల్లి కులసింహుఁడు పెద్దనభూవరుండు........'

— ముకుంద విలాసము, 1—41.

బక్కాంబా పెద్దభూవిభుల కుమారుఁడే ప్రసిద్ధుఁడయిన పెదసోమ

భూపాలుఁడు. ఈయన ప్రామాణికసాహిత్యముసందేగాక, జానపదసాహిత్యము నందును ప్రచారప్రశస్తులను బడసినవాఁడు. జానపదసాహిత్యమునందు శోభనాద్రి యనుపేర నీయన వ్యవహృతుఁడు. పెదసోమభూపాలుఁడు గద్వాల దుర్గమును క్రీ. శ. 1698—1704 మధ్య నిర్మించినవాఁడనియు, గద్దపల్లె యను గ్రామమునొద్దగల పెద్ద బయలున నిర్మింపఁబడిన పట్టణము గావున గద్వాల యను పేరు సిద్ధించెననియు చరిత్రకారుల విశ్వాసము.* కాణాదము పెద్దన సోమయాజి తన ముకుందవిలాసమునందు—

'అట్టి పెదసోమభూజాని హర్షమూని
ప్రబల గద్వాల యను మహారాజధాని
నతిశయించి ప్రతిష్ఠించి యందు మించి
ప్రేమ పూడూరి కేశవస్వామి నిలిపె' — 1—48.

అని నిరూపించిన చారిత్రకాంశము పై చరిత్రకారుల విశ్వాసము నామ్రేడింప వచ్చినది.

పెదసోమభూపాలుఁడు సర్వతోముఖప్రజ్ఞ గలిగిన పరిపాలకుఁడు. దక్కను సులతానులను—ముఖ్యముగా బిజాపూరు సులతానులను—జయించుటలో నీతఁడు ఔరంగజేబునకు ఎంతో తోడ్పడెనఁట. ఈతని ధైర్యస్థైర్యములకు, శౌర్య సాహసములకు మొగలుపాదుషా ఔరంగజేబు ఎంతయో సంతోషించి 1704 లో రాజా బిరుదమును ప్రసాదించి గద్వాలప్రాంతముపై ఆధిపత్యమునకు సన్నదు నిచ్చి సత్కరించెనఁట. పెదసోమభూపాలుఁడు గద్వాలలో కేశవస్వామి ఆలయమును గట్టించి పూడూరినుండి కొనితెచ్చిన కేశవస్వామి నిందు ప్రతిష్ఠించెనఁట. వీరి పూర్వపు రాజధాని రాజోలు. సోమభూపాలుని కాలమున రాజధాని రాజోలునుండి గద్వాలకు మాఱినది. గద్వాలకోటలో వెలసిన చెన్న కేశవస్వామి గద్వాలపాలకుల కులదైవము. ఈ కేశవస్వామిపేర గద్వాల కేశవనగరమనియు వ్యవహరింపఁబడుచున్నది. కేశవభొట్లు అను బ్రాహ్మణ బాలుని ద్వారమున గద్వాలప్రభువుల కీ ప్రభుత్వప్రాభవములు సంప్రాప్త మయినట్లు లోకము వాకొనుచున్నది.†

పెదసోమభూపాలునకు అమ్మకాంబ, లింగాంబ, రామాంబ యని ముప్వురు భార్యలు. లింగాంబవలన తిరుమలరాయలు, రామరాయలు అను నిద్దరు కొడుకులు గలిగిరి. తిరుమలరాయలు తండ్రి తరువాత కొంతకాలము పాలించెను. ఇతని పాలనము తృప్తికరముగా లేనందున సోమభూపాలుని పట్టపురాణియగు అమ్మకాంబ సింహాసన మధిష్ఠించినది. ఆ పిమ్మట తిరుమల

* డాక్టర్ మారేమండ రామారావు, గద్వాల పెదసోమభూపాలుఁడు, ప్రబుద్ధాంధ్ర, సంపుటము 6, సంచిక 4, 1935 ఏప్రిల్, పుటలు 114-116.

† చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి, కథలు-గాథలు, సంపుటి 1, పు. 487.

రాయల తమ్ముఁడయిన రామరాయలు (1724—1762) గద్దెనెక్కెను. రామరాయలు నిస్సంతగుటవలన తిరుమలరాయల రెండవభార్యయగు మంగమాంబ వలన జన్మించిన చినసోమభూపాలుని దత్తు తీసికొనిరి. చినసోమన (1762—1793) తన పితామహునివలె నతిప్రసిద్ధుఁడు. చినసోమనృపాలుని పట్టమహిషి రామాంబ. వీరికుమారుఁడు శ్రీరామరాయలు. ఈతఁడు 1793 లో సంస్థాన పాలనమును స్వీకరించెను.

వీరి కోవలో రాజా రామభూపాలరావు (1844—1902), రాజా సీతారామ భూపాల్ బల్వంత్‌బహద్దర్ (1896—1924) ప్రసిద్ధులు. రాజా రామభూపాల రావుగారి దత్తపుత్రులు రాజా సీతారామ భూపాల్ బల్వంత్ బహద్దర్‌గారు. 1902 లో రాజా రామభూపాలరావుగారి మరణముతో సంస్థానము పదియేండ్ల పాటు కోర్టు ఆఫ్ వార్డ్సు పాలనమున నుండినది. మైనరుగానుండిన సీతారామ భూపాల బల్వంత్ బహద్దరుగారు తమకు ప్రాజ్ఞత వచ్చినతరువాత 1912 లో రాజ్యాధికారమును చేపట్టిరి. 1924లో సీతారామ భూపాల్‌గారి అకాలమరణముతో గద్వాల సంస్థానము పెక్కుచిక్కులకు లోనయినది. కాని రాణియగు శ్రీ ఆదిలక్ష్మీదేవమ్మగారి చాకచక్యమువలన సంస్థానము పూర్వవైభవమును గోల్పోకుండ విరాజిల్లినది. వీరి జ్యేష్ఠతనయ శ్రీ రాణీ సత్యవరలక్ష్మీదేవిగారు; ఈమె దోమకొండ సంస్థానప్రభువు సోమేశ్వరరావుగారి భార్య. శ్రీ రాణి ఆదిలక్ష్మీదేవమ్మగారి తరువాత రాజా శ్రీ కృష్ణరామభూపాల్‌గారు గద్వాల సంస్థానమును పాలించిరి.

## సాహిత్యపోషణము

'నాణెంబైన మెఱుంగు కబ్బములతో నవ్యాకృతుల్ వాఙ్మయశ్రేణిం దీర్చిన సత్కవీశ్వరులకున్ సేవాప్రదేశంబు ....'[1] అయిన తెలంగాణమునందలి గద్వాల సంస్థానమునకు 'విద్వద్గద్వాల' యనుపేరు సార్థకనామము. పెదసోమ భూలుఁడు మొదలుగా చిట్టచివరి పాలకుఁడు రాజా శ్రీ కృష్ణరామభూపాలుని వరకు గద్వాల ప్రభువులు వితరణగుణమునను, విద్యాపోషణమునను భోజకృష్ణ రాయ భూజానుల తలపించునట్టి యుత్తమసాహితీపోషకులు[2].

పెదసోమ భూపాలుఁడు కర్త; కారయిత. ఏఁటేఁట కార్తిక మాసమున పండితులకును, మాఘమాసమున కవిగాయకులకును సమ్మానము సలుపు సత్సంప్రదాయమును పెదసోమభూపాలుఁడే మొదట నెలకొల్పినవాఁడు. ఈ సంప్రదాయము నాఁటికి నేఁటికిని కొనలుసాఁగుచుండుట గమనింపఁదగిన

[1] శేషాద్రి రమణకవులు, తెలంగాణము, ఆంధ్రపత్రిక, సంవత్సరాదిసంచిక, బహుధాన్య, 1938, పు. 46.

[2] 'నేఁడు సిరిగల ప్రతి రెడ్డివీడుకూడ
పండితుల పాలిటికి పిల్ల కొండవీడు'

—దువ్వూరి రామిరెడ్డి.

విశేషము. సోమభూపాలుని యాస్థానమున హరిభట్టు, కొటికలపూడి వీరరాఘవ కవి, కాణాదము పెద్దనసోమయాజి మొదలగు విద్వత్కవులుండిరి. పెదసోమ భూపతి రతిశాస్త్రమను మూఁడాశ్వాసముల ప్రబంధమును, అష్టపదులను రచించిన రాజకవి. రతిశాస్త్రము హరిభట్టు ప్రణీతమగు సంస్కృతకృతికి నాంధ్రానువాదమని పరిశీలకుల భావన. జయదేవకవి విరచితమగు గీత గోవిందమునందలి 'ప్రియే చారుశీలే' యను ప్రశస్తగీతమునకు సంస్కృతాంధ్ర భాషలలో ఛందోబద్ధముగా సంధానితమయిన వ్యాఖ్యారూపవిస్తృతి సోమ భూపాలుని 'అష్టపది'. అష్టపదియందలి యొక్కొక్క చరణమును శ్లోకము, పద్యము, దరువు, చూర్ణిక—యను నాలుగురీతుల పెంపుసేయఁబడినది. సోమ భూపాలుని మధురసాహితీనిర్మాణనైపుణ్యము, నాట్యకళాకౌశలము, రాగతాళాభి నయజ్ఞానము ముప్పేటగా మూర్తికట్టిన రసికజనమనోభిరామమయిన రచనమిది.

'గద్వాల సోమనరపాలమణి ప్రణీతం
పద్మావతీంద్ర జయదేవకవీంద్రగీతం
రాధామధిప్రథిత మాధవసూక్తిజాతం
మాధుర్యచాటుఫణితం జయతుప్రభూతం'

దీని యసమగ్రప్రతి ప్రాచ్యలిఖిత గ్రంథాలయమున ఆర్. నెంబరు 900(b) గా నున్నది. ఇది చినసోమభూపాలకృతమని పరిష్కర్తల భావన*. మచ్చున కొక పద్యము :

'మదనమహానలంబు పలుమాఱు దహింపఁగఁజేసె నా మదిన్
వదనసరోజదివ్య మధుపానమొసంగు మకారణంబుగాఁ
బదరిన కోపమున్విడిచి బాగుగ మత్ప్రియురాలవైన యో
మదవతి! చారుశీల! నను మన్నన సేయవె రాధికామణీ'

కాణాదము పెద్దనసోమయాజి తన రామాయణమున కృతిపతియగు సోమభూపాలు నిట్లు వర్ణించెను :

'తనదు సోమసమాఖ్యఁదనరు షోడశమహా
దానకళాధురంధరత మించి....
తన సోమవంశవర్తన కుచితంబుగా
విజయవిఖ్యాతిచే విస్తరించి....
అతఁడు జెలువొందు మాఘమాసాది ఘటిత
రామకేశవ గోపాల రథమహోత్స
వారచిత హేమమణి తులాభార దాన
భరిత భువనాళి సోమభూపాలమౌళి'.

*Bulletin of the Govt. Oriental Manuscripts Library, Madras, Vol. VIII, No. 2, pp. 43–55.

పెదసోమనృపతి ఆనాఁటికి ఆంధ్రమునందు సంధానితమయిన భాస్కరా ద్యాంధ్ర రామాయణముల అనువాద పద్ధతిని గమనించి ఆ ఫక్కికతో తృప్తి వహింపక వాల్మీకి రామాయణమును యథాశ్లోకతాత్పర్య నిరూపణరూపపూర్ణముగ రచియింపఁ జేయవలయునను నాసక్తికలిగి తన యాస్థానకవులకు తన యుద్దేశము నెఱిఁగించెను. ఆస్థానకవు లొక్కొక్కరు నొక్కొక్క కాండమును సోమ భూపాలుని యాజ్ఞానుసారము వాల్మీకి రామాయణమును యథాతథముగా ననువ దింపఁగడఁగిరి. చినసోమనృపాలునికాలమున నీ యాంధ్రీకరణోద్యమము నిర్విఘ్నముగా పరిసమాప్తమయినది. ఇది యథాశ్లోక తాత్పర్య రామాయణ ప్రబంధ మనుపేర సంధానింపఁబడి ఇంచుమించుగా నిన్నూఱేండ్ల తరువాత గద్వాలభూపతి రాజా రామభూపాలరావుబహద్దరు (1844–1902) గారిచే వారి సాహిత్యవిద్యాముకురముద్రాక్షరశాలలో శా. శ. 1818 లో ముద్రితమయినది. బాల, అయోధ్య, అరణ్య, కిష్కింధాకాండములు మొదటి సంపుటముగను, సుందర, యుద్ధకాండములు రెండవ సంపుటముగను వెలువడినవి. మొదటి సంపుటము రాజా రామభూపాలరావుబహద్దరు ఆస్థానవిద్వాంసులగు బైరంపల్లి తిరుమలరాయ పరిష్కృతము ; రెండవ సంపుటము సీతారామభూపాల్ బహద్దరు గారి యాస్థానకవులగు ఆదిపూడి ప్రభాకరకవి పరిష్కృతము.

ఈ రామాయణమునందలి వివిధకాండములయు తత్కర్తలయు వివరణ మిది :

| కాండము | ఆశ్వాస సంఖ్య | కవి నామాదికములు |
|---|---|---|
| బాలకాండము | 3 | ఉభయకవితానిస్సహాయసాహితీవిహార కాణాదము పెద్దనసోమయాజి |
| అయోధ్యాకాండము | 5 | విద్వన్మహాకవి కొత్తపల్లి రామచంద్రాచార్యులు |
| అరణ్యకాండము | 3 | ఉభయకవితానిస్సహాయసాహితీధురీణ గార్గ్యపురము సుబ్బశాస్త్రి |
| కిష్కింధాకాండము | 3 | చతుర్విధ కవితానిర్వాహక కామసముద్రము అప్పలాచార్యులు |
| సుందరకాండము | 3 | అష్టభాషా కవితాఽసమాన వైభవ ధురంధర తిరుమల కృష్ణాచార్యులు |
| యుద్ధకాండము | | ఉభయకవితానిస్సహాయ సాహితీవిహార బోరవెల్లి శేషాచార్యులు |
| పూర్వభాగము | 4 | |
| ఉత్తరభాగము | 4 | |

పెదసోమభూపాలుని కాలమున మొదలయిన ఈ రామాయణానువాదము ఏకారణముననో కొంత కొదవగా నాఁగిపోఁగా పెద సోమభూపాలుని పౌత్రుఁ

డగు చిన సోమభూపాలుఁడు తన యాస్థాన విద్వత్కవులను పిలిపించి —

'శ్రీమద్రామాయణ మిది
నేమమ్మున వృద్ధసోమనృపతి మును కవి
గ్రామణులచేత నాంధ్రము
గా మహి నిర్మింపఁబూనెఁ గావున నాకున్'
'అతని సంకల్ప మీడేర నర్థమగుట
ప్రేమ నీ కాండలన్ని జెప్పింతుఁగాన
కొదువ కాండలు మీ రింపుగూర్పవలయు
నమర కేశవదేవనామాంకితముగ' —పు. 5.

అని యాదేశించి తాతగారి యాశయమునీడేర్చినాఁడు.

ఈ రామాయణమునుండి మాదిరికి కొన్ని పద్యములు :

'మునుకొని వారి ధర్మపటముల్ పరిచర్మపటంబులంచు, లే
పనములు భూతి పూఁతలని, భ్రాంతి కుచమ్ములు రొమ్ముకొమ్ములం
చనియు జడల్ మెఱుంగు జడలంచును గానము సామమంచు మం
డనములు పుష్పకాండమని నమ్మి విభాండక సూనుఁడుండఁగన్'
—బాల. పు. 15.

'మదకలనాద పక్షిగణమండితమై జలజాకరాది సం
పదకును కందళంబులకు పట్టయి కామిజనుల్ రతిన్ బెనం
గఁదనరు కేళికావనులు గన్గొననయ్యె దిశాశిరాలఁగా
పదపడి సారె మ్రోయుగలి వర్త్రిలు మ్రాఁకులు మోదశూన్యమై'
—అయోధ్య. పు. 196.

'ఉరుతరమైన విక్రమము నొప్పినవానిని నీలనీరద
స్ఫురణము గల్గువాని నతిశుభ్రభుజాంతరుఁడైన వాని ని
ర్జరపరిపంథినాథుఁడు రసాస్థలి శాంతి వహించు హవ్యవా
డ్వర రుచిసామ్యమున్ గలుఁగువాని కనుంగొనె నా జటాయువున్'
—అరణ్య. పు. 319.

కనుగొని యశ్రుధార లొలుకన్ నిజపార్శ్వ నివాసియైన త
మ్ముని కడు దీనుఁడై రుదితమున్ పచరింపదొణంగె నిట్ల నో
యనుజ మహీజ రాత్రిచరుఁడభ్రమునన్ గొనిపోవ నంబరం
బున తన సొమ్ములన్ బొదివి భూమిపయిన్ బడవైచెఁ జూడుమీ'
—కిష్కింధ. పు. 13.

'ఆ రఘువీరుఁడాహవమునందున వాలిని ద్రుంచి వృక్ష సం
చారకులేశుఁడైన రవిసంభవు రాజ్యమునందు నిల్పె నీ

వారయ మున్నెఱుంగుదువు నా హరివర్యుఁడు వాలి యాజిలో
నా రఘువర్యుచే హతుఁడునయ్యె నొకమ్మునఁ గీశమాత్రుఁడై'
—సుందర. పు. 69.

'సమరక్షోణిని పేసెనెట్లు నముచిన్ జంభారి దంభోళి న
ట్లు మరుత్సూనుఁడు నా యకంపను నిశాటున్ శైలమున్ వేసినన్
సముదగ్రంబగు నా నగాగ్రమును రక్షఃపాలుఁడాతండు చూ
చి మహార్ధేందువులైన బాణములచే ఛేదించె దూరంబుగాన్'
—యుద్ధ. పు. 71.

పెదసోమభూపాలుని పౌత్రుఁడును తిరుమలరాయని పుత్రుఁడుననగు చినసోమభూపాలుఁడును (1762—1793) కవిపోషకుఁడు, నవభోజరాజ యని యీయన బిరుదు[1]. తమ పితామహు లుద్యమించి యఱగొఱగా పూర్తిచేసిన యథాశ్లోకతాత్పర్య రామాయణ రచనను పారముముట్టఁజేసినట్లు ముందే నిరూపింపఁబడినది.

19 వ శతాబ్ది ఉత్తరార్ధమునకు చెందిన గద్వాలప్రభువు ముష్టిపల్లి రామభూపాలుఁడు ఛందోముకుర మను సంస్కృతగ్రంథమును రచించి లాక్షణికుల మెప్పునుబొందినవాఁడు. పురాణము దీక్షాచార్యు లీ రాజకవికి విద్యాగురువు. ఈ రామభూపాలుని దత్త తనయుఁడు సీతారామభూపాలుఁడు సైతము విద్వత్కవి పోషకుఁడు[2]. ఆశుకవిత్వము, అవధానవిధానము, సమస్యాపూరణము మున్నగున వీయనకుఁ బ్రీతికరములు. సీతారామభూపాలుని యనంతర మాయన ధర్మపత్ని రాణి ఆదిలక్ష్మీదేవమ్మగారు పూర్వరాజన్యుల సంప్రదాయమును నిపుణముగా నిర్వహించిన సాధ్వీమణి.

కొందఱు గద్వాలాస్థానకవులు :

## కాణాదము పెద్దనసోమయాజి

ఆత్రేయసగోత్రుఁడు, ఆశ్వలాయనసూత్రుఁడు, చతుర్విధ కవితా విశారదుఁడు. కొంతకాలము సురపురసంస్థానాధీశుల యాస్థానమునందుండి యాంధ్రమున మత్స్యపురాణమును సంతరించి 'శేషశైలేశలీల' యను అపంచవర్గీయ వర్ణఘటితమగు కావ్యమును రచించినవాఁడు. ఆ పిమ్మట గద్వాల

1 'సుకవుల కొక రొక్కరి కొసంగె నే ఘనుం
డలరి వేనూట పదార్లుగాగ' —1—72.
అని ముకుందవిలాసకర్త చినసోమనృపాలుని కీర్తించినాఁడు.

2 'విపుల గద్వాలసామ్రాజ్య విభవకలిత
లలితసింహాసనుండు కలాకలాప
కవితిలక దివ్యగవిభావభవమనోజ్ఞ
మూర్తివెలయు సీతారామ భూవరుండు' —పౌండరీకము, అవతారిక.

సంస్థానమున 'భద్రాపరిణయ' మను నామాంతరముగల ముకుందవిలాసమును, అధ్యాత్మ రామాయణమును, యథాశ్లోక తాత్పర్య రామాయణమునందలి బాల కాండమును నిర్మించినవాఁడు.

## కిడాంబి వేంకటాచార్యులు

శఠమర్షణ గోత్రజుఁడు, ఆపస్తంబసూత్రుఁడు, సర్వతంత్ర స్వతంత్ర కవితార్కికకంఠీరవ శ్లేషయమక చక్రవర్తిత్యాది వివిధ బిరుద విరాజితుఁడు. అలంకార కౌస్తుభము, భావశతకము, ఝంఝూమారుతము, శృంగారలహరి, హయగ్రీవ దండకము మున్నగున వీయన సంస్కృతరచనలు. అచలాత్మజా పరిణయమను నాంధ్రద్వ్యర్థి కావ్య మీతని కృతి. కృతినామమునందును శ్లేష నాశ్లేషించిన కావ్యములలో నిదే మొదటిది. రెండవది గద్వాలసంస్థా నాస్థానకవి యగు పోకూరి కాశీపతి రచించిన సారంగధరీయమను త్ర్యర్థి కావ్యము.

## కామసముద్రము అప్పలాచార్యులు

విద్వత్కవికుంజర బిరుదాంకితుఁడు, చతుర్విధ కవితావిశారదుఁడు, సంస్కృత ప్రాకృతాంధ్రభాషలలో శతాధిక గ్రంథములను సంధానించిన వాఁడు. కృష్ణలీలాతరంగిణిని ఆంధ్రాష్టపది యనుపేర తెలుఁగుసేసినవాఁడు. యథాశ్లోకతాత్పర్యరామాయణమునందలి కిష్కింధాకాండ మీతని రచన.

## కర్నమడకల అనంతాచార్యులు

న్యాయ వేదాంత వ్యాకరణ మీమాంసా సాహిత్యములందు దృఢ వ్యుత్పత్తి గౌరవము గలవాఁడు. కాశీనుండి శివకుమారపండితుఁడు వచ్చి గద్వాలసంస్థాన విద్వాంసుల నందఱ నోడింపఁగా వీరు కాశీపండితుల పూర్వ పక్షమును పరాస్తమొనర్చి శివకుమార పండితులకు ప్రేమాస్పదులయిరి. తమ జీవితము చరమదశలో కాశీక్షేత్రమున నివసించి యచటనే పరమపదించిరి. ఆచార్యవింశతి, ఆంధ్రశబ్ద చింతామణి, మదనవిజయభాణము మున్నగునవి వీరి కృతులు.

## కొత్తపల్లి రామచంద్రాచార్యులు

విద్వన్మహాకవి బిరుదాంకితులు, యథాశ్లోకతాత్పర్యరామాయణము నందలి పంచాశ్వాసపరిమితమగు అయోధ్యాకాండము వీరి రచన.

## గార్గ్యపురము సుబ్బశాస్త్రి

ఉభయ కవితా నిస్సహాయ సాహితీధురీణ బిరుదాంకితులు. పై రామాయణమునందలి అరణ్యకాండము వీరి కృతి.

## తిరుమల కృష్ణమాచార్యులు

అష్టభాషాకవితాధురంధరులు. పై రామాయణమునందలి సుందరకాండ వీరి రచన.

## బోరవెల్లి శేషాచార్యులు

పై రామాయణమునందలి యుద్ధకాండము వీరి రచనము.

## కొటికలపూడి వీరరాఘవాచార్యులు

శ్రీ రాజా పెదసోమభూపాలరావుగారి యనుమతిని యథాశ్లోక తాత్పర్య భారతోద్యోగ పర్వమను అష్టాశ్వాసపరిమిత మహాప్రబంధమును గైసేసినవారు. గద్వాలసంస్థాన విద్వాంసులు పుల్లగుమ్మి వేంకటాచార్యులచే పరిష్కృతమయి రాజా రామభూపాలరావుగారిచే ప్రచురితమయిన ప్రశస్తకృతి ఇది. పూడూరి కేశవస్వామి కంకితము. కవి శాండిల్యగోత్రుఁడు. రంగశాయి సత్కవి పుత్రుఁడు. వినుకొండ వాస్తవ్యుఁడు*. ఇందలి యొక పద్యము :

'అనుపమ రాజసూయమహితావభృథాది పవిత్రమైన దీ
ఘనకబరీభరం బిది సగంబు కరంబున దుస్ససేనుఁడీ
డ్చినపుడు లుప్తమైనదిది చిత్రములోపలఁ బుండరీకలో
చన కురురాట్సభన్ నిలిచి సంధియొనర్చునెడన్ దలంపవే'.

## వాడాల శేషాచార్యులు

మైథిలీపరిణయమను పద్యకావ్యము వీరి కృతి.

## హొసదుర్గము వేదాంతాచార్యులు (1842—1933)

గద్వాలసంస్థాన ధర్మాధికారులు. ఆచార్యవైభవము, శ్రీకృష్ణ బ్రహ్మ తంత్రార్య వేదపాదస్తవము వీరి కృతులు.

## పుల్లగుమ్మి వేంకటాచార్యులు

సంస్థాన ధర్మాధికారులు. రాజా సీతారామభూపాలరావుగారికి విద్యాగురువు. రాజాగారిని సంస్కృతాంధ్రకవిగా తీర్చిదిద్దినవారు. వ్యాకరణాచార్యులు, శతావధానులు. అలంకారావళి, ఆదిలక్ష్మీకర్ణపూరము, ఆంధ్రవ్యాకరణ సూత్రావళి మున్నగునవి వీరి ముఖ్య రచనలు. బహుగ్రంథ పరిష్కర్తలు.

* కేతవరపు వేంకటరామకోటిశాస్త్రి, వీరరాఘవుని ఉద్యోగపర్వము, భారతి, 1960, డిసెంబరు, పుటలు 83-88.

వీరి కుమారులు పుల్లగుమ్మి అహోబలాచార్యులుగారు ప్రసిద్ధ జ్యోతిశ్శాస్త్రకర్త. అభినవతిథివల్లి, దృక్సిద్ధ గ్రహ గణితము, సూర్యసిద్ధాంతసారము మున్నగునవి వీరి ముఖ్యరచనలు.

## చేట్లూరి నారాయణాచార్యులు

1880 ప్రాంతము. గద్వాలసంస్థానమున శాస్త్రపరీక్షాధికారి. ప్రతాపరుద్రీయసారమను నలంకారగ్రంథము వీరి రచనము.

## పురాణము దీక్షాచార్యులు

రామచంపువు, రామనృపకర్ణపూరము, కావ్యోత్కర్ష, కేశవసుప్రభాతము మొదలగునవి వీరి రచనలు.

## పురాణము నరసింహాచార్యులు

వీరు సంస్థాన ధర్మాధికారులు. గద్వాల సంస్థానమున వీరికి తిరుపతి వెంకటకవులకు హోరాహోరిగా శాస్త్రవాదములు జరిగినవి. వీరు దీక్షను స్వీకరించి, సన్న్యసించి, శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ వాగీశ బ్రహ్మతంత్రపరకాలయతీంద్రుల వారను పేర ప్రసిద్ధులయిరి. జానకీపరిణయ శ్రీరామభూప చరిత్రములు వీరి ముఖ్యరచనలు.

## బైరంపల్లి తిరుమలరాయకవి

గద్వాల సంస్థానాస్థానకవులు. కాణాదము పెద్దనాదులు సంతరించిన యథాశ్లోక తాత్పర్య రామాయణ ప్రబంధమును రాజారామభూపాలరావుగారి కోరిక మేరకు పరిష్కరించినవారు. సంస్కృతాంధ్రములయందు గొప్పకవి. చాటూక్తులలో మేటి. ఆశుకవితలో నందెవేసినచేయి. ఈయన ముఖ్య రచనలేవియు లభ్యముకాలేదు.

## గాడేపల్లి వీరరాఘవశాస్త్రి (1891—1945)

విద్వత్కవులు, సంస్కృతాంధ్రములలో ననర్గళ కవితాధార గలవారు. తెలుఁగునేల నాలుగంచులు తిరిగి యవధానములు సలిపి పేరుపొందినవారు.

'రాగపశాస్తులోరడుగోరా ! అదెసూడి పెబంత మాసి బౌ
లాగవమంటకైతలొ సెలాకుపరీచ్చట ! బుద్ధిమేదయే
మో గడెకొక్క ఫొచ్చుకను వున్నపెవుండి రసిస్తడంట ! అ
బ్బే ! గదవాలకాడ పెదపెద్ద పెసంగము సేస్తడంటరా!'

అని పామరభాషితముగా వీరరాఘవశాస్త్రి అవధానవిధానమును మేడవరపు

సుబ్బరాయకవి ప్రస్తుతించినాఁడు.

శ్రీ సత్యవరలక్ష్మీ ధ్రువచరిత్రము, శ్రీ రాణీసత్యవరలక్ష్మీ రామాయణము. త్రిపురాంతక స్థలమాహాత్మ్యము మున్నగునవి వీరి ముఖ్యరచనలు. గద్వాల రాణి ఆదిలక్ష్మీదేవమ్మగారి జ్యేష్ఠపుత్రిక సత్యవరలక్ష్మీదేవిగారు. ఈమె దోమకొండ సంస్థాన పాలకులగు రాజా సోమేశ్వరరావుగారి భార్య. చిన్న వయస్సునందే సత్యవరలక్ష్మీదేవిగారు పరమపదింపఁగా నామె స్మృత్యర్థము గద్వాల రాణీగారి యాజ్ఞానుసారము యువరాజ్ఞీ నామ చిహ్నితముగ సీతా కళ్యాణ గాథ 'శ్రీ రాణీ సత్యవరలక్ష్మీ రామాయణ' మను పేర ద్విపద కావ్యముగాఁ గూర్చఁబడినది. ఇందు 1920 ద్విపదలు గలవు. భాగవత పురాణ ప్రసిద్ధమయిన ధ్రువుని కథ సత్యవరలక్ష్మీదేవిగారి స్మృత్యర్థము 'శ్రీ సత్యవరలక్ష్మీ ధ్రువచరిత్ర' మనుపేర సంతరింపఁబడినది.

## ఆదిపూడి ప్రభాకరకవి

గద్వాలాస్థానకవులలో నాధునికులు; పరీక్షాధికారులు. వీరు గద్వాలప్రభువు సీతారామ భూపాలుని మృగయా వినోదమునుదెల్పు పౌండరీకమను నేకాశ్వాస ప్రబంధమును రచించిరి. ఇది గద్వాల చెన్నకేశవున కంకితము.

## పోకూరి కాశీపతి

ఈయన గద్వాలరాణి ఆదిలక్ష్మీదేవమ్మగారి ఆస్థానకవులు. గుంటూరు మండలము పల్నాడు తాలూకాలోని 'బోదిలవీడు' గ్రామ వాస్తవ్యులు. విశ్వ బ్రాహ్మణ కులసంభూతులు. చతుర్విధ కవితా విశారదులు. సారంగధరీయ నిరోష్ఠ్య నిర్వచన శుద్ధాంధ్ర హరిశ్చంద్రోపాఖ్యానాద్యనేకాంధ్రగ్రంథకర్తలు. సారంగధరీయము నాలుగాశ్వాసములుగల త్ర్యర్థి కావ్యము. సారంగధరులగు శివ, చంద్రులయు, సారంగధర నామకుఁడగు నొకరాజకుమారునియు కథలు మూఁడును ముప్పేటగా నడచిన బహ్వర్థక కావ్యమిది. గర్భచిత్ర, బంధ కవిత్వములతోడను నష్టాదశవర్ణనములతోడను నిండినది. ఆదిలక్ష్మీ దేవమ్మగారి యనుమతిని వారి భర్త స్వర్గీయ సీతారామ భూపాలరావు బలవంత్ బహద్దరువారికి కృతి. వ్యాఖ్యానసహితము. ఆస్థానవిద్వాంసులు పుల్లగుమ్మి వేంకటాచార్యుల పీఠికాయుక్తము. కాశీపతి కవిగారిటీవల నలువదేసి యర్థములు వచ్చు పద్యములను కొన్నింటిని రచించిరఁట.

## పెద్దమందడి వేంకటకృష్ణకవి

నిర్వచన భక్తివిజయము, మారుతివిలాసము, గద్వాల సంస్థానచరిత్రము, రెడ్డికులనిర్ణయ చంద్రిక, కేశవవిలాసము వీరి రచనలు.

## శ్రీరామనరసింహమూర్తికవులు

శ్రీ రామనరసింహ గ్రంథరత్నమాలా నిర్వాహకులును, శ్రీ మదాంధ్ర భాగవత కర్తలును, శతావధానులును, జంట కవులునునగు శ్రీ రామనరసింహ మూర్తికవులు గద్వాల రాజన్య సంస్థానాస్థాన కవీంద్రగౌరవమును గొన్నవారు. గద్వాల యువరాజావారగు కృష్ణరామభూపాలుగారు 1945లో వీరిని తమ యాస్థాన కవులుగా నమోదు చేయించిరి. వీరు బహు గ్రంథ రచయితలు. వీరి నిరంతరవిద్యాపరిశ్రమ, నిరుపమానదీక్ష వీరి కృతులలోఁ గన్పట్టుచున్నవి. అయిదు సంపుటములలోఁ బ్రచురితమయిన శ్రీ మదాంధ్రభాగవతము వీరి ముఖ్యకృతి.

ఆస్థానకవులను బోషించుటయే కాక, ఏఁటేఁట కేశవస్వామి ఉత్సవ సందర్భములయందు, మాఘ కార్తికమాసములయందు నిర్వహించెడి కళా పరీక్ష సమావేశములలో కవి పండిత నర్తక గాయకాదులకు గద్వాల సంస్థానాధి పతులు విశేషసమ్మానములు సలిపెడివారు. వీనిలో నూర్లకొలఁది కవి పండి తాదులు సత్కరింపఁబడుచు వచ్చిరి. తిరుపతివేంకట కవులు, కొప్పరపు కవులు*, వేదము వేంకటరాయశాస్త్రి, కాశీ కృష్ణాచార్యులు, కాలెంపూడి రాజమన్నారు కవి, పిశుపాటి చిదంబరశాస్త్రి ఇంకను నెందఱో గద్వాలాధిపతుల వార్షికాది సమ్మానములఁ బడసినవారు.

ఆంధ్ర నాటక పితామహులు శ్రీ ధర్మవరము కృష్ణమాచార్యులు (1853–1912) గారికి 1910లో 'ఆంధ్ర నాటక పితామహ' బిరుదమును బ్రసాదించి యాదరించినవారు గద్వాల ప్రభువులే. తిరువత్తూరు కుప్పయ శిష్యుఁడును, ఘంట సాల వాస్తవ్యుఁడునునగు చల్లపల్లి సుబ్బయ్య గద్వాల సంస్థానములో ఆస్థాన సంగీత విద్వాంసుఁడుగా గౌరవమునందినవాఁడు. గద్వాల రాణి ఆదిలక్ష్మీదేవమ్మ గారు అనేక విద్యాసంస్థలకు, గ్రంథ ప్రచురణ సంస్థలకు భూరిగా విరాళములిచ్చి పోషించినవారు. రాజమండ్రిలోని ఆంధ్రేతిహాస పరిశోధక మండలిపోషకులు. శిరోమణి సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారి పరిపుష్టమయిన లక్ష్యలక్షణ పరిజ్ఞానము రూపెత్తిన 'తత్సమ చంద్రిక' శ్రీ ఆదిలక్ష్మీదేవమ్మగారి ప్రాచ్య విద్యాభిమానమునకు ప్రతీకగా ప్రచురితమయినది. ఏతద్గ్రంథమును తమ భర్తృపాదులు శ్రీ సీతారామభూపాల బహద్దరు (1888–1924) వారి కంకితము చేయించిరి. నాఁటి విద్యాపోషకులలో గద్వాల పాలకులను మించినవారు లేరని పండితులు ప్రశంసించిరి.

*గద్వాల సభకు కొప్పరపు సోదరకవు లరుదెంచినపుడు ఆస్థానకవి ఆదిపూడి ప్రభాకరకవి కవులను ప్రభువునకు పరిచయ మొనర్చుచుఁజెప్పిన 64 పంక్తుల చంపక మాలిక ప్రసిద్ధము. చూ. పరిచయము, శారదపత్రిక, 1924, పుటలు 46,47.

'ప్రతివర్షమ్మును రెండుమాఱులుగ శాస్త్రశ్రౌత వేదాదులం
చితరీతిన్ గవితా పరీక్షలును వాసిన్ జేసి విద్వాంసులన్
శతమున్ వేలు నొసంగి వార్షికముగా సంస్థాన మర్యాదలన్
చతురత్వమ్మున నల్పుచుండు నల లక్ష్మమ్మన్ బ్రశంసించెదన్'

అని కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు తమ ఆంధ్రాభ్యుదయ కావ్యమున ఆదిలక్ష్మీదేవమ్మగారి వదాన్యతను గొనియాడిరి (చూ. ఆంధ్రాభ్యుదయము, పూర్వభాగము, 5–57).

## ఉపజీవ్య గ్రంథసూచి


1. సురవరము ప్రతాపరెడ్డి, గోలకొండకవుల సంచిక.

2. సురవరము ప్రతాపరెడ్డి, నిజాము రాష్ట్రములోని ఆంధ్ర సంస్థానములచరిత్ర, శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ రజతోత్సవ సంచిక, పుటలు 43–45.

3. దేవులపల్లి రామానుజరావు, తెలంగాణాలో జాతీయోద్యమాలు, పుటలు 64, 65.

4. దేవులపల్లి రామానుజరావు, తెలుగుసీమలో సాంస్కృతిక పునరుజ్జీవనము, పు. 98.

5. తిరుపతివేంకటకవులు, నానారాజ సందర్శనము, పుటలు 15–19, 29–42, 47–52, 116–120.

6. మారేమండ రామారావు, ప్రబుద్ధాంధ్ర, 1935 ఏప్రిల్–జూన్, సంపుటము 6, సంచిక 4, పుటలు 114–116; సంచిక 6, పుటలు 197, 198.

7. తెలుగువిజ్ఞానసర్వస్వము, సంపుటము 3.

8. ఆదిపూడి ప్రభాకరకవి, శ్రీ గద్వాల సంస్థానపు రెడ్డిరాజుల గురుభక్తి (పద్య.), భారతి, 1928, ఆగస్టు, పుటలు 259–261.

9. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, మా విద్యార్థిదశ – నాఁటి కవిత్వం, భారతి, వృష జ్యేష్ఠము, 1941 జూన్, పుటలు 659–670.

10. V. L. Sastri, Encyclopaedia of the Madras Presidency and the Adjacent States, pp. 442–448.

11. S. H. Belgrami, Historical and Descriptive Sketch of His Highness the Nizam's Dominions.

12. W. W. Hunter, Imperial Gazetteer of India, Oxford, New Edition, 1908, Vol XII, p. 121.

# గూటాల

## ప్రవేశిక

ఈ యెస్టేటు గోదావరి మండలములోనిది. వైశ్యవంశజుల సంస్థానములలో నిది పెద్ద పేరుపెంపులు గలది. ఇంజరము, గూటాల, చిడిపి, తిరుగుడుమెట్ట, పెద్దేపం, ముంగొండపాలెము మొదలగున వీ యెస్టేటునకుఁ జెందినవి. శాశ్వతకర నిర్ణయమునాఁటి కీ యెస్టేటు పోలవరము రాజాగారైన మంగపతిదేవుగారి స్వాధీనమున నుండినది. 1812 లో పోలవరము ఎస్టేటంతయును వేలము వేయఁబడినది. అప్పుడు దానిని నూజివీడు జమీందారు శ్రీ రాజా అప్పారావుగారు ఖరీదుచేసియుండిరి. ఆ పిమ్మట 1827 లో మన్యం సత్యలింగముగారు ప్రాఁతనాగరము మొదలగు నుండి మఱికొన్నిపల్లెలు చేరిన దీనిని రూ. 2,30,000 లకుకొనిరి. అప్పటినుండియు నీ యెస్టేటు మన్యం వంశీయుల పాలనమున నుండినది. 1938 నాఁటి లెక్కలప్రకారము దీని యాదాయము రూ. 26 వేలు. పేష్కషు రూ. 6,720 లు.

## సంస్థాన చరిత్రము

సంస్థానసంపాదకులగు మన్యం సత్యలింగముగారి తండ్రిగారు మన్యం కనకయ్యగారు. వీరు పదునెనిమిదవ శతాబ్దాంతమున కాకినాడలో గొప్ప వర్తకులు. ద్వీపాంతర వ్యాపారము సేసి లక్షలార్జించిన లక్ష్మీపుత్రులు. ఆ పిమ్మట వీరు ఫ్రెంచివారి యేలుబడిలోనున్న యానామునందు స్థిరపడి వ్యాపారమును బహుముఖముల విస్తరింపఁ జేసిరి. అరదేశ పరదేశ నానాదేశ సెట్లలో కనకయ్యగారు మంచి పరపతి గలవారుగా పేరుపడసిరి. అలనాఁటి అవచి తిప్పయసెట్టియే యిట్లవతరించెనని బట్రాజులు కైవారములు సేసిరఁట!

కనకయ్యగారికి వెంకట నరసయ్య, సత్యలింగము, రెడ్డయ్య, వెంకటరత్నము, ప్రకాశరాయఁడు నను నైదుగురు పుత్రులు. వీరిలో ద్వితీయులైన సత్యలింగముగారు గూటాల సంస్థాన సంపాదకులు. వీరు బుద్ధియందును, కార్యసంశుద్ధియందును తండ్రిని మించిన తనయులు. 1827 నుండి 1850 దాఁక సంస్థాన పాలనమును అతినిపుణముగా నిర్వహించిరి. 1850 లో వీరి మరణముతో కొడుకు కనకయ్య, తమ్ముఁడు వెంకటరత్నమును సంస్థాన పాలనమును చేపట్టిరి.

వెంకటరత్నము చాల సమర్థుఁడు. ఇతనికి కనకయ్య, వెంకటసుబ్బారావు,

సీతయ్య, రాజాజీ యని నల్వురు పుత్రులు. 1860 లో వెంకటరత్నము చనిపోఁగా మొదటి యిద్దఱు కుమారులును జాయింటు జమీందారులైరి. సోదరులందఱు మరణింపఁగా కనకయ్య యొక్కనికే సంస్థానము దక్కినది. ఆ తరువాత కనకయ్యయే జమీపాలకుఁడుగా నుండెను.

ఈ కనకయ్య కుమారుఁడు చిన్నకనకయ్య. ఇతఁడు మంచి వ్యవహార వేత్త; బహుభాషావేత్త. యానాము పట్టణములోని గూటాల జమీందారుల దివ్యభవన మీతఁడు నిర్మించినదే. చిన్నకనకయ్య ఫ్రెంచి కుంఫిణీవారికి ఆప్త మిత్రుఁడు; కుంఫిణీవారికి అప్పుసప్పులిచ్చి అదనున ఆదుకొనినవాఁడు. ఫ్రెంచి ప్రభుత్వమువా రీతనిని గొప్పగా గౌరవించుచుండిరి. కనకయ్య ఫ్రెంచివారినుండి లక్షరూపాయలకు అనేకభూములను ఖరీదుచేసి ఎస్టేటును పెంపొందించెను. గూటాల, యానాములలో సత్రములు కట్టించి, వాని సక్రమ నిర్వహణమునకు కట్టుదిట్టములు గావించెను. 1873 లో చిన్నవయసునందే కనకయ్య పరమ పదించెను.

చిన్నకనకయ్యగారి భార్యయే మహాలక్ష్మమ్మగారు. ఈమె ఆనాఁడు విశాఖ పట్టణములో పేరుమోసిన వర్తకశ్రేష్ఠులు సీతర్ల సత్యలింగముగారి తనయ. ఈమె 1856 లో జన్మించిరి. 1865 లో గూటాల జమీందారు మన్యం చిన కనకయ్యగారితో వీరి వివాహము జరిగినది. పట్టుమని పదియేండ్ల పాటు భర్త జీవింపలేదు. చిన్నవయసులో భర్తపోయి జమీపాలన మను పెద్దబరువు తలమీఁదపడినను దొడ్డబుద్ధిగల మహాలక్ష్మమ్మగారు ఉభయకులపవిత్రగా సాగరాంధ్రము నందలి సంస్థానాధీశులలో సాటిలేని సత్కీర్తిని సంపాదించినది. ఈమె యానాములోని ఫ్రెంచివారికి ఆర్థికముగ చాలఁ దోడ్పడినది. భర్తపెట్టిన ఒరవడిలో ధర్మకార్యములను నిర్వహించినది. బీదలకు, సాదలకు, సత్పాత్రు లకు దానధర్మములుచేసి చేతికెముకలేదను పేరు పొందినది.

## సాహిత్యపోషణము

మన్యం చినకనకయ్యగారికి ఇంగ్లీషు, ఫ్రెంచి, సంస్కృత భాషలలో మంచి పాండిత్య ముండెడిదఁట; మన్యమువారి కుటుంబము మొదటినుండియు వేదవిద్యా పోషణకు, ఆర్షధర్మ వ్యాప్తికి, జీర్ణదేవాలయోద్ధరణకు* మీఁదు కట్టినది. దేశమునందు ప్రసిద్ధిపొందిన వేదపండితులలో పెక్కురు మన్యమువారి మన్ననలను పొందినవారు. వేదవిద్యతోపాటు సంస్కృత భాషయును మన్యము వారి సమాదరణమును బొందినవి. మన్యమువా రింటఁ బుట్టిన వారందఱును అంతోయింతో సంస్కృతభాష నభ్యసింపవలసి యుండెడిదఁట; రాజభాష గావున

* పేటూరి ప్రభాకరశాస్త్రి, 'దాక్షారము అన్నసత్తర్వు గంట', భారతి, ప్రమాది, శ్రావణము, 1939 ఆగస్టు, పు. 206.

నాంగ్లమును. యానాములో వ్యవహారభాష గావున ఫ్రెంచియును విధిగా నేర్వ వలసిన భాషలు.

మహాలక్ష్మమ్మగారి పాలన కాలమందు గూటాలకు మంచిపేరు వచ్చినది. మహాలక్ష్మమ్మగారు వేదవిద్యలనేకాక బొమ్మలాటలు, వీథినాటకములు, కూచి పూఁడి భాగవతములు మొదలగు జానపదకళాప్రదర్శనములను సైతము ఆదరించెడివారఁట. తన చిన్నవయసులో తా నీ నాటకములను తదేకదృష్టితోఁ జూచి తన్మయుఁడగుచుండినట్లు చెళ్ళపిళ్ళవారి వ్రాఁతలు.[1] యానాములో మన్యం మహాలక్ష్మమ్మగారి మేడయెదుట జరిగెడి తోలుబొమ్మలాటలను, వీథినాటకము లను చూచి చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు తన జట్టుగాంద్రతో కలిసి కాగితపు బొమ్మలను తయారుచేసి యాడించుచుండఁగా మహాలక్ష్మమ్మగారు ముచ్చటపడి చూచి, యానందించి చిన్నచిన్న బహుమతుల నిచ్చి పంపెడివారఁట.[2]

మహాలక్ష్మమ్మగారి చేతిచలువ యెట్టిదోగాని, గూటాల జమీందారుల ఆస్థానపండితుల సన్నిధిని గుంటయోనమాలు దిద్దిన ఈ బాలుఁడే పెరిగి పెద్దయై తెలుఁగునాట అవధానాదు లొనరించియు, ప్రాచీనార్వాచీనాంధ్రకవితా రీతులకు నూతనసేతువును నిర్మించియు అఖిలాంధ్రరసికలోకము నలరించిన మహావ్యక్తిగా, విద్యాసంతతిని దిద్దితీర్చిన దివ్యశక్తిగా రూపొందినాఁడు.

చెళ్ళపిళ్ళవారి స్మృతులలోని క్రింది యుద్ధరణము మన్యము మహా లక్ష్మమ్మగారి ధన్యతకు, వదాన్యతకు ప్రత్యక్ష నిదర్శనము :

> 'నా చిన్నతనంలో పదేళ్ళ వయస్సు పిమ్మట సుమారు ఒక పుష్కరం కాలం ఫ్రెంచి టవును యానాంలోనే వెళ్ళింది. ఆ వూళ్ళో కీ.శే. మన్యం మహాలక్ష్మమ్మ జమీందారురాలు నివాసంగా వుండడంవల్ల యెన్నో వైదికానికి సంబంధించిన పుణ్యకార్యాలు వారి మేడకు ఎదురుగావుండే సత్రంలో తఱుచు జరుగుతూవుండేవి. వేదంలో ప్రసిద్ధులైనవారు వచ్చి నవరాత్రోత్సవాలల్లో శ్రావ్యంగా స్వస్తి వగైరాలు పరస్పర గాత్రాలు కల్పి ఉచ్చైస్స్వరంగా చెబుతూవుంటే....'[3]

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు నానారాజసందర్శనమునందు మహాలక్ష్మమ్మ జమీందారిణిగారిని గుఱించిచేసిన ప్రశంస :

> 'పొనరించితివి మహా పుణ్యకార్యమ్ముల
> స్వర్గలోకంపు సోపానములుగ
> నిచ్చిపుచ్చితి వెందఱెందఱకో భూమి
> ఖండంబులను మహోద్దండగరిమఁ

1 చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, కాశీయాత్ర, పు. 25.
2 చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, కథలు-గాథలు, సంపుటము 1, పు. 406.
3 పైది, పు. 71.

గట్టించితివి దేవగణము సంతోషింప
దేవళంబులయందు దీప్తి యెసఁగ
చేయించితివి తృప్తి చెన్నారఁగా మేటి
సంతర్పణముల ననంతములుగ
గరువమను మాటెఱుంగవు కలిమిగలిగి
సర్వసామాన్యమౌ మనుష్యగతి నుందు
వఖిల ధర్మము లెఱుఁగుదు వాత్మయందు
లలిత సుగుణకదంబ శ్రీ లక్ష్మమాంబ'

—నానారాజ. ఉత్తరార్ధము, పు. 278, 279.

'గోచీ పెట్టినవాది నిన్నెఱుఁగుదున్, గోపట్లనే కాదు నీ
యాచారమ్మును దాతృతాగరిమ సత్యాసక్తి నిర్గర్వతా
ప్రాచుర్యమ్మును దీనపోషణము నెప్పట్లన్ గనంబోల దే
లా చెప్పన్‌వలె నిన్నుఁ జెప్పియు మహాలక్ష్మ్యంబ పేత్కారిన్'

—పైది, పు. 279.

'నను బాల్యంబది యాదిగా నెఱిఁగి యేనాఁడేని నే వచ్చినం
తనె వెన్‌వెంటనె దర్శనంబొసఁగి సంతానంబుకన్నన్ గడున్
ఘనసంప్రీతిని జూచు నీయెడల నిక్కమ్మైన నాపేర్మి చ
క్కని నీ కీర్తికి శాశ్వతంపు గరిమన్ గల్పించె నీరీతిగన్'

—పైది, పు. 280.

షడ్దర్శనములలో, షట్ఛాస్త్రములలో నిధి, ప్రసిద్ధ కాశీపండితులు పుల్య దక్షిణామూర్తిశాస్త్రి (1830–1900) గారి పాండితీవైభవమును, శాస్త్రాధ్యాపన రీతిని గుఱించి విని శ్రీ మన్యం మహాలక్ష్మమ్మగారు శాస్త్రిగారికి ముక్కాలుఁ బండు కేవారఖండమునిచ్చి సమ్మానించిరి. దక్షిణామూర్తిశాస్త్రిగారు కవి సార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి ప్రశంసలను పొందిన పండితులు. పుల్యవారిని గుఱించి శ్రీపాదవారు చేసిన ప్రశంసాపద్యములు పరికింపుఁడు :

'తనరుచుండెఁ బుల్య దక్షిణామూర్తిశా
స్త్ర్యగ్రగణ్యుఁడనఘుఁ డాఱు శాస్త్ర
ములను జదివి పండితుల కులగురువను
పేరుగాంచి మించెఁ బృథివియందు' —ఆంధ్రాభ్యుదయము, 2–75.

'దేవీసాక్షాత్కారం
బా విప్రాగ్రణికిఁ గలదియై తోఁబలుకున్
వేవురువిద్వద్వర్యుల
లో విబుధుం డతనిసుడియె లోకము నిండున్' —పైది, 2–76.

చెళ్లపిళ్లవారి గురుపరంపరలో నొకరును, గోదావరీతీరమునందలి

కోరుమిల్లి వాస్తవ్యులుననగు ముక్కవిల్లి జగన్నదీక్షితులుగారు మన్యమువారి దేవిడీలో జరుగు జపతపాల నిర్వహణమునకై యానాము వచ్చెడివారట! మన్యమువారి యాస్థానపురోహితులగు గాడేపల్లి సుబ్బావధానిగారును ప్రసిద్ధ వేదపండితులలో నొకరు.

## ఉపజీవ్య గ్రంథసూచి


1. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, ఆంధ్రాభ్యుదయము
2. తిరుపతివేంకటకవులు, నానారాజ సందర్శనము.
3. శ్రీరాం వీరబ్రహ్మకవి, నానారాజన్య చరిత్రము, పుటలు 200-202.
4. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, కాశీయాత్ర.
5. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, కథలు - గాథలు, సంపుటము 1.
6. C. A. Souter and K. N. K. Ayyar, Gazetteer of the East Godavari District, Vol. II, Madras, 1935, pp. 423,424.

# గోడేవారి సంస్థానములు

## ప్రవేశిక

గోడేవంశమువారు పాలించిన ఎస్టేటులలో అనకాపల్లి, ఎంబారం, కుప్పిలి, కొరుపోలు, గొట్టిపల్లి, గొడిచర్ల, భరణికము, మునగపాక, శ్రీరామపురము, షేర్ మొహమ్మద్‌పురము మున్నగునవి ముఖ్యమయినవి. షేర్ మొహమ్మదుపురము గోడేవంశ్యుల మొదటి సంస్థానము. సాధారణముగ ఈ వంశీయులను, వీరి వారసులను అనకాపల్లి జమీందారులనియు, ఎంబారం జమీందారులనియు, షేర్ మొహమ్మదుపురము జమీందారులనియు వ్యవహరింతురు. ఈ సంస్థానాధీశులందఱును నొకే మూలపురుషుని సమీపసంతతికి చెందినవారు గావున ఈ సంస్థానముల చరిత్రమును, వాని సాహిత్యపోషణమును సామూహికముగ నిచ్చట ప్రదర్శింపఁబడినవి.

పేష్కషు బకాయి నిమిత్తము శాశ్వత పరిష్కారకాలమున ఏలము వేయఁబడిన షేర్ మొహమ్మదుపురము ఎస్టేటును పదునాఱు జిరాయితీ గ్రామములు, ఆఱు శ్రోత్రియములు, ఐదు మొఖాసాలు గలదానిని మచిలీపట్టణములోని చీఫ్ ఇన్ కవున్సిలువారి దుబాషియగు గోడే పెద్దజగ్గరాయనింగారు రూ. 18,445 లకు ఖరీదు చేసియుండిరి. దీని పేష్కషు రూ. 19,343 లు. పదుమూఁడు జిరాయితీ గ్రామములు, మూఁడు శ్రోత్రియములు గల అనకాపల్లి ఎస్టేటు 1802 లో విజయనగరమురాజాగారివలన కుంఫిణీవారి ఏలములో ఖరీదుచేయఁ బడినది. 1810 లో గోడే సూర్యప్రకాశరావుగారు దీనిని ఖరీదు చేసిరి. 1818 లో సూర్యప్రకాశరావుగారి విభక్తకనిష్ఠసోదరులు గోడే సూర్యనారాయణరావుగారు పెద్దాపుర సంస్థానమునందలి సత్యవరము పరగణాలోని భాగమయి పదుమూఁడు జిరాయితీ గ్రామములుగల గొడిచర్లను ఏలములో కొనిరి. పెద్దజగ్గరాయనింగారి మరణానంతరము షేర్‌మొహమ్మదుపురము సూర్యనారాయణరావుగారి వంతునకు వచ్చినది. గోడే సూర్యప్రకాశరావుగారు 1820 లో ఏడు జిరాయితీ గ్రామములను, రెండు శ్రోత్రియములును కలిగి, నక్కపల్లి ఎస్టేటులో నొకభాగమయిన కొరుపోలును, 1822 లో చీపురుపల్లి ఎస్టేటులోని నాలుగు ఖండములలో మొదటిఖండములోని భరణికమును, 1830లో ఎనిమిది జిరాయితీ గ్రామములను, రెండుశ్రోత్రియములునుగల మునగపాకను, 1835 లో తొమ్మిది జిరాయితీ గ్రామములుగల శ్రీరామపురమును ప్రభుత్వము వారి ఏలములో ఖరీదుచేసిరి. 1879 లో గొట్టిపల్లి ఎస్టేటును గోడే నారాయణ

గజపతిరావుగారు సంపాదించిరి. ఈ గొట్టిపల్లి ఎస్టేటులోని యొకభాగమే ఎంబారం ఎస్టేటు. 1815 లో శ్రీ గొడే సూర్యనారాయణరావుగారు విజయనగరము మహారాజాగారి పినతల్లి పెనిమిటియగు రాజా శ్రీ సాగి రామచంద్ర రాజుగారినుండి రాజేల ఎస్టేటును కొని 1818 లో దీనిని భాగవతుల నారప్పగారికి విక్రయించిరి. పేష్కషు బకాయిపడిన రాయవరం ఎస్టేటునుగూడ శ్రీ గొడే సూర్యనారాయణరావుగారు రాజాశ్రీ సాగి రామచంద్రరాజుగారినుండి ఖరీదుచేసి, ఆ పిమ్మట అది లాభసాటిగా కన్పట్టనందున కుంఫిణీవారికే ముప్పది వేలకు తిరిగి విక్రయించిరి. వీరి వంశీయులు ఇంకను కరకవలస, కుప్పిలి, గాజువాక, నక్కపల్లి, మట్టిపాలెము మొదలగు ఎస్టేటులను సంపాదించిరి. వరుసగా నీ ఎస్టేటుల పేష్కషు వివరములు :

| | | | |
|---|---|---|---|
| అనకాపల్లి | 30,000 | ఎంబారం | 2,000 |
| కరకవలస | 4,000 | కుప్పిలి | 8,000 |
| కొరుపోలు | 8,000 | గొడిచర్ల | 17,000 |
| నక్కపల్లి | 6,000 | భరణికము | 1,500 |
| మునగపాక | 25,000 | శ్రీరామపురము | 18,000 |

షేర్ మొహమ్మద్ పురము 20,000

ఈ యన్నింటి మీఁదను ఈ సంస్థానాధీశ్వరులకు నించుమించుగా ఏడెనిమిది లక్షల యాదాయము వచ్చెడిది. షేర్ మొహమ్మదుపురము చిట్టచివరిపాలకులగు అంకితము వెంకటభానోజీరావుగారు 1930లో జమీని రెండుభాగములు చేసి తూర్పుభాగమును విజయనగరములోని పేర్లవారికిని, పడమటి భాగమును విశాఖపట్టణములోని ఆకెళ్ళవారికిని విక్రయించిరి.

## సంస్థాన చరిత్రము

ఈ సంస్థానపాలకులు పెటికిరాజులను వ్యవహారనామముగల పురగిరి క్షత్రియ వంశమునకు చెందినవారఁట ; వీరి గృహనామము గొడేవారు. వీరిది ఛత్రసాల గోత్రము. కాకరపర్తి బుచ్చిపాత్రకవి ప్రణీతమగు సత్యవతీ పరిణయమునందు వీరిది దినేశ వంశమనియు, రవికులమనియుఁ బేర్కొనఁబడుట చింత్యము. పరశురాముని నెదిరింపఁజాలక యజ్ఞోపవీతములను ధరింపమానిన ఒకానొక క్షత్రియవంశము వీరిదని కొందఱు.* వీరి మూల పురుషుఁడు చెన్నమల్ల భూపాలుఁడు. ఇతని కుదురునందు అక్కన భూపతి జన్మించెను. అక్కన భూపతికి భూపతియని కుమారుఁడు. ఈయనకు సూరన, రామచంద్రయని యిరువురు కుమారులు. ఈ సూరనగారిని

*ఉపద్రష్ట వేంకటజగన్నాథశాస్త్రి, లోకనాథుఁడు (సీరియల్ నవల) కల్పలత పత్రిక, 1921, ఫిబ్రవరి, పు. 29.

పెదసూర్యారావుగారని వ్యవహరింతురు. ఈ పెదసూర్యారావుగారు మొగలాయి ప్రభుత్వమువారి సరదారఁట! ఈయన వాకతిప్పలో హరిహరులకు కోయిలలు కట్టించెనఁట! ఈయనకు గుంపమ్మయను భార్య వలన ఉప్పన్న, సర్వేశ. జగ్గరావు, భూపతి, గోపాలుఅను నయిదుగురు పుత్రులు. వీరిలో మధ్యముఁడైన జగ్గరావు ప్రసిద్ధుఁడు. ఈయన సప్తసంతాన నిర్మాతయఁట! ఈ జగ్గరాయనికి అంకాంబ వలన కలిగిన నయిదుగురు పుత్రులలో సూర్యారావు నాల్గవవాఁడు. ఈ సూర్యారావుగారికి సుభద్రమ్మయను భార్యవలన పెదజగ్గరావు అను కుమారుఁడును, అప్పయ్యమ్మ, సీతయ్యమ్మయను తనయలను గలిగిరి. అప్పయ్యమ్మ మదినెవారి కోడలు; సీతయ్యమ్మ చెవలవారి కోడలు.

గొడేవారి కుడుంనందు పెదజగ్గరాయనింగారు సుప్రసిద్ధులు. వీరు మచిలీపట్టణమునందు చీఫ్ ఇన్ కవున్సిలు వారి కచ్చేరీలో దుబాషీగానుండిరి. ఇంగ్లీషు కుంఫిణీవారి తరపున సరదారీ యుద్యోగముచేసి కుంఫిణీవారి కసాధ్యము లయిన మైలవరము మున్నగు కోటలను సాధించి కుంఫిణీవారి మన్ననలకు పాత్రులయిరి. తిరుగుబాటు మనస్తత్వముగల ప్రజలను ప్రశాంతపఱిచి, ఆ యా సీమలను నిష్కంటకముగఁజేయుటకు కుంఫిణీవారికి పెదజగ్గరాయనింగా రెంతేని తోడ్పడిరి. వీనిని పురస్కరించికొని కుంఫిణీవారు, ఆఫ్తాగిరియును, అరిగె జోడు మషాళ్లు, షాహేబాంపల్లకి, దానియెదుట బరాబరులు గావించెడి రజత సువర్ణ వేత్రకులను పెదజగ్గరాయనింగారికి ప్రసాదించిరి. ఈ యంశమునే సత్యవతీపరిణయ ప్రబంధమిట్లు నిరూపించుచున్నది:

'అమర నాంగ్లేయాధిపాజ్ఞాధురంధరుం
డై వారలకు సాహ్యుఁడై యసాధ్య
మగు మైలవరదుర్గ మవలీల నిర్జించి
మఱియు కొండఱినపుడు తిరుగఁబడిన
వారి వశ్యులఁ జేసి వరలంగ నింగ్లీషు
వారి సమ్మానంబువడసి మిగుల
జోడు మషాళ్లను, సొంపొందు షాహిమాన్
పాలకీ నరిగె, నాఫ్తాగిరియును
మొదలుగాఁగల గొప్ప బిరుదుల నొంది
పుడమినెల్ల నిష్కంటకంబుగ నొనర్చి
యఖిలదిక్కుల తనకీర్తి యతిశయిల్ల,
ప్రజలఁ బ్రోచుచు జగ్గరాట్ప్రభుఁడు దనరె' — పు. 10.

ఈయన పెద్దభార్యయగు కృష్ణమ్మకు సంతతి యున్నట్లులేదు. రెండవభార్య యగు చెల్లయ్యమ్మకు సుభద్రమ్మ, బంగారమ్మ, సూర్యప్రకాశరావు, లక్ష్మీ

నరసమ్మ, భాస్కరరావు, సూర్యనారాయణరావు అని సంతానము. పెద్ద తనయ యగు సుభద్రమ్మ మదినె అప్పయాంబా కృష్ణయ్యల తనయుఁడగు సూరన్న గారి భార్య. ఆంధ్ర కవయిత్రులలో సుప్రసిద్ధురాలగు మదినె సుభద్రమ్మ యీమెయే.

పెదజగ్గరాయనింగారి పెద్ద కుమారులగు సూర్యప్రకాశరావుగారు పిండారీ మూఁకలను పాఱఁదోలుటలోను, పాయకరావు పితూరీ యల్లరుల సణఁచుట లోను కుంఫిణీవారికి తోడ్పడినవారు. వీరి పుత్రులిరువురును చిన్నతనముననే పోయిరి. వీరి యనంతరము వీరి భార్య జానకమ్మగారును, ఆ పిమ్మట వీరి పుత్రిక రత్నయ్యమ్మగారును ఎస్టేటులను పాలించిరి. ఆ తరువాత నీ యెస్టేటు లన్నియును సూర్యప్రకాశరావుగారి కడగొట్టుతమ్ముని కుమారులగు మహారాజా నారాయణగజపతిరావు బహద్దరుగారికి దఖలుపడినవి. పెదజగ్గరాయనింగారి రెండవ కుమారులయిన భాస్కరరావుగారి సంతతికూడ కొనలు సాఁగలేదు. మూఁడవ కుమారుఁడయిన సూర్యనారాయణరావుగారికి ముగ్గురు భార్యలు. పెద్దయామె యగు నీలయ్యమ్మకు సంతతి యున్నట్లులేదు. రెండవ భార్యయగు నచ్చయ్యమ్మ కుమారుఁడు వెంకట జగ్గారావుగారు (1817—1856) షేర్ మొహ మ్మదుపురము జమిందారు. వీరు మదరాసులోఁ జదివిరి. ఖగోళశాస్త్రము వెంకట జగ్గారావుగారి అభిమానవిషయము. ఈయన భార్య చెవల జగ్గారాయని పుత్రిక బంగారమాంబ. పరిశోధనము నిమిత్తము విశాఖపట్టణములో నొక నక్షత్రశాలను వెంకటజగ్గారావుగా రేర్పఱిచిరి. వీరి తనయ అచ్చయ్యమ్మగారు. ఈమెను అంకితము శ్రీరాములుగారి కుమారులు వెంకటనరసింగరావుగారి(1827—1898) కిచ్చిరి. వీరు రాయబహద్దరు బిరుదాంకితులు. ఈ దంపతుల కుమారులు అంకితము వెంకటజగ్గారావుగారు. ఈ జగ్గారావుగారి కుమారులు అంకితము వెంకటభానోజీరావుగారు. నాఁటికి నేఁటికి భానోజీరావుగారు బొబ్బిలి పాలకులకు కూర్చు మిత్రులు 'షేరుమొహమత్పురీ జమీందారుఁడైన యలఘుఁడల్లి భానోజిరావరుగుదెంచె రహివిడిదిగ నొసఁగిరి దర్బారుమహలు గౌరవంబెంత చేనియుఁగడలు కొనఁగ' (బొబ్బిలి పట్టాభిషేకము, 2—39). వీరు ప్రస్తుతము ఆంధ్రప్రదేశ శాసనసభా సభ్యులు. వీరి కుమారులు వెంకటజగ్గారావుగారు వాణిజ్యవిద్యాపట్టభద్రులు.

సూర్యనారాయణరావు* గారి మూఁడవభార్యయగు సీతయ్యమ్మగారి కుమారులు మహారాజా సర్ గోడే నారాయణగజపతిరావు బహద్దరుగారు (1828—1903). ఈయన రాజకీయ రంగమునందును, సాహిత్య ప్రాంగణము నందును సమానప్రతిభను ప్రదర్శించినవారు. వీరు కలకత్తా, మద్రాసులలో

*ఈ సూర్యనారాయణరావుగారు జమీందారులయియుండియు విజయనగర సంస్థానమున మంత్రిపదవిలోనుండిరఁట ! చూ. పూర్వోదాహృత కల్పలత పత్రిక, పు. 30,

విద్య నభ్యసించిరి మొదటి యిద్దఱు భార్యలు మరణింపఁగా మదినె జగ్గారావు పుత్రికయును, గుడివాడ రత్నయాంబా లక్ష్మీనరసింహరాయల దత్తపుత్రికయు నగు చినజానకమ్మగారిని మూఁడవభార్యగా వరించిరి. వీరికి సీతయాంబ, లక్ష్మీనరసయాంబ యని యిరువురు పుత్రికలు. సీతయాంబ బంగాళారాష్ట్రము నందలి పడవాన్ ప్రభువు ఠాకూర్ సాహేబ్‌గారి భార్య. లక్ష్మీనరసయాంబ కురపాము సంస్థానాధీశ్వరులు రాజా శ్రీ వైరిచర్ల వీరభద్రరాజుగారి పట్టమహిషి. సీతయాంబ చిన్నతనముననే వితంతువై విశాఖపట్టణము వచ్చి పుట్టింటనే కాలము గడపినది. ఈమెకు సంతతి లేదు. వీరభద్రరాజుగారి భార్యయగు లక్ష్మీ నరసయాంబ సంతానము ముగ్గురు. ఈమె 1901 లో పురిటిలో చనిపోయినది. మహారాజా సర్ నారాయణగజపతిరావుగారి భార్యయయిన చినజానకమ్మగారు కొంతకాలము ఎస్టేటు వ్యవహారములను పరిశీలించినది. ఆమె యనంతరము నారాయణగజపతిగారి ఎస్టేటులన్నియును దౌహిత్రులును, కురపాము పాలకులును నగు సూర్యనారాయణరాజు, నారాయణగజపతిరాజులకు సంక్రమించినవి.

## సాహిత్యపోషణము

గాడేవారి కోవలో ప్రసిద్ధులును, సంస్థానస్థాపకులును నయిన గాడే పెద్దజగ్గరాయనింగారు సప్తసంతానప్రతిష్ఠాపయితగా సాహిత్యము సాక్ష్యమిచ్చు చున్నది. పెదజగ్గరాయనింగారు కాకరపర్తి తిరుపతిపాత్రకవి రచితమయిన సత్యభామాకృష్ణసంవాదమను మూఁడాశ్వాసముల శృంగార ప్రబంధమును కృతి నందినవారు. పెదజగ్గరాయనింగారినిగూర్చి సత్యవతీపరిణయప్రబంధ మిట్లు ప్రశంసించుచున్నది :

సత్యభామాకృష్ణ సంవాద ముఖకృతు
 లందె నే రసికజనాగ్రగణ్యుఁ
డకలంక విజయరామాధీశకృత మహా
 సన్మానుఁడగుచు నే చతురుఁడలరె
శాశ్వత శ్రీయుక్త సప్తసంతానముల్
 ధరఁ బ్రతిష్ఠించె నే ధన్యమౌళి
కాశీపురంబున ఘనతర సత్రముల్
 గావించె నే పుణ్యకర్మఠుండు
ప్రకటకళలచే నమరె నే రాజమౌళి
యా గాడే జగ్గరాయని యలఘుసుగుణ
వారమంతయు నాలుగైదాఱువేలు
మోములఁదగు వేల్పులకైనఁ బొగడవశమె !' — పు. 10.

పెదజగ్గరాయనింగారు తల్లిదండ్రుల పేర సూర్యనారాయణ పురము,

సుభద్రాపురమునను నగ్రహారముల నేర్పఱిచి సత్పాత్రార్పణ మొనర్చినవారు. విశాఖపట్టణము నందలి కోదండ రామాలయము * పెదజగ్గరాయనింగారు కట్టించినదే.

పెదజగ్గరాయనింగారు కాకరపర్తి తిరుపతిపాత్ర కవిని తన యాస్థానము నకు రప్పించి—

'ప్రతిపదమునందు నొక చమత్కృతి ఘటించు
కృతివి గావున నీ వొక్క కృతి రచించి
నా కొసంగుము మావలనన్ బహూప
కృతిని బొందెదవని బహూకృతమొనర్చ'

—సత్యభామాకృష్ణ సంవాదము, పు. 6.

కవి యీ కృతిని రచియించినట్లు తెలియుచున్నది.

గొడేవారి సంస్థానము నాశ్రయించి వర్ధిల్లిన కాకరపర్తివారు వైదికులు. కాశ్యప గోత్రోద్భవులు. ఈ వంశీయులు అయిదాఱు తరములుగా గొడేవారి సంస్థానము నాశ్రయించి సాహిత్యసేవ సల్పినవారు. శశిరేఖాపరిణయము, ముఖ లింగేశ్వరక్షేత్ర మాహాత్మ్యము, ముఖలింగేశ్వర తారావళ్యాది గ్రంథములను రచించిన కాకరపర్తి కృష్ణకవి తిరుపతిపాత్రకవి కుమారుఁడు. కృష్ణకవి కుమారుఁడు బుచ్చిపాత్రకవి సత్యవతీ పరిణయ ప్రబంధ కర్త. బుచ్చిపాత్రకవి సోదరపుత్రుఁడగు వెంకటశాస్త్రియును, బుచ్చిపాత్రకవి మనుమఁడు సీతారామ శాస్త్రియును కవులే. కాకరపర్తి నృసింహకవి సారంగధర యక్షగాన కర్త యొకఁడు ఈ వంశమునకు చెందినవాఁడే. సహస్రకంధర రామాయణ కర్త ముద్దు లక్ష్మీనారాయణ కవి —

'కాకరపర్తికులాబ్ధి ని
శాకరు గురు మత్పితృవ్యజామాత మదు
త్సేకకరు లక్ష్మణాఖ్యు శు
భాకరు విద్యానిధిం గృపాంచితు నెంతున్'

అని కీర్తించినకాకరపర్తిలక్ష్మణ కవి వీరి కోవకుఁజెందిన వాఁడో కాఁడో నిర్ధారింపవలసియున్నది.

ముఖలింగక్షేత్ర మాహాత్మ్య కర్తయగు కాకరపర్తి కృష్ణకవి తన తండ్రియును, సత్యభామాకృష్ణసంవాద ప్రబంధ కర్తయు నగు కాకరపర్తి తిరుపతిపాత్రకవినిగూర్చి యిట్లు పేర్కొని యున్నాఁడు :

* సీతారామస్వామి కోవెల యని నేఁటి వాడుక. ఎ. వి. భానోజీరావుగారు ఇప్పటి ధర్మకర్తలు ; ఆర్షధర్మాభిమానులగు మంగళగిరి కోదండరామయ్యగారు కార్యకర్తలు. గొడేనారాయణరాయనింగారి కోయిలను గట్టించిరని ఉపద్రష్ట వేంకటజగన్నాథశాస్త్రిగారి వ్రాఁత. చూ. పూర్వోదాహృతమగు వీరి నవల, కల్పలత, పుటలు 30, 31.

'శ్రీరామపదపద్మ సేవారతుండును
వేదశాస్త్రార్థ ప్రవీణుఁడగుచు
సత్యభామాకృష్ణసంవాద ముఖ్య ప్ర
బంధముల్ రచియించి ప్రథిత గోడె
వంశామలక్షీరవారాశి రాకాసుధా
కర కమనీయకర యశో వి
రాజమాన సుపర్వరాజవైభవ కవి
రాజ భూకల్పకభూజ జగ్గ
రాయభూపాల వరదత్త రాజితాగ్ర
హార ముఖనిస్తులేద్య సత్కారుఁడగుచుఁ
దనరు సత్కీర్తిధుర్య, పాత్ర కవివర్యు
మహితగుణవంతు మదిని నమస్కరింతు'

—ముఖలింగక్షేత్ర మాహాత్మ్యము, అవతారిక, పు. 2.

తిరుపతిపాత్రకవి కవితలో పూర్వ మహాకవుల ఔచిత్యసుందరము లయిన కావ్యధర్మచ్ఛాయ లనేకము కన్పట్టుచున్నవని పెదజగ్గరాయనింగారు కృతిపతిగా కవితో నన్నమాటలు :

'మృదుపదవైఖరుల్ బొదలించునప్పుడు
నంది తిమ్మామాత్యు నైపుణంబు
సలలితాలంక్రియ ల్సమకూర్చునప్పుడు
కవి రామభద్రుని కౌశలంబు
నర్థగుంఫన రీతు లలరించునపు డల
సాని పెద్దన ప్రతిభానిరూఢి
ఘనతరశ్లేషకల్పన సేయునపుడు
పింగళి సూరకవి నిరాఘాటపటిమ
నీకుఁ గల్గుటఁజేసి నాళీకభవ వ
ధూనటి యనారతము తావకీన మృదుల
జిహ్వాకారంగమునఁ బ్రీతిచే నటించు
పాత్రకవివర్య సద్గుణప్రకరధుర్య' — అవతారిక, పు. 5.

గోడేవారి యాశ్రయమునందలి మఱియొక కవి కాకరపర్తి కృష్ణకవి. మూఁ డాశ్వాసములు గల శశిరేఖాపరిణయమను శృంగారప్రబంధ మీయన రచనలలో నొకటి. గోడేవారి సంస్థానాస్థానకవియగు కాకరపర్తి తిరుపతిపాత్ర కవిపుత్రుఁ డీ కృష్ణకవి.

'రవికుల సార్వభౌము రఘురాము భజింపుచు తత్కటాక్ష ల
బ్ధి వివిధ వేదశాస్త్రకలితాంచిత శ్రీ గోడె జగ్గరాయభూ

ధవ కరుణాత్త తద్విభవధన్యుని కాకరపర్తి పాత్ర స
త్కవిజనవర్య మజ్జనకు తద్దయు భక్తి నమస్కరించెదన్'

— శశిరేఖా పరిణయము, అవతారిక, పు. 2.

ఈ ప్రబంధము ప్రసిద్ధమగు భారతకథానుసారి. మచ్చునకొక పద్యము :

'అలికులవేణి యిట్టి సమయంబిపుడెన్నఁడు నెంచి చూడఁగాఁ
గలుగదు సుమ్ము, నా పలుకు గట్టిగ నెమ్మదియందు నమ్మి నీ
చెలు లిటు రాకమున్నె దయచే మరుకేళికి సమ్మతించినన్
వలసిన యట్లు వర్తిలఁగవచ్చునుగాదె సరోజలోచనా'

— ద్వితీయా. పు. 24.

కృష్ణకవిప్రణీతమగు మఱియొక రచనము మూఁడాశ్వాసములు గల 'ముఖలింగక్షేత్ర మాహాత్మ్యము'. ఇది ముఖలింగేశ్వరున కంకితము. ఇందలి యొక పద్యము :

'సలలితరూప సర్వగుణసంపదలన్ దగు మిమ్ముఁజూచి యే
యలికచ కైనఁగాని హృదయంబు గరంగదె యంచుఁ దెల్పఁగా
పలసితి మంచు మేము మగవారలతో నిఁక పేటెమర్మముల్
పలుమఱు జెప్పనేల పరభావవిదుల్ గద మీర లెన్నఁగన్'

— ప్రథమా. పు. 13.

ముఖలింగేశ్వర తారావళియను మఱియొక కృతి కాకరపర్తి కృష్ణకవి కృతము. 'శ్రీ ముఖలింగా' అను మకుటముతోఁగూడి అశ్విన్యాది నక్షత్రనామ చిహ్నితములయిన ఇరువదియేడు కందపద్యములుగల రచన మిది.

'శ్రీ సురుచిర సురశైలశ
రాసన నిగమాశ్వ నిర్జరాధిపచిత్తో
పాసితపద సదమృతల
క్ష్మీసదన దయాంతరంగ శ్రీ ముఖలింగా'.

'శ్రీకంఠ భక్తియుక్తుం
డై కాకరపర్తి కృష్ణయాఖ్యుఁడు ప్రీతిన్
నీ కొసఁగిన తారావళి
చేకొను మిలను ప్రబలంగ శ్రీ ముఖలింగా'.

పెదజగ్గరాయనింగారి పెద్దకుమారులును, అనకాపల్లి జమిందారులును నగు గొడే సూర్యప్రకాశరావుగారు (1788—1841) కూడ గొప్ప సాహిత్య పోషకులు. ఈయన ప్రసిద్ధ పండితులు పరవస్తు శ్రీనివాసాచార్యుల అంతేవాసి. సంస్కృతాంధ్రములయందేగాక ఆంగ్లమునందును గొప్ప పాండిత్యము గలవారు. పాశ్చాత్యసీమలలో ప్రచలితమయిన వాస్తుశాస్త్రము, వృక్షలతాది దోహదశాస్త్రములు విశేషాభినివేశముతోఁ బరిశీలించినవారు. ఆంగ్లభాషా

నిఘంటుమర్యాదల ప్రకారము సంస్కృతాంధ్రములకు చక్కని నిఘంటువును కూర్పవలసినదని సూర్యప్రకాశరావుగారు తమ యధ్యాపకులగు శ్రీనివాసా చార్యులుగారిని అభ్యర్థించిరి. దేశభాషోద్ధారకుఁడును, శిష్యుఁడును, పోషకుఁడును నగు సూర్యప్రకాశరావుగారి కోర్కెను మన్నించి నిఘంటువు నందలి చాలభాగమును పూర్తిచేసి చివరి నాలుగయి దక్షరములకొలఁది యుండఁగా శ్రీనివాసాచార్యులుగారు మరణించిరి. ఆచార్యులుగారి పుత్రులు పసివారు. దీనిని పూర్తిచేయు పండితులు కన్పింపనందున మిక్కిలి చింతించుచు 1841 లో సూర్యప్రకాశరావుగారు పరమపదించిరి. తదుపరి వీరి భార్యయగు జానకయ్యమ్మగారు తన భర్త తలపెట్టిన ఈ యుద్యమమును గొనసాఁగింప నిర్ణయించి శ్రీనివాసాచార్యులవారి కుమారులగు వేంకటరంగాచార్యులుగారికిని, రామానుజాచార్యులుగారికిని ప్రాజ్ఞతరాఁగా వారిరువురచే నీ నిఘంటువునందలి శేషభాగమును పూర్తిచేయించిరి. ఇది 'సర్వశబ్దసంబోధిని' అను పేర ప్రకటితమయినది.

ఆంధ్రకవులలో నాథునికుఁడును, కౌండిన్యసగోత్రుఁడును, కృష్ణా మండలము ఎల్లమందగ్రామ వాస్తవ్యుఁడును, ఎల్లమంద కోటీశ్వరస్వామి భక్తుఁడును, జోగయార్య పుత్రుఁడును నగు అక్కినేపల్లి నృసింహకవి రచియించిన ఓషవతీ పరిణయమను నాలుగాశ్వాసముల ప్రబంధమునకు సూర్యప్రకాశరావుగారు కృతిభర్త. ఈయనకవిని తన సభాభవనమునకు రావించి—

'మారుమూలలఁ గలుగు కఠోరశబ్ద
కలిత పాషాణ పాకముల్ గడలు గొలిపి
కబ్బములు సెప్పి యరసికగ్రామణులకు
గృతులిడుదు, రవి దాంభికోన్నతులుగాన'

— ఓషవతీ పరిణయము, 1–29.

'పాకములలోనఁ గదళీ
పాకమె మాధుర్య సరసపాకము దానన్
మా కొక ప్రబంధ మిదుమీ
శ్రీకరగుణసాంద్ర నారసింహకవీంద్రా!' — పైది, 1–30.

'సంతతు లెవ్వియు మహిఁ గృతి
సంతతితోఁ దూఁగ వఖిలసంతతి యిది యో
శెంతయు నేర్పున మా కీ
సంతతి రహి సంఘటింపు సౌఖ్యస్థితిగాన్' — పైది, 1–31.

అని కవితో పలికి కృతిరచనకుఁ బ్రేరేపించినట్లు తెలియుచున్నది. కృతిపతి యగు సూర్యప్రకాశరావుగారు 'కవులకు నీవిచెట్టు చెలికాంద్రకు నెల్లను జీవగఱ్ఱ

బాంధవులకుఁ బట్టుకొమ్మ వసుధామరకోటికి వేల్పుగిడ్డి.........' (1–177) యని కీర్తింపఁ బడినాఁడు.

ఈ ప్రబంధమునందలి యితివృత్తము నాలుగయిదు తరములకు సంబంధించినది. అయోధ్యాధీశ్వరుఁడును, సూర్యవంశీయుఁడును నగు దుర్యోధన మహారాజునకును నర్మదానదికిని జన్మించిన కూఁతురు సుదర్శన. ఈ సుదర్శన అగ్నిదేవుని పరిణయమాడి సుదర్శనుఁడను పుత్రుని బడయును. సుదర్శనుని కుమారుఁడు ఓఘవంతుఁడు. ఓఘవంతుని కూఁతురు ఓఘవతి. ఓఘవతి స్వయంవరమునందు తన పితామహుఁడగు సుదర్శనుని వరించును. ఆ పిమ్మట ధర్మదేవతా వరమున ఓఘవతి పవిత్రమగు నొక నదిగా మాఱిపోవును.

సకలాంధ్రప్రబంధములందలి పడికట్టువర్ణనము లన్నియు నిందు వరుస తప్పకుండ వర్ణింపఁ బడినవి. మచ్చునకు ఒండు రెండు పద్యములు. చంద్రోపాలంభనము నందలి దీ పద్యము :

'సకుటిలవృత్తిమించి, బుధసంగతి లేక గురు స్వసిద్ధి రా
కకువిలసిల్లి, రాత్రిచరకార్యము బూనుచు విప్రయోగులన్
బ్రకటమతిం గలంచుచు, సపంకగతిం గని నీవు దానవ
త్వకలన సంచరింతువు గృపామతిఁ గొంతువె సారసాస్యలన్'

----3–110.

'ఇచ్చరవచ్చు వాని వరియించవె యంచును బల్క, నేరిఁ దా
మెచ్చక పచ్చవిల్తు నెలమిన్ రతి చూచినరీతి నాతనిన్
బొచ్చెములేక చూచి వలపుల్ పచరించి వరించెఁ బ్రేమతో
నచ్చపలాక్షి యంత దివి నచ్చగ నచ్చరలాడి రాదటన్' —4–125.

గ్రంథాంతపద్యమునందలి శకవర్ష సూచన ననుసరించి కృతిసమర్పణ కాలము క్రీ. శ. 1817 అని తెలియుచున్నది.

## ఎఱ్ఱమిల్లి పేరరాజకవి (1800–1860)

ఈయన గొదే సూర్యప్రకాశరావుగారి యాస్థాన విద్వాంసుఁడు ; పౌరాణికుఁడును. ఓఘవతీపరిణయ కృత్యవతారికవలన ఈ పేరరాజకవి 'సకల వర పురాణ మర్మజ్ఞతయును, సరస వాక్ప్రౌఢియును' కలిగి సూర్యప్రకాశరాయుని మెప్పించినవారని తెలియుచున్నది (1–192). ఇతఁడు మఱింగంటి వేంకటాచార్యులు రచించిన మల్లారిచరిత్రము కడు సంగ్రహముగా నుండుట చూచి గొదే సూర్యప్రకాశరావు భార్య జానకయ్యమ్మ యాజ్ఞప్రకారము మూల ద్విపద గ్రంథమునకు మఱికొన్ని మంజరీద్విపదలను జేర్చి విస్తరించి వ్రాసినాఁడు. మలహరేశ్వరస్వామి గొదే వంశీయుల యిలువేల్పు. శుభాశుభ కార్యముల సందర్భములయందు మలహరేశ్వర ప్రతిమను యథావిధిగ షోడశోపచారములచే

పూజించుట వీరి యింట పరంపరగా వచ్చుచున్న సంప్రదాయము. ఈ పూజా విధానమంతయు ఓఘువతీపరిణయ కృత్యవతారికలో విపులముగా వర్ణింపఁ బడినది. మలహరేశ్వరుని కరుణచేతనే గొడేవారికి రాజ్యమువచ్చి యభ్యుదయములు చేకూఱినవఁట! మలహరేశ్వర స్వామియే మల్లారి యను పేర వ్యవహృతుఁడు. జానకయ్యమ్మ యందుచేత నీ గ్రంథమును విస్తరింపఁ జేయించినది. ఈ గ్రంథ మముద్రితము. దీని లిఖితప్రతి చెన్నపురి ప్రాచ్యలిఖితగ్రంథాలయమున ఆర్. నెంబరు 338(b) గా నున్నది. నాలుగాశ్వాసముల అసమగ్రప్రతి యిది. ఈ మల్లారిచరితము స్కాందపురాణసంగతమఁట! కృతయుగంబున కావి నుండిన గిరిరాజను నతఁడు మల్లారిఁగొలిచి యతులితైశ్వర్యయుతుఁడయి వర్ధిల్లెనఁట!

'శ్రీనివాసంబైన శ్రీ గొడేవంశ
కలశవారధిసుధాకరుఁడు గాంభీర్య
వీర్య ధైర్య స్థైర్య విశ్రుతౌదార్య
కలిత సాహస శౌర్య ఘనతరైశ్వర్య
యుతుఁడురుసత్కృపాయుతుఁడు సూర్యప్ర
కాశరాయఁడు దానఘనుఁ డని జగతిఁ
బ్రణుతికెక్కిన మేటిప్రభుపున కెలమి
సద్ధర్మపత్నియౌ సరసాంతరంగ
పరమపాతివ్రత్య భవ్య గుణశీల....
అలరిన శ్రీ జానకయ్యగా రెలమి
రహి నెట్టిముల్లి పేర్రాజును నన్నుఁ
దమ యాశ్రితులలోనఁ దద్దయునెపుడు
గారవించుచునుంటఁ గరుణచే నిట్లు....'

కర్ణకులీనుల ఘనచరిత్రముగల యీ కృతిని రచించినట్లు పేరరాజుకవి పేర్కొనినాఁడు. 'గగనేభ నగభూమిదగు శాలివాహశకమునఁ బింగళసంజ్ఞ సంవత్సరమ్మునఁదగు కార్తికమ్మున శుక్లపక్షమున....' అనఁగా శా.శ. 1780

* శ్రీ గొడే సూర్యనారాయణరావుగారు విశాఖపట్టణమున ఉప్పుటేటి పక్కను గట్టించుచున్న అనేక భవనములను చూచి, నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి (1758—1836) గారు వాపోవుచుఁ జెప్పినదిగా క్రింది చాటువు వాడుకలో నున్నది:

'కారూణా మథధారూణాం శిల్పకానాం తథైవ చ
గొడే నారాయణ ద్రవ్య మయ్యో అయ్యో వృథావృథా'

ఇది సూర్యనారాయణరావుగారి కుమారులగు మహరాజా గొడే నారాయణగజపతిరావు (1828—1903) గారిని గుఱించి చెప్పినదని నడిమింటి పతంజలిశాస్త్రిగారు చేసిన యూహ సరికాదని తోఁచుచున్నది. సర్వమంగళేశ్వరశాస్త్రిగారి కాలమునాఁటికి పట్టుమని పదేండ్లులేని బాలుఁడు ఇంతద్రవ్యమును వెచ్చించుట పొసఁగని మాట!

వీరి కుమారులలో పెద్దవారు వెంకటజగ్గారావుగారు (1817—1856). వీరు ప్రాచ్యప్రతీచీ విద్యాసంప్రదాయముల నామూలచూడముగ నవలోడనము చేసిన వారు. వీరు విశాఖపట్టణములో నాధునికయంత్రపరికరములతో, నావశ్యక గ్రంథ సంచయముతో నొక నక్షత్రశాల నేర్పఱిచి ఖగోళవిషయములపై తఱచుగా నాసక్తికరములగు విషయములను ప్రాచ్యప్రతీచీఖండముల యందలి శాస్త్ర పత్రికలలో ప్రచురించెడివారు. వీరికి పుత్రసంతతి లేనందున తమ తనయ యచ్చయ్యమ్మగారిని అంకితము వెంకటనరసింగరావు (1827—1898) గారి కిచ్చి యిల్లటపుటల్లునిగా నిలిపికొనిరి. అచ్చయ్యమ్మగారు తలిదండ్రుల యనంత రము 1864 లో పైతృకములగు ఎంబారం, షేర్ మొహమ్మద్ పురము ఎస్టేటు లకు జమీందారిణి యైనది. స్థానిక కళాశాలకు రాః మేఘ ర్త శ్రీ ఏ. వి. నరసింగ రావుగారు 1892 లో లక్ష పదియేను వేల రూ. లు విరాళమిచ్చినందున ఈ కళాశాల శ్రీమతి నరసింగరావుగారి స్మృత్యర్థము మిసెస్. అంకితము వెంకట నరసింగ రావు కళాశాల (Mrs. A. V. N. College) అను పేర వాడుకపడినది.* వీరి కుమారులగు అంకితము వెంకటజగ్గారావుగారు తమ మాతామహులు నెలకొల్పిన నక్షత్రశాలను బహుముఖముల విస్తరింపఁ జేసిరి.

> 'జ్యోతిషప్రియుఁడయి శాస్త్రశోధమునకుఁ
> దివిరి విద్వాంసులగు వారిఁదెచ్చి తనదు
> కడ నిలుపుకొంచుఁ దన్మార్గగతినిఁ జేసి
> కట్టె నక్షత్రశాల నాపట్టణమున' —ఆంధ్రాభ్యుదయము, 3—13.

వీరు F.R.A.S., F.R.Met. Soc., F.A.S., F.R.C.I. మొదలగు పట్టములను పొందినవారు. హరితసగోత్రుఁడును, ఆపస్తంబసూత్రుఁడును, యజుశ్శాఖీయుఁ డును, ప్రసిద్ధ జ్యోతిశ్శాస్త్రవేత్తయును నగు రాణీ మహాగ్ని చిన్నృసింహకవి షేర్ మొహమ్మదుపురము జమీందారుల సమ్మానములందినవారు. విశాఖ పట్టణమునందు నక్షత్రశాలాధీశ్వరులయిన రాజా అంకితము వెంకటజగ్గారావు బహద్దరుగారి సంస్థానపండితులు. పంచాంగసాధనోపయోగముగా వీరు రచించిన 'తిథి కల్పవల్లి' అను శాస్త్రగ్రంథము రాజా వెంకటజగ్గారావుగారికి

ఇది సూర్యనారాయణరావుగారి కుమారులగు మహారాజా గొడే నారాయణగజపతిరావు (1828—1903) గారిని గుఱించి చెప్పినదని నడిమింటి పతంజలిశాస్త్రిగారు చేసిన యూహ సరికాదని తోఁచుచున్నది. సర్వమంగళేశ్వరశాస్త్రిగారి కాలమునాఁటికి పట్టుమని పదేండ్లులేని బాలుఁడు ఇంద్రద్రవ్యమును వెచ్చించుట పొసఁగని మాట!

* 1860 నాఁటి ఆంగ్లో వర్నాక్యులర్ స్కూలు, నేఁటి కళాశాలకు తొలిరూపము. ఓసని స్థాపించుటలో మహారాజా గొడే నారాయణ గజపతిరావుగారు ముఖ్యులు. ఇది 1878 లో సెకెండుగ్రేడు కాలేజి అయి మదరాసు యూనివర్సిటీ కనుబంధింపఁబడినది. 1878—1892 ల మధ్య దీని నామము హిందూ కళాశాల.

కృతియీఁబడి ముద్రితమయినది. ఈ విషయమునే—

'అంకితవంశవార్ధి నుదయంబయి కల్పమహీజమో యనన్
బొంకముగాంచి యాచనక పుంజము దన్పెడి జగ్గరాయనా
మాంకితు భర్తజేసెఁ దెలియన్ తిథికల్పకవల్లికిన్ బ్రమో
దాంకుర మొప్పఁగా నృహరి యజ్వకు నీ దెపఁడీ జగంబునన్' —226.

అని 'దైవజ్ఞ సార్వభౌమ విజయము' అను గ్రంథము ప్రస్తావించినది. తిథి కల్పవల్లి రచనాకాలము క్రీ.శ. 1892. పూర్వోక్తమయిన దైవజ్ఞ సార్వభౌమ విజయము రాణీ మహాగ్ని చిన్నృసింహకవి జీవితచరిత్రము. కావ్యస్మృతితీర్థ జనమంచి శేషాద్రిశర్మ విరచితము. పండితదాసు శ్రీరాములుపంతులుగారిచేఁ బరిశోధితము. రాజా అంకితము వెంకటజగ్గారాయ బహద్దరుగారిచే ప్రచురితము.

గొడేవారి వంశములో ననితరసాధ్యమయిన గౌరవములను పొంది యనేక ధర్మసంస్థలను, విద్యాసంస్థలను, పండితకవులను పోషించి ప్రాచీ నార్వాచీన ప్రబంధముల నెన్నింటినో ప్రచురించి చిరయశమును సముపార్జించిన వారు మహారాజా సర్ గొడే నారాయణగజపతిరావు బహద్దరుగారు (1828–1903). వీరు పరవస్తు శ్రీనివాసాచార్యుల శిష్యులు. రమారమి పదియేండ్లపాటు (1840–1849) కలకత్తాలో నాంగ్లవిద్యాధ్యయనము చేసిరి. చాలకాలము (1868–1884) కౌన్సిలు సభ్యులుగా, మద్రాసు విశ్వవిద్యాలయ సెనేట్ సభ్యులుగా పేరుపొందినవారు. తమ పెద్దతండ్రి గొడే సూర్యప్రకాశ రావు (1788–1841) గారి దౌహిత్రి చినజానకయ్యమ్మగారిని వివాహమాడి నందున వారసులులేని వారి యెస్టేటులకు వీరు హక్కుదారులయిరి. నాఁటి సంస్థానాధీశులలో పెక్కురు మహారాజా నారాయణగజపతిగారికి ఆప్తమిత్రులు*. వీరు బ్రహ్మసమాజ మతాభిమానులు. మహర్షి దేవేంద్రనాథటాగూరుగారికిని, బ్రహ్మానంద కేశవచంద్రసేనుగారికిని ఇష్టులు.

* వెంకటగిరిరాజాగారి పట్టాభిషేకమునుఁజూడ నరుదెంచిన గొడే నారాయణ గజపతిగారి వర్ణనమును చూడుఁడు :

'ప్రణయమున సర్వజన బ
ర్హిణఘనుఁడై తనరు నానరేబిల్ నారా
యణగజపతిరాయ సుహృ
న్మణి మొదలుగ వచ్చిరపుడు నరపతి మిత్రుల్'

—రాధాకృష్ణ సంవాదము, ద్వితీయా. పు. 181.

'అతులాసన శిఖరాలం
కృత కరిగిరి నెక్కి యానరేబిల్ వియదాం
కిత గొడే నారాయణగజ
పతిరాయ ఘనుండు వచ్చెఁ బ్రజలనుతింపన్' —పైది, తృతీయా. పు. 324.

కాకరపర్తి బుచ్చిపాత్రకవి ప్రణీతమయిన సత్యవతీపరిణయ మను నయిదాశ్వాసముల ప్రబంధము నారాయణగజపతిగారి కంకితము. బుచ్చిపాత్రకవి సోదరపుత్రులగు కాకరపర్తి వేంకటశాస్త్రులుగారిచేతను, పాత్రకవికి పౌత్రుఁడయిన సీతారామశాస్త్రులుగారిచేతను సవరింపఁబడిన యీ ప్రబంధము నారాయణ గజపతిగారి యనుజ్ఞప్రకారము ప్రచురితము. బుచ్చిపాత్రకవి నారాయణగజపతి తండ్రి సూర్యనారాయణప్రభున కంకితము చేయనెంచి కథాంశముమాత్రము పూర్తిచేసి మరణింపఁగా, కవివంశీయులగు వేంకటశాస్త్రి, సీతారామశాస్త్రి నారాయణగజపతి కోరికమేరకు కావ్యావతారికను రచియించి నారాయణగజపతికి కృతిగా దీనిని సమర్పించిరఁట! ఇందలి యితివృత్తము సత్యవతీశంతనుల వివాహగాథ. ప్రబంధపరిపాటిగా అష్టాదశవర్ణనము లిందు చోటుచేసికొన్నవి. ప్రబంధశాఖాప్రియులు అవశ్యము పఠింపఁదగిన యుత్తమరచన.

గొడేవారి యాస్థానపండితులగు వరవస్తు శ్రీనివాసజగన్నాథస్వామి యయ్యవారలుగారు ఆనరబుల్ మహారాజా గొడే నారాయణగజపతిరాయనిం గారి చెప్పుప్రకారము అనేకోపనిషత్తులనుండి యుత్తమభాగములను సంగ్రహించి ప్రతిపదార్థ తాత్పర్యములను జేర్చి 'భగవద్విషయోపనిషత్తులు' అనుపేర నొకగ్రంథమును రచించి ప్రకటించిరి.

నారాయణగజపతిగారి మఱియొక యాస్థానకవి గొర్తి వేంకటశాస్త్రి. ఈయన శ్రీవత్సనగోత్రుఁడు. రామస్వామి పుత్రుఁడు. నారాయణగజపతిగారి యాదేశముప్రకారము 'సత్ప్రభూ పద్యమాల' యను గ్రంథమును రచించిరి. మహారాజాగారు తమ కిష్టమువచ్చిన కల్పనలను వివరింపఁగా వానినిఁ బద్య రూపమున నిర్మింపవలెనను నియమముతో 'సత్ప్రభూ' అను మకుటముతో ఈ కృతి సాఁగినది. ఇందలి యొక పద్యము :

'జనకుఁడ వీవు నీ వలన సంభవమొందితి మెల్లవార మే
పునఁదగు మైత్రి నొందొరులముస్ సహజన్ములయట్లెసంగఁగా
ననిశము నీదు దివ్యమహిమానుభవం బొనరించు నట్లుగా
నను గృపసేయవే యఖిలనాయక! సర్వశరణ్య! సత్ప్రభూ!' —23.

నారాయణగజపతిగారి నిర్దేశముమేరకు వేదాంతవిషయబోధకములగు ననేక గ్రంథములనుఁ బరిశీలించి యందలి ముఖ్యాంశముల నేరి న్యాయవైశేషిక యోగసాంఖ్య భాట్ట ప్రాభాకర శంకర శాక్త రామానుజ మధ్వాది మతముల ప్రరోహ విస్తారాదికములు సంగ్రహముగా సుబోధకశైలిలో నాంధ్రమున వరవస్తు శ్రీనివాస జగన్నాథస్వామి అయ్యవారలుగారిచే రచియింపఁబడిన 'వైదిక మతావళి' యను నుత్తమ దార్శనికగ్రంథము నారాయణగజపతిరాయనిం గారి పీఠికాసహితముగా ప్రచురితమయినది. మహారాజాగారి యార్షధర్మాభిరుచి కిది ప్రబల నిదర్శనము.

మహారాజాగారు పండితకవులను ప్రోత్సహించుటయేగాక పూర్వ ప్రబంధములను పెక్కింటిని స్వయముగా ముద్రింపించిరి. కాకరపర్తి తిరుపతి పాత్రకవి రచించిన సత్యభామాకృష్ణసంవాదము, కాకరపర్తి కృష్ణకవి ప్రణీతములగు శశిరేఖాపరిణయ ముఖలింగేశ్వర తారావళి ముఖలింగేశ్వరక్షేత్ర మాహాత్మ్యములును, అక్కిసేపల్లి నృసింహకవికృతమగు ఓఘవతీపరిణయ మును, కాకరపర్తి బుచ్చిపాత్రకవిరచితమగు సత్యవతీపరిణయమును, పుదిపె సుభద్రయ్యమ్మవిరచిత సర్వకావ్యసంపుటములును, ఎజ్జుమిల్లి మల్లికార్జునకవి యాంధ్రీకరించిన 'చార్ దర్వీషు'—అనఁగా నలుగురుఫకీరుల చరిత్రము, పరవస్తు శ్రీనివాసాచార్యుల సర్వశబ్ద సంబోధిని, నోరి గురులింగశాస్త్రుల గద్యాత్మక విష్ణుపురాణము మున్నగునవి వీరు ముద్రింపించిన గ్రంథములలో ముఖ్యములు. వీరు తిరుపతివేంకటకవులు[1], చిలకమర్తి లక్ష్మీనరసింహము[2], తుమురాడ సంగమేశ్వరశాస్త్రి (1874—1932) మొదలగువారిని సమ్మానించిరి.

'ఆంధ్ర సంస్థానములు — సాహిత్యసేవ' యను వ్యాసమున నిడుదవోలు వారు నిరూపించినప్రకారము 'జ్ఞానభోగి గొడే జగన్నాథయోగి' యను మకుటముగల సీసపద్య శతక మొకటి వేదాంతపరమగునది యున్నట్లును, అది గొడే నారాయణగజపతిరాజుగారి సోదరులయిన జగన్నాథరాజుగారు యోగులై చెప్పినట్లును తెలియుచున్నది[3]. కాని, ఆంధ్రకవిసప్తశతికారుల నిరూపణము మేరకు 1850 ప్రాంతమువాఁడైన నిమిషకవి వేంకటేశకవి గొడే జగన్నాథ రావుగారు యోగియయిన పిదప నాతని సంబోధించుచు 'జ్ఞానభోగి గొడే జగన్నాథయోగి' యను మకుటముతో సీసపద్య శతకమును రచించెనని తెలు చున్నది[4]. మహారాజా గొడే నారాయణగజపతిరాయనింగారి సపత్నిసోదరులు వెంకటజగ్గరాయనామధురలవారొకరు (1817—1856) మాత్రము కన్పట్టు చున్నారు. ఈయన గొడే సూర్యనారాయణరావుగారి ద్వితీయభార్యయగు నచ్చయ్యమ్మగారివలన జన్మించినవారు. ఈ జగ్గారావుగారినే మీఁది శతకము నందు సంబోధితుఁడయిన 'జగన్నాథయోగి' యని సంభావించుచున్నారు. 'జగ్గయ' యను వ్యవహారము 'జగన్నాథ' శబ్దమునకు పరిశిష్టముగానుండుట సంభావ్యమేగాని యీ వెంకటజగ్గారావుగా రెపుడు యోగులుగా మాఱిరో విచారింపఁదగియున్నది. ఆయన 'జ్ఞానభోగి' యగుట మాత్రము ప్రసిద్ధము. చరిత్రకారు లీ విషయముల నింకను విచేచింపవలసియున్నది.

పుట్టిన గొడేవంశమునకును, మెట్టిన మదినెవంశమునకును, సర్వాంధ్ర

[1] నానారాజ సందర్శనము, పు. 14.
[2] చిలకమర్తివారి స్వీయచరిత్రము, పు. 148.
[3] తెలుగువిజ్ఞానసర్వస్వము, సంపుటము 3, పుటలు 1171-1175.
[4] ఆంధ్రకవిసప్తశతి, పు. 259.

మహిళాలోకమునకును సాహితీసంబంధమయిన కీర్తిని సముపార్జించిపెట్టిన యుత్తమ కవయిత్రి మదినె సుభద్రయ్యమ్మగారు (1781–1840). ఈమె గొదే వారి సంస్థానస్థాపకుఁడయిన పెద్దజగ్గరాయనింగారి (1745–1805) జ్యేష్ఠ పుత్రిక. ఈమెకు పితామహిపేరే పెట్టిరి. ఈమె తన మేనయత్త అప్పయ్యమ్మ గారి మూఁడవ కుమారులయిన మదినె సూరన్నగారి భార్య. ఈమె తండ్రివంక వారు గొప్ప విద్యాపంతులు. విద్యాపోషకులు. చిన్నతనమునుండియు నీమె పరవస్తు కుటుంబపండితుల సన్నిధిని సంస్కృతాంధ్రములు, శాస్త్రములు గురుకులపద్ధతిలో చదివి దృఢవ్యుత్పత్తిని, ఉభయభాషాప్రావీణ్యమును, తదుభయ కవితాకౌశలమును సంపాదించినది. ఈమెరచనలలో కొన్ని శత కములు, దండకములు మాత్రము లభ్యమయినవి. ఈమె తరిగొండ వేంగ మాంబకు నించుమించుగా సమకాలికురాలు. లభ్యమయిన యీమె సాహితీసృష్టిని పరికించినచో నీమె కవితారీతి తరిగొండ వెంకమ్మరీతి కంటె ప్రశస్తముగాఁ గన్పట్టును. కృష్ణ కేశవ కోదండరామ రఘునాయక రాఘవరామ వేంకటేశ శ్రీరంగేశ్వర శ్రీహరిరమేశ సింహగిరి సింహాచలాధీశ్వర.— మున్నగు శతకములు, శ్రీరామదండకము*ను ముద్రితములై యున్నవి. 'కృష్ణా' యను మకుటముగల శ్రీకృష్ణశతకము కందపద్య శతకము. కృష్ణ లీలలిం దభివర్ణితము.

'ప్రద్యుమ్నాదులఁ బలుపుర
ఖద్యోతప్రభల మీఱు ఘనులను గనియున్
చోద్యముగా ధారణిలో
మిథ్యా సంసారివగుచు మెలఁగితి కృష్ణా!'

కేశవశతకము భాస్కరశతకమువలె నీతిదాయకమయినది.

'ఏలినవాని సన్నిధిని హృద్యముగా సకలోపచారముల్
తాలిమితో ఘటించు నొకదాసుఁడె చాలును మెండవేల భూ
పాలుని కాలివ్రేల నొక బంగరు రత్నపు మట్టె బూనఁగాఁ
జాల వికాసమౌను పది సత్తువి యిత్తడి వేల కేశవా!'

రఘునాయకశతకమునుండి యొక పద్యము :

'శ్రీరమణీకళత్ర, సరసీరుహనేత్ర, జగత్పవిత్ర, సత్
సారసబృందమిత్ర, సురసన్నుతి పాత్ర, నరేంద్ర పుత్ర, శృం
గార సమగ్రగాత్ర, జనకర్మవిదారణ కృచ్చరిత్ర, శ్రీ
నారదమౌని గీతచరణా రఘునాయక దీన పోషకా!'

సింహాచలాధీశ్వరశతకమునుండి :

* రావూరి దొరసామిశర్మ, దండక వాఙ్మయము; శ్రీరామదండకము, మదినె సుభద్రమ్మ, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, హేమలంబ, 1957, పు. 134.

'వీసంబైన వివేకమున్ సుగుణమున్ విజ్ఞాన మాచారమున్
వాసింబుణ్యము నే నెఱుంగను మనోవాక్కాయ కర్మంబులన్
దాసిం నన్ను తరింపఁజేయుటకునై దాక్షిణ్యభావంబుతో
శ్రీ సారంబగు భక్తియుక్తి లిడవే సింహాచలాధీశ్వరా !'

కోదండరామశతకమునుండి యొక పద్యము :

'విదళితేశ్వరచాప విజితలంకాద్వీప
రవివంశదీప తీవ్రప్రతాప
విదిత శాస్త్రకలాప విహిత వాయసతాప
కుసుమేషురూప తామసదురాప
శ్రుతిమధురాలాప కృతనతార్తి విలోప
కరుణానదీప యక్షయ కలాప
సజ్జన నిక్షేప శత్రు భీకరకోప
కుటిల ప్రతీప సద్గుణకలాప
ప్రాప్తనరరూప, హృతదానవావలేప
రాఘవక్ష్మాప యంచితామోఘరూప
చారు వైశాఖపురధామ జగ్గరాయ
దాసహృదయాబ్ధిసోమ కోదండరామ!'

కాకరపర్తి సీతారామకవి నారాయణగజపతిగారికిని వారి యనంతరము వారి ధర్మపత్ని చిట్టి జానకయ్యమ్మగారికిని ఆశ్రితుఁడు. ఈయన సత్యవతీ పరిణయ ప్రబంధకర్తయగు బుచ్చిపాత్రకవికి పౌత్త్రుఁడు. సత్యవతీపరిణయము నందలి కృతిపతి వంశావతారమును కృతిపతియగు నారాయణగజపతి యనుజ్ఞ మేరకు రచించినవాఁడు. ఈతఁడు చిట్టిజానకయ్యమ్మగారి యాదేశము ననుసరించి 'సత్యా'యను మకుటములో సత్యనారాయణమూర్తి స్తవరూపమైన కందపద్య శతకము నొకదానిని రచించిరి.

'నిఖిల జనస్తుత కాశ్యప
ముఖలింగేశ్వర తనూజముఖ్యుఁడ విద్వ
త్సఖుఁడు భవచ్ఛ్రిత నమనో
న్ముఖుఁడ త్వదీయార్చనాభిముదితుఁడ సత్యా'

'పుస్తక వీణావిలసిత
హస్తే నిజపాదవినతి హరిహయముఖ స
న్మస్తే సమస్తజనని న
మస్తే యని నిన్ను దలఁతు మంజులవాణీ'

నారాయణగజపతివారి యాస్థానోద్యోగులగు శ్రీరంగం సూర్యనారాయణ శర్మగారు 'శ్రీ భగవద్గీతాసార సంకీర్తన' యను నపూర్వగ్రంథమును కీర్తనల

ప్రబంధమున భగవద్గీతా సారమంతయును నిక్షేపించి రచించిరి. ఇది శేషగిరి రాయునకు సమర్పితము. ‘గీతార్థ సారము వినుము నవనీతము జేకొను విధము’ అను పల్లవితోఁ దీర్పఁబడిన వీ కీర్తనలు.

నారాయణగజపతిగారి పట్టమహిషియగు మహారాణి లేడీ గౌదే చిట్టి నరసయ్యమ్మగజపతిరావు గొప్ప విదుషీమణి. సంస్కృతాంగ్లాంధ్రములయందు మంచి పరిచయము కలది. 1903 లో మహారాజా గౌదే నారాయణగజపతిరావు బహద్దరుగారు మరణింపఁగా భర్తృమరణ శోకభారమున క్రుంగిన చిట్టి నరసయ్యమ్మగారు రచించిన భగవత్ స్తోత్ర సంబంధమైన ‘భగవత్ప్రార్థన’ అను గ్రంథము ఆమె దైవభక్తికిని, కవితాశక్తికిని ఒక తార్కాణము. ఇందు 108 పద్యములు కలవు. అందొక పద్యము :

‘భవదీయాజ్ఞను బూని యాకసమునన్ భానుండు శీతాంశుఁడున్
బవలున్ రేయి గ్రమంబునన్ దనరుచున్ బ్రహ్మాండ మెల్లన్ నిజాం
శువుల న్వెల్గఁగఁ జేయుచుందురుగదా శుద్ధాత్మ దివ్యప్రభా
వ విపన్నావన యోగివర్య హృదయాబ్జాతాలయా దుర్జయా’ —64.

గౌదే నారాయణగజపతిగారి జ్యేష్ఠపుత్రిక హెర్ హైనెస్ శ్రీ సీతాబా రాణీ సాహెబావారి సెలవుప్రకారము ఉపమాక క్షేత్రమందు వెలసియున్న శ్రీ వేంకటేశ్వరస్వామివారి తిరుకల్యాణోత్సవమునందు తత్తన్నియతకాలము లందుఁ బఠింపఁబడు సంస్కృతభాషామయమగు సంవాదత్రయము మూల ములతోఁ గూడ ఆంధ్రతాత్పర్య యుక్తముగఁ బ్రచురింపఁ బడినది. ఇందలి చోర సంవాదము పరవస్తు వేంకటరంగనాథస్వామి అయ్యవారలుగారిచే రచియింపఁ బడిన ఆంధ్ర తాత్పర్య సమేతము. లక్ష్మీవరణ, లక్ష్మీనారాయణ సంవాదములు పరవస్తు లక్ష్మీనరసింహస్వామి అయ్యవారలుగారిచే రచింపఁబడిన ఆంధ్ర తాత్పర్య సంభరితములు. ఈ మూఁడును సంవాదత్రయమను పేర వద్వాన్ మహారాణి శ్రీ సీతాబా రాణీసాహెబాగారి ఆజ్ఞ ప్రకారము ప్రచురితము. ఉపమాక క్షేత్రము గౌదేవారి భక్తిప్రపత్తులవలన వర్ధిల్లినది. ఆంధ్రతాత్పర్య కర్తలు మహామహోపాధ్యాయ శ్రీ పరవస్తు వెంకటరంగాచార్యులుగారి పౌత్రులును, అంతేవాసులును.

వద్వాన్ మహారాణిగారి సమాదరణమున ప్రకాశితమైన మఱియొక కృతి ‘ఉపమాక క్షేత్ర మాహాత్మ్యము’. ఇది బ్రహ్మవైవర్త పురాణమునందలి గరుడా చలమాహాత్మ్యములోని అయిదధ్యాయముల గాథ. మూలగ్రంథమునకు పరవస్తు వేంకటరంగనాథస్వామి అయ్యవారలుగారు, కాకరపర్తి సీతారామస్వామి శాస్త్రులుగారును సులభశైలిని ఆంధ్ర తాత్పర్యములను వ్రాసిరి. సీతాబావారి సంస్థానములోని చక్రావధానుల వేంకటాచలముగారు దీనిని ముద్రింపించిరి. ఆంధ్రతాత్పర్యకర్త లిర్వురును రాణీ సీతాబావారి యాశ్రితులు.

షేక్ మొహమ్మదుపురము జమీందారులును, ఉదారులును నగు అంకితము వెంకట ఖానోజీరావుగారు తమ తాతముత్తాతలు సమకూర్చిన అత్యుత్తమ గ్రంథాలయమునందలి గ్రంథరాశిని ఆంధ్రవిశ్వకళాపరిషద్గ్రంథాలయమునకు బహూకరించి తమ విద్యాభిమానమును వెల్లడించిరి. ఖానోజీరావుగారు విశాఖపట్టణమునందలి మిసెస్.ఏ.వి.ఎన్.కళాశాలా పాలకసంఘమునకు పైతృకముగా ఉపాధ్యక్షులు. వీరి పితృపాదులు శ్రీ అంకితము వెంకటజగ్గారావుగారు శాస్త్ర పండితకోటి తోడ్పాటువలన సంధానించిన దేవీపూజామహిమాదికములను దెలుపు మంత్రశాస్త్రగ్రంథము లిఖితప్రతియొకటి ఖానోజీరావుగారియొద్ద నున్నదఁట :

## ఉపజీవ్య గ్రంథసూచి

1. విశాఖపట్టణ జిల్లా వృత్తాంతసంగ్రహము, పుటలు 552—558.
2. కవిత్వవేది, ఆంధ్రవాఙ్మయ చరిత్రసంగ్రహము, 1959, పు. 256.
3. ఆంధ్రవిజ్ఞానము, సంపుటములు 1, 2, 5.
4. తెలుగువిజ్ఞానసర్వస్వము, సంపుటము 3.
5. ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ, ఆంధ్రకవయిత్రులు, పుటలు 71, 72.
6. Russel's Report, President's Minute, para 20, pp. 53,54.
7. Celebrations of the Jubilee of the Queen Empress, London, 1887.
8. A. Vadivelu, The Aristocracy of Southern India, Vol. I, pp. 153–167; Vol. II, pp. 1–31.
9. M.A.M.P. II, Appendix, pp. 294–301.
10. Report of Madras Estates Land Act Committee, 1938.

# చల్లపల్లి (దేవరకోట)

## ప్రవేశిక

ఇది కృష్ణామండలము దివితాలూకాలోని ప్రాచీన సంస్థానము. తూర్పున బందరు తాలూకాయును, దక్షిణ పశ్చిమదిశలలో కృష్ణానదియును, ఉత్తరమున గన్నవరము, గుడివాడ తాలూకాలును దీనికి సరిహద్దులు. దీని వైశాల్యము 190 చ.మై. 66 కసుబా గ్రామములు, 32 శివారు గ్రామములు లేక పాలెములు, 20 అగ్రహారములును ఈ జమీలో నుండినవి. సంస్థానాధీశ్వరులు సాలీనా ఎనుబదివేలకుపైగా పేష్కషు ప్రభుత్వమునకు చెల్లించుచుండిరి. మూఁడు లక్షలకు పైఁబడిన సాలుసరి ఆదాయముండినది. వీరి పూర్వులు గోలకొండ నవాబులనుండి సన్నదులను సంపాదించి నాఁటినుండి యీ ప్రాంతమును పాలించుచు వచ్చిరి. 1802లో పేష్కషు రూ. 1,02,690. పెదవేగి కృష్ణాపుర సంస్థానములు అనంతరకాలమున దీనితో చేరినవి.

## సంస్థాన చరిత్రము

సంస్థాన పాలకులది రేచెర్ల గోత్రము. వీరు కమ్మవారు. పూర్వపాలకులలో గుర్విసీఁడు, తిరుమలనీఁడు, గంగినీఁడు, కంచినీఁడు, నాగన్న మొదలగు పేర్లు వినఁబడుచున్నవి. తిరుమలనీఁడు గోలకొండపాదుషా అబ్దుల్లా కుతుబ్షాకు సామంతుఁడఁట! యార్లగడ్డ గుర్విసీఁడు (క్రీ.శ. 1576—1596) వీరి కూటస్థుఁడుగా సంభావింపఁ బడుచున్నాఁడు. వీరి వంశమునందు మొదటి అంకినీఁడు(క్రీ.శ.1710—1723) చాల ప్రసిద్ధుఁడుగా కన్నట్టుచున్నాఁడు. ఇతఁడు మొదటి నిజామునకు సామంతుఁడు. గుర్విసీఁడున కాఱవ తరమువారు కోదండ రామన్న బహద్దరు దేశాహి (క్రీ.శ. 1746—1791) గారు. 1734—1745 మధ్య పుష్కరముపాటు సంస్థానము చిక్కులలోపడి ఫౌజుదారు వశమున నుండినది. 1746లో కోదండరామన్నగారు జమీకి వచ్చిరి. వీరుగొప్ప వ్యవహార నిపుణులు. ఫ్రెంచివారినుండి గూడూరు, ఆకులమన్నాడులకును. దివిసీమలోని ఆఱులంకలకును ఫర్మానాను సంపాదించిరి. ఆలయారామ తటాకాదుల ప్రతిష్ఠలుజరిపి కవిపోషణమొనర్చినవారు. వీరి పుత్రులు వెంకటరామన్నబహద్దరు దేశాహిగారు 1791లో జమీకివచ్చి స్వల్పకాలముమాత్రము పాలించి 1792లో పరమపదించిరి. వీరి దత్తపుత్రులు శ్రీమంతు రాజా ఇమ్మడి అంకినీఁడు బహద్దరుగారు మైనరైనందున తండ్రియగు నాగేశ్వరనాయఁడుగారు 1792 నుండి 1798 దాఁక

పాలించిరి. 1798 నుండి 1819 దాక ఇమ్మడి అంకినీఁడుగారు జమీని పాలించిరి. వీరికి సంతతి లేనందున సోదరపుత్రుఁడగు దుర్గాప్రసాదనాయఁడు బహద్దరుగారిని దత్తుతీసికొనిరి. కుంఫిణీ ప్రభుత్వమువారు 1802లో ఈ యిమ్మడి అంకినీఁడు బహద్దరుగారిపేరనే 'సన్నద్-ఇ-మిల్కి-యత్ ఇస్తిమిరార్' ప్రసాదించిరి. అంకినీఁడు బహద్దర్‌గారు పూనాలో పీష్వాగారిని దర్శించి వారి నుండి శ్రీమంత్ బిరుదమును, నిజాము నవాబునుండి* రాజా బహద్దరు జబ్దతుల్ అక్రాన్‌బిరుదములను బడసిరి. ఈ బిరుదములను తరువాతి పాలకులు పరంపరగా ధరించుచు వచ్చిరి. చల్లపల్లి కోటలోని రాచనగరు ఈయన కట్టించినదే. కాశీ రాజసౌధము నమూనాలో తయారయిన దీనికి రెండులక్షలు ఖర్చయినవి. అంకినీఁడు బహద్దరుగారి దత్తుఁడు దుర్గాప్రసాదనాయఁడు బహద్దర్‌గారు—అంకినీఁడుగారి తమ్ముఁడు గంగాధరనాయఁడుగారి తనయులు—మైనరైనందున సంస్థానము 1819 నుండి 1831 దాఁక కోర్ట్ ఆఫ్ వార్డ్సు పరమున నుండినది. ప్రాజ్ఞతరాఁగా 1831 నుండి దుర్గాప్రసాదనాయఁడు బహద్దరుగారు కొంతకాలము జమీని నిర్వహించి 1835లో స్వర్గస్థులైరి. ఈయన భార్య దుర్గాభవానీదేవిగారు. పుత్రులు లేనందున వీరి భర్త సూచనమేరకు దివిసీమలోని తమ పరంపరా సంబంధులలో నొకరగు మెరకనపల్లిలంక వాస్తవ్యులు యార్లగడ్డ వెంకట రామన్నగారి మూఁడవ కుమారుఁడైన అంకినీఁడుబహద్దరుగారిని దత్తు చేసికొనిరి. ఈయనను ముమ్మడి అంకినీఁడుబహద్దరుగా రని వ్యవహరింతురు. ఈయన 1846 నుండి 1875 దాఁక జమీని పాలించిరి. చల్లపల్లి రాతికోట కట్టించినది వీరేయఁట! ఈయన పండితాభిమాని. చల్లపల్లిలో సంస్కృత పాఠశాలను స్థాపించినవారు. వీరి జ్యేష్ఠపుత్రులు శ్రీమంతు రాజా యార్లగడ్డ మల్లికార్జునప్రసాదనాయఁడు బహద్దరు (1847–1921) గారు. వీరు ముక్త్యాల ప్రభువులు రాజావాసిరెడ్డి భవానీముక్తీశ్వరప్రసాదు బహద్దరుగారి పుత్రిక విశాలాక్షమ్మను పరిణయమాడి 1876లో పట్టాభిషేకము గావించికొనిరి. శ్రీ రాజాగారి సోదరులగు దుర్గాప్రసాదనాయఁడు, వేంకట రామలింగన్ననాయఁడు జమీలో తమకుకూడ హక్కుగలదని జిల్లాకోర్టులో జమీ విభాగమునకై 1880లో వ్యాజ్యము తెచ్చిరి. క్రింది కోర్టులో ఓడి, పై కోర్టులో గెలిచిరి. ఇది అంతతో ఇంతతో ఆఁగక ప్రీవీకౌన్సిల్‌దాఁక పోయినది. ప్రీవీ కౌన్సిలులో 1890లో జమీ అవిభక్తమని రాజాగారి కనుకూలముగా తీర్పువచ్చినది. కాని తమ్ములిరువురకు చెరి రూ.750లు మాసికభృతి నీవలసివచ్చినది. వీరి పుత్రులు శ్రీమంతు కుమార రాజాయార్లగడ్డ అంకినీఁడుప్రసాద్ బహద్దరుగారు (1877–1927) ముక్త్యాల రాజా వాసిరెడ్డి చంద్రమౌళీశ్వరప్రసాదనాయఁడుగారి సోదరి యగు భవానీదేవిగారిని 1904లో వివాహమాడిరి. 1921లో జమీకి వచ్చిరి. వీరి

*షా ఆలంనుండి యని కమ్మవారిచరిత్రము.

సుమారులే మొన్నటి ఆంధ్రప్రభుత్వ ఆరోగ్యశాఖామంత్రి శ్రీమంతు రాజా శివరామప్రసాద్ బహద్దర్‌వారు. వీరు 1906లో జన్మించిరి. 1908లో భవానీ దేవిగారు పరమపదింపఁగా 1909లో అంకినీఁడుప్రసాదు బహద్దరుగారు మద్రాసు వాస్తవ్యులు శ్రీమంతులు గడ్డిపాటి వీరయ్యనాయఁడుగారి ద్వితీయ పుత్రిక రమణమ్మగారిని పెండ్లాడిరి. ఈమెయును జబ్బుపడి 1918లో నిస్సంతుగా మరణించిరి. ముక్త్యాల చినరాజా చంద్రమౌళీశ్వరప్రసాదబహద్దరుగారి తనయ రాణి వెంకటరత్నమాంబ వీరిమూఁడవసతి. ఈమెవలన కలిగినవారు శ్రీమంతు రాజా యార్లగడ్డ రామకృష్ణప్రసాద్‌బహద్దర్‌గారు(1919). రాజా అంకినీఁడు ప్రసాదు బహద్దరుగారు తమ రెండవ కుమారులగు రామకృష్ణప్రసాదుబహద్దర్ గారి కొఱకు ముంజులూరు, పెనమకూరు ఎస్టేటులను వేఱుగా కొని యిచ్చిరి. రామకృష్ణప్రసాదుగారు హైదరాబాదులోని సారథీ స్టూడియో అధిపతులు. వీరి తనయులు కుమారరాజా హర్షవర్ధనప్రసాదుగారు. 1928 లో అంకినీఁడుప్రసాదు బహద్దరుగారు పరమపదింపఁగా జ్యేష్ఠపుత్రులగు శివరామప్రసాదుబహద్దరుగారు 1929 లో జమీకి వచ్చిరి. వీరికి శ్రీమంత్ కుమారరాజా మల్లికార్జునప్రసాదు, అంకినీఁడుప్రసాదు, పద్మనాభప్రసాదు అని ముగ్గురు కుమారులు. కుమారరాజా గారి కుమారులు శివరామప్రసాదు. జమీందారీరద్దుచట్టముమేరకు నీ సంస్థానము నంతరించినది. అంకినీఁడు ప్రసాదుగారు పార్లమెంటు సభ్యులు.

## సాహిత్యపోషణము

చల్లపల్లిసంస్థానమువారి సమాదరణమున వెలసిన కవులలో ముక్తేవి పెరుమాళ్ళయ్య, కాసుల పురుషోత్తమకవి మొదలగువారు ముఖ్యులు. సంస్థాన మూలపురుషులలో నొకరగు కంచినీఁడుగారిమీఁద వారి వితరణాదిక గుణములను ప్రకటీకరించు చాటువులు పెక్కులు కలవఁట ; అవి యింతవరకు ప్రకటితము కాలేదు (చూ. కమ్మవారి చరిత్రము, పు. 246).

ప్రసిద్ధ వాగ్గేయకారుఁడు నారాయణతీర్థులు (సుమారు 1580–1680) దేవరకోట ప్రభువుల ఆదరమునుపొందినవాఁడని ఒక యూహ*. కూచిపూడి నాట్యరీతికి గురుపీఠమైన సిద్ధేంద్రయోగి (1675) సైతము దేవరకోటప్రభువుల నుండి ఈనాములను పొందియుండెనఁట†.

యార్లగడ్డ కోదండరామన్నదేశాహి (1746–1791) గారి యాశ్రయము నందలి ముఖ్యకవి పెదముక్తేవిగ్రామవాస్తవ్యులగు ముక్తేవి పెరుమాళ్ళయ్య గారు. ఈయన గొప్ప తపస్సంపన్నులని ప్రతీతి. దివితాలూకా పెదముక్తేవి గ్రామములోని లక్ష్మీపతిస్వామి దేవాలయము పంచ లక్ష్మీనారాయణ క్షేత్రము

* దేవరకోటసీమ సర్వస్వం, పుటలు 72, 73.

† చూ. పైది, పు. 80.

లలో నొకటి. దీనిని పునరుద్ధరించినవారు యార్లగడ్డ కోదండరామన్న దేశాహి గారు. గోల్కొండకైఫీయత్తులో 'యార్లగడ్డ కోదండరామర్సు సుబేదార్ బిహద్దరు' అని కలదఁట[1]. క్రీ. శ. 1765–1785 ప్రాంతమున నైజామునుండి నిజామలీ యనువాని యాధిపత్యమున వచ్చిన గుఱ్ఱపుదండు దేవరకోట సంస్థానమును దోఁచికొనవలెనని ప్రయత్నించుచున్నదని[2] తెలిసి సంస్థానాధిపతి యగు కోదండరామన్న దేశాహిగారు ముక్తేవి పెరుమాళ్ళయ్యకవిగారిని పిలిపించి యా వృత్తాంతమంతయును జెప్పి యా దండును రాకుండజేయుఁడని వేఁడికొనిరఁట. కవిగారు శ్రీకాకుళక్షేత్రమునకు వచ్చి స్వామివారి సన్నిధిని నెలకొనియున్న శ్రీ ఆంజనేయస్వామివారి నుపాసించి అప్పటికి బెజవాడ యొద్దకు వచ్చిచేరిన గుఱ్ఱములదండుపై పిడుగులుపడి భయముతో పరుగెత్తు నటుల పద్యశతకముచే స్తుతించిరఁట. ఆంజనేయస్వామివారి మాహాత్మ్యము వలన నవాబుపటాలములపై పిడుగులుపడి అల్లకల్లోలమైనందున నవాబుగారు మిగిలిన దండుతో వెనుదిరిగిపోయిరఁట. ఇదియే హనుమంతశతకము[3]. సింహాద్రి నారసింహశతకము, భద్రాద్రిశతకము, విశ్వేశ్వరశతకము, శత్రుసంహారశతకము, ఆంధ్రనాయకశతకముల కోవలోఁ జేరిన దీశతకము. 'శత్రుహంత శ్రీ హనుమంతా[4]' అను మకుటముగల కందపద్యశతక మిది. మాదిరికి కొన్ని పద్యములు :

'ఇత్తఱిని నిజామల్లీ
హత్తీలు గుఱాలు పటుతరాహవబలముల్
మొత్తమయి వచ్చె వి
చ్చిత్తు పడన్ శత్రుహంత శ్రీ హనుమంతా'.
'లక్షలతరబడి యావల
పక్షంబున గుఱ్ఱములును బలములు వచ్చెన్
ఈ క్షణమున నీవే చని
శిక్షింపుము శత్రుహంత శ్రీ హనుమంతా'.
'వచ్చిరని జనులు బలికిరి
రచ్చల బెజవాడవరకు రాతిరి విని నే

[1] ఆరాధన, 1956 నవంబరు, పు. 249.

[2] A. Vadivelu, Vol. II, pp. 123, 124; J.A.H.R.S., Vol. VII; దేవరకోటసీమసర్వస్వం, పు. 6.

[3] దీవి నరసింహాచార్యులు, శ్రీకాకుళము – ఆంధ్రవిష్ణువు, ఆరాధన, 1956, ఏప్రిల్, పుటలు 67–71.

[4] వైరిహంత శ్రీ హనుమంతా యను మకుటమున్నట్లు దేవరకోటసీమసర్వస్వం, పు. 6.

త్వచ్చరణంబులు గొలిచితిఁ
జెచ్చెరనో శత్రుహంత శ్రీ హనుమంతా'.
'కాకుళరాయునిఁ బొడఁగని
తేకువ యీ ముచ్చటంత దెల్పియు హితపున్
గైకొని హయములఁ గొట్టవె
చీకాకుగ శత్రుహంత శ్రీ హనుమంతా'.
'భానుని మ్రింగిన పగిదిని
సేనాధిపు నాక్రమించి చీకాకుపడం
గా నొనరిచి రానీయకు
సేనల నో శత్రుహంత శ్రీ హనుమంతా'.
'రక్షగ దేవరకోటకు
నీ క్షణమున వచ్చి మమ్ము నీ వేలు జగ
ద్రక్షక యక్షకుమారుని
శిక్షించిన శత్రుహంత శ్రీ హనుమంతా'.
'ఆషాఢ బహుళ చవితికి
దోషాత్మ నవాబు బలము దోలుము మరలన్
శేషించకుండ రిపుల న
శేషముగా శత్రుహంత శ్రీ హనుమంతా'.
'వడిగల దేవుఁడ వనుచును
నుడికారపు శతకమందు నుతిసేసెద నే
కడువడి గుఱ్ఱపుదళముల
జెడఁదోలుము శత్రుహంత శ్రీ హనుమంతా'.

పెరుమాళ్ళయ్యకవి ప్రార్థనలు మన్నించి ఆంజనేయస్వామి నవాబు పటాలములపై పిడుగులు పడునట్లు చేయఁగా నవాబుసేన చెదరిపోయెనఁట. ఆ పిమ్మటఁ జెప్పిన పద్యము లివి :

'వాసి మహారాజశ్రీ
దేశాయీగారి కార్యతేజంబెపుడున్
భాసిల్ల శత్రు లణఁగఁగఁ
జేసితివా శత్రుహంత శ్రీ హనుమంతా'.
'తిరునాళ్ళ యుత్సవంబున
ధరాసురులకెల్ల నన్నదానములున్ మా
దొరగారిడి కాకుళమున
సిరివరునకుఁ బ్రీతిసేసె శ్రీ హనుమంతా'.

'లోకములోనఁ బ్రసిద్ధిగ
నా కోరిక లొసఁగి కృతికి నాథుఁడవై శ్రీ
కాకుళ నిలయుని సన్నిధిఁ
జేకొంటివి శత్రుహంత శ్రీ హనుమంతా'.
'ఆపద్బాంధవ సదయా
టోపమె నా మీఁద జూపుటొప్పుగ నీకే
ప్రాపగు ముక్తేవీ ల
క్ష్మీపతి పాదాబ్జ భృంగ శ్రీ హనుమంతా'.

'భద్రగిరి సౌధసంచార భవవిదూర' యను మకుటముతో నలుపదినాలుగు సీసపద్యములలో రామాయణకథ నిమిడ్చి పెరుమాళ్ళయ్య యొక కావ్యమును వ్రాసెనఁట*: ఈయన పుత్రులు సుందరరామదాసకవి సంస్కృతాంధ్రములలో గొప్పకవియఁట: 'రామాయణసారసంగ్రహము' అనుకావ్యము వీరి రచన. పెరుమాళ్ళయ్య దౌహిత్రులు కోవెల రాఘవాచార్యులు శ్రీకాకుళాంధ్రవిష్ణువు మీఁదను, పెదముక్తేవి లక్ష్మీపతిస్వామిమీఁదను అనేక గేయములను, ఏకాంత సేవాప్రబంధమును వ్రాసిరి.

కాశీనాథుని మల్లనారాధ్యునికి కోదండరామన్న దేశాహి మల్లేశ్వర పురమును అగ్రహారముగా నిచ్చినట్లు '....చల్లపల్లిధరణీజాని యా కోదండ రాముఁడు మల్లేశ్వరపుర మిచ్చె....నత సమస్తభూమిపతి మల్లనారాధ్య పుణ్య రాశికి....' (సత్యవత్యుపాఖ్యానము. అవతారిక 3) తెలియుచున్నది.

కాసుల పురుషోత్తమకవి శ్రీమంతు రాజా ఇమ్మడి అంకినీఁడు బహద్దరు (1798–1819) గారి ఆస్థానకవి.

'కలలో వెంబడి కృష్ణరాయవిభుచేఁ గబ్బంబు చెప్పించి టే
క్వెలయన్ మున్నొకనాఁటి సేవఁగొని యా శ్రీకాకుళాంధ్రేశ్వరుం
డలరంగా నిపుడంకినీణ్ణృపతి సేయంబూను విద్యోత్సవా
కలనన్ దా నిఁక నెన్ని సన్నుతకృతుల్ గావింపఁగాఁ జేయునో'.

—ఒక చాటుపు, ఆరాధన, 1956, ఏప్రిల్, పు. 71.

ఈ ప్రశస్తి ఇమ్మడి అంకినీఁడుగారికి సంబంధించినది. ఆ నాఁడు శ్రీకాకుళము నందలి ఆంధ్రనాయకస్వామికి పూజలు లోపించినందున స్వామి భూగర్భమున మునిఁగి అంతర్హితుఁడుకాఁగా, దేవరకోటప్రభువు అంకినీఁడు బహద్దరుగారు, కాసుల పురుషోత్తమకవి గొప్ప ఉపాసనాశక్తికల కవియని విని, సాదరముగా నతనిని రప్పించి శ్రీకాకుళేశ్వరుఁ డనుగ్రహించునట్లొనర్ప వలసినదని వేఁడికొనిరఁట: కవి శ్రీకాకుళమునకేఁగి కృష్ణాతరంగిణియందు కృతస్నానుఁడయి, కాకుళేశ్వరుని కోయిలలో నిలుచుండి అష్టోత్తరశత

* దేవరకోటసీమసర్వస్వం, పు. 64.

పద్యములను నిష్ఠాపరుఁడయి పఠించుసరికి స్వామి పద్యమున కొక యంగుళము పంతున పైకి లేచివచ్చెనఁట! కవిశక్తి కలరి అంకినీఁడుప్రభువతనిని తమ యాస్థానకవిగా నియమించిరని యైతిహ్యము. ఈ పురుషోత్తమకవి చల్లపల్లి జమీందారీలోని శ్రీకాకుళాంధ్రవిష్ణునిమీఁదఁ జెప్పిన కృతియే ఆంధ్రనాయక శతకము. 'చిత్రచిత్రప్రభావ దాక్షిణ్యభావ హత విమతజీవ శ్రీకాకుళాంధ్రదేవ' యను మకుటముగల నూఱు సీసపద్యముల సంపుట మీ శతకము. చమత్కార లోలుకు తెనుఁగు నుడికారమునకును, చక్కని వ్యాజస్తుతులకును ఈ శతకము ఆకరము. 'అలుబిడ్డలు తెచ్చు ప్రఖ్యాతిగాని మొదటినుండియు నీవు దామో దరుఁడవె' వంటి పంక్తులు నిందాస్తుతికి పరాకాష్ఠగా భావింపవచ్చు. హంసల దీవి గోపాల మానసబోధ భక్తకల్పద్రుమశతకము లీయన యితరకృతులు. పురుషోత్తమకవి చల్లపల్లిజమీలోని పెదప్రోలుగ్రామ నివాసి. చల్లపల్లికిని, మోపిదేవికిని మధ్య పెదప్రోలు కలదు. తండ్రి అప్పలరాజు, తల్లి రమణమ్మ. వీరిది కాశ్యపగోత్రమఁట! గురువు అద్దంకి తిరుమలాచార్యుఁడు. పురుషోత్తమకవి బ్రాహ్మణుఁడని కొందఱును, బట్రాజని కొందఱును[1] భావించిరి. ఏ కులము వాఁడైనను నగుఁగాక! తెలుఁగువారికి కలకాలము నిలువఁదగిన శతకకృతిని సమర్పించి కథావశేషుఁడయినాఁడు. కాసులవారనెడి బట్రాజులు నేఁటికిని పెదప్రోలులోఁ గలరనియు, వారు ఆంధ్రనాయకశతకములోని పద్యములను వీనులకింపుగాఁ జదువుదురనియు తెలియుచున్నది[2].

1846—75 మధ్య దేవరకోటను పాలించిన మూఁడవ అంకినీఁడు బహద్దరుగారు భాషాభిమానులు. సంస్కృతాంధ్రపండితులతో స్వయముగా సంభాషించుచు వారిని సుచితరీతిని సత్కరించుచుండిరఁట. వేమూరి సుబ్బావ ధాని, యడవల్లి అప్పావధానులు, మద్దూరి కృష్ణావధానులు, కోటమర్తి రామావ ధానులు, ప్రభల ఆదినారాయణావధానులు ఆనాఁటి దేవరకోటలో పేరుమిగిలిన వేదపండితులు. రాజాగారు చల్లపల్లిలో సంస్కృతపాఠశాలను స్థాపించి కావ్య నాటకాలంకార వ్యాకరణములను, వేదమును బోధింప నేర్పాటుచేసి, ఉచిత భోజనసౌకర్యములు కల్పించి పోషించిరి.

1876—1921 నాఁటి చల్లపల్లిపాలకులైన మల్లికార్జునప్రసాదనాయుఁడు బహద్దరుగారు గీర్వాణాంధ్రములలో గొప్ప పండితులు. ఉరుదూ, ఇంగ్లీషు భాషలలో మంచి ప్రవేశము కలవారు. పెదప్రోలువాస్తవ్యులును, సాహిత్య

1 వంగూరి సుబ్బారావు, శతకవాఙ్మయచరిత్ర, పు. 488: దేవరకోటసీమ సర్వస్వం, పు. 92.

2 గ. శ్రీ. స. ఆచార్యుఁడు, ఆంధ్రనాయక శతకము, ఆంధ్ర విశ్వకళా పరిషత్తు — కళాశాలాంధ్రసంఘపత్రిక, 1932, అక్టోబరు, పుటలు 2-4.

చక్రవర్తి బిరుదాంచితులును నగు వేమూరి నరహరిశాస్త్రిగారును, వీరి సోదరులు సంగీత సాహిత్య సార్వభౌములు శివరామశాస్త్రిగారును ఆస్థానపండితులుగా, పౌరాణికులుగా నుండిరి. చిత్రకళ, సంగీతము, ఫోటోగ్రఫీ, వ్యాయామము, ఆయుర్వేదము మొదలగువానిలో మల్లికార్జునప్రసాదనాయఁడుగారి కభిరుచి ఎక్కువ. స్వయముగా వైణికులుకూడనఁట! వీ రాయుర్వేదవిధానమును పోషించిరి. చల్లపల్లిలో ఆయుర్వేద వైద్యాలయమును నెలకొల్పిరి. వ్యాయామ విద్యాశిక్షణమందిరము (తాలింఖానా) లను నెలకొల్పి తద్విద్యాప్రదర్శనములను నిర్వహించి ఆదరించిరి. వీరి కుమారులగు అంకినీఁడుప్రసాదుబహద్దరు ఆంగ్లవిద్యాపట్టభద్రులు. బందరు నోబుల్ కళాశాలలోను, మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలలోను విద్యాభ్యాసము గావించిరి. వీరు సుప్రసిద్ధ భాషాతత్త్వవేత్తలు టి. ఎమ్. శేషగిరిశాస్త్రి, రంగాచార్యులు మొదలగువారి శిష్యులు. సంస్కృతము ద్వితీయభాషగా 1904 లో బి.ఏ. పట్టమును స్వీకరించిరి. 1909 లో జరిగిన తమ ద్వితీయవివాహసమయమున రాజాగారు కవిపండితసభ నేర్పఱిచి పెక్కురు విద్వాంసులను సత్కరించిరి. 'సుశీల' యను నాటకమునకు కృతిభర్తలైరి. వ్యవసాయ విషయములనుగూర్చియు, సంస్థానపాలకుల విధులను గూర్చియు కృష్ణాపత్రికలో వ్యాసములు వ్రాయుచుండిరి. వీరికి భాషాసంబంధమైన చర్చలనిన మక్కువ యెక్కువ. వ్యావహారికభాషా ప్రయోగౌచిత్యము, సంధి, అర్ధానుస్వారము, శకటరేఫము, అన్యదేశపదప్రయోగము మొదలగు విషయము లనుగూర్చి వేదము వేంకటరాయశాస్త్రి, పురాణము నాగభూషణముపంతులు, దివాకర్ల తిరుపతిశాస్త్రి, చెన్నాప్రెగ్గడ భానుమూర్తి మున్నగు దిగ్దంతులవంటి పండితులు 1912 లో ప్రసంగించిన పచ్చయ్యప్పకళాశాల సభకు అంకినీఁడు ప్రసాదు బహద్దరుగారు అగ్రాసనాధిపత్యము వహించి ఉపన్యాసకుల ప్రసంగ విషయములను శాస్త్రపద్ధతిలో సమన్వయపఱిచి పండితకోటి ప్రశంసలకు పాత్రులైరి. ఆంధ్ర విశ్వకళా పరిషత్తునకు 1926–27 లో ఇరువదియైదు వేలు విరాళమిచ్చిరి. 'ఆంధ్ర భారతి' (మచిలీపట్టణము) మొదలగు సాహిత్యపత్రికలకు ప్రధానపోషకులుగా నుండిరి. కాకినాడలోని ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల మొదలగు అనేకగ్రంథప్రచురణసంస్థలకు ఉదారముగా విరాళము లిచ్చిరి. బలిజేపల్లి లక్ష్మీకాంతకవి (1881–1953) గారు వీరి సాయముతో 1922 లో గుంటూరులో చంద్రికా ముద్రణాలయమును స్థాపించి భాషాసేవ గావించిరి. తర్కశాస్త్ర ప్రవీణులగు అద్దేపల్లి సోమనాథశాస్త్రిగారు వీరి యాస్థాన విద్వాంసులు. శాస్త్రిగారు విజయనగరము పండితులు మహిసూరి భీమాచార్యులు, పేరి వేంకట శాస్త్రిగారలయొద్ద తర్కవ్యాకరణములు చదివిరి. వేటూరి ప్రభాకరశాస్త్రి పళ్ళె పూర్ణ ప్రజ్ఞాచార్యులు అద్దేపల్లివారి శిష్యులఁట. రాజాగారి పట్టాభిషేక సందర్భమున ఉత్సవముల కరుదెంచిన నానారాజ సందర్శన కర్తలు—

'సిరియున్ వాణియు నొక్కచోఁ గలియుటల్ చేకూరదన్ మాట ని
స్సరయున్ దప్పనితోఁచు హూణకలయందా పెద్ద విద్వత్తకున్
గురుతై తాంధ్రమునందు సంస్కృతమునన్ గూలంకషప్రజ్ఞకున్
గురియై తిట్టి యదృష్టమున్ సులభమొక్కో అంకినీడ్భూపతీ'

—నానారాజ. 228—230.

అని కీర్తించిరి. ఆంధ్రగాయక పితామహులు శ్రీ గరికిపర్తి కోటయ్యదేవరగారు (1861—1924) చల్లపల్లి సంస్థానాస్థాన సంగీత విద్వాంసులు. భగవదను మతము, పతివ్రతామాహాత్మ్యము, హనుమదభ్యుదయము, చిత్రకర్ణోదంతము, వీరరసపుత్రీయము, వైద్యరహస్యదీపిక, తులసీదేవిచరిత్ర మున్నగు గ్రంథము లను రచించిన దేవినేని సూరయ్యగారు కొంతకాలము దేవరకోట ఆస్థాన పండితులుగా, శ్రీమంత్ రాజా అంకినీడ్ ప్రసాద బహద్దరుగారి మాధ్యమిక పాఠశాలలో ఆంధ్ర పండితులుగా నుండిరి. మూలఘటిక కేతన కృతియగు ఆంధ్రభాషాభూషణమునకు వీరు కైసేసిన 'దివ్యప్రభా' వివరణము పండిత లోక ప్రశస్తిని గాంచినది. వీరు చల్లపల్లి సీమలోని మొరకసపల్లి వాస్తవ్యులు.

రాజా శివరామప్రసాదుబహద్దరు

'ఇతఁడు దేవరకోట రాజేంద్రుఁడిరా మ
నఃప్రియుఁడు శివరామ భూనాయకుండు
పేర్మిమై జాతవా గండపెండెరంబు
తొడిగి నపతికవితకు సొంపులిడినవాఁడు'.

అంకినీడు ప్రసాదుగారి కుమారులు శివరామప్రసాదుగారు. బి. ఏ. పట్ట భద్రులు. అభినవతిక్కన తుమ్మల సీతారామమూర్తిచౌదరిగారు రచించిన రాష్ట్ర గాన కృతిభర్త. ఈ యొక్కకృతి చాలు రాజాగారి చిరకీర్తికి. రాష్ట్రసాధనకు, దేశసమారాధనకు రాష్ట్రగాన కావ్యము ప్రబోధ సాధనముగా తెలుఁగునేల నాలుగంచుల జగాదివ్వటీలు వెలిఁగించినది. 'ఏ పురాపుణ్య లేశమో యిటకు దెచ్చి యర్పకునిజేసె నీకు నన్నాంధ్రవాణి' యని మురిసిపోయిన 'తెలుఁగు లెంక' 'ప్రతి పదమ్మున రసచమత్కృతులు వెల్లి వొడువఁ ........' గై సేసిన రాష్ట్ర గానరమణీయకావ్యమును కృతిగొనుటచే కృతిభర్తకు దేశదేశములలో పన్నెయు వాసియు నచ్చినవి.

'శివరామప్రభు ! నీదు హస్తమున నిల్చెన్ రాష్ట్రగానాబ్జ మా
దివిషత్సంఘము మెచ్చ నాంధ్రజనయిత్రీ పాదపూజార్థమై
కవిహంసం బిడ నేఁడు త్వద్విజయ శంఖధ్వానముల్ మ్రోగ నో
యపనీనాయక ! యార్లగడ్డ కులసోమా ! చల్లపల్లీశ్వరా !'

అని పలనాటి కవిచంద్రులు 'రాష్ట్రగాన' కృతి సమర్పణోత్సవ సందర్భమున

చల్లపల్లి రాజాగారి నభినందించిరి.

'దీక్షాకంకణమున్ ధరించి జనయిత్రీ దాస్యవిచ్ఛేదనా
పేక్షల్ పొంపిరి హోప ముజ్జగము కంపింపంగ లేలెం' దని నిద్రా ముద్రితమగు ఆంధ్రజాతిని జాగృతమూర్తిగా నొనర్చిన మహాకవి రాష్ట్రగాన కర్త, కవిలోక వైతాళికుఁడు.

శివరామప్రసాదు బహద్దరువారు చిరకాలము కృష్ణాజిల్లాబోర్డు అధ్యక్షులు. చెన్నపురి శాసనసభాసభ్యులు, ఆంధ్ర విశ్వకళా పరిషత్ సెనేట్ సభ్యులు, ఆంధ్ర మహాసభాధ్యక్షులు. 1929 లో జరిగిన తమ వివాహ పట్టాభిషేకోత్సవ సమయములందు కవి పండిత నట నర్తక గాయకాదులను ఘనముగా సమ్మానించిరి. చెళ్ళపిళ్ళ, శ్రీపాద, వేటూరి, కాశీకృష్ణాచార్యులు. ఉమర్ అలీషాకవి మున్నగు వారానాఁటి కొలువులో కొలువులందినవారు.

'ఇంతమంది కవీంద్రు లేతేని పట్టాభి
షేకమ్మునకును విచ్చేయలేదు
ఇంతమంది బుధేంద్రు లేతేని పట్టాభి
షేకమ్మునకును విచ్చేయలేదు....'

అనియు

'....సుకవితా సీమంతినీ భాగ్యరేఖా రారాజదపాఁకీర్తినిధి....'

యనియు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి ప్రస్తుతిని. ఆశీస్సులను బడసిన కీర్తి శివరామ ప్రసాదుగారిది.

'గోత్రారి సభలోన గురుఁడొక్కరుఁడె కాని
కలరు నీ సభను బెక్కండ్రు గురులు
పురుహూతు కొల్వున బుధుఁ డొక్కరుఁడె కాని
నీ కొల్వునఁగల రనేకబుధులు
దివిజనాయకు మ్రోలఁ గవి యొక్కరుఁడె గాని
కలరు నీ మ్రోలఁ బెక్కండ్రు కవులు
సుత్రాము సన్నిధి మిత్రుఁడొక్కఁడె కాని
నీ సన్నిధిఁ గల రనేకమిత్రు
లౌర! సురసభ మీఱు దర్బారునందు
నిండుపేడుక పట్టభద్రుండవైతి
రాజబహదరు శివరామరాజ! దేవ
దేవుఁడోముత మిము శుభస్థితులొసంగి' –

అని పట్టాభిషేక సందర్భమున నొక కవిసేసిన కైవారమిది. వీరు తిరుపతి వేంకటకవులనేగాక కొప్పరపు సోదరకవులనుగూడ సమ్మానించిరి. జమ్ముల మడక మాధవరామశర్మగారి ఆంధ్రప్రతాపరుద్రీయము. 'అభినవసహదేవ'

యేజెళ్ళ శ్రీరాములు చౌదరిగారి 'పశువైద్య వస్తుగుణ దీపిక', గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగారి 'భట్టుమూర్తి రామరాజభూషణుఁడా' అను కృతులను కృతిని బొందిరి. నాగభైరవ శివరామకృష్ణయ్యవంటి అభ్యుదయకవుల కృతులనునయిత మంకితముగాఁగొని తమ సాహిత్యపోషకత్వమును సార్థక పఱిచికొనిరి. 1949 లో జరిగిన అభినవతిక్కన కనకాభిషేక మహోత్సవ సందర్భమున కవిగారికిని, ఆంధ్రసలందావారి యాధ్వర్యవమున వాఙ్మయమహాధ్యక్ష వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారికిని గండపెండెరములు స్వయముగా తొడిగి కవిపండితుల యెడ తమకుఁగల యాదరమును బ్రకటించిరి. స్థానం నరసింహారావు, పెద్దిభొట్ల చలపతిరావు, గోవిందరాజుల సుబ్బారావువంటి నటశేఖరులకు బంగారు పతకములు, రవ్వల యుంగరములు, సువర్ణ కంకణములు బహూకరించి తమ కళాభిమానమును వ్యక్తీకరించిరి. పగటివేషములు వేయుటలో పెద్దపేరుపొందిన సున్నం వీరయ్యవంటి కళాకారుని, ప్రఖ్యాత హరికథకులు పుట్నూరి కుటుంబరాయశాస్త్రి భాగవతారుగారిని సత్కరించి జానపద కళాభిరుచిని వెల్లడించిరి. మహారాజపోషకులుగా 'మహతి' పత్రికను పోషించిరి.

1930 లో గాంధీజీ చల్లపల్లి వేంచేసినపుడు హరిజన బాలుర విద్యాభివృద్ధి నిమిత్తము రూ. 5,000/– విరాళముగా నొసంగిరి. ఉపహార వేతనముల నిమిత్తము ఆంధ్రవిశ్వకళాపరిషత్తునకు రూ. 8,000/– లును, ఏలూరులోని మాగంటి అన్నపూర్ణాదేవి విద్యాలయమునకు, గుంటూరులోని శారదా నికేతనమునకు, బందరులోని గోరక్షణశాలకు చెఱి వేయినూట పదాఱులును విరాళముగా నిచ్చిరి. కాజ, పెదసనగల్లు, మోపిదేవి, శ్రీకాకుళము మున్నగు గ్రామములలో ఉన్నత పాఠశాలలను స్థాపించుటకు తోడ్పడిరి.

1966 అక్టోబరులో జరిగిన రాజాగారి షష్టిపూర్త్యుత్సవ సందర్భమున ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షులగు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు ఆధ్యక్ష్యము వహించిన కవిపండితసమ్మేళనమునందు తుమ్మల సీతారామ మూర్తి చౌదరి, విశ్వనాథ సత్యనారాయణ, కొత్త సత్యనారాయణ చౌదరి, జమ్ములమడక మాధవరామశర్మ, కొండవీటి వెంకటకవి, పువ్వాడ శేషగిరిరావు, జంధ్యాల పాపయ్యశాస్త్రి మొదలగు విద్వత్కవులకు చెఱి నూటపదియాఱులు, శాలువలు బహూకరింపఁబడినవి.

శ్రీకాకుళమునందు వెలసిన ఆంధ్రవిష్ణువు, పెదకళ్ళేపల్లిలోని దుర్గా నాగేశ్వరులు, బందరు శివగంగలోని మహిషాసురమర్దని చల్లపల్లి సంస్థాన పాలకుల సేవలనందిన దేవతామూర్తులు. దుర్గానాగేశ్వర క్షేత్రమునకు చల్లపల్లి వారు ధర్మకర్తలు. 'శాలివాహన వర్షేషు వేదాంబర గిరీందుషు కోదండరామ ప్రభుణా కారితం శివమందిరమ్' అను ఆలయశాసనమునుబట్టి యీ దేవాలయము

గోవంతరావు దేశాయిగారివలన నిర్మింపఁబడినట్లు తెలియుచున్నది. బందరు శివగంగలోని మహిషాసురమర్దని అమ్మవారి ఉత్సవము చాల గొప్పది. చల్లపల్లి రాజాగారీయుత్సవసందర్భములందు స్వామివారికి గజచోదకులై గజారోహణోత్సవమునుజరుపు ఆచారము నేఁటికిని కలదు. ఏనుఁగంబారుమీఁద ఉత్సవమూర్తి నుంచి శివగంగనుంచి చిలకలపూఁడివరకు ఊరేఁగింతురఁట!

శ్రీ రాజాగారి సవతిసోదరులు శ్రీ రామకృష్ణప్రసాదబహద్దరుగారు ఉన్నతవిద్యాపట్టభద్రులు. ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారి సెనేట్, సిండికేట్, అకడమిక్ కౌన్సిల్ సభ్యులుగా విద్యారంగమునకు చేయుచున్న సేవ విస్మరింపరానిది. తమ ఎస్టేటుగ్రామమయిన ముంజులూరులో స్థాపింపఁబడిన ఉన్నత పాఠశాలకు ఉదారముగా ఆర్థికసాహాయ్యమొనరించి విద్యావ్యాప్తికి తోడ్పడిరి.

## ఉపజీవ్య గ్రంథసూచి


1. కొత్త భావయ్యచౌదరి, కమ్మవారి చరిత్రము, పుటలు 246-248.
2. శ్రీరాం వీరబ్రహ్మకవి, నానారాజన్య చరిత్రము, పుటలు 92-123.
3. తిరుపతివేంకటకవులు, నానారాజ సందర్శనము, పుటలు 228-230, 267, 271-275, 285.
4. ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆంధ్రసాహిత్యచరిత్ర సంగ్రహము, పుటలు 292, 293.
5. తెలుగువిజ్ఞానసర్వస్వము, సంపుటి 3, తెలుగుసంస్కృతి, పుటలు 779, 780.
6. అయ్యదేవర కాళేశ్వరరావు, నా జీవితకథ — నవ్యాంధ్రము, పు. 62.
7. మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రి, సత్యవత్యుపాఖ్యానము, అవతారిక.
8. గొల్లపాటి వెంకటనరసయ్య, దేవరకోటసీమసర్వస్వం, కదళీపురగ్రంథమాల, రాజీవవాటిమస్థానం, పెదకళ్ళేపల్లి, 1966.
9. A. Vadivelu, The Aristocracy of Southern India, II, pp. 120-144.
10. K. Bhavaiah Chowdari, A Brief History of the Kammas, pp. 78, 79, 86, 87.

# జటప్రోలు

## ప్రవేశిక

ఈ సంస్థానము తెలంగాణమునందలి మహబూబ్‌నగరము మండలము లోనిది. వైశాల్యము 191 చ.మై. జనసంఖ్య ముప్పదివేలు. గ్రామములు 89. సాలుసరి ఆదాయము ఇంచుమించుగా రెండులక్షలు. తొలుత విజయనగర చక్రవర్తులకును, చివర నిజామునకును సామంతరాజ్యము. అర్వాచీనకాలము నందు ఈ సంస్థానమునకు కొల్లాపురము రాజధాని యగుటవలన ఈ సంస్థానమును కొల్లాపురమనియు వ్యవహరించుట గలదు.

## సంస్థాన చరిత్రము

ఈ సంస్థానపాలకులు విష్ణుపాదోద్భవమగు పద్మనాయకశాఖలో డెబ్బది యేడు గోత్రములు గల రాచవెలమతెగకు చెందినవారు. పదిగోత్రములుగల ఆదివెలములకు సంస్థానములు లేవు*. సురభి యనునది జటప్రోలుపాలకుల గృహనామము. గోత్రము రేచెర్ల. మూలపురుషుఁడు బేతాళనాయఁడు అను వ్యవహారనామము గల చెవిరెడ్డి. వెంకటగిరి, నూజివీడు, బొబ్బిలిసంస్థాన పాలకులకును ఈ చెవిరెడ్డియే మూలపురుషుఁడుగా సంభావింపఁబడుచున్నాఁడు. చెవిరెడ్డి కాకతీయచక్రవర్తి గణపతిరుద్రదేవుని పరిపాలన కాలమువాఁడు. ఇతనికి తొమ్మిదవతరమువాఁడైన అనపోతనాయఁడు క్రీ.శ. 1243 లో రాజ్యమును బహుముఖముల విస్తరింపఁజేసినవాఁడు. ఈ వంశీయులు 'కంచి కవాట చూరకార', 'పంచపాండ్య దళవిభాళ', 'ఖడ్గనారాయణ', 'కాకతీయరాజ్య స్థాపనాచార్య' మొదలగు కులక్రమాగతములగు బిరుదములు కలవారు. సాహితీ రంగముననను, సమరాంగణముననను సవ్యసాచిత్వము వెలిపిన సర్వజ్ఞ సింగ భూపాలుఁడు ఈ కుదురునకు చెందినవాఁడు. సర్వజ్ఞసింగనృపాలు నన్వయమున పెద్ద పేరుపెంపులు కలవాఁడు పెద్దమహీపతి. సురభివారికి పెద్దమహీపతి కూటస్థుఁడు. పెద్దమహీపతికి అయిదవతరమువాఁడగు సురభి మాధవరాయలు ప్రసిద్ధమగు చంద్రికాపరిణయ ప్రబంధకర్త. ఈ మాధవరాయలు అళియరామ రాయలనుండి జటప్రోలుసంస్థానమును బహుమతిగాఁ బడసినవాఁడఁట. రామ

* చెలికాని లక్ష్మారావు, వెలమలు క్షత్రియులా?, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, నల, 1916, పుటలు 279, 280.

రాయ లిచ్చిన సన్నదులో 'ఆనెగొంది తక్తుసింహాసనానికి అధిపతులయిన....'* అని అళియరామరాయలు ఆనాఁటికి ఆనెగొంది రాజధానిగా పాలించుచుండినట్లు నిరూపింపఁబడినది. పూర్వమునుండి పరంపరగా వచ్చుచుండిన సంస్థానాధిపత్యమును మాధవరాయలకు ప్రసాదించుచు అళియరామరాయలు స్థిరపఱిచి యుండవచ్చును. మాధవరాయల పుత్రులు గోలకొండనవాబు అబ్దుల్ హసన్ కుతుబ్‌షా (తానీషా) వలన క్రీ.శ. 1650 లో సంస్థానమునకు క్రొత్త సనదును సంపాదించియుండిరఁట!

సురభి లక్ష్మరాయ బహద్దరుగారివరకు (సుమారు క్రీ.శ. 1840) సురభివారి రాజధాని జటప్రోలు. వీరికాలమునుండి రాజధాని కొల్లాపురమునకు మాఱినది. నాఁటినుండి వీరు కొల్లాపురముప్రభువులుగా ప్రసిద్ధులయిరి.

'మిక్కుటముగఁ గొల్లాపురపున్ దొర
మెలఁగె నతం డల నకులుకునకున్ దొర'

—రాధాకృష్ణ సంవాదము, తృతీయా. పు. 313.

'....కొల్లాపురీ జగన్నాథ నృప
గ్రామణి యొక కంఖాణశి
ఖామణి నెక్కి విహరించె ...'

—పైది, పు. 339.

లక్ష్మరావుగారి కుమారుఁడు లక్ష్మీజగన్నాథరావుగారు ఫసలీ 1260—1263 (క్రీ.శ. 1851—1884) వరకు రాజ్యముచేసిరి. వీరు నిజామువలన రాజా బహద్దరు, నిజాం నవాజ్‌వంత్ బిరుదములను సంపాదించిరి. దేవబ్రాహ్మణ భక్తితత్పరులు. వీరికి సంతతిలేనందున వెంకటగిరిప్రభువులగు మహారాజా శ్రీ సర్వజ్ఞకుమారయాచేంద్ర బహద్దరుగారి చతుర్థపుత్రులగు నవనీతకృష్ణ యాచేంద్రులను దత్తపుత్రులుగా స్వీకరించిరి. ఈ దత్తపుత్రులే శ్రీ రాజా వేంకటలక్ష్మరావు బహద్దరు అనుపేర 1884 నుండి జటప్రోలుసంస్థానమును పాలించిరి. బొబ్బిలిసంస్థానపాలకులగు మహారాజా సర్ రావు వేంకట శ్వేతాచలపతిరంగారావు బహద్దరుగారు వీరి కగ్రజులు. లక్ష్మరాయ బహద్దరుగారి తనయను తేలప్రోలురాజాగారి కిచ్చిరి. వేంకటలక్ష్మరావుగారి యనంతరము వీరి ధర్మపత్ని రాణి వెంకటరత్నమాంబగారు కొంతకాలము సంస్థానమును పాలించిరి. వీరితరువాత వీరి దత్తపుత్రులు శ్రీ రాజా సురభి వెంకటజగన్నాథరావు బహద్దరుగారు సంస్థానమును నిర్వహించిరి. వీరు తిరుపాచూరు జమీందారు ఇనుగంటి వెంకటకృష్ణరాయల (1899—1935) నందినియగు ఇందిరాదేవిని పరిణయమాడిరి. వీరికాలముననే అన్నిసంస్థానములతోపాటు జటప్రోలును విశాలాంధ్రమున విలీనమయినది.

* శేషాద్రిరమణకవులు, సురభి మాధవరాయకవి, సారస్వతసర్వస్వము, సంపుటి 1, సంచిక 10, పుటలు 20-30.

## సాహిత్యపోషణము

ఈ సంస్థానమునందు సర్వజ్ఞసింగభూపతికాలమునుండి నిన్నమొన్నటి దాఁకసాఁగిన నిరంతరసాహితీసేవ, నిత్యకల్యాణము పచ్చతోరణముగా నెగడిన సాహితీప్రియత్వమును జగత్ప్రసిద్ధములు. సురభివారి కూటస్థుఁడగు పెద్ద మహీపతికి మూఁడవతరమువాఁడైన ముమ్మడి మల్లభూపాలుఁడు మహామహో పాధ్యాయ ఎలకూచి బాలసరస్వతి (క్రీ.శ. 1610—1670) ఆంధ్రీకరించిన సుభాషితత్రిశతికి కృతిభర్త. నీతిశతకమునందు 'సురభిమల్లా నీతి వాచస్పతీ' యనియు, శృంగారశతకమందు 'సురభిమల్లా మానినీమన్మథా' యనియు, వైరాగ్యశతకమునందు 'సురభిమల్లా వైదుషీభూషణా' యనియు ప్రకరణో చితములయిన మూఁడుమకుటములతో రూపొందిన మత్తేభ శార్దూలవృత్తమయ మీ త్రిశతి.

ఈ మల్లభూపాలుని నాల్గవభార్యయయిన వేంకటాంబవలన కలిగిన కుమారుఁడు చినమల్లనృపతి. ఇతని పట్టపురాణియగు చెన్నాంబకు రామ రాయడు, మల్లభూపతి, మాధవరాయలు అని మువ్వురు కుమారులు. ఇరువు రన్నల తరువాత మాధవరాయలు రాజ్యమునకు వచ్చి సింహాసనమధిష్ఠించుటయే గాక, కవితాసింహాసనమును గూడ నధిష్ఠించినవాఁడు. ఈతఁడు గైసేసిన చంద్రికాపరిణయము శ్లేషచమత్కారచారువయిన ప్రౌఢప్రబంధము. రామరాజ భూషణుని వసుచరిత్రమునకు దాదాపు సాటికి రాఁగలిగిన రసికజనమనోభిరామ మయిన రచనము*. ఇది ఆఱాశ్వాసములు గలది. ఈ ప్రబంధమునందలి కృత్యవతారికమేరకు మాధవరాయలు శాస్త్రవిదుఁడు, అఖిల కావ్యవేది, విబుధ శిక్షితుఁడు, ఘనతార్కికవ్యవహృతి నెఱిఁగినవాఁడు అని తెలియుచున్నది. జటప్రోలుపట్టణమునందు వెలసిన మదనగోపాలమూర్తి కిది యంకితము.

'విశాలస్య సుతో రామ! హేమచంద్రో మహాబలః
సుచంద్ర ఇతి విఖ్యాతో హేమచంద్రాదనంతరః' —బాల. 47—13.

వాల్మీకి రామాయణములో నిట్లు సూత్రప్రాయముగా నున్న యితివృత్తమును స్వీకరించి సుచంద్రుఁడు పాంచాలదేశాధీశుని పుత్రికయగు చంద్రికను పరిణయ మాడి అభ్యుదయమునందెనని ఆఱాశ్వాసముల ప్రబంధముగా అనల్పశిల్ప ప్రచురముగా, పండితలోక హృద్యముగా ప్రపంచించినాఁడు. మచ్చున కొండు రెండు పద్యములు పరిశీలింపుఁడు :

'ఈ యగరాజమౌళి మన మిచ్చటనుండుట తా నెఱింగి యా
త్మీయ సమగ్రవైభవగతిన్ దిలకింపఁగ రమ్మటంచు మో

*శేషాద్రిరమణకవులు, వసుచరిత్రము - చంద్రికాపరిణయముల కథావస్తునిర్మాణము, ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక, రక్తాక్షి, 1924, పుటలు 81—89.

దాయతిఁ బిల్వఁబంచెఁ బవనాంకురపాళికఁ జూతమే పయ
స్యా యచలేంద్రు దివ్యమహిమాతిశయంబు ప్రియంబు పొంగఁగన్'
—2—4.

'చలనముబొందసాఁగెఁ జెలి స్వాంతమరాళ మరాళవృత్తికిన్
విలయకృశాను హేతి తులనీమని శాతనిశాతపాళికిన్
ఫలనిభ వాయకీర్ణ మధుపాదప రాగ పరాగపాళికిన్
లలిత రసాలసంగత కలస్వనపీన నవీనగీతికిన్' —4-21.

'నించిరి వేలుపుల్ ప్రియమునిక్కఁగఁ గ్రొవ్విరిసోన, చక్కఁ దీ
వించిరి తాపసాధిపు లవేలమృదంగరవాళి మించ, సం
ధించిరి నాట్యవృత్తి సురనీరజనేత్రలు, చిత్తవీథిమో
దించిరి సర్వదేశజగతీరమణుల్ నిరసూయ మెచ్చఁగన్'
—5—128.

మాధవరాయల కుమారులు నరసింగరావు 'క్షత్రఖేలన'మను గీర్వాణ కృతికర్త. ఆయనకుమారుఁడు 'శూద్రస్మృతి' యను గ్రంథమును సంస్కృతమున రచించినవాఁడు.

క్రీ.శ. 17 వ శతాబ్దికి చెందిన చింతలపల్లి గోపాలమంత్రి ఆర్యా శతకమును సంస్కృతమున సంతరించి జటప్రోలుసంస్థానమున సమ్మానము లందెనఁట. నిజామురాష్ట్రములోని గంగాపురము గోపాలమంత్రి నివాస గ్రామము. మధురవాణీవిలాస ప్రబంధకర్త వీరరాఘవకవి కీతఁడు పెదతండ్రి.

లక్ష్మరాయపౌత్రుఁడయిన వెంకటలక్ష్మరావుగారికాలము (క్రీ.శ. 1850—1883) న ఈ సంస్థానమున విద్వత్కవులనేకులు విలసిల్లి సాహితీసమారాధనము గావించిరి. కవితార్కికసింహ మంచాలకట్ట గోవిందాచార్యులు, కవికంఠీరవ కృష్ణమాచార్యులు, వైయాకరణ గజకంఠీరవ యుణయవల్లి కృష్ణమాచార్యులు. హొసదుర్గము కృష్ణమాచార్యులు, వెల్లాల సదాశివశాస్త్రి, అవధానము శేషశాస్త్రి, అక్షింతల సింగరశాస్త్రి, అక్షింతల సుబ్బాశాస్త్రి, వల్లా చంద్రశేఖర శాస్త్రి మొదలగు పండితకవు లనేకులు కొల్లాపురప్రభుపోషణమునందలివారు.

సంస్థాన విద్వత్కవులను గుఱించిన దిక్ప్రదర్శకనిరూపణ మీ క్రింద నొనర్పఁబడినది :

## అక్షింతల సుబ్బాశాస్త్రి (1807—1871)

కాశీపండితుల సన్నిధిని చదివి సర్వశాస్త్రములయందు ప్రామాణికమయిన ప్రావీణ్యమును సంపాదించి, బ్రహ్మసూత్రభాష్యమునకు 'భాష్యార్థ రత్నమాల' యను వివరణమును రచించి జటప్రోలుసంస్థానమునందు సమ్మానము నందినవారు.

## అక్షింతల సింగరశాస్త్రి

సుబ్బాశాస్త్రిగారి రెండవకుమారుఁడు. పితృపాదుల సన్నిధిని తర్క-వేదాంతశాస్త్రముల పారముచూచిన విద్వాంసుఁడు. వెంకటగిరి, గద్వాల, వనపర్తి, ఆత్మకూరు సంస్థానములయందును సత్కారములందిన గౌరవము వీరిది. అన్నపూర్ణాష్టకము, ద్వాదశమంజరి, భాస్కరఖండము, శ్రీశైలమల్లికార్జున రత్నపంచకము మున్నగునవి వీరి కృతులు.

## కవికంఠీరవ కృష్ణమాచార్యులు (క్రీ.శ. 1835 ప్రాంతము)

జటప్రోలుసంస్థానమున విద్వాంసులు. సంస్కృతమున నిరోష్ఠ్య రామాయణ కావ్యకర్త.

## కృష్ణమాచార్యులు (క్రీ.శ. 1875 ప్రాంతము)

నృసింహవిలాస మను నాంధ్రప్రబంధమును రచించి జటప్రోలుపాలకుఁడయిన సురభి వేంకటజగన్నాథప్రభువున కంకితమొసఁగి అగ్రహారాది సత్కారము లందినవారు.

## కవితార్కికసింహ మంచాలకట్ట గోవిందాచార్యులు

తిరుపతిలో కపిస్థలము దేశికాచార్యులు, కంఠీరవశాస్త్రి మున్నగువారి సన్నిధిని తర్కాలంకారములు తరిచిచూచి వ్యాకరణ వేదాంత మీమాంసా శాస్త్రములమేరలు పరిశీలించి బహుకాలము తర్కాలంకారశాస్త్రాధ్యాపకులుగా పనిచేసి జటప్రోలుసంస్థాన సమ్మానమునందిన పండితులు.

## వైయాకరణగజకంఠీరవ యుణయువల్లి కృష్ణమాచార్యులు

వ్యాకరణశాస్త్రమున దృఢవ్యుత్పత్తిగౌరవము గలవారు. సంస్కృతమున అష్టప్రాసరామశతకము, నిరోష్ఠ్యకృష్ణశతకము, జాతకచంద్రికవ్యాఖ్య, రసజ్ఞానానందము, శ్రీకృష్ణచంపువు మున్నగు గ్రంథములను సంధానించినవారు.

## వెల్లాల సదాశివశాస్త్రి (1861–1926)

జగత్ప్రసిద్ధిగాంచిన అక్షింతల సుబ్బాదీక్షితుల మేనల్లురు. కాశీపండితులు మానవల్లి గంగాధరశాస్త్రులుగారి శిష్యులు. తర్కవ్యాకరణాలంకారాదిశాస్త్రముల తలపోలములు తిలకించినవారు. గద్వాల, బొబ్బిలి, వెంకటగిరి మొదలగు సంస్థానములలో పండిత సత్కారములందిన మహామనీషి. రాజా సురభి లక్ష్మీరాయ బహద్దరువారి యాజ్ఞానుసారము సురభి మాధవరాయ నృపాల విరచితమగు

చంద్రికా పరిణయ ప్రబంధమునకు ఉత్తమవ్యాఖ్యానమును రచించినవారు. కావ్యాలంకారసంగ్రహ విమర్శనము, ఆంధ్ర దశరూపక విమర్శనము, వీర క్షత్రియ ఖండనము, వెలుగోటివారి వంశచరిత్రము, సురభి వంశచరిత్రము, కంఠీరవ చరిత్రము, రామచంద్ర చరిత్రము, నామిరెడ్డి చరిత్రము, యతినిందా నిరాకరణము, రామానుజ గోపాలవిజయము మొదలగునవి వీరి రచనలు.

## అవధానము శేషశాస్త్రి

వెల్లాల సదాశివశాస్త్రిగారితో కలిసి చంద్రికాపరిణయ వ్యాఖ్యను, సురభి వంశచరిత్రమును, కావ్యాలంకారసంగ్రహ వివరణమును వ్రాసినవారు.

## శ్రీధర కృష్ణశాస్త్రిగారు

మంచాలకట్ట వాస్తవ్యులు. శ్రీరామమందహాసము అను కావ్యము వీరి రచన.

## హాసదుర్గము కృష్ణమాచార్యులు

సురభి వేంకటజగన్నాథరావున కాశ్రితులు. రాజాగారి ప్రేరణమున లక్ష్మీవిలాసచంపువు, మదనగోపాల మాహాత్మ్యము అను కావ్యములను గీర్వాణమున రచించిరి.

## రాజా వేంకటలక్ష్మీరాయబహద్దరు

'నైజాం సర్కారున
రాజిలు జటప్రోలు నాఁగ రాజాస్థానం
బోజన్ లక్ష్మీరాయఁడు
తేజంబున నేలునట్టి ధీరుండయ్యెన్'

—ఆంధ్రాభ్యుదయము, 5 — 66.

ఈ సంస్థానాధిపతులలో శ్రీ రాజా సురభి వేంకటలక్ష్మీరాయబహద్దరు వారు విశేషించి పేర్కొనఁదగినవారు. వీరు కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారిచేత చంద్రికాపరిణయ ప్రబంధమున కనుకృతిగా చంద్రికా పరిణయ నాటకమును, సురభిరాజవంశావతార మను గ్రంథమును రచియింపఁ జేసి తమ విద్యాగౌరవమును, పూర్వరాజన్యులమీఁది భక్తియును బ్రకటించిరి. మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి ఆంధ్ర దశరూపక మను గ్రంథముమీఁద జటప్రోలుసంస్థానాస్థానపండితులు వెల్లాల సదాశివశాస్త్రిగారు ప్రకటించిన విమర్శకగ్రంథము వేంకటలక్ష్మీరాయబహద్దరువారి సత్యనిర్ణయబుద్ధికి, సాహితీ ప్రియత్వమునకు చక్కని నిదర్శనము. వీరు తమ సంస్థానములోని పండితులను

కొందఱను ఎన్నికచేసి దేశదేశములకు పంపి సకలశాస్త్రములు, సంగీతము, శిల్పము, వైద్యము మున్నగువానిలో నైపుణ్యమును సంపాదించునట్లు తోడ్పడిరి. కృతికర్తలును, కృతిభర్తలును అయిన వెంకటగిరిప్రభువులు సర్వజ్ఞ కుమారయాచేంద్రబహద్దరువారి యౌరసపుత్రులగుటవలన వేంకటలక్ష్మరాయ బహద్దరుగారు విద్యాగోష్ఠియందు విశేషాసక్తియు, ఆంధ్రభాష యందత్యంతాను రక్తియు నిసర్గముగాఁ గలవారు. రాజాగారు శాకుంతలాది సంస్కృతనాటకముల ప్రదర్శనములనుసైత మేర్పాటుచేయించెడివారు. అభినవదుష్యంత శ్రీ కందాడై శ్రీనివాసన్ వంటి మహానటులను రాజాగారు సత్కరించిరి.

వీరి యనంతరము వీరి ధర్మపత్ని రాణీ వేంకటరత్నమాంబగారు సంస్థానప్రాభవమున కుచితమగురీతిని ప్రాచీన మర్యాదలను పాటించి కవి పండితపోషణము గావించిరి. గద్వాల, వనపర్తి, ఆత్మకూరులలోవలె నియతముగ ప్రతివర్షమును విద్వత్సమావేశములు నిర్వహింపఁబడకపోయినను జటప్రోలువారి ఆస్థానమంటపమున నిత్యమును పండితగోష్ఠులును, సాహితీ చర్చలును, తఱచుగా కవిపండితసమ్మానాదికములును నిర్వహింపఁబడుచు వచ్చినవి. ప్రాచీనార్వాచీనములగు గీర్వాణాంధ్రకృతులెన్నియో జటప్రోలు సంస్థానాధీశుల సమాదరణమున ప్రచురితములయినవి.

వేంకటలక్ష్మరాయబహద్దరుగారికి సంతతి లేనందున బొబ్బిలిరాజా శ్రీ రావు వేంకటశ్వేతాచలపతి రామకృష్ణ రంగారావుబహద్దరుగారి రెండవ కుమారులను దత్తుగా స్వీకరించిరి.

> 'అందు రెండవపుత్రకు నాత్మజనకు
> తమ్ముఁడగు జటప్రోలు సంస్థానపతికి
> సురభి వేంకటలక్ష్మరాడ్ ధరణివిభున
> కిడియె దత్తుగ శ్రీరామకృష్ణవిభుఁడు'
>
> —తిరుపతివేంకటకవుల బొబ్బిలి పట్టాభిషేకము, 1–91.

ఈయనయే శ్రీ రాజా సురభి వేంకటజగన్నాథరావుబహద్దరు అనుపేర జటప్రోలునేలినవారు. రాజాగారును, వారి యర్ధాంగి రాణి ఇందిరాదేవిగారును సంగీత సాహిత్యములయందు విశేషాసక్తి కలవారు. శ్రీ భాగవతుల నరసింహ శర్మగా రాంధ్రీకరించిన తులసీరామాయణమును శ్రద్ధాసక్తులతోఁ బరిశీలించి జగన్నాథరావుబహద్దరుగారు నీతిజ్ఞానవైరాగ్య సందర్భములందలి కొన్ని పద్యములను ఏర్చికూర్చి తమ యాశ్రితుఁడగు వాజపేయయాజుల రామసుబ్బా రాయకవి సంపాదకత్వమున 'తులసీరామాయణ నీతిరత్నములు' అనుపేర ప్రకటింపఁజేసిరి. వీరికాలమున శ్రీధర కృష్ణశాస్త్రి, సరిపెల్ల విశ్వనాథశాస్త్రి, వెల్లాల శివరామశర్మ, వనం సీతారామశాస్త్రి, పత్రి విశ్వేశ్వరశాస్త్రి, పత్రి సత్యనారాయణశాస్త్రి మొదలగువారు సంస్థానవిద్వాంసులుగా నుండిరి. వీరి

[illegible] నానాటక కవి వ్రాసిన 'వివాహకాలీన పంచరత్నముల'పై [illegible] కృష్ణా, గోలకొండ, సుధర్మ మొదలగు పత్రికలద్వారమున [illegible] సుప్రసిద్ధము. ఏనం సీతారామశాస్త్రి, చెళ్ళపిళ్ళ వెంకట[illegible] శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, గాజులపల్లి హనుమచ్ఛాస్త్రి మొదలగు [illegible] ఈ [illegible] రచ్చకెక్కినవారు.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. [illegible] మాధవరాయలు, చంద్రికాపరిణయము, సవ్యాఖ్యానము, ఆనంద ప్రెస్, [illegible], [illegible].

2. [illegible] వీరేశలింగము, ఆంధ్రకవుల చరిత్రము, భాగము 3.

3. [illegible] సదాశివశాస్త్రి, ఆంధ్రచరిత్ర విమర్శనము (వీరభద్రీయ ఖండనము).

4. [illegible] కేశవపంతుల నరసింహశాస్త్రి, తెలంగాణా సంస్థానములు — సాహిత్య[illegible] [illegible]సర్వస్వము, సంపుటము 3, పుటలు 1175—1179.

5. [illegible] రామలింగస్వామి, శ్రీకృష్ణకవిజీవితము, పు. 67.

6. [illegible]కవుల సంచిక.

7. [illegible] లక్ష్మీరంజనము, ఆంధ్రసాహిత్యచరిత్రసంగ్రహము, పుటలు [illegible].

8. ఆంధ్రవిజ్ఞానము, సంపుటము 6.

9. శ్రీపాద [illegible]మూర్తిశాస్త్రి, చంద్రికాపరిణయనాటకము, 1931.

10. శ్రీపాద [illegible]మూర్తిశాస్త్రి, శ్రీకృష్ణ స్వీయచరిత్రము, 1959.

11. [illegible] సుబ్బారాయకవి, రాజా వేంకటకృష్ణారావుబహద్దరువారి [illegible], [illegible] గ్రంథమాల, కాకరపఱ్ఱు, 1937.

# తెట్టు (వేజెళ్ళవారు)

## ప్రవేశిక

ఇది ప్రాచీనమైన కమ్మరాష్ట్రమందలి ఆంధ్ర క్షత్రియ సంస్థానములలో నొకటి. కొండవీడు మొదలుగా నెల్లూరులోని కందుకూరు తాలూకా గుడ్లూరు దాఁక గల ప్రాంతము ఈ సంస్థానమునందలిది. 'తెట్టు' ఆనాఁటి పాలకుల ముఖ్యపట్టణము. నేఁటి కందుకూరు తాలూకాలో కందుకూరునకు దక్షిణదిశలో ఆమడదూరమునను, గుడ్లూరునకు ఆగ్నేయదిశలో నొక పరువు దూరమునను 'తెట్టు' గ్రామమున్నది. ఈ సంస్థానపాలకులను 'గుడ్లూరు ప్రభువు' లనియు వ్యవహరించెడివారు. ఈ సంస్థానము కుంఫిణీవారికాలమునాఁటికే అంతరించి యుండినది.

## సంస్థాన చరిత్రము

ఒంగోలుసీమను పాలించిన మందపాటివారికి వేజెళ్ళవారు వియ్యంకులు. వేజెళ్ళ పోలమరాజు ఈ సంస్థాన స్థాపకుఁడు. ఇతఁడు పదునైదవ శతాబ్దివాఁడు. ఈ పోలమరాజు కుమారుఁడు పాపరాజు (1440—1490). ఇతనికొడుకు కసవ రాజు (1490—1522). అయ్యపరాజు (1522—1558), సర్వరాజు కసవరాజు కుమారులు. పెద్ద నరసరాజు (1558—1600), చిన్ననరసరాజు అయ్యపరాజు తనయులు. పెద్ద నరసరాజు కొడుకు కుమార కృష్ణమరాజు (1600—1630). కుమార కృష్ణమరాజు తనయుఁడు కుమార నారాయణరాజు (1630—1678). ఇతనికి కృష్ణమరాజు (1678—1693), రాఘవరాజు అను నిరువురు కుమారులు. జ్యేష్ఠుఁడగు కృష్ణమరాజు మనుమడు కుమార కృష్ణమరాజు (1730—1750). ద్వితీయుఁడగు రాఘవరాజునకు అయ్యపరాజు, సర్వరాజు అను నిద్దరు కుమారులు*. అయ్యపరాజు తన తమ్ముఁడగు సర్వరాజు లేక సర్వాజును హైదరాబాదు కొలువులో నుంచి గుడ్లూరుసీమను జాగీరుగాఁ దెచ్చి తాను టంగుటూరునకు దాపున గల సోమరాజుపల్లెలో కోటను గట్టికొని జాగీరు ననుభవించుచుండె నఁట ; సర్వాజు 'తెట్టు'పాలకుఁడుగా నుండెనఁట. సర్వాజు మరణింపఁగా సర్వాజు సంస్థానమునకు పాలకులగుటకు సమీపజ్ఞాతులు లేకపోయిరఁట ; వేజెళ్ళవారి మంత్రులలో నొకరును, తెట్టు సంస్థానాధీశుఁడగు వేజెళ్ళ సర్వాజుగారియొద్ద

* వంశవృక్షము విషయమున గురజాడవారి కవిజీవితములు, కోన వెంకటరాయ శర్మగారి దండనాథులును మతభేదమును గలిగియున్నవి.

మంత్రియునునగు వెన్నెలకంటి వెంగన, సత్తాజు పెదతండ్రియగు కృష్ణమరాజు మనుమలు కుమార కృష్ణమరాజుగారిని (క్రీ. శ. 1730—1750) పాలకునిగాఁ బ్రకటించి ఫౌజుదారునొద్దకుఁ గొనిపోయి రాజ్యమును కృష్ణమరాజునకు స్వాధీన పఱిచెనఁట : ఈ విషయము ఈ క్రింది పద్యమువలన తెలియుచున్నది.

'వేజెళ్ళ సత్తాజు విభవాధిపత్యంబు
పూనిన సర్వజ్ఞ పుణ్యమూర్తి
పొలుపొంద నా కృష్ణభూపాలబాలుని
దొరజేసికొని కార్య మరసి నడపె
శ్రీరంగరాయలచే నొప్పుగొని తెచ్చి
పంచవన్నెల డాలుపరగఁ జేసె
కొండవీటి సరద్దు గుడ్లూరు దనుకను
ఏలించె కృష్ణభూపాలు నెమ్మి
సకల ప్రజ్ఞానుదక్షుఁడై జనులఁ బ్రోచె
రాజసమ్మానములచేతఁ దేజమలరె
బంధుజనముల సకలసంపదలఁ దనిపె
మహితయశుఁడు వెంగనమంత్రి యపుడు*'.

వెంగనమంత్రి తనయు లేవురును వేజెళ్ళవారి మంత్రులఁట : కుమార కృష్ణమరాజు సనంతరము వేజెళ్ళ నారాయణరాజు సంస్థానకర్తయైనట్లు క్రింది పద్యమువలనఁ దెలుచున్నది :

'రామన్న మరియాద రామన్న వేజెళ్ళ
నారాయణేంద్రుండు గారవమునఁ
జనవీయ నాయన సంస్థానకర్తయై
పాలించుఁ బ్రజల సంపదలఁ బొదల
గోలకొండ వజీర్లఁగూడి దుర్గాలపై
ముత్తిక హత్తించి మొత్తిమొత్తి
కడు మన్నెసరదార్ల వడిసెడఁగాఁ గొట్టి
రాజుచే మెప్పులు రమణనొందె
పొదిలెలింగప్పతోఁ గూడి భూములెల్లఁ
గొట్టి విప్రుల కన్నంబు బెట్టి మించె,
గలియుగంబున వెన్నెలకంటి రామ
మంత్రికిని నీడులే రని మహికి నెక్కె'

ఈ పద్యమునందు పేర్కొన్న రామన్నమంత్రి వెన్నెలకంటి వెంగనామాత్యుని యైదుగురు పుత్రులలో రెండవవాఁడు. ఈ పద్యమునం దుదాహరింపఁబడిన

* గురజాడ శ్రీరామమూర్తి, కవిజీవితములు, పు. 687 ; దండనాథులు, పు. 308.

నారాయణేంద్రుఁడు కుమార కృష్ణమరాజునకు పిమ్మట వెట్టును పాలించిన పెద్ద నారాయణరాజుగారు.

వేజెళ్ళ వెంకటనారాయణరాజు ఒంగోలుప్రభువులగు మందపాటివారికి మేనమామ. నారాయణరాజుతనయ అచ్చమాదేవి ఒంగోలుపాలకుఁడగు మందపాటి రామచంద్రరాజుభార్య. పెదనారాయణరాజుగారితో సంస్థానాధిపత్య మంతరించినట్లు తోఁచుచున్నది. చాటువులలోఁ గన్పట్టుచున్న వేజెళ్ళ వేంకట కృష్ణరాజు వేజెళ్ళవారి వంశవృక్షమున నే తరమునకుఁ జెందినవాఁడో నిర్ధా రించుటకు సాధనములేవియును లేవు. సంస్థానము కర్ణాటకపు నవాబునకు దఖలుపడిన దరిమిలా సంస్థానపు వారసులకు ఖరజములేర్పడియుండినవి. వేజెళ్ళవారి సంతతివారు నేఁటికిని గలరని ఆంధ్రవిజ్ఞానము పేర్కొనుచున్నది.

## సాహిత్యపోషణము

వేజెళ్ళవారి సంస్థానమునందు ప్రసిద్ధివహించిన సోదరకవులు మోచెర్ల వెంకన్న, మోచెర్ల దత్తప్పయనువారు. 'కవితపుట్టిల్లు వెన్నెలకంటియిల్లు, పచ్చి చొచ్చెను మోచెర్లవారియిల్లు' అని ఒక యాభాణకము. కవితాకన్య వెన్నెలకంటి వారియింటఁ బుట్టి మోచెర్లవారియిల్లు మెట్టినదని చెప్పుటచే ఈ రెండు విద్వత్కవికుటుంబములకు వియ్యము లుండినవి కాఁబోలు నని కొందఱ యూహము. ఆనాఁటి మోచెర్లకవుల రచనలేవియో తెలియదు. మోచెర్ల కవి సోదరుల చాటువులుమాత్రము నూఱార్లు కన్పట్టుచున్నవి. ఆశుకవిత్వము నందును, సమస్యాపూరణమునందును ఈ కవులు దిట్టలఁట! వెంకటగిరి సర్వజ్ఞ యాచమనాయనిచే పరాభవింపఁబడిన యొక విద్వాంసుఁడు తన్ను శరణువేఁడఁగా దత్తప్పకవి అభయమొసఁగి అతనిని వెంటఁగొని సర్వజ్ఞ యాచమనీని యాస్థానమునకేఁగి ప్రభునివంచించి పశ్చాత్తప్తునిఁజేసి, యా విద్వాంసుని బహూకరింపఁజేసె నను నొక కథ ప్రచారములోనున్నది[1].

ఈ సందర్భమున పేర్కొనఁబడిన ప్రభువు వేంకటగిరి పాలకులు సర్వజ్ఞ కుమార యాచేంద్రులవారు. రాజును దర్శించిన కవి మోచెర్ల వెంకన్న యని అముద్రితగ్రంథచింతామణి అభిప్రాయము. వెంకన్నకవి యాశుకవితా శక్తిని పరీక్షించుటకు శ్రీ యాచేంద్రులవారు షాది క్షాంతవర్ణములుగల కందశతకము నొక్క గడియలో చెప్పుఁడని కోరఁగా వెంకన్నకవి పై నియమములతో దుష్కర ప్రాసబద్ధముగా శతకమును జెప్పి ప్రభువును మెప్పించెనఁట[2].

మోచెర్ల దత్తప్పకవి కృతముగా సంభావింపఁబడుచున్న సమస్యాపూరక

[1] ఆంధ్రవిజ్ఞానము, సంపుటము 5, పు. 2586.

[2] ఉదాహరణ పద్యములు వెంకటగిరిసంస్థానచరిత్రలో నీఁబడినవి.

పద్యములు నూఱుదాఁక సేకరింపఁబడి 'తెలుగు సమస్యలు' అను పేర నొక లఘుకృతి ముద్రితమయియున్నది*. దత్తప్పకవి పూరించె నను నమ్మకముగల సమస్యా పద్యములతోపాటు ఇతరకవుల రచనలుగా ప్రసిద్ధమైన 'అద్దిర శ్రీ ఘూనీశలు', 'కుంజర యూథంబు దోమ కుత్తుక సొచ్చెన్' వంటివి కూడ కొన్ని ఇందు చేర్పఁబడినవి. 'ఏకాదశినాడు సప్త మేదే గడియల్', 'చెలువుగ రామలక్ష్మణులు సీతకుఁ దమ్ములు శంఖుఁడన్నియున్', 'సుగ్రీవుని యెదమకాలు శునకముగఱచెన్', 'భార్య లిద్దరు శ్రీరామచంద్రునకును', 'సంద్రాతికి కాళ్ళు వచ్చి గునగున నడచెన్' మొదలగు సమస్యల పూరణములిందు గలవు.

వేజెళ్ళ వెంకటకృష్ణరాజు మీఁదిదని క్రిందిచాటువు చాటుపద్యమణి మంజరిలో నుదాహరింపఁబడినది.

> 'చెలఁగెన్ వేజెళ సార్వభౌముఁడు జయశ్రీశాలి, సింహాసన
> స్థులలో నేడపరాజు, దిగ్విజయ కీర్తుల్ వానివే, వానితోఁ
> గలహం బెప్పుడు వద్దురా, రిపునృపుల్! గర్వించి మార్కొంటిరా
> పులితో లేళ్ళు, విహంగపుంగవునితోఁ బూరేళ్ళు పోరాడుటల్'
>
> —పు. 97.

* వ్యవహారతరంగిణీ ముద్రాక్షరశాల, చెన్నపురి, 1880.

## ఉపజీవ్య గ్రంథసూచి


1. మోచెర్ల దత్తప్ప, తెలుఁగు సమస్యలు.
2. ఆంధ్రవిజ్ఞానము, సంపుటములు 5, 6.
3. అక్కిరాజు నరసింహారావు, శ్రీరామచంద్రవిజయము.
4. కోన వేంకటరాయశర్మ, దండనాథులు, పుటలు 308—312.
5. గురజాడ శ్రీరామమూర్తి, కవిజీవితములు, పుటలు 687—692.
6. అముద్రిత గ్రంథచింతామణి.

# దోమకొండ

## ప్రవేశిక

నిజాము రాష్ట్రములోని పురాతనసంస్థానములలో పేరుపెంపులు కలది దోమకొండ సంస్థానము. దీనికి బిక్కనవోలనియు నామాంతరముగలదు. ఈ బిక్కనవోలు తూర్పు గోదావరిజిల్లాలోని బిక్కవోలుకంటె భిన్నమైనది. ఇది మెదకు మండలములోనిది. దీని కించుమించు నాలుగయిదువందలేండ్ల ప్రాచీన చరిత్రమున్నది. ఈ సంస్థానమునకు సంబంధించిన ఉమాపత్యభ్యుదయము, పద్మపురాణము, భద్రాయురభ్యుదయము, శివధర్మోత్తరము, షట్చక్రవర్తిచరిత్ర, సూతసంహిత మొదలగు కావ్యములవలన దోమకొండ పరిపాలకుల చరిత్రమును పునర్నిర్మింప వీలగుచున్నది. ఈ సంస్థానాధిపతులు తొలుత గోలకొండ సులతానులకును, ఆపిమ్మట నిజామునకును సామంతులుగా పాలించిరి. ఈ వంశమునకుఁజెందిన రాజన్నచౌదరి (క్రీ. శ. 1760) కాలములో రాజధాని బిక్కనవోలునుండి కామారెడ్డిపేటకు, ఇతనికుమారుడు రాజేశ్వరరావు కాలమున కామారెడ్డిపేటనుండి బిక్కనవోలికి మూఁడుకోసులదూరమునఁగలదోమకొండకు మాఱినది. నాఁటినుండి దీనికి దోమకొండసంస్థానమని పేరు వచ్చినది.

## సంస్థాన చరిత్రము

ఈ సంస్థానాధిపతులు పాకనాటి రెడ్లు. గద్వాల, ఆత్మకూరు పాలకులకు సమీపబంధువులు. 'కామినేఁడు' అను ప్రసిద్ధపురుషుఁడు కూటస్థుఁడగుటచే వీరి యింటిపేరు కామినేనివారు. వీరిది రాచుళ్ళగోత్రము. బిక్కనవోలులో వెలసిన సిద్ధరామేశ్వరుఁడు వీరి కులదైవము. సూతసంహితలో వీరు సూర్యవంశ క్షత్రియులనియు, బ్రహ్మోత్తరఖండ శివధర్మోత్తర భద్రాయురభ్యుదయాదులలో సచ్ఛూద్రులనియు పేర్కొనఁబడుట విచారణీయము.

'పరమపావనమైన తద్బాహుజన్మ
జాతి శాఖోపశాఖల జగతినిండె
నందు శ్రీపాకనాటి రెడ్డన్వయంబు
చాలఁ జెలువొందు విరులలో జాజిభంగి'
'ఆ పాకనాటి కులమున రూపింపఁగ మేలుబంతి రూఢిన్ ధర్మ
వ్యాపార నిర్మలంబై యేపున రాచుళ్ళ గోత్రమెన్నికఁ గాంచెన్'

—సూతసంహిత, అవతారిక.

'.......లక్ష్మీక పదకమలద్వంద్వమునఁ గీర్తి
సహిత శూద్రకులంబు సంభవించె
సంప సముద్రనికర మింపొందుచుండ
నాఁడు నాఁటికి శ్రీ పాకనాటి జనన
మస్తవైశ్వర్యభవ్యమై యవనిఁ బరఁగె
రాజరాజేశ్వర కృపాబ్ధి రామమగుచు' —భద్రాయు. 1—93.

'ఆ పాకనాటి వంశ
దీపకుఁడై కామనేఁడు దృఢతరబల సం
తాపితపరభూపాలకుఁ
డై పాలిచె సమస్తలోకమభినుతిసేయన్' —పైది. 1—94.

'అతఁడు తద్బిక్కవోలుపురాధిరాజ
రాజ్యసామ్రాజ్యలక్ష్మిచేఁ బొలిచియుండెఁ
గుతుబశాహాది యవనరాట్కృతక దత్త
ఘనతరాందోళికాది విఖ్యాతిఁగాంచి' —పైది. 1—95.

దీనిబట్టి పాకనాటిరెడ్డిశాఖలో కామినేనిచౌదరి మూలపురుషుఁడనియు, అతడు గోల్కొండ కుతుబుషాహీల మన్ననలనుగాంచి మెదకుసీమలోని బిక్కనవోలు రాజధానిగా రాజ్యమును పాలించుచు విఖ్యాతిఁగాంచి యుండెననియు తెలియుచున్నది. ఇతనికే కామిరెడ్డియనియు నామాంతరముగలదు.

'సకల కర్ణాటరాజ్యప్రశస్తుఁడగుచు
భాగ్యనగరాధిరాజ్య సంభావ్యలక్ష్మి
నొంచఁ దలపోసి శ్రీబిక్కవోలు పురవ
రమున వసియించె శ్రీ కామిరడ్డినృపతి' —భద్రాయు. 1—96.

ఈ కామినేనిచౌదరి కుమారుఁడు మొదటి కాచారెడ్డి లేక కాచిరెడ్డి. ఈ కాచిరెడ్డి తొలుత కర్ణాటకసీమలోని రాయదుర్గమును పాలించినవాఁడఁట; పిమ్మట సులతానుల ఆహ్వానము మేరకు కృష్ణనుదాఁటి మెదకు దుర్గమునకు వచ్చెనని శివకర్ణోత్తర కథనము. కాచారెడ్డి కుమారుఁడు రెడ్డిభూపతి. కొందఱితనినే భోగిరెడ్డియనిరి. ఇతనిని రెడ్డినృపశేఖరుఁడని, రెడ్డినరపాలుఁడని [illegible]మును, రెడ్డిభూపతియని భద్రాయురభ్యుదయమును పేర్కొనినవి. రెడ్డిభూపతికి వేదాంబికయను భార్యవలన ఇమ్మడికాచారెడ్డి, మల్లారెడ్డి, బొమ్మారెడ్డి యను ముగ్గురుపుత్రులు. జ్యేష్ఠుఁడగు ఇమ్మడికాచారెడ్డి మాచమాంబల పుత్రుఁడు మొదటి ఎల్లారెడ్డి. ఈ ఎల్లారెడ్డికి మల్లమాంబవలనకలిగిన రెండవ పుత్రుఁడు ముమ్మడికాచారెడ్డి. ఈ కాచారెడ్డికి తిప్పమాంబవలన జంగమరెడ్డి, కామిరెడ్డి, ఇమ్మడి ఎల్లారెడ్డి, మల్లారెడ్డి అని నలుగురు పుత్రులు. కామారెడ్డిపేట, ఎల్లారెడ్డిపేట, మల్లారెడ్డిపేటయను తటాక గ్రామములు వీరిపేర వెలసినవే.

హిజరీ 1055 (క్రీ. శ. 1636) లో అబ్దుల్లాహుసేన్ కుతుబ్‌షాహిచే కామారెడ్డి గారికి సంస్థానము సన్నదీఁబడియుండినది.

'భవ్య సులతాన్ మహమ్మదు పాదుషాహ
లబ్ధ భూషణలలితపల్యంకికాంక
పత్ర చామరసామ్రాజ్యభరితవిభవ
రమ్యగుణశాలి శ్రీ కామరడ్డిమహా॥'

—శివధర్మోత్తర కృత్యవతరణిక.

మల్లారెడ్డి దేవబ్రాహ్మణ భక్తితత్పరుఁడు. దేవగిరికొండకుఁద శ్రీరామ శ్రీ రాజరాజేశ్వరుల దేవాలయములు ఈయన నిర్మించినవే. తదుభయదేవాంకితములుగా శివధర్మోత్తరీయ బ్రహ్మోత్తరఖండ సూతసంహితా పద్మపురాణ వాసిష్ఠలైంగ బాలభారత కిరాతార్జునీయ షట్చక్రవర్తిచరిత్రాద్యనేకాంధ్ర ప్రబంధంబు లంకితములుగా నిర్మింపఁబడినవి. నాఁటి గోలకొండ నేలుచున్న కుతుబ్‌షాహి పాదుషావలన పలుబిరుదములను మల్లారెడ్డి సంపాదించెను. మల్లారెడ్డి కుమారుఁడు చినకామిరెడ్డి దేశముఖు. ఈయన కుమారుడు పోతారెడ్డి 'శ్రీ భాగనగర రాజ్యాధితస్థిరతర ప్రభుపర్యవర్ణిత ప్రాభవుండు' (భద్రా. 1–127). ఈయనకు పోతారెడ్డిదేశాయి యను వ్యవహారనామమునుగలదు. పోతారెడ్డిదేశాయి మనుమఁడు పోతారెడ్డి (వైది. 1–151). ఈ పోతారెడ్డికుమారుఁడే ప్రసిద్ధుఁడైన రాజన్నచౌదరి (క్రీ. శ. 1748–1757). ఈయన ఒక రాజర్షివలె సంస్థానమును పాలించెనఁట! రామారెడ్డి రయిచవుతరమువాఁడీ రాజన్నచౌదరి. ఇతని హయామునందే రాజధాని బిక్కనవోలినుండి కామారెడ్డిపేటకు మారినది. కిట్టనివారెవరో నవాబుతో చాడీలు చెప్పఁగా రాజన్నపై నవాబున కీర్ష్య యుదయించి అతనిని పట్టితెండని సేనను పంపెనఁట! రాజన్న భక్తిప్రభావమువలన సేనలు ఓడి వెనుదిరిగిపోఁగా నవాబు మరల నాతనితో సఖ్యముగావించి కొనెనఁట. రాజన్నకు చిరకాలము పుత్రులులేనందువలన వేములవాడ రాజేశ్వరుని సేవించి తత్ప్రసాదమున నొకకుమారుని బడసెను. ఈతఁడే మొదటి రాజేశ్వరరావు అనుపేర దోమకొండ సంస్థానమును బాలించినవాఁడు. ఈ రాజేశ్వరరావు నవాబునకు మిగుల హితుఁడు. చెన్నూరుపాలకుఁడు నవాబునకు సరిగా పన్నులు కట్టనందున హిజరీ 1202 (క్రీ.శ. 1786) లో నవాబుతరపున యుద్ధమొనర్చి రాజేశ్వరుఁడు చెన్నూరుపాలకు నోడించి నవాబునకు విజయము చేకూర్చెను. దీనికి నవాబు సంతోషించి చెన్నూరు మొదలైన సీమలను రాజేశ్వరునకు ఉంబళిగా ప్రసాదించెను. ఇతనితరువాత ఇతనికుమారుఁడు పెద రాజేశ్వరుఁడు పట్టమునకు వచ్చెను. ఈయన చందూలాల్ మిత్రుఁడు. సంతతి లేనందున తన చిన్నతమ్ముఁడగు అన్నారెడ్డిని పాలకునిగాఁజేసెను. అన్నారెడ్డి కుమారుఁడు ఉమాపతి. ఈ ఉమాపతిమనుమఁడు ఉమాపత్యభ్యుదయకావ్యభర్త

యను వెంకట ఉమాపతి. ఇతఁడు సోమేశ్వరుని పుత్రుఁడు. ఉమాపతితమ్ముఁ డగు రాజారామేశ్వరునిమనుమఁడు రాజాసోమేశ్వరరావు, నిజాం నవాబగు మహబూబలీఖానునుండి 'బలవంత' అను బిరుదమును సంపాదించిన మేటి. ఉమాపతిమనుమఁడు రాజా రామచంద్రరావుబహద్దరుగారు. 1927 లో శ్రీ రాజా రామేశ్వరరావుబహద్దరుగారు దోమకొండసంస్థాన పాలకులు. గద్వాలప్రభువుల [illegible] రాజా సోమేశ్వరరావుగారు చివరి పాలకులు.

## సాహిత్యపోషణము

అద్దంకి, కొండవీడు, రాజమహేంద్రవరము రెడ్డిరాజులవలె దోమకొండ సంస్థానాధిపతులు కూడ ఆంధ్రసాహిత్యమునకు శాశ్వతమైన సేవను సల్పిన వారు. మొదటికామారెడ్డి కుమారుఁడయిన రడ్డి నరపాలుఁడు సుధీలోకానురంజకుఁడు.

ఇమ్మడి కామారెడ్డి కుమారుఁడయిన మొదటి ఎల్లారెడ్డి సప్తసంతాన ప్రతిష్ఠాపకుఁడనియు, బాలభారత కిరాతార్జునీయాది సత్కృతి సంతతి [illegible] పంచినవాఁడనియు సూతసంహిత కథనము*. 'అందెనెవ్వఁడు కిరాతార్జునీయము బాలభారతంబనెడి ప్రబంధయుగళి ....అతఁడు....ఎల్లారెడ్డి [illegible]' యని పట్టమెట్ట సోమనాథసోమయాజి రచించిన బ్రహ్మోత్తర ఖండమును, 'ఎల్లారెడ్డియంతె హెచ్చునంగఁ బదార్థసృష్టి పాకరీతి వృత్తులలర బాలభారత ప్రబంధ కిరాతార్జునీయ కృతులు కీర్తినివ్వటిల్ల' యని మల్లారెడ్డికృత మగు శివధర్మోత్తరము నీ యంశమును ధ్రువపఱుచుచున్నవి. ఈ బాలభారత కిరాతార్జునీయములను రచించినవారెవ్వరో తెలియదు. నేఁ డీ కృతులును అలభ్యములు. ఇమ్మడి కామారెడ్డి కుమారుఁడయిన జంగమరెడ్డి 'సత్కవివర్య కోటికిఁ బంగరుకొండ' యని సూతసంహిత సూచించినదే కాని, ఆయన పోషించిన కవులెవ్వరో, వారు రచించిన కావ్యములెవ్వియో స్పష్టపడదు.

## కామినేని మల్లారెడ్డి

జంగమరెడ్డితమ్ముఁడయిన మల్లారెడ్డి కృతికర్తయును, కృతిభర్తయును. 'సత్కవిరాజ, సర్వజ్ఞభోజ' బిరుదవిరాజితుఁడు. మల్లారెడ్డి సాహిత్యమూర్తి కామినేనివంశమున కెత్తిన కీర్తిపతాక. రెడ్లలో నీతఁడు ప్రాచీనకవిచంద్రుఁడు. షట్చక్రవర్తిచరిత్రము, శివధర్మోత్తరము, పద్మపురాణము మున్నగునవి యితని రచనలు. మల్లారెడ్డి ప్రతిభావ్యుత్పత్తులనుగూర్చి—

* చాగంటి శేషయ్య, ఆంధ్రకవితరంగిణి, సంపుటము 11, పు. 25 ; ఆరుద్ర, సమగ్రాంధ్రసాహిత్యం, సంపుటము [illegible], పుటలు 212, 213.

'అతని యనుంగుఁదమ్ముఁడు మహాయశధీనిధి మల్లరెడ్డి సం
స్కృతమున నాంధ్రమందు ననవద్యకవితారచనాసమర్థుఁడ
ప్రతిమ సమస్తశాస్త్రగణపారగుఁడత్యలఘుండు....' —148.

'పఠియించె శ్రద్ధతో బహుశాస్త్రజాలంబు
చిత్తమెంతయు వికసిల్లునటుల
గడియించె మిగుల శ్లాఘాపాత్రమై యొప్ప
నుభయభాషలలోన నురుమనీష
అల్లనేర్చెను కవితల్లజు లరుదంద
మృదుమధుమధురసప్రీతిఁ గవిత
రచియించెఁ బద్మపురాణాదిక ప్రబం
ధములు నిరంకుశధాటి మెఱయ
నహరహము గ్రంథపఠనంబు, నహరహంబు
పండితులగోష్ఠి, దేవవిప్రప్రపూజ
లహరహము సేయు ఘనుఁడు సత్యవ్రతుండు
మల్లవిభుఁడన్న లోకసామాన్యనృపుఁడె' —149.

అని ఉమాపత్యభ్యుదయకావ్యము కీర్తించినది.

'నవరసాలంకార వివిధశబ్ద చాతురీధ్వని గుణపాక శయ్యలలర' వాసి
కెక్కిన షట్చక్రవర్తి చరిత్రము బిక్కనవోలుపట్టణమున వెలసిన సిద్ధరామ
లింగేశ్వరున కంకితము. ఇది యాఱాశ్వాసముల పద్యకావ్యము*. మొదటి
మూఁడాశ్వాసములలోని 288 పద్యములలో హరిశ్చంద్రకథ ఇమిడిపోయినది.
తక్కిన మూఁడాశ్వాసములలో మిగిలిన అయిదుగురు చక్రవర్తులకథలు
వివృతములైనవి. 'ఇది శ్రీమద్బిక్కనవోలు పట్టణప్రసిద్ధ సిద్ధసరస్తటావలంబ
సాంబసిద్ధరామేశ్వర వరప్రసాదసమాసాదిత సంస్కృతాంధ్రభాషాకవితా
రసపోషణవిశేషతాచమత్కార గురుభక్తివిహార రాచమళ్ళగోత్రపవిత్ర కాచ
భూపాలపుత్ర బుధజనవిధేయ మల్లారెడ్డినామధేయప్రణీతంబైన షట్చక్రవర్తి
చరిత్రంబను మహాప్రబంధంబునందు....' ఇది ఆశ్వాసాంతగద్య. మచ్చున
కొకటిరెండు పద్యములు:

'సోరణగండ్ల కన్నములచొప్పుల నొయ్యనమూరి తావి చొ
క్కారసి చల్లి తత్పురిని యామినులన్ సురతాంత తాంత కాం
తారుచిరాంగ ఘర్మకణ నవ్యవిచిత్రమణుల్ హరించుచున్
జోరుల కైవడిన్ మెలఁగుఁ జోద్యముగా మలయానిలౌఘముల్'
—షట్చ. 1–31.

* మదరాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయమున 853 నెంబరుగల తాళపత్ర ప్రతి యొకటి కలదు. అందవతారికాభాగము లేదు.

ఇది పురవర్ణనసందర్భమునందలిది. కథానాయకుని మృగయావినోదమునకుఁ బిరికొల్పు బోయదొరలమూఁక చేసిన గ్రామ్యభాషాసంభాషణమును జూడుఁడు :

'సామిద్దోవము గాదే
గామంబులు సొచ్చి సంపె గంపెఁడులచ్చల్
గామిడి మెకములు మనుజుల
బూములు రచ్చింపవయ్య పున్నెపురాజా' —పైది, 2–57.

ప్రబంధకవులందఱును తమ కథానాయికలను రకరకములుగా నేడ్పింపఁగా ఈయనయు ఆ యేడ్పుపద్యమును కూర్చిన తీరును తిలకింపుఁడు :

'దెబ్బలనొప్పిచేత సుదతీమణి లమ్మనిమోళి దండకున్
గొబ్బున నేఁగి కోవెలలు గ్రోల్చుతెఱంగు చెలంగ నేడ్చి రా
గుబ్బగ నశ్రువర్షములు కొండలపై సెలయేఱులో యనన్
గుబ్బలమీఁదటంబడి యకుంఠితలీలల జాలు వాఱఁగన్' —2–138.

ఏకాక్షరకందము, ద్వ్యక్షరికందము, తలకట్లకందము, గుళ్ళకందము, ఏత్వములకందము, అచలజిహ్వాకందము, నిరోష్ఠ్యకందము మొదలగు చిత్రబంధకవిత్వపు కసరత్తులను ఎన్నింటినో ఈ కవి గమ్మత్తుగా చేసినాఁడు. తుపాకి, మైజారు, దుమాళ్ళు, హజారము మొదలగు అన్యదేశ్యములును, 'చంకదుడ్డును శరణార్థి చక్కనగునె', 'ఆలస్యాదమృతం విషమ్', 'జాతి నైజంబు దప్పునే నీతి నెంచ', 'తనయుఁడె తప్పులుచేసిన జనకునకును ముద్దు గాదె', 'గురోర్వచన మౌషధమ్' మొదలగు నానుడులును, పలుకుబడులును ఈ కావ్యమున విరివిగా నుపయుక్తములైనవి.

ఆస్థానసభాసదుల ప్రోత్సాహమున 'శివసంభాషిత సంస్కృతోజ్వలవచః శ్రీగంధ సందర్భమౌ శివధర్మోత్తర మాంధ్రకావ్యముగ....' అష్టాశ్వాస పరిమితముగ విరచించి మల్లారెడ్డి 'భాషాశేషాహి' యని బిరుదందినవాఁడు. శైవాచార సంప్రదాయములు, ఐహికధర్మసముదాయము నిందు నిరూపితములు.

సంస్కృతాంధ్రభాషాపర కావ్యకల్పనావిచక్షణుండును, కుతుపావనీశ్వరాస్థానమహాకవీంద్రుఁడును, నరసింహపండితవరేణ్యకుమారుఁడును నగు గణనాథకవీశ్వరుని సూచన ననుసరించి మల్లారెడ్డి సంస్కృతపద్మపురాణములో కొంతభాగమును పద్మపురాణ మనుపేర నాంధ్రీకరించినాఁడు. పరమశివుఁడు శంభుభట్టారకుఁ డనుపేర నయోధ్యకు వచ్చి శ్రీరామచంద్రునకు వినిపించిన పురాణకథాసార మిందలి కథాశరీరము. మచ్చున కొక పద్యము :

'ఎంత కృతార్థుఁడీ కపికులేంద్రుఁడు చంద్రకిరీట ! వేదవే
దాంత నితాంతదాంత చటులామరసంతతికైనఁ జెందన
త్యంత మశక్యమైన భవదంఘ్రియుగం బఖిలాంగసీమ వి
శ్రాంతి వహించె నీ ఘనునిసాటి యిఁకెవ్వరజాండమండలిన్'.

## పట్టమెట్ట సోమనాథసోమయాజి

మల్లారెడ్డి పెద్దన్నయగు కామారెడ్డి (1530–1590) యాస్థానమున పట్టమెట్ట సోమనాథసోమయాజి యను పండితకవి యుండెను. 'రాజమహేంద్ర దుర్గస్థలోభయ గౌతమీమధ్య....' సీమయందలి వెలపలపల్లిగ్రామ మీ కవి జన్మభూమి. ఇతఁడు గడియకు నూఱుపద్యములు గంటములేక రచింపఁగల దిట్ట. 'అఖిల దిగ్దేశ రాజాస్థాన విఖ్యాత చాటు గాథాచతురిమంబు' కలవాఁడు. సూతసంహిత యను నేడాశ్వాసముల పద్యగ్రంథమును విశిష్టాంధ్రోక్తి రచించి కామారెడ్డిప్రేరణమున సిద్ధరామేశ్వరునకు, బ్రహ్మోత్తరఖండ మను నైదాశ్వాసముల పద్యకావ్యమును కామారెడ్డితమ్ముఁడైన ఎల్లారెడ్డి ప్రోత్సాహమున రచించి ఎల్లక్ష్మామండలేంద్ర సుమనోరామావేశునకు సిద్ధరామేశునకుఁ గృతియిచ్చెనఁట! సోమనాథ సోమయాజియు, సూతసంహితాకావ్యప్రేరకుఁడగు కామినేని కామారెడ్డియును సతీర్థ్యులు. '....మాకు సతీర్థ్యుఁడ వనురక్తుఁడ వాశ్రితుఁడ....'వని కామారెడ్డి కవిని సంబోధించినాఁడు.

పట్టమెట్ట సోమనాథకవి తన సూతసంహితలో—

'....అత్యాప్తుఁడు సతీర్థ్యుఁడైన కామారెడ్డి
పట్టభద్రుని ధర్మపాటవంబు
తత్సభాసదులైన ధన్యవిద్వాంసుల
సంతత సల్లాపసమ్మతంబు....
కారణంబులుగా నిరాఘాట చాటు
శుద్ధపద్ధతిఁ బెనుఁగున సూతసంహి
తా చతుర్విధఖండ సందర్భమెల్లఁ
గావ్యమొనరింతు లోకవిఖ్యాతముగను' అని కామారెడ్డికిని, తనకును

గల సతీర్థ్యత్వమును నిరూపించినాఁడు. ఈతని యనువాదరీతి మూలానుసారి.

'సర్వజ్ఞమౌళిభూషణమైన శబ్దశా
సను బహుముఖ రసజ్ఞతఁదలంచి
యోగ్యశ్రుతిహిత ప్రయోగుఁడౌ సోమయా
జులరీతి వృత్తిసంశుద్ధినెన్ని
నిర్దోషసుసమాధి నియతోక్తియగు శంభు
దాసుప్రసాద పాత్రతనుతించి
నిస్తులౌజః కాంతినిధులైన సోమభా
స్కరుల శబ్దగుణప్రసక్తిఁబొగడి
రుచిరపద సిద్ధధారానిరూఢ మహిమఁ
దగిన శ్రీనాథునచ్యుతత్వము గ్రహించి

తత్కవిత్వకథాసుధాధానసంత
తావధానైక చిత్తుండునై కణంగి' కైసేసిన ఈతని కవితావిలాసము శ్రీనాథుని విన్యాసమునకనుప్రాసమని ఆంధ్రకవితరంగిణీకారుల కతపత్రము*. స్కాందమునందలి యాఱుసంహితలలో ద్వితీయమగు సూతసంహిత కీకావ్యమాంధ్రీకరణము.

సూతసంహితా రచనానంతరము సంతరింపఁబడిన కృత్యంతరము బ్రహ్మోత్తరఖండము.

'కలరు బిక్కనవోలి శ్రీ కామిరెడ్డి
భూమివిభునాశ్రయించిన బుధులు నిజము
శాలివాహనశకవర్ష సంఖ్య పదియు
నైదు నూర్లైన వర్తమానాబ్దములను'

—బ్రహ్మోత్తరఖండ కృత్యవతారిక.

అనుటనుబట్టి యీ కవి పదునాఱవశతాబ్ది ఉత్తరార్ధమువాఁడని నిర్ధారింపఁబడినది.

## కామినేని ఎల్లారెడ్డి

కామారెడ్డిసోదరుఁడగు ఎల్లారెడ్డి (క్రీ.శ. 1550–1600) పట్టమెట్ట సోమనాథసోమయాజి రచించిన బ్రహ్మోత్తరఖండమునకుఁ గృతిప్రేరకుఁడు; వాసిష్ఠలైంగధర్మ మను కావ్యమునకు కర్త. 'ఎల్లభూకాంతుఁడు వాసిష్ఠలైంగ ధర్మము రామలింగమునకు నంకితం బొనరించె....' నని శివధర్మోత్తరము పేర్కొనుచున్నది. ఎల్లారెడ్డి సంతరించిన కృతులేవియు లభ్యముగాలేదు. ఈయన బహుభాషావేత్తయనియు, బహుపురాణజ్ఞుఁడనియుఁ దెలియుచున్నది.

'ప్రాకృత వైకృత ప్రముఖ సర్గ ప్రస
త్సర్గ పారంపరీసంగతులును
గమలసంభవ మహాకల్పదైనందిన
కల్పమానవకల్ప కార్యగతులు
నాదిమవంశ వంశాంతరావాంతర
వంశ నానావిధవ్యాహృతులును
దేవతిర్యఙ్నరదేవ సేవనవిధా
సాధారణ విశేషచరితములును
కరతలామలకంబు లేఘనున కతఁడు
దిక్కరిగిరీంద్రధృతిశాలి బిక్కవోలి

* ఆంధ్రకవితరంగిణీ, సంపుటము 11, పు. 10.

కామిరెడ్డీంద్రుననుజుఁ డఖండకీర్తి
యెల్లరెడ్డి క్షమాతలాధీశ్వరుండు'.
'పంచమవేదమై బరఁగు భారతసంహిత నాకళించి, శో
ధించి పురాణపంక్తిని శ్రుతిప్రతిపాదిత మేర్పటించి, ని
శ్చంచలబుద్ధి యోగపద సాంఖ్యవిధంబుల కాదితత్త్వముల్
గాంచి ముదంబునం దనరు గాచయ యెల్లయరెడ్డి ధన్యుఁడై'
అని వర్ణింపఁబడినాఁడు.

కామారెడ్డికి లింగాంబవలన జన్మించిన జ్యేష్ఠతనయుఁడు సదాశివరెడ్డి. 'అరబీ పారసి ద్రావిడంబును దెనుంగాద్యంబునున్ మున్నుగా వరభాషాలిపి భేదముల్ తెలిసి సర్వజ్ఞత్వ' మొప్పినవాఁడని బ్రహ్మోత్తరఖండకృత్యవతారిక వలన స్పష్టపడుచున్నది. ఎల్లారెడ్డికి అయిదవతరమువాఁడైన పోతారెడ్డి విద్వత్కవీశ్వరపారిజాత మని భద్రాయురభ్యుదయము పేర్కొనుచున్నది (చూ. 1—151). ఇంతకుతప్ప పోతారెడ్డి సాహితీసేవాసంబంధమైన వివరములు లభ్యముకాలేదు. ఈ పోతారెడ్డి కుమారుఁడైన రాజన్నచౌదరి భద్రాయురభ్యుదయ కృతిప్రేరకుఁడు.

## భద్రాయురభ్యుదయము*

ఇది అయిదుల్లాసముల ప్రబంధము. ఉభయభాషాకవితావిశారద రాపాక లక్ష్మీపతికృతము. కామారెడ్డిపేట సంస్థానాధీశ్వరుఁడగు కామినేని రాజన్న చౌదరిగారి అస్థానకవి యితఁడు. కృతిప్రేరకుఁడు కృతికర్తను సభాస్థలికి రావించి—

'అద్వితీయాపరోక్షానుభూతి ప్రసి
ద్ధాచార్య విజయమాంధ్రాంచితముగ
ఘనజగజ్జన్మాదికారణ శ్రీ మదు
పాఖ్యానము దెనుంగునై తలిర్ప
లలితపదార్థాద్యలంకార సహిత నీ
శా వివాహము సముల్లాసమలరఁ
గృతులు మెచ్చంగ శ్రీకృష్ణవిలాసంబు
జనమనోహరముగా మునురచించి

* దోమకొండసంస్థానాధీశ్వరులు రాజా రాజేశ్వరరావుబహద్దరువారి అనుమతిని ప్రచురితము. గోలకొండ ముద్రాక్షరశాల, 1930. దోమకొండసంస్థానకవి పెద్దమందడి వేంకటకృష్ణకవిగారి పీఠిక కలదు. దీని ప్రథమముద్రణము దోమకొండ రాజా రామ చంద్రరావుబహద్దరుగారిచే కాకినాడ సుజనరంజనీ ముద్రాక్షరశాలలో 1908 లో లదిపూడి ప్రభాకరకవి శీర్షకముతో వెలువరింపఁబడినది.

మించి యున్నట్టి నిన్ను వర్ణించ (దరమె
ప్రబలరాపాకవంశసంభవ నవీన
జవనకవనప్రభవన భాషావిశేష
లక్షణ ప్రతిభాధుర్య లక్ష్మణార్య' —భద్రా. 1—68.

అని కవి ప్రతిభావిభవాదుల నుగ్గడించెన (ట ! లక్ష్మీపతి పరాశరగోత్రజు (డు. రాపాక రంగనార్య పుత్రు (డు*. శ్రీకృష్ణవిలాసము, ఆచార్యవిజయము, శ్రీమదుపాఖ్యానము, సీతావివాహము మొదలగునవి కవి యితరకృతులు. దశార్ణదేశాధినాథు (డగు వజ్రబాహునిభార్యయగు సుమతివలన జన్మించిన భద్రాయువను రాకుమారు (డు నిషధదేశాధీశు (డగు చంద్రాంగదుని తనయయగు కీర్తిమాలిని పరిణయమాడి పడసిన అభ్యుదయాదులీ ప్రబంధమున సంగ్రథితములు. మూలకథ బ్రహ్మోత్తరఖండమునందలిది. వేములవాడలో వెలసిన శ్రీ రాజరాజేశ్వరస్వామి కిది యంకితము. ప్రబంధసాధారణములైన పదికట్టు వర్ణనము లిందు మిక్కుటముగా (గన్పట్టుచున్నవి. మాదిరికి కొన్ని పద్యములు— పురవర్ణన సందర్భము :

వెల (దుక లప్పురోపవని వెన్నెలకుప్పల నొప్పు క్రీడలన్
గలువలతేని రాల యిసుకన్ గ్రహియించి వధూపదిష్ట భూ
తలమున నుంచి తొల్తటిపదంబున (జేరి తిరంగి చూడ (గ
ల్వలచెలి చేతులం గర (గ లజ్జవహింతురు రేల నిచ్చలున్' —1—53.

'సరసాలాప గతాగతాంబుఘటయుక్చంద్రాననా మానసాం
తర సుప్తాంగజబోధకంబులగు యంత్రశ్రేణి భాక్పూరుషా
వరుషోద్గీతములైన గేయములు స్వప్నశ్శాలి గోపీ నిరా
దర ప్రత్యావయవక్రమంబున (దగున్ దద్బాహ్యదేశంబులన్'
—1—56.

లక్ష్మీపతిగారి నాయిక ఇతర ప్రబంధనాయికల ననుకరించి యెట్లేచ్చినదో చూడు (డు :

'లలనారత్నము నిండువెన్నెలకు (దాళన్ లేక పైఠాపటాం
చల మాస్యంబున (జేర్చి యేద్చె సుమనశ్శ్యామాకరాంభోరుహా
కలితగ్రామవిశేషకశ్రుతి కళాకాలక్రియామాన మానవ
ద్విలసత్కన్నడగౌడమేళకలనా వీణానుకారధ్వనిన్' —4—224.

కవిశబ్దాలంకారతత్పరతను సూచించు కొన్ని నిదర్శనములు :

'ఏలర ఇప్పు డింతచలమేలర మారుని కేళిలోన న
న్నేలర ఈ విరాళి (గొన నేలర నాదగు వంతదీర్ప నా

* లింగనార్యతనూభవు (డని శేషాద్రిరమణకవులు, చూ. రాపాక లక్ష్మీపతి, గ్రంథాలయ సర్వస్వము, 1921, సంపుటము 5, పుటలు 19—22.

ఖీల రసాలసాల సురభీకృత భీకృదనూన సూన వా
చాల విశాలమాధుకరశబ్దములన్ విన(జాలనేలరా' —4—231.
'ప్రాసికుల్ కార్ముకాభ్యాసికుల్ ముద్గర
న్యాసికుల్ దగు హళాహళి యొనర్ప' —3—15.
'హాయను మన్మనోరథ సుధార్ణవపూర్ణశశాంక రుచ్య దే
హాయను........' —2—16.

ఆశ్వాసాంతములందు :

'ఇది శ్రీ వేములవాడపట్టణ నివాసేశాన సంప్రాప్త శ
శ్వదయాప్రాభవ కామినేనికుల రాజారెడ్డిదేశాయి స
మ్మద లక్ష్మీపతి పండితోదిత సుధీమందార భద్రాయుర
భ్యుదయాఖ్యాన్విత సత్ప్రబంధము రచింపున్ బంచమోల్లాసమై'

అని ఆముక్తమాల్యదాపద్ధతిలో మత్తేభవిక్రీడితములో కృతికర్తృ కృతిప్రేరక కావ్యనామములు సంగ్రథనము సేయ(బడినవి. ఈ ప్రబంధమునందు అపరంజి, కుతుపశహా, కుందనము, జాళువా, జులుమతీ, తాయతు, తేజి, నేజా, బక్తరు, బారు, శాలు—మొదలగు నన్యదేశ్యములు ప్రయుక్తమయినవి. వినేవా, వెలదులనేచేవు, చంద్రుండనే పండు—మొదలగు వ్యాకరణవిరుద్ధ ప్రయోగములును గ్వాచిత్కముగ( గన్పట్టుచున్నవి.

శివరహస్యఖండ కృతికర్తయగు రాపాక వేంకటదాసకవి లక్ష్మీపతి సోదరు(డు. నిజామురాష్ట్రములోని పరకాల యీతని నివాసము. క్రీ.శ. 1700 ప్రాంతమువా(డు.

భద్రాయురభ్యుదయకావ్యప్రేరకు(డగు రాజన్నచౌదరి మనుమని మనుమ(డు ఉమాపతి. ఈయన కామినేనివంశచరిత్రము అను నామాంతరముగల ఉమాపత్యభ్యుదయ కృతిభర్త. హిజరీ 1323 లో తులాభారము తూ(గి బ్రాహ్మణులకు దానమిచ్చినవా(డిత(డు.

## ఉమాపత్యభ్యుదయము

చారిత్రక కావ్యములలో అధునాతనమగు నీ కృతి ఆదిపూడి ప్రభాకరకవి విరచితము. దోమకొండసంస్థానాధిపతి రాజా ఉమాపతి మహాబలవంత బహద్దరు దేశాయివారి యాజ్ఞానుసారము ప్రకటితము. వీరి పుత్రులు రాజా రామచంద్రరావు బహద్దరుగారి ప్రేరణమున విరచితము. ఇది ఏకాశ్వాస పరిమితము. 286 గద్య పద్యములు గలవు. ఈ కావ్యమునకు పోలవరము జమీందారుగారగు కొచ్చెర్లకోట వేంకటకృష్ణారావుగారు మున్నుడిని, తిరుపతి వేంకటకవులు పీఠికను సంతరించియున్నారు. ఇందు కామినేనివారి వంశ చరిత్రము విపులముగా వర్ణింప(బడినది. ఉమాపతి రెండవకుమారు(డగు

రామచంద్రభూపాలుఁడు 'తెలుఁగున బారసీని గడిదేఱినవాఁడును, హూణ భాషయుం దెలిసినవాఁడు, కైసరుల తీయన కువ్విళులూరువాఁడు....' కవిని పిలిపించి '....పేరుప్రతిష్ఠాదు లయ్యావి లోకంబున నిల్చునే సుకవికావ్యస్థంబులే కానిచోన్'.

'కాన మాతండ్రి కృతినాథుగా నొనర్చి
కావ్యమొక్కటి మా వంశకథను దెలుపు
నదిగ నొడగూర్చి మముఁ జరితార్థులుగను
జేయుఁ....' (ఉమాపత్యభ్యుదయము, 54, 55) దని చెప్పఁగా కవి యీ కృతిని సంతరించినట్లుఁ దెలియుచున్నది. ఉమాపత్యభ్యుదయ కృతికర్త యగు ఆదిపూడి ప్రభాకరకవి రామలక్ష్మ్యంబా బుచ్చివేంకయమంత్రీంద్ర పుత్రులు. తాతముత్తాతల నివాసము ప్రస్తుతము గుంటూరుమండలమునందున్న ఆదిపూడి యను గ్రామము. కవి జన్మభూమి బెంగుళూరు. చాలకాల మీయన గద్వాలసంస్థానాస్థానకవి. ఈయన సోదరులందఱును మహాకవులఁట!

ఉమాపతితండ్రియగు సోమేశ్వరభూపాలుని సోదరులలో నొకరగు రామేశ్వరరాయలు ఆంధ్ర మ్లేచ్ఛభాషలలో దిట్టయఁట! ఈయన పారసీకభాషలో గద్యపద్యకావ్యములనేకము కైసేసినవాఁడఁట!

శేషాద్రిరమణకవులును, దోమకొండసంస్థానాస్థానకవియగు పెద్దమందడి వేంకటకృష్ణకవిగారును కలిసి అనేకాధారముల నూఁతగాఁగొని రెడ్లు క్షత్రియులే యని నిరూపించుచు రచించిన గ్రంథము 'రెడ్డికుల నిర్ణయచంద్రిక'. కావ్యకంఠ గణపతిశాస్త్రిగారిచేఁ బరిశోధితము. వనపర్తిసంస్థాన విద్వాంసులు కంఠీరవాచార్యులుగారును, గద్వాలసంస్థాన విద్వాంసులు పుల్లగుమ్మి వేంకటాచార్యులు గారును సమర్థించిన రచనము. దోమకొండసంస్థానాధీశ్వరులు శ్రీమంతు రాజా రాజేశ్వరరావుబహద్దరుగారి యాదరమునఁ బ్రచురితము*. దోమకొండ పాలకులగు రాజా సోమేశ్వరరావుబహద్దరుగారు సన్నిధానమువారి కావ్యాలంకార సంగ్రహవివరణప్రచురణకు ముఖ్యకారకులు.

* గోలకొండ ముద్రాక్షరశాల, హైదరాబాదు, 1927.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. సురవరము ప్రతాపరెడ్డి, నిజామురాష్ట్రములోని ఆంధ్రసంస్థానములచరిత్ర, శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయ రజతోత్సవసంచిక, 1927, పుటలు 39—49.

2. కందుకూరి బాలసూర్యప్రసాదరావు, ఆంధ్రవిజ్ఞానము, సంపుటము 5, పు. 2401; సంపుటము 7, అనుబంధము, పు. 180.

3. చాగంటి శేషయ్య, ఆంధ్రకవితరంగిణి, సంపుటము 11, పుటలు 1—43.

4. ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆంధ్రసాహిత్యచరిత్రసంగ్రహము, పదియవ ప్రకరణము, కొందరు తెలంగాణపు కవులు, పుటలు 168—196.

5. ఆరుద్ర, సమగ్రాంధ్రసాహిత్యం, సంపుటి 9, కామినేనికవులు — ఆశ్రితులు, పుటలు 211—218.

6. గ్రంథాలయసర్వస్వసంచికలు

7. Triennial Catalogue of Telugu Manuscripts in the Government Oriental Manuscripts Library, Madras, Vol. III, Part III.

8. A Descriptive Catalogue of Telugu Manuscripts in the Government Oriental Manuscripts Library, Madras, Prabandhas, Vol. III, 1934.

# నరసరావుపేట

## ప్రవేశిక

గుంటూరు మండలములోని ప్రాచీనమైన సంస్థానములలో నరసరావుపేట యొకటి. దీనికి బెల్లముకొండ సంస్థానమనియు వ్యవహారనామముండినది. బెల్లముకొండ, వినుకొండ, నరసరావుపేటలు క్రమముగా నీ సంస్థానమునకు రాజధానులుగానుండినవి. బెల్లముకొండకు, 'గుడాద్రి' యనియు, వినుకొండకు 'శ్రుతగిరి' యనియు సంస్కృతీకరణరూపములు సాహిత్యమునఁ గన్పట్టుచున్నవి (రంగారాయ చరిత్రము, 2–263). అట్లూరన్నది నరసరావుపేట పూర్వనామము. ఏడెనిమిదివందల యేండ్ల ప్రాచీనచరిత్రగల యీ అట్లూరు గోలకొండ సులతానుల కాలమునుండియు కటికినేనివారను వెలమవారి మొఖాసా గ్రామముగా నుండినదఁట!

గుంటూరునకు పడమటితట్టున 28 మైళ్ళ దూరమున నరసరావుపేట కలదు. శాశ్వతకర నిర్ణయమునకు పిమ్మట నీ సంస్థానాధీశ్వరులు నెల్లూరుజిల్లా రాపూరుతాలూకాలోని సైదాపురము జమీందారీని, గుంటూరుమండలము రేపల్లె జమీందారీలోని రాచూరుభాగమును, గోదావరీమండలము పెద్దాపురము సంస్థానమునందలి కదలిముఠాను ఖరీదుచేసి సంస్థానమును విస్తరింపఁజేసి యుండిరి. కదలిముఠాను రూ. 37,888 లకు కొనియుండిరి. దీని పేష్కషు రూ. 36,631 లుగా నుండినది. నరసరావుపేట సంస్థానమునందు 420 గ్రామములుండెడివి. జమీందారీరద్దుచట్టమునకుఁ బూర్వమే కొన్ని రాజకీయకారణముల వలన నీ సంస్థానమంతరించియుండినది.

## సంస్థాన చరిత్రము

దిట్టకవి నారాయణకవి రచించిన రంగారాయచరిత్ర కృత్యవతారికలో నరసరావుపేట సంస్థానాధీశ్వరుల వంశావతారము విపులముగా వర్ణింపఁబడి యున్నది (చూ. ప్రథమా. పద్యములు, 16 నుండి 48 వరకు). రమామనోహరుని దివ్యశ్రీ పదాంభోరుహమున జన్మించిన పద్మనాయకకులము వీరిది. వీరు కాకతీయ చక్రవర్తులను గొలిచిన డెబ్బదియేడు గోత్రముల వెలమవారు. ఇందు 'విరియాల' గోత్రము వన్నెవాసిగలది. విరియాల గోత్రజులలో 'మల్రాజు' గృహనామకులు ప్రముఖులు. కాశ్యపగోత్రులగు మల్రాజువారు వీరికంటె భిన్నులు; వారు ఆంధ్రక్షత్రియులు, వీరు వెలమదొరలు.

వెలమవారలగు ఈ మల్రాజువారి పూర్వులు నిజామురాష్ట్రమున 'కొల్లార' సంస్థానాధీశులుగా నుండిరఁట. వీరిలో రాజా తిరుమలరాయణింగారు ఆద్యులు. వీరి కుమారులు వల్లారాయఁడను వాడుకపేరుగల పల్లభరాయఁడు ప్రసిద్ధుఁడు. ఈయన ఢిల్లీపాదుషాను మెప్పించి కొండవీటి సర్కారులో కొంతసీమను సంపాదించి యుండిరిఁట. మూర్తిజాన్నగరము సర్కారునకు వీరు దేశముఖులుగా, మన్నావరులుగాఁగూడ నధికారముగలిగియుండిరిఁట!

పల్లభరాయనింగారికి పెదచ్చన్న, చినచ్చన్న, జగ్గన్న, కొండలరాయఁడు అని నలుగురు కుమారులు. ఈ నలుగురలో కడగొట్టువాఁడైన కొండలరాయ నృపతికి లింగన్న, జగ్గన్న, రామన్న, రామచంద్రుఁడు, రంగప్ప, మల్లన్న — అని ఆఱుగురు పుత్రులు. ఈ ఆఱుగురలో రామన్న కులవిస్తారకుఁడు. 'సకలదిగ్దేశనృపతులుసన్నుతింప బెల్లపుకొండ ధరాధిరాజరాజమార్తాండమూర్తి' రామనృపతి యలరుచుండెడివాఁడఁట (రంగా. 1—29). రామనృపతికి కొండలరాయఁడు, వేంకటాచలపతియని యిరువురు కుమారులు. ఈ కొండల రాయనృపతికి నీలాద్రిరాయఁడను మఱియొక పేరుండినట్లు ఊహింప వీలగుచున్నది. కాంతమాంబ, చినపాపమాంబయని కొండలరాయనృపతికి భార్య లిద్దఱు. కాంతమాంబయందు వెంకటరామన్న, సూరన్న, రామన్నయను ముగ్గురు పుత్రులును, రెండవభార్యయగు చినపాపమాంబయందు వేంకట నరసింహరాయఁడు, వల్లారాయఁడు, రామచంద్రరాయఁడు అను ముగ్గురు పుత్రులును గలిగిరి. వేంకటనరసింహరాయఁడు 'సైపుఖాన వజీర భుజావలేప లోపకృద్ధీరవిజయప్రతాపశాలి' (పైది, 1—44). పై యాఱుగురు కుమారులలో మూఁడవవాఁడగు రామనృపాలుఁడు రంగారాయచరిత్ర కృతిభర్త.

చినపాపమాంబా కొండలరాయల పెద్దకుమారుఁడగు రాజా వేంకట నరసింహరాయణింగారు సంస్థానపాలకులలో చాలప్రసిద్ధులు. ఈయన పదునెనిమిదవ శతాబ్ది మధ్యభాగమునందు వినుకొండ పరగణాకు దేశముఖి మన్నావరుగాఁగూడ నుండినట్లు తెలియుచున్నది. వీరు రాజధానిని 'అట్లూరు' అను గ్రామమునకుమార్చి అచట పెద్దకోటను, మంచిపేటను గట్టించి, తోటలను బాటలనువేయించి అట్లూరు అను పేరుమార్చి 'నరసరావుపేట' అని క్రొత్తగా తమపేర వెలయించిరఁట!

ఈ వేంకటనరసింహరాయణింగారికి పెదవేంకటగుండారాయణింగారు, (1784—1814) చినవేంకటగుండారాయణింగారు అని యిద్దఱు కుమారులు. వీరిద్దఱును జమీని పంపకములు చేసికొని వినుకొండ పరగణానొకరును, బెల్లముకొండ పరగణాను మఱియొకరును పాలించుచువచ్చిరి. కాని పంపకము లయిన కొలఁదికాలమునకే రెండవవారెందువలననో తమవంతు జమీని అయాచితముగ మొదటివారికి వదలిపేసిరఁట! శాశ్వత కర నిర్ణయము నాఁటికి

రెండువందలు నౌకేజమీగా పెదవేంకటగుండారాయణింగారి పేర 'సమోదు' చేయింపఁబడినవి.

పెదవేంకటగుండారాయణింగారు చాల సమర్థులైన పాలకులు. పెద్దాపురము, రేపల్లె, సైదాపురము జమీందారీ భాగములు ఏలమునకురాఁగా, ఖరీదు చేసి తమ జమీని విస్తరింపఁజేసిరి. తమ కొమార్తెయగు లక్ష్మీనరసమ్మను సైదాపురము జమీందారుని సోదరుఁడయిన జూపల్లె మల్లారావుగారికిచ్చి పెండ్లి చేసిరి. 1797 లో ఈ గుండారాయణింగారు అట్లూరికి తూర్పున కోటపేటలను కట్టించి దానిని తమ తండ్రి నరసారాయని పేర 'నరసరావుపేట' యని వ్యవహరించినట్లు కొందఱభిప్రాయపడిరి[1]. నరసరావుపేట నిర్మాతలు ఈ తండ్రి కొడుకులలో నెవరో నిష్కర్షగా చరిత్రకారులు నిర్ధారింపవలసియున్నది. నరసరావుపేటకు పశ్చిమదిశనున్న గ్రామమే ఆనాఁటి అట్లూరు.

గుండారాయణింగారు దానధర్మములకు పెట్టినదిపేరు. పిండారీదండుల దోపిడుల సందర్భమునందు గుండారాయణింగారు ప్రజలకు తమకోటలో రక్షణ నొసఁగి, ఈదండులను పాఱఁదోలిరఁట![2]

గుండారాయణింగారి భార్య రాణీలక్ష్మమ్మగారు వితరణగుణమునందు కీర్తిని వెలయించిన సాధ్వీమణి. 1832–33 లలో గుంటూరుమండలములో గొప్పకఱవురాఁగా, శ్రీ లక్ష్మమ్మగారు వేలకొలఁది పేదలకు నిత్యాన్నదానములు జరిపించి రక్షించిరి. వీరి దత్తపుత్రులు రాజా వేంకటనరసింహరాయణింగారు.

ఈ కఱవుకాటకములవలన సిస్తులు సరిగా చెల్లనందునను, ఆర్తులను, అనాథులను ఆపత్సమయమున ఆదుకొనుటలో ఖర్చులు పెరిగినందునను ఖజానా శూన్యమయినది; సంస్థానము అప్పులపాలయినది. సంస్థానమునుండి కుంపిణీకి చెల్లవలసిన పేష్కషుమొత్తము పేరుకొనిపోయినది. అందువలన సంస్థానము కుంపిణీవశముకాకతప్పలేదు. 1833—46 ల మధ్య సంస్థానము కుంపిణీవారి పాలనమున నుండినది.

ఆ తరువాతిపాలకులు శ్రీ రాజా మల్రాజు కొండలరావుబహద్దరుగారు. రాజా వేంకటనృసింహరావుబహద్దరు జమీందారు సర్దేశముఖిమన్నెవారుగారలు. నృసింహరాయణింగారి సతీమణి రాణి లక్ష్మీవెంకాయమ్మ నూజివీడుసంస్థానాధీశ్వరుల యాఁడుబడుచు; లక్ష్మీచెల్లమాంబా రంగయ్యప్పారాయల తనయ. వేంకటనరసింహరాయణింగారి పుత్రులు రాజా వేంకటరామకృష్ణకొండలరావు బహద్దరుగారు. వీరు ఇటీవల పరమపదించిరి.

[1] గుంటూరుమండలసర్వస్వం, పు. 161; నరసరావుపేట తాలూకా గ్రామచరిత్ర, పుటలు 3, 4.

[2] ఆదవి శంకరరావు, ఆంధ్రదేశము - పిండారీదండులు, భారతి, 1934, డిసెంబరు, పుటలు 835—842.

## సాహిత్యపోషణము

చాలమంది సంస్థానాధీశ్వరులవలెనే నరసరావుపేటపాలకులును యథాశక్తిగా సాహితీసేవఁ గావించినవారు. కవిశిరోభూషణకర్తయగు అహోబలపండితుఁడు నరసరావుపేట సంస్థానమునందలి మైదవోలు[1]లోఁ గాఁపురముండఁగా గుండ్లకమ్మకు పెద్దపెట్టున వఱదలు వచ్చి, కొంపగోడులు కొట్టుకొనిపోయి. పైరుపంటలు పాడయి, ప్రజలందఱును నివాసములేని భిక్షుకులయి, గూడులేని పక్షులయి, బెదరి తలాయొక దిక్కునను చెదరిపోయిరఁట! ఈ గడ్డుగడియలలో అహోబలపండితుఁడు మల్రాజువారి యాస్థానమునకేతెంచి----

'జానకీపతి లేఁత సజ్జలొట్టెల పాలు
కొంపల కప్పెల్ల గొడ్లపాలు
సింహాసనములు దొంగ జాగిలంబుల పాలు
సయనముల్ జాగరణంబు పాలు
కల పుస్తకపుఁ బ్రాఁత కట్టెమోపుల పాలు
సొలుపైన చేతులు ముండ్లపాలు
భూరి సంధ్యావిధుల్ బురదనీళుల పాలు
నాలుక దీనోక్తి నటన పాలు
ఘనతర స్నేహ మతినీచజనము పాలు
చిత్త మేవేళ నతిదీర్ఘచింత పాలు
హరిహరీ! దేహమంతయు నలత పాలు
మైదవోలుననుండుట మాకుఁ జాలు'

అని ప్రభువులకు నివేదించి వారివలన 'ఉమ్మడివరం'మను నగ్రహారమును సంపాదించి యచట స్థిరపడినట్లు తెలియుచున్నది[2]. అహోబలపతియింటిపేరు గాలివారు. ఆఱువేల నియోగిబ్రాహ్మణులు. వీరిది భారద్వాజసగోత్రము. పోలూరి మాచిరాజు అహోబలుని మాతామహుఁడు. మేనమామయగు పోలూరి మాధవసోమయాజి అహోబలునకు విద్యాగురువు. అహోబలపతికృతములగు కవిశిరోభూషణమునందును, కాళిందీకన్యాపరిణయమునందును ఈ మాధవసోమయాజి బహుముఖముల ప్రస్తుతింపఁబడినాఁడు. గాలివారి మైదవోలు కరణికము పోలూరివారిచ్చినది. అహోబలపతి, తాతముత్తాతల కాణాచియగు మైదవోలునందేయుండి పూర్వోక్తకారణమువలన ఉమ్మడివరమునకు కాఁపురమును మార్చినట్లు స్పష్టమగుచున్నది.

మొదటివల్లభరాయల కుమారుఁడగు కొండలరాయనృపతి 'విద్వ

1 నరసరావుపేట కాగ్నేయదిశలో పండ్రెండుమైళ్ళ దూరమున మైదవోలున్నది.
2 వేటూరి ప్రభాకరశాస్త్రి. చాటుపద్యమణిమంజరి, పు. 173.

స్వాహాంగణావిఖ్యాత నిజరూప సంరంభయుత సౌరసౌరభేయి....కవిజనానీక లోక ప్రమోదాపాది (రంగా. 1—24) యఁట! కొండలరాయనృపతియగ్రజుఁడగు జగ్గన్న 'వితరణశ్లాఘా నవీనకర్ణఖ్యాత ఘనకీర్తిశాలి' (పైది, 1—22). కొండలరాయనృపతి కుమారుఁడగు రామన్న 'సుకవి విద్వదాధారుఁడు' (పైది, 1—28). ఈ రామన్నయే దిట్టకవి నారాయణకవి రచించిన రంగారాయ చరిత్రమునకు కృతిభర్త. ఈయన 'సాహితీభోజుఁ'డనియు, 'భూజనస్తుత లీలా విభవభోగ విరాజుఁ' (పైది, 1—23) డనియు, 'అర్థార్థిజనకామితావాప్తి యొన రింప నవనికి వచ్చిన యమరతరువు' (పైది, 1-43) అనియు కీర్తింపఁబడినాఁడు.

రంగారాయచరిత్రము మూఁడాశ్వాసముల చారిత్రకకావ్యము. దీని యసలు పేరు 'రంగారాయ కదనరంగ చరిత్రము'. ఆశ్వాసాంతగద్యములయందిట్లే పేర్కొనఁబడినది. బొబ్బిలికోటను పాలించిన వెలమవీరులు తమపై దండెత్తి వచ్చిన బుస్సీ సేనతో తలపడి వీరస్వర్గమలంకరించిన చారిత్రకసంఘటన యిందలి యితివృత్తము. బొబ్బిలియుద్ధము క్రీ.శ. 1757లో జరిగినది. ఈ కృతి రచన యీ పిమ్మటనే జరిగియుండును. మల్రాజువంశోదయుల శుభ్రకీర్తి ప్రవాహమున రంగారాయచరిత్ర మొక స్వచ్ఛతరంగము.

రంగారాయచరిత్రకర్తయగు నారాయణకవి కాశ్యపగోత్రుఁడు, దిట్టకవి రంగకవిప్రపౌత్రుఁడు, అప్పనామాత్యపౌత్రుఁడు, పాపనామాత్యకవిపుత్రుఁడు. 'మల్రాజువంశ పద్మవనహేళియగు రామనృపాలమౌళి' వలన 'హైమభూషా దుకూలదానాగ్రహార ముఖ్యబహూకృతుల్ గారవమున నందు....' (రంగా. 1—[illegible]) గాంచినవాఁడు. నారాయణకవికుమారుఁడగు రామచంద్రకవి రఘుతిలక వేంకటగోపాలరాయాంకిత శతకకర్త.

రాజా మల్రాజు పెదవేంకటగుండారాయణింగారు సాహిత్యవ్యాసంగము లందును మంచి యభిరుచిగలవారు. వీరి యాస్థానమున తాడికొండ మల్లనారాధ్యులు, పట్టాభిరామకవి, మతుకుమల్లి కనకాద్రిశాస్త్రి మున్నగు కవిపండితు లుండిరి. పట్టాభిరామకవి కవిసర్పగారుడము, కవిమూషికమార్జాలము, [illegible]శతకము, మల్రాజు గుండారాయణోపాఖ్యానము, వజ్రపంజర శతకము, స్యమంతకోపాఖ్యానము—మొదలగు గ్రంథములను రచించెనఁట! ఆంధ్రకవితరంగిణియందు పేర్కొనఁబడిన మరున్నందన వజ్రపంజర శతకముల కంటె పట్టాభిరామకవి కూర్చిన ఆ పేరింటి శతకములు భిన్నములును, అప్రకటితములును అని నిర్ధారింపవలసియుండును.

తాడికొండ మల్లినారాధ్యులు ఆరాధ్యబ్రాహ్మణులు, భారద్వాజసగోత్రులు, మంత్రశాస్త్రవిదులు, సంస్కృతాంధ్రభాషాకోవిదులు. గుండారాయణింగారిని తమ శివశక్తిచే మెప్పించి 'నందివెలుగు' గ్రామమున నొక మాన్యమును బడసిరి. ఆరాధ్యులవా రేకప్రాసముతో 'వీరాధిప గుండభూప విభవదిలీపా!' యను

మకుటముతో నీరాక శతకమును ప్రభువు పేర చెప్పిరంట!

'కోరితి నీదగు దయ సుర
ధారుణిరుహా సురభికర్మ ధారాధరధా
శ్రీరాజ దానధుర్యా
వీరాధిప గుండభూప! విభవదిలీపా!'

'ధీరా యీ మునిపురమునఁ
బారువు నా మాన్యభూమి తూమెఁడు గింజల్
కారుటఁబండవు. దూరము--
వీరాధిప గుండభూప! విభవదిలీపా!'

'కోరితి దీనింగైకొని
మారుగు దక్షిణమునందు మాన్యముఁ దమి నీ
పేరుగ నియ్యఁగ నాకును
వీరాధిప! గుండభూప! విభవదిలీపా!'

ఈ కవి వ్రాసిన యితరకావ్యము లేవియో తెలియదు. ముతుకుమల్లి కనకాద్రి శాస్త్రి గుండారాయణింగారి యాస్థాన విద్వత్కవి. ఈయన షట్శాస్త్రముల యందు ప్రౌఢవ్యుత్పత్తిగల మహామనీషి. తర్కశాస్త్రము వీరి యభిమాన విషయము. కనకాద్రిశాస్త్రి పితామహుఁడగు మాధవమంత్రి 'అభినవభారత' గ్రంథకర్త. సోదరుఁడగు మాధవశాస్త్రి దశావతారస్తవగ్రంథకర్త. జ్యేష్ఠ కుమారుఁడగు నరసింహశాస్త్రి పల్లూరు సంస్థానాధీశ్వరుల యాస్థాన విద్వత్కవి: అజచరిత్ర చెన్నపురీ విలాసాది ప్రబంధకర్త. ద్వితీయ కుమారుఁడగు కృష్ణశాస్త్రి వీరభద్రశతకకర్త. కనకాద్రిశాస్త్రిగారు రచించిన గ్రంథములు లభ్యము కాలేదు.

గుండారాయణింగారి రాజ్యకాలమున వారి యాస్థానవిద్వాంసుఁడగు నొక శివద్విజుఁడు 'రసతంత్ర' మను గ్రంథమును రచించి స్వయముగ నాంధ్రటీకను సహితము రచించి శోధించినట్లు కనఁబడుచున్నదనియు, మైసూరు మహారాజావారి సంస్థానవైద్యులగు సూరిపండితులవారియింట నీ ప్రతి కలదనియు వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారు వ్రాసిరి[1].

అభినవపండితరాయలు మాడభూషి వెంకటాచార్యుల 1872 నాఁటి నూజివీటి శతావధానసభకు విచ్చేసిన సంస్థానాధీశులలో నరసరావుపేట జమీందారు శ్రీ రాజా కొండలరావు బహద్దరుగారు ముఖ్యులు[2]. విఖ్యాత వేద పండితులగు విక్రాలరామచంద్రాచార్యులు (1879--1932) గారు రాజా మల్రాజు

1 ఆయుర్వేద గ్రంథములు, ఆంధ్రభారతి, 1912, నవంబరు, పుటలు 207—215.

2 నిడుదవోలు వేంకటరావు, అభినవపండితరాయలు: అవధానప్రతిభ, భారతి, 1960, ఫిబ్రవరి, పుటలు 40—48.

వేంకటనృసింహారావుగారి యాస్థానమున సమ్మానములందినవారు*.

వేంకటపార్థసారథికవులను జంటకవులు రచించిన 'విచిత్రరాఘవ' మను ఆఱంకముల నాటకము శ్రీ రాజా మల్రాజు వేంకటనృసింహరావు బహద్దరు జమీందారువారికి కృతియీయఁబడినది. రామభద్రదీక్షితుని జానకీపరిణయ నాటకమున కిది యాంధ్రీకరణము. ఆంధ్రీకర్తలు తాము పెద్దలచాటువారల మనియు, మొండిధైర్య మవలంబించి గురుచరణరజఃప్రభావమువలన దీనిని ముగించితిమనియు తమ వినయవివేకములను బ్రకటించిరి. ప్రయోగయోగ్యమైన చక్కని నాటకమిది. పుత్రశోకముచే దుఃఖించుచు మరణించిన తండ్రిని పేర్కొని భరతుఁడు విలపించిన ఘట్టమునందలి యొకపద్యమును చూతుఁడు :

'పుత్రులో పుత్రులో యంచుఁ బొగిలి పొగిలి
కడపటను మమ్ము నల్వురఁ గంటి ! పైన
నేమి ఫల ? మాత్మజుని వనభూమి కంపి
పాడుచేసితి విక్ష్వాకువంశ మీవె' —షష్ఠాంకము.

శ్రీమత్తిరుమల నల్లాన్‌చక్రవర్తి వేంకటరామనృసింహచార్యులవారు రాజాగారి యాస్థానపండితులు; విద్యా పరీక్షకులు.

* విక్రాల శేషాచార్యులు, విక్రాల రామచంద్రాచార్యులప్రతిభ, భారతి, 1961 మే. పుటలు 23—32 ; విక్రాల శేషాచార్యులు, పండితప్రకాండులు విక్రాల రామచంద్రాచార్యులు,ఆంధ్రపత్రిక, ఆదివారము సంచిక, 1967, ఏప్రిల్, 10, పు. 6.

## ఉపజీవ్య గ్రంథసూచి


1. దిట్టకవి నారాయణకవి, రంగారాయచరిత్రము, వావిళ్ళ, చెన్నపురి, 1914.

2. దరువూరి వీరయ్య, గుంటూరుమండలసర్వస్వం, మల్రాజువారి చరిత్ర, పుటలు 133, 134.

3. ఆంధ్రవిజ్ఞానము, సంపుటము 3.

4. తెలుగువిజ్ఞానసర్వస్వము, సంపుటము 3.

5. నిడుదవోలు వేంకటరావు, శతకకవులచరిత్రము, అనుబంధము, పుటలు 778, 779.

6. విష్ణుభొట్ల సూర్యనారాయణ, నరసరావుపేట తాలూకా గ్రామచరిత్ర, 1964.

7. కోలవెన్ను రామకోటీశ్వరరావు, మూర్తిజాన్నగర్ సర్కారు, జయంతిపత్రిక, సంపుటము 1, పుటలు 56—63.

# నూజివీడు

## ప్రవేశిక

కృష్ణామండలములోని ప్రాచీనమయిన సంస్థానములలో నూజివీడు సంస్థాన మొకటి. ఇందలి గ్రామములు 231. వైశాల్యము 569 చ.మై. 1802 నాఁటి రాఁబడి రూ. 4,97,595 లు, పేష్కషు రూ. 3,08,000 లు. ఏకఖండముగా నుండిన ఈ సంస్థానము శోభనాద్రిఅప్పరావుగారి (1830—1868) పిమ్మట తలయెత్తిన అన్నదమ్ముల అంతఃకలహములవలన 1882 లో వెంట్రప్రగడ, వుయ్యూరు, మీర్జాపురము, కపిలేశ్వరపురము, తేలప్రోలు, మేడూరు—అను ఆఱు ఎస్టేటులుగా నవతరించినది. నారయ్యప్పారావుగారి వంతునకు వచ్చిన వెంట్రప్రగడ—అతని ముగ్గురు కుమారులకు పంపకమగుటవలన వెంట్రప్రగడ, ముసునూరు, గన్నవరము అను మూఁడు క్రొత్తఎస్టేటులుగా నేర్పడినది. 1938 లో వుయ్యూరు ఆదాయము రూ. 3,64,319 లు ; పేష్కషు రూ. 24,565 లు, మీర్జాపురము రాఁబడి రూ. 1,76,283 లు ; పేష్కషు రూ. 11,446 లు, కపిలేశ్వరపురము రాఁబడి రూ. 32,502 లు ; పేష్కషు రూ. 5,485 లు.

## సంస్థాన చరిత్రము

కాకతీయచక్రవర్తులనాఁడు పద్మనాయకకులోద్భవులగు వెలమవారు డెబ్బదియేడు గోత్రములవారలుగా వర్గీకరింపఁబడియుండిరఁట ! ఒక్కొక్క గోత్రమున కొక్కొక్క నాయకుఁడుచొప్పున నేర్పడిన యీ డెబ్బదియేడుగురు వెలమవీరులు చక్రవర్తికి అంగరక్షకులుగా నుండెడివారఁట ! వీరికి అర్హారీతిని సత్కారాదికములు జరుగుచుండెడివఁట ! వీరిలో రేచెర్ల, విప్పర్ల, విరియాల గోత్రజులు చాల ప్రధానులు. నూజివీటి కోవవారు విప్పర్లగోత్రజులు. వీ రొకప్పుడు కృష్ణాగోదావరుల మధ్యనున్న ఆంధ్రదేశమునేలినవారు. అనఁగా ప్రాచీనమగు నూజివీటి సంస్థానము కృష్ణాగోదావరుల నడిమినేల యంతటను వ్యాపించి యుండినదని భావింపవచ్చు.

ఈ విప్పర్ల గోత్రమునందు మేకా వారిది మేటికుటుంబము. మేకా బసవన్న ఈ కుటుంబమున నాద్యుఁడని ప్రతీతి. అయినను ఆయననుగుఱించిన చరిత్ర మనకంత స్పష్టముగాఁ దెలియుటలేదు*. బసవన్నయును ఆయన సంతతి

* ఈ బసవన్న కరికాలచోడుని యాస్థానమున సరదారుగా నుండెడివాఁడనియు,

వారును పరంపరగా ధరించుచు వచ్చిన బిరుదావళి తీరులనుబట్టి వీరిచరిత్రను రేఖామాత్రముగ నయినను చిత్రీకరింప వీలగుచున్నది. చోళరాజ్యప్రతిష్ఠాపనా చార్యయను వీరి కులక్రమాగత బిరుదము ననుసరించి రాజ్యభ్రష్టుఁడయిన నెల్లూరు మనుమసిద్ధి తనరాజ్యమును తిరిగి పొందుటలో కాకతీయచక్రవర్తుల సాయము బసవన్నగారి ద్వారమున జరిగియుండవచ్చునని యూహింపననువు పడుచున్నది.

నూజివీటిలో మేకావారి కుటుంబము పదురుకొనువరకు వీరి పూర్వచరిత్ర ఇంచుమించుగా తెలియదు. అందాఁక కాకతీయుల కొలువులో మెలఁగినవారని మాత్రము నిష్కర్షచేయవచ్చు. ఓరుగల్లుపతనముతో వీరు దక్షిణదిశగా తరలి వచ్చియుందురు. బసవన్న కుమారుఁడు తిమ్మన్న; తిమ్మన్న కుమారుఁడు పాపన్న; పాపన్న పుత్రుఁడు కోనప్ప. కోనప్పయే అనేకగ్రామములతో కూడిన పరగణాకు ప్రభువయి నూజివీటికోటను గట్టినవాఁడఁట! కోనప్ప కుమారుఁడు వెంకటాద్రి. వెంకటాద్రి పుత్రుఁడు అప్పన్న. ఇతని కాలము సుమారు క్రీ. శ. 1667 ప్రాంతము.

నూజివీటి పాలకులలో నాఁటికి నేఁటికి అతి విఖ్యాతుఁడీ యప్పన్న. ఇతని కాలమునాఁటికి వెనుకటితరముల నాఁటి ఒకపరగణా పదునెనిమిది పరగణాలయినది. అనేక యుద్ధములలో ధైర్య సాహసములను ప్రదర్శించి గోలకొండ నవాబుల ప్రశంసలనుపొంది, సన్నదులను గౌరవలాంఛనములను అప్పన్న సంపాదించినవాఁడు. తహవర్ వ జలలత్, దస్తుగహ, రాజా బహద్దరు మొదలగు బిరుదు లీయన సమకూర్చినవి. పూర్వ మీ కోవలోని పాలకులెందరున్నను రావు బిరుద నామమును పొంది 'అప్పారావు' గా ప్రసిద్ధుఁడైన పాలకుఁడు అప్పన్నయే. ఈయన కాలమునుండి నూజివీటిపాలకులు అప్పారావు అను నామమును బిరుదనామముగ ధరించుచువచ్చిరి. ఈయనకు విజయ అప్పారావను బిరుదుకూడ కలదఁట!

ఈ యప్పారావుగారి కుమారులు వెంకటాద్రిఅప్పారావుగారు. వెంకటాద్రి అప్పారావుగారికి నరసింహఅప్పారావు, సుబ్బన్న అని యిద్దఱుకుమారులు. ఈ సోదరు లిరువురును భీమార్జునులవంటి వారఁట! వీరు సంస్థానమునకు పదికొన్ని పరగణాలను జేర్చిరఁట! ఈ నరసింహాప్పరాయలు కుమారధూర్జటి కవి కృతమగు ఇందుమతీపరిణయ ప్రబంధమునకు కృతిభర్త. నరసింహాప్పారావుబహద్దరువారు 'తీన్ హజార్ మన్సబ్దా' రను బిరుదమును సంపాదించి యుండిరి. ఈ సోదరులిద్దఱును నిస్సంతుగా మరణించినందున దూరపుబంధు

నూజివీడు సంస్థానములోని భాగమగు గొల్లపల్లి పరగణా నాక్రమించి నూజివీటిలో కోటను గట్టినసియు వరివేలగారి కథనము. ఎక్కడి కరికాలచోడుఁడు! ఎక్కడి బసవన్న! ఒకవిధమైన సాహిత్యములందు కరికాలచోడుఁ డించుమించుగా నైతిహాసికపురుషుఁడు.

పయిన 'అప్పన్న' యను నతనికి సంస్థానము దక్కినది. ఈతని మరణముతో రామచంద్ర లేక నరసింహఅప్పారావు చేతికి సంస్థానము వచ్చినది.

ఈతని కాలములో దక్కనుసుబాదారయిన ఆసఫ్‌జా (1713—1748) యను నతఁడు వచ్చి కృష్ణామండలప్రాంతమును సంపూర్ణముగా కేంద్రము నధికారము క్రిందికి తేవలెనని తీవ్రప్రయత్నములు గావించెను. రామచంద్రుఁడితనినెదిర్చి మూఁడు నెలలపాటు తీవ్రయుద్ధముసాఁగించి చివరకు రుస్తుమ్ అలీఖాన్ అనువాని కత్తికెరయయ్యెను. రుస్తుమ్అలీ పండ్రెండుసంవత్సరము లీ సంస్థానమును తనచేతిలో నుంచికొనెను.

ఆ తరువాత జగన్నాథఅప్పారావు, వెంకటాద్రిఅప్పారావులు క్రమముగ నేలికలయిరి. వెంకటాద్రిఅప్పారావుగారికి నిజామునుండి 'సవైరాజా' బిరుదు వచ్చినది. వెంకటాద్రిఅప్పారావు కాలమునందే ఉత్తరసర్కారులు ఇంగ్లీషు కుంఫిణీవారికి రవులిన కీఁబడినవి. 1772 లో వెంకటాద్రి నిస్సంతుగా మరణించెను. ఈయన సోదరుఁడు నారయ్యాప్పారావు (1772—1782) సంస్థానమును పాలించెను. సాలుసరి పేష్కషు చెల్లించుటలో కొంత ఆలస్యమైనందున నూజివీటి ప్రభువుల ఆశ్రయమునందలి కమదన కుటుంబమువారు మచిలీపట్టణములోని చీఫ్ ఇన్‌కౌన్సిలు వారితో గోరంతలు కొండంతలుచేసి కొండెములుచెప్పి పేష్కషు చెల్లింపకపోవుటను తిరుగుబాటుగా చిత్రించిరి.

కుంఫిణీవారు సేననుబంపి సంస్థానమును స్వాధీనపఱచికొనఁదలఁచిరి. ఇది తెలిసి నరసింహనారయప్పారావుగారు కుంఫిణీ యుద్యోగులయొద్ద పెద్ద మొత్తము నప్పుగాఁదీసికొని పేష్కషును చెల్లించెను. కాని వీరి యప్పులు పూర్తిగా తీరలేదు. అప్పులిచ్చినవారు రాజాగారిని చాల ఒత్తిడిపెట్టిరి. రాజాగారు చెన్నపురిలోని గవర్నరునకును, లండనులోని కోర్టు ఆఫ్ డైరక్టర్స్ వారికిని అప్పీలుచేసిరి. లండనులో ఈ యప్పీలు విషయముగా విచారణ జరుగుచుండఁగా నారయ్యాప్పారావుగారు తిరుగుబాటుకు ప్రయత్నించుచున్నారను పుకారులు పుట్టుటచే కుంఫిణీవారి పటాలములు నూజివీటి కోటమీఁద వచ్చి పడినవి. అప్పారావు చేయునదిలేక నిజామురాష్ట్రమునకు పాఱిపోయి భద్రాచలము అడవులలో దాఁగికొనెను. కొన్నాళ్ళకు పట్టుకొనఁబడి చీఫ్ ఇన్ కౌన్సిల్‌వారి యెదుట హాజరుచేయఁబడెను. అప్పులను చెల్లింతుననియు, తన రాజ్యమును తనకిప్పింపుఁడనియు, తన పూర్వప్రవర్తనమును క్షమింప వలసినదనియు అప్పారావుగారభ్యర్థించిరఁట! కుంఫిణీవారు అప్పారావుగారి అభ్యర్థనమును మన్నించిరి.

కాని అప్పారావుగారు ఆసించినతీరులో అప్పు చెల్లుబడికాలేదు. ప్రభుత్వమువారు మరల సేనలను బంపక తప్పలేదు. ఈసారి కుంఫిణీ సేనలకును అప్పారావు సేనలకును హోరాహోరి యుద్ధము జరిగినది. కాని శత్రుసేనల

ధాటికి తట్టుకొనలేక నారయప్పారావు తప్పించుకొని పోయెను. కోట నేలమట్ట మయినది. నారయప్పారావును పదచ్యుతుని గావించితిమనియు, అతని జ్యేష్ఠ కుమారుఁడయిన రాజా వేంకటనరసింహ అప్పారావుగారిని పాలకునిగాఁ జేసితి మనియు కుంఫిణీవారు ఇస్తిహారుచేసిరి. ఆ తరువాతను నారయ్యప్పారావుగారు ధ్రావలముకొండలలో రహస్యముగా సంచరించుచు, కుంఫిణీ అధికారులను చీకాకుపఱచుచు, ఖజానాలను దోఁచికొనుచు, ఎదిరించినవారిని శిక్షించుచు అలజడికలిగించెనఁట! ఆ పిమ్మట నతఁడు చెన్నపట్టణమునకుఁగొంపోఁబడి యచట మరణించెను.

వెంకటనరసింహ అప్పారావు 1793 దాఁక చీకుచింతలేకుండ పాలించెను. ఆ పిమ్మట పేష్కషు సరిగా చెల్లింపలేదను మిషతో నాయేఁడు కుంఫిణీవారు వెంకటనరసింహాప్పారావును పదచ్యుతునిగావించి పరగణాలను తమ పరము చేసికొని పాలక వంశీయులకు భృతులనేర్పఱచిరి. నారయప్పారావుగారికి మఱియొక భార్యవలన రామచంద్రఅప్పారావు, నరసింహాప్పారావు అను ఇద్దఱుపుత్రులుండిరి. పెద్దకుమారునితో కలిసి ఈ ముగ్గురును అవిభక్తముగా జీవించుచుండిరి. సవతిసోదరులగు వేంకటనరసింహ అప్పారావు, రామచంద్ర అప్పారావు లిద్దఱు మొదట మొదట అన్యోన్యముగ నుండినను క్రమక్రమముగా వారిరువురలో అరలుపొరలేర్పడి ఎవరికివారే సంస్థానాధిపత్యమునకు పెనఁగు లాడఁజొచ్చిరి. రామచంద్ర అప్పారావు సంస్థానమునందు పన్నులు వసూలు చేసికొనుచు అలజడిని రేకెత్తించెను. కుంఫిణీవారీ చిక్కులతో, చీకాకులతో విసిగి జమీని పునరుద్ధరించి దానిని రెండుభాగములుచేసి నిడుదవోలుపరగణాలను వేంకటనరసింహాప్పారావు పేరను, తక్కిన యాఱుపరగణాలను రామచంద్ర అప్పారావు పేరను నమోదుచేయించి ఆ మేరకు సన్నదులిప్పించిరి. ఏలూరు సర్కారులోని 12 పరగణాలలో మూఁడింట రెండువంతులతో నిడుదవోలు ఎస్టేటును, తక్కిన మూఁడవవంతును, కొండపల్లి సర్కారులోని 6 పరగణా లను గల నూజివీడు ఎస్టేటును అవతరించినవి. రామచంద్ర అప్పారావు తమ్ముఁడైన నరసింహ అప్పారావుమాట నెవ్వరును తలపెట్టలేదు. ఆ పిమ్మట జరిగిన వివాదములవలన నీ రెండు ఎస్టేటులనుండి కొన్ని గ్రామములను విడదీసి నరసింహ అప్పారావునకిచ్చిరి. రెండు ఎస్టేట్లకును విడివిడిగా మరల సన్నదులు జారీచేయఁబడినవి.

వేంకటాద్రి నరసింహ అప్పారావు నిడుదవోలు ఎస్టేటును 1827 దాఁక పరిపాలించెను. వీరి ఏకైకపుత్రుఁడు నిస్సంతుఁగా మరణింపఁగా వేంకటాద్రి నరసింహాప్పారావు తన సవతితమ్ముఁడగు నరసింహాప్పారావు రెండవకుమారుని దత్తు తీసికొనెను. ఈ దత్తుఁడగు నారయ్యప్పారావుగారు గూడ నిస్సంతుగా మరణించిరి. నూజివీటిపాలకుఁడైన రామచంద్ర అప్పారావు 1814 లో

మరణించెను. వీరి కుమారుఁడైన శోభనాద్రి అప్పారావు ముక్కుపచ్చలారని పసివాఁడు. ఎస్టేటు కోర్టు ఆఫ్ వార్డ్సువారి వశమయినది. 1830 లో శోభనాద్రి జమీకి వచ్చెను. ఇతని కేడుగురు కొడుకులు; నారయ్య, రంగయ్య, వెంకట జగన్నాథ, వెంకటనరసింహ, వెంకటాద్రి, సింహాద్రి, వెంకటరామయ్య లనువారలు. శోభనాద్రి 1868 లో మరణించెను. పెద్దకొడుకగు నారయ్య జమీకి వచ్చెను. అన్నదమ్ములేడుగురును చక్కని సంస్కృతికలవారు. శోభనాద్రికాలమునందే రాఁబడికంటె ఖర్చు పెరిగినది. పరిస్థితులను అదుపులో పెట్టుటకు శోభనాద్రి ప్రయత్నింపలేదు. పరిస్థితి చేఁజారిపోవుచున్నదని గుర్తించిన నారయ్యకును, తక్కిన అన్నదమ్ములకును కలఁతలు పొడసూపినవి. 1871 లో నాల్గవవాఁడగు వేంకటనరసింహాప్పారావు తనవంతు జమీ నిమిత్తము కోర్టులో వ్యాజ్యము తెచ్చెను. రెండవవాఁడగు రంగయ్యప్పారావు తప్ప తక్కిన సోదరులు నలుగురును వరుసగా దావాలలో దిగిరి. ప్రీవీకౌన్సిలువారు సంస్థాన విభాగమున కనుకూలముగా తీర్పునిచ్చిరి. ఈ తగవొక కొలిక్కి వచ్చి తీర్పు రాకమునుపే నారయ్య 1877 లో మరణించెను. 1871 కి పూర్వమే వేంకట జగన్నాథ అప్పారావు నిస్సంతుగా మరణించుటచే సంస్థానమంతయు ఆఱు వాటాలుగా విభజింపఁబడినది. నారయవంతునకు వెంట్రప్రగడ, రంగయ్య వంతునకు వుయ్యూరు, వెంకటనరసింహునివంతునకు మీర్జాపురమును, వెంకటాద్రివాటాకు కపిలేశ్వరపురమును, సింహాద్రిపాలునకు తేలప్రోలును, వేంకటరామయ్యభాగమునకు మేడూరును వచ్చునట్లుగా 1882 లో పరిష్కారము జరిగినది.

ఇఁక నిడుదవోలువంకఁ జూడుఁడు. నిస్సంతుగామరణించిన నారయ్యప్పారావు తనభార్యయగు పాపమ్మారావు (1888—1899) నకు నచ్చిన చిన్నవానిని దత్తు తీసికోవచ్చునని వీలువ్రాయించియుండెను. కాని నారయ్యమరణముతో వేంకటనరసింహ అప్పారావు మొదలగువారీ ఎస్టేట్లలో తమ వాటాలనిమిత్తము దావాలువేసి 1914 లో డిక్రీ తెచ్చుకొనిరి.

నూజివీడు రామచంద్ర అప్పారావు మనుమఁడైన నారయ్యకు రాజగోపాల అప్పారావు, రామచంద్ర అప్పారావు, వరదరాజ అప్పారావు అని ముప్వురు కొడుకులు. నారయ్యవంతునకు వచ్చిన వెంట్రప్రగడ ఎస్టేటు మరల గన్నవరము, ముసునూరు, వెంట్రప్రగడ అను మఱి మూఁడుభాగములు కావలసివచ్చినది. రాజగోపాల అప్పారావువంతునకు వెంట్రప్రగడ, రామచంద్ర అప్పారావునకు ముసునూరు, వరదరాజ అప్పారావునకు గన్నవరము వచ్చినవి. తన తరువాత తన ఎస్టేటగు వెంట్రప్రగడ రామచంద్ర అప్పారావు రెండవ తనయుఁడైన సింహాద్రి అప్పారావునకు చెందవలెనని నిర్ణయించి రాజగోపాల అప్పారావు మరణించెను. ముసునూరుపాలకుఁడగు రామచంద్ర అప్పారావు

18[illegible] లో జన్మించి 1889 లో జమీకి వచ్చి, 1909 లో మరణించిరి. వీరికి నారయ్య, సింహాద్రి, రాజగోపాల అని ముప్వురు కుమారులు. తండ్రితరువాత నారయ్య జమీకివచ్చి 1918 లో అకాలమరణము చెందెను.

పుయ్యూరుపాలకుఁడైన రంగయ్యప్పారావుగారికి 1906 లో రాజా బిరుదము వచ్చినది. వీరి తనయయగు లక్ష్మీవెంకయ్యమ్మగారిని నరసరావుపేట జమీందారునకిచ్చిరి. రాజాగారి దత్తపుత్రులు వెంకటాద్రి అప్పారావుబహద్దరు గారు. గోపనాద్ర్యప్పారావుగారికి సుబ్బమాంబికయందుదయించిన ఏడుగురు కుమారులలో అయిదవవారు వేంకటాద్ర్యప్పారావుగారు. ఈ వేంకటాద్ర్యప్పారావుగారికి కనకమాంబయందు వెంకటరంగయ్యప్పారావుగారు జన్మించిరి. వీరికి వేంకటాద్ర్యప్పారావు, శ్రీమన్నారాయణ, శ్రీనివాస అని ముగ్గురు కుమారులు. తనయలలో నగ్రజాతయగు అండాళమ్మగారిని పిఠాపురము మహారాజా శ్రీ సూర్యరావుబహద్దరుగారి కిచ్చిరి. రాణీ చిన్నమాంబ యను పేర నీమె ప్రఖ్యాతయయినది. అండాళమ్మగారిసోదరులగు వేంకటాద్ర్యప్పారావుగారినే శ్రీ రాజా రంగయ్యప్పారావుగారు దత్తు తీసికొనిరి. వీరు 1894 లో జన్మించిరి. సంస్కృతాంధ్రాంగ్లములను మంచి అధ్యాపకుల సన్నిధిని అభ్యసించిరి. రాజా వెంకటాద్రి అప్పారావుబహద్దరుగారి కుమారులు రాజా రంగయ్యప్పారావు బహద్దరుగారు. వీరు కొంతకాలము ఆంధ్రప్రదేశ మంత్రివర్గమునందు సాంస్కృతికవ్యవహారశాఖామాత్యులు.

## సాహిత్యపోషణము

విద్యాదరణమునందును, సాహితీపోషణమునందును నూజివీటిపాలకులు తెలుఁగుగడ్డయందలి సంస్థానాధీశ్వరులలో నగ్రశ్రేణికిఁ జెందినవారు. ప్రాచీనమగు నూజివీటిసంస్థానమునుండి అర్వాచీనకాలమున నేర్పడిన వుయ్యూరు, వెంట్రప్రగడ, ముసునూరు, గన్నవరము, మీర్జాపురము, తేలప్రోలు, మేడూరు, చిక్కవోలు, శనివారపుపేట మొదలగు ఎస్టేటుల పాలకులుకూడ విద్వత్సమ్మాన విషయమునందు పూర్వపాలకులకు తీసిపోనివారు. నూజివీటిపాలకులలో కృతికర్తలు, కృతిభర్తలు కలరు. తమ యాస్థానములయందు కవిపండితులనేగాక ఇతర కళలలో ప్రవీణులైనవారిని సయితము ప్రోత్సహించుచు వచ్చిరి. నూజివీటికవిపండితులలో కుమార ధూర్జటి, ఆణివిళ్ళవెంకటశాస్త్రి, ఆణివిళ్ళ నారాయణశాస్త్రి, దిట్టకవి రామయోగి, దిట్టకవి రామచంద్రకవి, మాడభూషి నరసింహాచార్యులు, మాడభూషి వేంకటాచార్యులు మొదలైనవారు పూర్వతరమునకు చెందినవారు. బుక్కపట్టణము రాఘవాచార్యులు, చర్ల భాష్యకారశాస్త్రి, గోపాలకృష్ణాచార్యులు, తిరుపతి వేంకటకవులు, కార్యమపూడి రాజమన్నారుకవి, కాశీకృష్ణాచార్యులు, మల్లాది సూర్యనారాయణశాస్త్రి, చిలకమర్తి లక్ష్మీనరసింహము

మొదలగువారి సంస్థాన సత్కారములను బడసినవారిలో ఆధునికులు.

## కుమార ధూర్జటి

ఈ సంస్థానకవులలో మొదట పరిగణింపఁదగినవాఁడు కుమారధూర్జటి. ఇతఁడు కాళహస్తి మాహాత్మ్యకృతికర్తయగు పెదధూర్జటికి పౌత్రుఁడు; భారద్వాజసగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు, పాకనాటి నియోగి; కాళయామాత్య పుత్రుఁడు. ఇతని యసలునామము వేంకటార్యుఁడు. 'ధూర్జటి' అనునది పౌరుషనామము. కుమారధూర్జటి కృతమగు ఇందుమతీ పరిణయము నూజివీటి ప్రభువు నరసింహఅప్పారావుగారి కంకితము.

'చిత్రముగాఁగఁ జిన్నపుడె చేసితివౌ రసముల్ చెలంగ సా
విత్రి చరిత్రముఁ దొగుల పేరుక నిందుమతీవివాహమున్....' —1–25.

'బాలుఁడవయ్యును విద్యా
శీలుఁడవు గభీరమధురశృంగారకళా
లాలిత చాతుర్య కవి
త్వాలోచననిపుణ! వేంకటామాత్యమణీ' —1–24.

అని కృష్ణరాయ విజయమునందు కృతిప్రేరకుఁడగు ఆరవీటి చిన్నవేంకటరాయలు ప్రస్తావించినట్లుండుటచే నీ యిందుమతీపరిణయమును గృతికర్త చిన్నారిపొన్నారి చిఱుతకూఁకటినాఁడే రచించియున్నట్లూహింపవచ్చు.

ఇందుమతీపరిణయము ఆఱాశ్వాసముల శృంగారప్రబంధము. కృతిభర్తయగు మేకా నరసింహఅప్పారావుగారు విజయాప్పరాయల పౌత్రులు, వేంకటాద్ర్యప్పరాయల పుత్రులు. వీరి కావ్యప్రియత్వమునుగూర్చి పారశీకధరాధీశ చరిత్రమునందిట్లు వర్ణింపఁబడినది:

'ఇందుమతీ పరిణయము
సుందరకావ్యములు పెక్కు సుకవులు గొనిరా
నందెఁ గృతినాయకత్వ ము
మందానందమున వారి మన్నించి తగన్'

కృతిభర్త కవిని తన హజారమునకుఁ బిలిపించి చతుర్విధకవితారచనమృదువచన భారతీశ్వరులగు కవీశ్వరులు పరివేష్టించియుండఁగా దాక్షిణాత్యకవుల కవితాప్రాశస్త్యము నిట్లు భాషించియున్నాడు:

'దాక్షిణాత్యకవులు, ద్రాక్షేక్షుమధురస
మాధురీధురీణ మహితదివ్య
భవ్యకావ్యనవ్యపటువాక్చమత్కార
పటిమఁ దనరినట్టి ప్రౌఢులంద్రు' —1–32.

'ప్రతిపద్య చమత్కృతిలో నతిహృద్యంబిది యటంచు నఖిలకవీంద్రుల్

మతిఁజోద్యలీల వినఁగా.........' కృతిని వినిర్మింపు మని కృతిపతి కోరినాఁడు.

ఇందు ప్రబంధవర్ణనము లన్నియు తు-చ తప్పకుండ చేయఁబడినవి. ఇది యించుమించుగా నొక 'పిల్ల వసుచరిత్రము'. చిత్రబంధకవిత్వముల కసరత్తుల యెత్తుగడలన్నియును గలవు. మాదిరి కొక పద్యము :

'గుంపులుగూడి ముద్దువగ కొమ్మలు కమ్మలడాలు చెక్కులన్
సొంపెసలారఁ గై శికరుచుల్ జలకేళి మదాళి పాళిపైఁ
బంపులుగాఁగ గుబ్బల సుపాణిరుచుల్ జలబిందురాజిలో
తుంపెసలార సొందొరులు దోయము చల్లఁదొడంగి రయ్యెడన్'
—3–57.

ఈ గ్రంథమును కృతిపతివంశీయులగు నారయ్యప్పారాయ సింహాద్రి అప్పరాయ సోదరులచే ప్రచురితము. తిరుపతివేంకటకవి పరిష్కృతము. తిరుపతివేంకటకవుల ప్రశస్తమయిన యుపోద్ఘాత మిందుకలదు.

## ఆణివిళ్ళ వేంకటశాస్త్రి

కాకరపర్తి అగ్రహార వాస్తవ్యుఁడును, యజ్ఞనారాయణదీక్షితుల తనయుఁడును నగు ఆణివెళ్ళ వేంకటశాస్త్రి రచించిన 'అప్పారాయ యశశ్చంద్రోదయ' మను అలంకార శాస్త్రము ఇందుమతీపరిణయ కృతిభర్తయగు శ్రీ నారసింహాప్పారాయ ప్రభువర్యుల కంకితము. ఇది నారసింహాప్పరాయ యశోవర్ణనాత్మకము. గుణ దోష శబ్దాలంకార అర్థాలంకార ఉత్తమకావ్య శ్రవ్యప్రబంధ దృశ్యకావ్యలక్షణ వ్యత్యాది నిరూపణములను పదునాఱు నిరూపణములుగల షోడశ కళాసమేత మీగ్రంథము. గ్రంథకర్తృవంశీయుఁడగు సీతారామశాస్త్రిచే యథామాతృకముగా పరిష్కృతము, కృతిభర్తృవంశీయులగు నారయ్యప్పారాయ సింహాద్రిఅప్పారాయ సోదరులచే ముద్రాపితము.

ఈ యలంకారగ్రంథకర్త ఆణివెళ్ళ యజ్ఞనారాయణ భట్టారకపుత్రులు, రామలింగసూర్యనుజులు. ఆణివెళ్ళ వేంకటశాస్త్రి కూచిమంచి జగ్గకవి కృత మగు చంద్రరేఖావిలాపమున చంద్రరేఖకు తండ్రియగు వేంకటశాస్త్రి :

'అప్పారావుకుఁ గావ్యము
చెప్ప నతండణఁగ నందుఁజేరెను, వినయం
బొప్పఁగ వేంకటశాస్త్రులు
గుప్పున నతఁ డాణివెళ్ళ కులుఁడెన్నంగన్'
—1–48.

ఈ వేంకటశాస్త్రులు చంద్రరేఖావిలాప ప్రబంధకథానాయకుఁడగు నీలాద్రి రాయణింగారికి ఒక యలంకారగ్రంథము సంస్కృతభాషామయమగు దానిని అంకితమొసఁగినట్లు–

'వేంకటశాస్త్రులు మాకు న
లంకార గ్రంథమొకటి లలి సురభాషన్
బంకించె నాంధ్రకావ్యం
బంకితమొనరింపు మీవు నట్లనె మాకున్' —1—18.

చంద్రరేఖావిలాపకృత్యవతరణిక మూలమున స్పష్టమగుచున్నది.

అప్పారాయయశశ్చంద్రోదయ కృతిభర్తయగు మేకా వేంకటనృసింహాప్పారావుగారు 1745 లో కవికి పల్లూరుమల్లి అగ్రహారమును ప్రసాదించిరి. అలంకారసుధాసింధు, మహేశ్వర మాహాత్మ్య కావ్యము, రుక్మిణీపరిణయము, భాస్కరప్రశస్తి మున్నగునవి వేంకటశాస్త్రి యితరకృతులు.

వేంకటశాస్త్రి కుమారుఁడగు నారాయణశాస్త్రి సాహిత్యకల్పద్రుమకర్త. ఇది జగన్నాథఅప్పారావుగారి కంకితము.

## దిట్టకవి రామయోగి

నూజివీటిప్రభువు నారయ్యప్పారావుగారి యాస్థానకవి దిట్టకవి రామయోగి. రంగారాయచరిత్ర కృతికర్తయగు నారాయణకవికితఁడు వరుసకు మనుమఁడు. యాదవరాయకవిపౌత్రుఁడు, సుందరరామసూరి పుత్రుఁడు, వ్యాకరణశాస్త్ర పారంగతుఁడు, సంస్కృతాంధ్రములయందు పండితుఁడు, గొట్టుముక్కలగ్రామ వాస్తవ్యుఁడు. ఇతఁడు ప్రభువువెంట కాంచీనగరమునకరిగి యచటనున్న మహా పండితులతో వ్యాకరణశాస్త్రచర్చలు బహుదినములు సాఁగించి తుదకు వారి నోడించి సమ్మానములందిన పండితుఁడఁట ! సంస్కృతమున ననేకగ్రంథములకు వ్యాఖ్యానములు, మతవిషయిక ఖండనగ్రంథములు ఈయన వ్రాసెనఁట ! ఆ గ్రంథములేవియును కానరావు. నారయ్యభూపాలునిమీఁద ఈయన రచించిన సంస్కృతచాటువులు కొన్ని లభ్యమగుచున్నవి*. రామయోగికవి చిరకాలము నూజివీటి ఆస్థానమునఁ బౌరాణికులుగా నున్నటులఁ గవివంశీయులు చెప్పుచున్నారని శేషాద్రిరమణకవుల వివరణము. ఈయన రచించిన రుక్మిణీపతి శతకము మాత్రము ముద్రితమై లభ్యమగుచున్నది. అందలి యొకపద్యము :

'యోగములెన్మిదింట నవయోగము జెందఁగనీక చక్రసం
యోగఫణీంద్రమస్తకము నూర్ధ్వముజేసి ఫణాసుదీప్తిచే
నూఁగఁగనీని దేహములనొప్పు మునీంద్రుల చిత్తవీథులన్
రాగిలు పాదపద్మము శిరంబునఁ జేర్పుము రుక్మిణీపతీ' —100.

* విరాజతే లోకవిరాజిరాజతా విభాకరేసంస్థితి మేతిహంసతా
సరాజహంస స్ప్రమదీపిసర్వదా సదాఖ్యయా నారయభూపవర్యః'
—రుక్మిణీపతి శతక పీఠికలో శేషాద్రిరమణకవుల యుదాహరణము.

## దిట్టకవి రామచంద్రకవి

ఈ రామయోగికవికి బంధువును, రంగారాయచరిత్ర కృతికర్తకు తనయుఁడును నగు దిట్టకవి రామచంద్రకవి (సుమారు 1760—1800) పేరు మాచవీటిసంస్థానమునందలి రికార్డులమూలమునఁ దెలియవచ్చుచున్నది. ఈతఁడు రాజానుగ్రహసమర్థుఁడఁట:

'దిట్టకవి రామచంద్రుఁడు
పెట్టిన రాయైనఁ బగులు, దీవించిన నా
బెట్టైనఁ జిగురువెట్టును
గట్టిగఁ బొల్లింటి భీమకవి కాఁబోలున్'

అను చాటుపద్యమొకటి ప్రచారములోనున్నది. '....మద్దాలి యుద్దండరాయ జయశ్రీ సువిధేయ భక్తజనగేయానిత్యభాగ్యోదయా' అను మకుటముగల యుద్దండరాయశతకమును, 'గొట్టుముక్కల పురౌకా రాజగోపాలకా' అను మకుటముగల గొట్టుముక్కల రాజగోపాలశతకమును, 'మహిషాసురమర్దని ఖండ్యాపర్దిని' అను మకుటముగల మహిషాసురమర్దని శతకమును, 'రఘుతిలక నిజలతటనటదలకా' అను మకుటముగల రఘుతిలకశతకమును, హేలాపతీ దండకమును, వాసిరెడ్డివంశచరిత్రమును (ఒక ప్రబంధమునఁ గృత్యాదిభాగము) మొదలగున వీతని కృతులు. కృష్ణామండలము నందిగామతాలూకా గొట్టుముక్కల యీతని నివాసము. కొంతకాలము వుయ్యూరుతాలూకాలోని పెదమద్దాలి గ్రామమునఁగూడ నివసించెనఁట! రామకథాసారము, శకుంతలాపరిణయము, సేతుమాహాత్మ్యము మొదలగు కృతులను రచించిన దిట్టకవి పాపరాజకవి యీతని పితామహుఁడఁట!

రామచంద్రకవి రచనములనుండి మాదిరికి కొన్నిపద్యములు:

'గజమేదేశికునొద్ద శిక్షఁగనె సాకల్యంబుగాఁ గుబ్జ యే
ద్విజు నాచార్యునిఁగాఁగఁ జేకొనె భవద్దివ్యామృతప్రాయ నా
మజపప్రాప్తికి సాత్వికంబె గురువౌ; మద్దాలి యుద్దండరా
య! జయశ్రీసువిధేయ! భక్తజనగేయా! నిత్యభాగ్యోదయా'

—ఉద్దండరాయశతకము, 23.

'యమరాజన్మూఁడు వాసవాత్మజుఁడు కోర్కుల్ మీఱఁగా నిన్ను సం
గరసాహాయ్యముఁ వేఁడ రాజునకు వేడ్కన్ సేనలం బంపి నీ
వరయన్ సాక్షివైతి వర్జునున కత్యంతాప్తిచేఁ గోటి భా
స్కరతేజస్వీక! గొట్టుముక్కలపురౌకా! రాజగోపాలకా'

—గొట్టుముక్కల రాజగోపాలశతకము, 85.

'లాలితరత్నవీణ నుపలాలనఁజేయుచు మందహాసయు
క్త్యాలపనైకగీతముల నర్మిలిఁ బాడుచు శంభుసన్నిధిన్
జాలవిలాసమొప్ప సురసంజలరంజిల నాట్యకేళిచే
హేళి యొనర్చు తల్లి మహిషాసురమర్దని పుణ్యవర్ధనీ'
---మహిషాసురమర్దని శతకము, 28.

'ప్రాచేతస కవి కవితా
వ్యాచిక్రింసాభిరామ హర్షితహృదయా
యాచకకాంక్షాఫలసం
ధాచణ రఘుతిలక నిటలతటనటదలకా' —రఘుతిలకశతకము, 98.

## మాడభూషి నరసింహాచార్యులు

పల్లవీపల్లవోల్లాస ప్రబంధకర్త మాడభూషి నరసింహాచార్యులు నూజివీటి సంస్థానాధిపతుల ఆస్థానకవి. 'సకలాగమపురాణశాస్త్రజ్ఞు లొకచెంతఁ గర్కశోక్తులఁ బ్రసంగములు సేయ, సంగీత సాహిత్యసారజ్ఞు లొకచెంత శృంగార కావ్యముల్ చెలఁగి చదువ....' (1–18) నిండుకొలువునున్న నూజివీటి పాలకుఁడు శోభనాద్ర్యప్పరావుగారు ఆకిరిపల్లెలో వేంచేసిన శోభనాద్రి నృకేసరి కల్పితంబుగా నొక నవ్యకావ్యము రసమంజులముగా విరచింపుమని కవిని కోరఁగా, మదనగోపాలచరిత్ర చిత్రితముగ నీ శృంగారకావ్యము మూఁడాశ్వాసముల గ్రంథముగా నిబంధింపఁబడినది. మాసలా కొక పద్యము :

'పున్నమనాఁటి చందురునిబోలెడి నీదు మొగంబునందు లే
వెన్నెలవంటి నవ్వు కడువేడుక మీఱఁగఁ గానరాదయో
కన్నియ నీదు చెక్కుల వికాసము వీడెను వెంటవెంటనే
కన్నుల నీరునిండి నునుకాటుక జాఱె నిదేమె కోమలీ!' —2–76.

నరసింహాచార్యులు శ్రీవైష్ణవబ్రాహ్మణులు, నైధ్రువకాశ్యపసగోత్రులు, ఆపస్తంబసూత్రులు ; తండ్రి వేదాంతాచార్యులు.

## గాంగేయేశ్వర సూరి

శోభనాద్ర్యప్పరావు (1830–1868) గారి కాలమునాఁటి నూజివీటినివాసి చెఱకూరి గాంగేయేశ్వరసూరి 'సాత్రాజితీపరిణయ'మను నాలుగు స్తబకముల చంపూప్రబంధమును సంస్కృతభాషలో సంతరించినవాఁడు. కృష్ణాతీరభూముల లోని చెఱకూరికుటుంబము సుప్రసిద్ధ పండితవంశముగా పేరుపొందినది. షడ్భాషాచంద్రికాకర్తయగు చెఱకూరి లక్ష్మీధరసూరి గాంగేయేశ్వరసూరి పూర్వులలో నొకఁడు. ప్రాకృతభాషావ్యాకరణమాలికలో షడ్భాషాచంద్రిక కొలికిపూస.

## మాడభూషి వేంకటాచార్యకవి

వల్లీపల్లవోల్లాసకర్తయగు నృసింహాచార్యులపుత్రులీ వేంకటాచార్యులు (1835—1895). అభినవపండితరాయబిరుదవిభూషితులు. అష్టభాషలలో ప్రావీణ్యముకలవారు. పిఠాపురము, విజయనగరము మొదలగు సంస్థానములను కూడ దర్శించి విద్యాభోజులగు నా మహారాజుల యాస్థానములలో తమ యద్వితీయమగు నవధాననైపుణ్యమును బ్రదర్శించి సత్కారములందిన విద్వత్కవి. 1872 లో వేంకటాచార్యులవారు నిర్వహించిన సూజివీటి శతావధానము సాహిత్యచరిత్రలో ప్రసిద్ధము. నారయ్య అప్పారాయబహద్దరానాఁటి సభి కధ్యక్షులు. నరసరావుపేట, పిఠాపురము జమీందారులతోపాటు నారయప్పారావు గారి సోదరులు రంగయ్యప్పారాయాదులు, ఆస్థాన విద్వత్కవులు సభాసదులు. అవధానానంతరము వేంకటాచార్యకవికి స్వర్ణకవచము, జోడుశాలువలు, వేయి నూటపదాఱులు బహూకరింపఁబడినవి. ఆ సభయందే పిఠాపురము మహారాజా శ్రీ రావు వేంకటమహీపతి గంగాధర రామారావుబహద్దరుగారు కవికి అభినవ పండితరాయ లను బిరుదమునిచ్చి సత్కరించిరి*. భరతాభ్యుదయము, పుష్పబాణ విలాసము, రామావధూటీతారావళి మున్నగునవి వేంకటాచార్యుల కృతులు. అనుభవరసికులగు వేంకటాచార్యులవారు తమ వేశ్యయగు నెల్లూరి రామావధూటిపేర వ్రాసిన శృంగారక్రీడాప్రదర్శకములగు నిరువదియేడు సీస పద్యముల తోరణ మీ రామావధూటీతారావళి. ఈ తారావళి విలువకట్టలేని సాహితీభూషణమని గ్రంథసంపాదకులు ప్రస్తుతించిరి. ఈయన శోభనాద్ర్యప్పారావు, నారయ్యప్పారావుగారల యాస్థానకవి.

## బుక్కపట్టణము రాఘవాచార్యులు

బుక్కపట్టణము శ్రీనివాసతాతాచార్య తనయుఁడగు రాఘవాచార్యులు (1880 ప్రాంతము) నూజివీటిలో సంస్కృతాంధ్రాంగ్ల భాషలలో అవధానము లొనర్చి బహూకృతుల నందినవాఁడు. కువలయాశ్వవిజయమను నవ్యప్రబంధ మీకవికృతము. కార్మైకిల్ దొరవారి యుత్తరువు మేరకు రాఘవాచార్యులు విర్మించిన ఆంధ్రదేశ చరిత్రము ముద్రితము కావలసిన రచనము. ఈ కవి పూర్వులలో నొకఁడగు రాఘవాచార్యుఁడు షట్ఛాస్త్ర విద్ధీ విఖ్యాతుఁడయి నూజివీటి సంస్థాన పండితుఁడుగా నుండెనఁట !

## రాజా రంగయ్యప్పారాయబహద్దరు

రాజా శ్రీ రంగయ్యప్పారాయబహద్దరుగారు రచింపఁజేసిన 'పారసీక

* నిడుదవోలు వేంకటరావు, అభినవ పండితరాయలు : అవధానప్రతిభ. భారతి. 1930, ఫిబ్రవరి, పుటలు 40—48.

ధరాధీశచరిత్రము' చారిత్రకకావ్యములలోఁ బ్రశస్తమయినది. గ్రంథకర్త లక్ష్మణాచార్య సుకవి. దాని యందచ్చుపడిన యొక్క యాశ్వాసము మాత్రము లభ్యమగుచున్నది. అప్పారాయనృపాలుని ఆస్థానవిద్వాంసులగు గోపాల కృష్ణాచార్యులు శోభనాద్రీశవైభవ మను సంస్కృతచంపూప్రబంధరచయితలు. ఇది రామాయణకథాత్మకమగు బృహత్కావ్యము. రాజా రంగయ్యప్పారాయ బహద్దరువారు అముద్రితగ్రంథచింతామణికి నిత్యపోషకులుగా నుండిరి. వీరి ప్రాచ్యవిద్యాభిమానమధికము. కవిపండితపోషణము వీరి నిత్యకృత్యములలో నొకటి. వీరు సంస్కృతాంధ్రపారసీకములలో పటిష్ఠమైన పాండిత్యముగలవారు. పారసీభాషలోని 'షహనామా'ను తెలుఁగుచేఁతను సంతరించిరి. వీరి యాస్థాన విద్వాంసులు నల్లాన్‌చక్రవర్తి సంపత్కుమారలక్ష్మీనృసింహాచార్యులచే పూరింపఁ బడిన సమస్యాపద్యములు పెక్కులు అముద్రితగ్రంథచింతామణిలో ప్రచురిత మయినవి.

చర్ల భాష్యకారశాస్త్రిరచితమగు 'మేకాధీశశబ్దార్థశతకోటి' అను సంస్కృతకృతి కృతికర్త సర్వంకషపాండితీప్రకర్షకమగునది. ఈయన కాకరపఱ్ఱుగ్రామవాస్తవ్యులగు చర్ల కామమాంబా వేంకటశాస్త్రుల పుత్రుఁడు. బెజవాడలోని శ్రీ రంగయ్యప్పారాయ కళాశాల ఈ ప్రభువుల స్మృత్యర్థము రూపెత్తినది.

## రాజా వెంకటాద్రి అప్పారావుబహద్దరు

రాజా శ్రీ రంగయ్యప్పారాయబహద్దరుగారి దత్తపుత్రులగు వెంకటాద్రి అప్పారావుబహద్దరుగారు కావ్యకళాప్రపూర్ణులు. కళాపోషణము, కావ్య నిషేవణము—ఈ రెండును వారి జీవితమునందలి పరమార్థములు. 1927 లో కాకినాడలోజరిగిన యాంధ్రసాహిత్య పరిషద్వార్షిక సభకు వీ రధ్యక్షులు. రామ దాసు, జ్యోతిర్లీల, గోవర్ధనోద్ధారణము మొదలగునవి వీరు రచించిన నాటకములు. ఆంధ్రగీతగోవిందము, ఆంధ్రాష్టపదులు, శోభనాచల మాహాత్మ్యము మొదలగు నవి వీరు సంతరించిన కమనీయ కావ్యములు. 'జ్యోతిర్లీల' యను నైదంకములు గల నాటకము సరిక్రొత్తరీతులలో రూపెత్తిన రచనము. కృతికర్తలను గాదని తత్కృతులపరముగా పూర్వకావ్యస్తుతిని నెఱపుట రాజాగారి నెఱజాణతనమును సూచించును. జ్యోతిశ్శాస్త్ర విశేషములను దృశ్యరూపమున వ్యక్తపఱుచుట నాటకకర్త ముఖోద్దేశము. పురుషప్రయత్నమునకు ప్రకృతిసత్వములు స్వాధీ నములని నిరూపించుట యీ కథయందలి పరమార్థము. త్రిభంగి, ధ్వని, చంద్ర పద్మ, నారి, శ్రీ, స్త్రీ, మృగీ, పంక్తి, సమానీ మొదలగు అపూర్వవృత్తము లిందు రచితము. భూమికా వివరణ పట్టికలో ఆయా భూమికల ఆహార్యాదులును వర్ణ్యములు.

'....వేంకటాద్రివిభుఁడున్ దా గీతగోవింద నృ
త్యత్ప్రియూషపరుండు, ప్రోల్లసిత రాధాకృష్ణ కేళీకళా
తాత్పర్యజ్ఞుఁ డనేక కావ్య ఘటనాదక్షుండు, సత్సాహితీ
హృత్పద్మాంతర భోగభోగి, అతఁడెంచేవెల్గు నిశ్చింతుఁడై'

ప్రసిద్ధులగు తిరుపతివేంకటకవులు వెంకటాద్రిఅప్పారావుగారిని దర్శించి సమ్మానములను బడసిరి. ఆ సందర్భమున తిరుపతిశాస్త్రిగారు చెప్పిన పద్యమిది:

'కవివై, భూపతివై, సదా సుమతివై, కల్యాణివై, నిత్యమా
ర్జవ మొప్పారఁగ నూజివీట సుఖివై రాజ్యంబు పాలించు ని
న్నవలోకించి నదృష్టమిప్పటికి సంప్రాప్తించె నుయ్యూరు రా
జవరా ! తిర్పతిశాస్త్రికిన్ సుకవితాసాఫల్య మింపారఁగన్'

—నానారాజ. ఉత్తర. 467.

ఈ సందర్భమునందే నూజివీటి కోటలో వేంకటాద్ర్యప్పరావుగారు రచించిన 'రామదాస' నాటకప్రదర్శనము జరిగినది. ఈ నాటకరచనను తత్ప్రయోగ కౌశలమును ప్రస్తుతించుచు తిరుపతివేంకటకవులు పద్యములు చెప్పిరి. అప్పారావుగారిచే సత్కరింపఁబడిన వారిలో కళాప్రపూర్ణ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారొకరు.*

నూజివీటి ప్రభువుల మఱియొక రాజధాని శనివారపుపేట. శనివారపుపేట జమీందారు నారయ్యప్పారావుగారిని తిరుపతి వేంకటకవులు దర్శించి సమ్మానము లందిరి.

నూజివీటి కోవలోని ముసునూరు పాలకులగు రామచంద్ర అప్పారావు గారు సంస్కృతాంధ్రాంగ్ల పారసీకభాషలలో మంచి పాండిత్యము కలవారు. వీరు 1862 లో జన్మించి 1889 లో ఒమికివచ్చిరి. తిరుపతివేంకటకవులు, కాశీ కృష్ణాచార్యులు, విశ్వనాథ సత్యనారాయణ మున్నగు కవి పండితులను బెక్కురను సమ్మానించిరి. వారికి వార్షికములనుగూడ నేర్పఱిచిరి. వీరు 1909 లో మరణించిరి. వీరి నిర్యాణముపై తిరుపతివేంకటకవులు చెప్పిన పద్యములు రాజాగారి పాండిత్య దాతృత్వ సౌహార్ద మార్దవములను బట్టియిచ్చునట్టివి :

'రాజులు లేరె లోకమున ? రాజులుగాఁగలరేమి లాభ ? మీ
తేజము రంజకత్వమును దేఁకువ, లోఁకువగాని శక్తియున్
భోజునివంటి పాండితియుఁ బొల్చెడివాఁడెవఁడో వచింపు, మిం
కీ జనపాలురందు, ధరణీశశిఖామణి ! యప్పరాడ్విభూ !'

ఈ రామచంద్రఅప్పారావుగారికి విశ్వనాథ సత్యనారాయణగారి అనార్కలీ నాటకము కృతి యీఁబడినది. కాశీ కృష్ణాచార్యులుగారు రామచంద్రఅప్పా

* చిలకమర్తి లక్ష్మీనరసింహము, స్వీయచరిత్రము, ఆంధ్రరాష్ట్ర అభ్యుదయ రచయితల సంఘ ప్రచురణము, 1944, పు. 376.

రావుగారిని దర్శించి ప్రశంసించిన పద్యము :

'అవనీకాంతను బెండ్లియాడి, తదిగా కబ్జాలయాహస్తప
ల్లవముంబట్టితి, వంతబోక వివిధాలంకార మాన్యాత్మయా
కవితాకన్యను గౌఁగిలించి తిఁక నో క్ష్మానాథ ! మాకెట్టు లీ
భువి వర్ణిత్వము సల్పఁగాఁగలుగునో ముస్నూర్ క్షమాఖండలా'*

ఈ రామచంద్రఅప్పారావుగారి పుత్రులగు సింహాద్రిఅప్పారావు బహద్దరుగారును, రాజగోపాలఅప్పారావు బహద్దరుగారును కవితాపోషకులు. ప్రతిజ్ఞాశాంతనవము మొదలగు ప్రశస్తకృతులను వీరు ఆదరించిరి. ధర్మఅప్పారావు వంశమునందు జన్మించిన వీరు తమ పూర్వుల కీర్తిని నిలుపఁబెట్టినవారు.

## రాజా రంగయ్యప్పారావుబహద్దరు

మయ్యూరు వెంకటాద్రి అప్పారావుగారి తనయులు రంగయ్యప్పారావు బహద్దరుగారు ఉన్నతవిద్యాపట్టభద్రులు. ఆంధ్రప్రదేశ సాంస్కృతిక వ్యవహారశాఖామాత్యులుగా, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ ప్రోత్సాహకులుగా, ఆంధ్ర విశ్వవిద్యాలయము సెనేట్, సిండికేట్ సభ్యులుగా, విశ్వకళాపరిష దుపాధ్యక్షులుగా, ఆంధ్ర నాటక కళాపరిషదధ్యక్షులుగా వీరు కావించిన విద్యాసంబంధమైన కృషి విస్మరింపరానిది. ధర్మాప్పరాయల ధర్మసంతతికిఁ జెందిన నిర్మలమూర్తియగు అప్పారాయబహద్దరుగారు అనేకకృతులను కృతినొందిన సుకృతులు. దురిసేటి వేంకటరామాచార్యుల 'అనార్కలి' యను ఆధునిక పద్యకృతి, యత్ర్తోజు మాధవాచార్యుల 'మధువలయము' అను పద్యకృతి మొదలగునవి వీరు అంకితముపొందిన గ్రంథములలో కొన్ని.

'అహహ వేంకటనారసింహాప్పరాయ
భూతలేంద్రున కెంతటి భూతదయయొ
యిమ్మహోదారు సత్కథలెల్లఁ దిశల
గానమొనరించెదరు పుణ్యకరములనుచు'

అని పారసీక ధరాధీశ చరిత్రమునందుఁ బ్రస్తుతింపఁబడిన ధర్మఅప్పారాయ ప్రభువర్యుల స్మృతిచిహ్నము నేఁటి నూజివీటిలోని కళాశాల.

* అవధానయాత్ర, పు. 162.

## ఉపజీవ్య గ్రంథసూచి


1. ఆంధ్రవిజ్ఞానము.
2. తెలుగువిజ్ఞానసర్వస్వము, సంపుటము, 3, పుటలు 1171—1175.
3. అముద్రితగ్రంథచింతామణి సంపుటములు.

4. శ్రీరాం వీరబ్రహ్మకవి, నానారాజన్యచరిత్రము, పుటలు 124–146.

5. A. Vadivelu, The Aristocracy of Southern India, Vol. I, pp. 182–191; Vol. II, pp. 32–73.

6. V.L. Sastri, Encyclopaedia of the Madras Presidency and the Adjacent States, pp. 425–429.

7. M.A.M.P., Vol. I, p. 59.

# పాచిపెంట (తేడ పాచిపెంట)

## ప్రవేశిక

'శ్రీశ మద్రాసు ప్రెసీడెన్సిలోన విశాఖపట్టణపు డిస్ట్రిక్టునందు సాలూరు సబ్ రిజిష్ట్రి రిలాకా పాచిపేట జమీందారి పేర నలరు....' (సూర్యనారాయణ స్వామి శతకము, 101). ఈ జమీందారీ శ్రీకాకుళమండలము సాలూరు తాలూకాలోనిది. ఇందు పదునైదు గ్రామములున్నట్లు వెబ్బుదొరగారు వ్రాసి యున్నారు. తాడూరు, తేడ యను రెండుముఠాలను ఆయన రెండుగ్రామములుగా లెక్కించినట్లున్నారు. తాడూరు ముఠాలో పంతొమ్మిది గ్రామములును, తేడ ముఠాలో నూటముప్పదిరెండు పల్లెలును కలవు. బంటుమానా సిబ్బంది ఖర్చులు పోను పేష్కషు రూ. 3,000 లు. పాచిపెంటకు ప్రాక్పురి, ప్రాచీపురము, ప్రాచీపట్టణము అను నామములున్నట్లు సాహిత్యమువలన తెలియుచున్నది. ఈ సంస్థానపాలక వంశమునకుచెందిన శ్రీరాజా త్యాడ పూసపాటి వీరపరాజు రచించిన ఆంధ్రపదాకరమను పద్యనిఘంటువునందు 'ప్రాక్పురాధీశ్వర' (పీఠిక. 2), 'ప్రాక్పురీశ్వర' (సుర. 11), 'ప్రాచీపుర నివేశ' (నర. 2), 'ప్రాక్పుర నివేశ' (పైది, 10), 'ప్రాచీపట్టణనిలయ' (పైది, 127), 'ప్రాచీపుర వాస' (అచర. 1) అనియు, వీరపరాజ విరచితమగు సూర్యనారాయణస్వామి శతకమునందుకూడ 'ప్రాచీపురాహ్వయ ప్రాజ్యరాజ్య' మనియు పాచిపెంట గ్రామము, సంస్థానము వ్యవహరింపఁబడినవి. పాచిపెంటనుండి జయపురము పోయెడు ఘాటీ మార్గమునొద్ద ఆ నాఁడు పటిష్ఠమైన పహారా ఆవశ్యకమై యుండెడిది. ఒకనాఁడు పాచిపెంట సంస్థానము జయపురసంస్థానములోని ఒకభాగముగా నుండెడిది. తమ సంస్థానసంరక్షణము నిమిత్తము జయపుర సంస్థానాధీశ్వరులు పైన పేర్కొనిన ఘాటీ మార్గమునొద్ద సమర్థుఁడును, విశ్వాసపాత్రుఁడునునగు నొకసరదారును నియమించుట యుక్తమని భావించిరి. దుగరాజు విశ్వంభరుని సామంతుఁడని రామవిలాసకథనము.

'దుగరాజు మొదలైన దొరలను భంగించి
విశ్వంభరుని యుద్ధవిరతుఁజేసె....
వత్సవాయాన్వయమునకు వన్నెదెచ్చె
రాయపనృపాలు శ్రీ తిమ్మరాజ మౌళి' —రామవిలాసము, పు. 29.

ఈ ఘాటీకి ఆపర్వతములయొక్క దక్షిణద్వారమని పేరు. దీనిని సంరక్షించుట గౌరవమగు పదవియైయుండెడిది. ఈ ఘాటీమార్గమునకు పైభాగమునను

క్రిందిభాగమునను గల కొన్ని గ్రామములు పోషణము నిమిత్తము ఏర్పఱిచి తమ పరివారములో కొందఱు బంటుమానాజనమునకు ముఖ్యనాయకుఁడుగానున్న తమ్మన్నదొరయను నతనికి దక్షిణకవాటయుగరాజను బిరుదమును ప్రసాదించి పాచిపెంట కేలికగా జయపురమువారు నియమించియుండిరి.

'ఒగి దక్షిణకవాటయువరాజు చేసి, త
మ్మన్న దొరకొంఁసగెం బాచిపెంట' —ప్రభాసశాప.

మూలపురుషుఁడగు పై తమ్మన్నదొర తేడలో నొకకోటను గట్టెను. కాని యాయన వంశీయులు తేడను వీడి, పాచిపెంటకు వచ్చి యచ్చట కోటలు, గుడులు, గోపురములు కట్టి స్థిరనివాసముల నేర్పఱిచికొనిరి. అందువలన నీ సంస్థానమునకు పాచిపెంట అనియు, తేడ పాచిపెంట అనియు వ్యవహార నామములు సిద్ధించినవి.

## సంస్థాన చరిత్రము

ఈ కుటుంబమువారు తాము కొండరాజులమనియు చంద్రవంశమువారమనియు చెప్పుదురు. కాని ఆంధ్రకవిసప్తశతి (పు. 223) వీరు సూర్యవంశ క్షత్రియులని పేర్కొనుటకు ఆధార మేమో తెలియదు. వీరపరాజ కృతమగు చిఱుతవజీరు శతకమునందు—

'వెన్నెలరా వంగసమున
వన్నెయు వాసియును గలిగి వఱలుచు నిలలోఁ
జెన్నగు శ్రీ మల్లపనృపు
చిన్నిసహోదరుఁడు....' నని వీరపరాజు చెప్పుటను బట్టియు, ఆంధ్రపదాకర కృత్యవతారికలో కృతికర్త యన్నయగు మల్లపరాజు 'అమృతకరవంశ వార్ధిరాకాచంద్రుఁడు' అని పేర్కొనఁబడుటనుబట్టియు వీరు చంద్రవంశము వారనుటయే సరియని తోఁచుచున్నది.

'....శ్రీ పూసపాటి....అన్నమావనీపతి....'

—ఆంధ్రపదాకరము, పీఠిక, 3.

'అలఘుతరభక్తి నీకు సమర్పణముగ
ధీసముద్ధాటి శ్రీ త్యాడ పూసపాటి
వీరపనృపాల విరచితమై రహించి
వెలయు సురవర్గు గైకొను వేదవేద్య'

—పైది, సురవర్గాంతము, పు. 19.

'ప్రాచీపురాహ్వాయ ప్రాజ్యరాజ్యాధిప
త్యవిరాజమాన వైభవఘనుండు
శ్రీ పూసపాటి దక్షిణకవాటదుగ రా
జ బిరుదాంకుండు సజ్జనవిధేయ

నృపుఁడు శ్రీ త్యాడ పెద్దమల్లపమహీశ
సోదరుఁడ నీదు భక్తుండ సుజనహితుఁడ
వీరపనృపాలుఁడను నను వేడ్కఁ బ్రోవు
సూర్యనారాయణ స్వామి ! సుపథగామి !'

—సూర్యనారాయణస్వామి శతకము, 101.

మొదలగు వానినిబట్టి వీరి యింటిపేరు పూసపాటివారని తెలియు చున్నది. వీరిది నాగేశ్వర గోత్రమఁట ! సృష్టికరణకులజులలో ఉరిడె, కంతుమహంతి, జగ్గుమహంతి, పెదపంకె, పొట్నూరు, మక్కువ మొదలగు గృహనామములుకలవారును నాగేశ్వరగోత్రమువారని తెలియుచున్నది. పాచిపెంటవారి వంశములో వీరప్పరాజు ప్రధానుఁడు. వీరపరాజునకు కళింగ విజయనగర పాలకుఁడయిన పెదవిజయరామరాజు సమకాలికుఁడు. చిరకాలము నుండియు పాచిపెంట సంస్థానదాతలగు జయపుర సంస్థానము వారికిని విజయనగరసంస్థానము వారికిని ఇరుగుపొరుగు పాలకులగుటవలన ఈర్ష్యా ద్వేషములేర్పడి యుండినవి. పెదవిజయరామరాజు తమ పక్షమును వదలి ఫ్రెంచివారి పక్షమునవలంబించినందులకు ప్రతిక్రియ చేయునిమిత్తము విజయ నగరరాజ్యమును నష్టపఱుచుటకొఱకు సర్కారుల నవాబగు జాఫరలీఖాను చికాకోలు సర్కారుపై దాడివెడలినపుడు అతనికి తోడుగావచ్చిన రఘోజీభాన్స్లే కుమారుని నాయకత్వమునఁగల మరాఠీ గుఱ్ఱపుదండునకు విజయనగరము వారితో విసిగిన వీరపరాజు పాచిపెంట ఘాటీమీఁదుగ విజయనగరముపోవుట కనువైనమార్గము చూపించెను. దీనితో విజయనగరమునకపజయము ప్రాప్తించి రాజ్యమంతయు కొల్లగొట్టఁబడినది. తమ శత్రుసేనలకు గుట్టుమట్టులెఱుకపఱిచి పాచిపెంట వీరపరాజు నేరముచేసి అర్ధాపరాధియయినందున విజయనగరము పెదవిజయరామరాజుగారు కోపించి వీరపరాజును శిక్షించుటకు తగిన అదను కొఱకు ఎదురుచూచి మరాఠీదండు ఈ దేశమును వదలిపోయినతరువాత వీరపరాజును పట్టి తెప్పించి విజయనగరముకోటలో ఖైదుచేసియుంచిరి. వీరప రాజు యావజ్జీవము ఖైదులోనే గడపెను. నాఁటినుండి పాచిపెంటసంస్థానమును విజయనగరమువారే స్వాధీనపఱిచికొని ఏలుచుండిరి. క్రీ.శ. 1789 లో ఈ వీరపరాజు చనిపోఁగా, ఆయనకుమారుఁడగు మొదటి మల్లపరాజుగారికి విజయ నగరము దివాణమునుండి స్వల్పమగు తవుజీ ఈఁబడుచుండెడిది. పద్మనాభ యుద్ధము జరిగి, విజయనగరసంస్థానము ఔద్ధత్యము తఱిగినతరువాత మల్లప రాజుగారిని కుంఫిణీప్రతినిధియగు వెబ్బుదొరగారు పిలిపించి మల్లపరాజు పైతృకములగు సంస్థానగ్రామములను మరల నతనికే కవులునకిచ్చిరి. క్రీ.శ. 1797 లో మల్లపరాజుగారు మరణించిరి. ఈయనకుమారుఁడైన అన్నమ రాజుగారితో శాశ్వతపరిష్కారము జరిగినది. ఈ అన్నమరాజుగారి పుత్రుఁడు

ఇమ్మడి మల్లపరాజు. ఈ మల్లపరాజుగారివలన 1846 లో ఈయన తనయుఁడగు ఇమ్మడి అన్నమరాజునకు జమీందారీ సంక్రమించినది. ఇమ్మడి మల్లపరాజు కాలమున జమీందారీ చాల హీనస్థితికి వచ్చినది. ఇమ్మడి అన్నమరాజునకు గంగమాంబవలనఁ గలిగిన కుమారులలో ముమ్మడి మల్లపరాజు, వీరపరాజు అను నిరువురు ముఖ్యులు. తేడ చిట్టెయ్య, రామజోగిపట్నాయకుగారలు సంస్థానము దివానులుగానుండిరి. ఈ వీరపరాజే పాచిపెంటసంస్థానమునకు సాహితీగౌరవమును సంక్రమింపఁజేసినవాఁడు.

## సాహిత్యపోషణము

ఇమ్మడి అన్నమరాజుతనయుఁడును, పాచిపెంటసంస్థానాధిపతియగు ముమ్మడి మల్లపరాజు (1845–1898) తమ్ముఁడునునగు రాజా త్యాడ ఘ్నాసపాటి వీరపరాజు దక్షిణకవాటయువరాజాబహద్దర్ ఈ సంస్థానాధిపతులలో గొప్ప సాహిత్యవేత్త. ఈయన ఆంధ్రపదాకరము, శ్రీ సూర్యనారాయణస్వామి శతకము, చిఱుతవజీరుశతకము మొదలగు కృతులను సంతరించిరి.

## ఆంధ్రపదాకరము*

ఇది సుర నర గుణ పరికర చర అచర నానార్థ వర్గములను సప్తవర్గ సహితమైన యాంధ్రపద్యనిఘంటువు; లఘుటీకాసమన్వితము. టీకాకర్త లెవరో తెలియదు. పాచిపెంటలో వెలసిన మల్లికార్జునస్వామి కిది అంకితము. 'ఘనమగు శాలివాహనశకంబు సవేందు దిశాంబుజారి సంఖ్య నలరు హేమళంబి శరదంతర మాధవమాసభాస కృష్ణనవమి భౌమవాసరమున....' శా.శ. 1815 అనఁగా క్రీ.శ. 1893 లో ఈ కృతి పూర్తియైనట్లు గ్రంథాంతమందలి పై పద్యము సాక్ష్యము.

> 'శ్రీ మత్పర్వత రాట్పు
> త్రీ మంజుల కుంభకుచపరీరంభణ స
> క్తామల కౌంకుమపదవ
> క్షో మహనీయాంగ మల్లికార్జునలింగా'

ఇది గ్రంథాదియందలి పద్యము. ఇఁక, ఇష్టదేవతాప్రార్థనాదికము :

> 'శ్రీశ్వరులన్ భజించి, దృఢచిత్తముననన్ సుమనోగణాది లో
> కేశ్వరుల న్నుతించి, గురునెంతయు మ్రొక్కి, కృతప్రబంధవా
> గీశ్వరులన్ ధరిత్రి గణియించియు, నాంధ్రపదాళిఁ బ్రాకృరా
> ధీశ్వర నామలాంఛిత కృతేచ్ఛఁ గుతూహలినైన యత్తఱిన్'

* శ్రీమాన్ తెన్మతము వేంకటనరసింహాచార్యులుగారిచే వసురత్నాకర ముద్రాక్షరశాలయందు ముద్రింపించి ప్రచురింపఁబడియె, 164 పుటలు, చెన్నపురి. 1897.

'శ్రీమదుమారమణీమణీరమణ పాదపయోరుహభ్రమద్భ్రమరాయ
మాన మానసుఁడు సుజ్ఞాన కళాపూర్ణుఁడష్టావధాన విహారి యమృత
కరవంశవార్ధి రాకాచంద్రుఁ డాశ్రితసురమహీరుహము భాసురవివేక
గురుఁడు నాగేశ్వరగోత్రపవిత్రుండు షాడ్గుణ్యదక్షుండు శౌర్యకాంత
గుణుఁడు శ్రీ పూసపాటి దక్షిణకవాట
పదకదంబ సిబిత్త విభాసితాస్న
మావనీపతి గంగమాంబాగ్రజన్ముఁ
డైన మద్భ్రాతృమల్లపక్షోణివిభుఁడు'
'అనుజులు భక్తులై, శ్రితబుధాళి సముంచితరక్తులై, సుహృ
జ్జనులు హితోక్తులై, సుభటసంచయ మాజ్ఞనియుక్తులై, సుధీ
జనులు కథానుషక్తులయి, సర్వజనంబులు షడ్విముక్తులై
తనుగొలువన్ సరాగమునఁ దత్సభలో ననుఁగాంచి వేడుకన్'
'తమ్ములలో సహోదరప్రధానులలోనఁ బ్రధానమిత్రవ
ర్గమ్ములలో సుహృద్వర సుకావ్యులలోనఁ గవీంద్రభృత్యబృం
దమ్ములలోనఁ గింకరజనాయిత వీరపభూమిపాల! రా
రమ్మని చేరఁబిల్చి మధురస్ఫురితామృత వాక్యధోరణిన్'.
'ఆంధ్రనిఘంటువుల్ బహుళమయ్యెఁ బఠింప నశక్య మేరి కా
యాంధ్రము నాంధ్రశేషము తదాంధ్రపయోజలరాశి వేంకటే
శాంధ్రము నాది తత్కృతులయందలి శబ్దములన్నిగూర్చి నీ
వాంధ్రపదాకరంబను సమాఖ్యనొనర్పు కృతిన్ సమాకృతిన్'
'క్రొన్నెలవంకదారియగు శివునకుఁ గృతియి'మ్మని అన్నగారు ఆదే
శింపఁగా మహాప్రసాదమని యంగీకరించి కృతియొనర్చినాఁడు వీరపరాజు
(ఆంధ్రపదాకరపీఠిక, 2 నుండి 7).

'నరసఖాప్త! సుర నర గుణ పరికర చ
రాచరంబులు నానార్థవాచకములు
సప్తవర్గులుగాఁగ నే సంఘటింతు
నవధరింపుము దివ్యచిత్తాబ్జమునను' —పైది, 9.

ఇట్లు ప్రతిపద్యమును శివసంబంధియగు సంబుద్ధితో నడచినది. నిఘంటుభాగము నందు మొత్తముపద్యములు 645 కలవు. అచ్చతెలుఁగుపదములుమాత్రమిందుఁ గూర్పఁబడినవి.

## సూర్యనారాయణస్వామి శతకము*

శ్రీ పాచిపేట జమీందారీయువరాజాగారగు వీరపరాజుగారివలన ప్రతి

* రెండవకూర్పు, వసురత్నాకర ముద్రాక్షరశాల, చెన్నపురి, 1899.

పద్యరసాస్పదంబుగా నీ శతకము రచియింపఁబడినట్లు ముఖపత్రమునందలి వివరణము సూచించుచున్నది. 'సూర్యనారాయణస్వామి సుపథగామి' యను మకుటముగల సీసపద్య శతక సంభరిత మిది. అరసవెల్లి సూర్యనారాయణస్వామి కంకితము. 'శాలివాహనశకమున షట్ఖవసుచంద్రసంఖ్యలు చనఁగ తారణాబ్ద భాద్రపదసితపక్షాదితిథి రవిజదిన మొసంగితి కృతి వేడ్కఁ గొనుము సూర్యనారాయణస్వామి సుపథగామి' అను శతకాంతపద్యమును బట్టి శా. శ. 1806 అనగా క్రీ. శ. 1884 న కృతి సమర్పితమైనట్లు తేలుచున్నది.

ప్రతిపద్యమునందును ఏదో యొక చమత్కార మీ శతకమున సంధానింపఁబడినది. శబ్దార్థాలంకారము లందలి సకల చమత్కారములు, 'పెద్దల కెల్లను బిలిచి చెప్పెదఁ జుమీ కర్ణునిగన్నట్టి కానిమాట' వంటి వ్యంగ్య స్తుతులును ఇందు కోకొల్లలు. తన కవితకు ఉద్బోధకమైన సామగ్రిని కవి యిట్లు పేర్కొనుచున్నాఁడు :

'సకలకళాదానశాలివౌనీదు చ
రణసరోరుహసమారాధనంబు
మన్మనోరథదానమన్మల్లికార్జున
స్వామి సాంద్రసహాయసాధనంబు
ప్రకటకుద్యాన్వయప్రాజ్ఞ సుబ్రహ్మాఖ్య
భూసురాగ్రణి గురుబోధనంబు
మత్సహోదరు పెద్దమల్లపరా ట్సర
స వరేణ్య చిరకృపాచ్ఛాదనంబు
కారణంబుగ నే నేర్చుకరణి ధరణి
నీ నిమిత్తంబుగాఁగ నే నిశ్చయముగ
సీసశతకంబుఁ జెప్పెదఁ జిత్తగించు
సూర్య నారాయణస్వామి ! సుపథగామి !'

## చిఱుతవజీరు శతకము

ఇదియును వీరపరాజకృతమే. కవి బాలురకొఱకిది వ్రాసెనఁట ! 'చిఱుతవజీరా ' యను మకుటము గలది. మచ్చునకు కొన్ని పద్యములు :

'వెన్నెలరావంగసమున
వన్నెయు వాసియును గలిగి వఱలుచు నిలలోఁ
జెన్నగు శ్రీ మల్లపనృపు
చిన్ని సహోదరుఁడు వేడ్క చిఱుతవజీరా'.

'కూడనిపని సేయకు మా
తాడకు మెపుడయ్యవారలకు మాటలకున్

గూడకు దొరసానుల పని
చేడెలతోఁగీడువచ్చు చిఱుతవజీరా'.
'వెలయాంధ్రను నమ్మకు ర
చ్చల నమ్మకు గోడఁ జాల్వ జలఁజిమ్మకు ని
చ్చలు దోసములఁ గ్రమ్మకు
చిలువ చెలిమిగ్రమ్మఁ బోకు చిఱుతవజీరా'.

వేఁగినాటి వైదికశాఖకుచెందిన గోడా సుబ్రహ్మణ్యశాస్త్రి పాచిపెంట సంస్థానాధీశ్వరుల విద్యాగురువు; సంస్థానవిద్యాధికారి. రాజా వీరపరాజు తన సాహితీసమారాధనమునకు 'ప్రకటకుద్యాన్వయ ప్రాజ్ఞసుబ్రహ్మాఖ్య భూసురాగ్రణి గురుబోధనంబు' ప్రధానసాధనమని సూర్యనారాయణ శతకమునఁ బేర్కొని నాఁడు. ఆంజనేయోపాసకులగు గోడా సీతారామస్వామిశాస్త్రి శాపానుగ్రహ సమర్థులగు విద్వత్కవులఁట ! ప్రత్యక్ష బాహాట పాంచాలశయ్యల ప్రౌఢిమెఱిన పౌరాణికులఁట ! వీరిరచన లేవియు లభ్యముకాలేదు.

పాచిపెంటను పాలించిన చివరి రాజాగారును గొప్ప పండితులు ; కవులు. అనుదినము విద్వద్గోష్ఠులతోఁ బ్రొద్దు పుచ్చెడి వారఁట ! కనీస మయిదాఱుగురు కవులో, పండితులో యీయనను బరివేష్టించి సాహితీచర్చలలోఁ బాల్గొనుచుండి నట్లు ఈ ప్రాంతములందలి జ్ఞానవయోవృద్ధులగువారు పెక్కురు వివరింతురు.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. విశాఖపట్టణముజిల్లా వృత్తాంతసంగ్రహము, పుటలు 304, 305 ; 538, 539.

2. తెలుగువిజ్ఞానసర్వస్వము, సంపుటము 3, ఆంధ్రసంస్థానములు – సాహిత్య సేవ, నిడుదవోలు వేంకటరావు, పుటలు 1171–1175.

3. వంగూరి సుబ్బారావు, శతకవాఙ్మయ చరిత్రము.

# పానుగల్లు

## ప్రవేశిక

ఈ ఎస్టేటు నెల్లూరు, ఉత్తరార్కాడు మండలములలోని కొన్ని గ్రామములతో కూడినది. కాళహస్తి పట్టణమునకు సమీపమున స్వర్ణముఖీనదీతీరమున నిటీవల నిర్మింపఁబడిన పానుగల్లు అను పట్టణము ఈ ఎస్టేటుదారుల నివాసము. ఋణబాధలపాలయిన కాళహస్తి సంస్థానము నందలి పామూరు తాలూకాను పానుగల్లు పాలకులు విక్రయించికొని తమ ఎస్టేటును పెంపొందించిరి. ఇది నవీనమయిన ప్రొప్రయిటరీ యెస్టేటు.

## సంస్థాన చరిత్రము

ఈ పానుగల్లువారు వెలమలు*. వీరిది పట్నూళ్ళ గోత్రము. కాలచోదితమున కాకతేశ్వరుఁగొలిచినవారు. వీరి పూర్వులు కాకతీయ సామ్రాజ్యమంతరించువాఁక తెలంగాణమునందలి నల్లగొండకు 3 మైళ్ళ దూరమునఁగల పానుగల్లు కోటకు అధిపతులుగా నుండిరఁట. బాలనాగమ్మ, మాయలమరాఠీల జానపదగాథలకీ పానుగల్లు ముఖ్యరంగము. పదునెనిమిదవ శతాబ్దాంతము నాఁటికి ఈ కుటుంబము అనేకవిపత్పరంపరలకు లోనయి తమ పాలనమునందలి పెక్కు ప్రాంతములను పోఁగొట్టుకొనినది. ఆ పిమ్మట నీ వంశీయులు దక్షిణ సీమలకు తరలివచ్చిరి. వీరిలో ప్రఖ్యాతులయిన వేంకటరామారాయణింగారు నెల్లూరు ఉత్తరార్కాడుమండలములలో మంచి విలువయినభూములను సంపాదించిరి. వీరి కుమారులగు వేంకటరంగారాయణింగారి కాలమున పానుగల్లు ప్రభుకుటుంబము కాళహస్తిలో స్థిరపడినది. వేంకటరంగారాయణింగారి సర్వతోముఖప్రతిభవలన ఎస్టేటు చాలవరకు వర్ధిల్లుచువచ్చినది. ఈయన పెద్ద కుమారులు శేషాచలపతిరాయణింగారు కాళహస్తి పట్టణమునకు దాపున స్వర్ణముఖి గట్టునందొక గ్రామము నిర్మించి దానికి 'పానుగల్లు' అని తమపూర్వులరాజధాని పేరు పెట్టిరి.

వేంకటరంగారాయణింగారి పెద్దకుమారులు రామారాయణింగారు (1866—1928) ఈ వంశమునందు గొప్ప పేరుప్రతిష్ఠలు గలవారు. రాజకీయరంగము

*'తొలికాల ముర్విగొడవల వెలియై పొలములయందు విహరించుటచే
నిల కాఁపుజనులుకొందఱు వెలమలనం జగతిలోన విశ్రుతులగుటన్'
—పద్మనాయక చరిత్రము, ప. 26.

నందును, సాంఘికసేవాకార్యక్రమములందును, విద్యారంగమునందును పరిగణింపఁదగిన కృషి సల్పినవారు. 1912 లో ఇంపీరియల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో మదరాసురాష్ట్రము జమీందారుల, భూస్వాముల ప్రతినిధిగా సభ్యులు. 1915 లో విశాఖపట్టణములో జరిగిన మూఁడవ నాంధ్రమహాసభకును, 1915 లో రాజమండ్రిలో జరిగిన రెండవ ఆంధ్రదేశగ్రంథాలయముల మహాసభకును పానుగంటి రామారాయణింగారధ్యక్షులు. 1918లో దివాన్‌బహద్దరు బిరుదమును, 1922 లో రాజా బిరుదమును, ఆపిమ్మట 1926 లో సర్ బిరుదమును బొందిరి. జస్టిస్‌పక్షము తరపున మద్రాసురాష్ట్రమునకు విద్యాశాఖామంత్రిగాను, ముఖ్యమంత్రిగాను వ్యవహరించి గొప్పపేరు గడించిరి. వీరి సోదరులు శ్రీ రాజా పానుగంటి పార్థసారథిరాయణింగారు.

## సాహిత్యపోషణము

దక్కనులోని పానుగల్లుకోటకు అధిపతులుగనుండిన కాలమునందలి యీ వంశీయుల సాహితీపోషణ వివరములు లభ్యముకాలేదు. పానుగంటి రామారాయణింగారు చిన్నతనమునుండియు సంస్కృతాంధ్రములలో మంచి యభిరుచిగలిగి ప్రెసిడెన్సీ కాలేజీలో ప్రత్యేకాంశములతోపాటు తెలుఁగు అభిమానవిషయముగా స్వీకరించి యం.ఏ. పరీక్షకు చదివి 1896 లో ప్రథమ శ్రేణిలో పట్టభద్రులయిరి. చాలకాలము మద్రాసువిశ్వవిద్యాలయములో తెలుఁగునకు పరీక్షకులుగా నుండిరి. ఉత్తమ కావ్యరచనను ప్రోత్సహింప పిఠాపురము రాజాగా రేర్పఱిచిన సాలుసరి పోటీలలో రామారాయణింగారు కందుకూరి వీరేశలింగము, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారలతోపాటు కావ్యపరీక్షకులుగా నుండిరి.* రాజమండ్రిలో జరిగిన ఆంధ్ర సాహిత్య పరిషత్తు ద్వితీయ వార్షికోత్సవ సభ కధ్యక్షతవహించిరి. లార్డ్ హార్డింజ్ ప్రభువు మదరాసునగరము విచ్చేసిన సందర్భమును పురస్కరించికొని తెలుఁగులో శాస్త్రగ్రంథముల ప్రచురణమునిమిత్తము మద్రాసు విశ్వవిద్యాలయమునకు పదివేల రూపాయల ఎండోమెంటు నిధిని సమర్పించిరి. ప్రాయోగిక మనస్తత్త్వశాస్త్ర విభాగమున పరిశోధనముసలుపుటకును, అందొక రీడరుపదవిని నెలకొల్పుటకును 1927 నుండి యేఁటేఁట అయిదువేల రూపాయల విరాళము ఆంధ్ర విశ్వవిద్యాలయమున కొసఁగుటకు రాజాగారు నిర్ణయించిరి. 1928 లో వీరు మరణించుటవలననో లేక మ తేకారణమువలననో వీరి ప్రయత్నము పారముముట్టినట్లు లేదు. ఆంధ్ర విశ్వ విద్యాలయము రూపెత్తుటలో పానుగల్లురాజాగారుచేసిన ప్రత్యేక కృషి మఱవరానిది. మద్రాసురాష్ట్రము విద్యాశాఖామంత్రిగా తెలుఁగుభాషకును, తెలుఁగుభాషాధ్యాపకులకును వీరుచేసిన మేలు విస్మరింపరానిది. కాళహస్తి,

* చిలకమర్తి లక్ష్మీనరసింహము, స్వీయచరిత్రము, పు. 276.

చల్లపల్లి, తుని, నూజివీడు, పిఠాపురము, పెద్దాపురము, బొబ్బిలి, ముక్త్యాల, విజయనగరము పాలకుల వలె వీరి ఆయుర్వేదాభిమానము ప్రత్యేక ప్రశంసకు పాత్రమయినది. వీరి దీక్షాదక్షతల మూలమున 1925 లో మదరాసు ప్రభుత్వము వారు దేశీయవైద్యవిధానమును గుర్తించి, తత్సంబంధి విద్యాలయములను నెలకొల్పిరి.

రాజా పానుగంటి పార్థసారథిరాయణింగారు ఆంగ్లవిద్యాపట్టభద్రు లయినను సంస్కృతాంధ్రములయందు మంచి యభినివేశముగలవారు. భగవద్గీతా మంజరి, కమలాకల్యాణము, సత్యాకృష్ణసమాగమము మొదలగునవి పార్థసారథి రాయణింగారి ముఖ్యరచనలు. వీరు అచ్చమాంబా వేంకటరంగయార్యులపుత్రులు. వీరి భగవద్గీతామంజరి భగవద్గీతకు నాంధ్రానువాదము. ఇది మంజరీద్విపదలో వ్రాయఁబడినది. మాదిరికి కొన్ని యనువాదభాగములు—

'భూతంబు లన్నసంభూతంబులగునుఁ
బ్రభవించు నన్నంబు వర్షంబువలన
వర్షంబు యజ్ఞంబువలనను బుట్టు
యజ్ఞంబు కర్మమం దావిర్భవించు'

—కర్మయోగము, అధ్యా. 3, ప. 14.

ఈ పంక్తులు క్రింది శ్లోకమునకు తెనిఁగింపు :

'అన్నాద్భవంతి భూతాని
పర్జన్యా దన్నసంభవః,
యజ్ఞాద్భవతి పర్జన్యో
యజ్ఞః కర్మసముద్భవః'

—భగవద్గీతా. తృతీయ. 14.

'విద్యావినయునందు విప్రునందైనఁ
గుంజరమందైన గోవునందైన
శ్వానమందైన శ్వపాకునందయిన
సమదర్శనంబుతో జ్ఞానులుండెదరు'

—కర్మసన్న్యాసయోగము, అధ్యా. 5, ప. 18.

ఈ పై పంక్తులు క్రింది శ్లోకమున కనువాదము :

'విద్యావినయసంపన్నే
బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ
పండితా స్సమదర్శినః' —పైది, పంచ. 18.

'ఏఱుల పలునీరు లెట్టుల వేగ
సంద్రంబునే చేరఁజనియెదునట్లు

వీరలు నరలోకవీరులు మీదు
వ్రేగుమోములను బ్రవేశించువారు'
—విశ్వరూపసందర్శనయోగము, అధ్యా. 11, ప. 28.

మీఁది పంక్తులు క్రింది శ్లోకమునకు భాషాంతరీకరణము :

'యథా నదీనాం బహవోఽంబువేగా
స్సముద్ర మేవాభిముఖా ద్రవంతి,
తథా తవామీ నరలోకవీరా
విశంతి వక్త్రాణ్యభివిజ్వలంతి' —వైది. ఏకాదశ. 28.

పార్థసారథిరాయణింగారి మఱియొకరచన కమలాకల్యాణము. ఇది యాంగ్లమునందు షేక్స్పియర్ మహాకవి సంతరించిన 'ప్వెల్ఫ్త్ నైట్' నాటకమునకు స్వేచ్ఛానువాదము. మూలకర్త యభిప్రాయము చెడకుండ తెలుఁగు నుడికారమునకును, తెలుఁగు వాతావరణమునకును దూరముగాకుండ ననువాదము సాఁగినది. ఇది ప్రతిపదభాషాంతరీకరణముకాదు. ఇది రాజాగారి చిన్ననాఁటి రచన. బాల్యోత్సాహము ప్రాబల్యమువలన నానావిధవృత్తముల నిందుఁబొందు పఱిచిరి. బాల్యమువలన పాదపూరణపదములుకొన్ని ప్రవేశించినవని రచయితలే స్వయముగా నంగీకరించిరి. 1892 లో పట్టపరీక్షకుఁజదువుచు సంధానించిన కృతియిది. నాటకమునందలి పాత్రముల సంభాషణము చాలతావుల పద్యముల లోనే సాఁగినది. ఇది యయిదంకముల రూపకము.

సత్యాకృష్ణసమాగమమను వీరి రచన చిన్నారి పొన్నారి చిఱుత కూఁకటి నాఁటిది. దీని రచనాకాలము 1888. ప్రథమపరీక్షకు పఠనీయగ్రంథమయిన గోల్డుస్మిత్ 'వికార్ ఆఫ్ ది వేక్ఫీల్డ్' కృతియందలి 'ది హర్మిట్' అను ఏకాంశమును స్వీకరించి 'సత్యాకృష్ణసమాగమము' అనుపేర నూటనలువది యాఱు పంక్తుల ద్విపదకావ్యముగాఁ గూర్చిరి. అలఁతియలఁతిపలుకులతో రూపొందిన లఘుకృతి యిది.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. తెలుగువిజ్ఞానసర్వస్వము, సంపుటము 3.
2. మాగంటి బాపినీడు, ఆంధ్రసర్వస్వము.
3. ఆంధ్రపత్రిక, సంవత్సరాది సంచికలు.
4. గ్రంథాలయ సర్వస్వసంచికలు.
5. V.L. Sastri, Encyclopaedia of the Madras Presidency and the Adjacent States, pp. 439–442.
6. Andhra University Annual Register, 1937–38.

# పాపన్నపేట

## ప్రవేశిక

ఇది చాల పురాతనమయిన సంస్థానమనియు నిజామురాష్ట్రమునందలి యన్నిసంస్థానములకంటె అధికవిస్తీర్ణము కలిగియుండినదనియు చరిత్రకారుల యభిప్రాయము. ఈ సంస్థానము ఫిరోజిషాచక్రవర్తి కాలమున స్థాపింపఁబడినట్లు మెదకురాజుల రికార్డులు, వంశవృక్షావళి మున్నగువానివలనఁ దెలియుచున్నదఁట.* నేఁటి మెదకుమండలమంతయు పూర్వ మీ సంస్థానముగా నుండెడిది. కాని యిటీవల నంతరించిన యీ సంస్థానము నేఁటి మెదకుమండలములోని చిన్న సీమకు పరిమితమై యుండినది. ఔరంగజేబు పాదుషా హయాముదాఁక నీ సంస్థానము చెక్కుచెదరకుండ నుండినదఁట. దీనికి మెదకు సంస్థానమనియు వ్యవహార నామముండినది. ఆ పిమ్మట నానాఁటికి క్షీణించుచు వచ్చినది.

## సంస్థాన చరిత్రము

ఈ సంస్థానము పూర్వచరిత్రము నెఱుఁగుటకు సరియయిన యాధార సామగ్రి లభించుటలేదు. రాయబేగం రాణీ శంకరమ్మ సంస్థానపాలకులలో పంద్రెండవతరమునకుఁ జెందినది. సంస్థానపాలనమును సమర్థముగ నిర్వహించినవారిలో నీమె మొదట పేర్కొనఁదగినది. ఈమె రాజా వేంకట నరసింహారెడ్డిగారి భార్య. రాజకార్యనిర్వహణమునందును, రణతంత్ర నైపుణ్యమునందును అలనాఁటి రుద్రమాంబను, పలనాటి నాగమాంబను దలఁపించు వీరనారీమణి. పిని సంస్థానము నిజామునకు సామంతరాజ్యముగ నుండినది. ఈమె ప్రభు కార్యనిర్వహణ దీక్షాదక్షతతో పీష్వాలతో ననేక యుద్ధములుచేసి వారి నోడించి, నిజామునకు జయమును, శ్రేయమును చేకూర్చినారు. ఈమె ప్రభుభక్తికి మెచ్చి నిజామీమెకు 'రాయె బాగన్' అనఁగా 'ఆఁడుసింగమువంటి రాణి' యను బిరుదమును, పల్లకీ, మాహీమర్తబ్ మున్నగు గౌరవసూచకప్రభులాంఛనములను ప్రసాదించి సత్కరించెనఁట. 'రాయె బాగన్' అన్న బిరుదము ప్రజలవాడుకలో 'రాయబేగం'గా మాఱినది.

ఈమెకు పుత్రసంతతి లేనందున దోమకొండ సంస్థానపాలకులగు రాజన్న చౌదరి పౌత్రుఁడును, రంగవ్వ రాజరాజేశ్వరాఖ్యుల పుత్రుఁడునునగు

*డా. బి. రామరాజు, తెలుగు జానపదగేయసాహిత్యము, పు. 258.

సదాశివరెడ్డిగారిని* దత్తుతెచ్చిరి. ఈ రంగమ్మ రాణీ శంకరమ్మ చెల్లెలు. సంస్థానపాలకులలో రాజా సదాశివరెడ్డి చాలముఖ్యుఁడు. సదాశివరెడ్డికథ జానపదులగీతములలో సుప్రసిద్ధము. రాణీ శంకరమ్మ కాలమున సంస్థానము పూర్వవైభవము నందికొనుటకు ప్రయత్నించినది. పీష్వాలతోటి యుద్ధములుముగిసి. సంస్థానమున కొంతశాంతి నెలకొనిన తరువాత నీమె కాశీయాత్ర కరిగినది. ఆమె తిరిగివచ్చునప్పటికి సంస్థానమున కుట్రలుప్రబలి అధికారము పరహస్తగతమై యుండినది. రాణీ శంకరమ్మ యీ కుట్రదారుని చంపించి, సదాశివరెడ్డికి పట్టముగట్టినది. సదాశివరెడ్డి భార్యలు గద్వాలవారి యాఁడుఁబడుచులని ప్రతీతి. ఈతని భార్య రాణీ పార్వతమ్మ వీరపత్నియేగాక. రాణీ ఝాన్సీలక్ష్మీబాయిని బోలిన వీరనారీమణి. భర్తకును ఆమె శత్రువులకును జరిగిన యుద్ధములలో పార్వతమ్మ భర్తను పలుతడవలు కాపాడినది.

1795 ప్రాంతముల రాజ్యకాంక్షవలన నిజాముకుటుంబమున నుత్పన్నమయిన గృహచ్ఛిద్రములలో సదాశివరెడ్డి ప్రధానపాత్రమునహించి, నిజాము తనయుని పక్షముననుండి, నిజామునెదిరించి యనేకయుద్ధములుచేసి, నాలు గయిదు నెలలు నిలుపరించి, పలుతూరులు నిజాము సేనల నోడించిన మహావీరుఁడు. చివరకు మోసముచేత సదాశివరెడ్డి దంపతులను నిజాముఖైదుచేయించి చంపించినాఁడు.

మెదకు పాలకులు తమ జాగీరులలో సంగారెడ్డి, వెలమకన్నె, రామాయమ్మపేట మొదలగుచోటుల పెద్దపెద్దకోటలు కట్టించిరి. సదాశివరెడ్డి తమ్ముఁడగు సంగారెడ్డి పటంచెఱువు సంస్థానమునకు పాలకుఁడుగానుండెను. సదాశివరెడ్డి కుమారుఁడు నరసింహారెడ్డి. మెదకుసంస్థానాధీశ్వరులకు 'చార్ హజార్' మున్నగు బిరుదము లనేకములుండెడివి. ఆ తరువాత ప్రస్తుతశతాబ్దాదియందు రాజా వేంకటదుర్గారెడ్డిగారు సంస్థానపాలకులుగానుండిరి. వీరి యకాలమరణముతో సంస్థానము చిక్కులను పెక్కింటి నెదుర్కొనవలసి వచ్చినది. 1927 ప్రాంతముల కొంతకాలము సంస్థానము కోర్టు ఆఫ్ వార్డ్సు వశమున నుండినది. ఆ పిమ్మట రాజా వేంకట దుర్గారెడ్డిగారిభార్య శ్రీ రాణీ వేంకటలక్ష్మమ్మసర్‌దేశాయ్‌గారు సంస్థానపాలనమును స్వీకరించిరి. వీరి తరువాత శ్రీ రాజా రామచంద్రారెడ్డి బహద్దరుగారు సంస్థానాధీశులయిరి. ఆ పిమ్మట తక్కిన సంస్థానములతోపాటు పాపన్నపేట సంస్థానమును హైదరాబాదు రాష్ట్రమున సంలీనమయినది.

*రంగంపేటయందలి శివరంగమ్మ వృద్ధమారెడ్డి యీతని తలిదండ్రులని, మెదకు శంకరమ్మ అవ్వయని జానపదగేయము. చూ. తెలుగు జానపదగేయ సాహిత్యము, పుటలు 253-255.

## సాహిత్యపోషణము

ఈ సంస్థానపాలకుల పూర్వచరిత్రము స్పష్టముగా తెలియనందున పూర్వ యుగములందు జరిగిన సాహిత్యపోషణవివరములు తెలియరాకున్నవి. శ్రీ రాణీ వేంకటలక్ష్మమ్మసర్దేశాయిగారు కవయిత్రి. 'మనసా హరిపాదము లాశ్ర యింపుమా' యను తీరున 'హరిని ధ్యానించు (భజియించు) మానందమబ్బు మనస' అను మకుటముతో 'మానస బోధ'ను లలితపదకలితశైలిలో వ్రాసిన మాననీయ ఈమె. మాదిరికి కొన్నిపద్యములను దిలకింపుఁడు :

'అంగమాయిది కడు క్షణభంగురంబు
సంపదది యెన్న మిగుల చంచలముగాంచఁ
గాలుఁడు సమీపవర్తియై కాచుచుండు
హరిని ధ్యానించు మానందమబ్బు మనస'
'బాహ్యశత్రు జయంబునఁ బ్రాభవంబు
గలుగదెప్పుడు జగతి నిక్కమ్ము సుమ్మి
యెదుగు కామాది షడ్వర్గ మదిమి భక్తి
హరిని భజియించు మానందమబ్బు మనస'
'సారమేలేని సంసారసాగరమున
మునిఁగి పుట్టుచు గిట్టుచు మోహమొంది
దరిని గానవు, నీ బాట నెఱుఁగలేవు
హరిని ధ్యానించు మానందమబ్బు మనస'
'బలవదింద్రియ నిగ్రహపరతఁ గల్గి
వీతరాగాత్మయుతమవై వెలసి, దంభ
వృత్తిఁ బోనాడి, విమలసద్వృత్తిచేత
హరిని భజియించు మానందమబ్బు మనస!'

పీళ్ఘానా శంకరరాయకవి పాపన్నపేట సంస్థానమువారి యాశ్రితుఁడు. ఈయనరచన 'సుజ్ఞానదీపమను గురుగీతలు', స్కాందపురాణము ఉత్తర ఖండమునందలి ఉమామహేశ్వరసంవాదమను గురుగీతలకును, గుర్వష్టక శ్లోకములకును, భ్రాంతిరహితశ్లోకములకును టీకాతాత్పర్యములు ,గురుసేవా పద్ధతిని వ్రాయఁబడిన రచనమిది. పాపన్నపేట సంస్థానాధీశ్వరియగు రాణీ వేంకటలక్ష్మమ్మ సర్ దేశాయి మెదక్ సంస్థానాధీశ్వరులుగారి యనుమతిని గద్వాల చెన్నకేశవ ముద్రాశాలలో 1941 లో నీ గ్రంథము ముద్రితము. కవి, భాగవతుల కృష్ణదేశికప్రభుస్వాముల వారిశిష్యుఁడు.

ఆధునికులగు చిదిరె లక్ష్మణశాస్త్రిగారు మెదకుసంస్థానాధీశ్వరిచరిత్ర వ్రాసిరఁట! ఇది అముద్రితమని తెలియుచున్నది (మా. గో. సం., పు. 368).

శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు మూర్తికవి కావ్యాలంకార సంగ్రహమునకు సంతరించిన విపులవ్యాఖ్యావివరణగ్రంథప్రచురణమునకు పాపన్నపేట సంస్థానాధీశ్వరులు శ్రీ రాజా రామచంద్రారెడ్డిబహద్దరువారు ముఖ్యదాతలు.

## ఉపజీవ్య గ్రంథసూచి


1. సురవరము ప్రతాపరెడ్డి, నిజామురాష్ట్రములోని ఆంధ్రసంస్థానములచరిత్ర, శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయ రజతోత్సవసంచిక, పుటలు 45, 46.

2. డా. బిరుదురాజు రామరాజు, తెలుగు జానపద గేయసాహిత్యము, పుటలు 253—261.

3. సురవరము ప్రతాపరెడ్డి, గోలకొండ కవులసంచిక, పుటలు 143, 368, 369.

4. ఆదిపూడి ప్రభాకరకవి, ఉమాపత్యభ్యుదయము.

# పాలకొండ

## ప్రవేశిక

ఇది శ్రీకాకుళమండలములోని ప్రాచీనమైన కొండజమీందారీలలో నొకటి. సర్క్యూటుకమిటీ విచారణముకాలమున పాలకొండజమీందారు విజయనగరము జమీందారునకు లోఁబడియుండి యుద్ధసమయములలో సేనలతో తోడ్పడుటయేగాక సాలీనా 52 వేలు కప్పము చెల్లించుచుండెను. ఈ సంస్థానమున 108 జిరాయితీగ్రామములు, 68 మొఖాసాగ్రామములు, 49 అగ్రహారములు నుండినవి. ఇదికూడ తక్కిన కొండజమీందారీలవలె జయపురమునాశ్రయమున రూపొందినట్టి సంస్థానము. ఏ చెడ్డగడియలో నీ సంస్థానమవతరించినదో కాని, అవతరించిననాఁటినుండి దీని నరిష్టము లనేకము లావరించి పీడించి అంతరింపఁ జేసినవి. పట్టుమని పదియేండ్లు ఏ పాలకుఁడుగూడ దీనిని పాలింపలేదు. పాలించినను పరిసరరాజన్యులతోడి కలహములు, గృహచ్ఛిద్రములువంటివి అడుగడుగున పాలకొండను పట్టి పాలార్చినవి. రాఁబడి 77 వేలు: పేష్కషు 55 వేలు.

## సంస్థాన చరిత్రము

పాలకులు కోదు లేక జాతాపు అను కొండజాతమువారు*. జయపురము రాజాగారగు విశ్వంభరదేవుగారు (1672–1676) ఈ కుటుంబమువారి మూల పురుషుఁడయిన 'దన్నాయి' యనువాని కుమారుని నరేంద్రనాయఁ డను బిరుదముతో పాలకొండ వీరఘట్టములకు జమీందారుని గావించెను. వీరు ధనుర్విద్యలో నేకలవ్యుని మించినవారు.

'....ఒక కోదువిల్కాని కొసఁగెఁ బాల్కొండఁ గృపన
రేంద్రరా వని విశ్వంభరేశ్వరుండు' —ప్రభాసశాప.

తిరుగుబాటుస్వభావముగల నౌకరును లోఁబఱుచుటకు సాయముకోరినప్పు డీ జమీందారులు విజయనగరము పూసపాటివారి యాశ్రయమునఁ జేరుట జరిగినది. అందువలన వీరు కొండజమీందారుల తిరుగుబాటులోఁ జేరలేదు. 1794లో పాలకొండ జమీందారగు విజయరామరాజు మూఁడేండ్లపాటు కుంఫిణీ ప్రభుత్వముపై పితూరీ జరిగించుటవలన అధికారమునుండి ఆయనను తప్పించి

* 'ఏవం స్థితే విజయనగర్యాః పంచయోజనదూరేస్థితస్య పాలకొండనామక కిరాత సామంత రాజ్యస్య....' —శ్రీరామచంద్రకథామృతేతిహాసపీఠిక, పు. ౫.

1796 లో ఆయనకుమారుఁడగు సీతారామరాజుగారికి సంస్థానమునిచ్చివేయుట జరిగినది. సీతారామరాజు 1798 లో కాలముచేసినందున ఆయనసోదరుఁడగు వెంకటపతిరాజుగారికి జమీ సంక్రమించినది. సీతారామరాజు తండ్రియును, పదభ్రష్టుఁడునునగు విజయరామరాజు కొంతసేనను ప్రోవుచేసికొని, తన తిరుగుబాటునకు వీరఘట్టమును కేంద్రముగా నేర్పఱచికొని అరాజకపర్వములను మొదలుపెట్టెను. కుంఫిణీసేనలకు చిక్కక విజయరామరాజు తప్పించుకొని మన్యములలో సంచరించుచు నాగపురము పాఱిపోయెను. ఆ నాఁటికి వెంకటపతి రాజు తొమ్మిదేండ్లవాఁడు. ఎల్లుమహంతి పరశురామపాత్రుఁడు దివానుగా నుండెను. వెంకటపతిరాజుగారితోడనే 1803 లో శాశ్వతపరిష్కారము జరిగినది.

వెంకటపతిరాజు దుబారా మానిసి; విషయలోలుఁడు. పేష్కషు సక్రమముగా చెల్లింపనందున జమీందారీ తఱుచుగా జప్తునకు వచ్చుటయు, దివాను జామీనువలన తిరిగి విడుదలయగుటయు జరుగుచుండినది. రాజునకు, దివానునకు కలఁతలు పుట్టినవి. విశ్వాసపాత్రుఁడైన దివాను జగన్నాథపాత్రుని, దివానుసోదరుని రాజాగారి మొఖాసాదారుఁడు వెంకటరాయఁడు, అతని మేనల్లుఁడు పాపారాయఁడు సాయుధసేనతోవచ్చి 1828 లో హత్యగావించిరి. ముక్కోపి రాజునకు మొండిప్రజలు. చపలచిత్తుఁడయిన రాజునకు జమీందారీ మీఁద పట్టు తప్పిపోయినది. తిరుగుబాటులు, దోపిడులు విచ్చలవిడిగ జరుగుచుండినవి. ఇట్లు సంస్థానము వేడిమంగలమువలె వేగుచుండ 1828 అక్టోబరునెలలో వెంకటపతిరాజు మరణించెను.

వెంకటపతిరాజునకు కూర్మరాజునరేంద్రరావు, విజయరామరాజు నరేంద్రరావు, నీలాద్రిరాజు నరేంద్రరావు అని ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు, ఎనిమిదిమంది భార్యలు ఉండిరి. ఈ భార్యలలో తాళికట్టినవారు తక్కువ. పెద్దలక్ష్మీనరసయ్యమాత్రము ఈతని తాళికట్టినభార్య. పెద్దజగ్గయ్య ఒక వేశ్య. సీతయ్య, చామలయ్య, చిన్నజగ్గయ్య, సుందరయ్య తెలుఁగువారు. వెంకటలక్ష్మయ్య యొక రైతుబిడ్డ. సుభద్రయ్య కమసాలికులమునకుఁ జెందినది. పట్టమహిషికి సంతతిలేదు. పెద్దకుమారుఁడైన కూర్మరాజు వారకాంత యగు పెద్దజగ్గయ్యకుమారుఁడు. రెండవకుమారుఁడగు విజయరామరాజు చిన్న జగ్గయ్యకుమారుఁడు. మూఁడవకుమారుఁడైన నీలాద్రిరాజు వెంకటలక్ష్మయ్యకు పుట్టినవాఁడు.

వెంకటపతిరాజుమరణముతో సంస్థానాధిపత్యమునకు తగాదాలు మొదలైనవి. పెద్దకుమారుఁడగు కూర్మరాజునే కుంఫిణీవారు 1829 లో వారసునిగా గుర్తించి రాజాగారి వితంతుభార్యయగు చామలయ్యను ఎస్టేటుమేనేజరుగా నియమించి సంస్థానపాలనమును కోర్ట్ ఆఫ్ వార్డ్సు వశమొనర్చిరి. మైనరు జమీందారగు కూర్మరాజునకును, మేనేజరుగానుండిన చామలయ్యకును సరిపడ

లేదు. తక్కిన తల్లులందఱును జగడగొండులు. వీరు ఎవరికివారే యమునాతీరే బాపతు. వీరికి విడివిడిగా మొఖాసాదారులయు, ముఠాదారులయు మద్దత్తుండినది. ఆ పిమ్మట పద్మనాభాచార్యులను సతనిని గార్డియన్‌గా నియమించిరి. కాని వీరి యంతఃకలహములు పరాకాష్ఠనుబొంది జమీందారీ యంతటను అల్లరులు, అరాజకచర్యలు అధికమైనవి. 1831 లో కూర్మరాజునకు ప్రాజ్ఞతవచ్చునరికి 93 వేల పేష్కషు పైకము బకాయిపడినది. పేష్కషు చెల్లనందునను, పితూరీలు పెచ్చుపెరిగినందునను 1837 లో కూర్మరాజును జమీనుండి తప్పించి సంస్థానమును 1846 దాఁక కలెక్టరు అజమాయిషీలో నుంచిరి. 1846 నుండియీ జమీందారీని హోంజరం తాలూకాతోపాటు లక్ష పదివేలకు ఆర్బత్‌నాట్ కంపెనీ. కవులున కిచ్చుచువచ్చిరి. మఱి కొంతకాలమునకు ప్రభుత్వవశమునకు వచ్చినది.

తుదకు కుంఫిణీవారు పాలకొండ జమీందారు కుటుంబమునుకి పరివారములోని ముఖ్యులను మొత్తము 19 మందిని చెఱపట్టి ఉత్తరార్కాడు మండలమందలి రాయవేలూరు దుర్గమున నిర్బంధములో నుంచిరి. కూర్మ రాజునకు మొదట మరణశిక్షనువిధించిరి కాని, యాపిమ్మట యావజ్జీవ కారాగారవాసశిక్షగా స్థిరపఱిచి యతనిని, ఆతని తల్లి పెద్దజగ్గయ్యను గుత్తి కోటలోను, విజయరామరాజు మొదలైన తక్కినవారిని రాయవేలూరు కోటలోను నివసించునట్లు గట్టి కట్టడచేసిరి. 1843 లో కూర్మరాజు గుత్తిదుర్గమునందే మరణించెను. 1844 లో నీలాద్రిరాజు రాయవేలూరులో మరణించెను. 1869 లో మద్రాసుగవర్నరు నేపియర్ ప్రభువు రాయవేలూరును దర్శించినపుడు పాలకొండ పాలక కుటుంబమును పరామర్శించి విజయరామరాజు రాయ వేలూరుకోటలో నిర్బంధమున నుండనక్కఱలేదనియు, కృష్ణానదికి దక్షిణమున నెచ్చటనైనను నిచ్చవచ్చినట్లు సంచరింపవచ్చుననియు ఉత్తర్వులు దయ చేయించెను. కాని విజయరామరాజు నూటికో కోటికో చెన్నపట్టణమునకుఁదప్ప మఱియెచ్చటకును బోలేదు. అతని సవతితల్లి సుభద్రయ్య, సవతిచెల్లెలు చంద్రయ్యమ్మ కూడ అతనితో నుండిరి. విజయరామరాజు నెల భరణము రూ. 17 న్నర నుండి రూ. 250 లకు పెంచిరి*. పాలకొండ జమీందారీ కుటుంబము ఇరువదియవ శతాబ్దము వెలుగును చూడనే లేదు. రాయవేలూరు కోటయందే వీరి వంశమంతరించినది.

## సాహిత్యపోషణము

పదునెనిమిదవ శతాబ్దిలో పాలకొండను పాలించిన రామభద్ర రాజు సాహిత్యపోషకుఁడు. పురిజాల లక్ష్మీనారాయణ దాస కవి రచించిన పారిజాత మను యక్షగానకృతి రామభద్రరాజునకుఁ గృతి యీఁబడినది. కవి కాశ్యప

*M.A.M.P., Vol. I, Political Pensioners, p. 4.

గోత్రుఁడు, పాపయరాజామాత్య పౌత్రుఁడు, అనంతమాంబానాగయామాత్యుల పుత్రుఁడు, తిరుమల తాతాచార్యుల శిష్యుఁడు. వేంకటేశ్వరవరప్రసాదలబ్ధ కవితావైభవుఁడగు నీ కవి—

'పాలకొండాన్వయుఁడు రామభద్రనృపతి
నన్నుఁదగి నట్టి సంభావనలను దనిపి
కృష్ణునకుఁబారిజాత మంకితమొసర్చి
చెప్పుమన యక్షగాన మేఁజేసి తిట్టు'

అని కృత్యవతరణికలో నేతద్గ్రంథావతరణగాథను వివరించినాఁడు. కీ॥శే॥ రామభద్ర నృపతి ప్రేరణమున రచితమైన యీకృతి అముద్రితము. ప్రాచ్య లిఖితపుస్తకభాండాగారమున దీని తాళపత్రప్రతి ఆర్. నం. 438 గా నున్నది. ఇందన్యదేశ్యములు కొల్లలుగా నుపయుక్తము లయియున్నవి.

అడిదము సూరకవి చాటువులలో ఈ రామభద్రనృపతి బహువారములు పేర్కొనఁబడినాఁడు. సూరకవి చాటువులు కొన్ని. సస్యశ్యామలమగు పాలకొండ సీమను గురించి సూరకవి చెప్పిన పద్యమిది :

క్షేమాకర్ణ వికీర్ణ ధామములు నక్షీణేక్షుకంభాటపీ
స్తోమంబుల్ బహుశాలిధాన్యతతు లెచ్చోటన్ నదీమాతృక
గ్రామంబుల్ బహుళాగ్రహారము లనేకంబులు ధరన్ జూడఁగా
క్షామంబన్నది లేదు క్షీరగిరిదేశంబందు నెందేనియున్'

—చాటుపద్యమణిమంజరి, పు. 40.

'....మన్నె దేశముల్ దిరిగి సమస్త వస్తువులు దెచ్చి భుజించు' చుండిన అడిదము సూరకవి అడుగుపెట్టని మన్నెదేశ మానాఁడులేదు. సూరకవి పాలకొండ ప్రభువు రామభద్రనృపుని గురించిచెప్పిన చాటువులు మఱికొన్ని చూడుఁడు :

'రాజా జారుఁడు, మంత్రి నిర్దయుఁడు, నీ రాష్ట్రింబులోఁబెద్దలా
కోజుల్ కొండలు, జీవహింసకును సంకోచింప, రెవ్వారికిన్
దాజీ మీయరు పాలకొండపురిలో దాక్షిణ్య శూన్యత్వ మీ
ఫాజీ పట్టణమేల వచ్చితిని నా పాపంబు సర్వేశ్వరా'

—పైది, పుటలు 39, 40.

ఇఁక పాలకొండ పాలకుని పరివారమును గురించి చెప్పినపద్యము :

'నరసింగుండును వెంకుపాత్రుఁడును గృష్ణాపాత్రుఁడున్ నాయుఁడున్
శరభాపాత్రుఁడు పాలకొండ ధరణీ సామ్రాజ్యధౌరేయులై
ధర వర్ధిల్లెడు రామభద్రనృపు నాస్థానంబునం బంచముల్
చిరకాలంబుగ వీరి వెంటఁ దిరుగన్ జీ చీ మనంబొప్పునే'

—పైది, పు. 40.

ఇట్లు నిర్భయముగా రాజులను, రాజపరివారమును చెడఁదిట్టిన కవులు చాలతక్కువ.

పాలకొండ జమీందారుగారు సుప్రసిద్ధపండితకుటుంబమగు నడిమింటి వారికి 'కందిశ' యను నగ్రహారమును దయచేయించియుండిరి. కురుపాం సంస్థానాధీశ్వరుల కోరికమీఁద నడిమింటివారి కుటుంబము కోనసీమనుండి నాగావళీతీరమునకు వచ్చియుండినది. నాఁటి కొండజమీందారు లనేకులు ఈ కుటుంబమువారి ప్రతిభాపాండిత్యములకు భరపడియో, వారికిఁగల శాపానుగ్రహాదిశక్తులకు భయపడియో అనేకాగ్రహారములను సమర్పించియుండిరి. నడిమింటి పేరుచయనులుగారు తర్కపండితులు. వీరి కుమారులు సర్వమంగళేశ్వరశాస్త్రిగారు ఆసేతుశీతనగము ప్రసిద్ధివహించిన మహాపండితులు. సర్వమంగళేశ్వరశాస్త్రిగారి పుత్రులు భగవత్పతంజలిశాస్త్రిగారు నేపాలు మహారాజాస్థానమునందు మన్ననలను బడసిన మహామనీషి.

సర్వమంగళేశ్వరశాస్త్రిగారి చాటువులలో పాలకొండ జమీందారీకి సంబంధించినవికూడ కలవు. ఉదాహరణమున కొకచాటువు:

'రుక్కయ్యాత్కయ్యమాపాద్య భయం కమలనాభమేత్
రంగయ్యాచ్చ గయామేతి న సీతారామభూపతి.'

రుక్కయ్య, కమలనాభయ్య, రంగయ్య అను ముగ్గురును పాలకొండ జమీందారు సీతారామరాజుగారియొద్ద దివానులుగనుండిరి. వీరు తెచ్చిపెట్టిన అనావశ్యక కలహముల మూలమున రస్సెల్ దొరగారు ఏపాపమెఱుఁగని జమీందారుగారిని పితూరీదారునిగా ఖైదుచేసి జమీందారీని వశపఱచికొనుట జరిగినది.

పాలకొండ జమీందారులు నిర్మించిన కూర్మరాజపురాగ్రహారమునందలి విష్ణ్వాలయమునందు ద్రావిడ వేదప్రవచనపరులైన శ్రీ వైష్ణవ పండితులనేకులుండిరి. విద్వత్కవి ముడుంబ నరసింహాచార్యస్వామి (1841–1927) వారి పితామహులగు రాఘవాచార్యులకు పాలకొండ జమీందారులు గృహభూదానము లొసఁగి సత్కరించియుండిరి*.

పాలకొండ దివానుల కుదురునకుచెందిన ఎల్లుమహంతి భద్రయ్య పాత్రులుగారి కనిష్ఠపుత్రులు ఆదినారాయణపాత్ర విరచితమగు శ్రీ వరాహుని చరిత్రమను కృతి యొకటి కన్పట్టుచున్నది. కర్త ఆంధ్రగీర్వాణాంగ్లేయ భాషా పరిజ్ఞాత. కృతి పంచమ జార్జి చక్రవర్తి ఢిల్లీ పట్టాభిషేకముహూర్తమున (12–12–1911) పట్టాభిషేకస్మృతిచిహ్నముగాఁ బ్రచురితము. శ్రీమన్నారాయణుని భక్తుఁడగు వరాహుఁడను వాని కల్పితకథ యిందలి యితివృత్తము.

*మేదేపల్లి వేంకటరమణాచార్యులు, విద్వత్కవి ముడుంబ నరసింహాచార్యస్వామి వారి చరిత్రము, భారతి, 1930, ఏప్రిల్, పుటలు 641–650; శ్రీరామచంద్ర కథామృతేతిహాస పీఠిక, పు. 5.

పూర్వకవి కృతపద్యములిందు యథాసందర్భములం దుదాహరింపఁబడినవి. హరికథా కాలక్షేపమున కనువుగా పాటలతో, పద్యములతోఁ దీర్పఁబడినది.

## ఉపజీవ్య గ్రంథసూచి


1. విశాఖపట్టణము జిల్లా వృత్తాంతసంగ్రహము, పుటలు 416—418; 565—570.

2. నిడుదవోలు వేంకటరావు, ఆంధ్రసంస్థానములు — సాహిత్యసేవ, తెలుగు విజ్ఞానసర్వస్వము 3, పుటలు 1171—1175.

3. కవికొండల వేంకటసత్యనారాయణమూర్తి, విశాఖమండలచరిత్రము, కాకినాడ ముద్రాక్షరశాల, కాకినాడ, 1927, పుటలు 171—176.

4. అడిదము సూరకవి చాటువులు.

5. M. A. M. P. Vol. I.

# పాల్వంచ - భద్రాచలము

## ప్రవేశిక

పాల్వంచ పూర్వనామము శంకరగిరి. ఇది వరంగల్లు మండలములోని ఆగ్నేయభాగమునందలి ఆఱుతాలూకాలతోఁగూడిన సంస్థానము. వైశాల్యము 800 చ.మై. జనాభా 40 వేలు. ఆదాయము 70 వేలు. నిజామున కిది సామంత రాజ్యము. దేశముఖి రుసుముక్రింద ఈ సంస్థానాధిపతులకు నిజామునుండి సాలీనా నాలుగైదువేల రూపాయల రాఁబడి యుండెడిది. వెనుకటి గోదావరీ మండలములోని రేకపల్లి, భద్రాచల సంస్థానములను పాల్వంచ జమీందారులకు చెందినవి. భద్రాచలము తొలుత హైదరాబాదు రాష్ట్రములోని భాగము. 1860 లో బ్రిటీషు ప్రభుత్వమునకు దత్తముచేయఁబడి మధ్యరాష్ట్రముల (Central Provinces) లో చేరియుండినది. 1874 లో చెన్నపురిరాష్ట్రమున చేర్పఁబడి గోదావరిమండలమునందలి ఏజెన్సీప్రాంతములోని ఒక తాలూకాగా ప్రవర్తిత మయినది. ఈ సంస్థానభాగమునందలి కొన్నిపల్లెలు బ్రిటీషుప్రభుత్వము నధీనమున నుండినవి. 1935 లో దీని పేష్కషు పదునెనిమిదివేలుండినది. ఈ యన్నింటివలన నీ జమీందారులకు సాలుసరి ఆఱులక్షల ఆదాయముండినది. ఇందులో నించుమించు నలువదియైదువేల కప్పము నిజామునకు చెల్లింపఁబడు చుండెడిది. ఈ సంస్థానమును అశ్వారావు అనుబిరుదముకల వెలమవంశీయులు పాలించిరి. నడుమంతరముగ అనేకకారణములవలన కందిమళ్ళ, జలగం, తాండ్ర, దామర, ముత్యాల మున్నగు వంశములవారును ఈ సంస్థానమును పాలించిరి. చాలకాలము పాల్వంచయే ఈ సంస్థానమునకు రాజధాని. కొంత కాలము భద్రాచలము రాజనివాసము, ఆ పిమ్మట అశ్వారావుపేట జమీందారుల నివాసము. అనంతరకాలమున ఎనిమిదివేల పేష్కషుకలిగిన రేకపల్లి ఎస్టేటు సూరెడ్డివంశీయులకు దఖలుపడినది. రేకపల్లికి రెండుమైళ్ళ దూరమునఁగల వడ్డిగూడెము సివారులలోని వరరామచంద్రపురము రేకపల్లి ఎస్టేటుదారుల వాసస్థలము.

## సంస్థాన చరిత్రము

'హరిచరణారవిందమందునింపొందు శౌర్యధైర్యాదిగుణములకు నిదాన మైన పద్మనాయకకులంబు' (హృదయాభిరామము, 1—16) నందు జన్మించిన రెబ్బదిమేడుగోత్రములకుఁ జెందిన వెలమవారిలో ఈ సంస్థానాధీశు లొకకోవకుఁ

జేరినవారు. 'గడిదేటి కాకతిగణపతిఁ గొలిచియు నిలనేలుప్రభువు లీ వెలమ వారు'. కాకతిప్రతాపరుద్రుని మన్ననలను బొంది అశ్వారావు బిరుదును స్వీకరించిన ఒక వెలమవీరుని సంతతివా రీ సంస్థానాధిపతులు. వీరిపూర్వులలో నొకఁడగు అన్నప్ప అశ్వారావు క్రీ.శ. 1324 లో తామర్లేనుకాలమున శంకరగిరి, హసనాబాదు పరగణాలతో కూడిన ఈ ప్రాంతమునకు పాలకుఁడుగా నుండెనఁట. ఇట్లు నాఁటినుండి క్రీ.శ. 1698 దాఁక పదునెనిమిదితరములు వీరు స్వతంత్రులుగా పాలించిరఁట! పిమ్మట మొగలుపాదుషా ఔరంగజేబుకాలమున పాదుషాకు సాయపడి వీరి పూర్వుఁడొకడు బాద్‌షాహీ మన్సబ్‌దార్ పదవినిఁ బొందెనఁట! క్రీ.శ. 1769 లో మొగలుసేనాని జఫర్ ఉద్‌దౌలా యనువాఁడు నాఁటిపాలకుఁడగు నరసింహ అశ్వారావును చంపి సంస్థానమును కొల్లగొట్టెనఁట! పూర్వసార్వభౌములొసఁగిన సన్నదులు, రాగిరేకులమీఁది పట్టాలు ఈ దోఁపిడిలో నంతరించినవఁట! ఆ పిమ్మట సంస్థానము నిజామునకు సామంతరాజ్యమైనది. రాజా నరసింహ అశ్వారావు తరువాత రామచంద్ర అశ్వారావు పోయిన ఎస్టేటును సంపాదించి ఒకయేఁడు పాలించెను. ఆ తరువాత అన్నప్ప అశ్వారావునకు ఇరువదియొకటవతరమువాఁడగు వెంకటరామ నరసింహ అశ్వారావు 1798 లో మీర్ నిజామలీఖాన్ బహద్దరుగారినుండి రాజా బహద్దరు, నవై మన్సబ్‌దార్ బిరుదులను, జండా నగారా నౌబత్తులను, రెండువేల అశ్వికసేన, మూఁడువేల కాల్బలము ఉంచికొనుటకు అనుమతిని సంపాదించెను.

తరువాతిపాలకుఁడు నరసింహ అశ్వారావు. ఇతనికి అయిదుగురు సంతానము; ముగ్గురు కొడుకులు, ఇద్దరు పుత్రికలు. వీరందఱును మైనరులు. రాజాగారు చనిపోయినపిమ్మట సెట్టిపల్లివారు సంస్థానముహక్కుకోసము వీరితో తగాదాకు దిగిరి. క్రీ.శ. 1800 నుండి 1858 దాఁక గృహచ్ఛిద్రములు, జ్ఞాతికలహములతో సంస్థానము క్షీణముఖము పట్టినది. కాని వెనుకటి రాజాగారి కుమారులగు రాజా శ్రీ సీతారామచంద్ర నవై అశ్వారావు బహద్దరుగారు సర్ సాలార్‌జంగ్‌బహద్దరుగారి సాయముతో ఈ తగాదాలనుండి బైటపడి జమీని కొంతకాలము పాలించిరి. ఇతనికాలమున సంస్థానము అప్పులపాలై ఋణదాతలకు తనఖాపడినది. ఇతనికాలముననే గోదావరికి ఎడమగట్టునఁగల రేకపల్లి, భద్రాచలము ప్రాంతములను నిజాము బ్రిటీషుప్రభుత్వమునకు ధారాదత్తము గావించినది. సీతారామచంద్ర అశ్వారావు అవివాహితుఁడుగానే మరణించెను. ఇతనితల్లి రాణీ లక్ష్మీనరసయ్యమ్మారావుగారిపేరున సంస్థానపాలనము కొంతకాలము నిర్వహింపఁబడినది. సంస్థానమును తాకట్టుపెట్టికొనిన ఋణదాత పంద్రెండేండ్లపాటు శిస్తులను వసూలుచేసికొనుచు గడువుదాఁటిన పిమ్మట దావావేసి విజయమునుపొంది ఆఱులక్షల రూపాయలకు మొత్తము సంస్థానమును దఖలుపఱిచికొనెను. ఇందులో నిజాము మూఁడులక్షలు నగదుగా

ఋణదాతకు చెల్లించి సంస్థానభాగమును కొంత వశపఱచికొనెను. తక్కిన మూఁడులక్షల బకాయిక్రింద మల్లూరు, రామానుజవరభాగములు ఋణదాత పేర నమోదు కావింపఁబడినవి. ఈ వ్యాజ్యముల సందర్భమునందే రాణీ లక్ష్మీనరసయ్యమ్మారావుగారు 1875 లో మరణించిరి.

రాణీ లక్ష్మీనరసయ్యమ్మారావుగారి దౌహిత్రులు పార్థసారథి అప్పారావు సవై అశ్వారావు బహద్దరుగారు రాణిగారి మరణమునకు పూర్వమే సంస్థానమునకు దత్తులు. వీరు నూజివీటి అప్పారాయకుటుంబమునకు చెందినవారు. '....శ్రీగణపత్యభిఖ్యరాజేంద్ర వరూథినీసుభటబృందనిషేవిత దండనాథుఁడై....' (హృదయాభిరామము, 1–17) న బసవనాఖ్యుఁడు నూజివీటిప్రభువులకు మూలపురుషుఁడు. ఈతని సంతతివారు కాకతీయచక్రవర్తులఁ గొలిచి కాకలుదీఱిన మేలాంగవీరులు. పద్మనాయక కులోత్తంసులగు డెబ్బదియేడుగురు నాయకులు కాకతిచక్రవర్తికి అంగరక్షకులుగనుండిరి. వీరిలో నూజివీటివారు విప్పర్ల గోత్రమువారు. వీరిలో మేకావారిది మేటికుటుంబము. వీరికోవలో నొకరు నూజివీడుకోటను గట్టిరి. అప్పారావుబిరుదాంకితులలో మొదటివాఁడైన అప్పన్న ఈ వంశమునందు గొప్పవాఁడు.

'వీరాగ్రేసరు నప్పనాఖ్యప్రతిభన్ వేనోళ్ళ శ్లాఘించుచున్
బ్రారంభంబునఁ జాందబీబి విజయప్రఖ్యాత చిహ్నంబిడెన్
వైరిశ్రేష్ఠుఁడె ఇబ్రహీమొసఁగె నప్పారాయఁ డన్సంజ్ఞ న
వ్వారిన్ దత్కులజుల్ తదాది గని రప్పారాయ నామంబునన్'
—హృదయాభిరామము, 1–21.

'ఆ మహనీయవంశమున నంచితశీలుఁడు పొల్చె భోగసుత్రాముఁడు పార్థసారథి ధరాతలనాథుఁడు....వంశకర్తయై' (పైది, 1–32). ఈ పార్థసారథి అప్పారావుగారు నవాబులనుండి విజయఅప్పారావు అను బిరుదములనందిన వెంకయ్య అప్పారావునకు పదునెనిమిదవ తరమువారును 1324 నాఁటి మూలపురుషునకు ఇరువదియెనిమిదవ తరమువారును. పార్థసారథి అప్పారావు—

'పంజ్ హజార్ సర్ఫరాజ్వంతు పాలవంచ
అందు భద్రాచలము సవై యశ్వరావు
రాజ మహబూబ్ వ బాద్షాహి ప్రముఖమైన
బిరుదముల వందిమాగధుల్ పేర్మిఁబొగడ' —పైది, 1–33.

'....శనివారపుపేట సురాజ్యలక్ష్మీ దోఃసూణములన్ ధరించి....' (పైది, 1–34) పాలించెను. ఈయనభార్య మైలవరమురాజాగారి తనయయగు సీతమాంబ. వీరికి నలుగురు కుమారులు, ఒక కూఁతురు కలిగిరి. వీరిలో పెద్దవారు నారయ అప్పారావుగారు. వీరి తమ్ములు వెంకటరామ అప్పారావుగారు. రాజా నారాయప్పారావుగారు పిఠాపురము కుమారరాజాగారి రెండవతనయయగు

అన్నపూర్ణాదేవిని పెండ్లాడిరి. వీరికి విజయాప్పారావు, ప్రతాపాప్పారావు, వేంకటనరసింహాప్పారావు అని ముగ్గురు తనయులు. పార్థసారథి అప్పారావు గారితరువాత 1932 లో వారి పెద్దకుమారులగు శ్రీ రాజా నారయ్యాప్పారావు నపై అశ్వారావు బహద్దరుగారును, ఆ పిమ్మట నారయ్యాప్పారావుగారి తనయులగు విజయ అప్పారావుగారును సంస్థానమును పాలించిరి. జమీందారీరద్దుచట్టము మేరకును, పోలీసుచర్య తరువాతి ఒడంబడికలప్రకారమును ఈ సంస్థానములు ప్రభుత్వవశమయినవి.

## సాహిత్యపోషణము

ఈ సంస్థానము పూర్వయుగమునందలి సాహిత్యపోషణమునకు సంబంధించిన యంశములేవియుఁ దెలియుటలేదు. సంస్థానము ఈ సంస్థానాధీశ్వరుల దౌహిత్రసంతతికి అనఁగా నూజివీటికోవవారికి సంక్రమించినప్పటినుండి సాహితీపోషణచరిత్రము స్పష్టముగానున్నది. నూజివీటిప్రభువులు సుప్రసిద్ధ సాహిత్యపోషకులుకదా! ఈ విషయమునే హృదయాభిరామకర్త కృతిభర్తృవంశము నభివర్ణించుచు—

'ధవుఁడై తనర్చె బసవదండనాథుఁడు
పంచతంత్రాఖ్య ప్రబంధమునకు
అధిపుఁడయ్యె నరసింహాప్పరా విందుమ
తీపరిణయనామదివ్యకృతికి
నాథుఁడయ్యెను జగన్నాథుఁడు సాహిత్య
కల్పద్రుమాభిధ గ్రంథమునకు
స్వామియయ్యెను రామచంద్రభూపుఁడు వల్లి
వీపల్లవోల్లాసవిమలకృతికి
నేఁటికి మరలఁ దాతలనాఁటి కీర్తి
నిలిపి కవులఁబోషించి కీర్తిలత దిశలఁ
బ్రాఁకఁ బ్రభుఁడయ్యె హృదయాభిరామకృతికి
త్యాగములతావు మా నృసింహాప్పరావు' (1–60) అని నిరూపించినాఁడు.

అశ్వారావుపేటప్రాంతనివాసియును, క్రీ.శ. 1700 కాలమువాఁడును పాల్వంచసంస్థానాధీశుల ఆశ్రయమును బొందినవాఁడును నగు శ్రీనాథుని వేంకటరామకవి శ్రీరామపట్టాభిషేకము లేక అశ్వారాయచరిత్రము అను గ్రంథము రచియించియున్నాఁడు. ఇందు వెలమవీరులకు ధంసాతో జరిగిన యుద్ధము వర్ణింపఁబడినది. చారిత్రకప్రాధాన్యముగల కృతియిది. అముద్రితము.

రాజా పార్థసారథి అప్పారావుగారు సాహిత్యపోషకులు. సాహిత్య విశారదబిరుదాంకితులును, ఆంధ్రవాఙ్మయసేవాసమితి నిర్వాహకులును నగు

శ్రీ కొత్తపల్లి వేంకటరామలక్ష్మీనారాయణశర్మగారు రాజాగారి పోష్యవర్గము లోనివారు. కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు వ్యాసభారతమంతయు యథామాతృకముగా ననువాదముసేయ సంకల్పించి ఆది సభాపర్వములు పూర్తి చేసి రచితభాగమును ముద్రించుట యెట్లని శ్రీమంతులను చాలమందిని దర్శించిరి. ఆ యదనున భద్రాచలసంస్థానాధీశ్వరులు రాజా శ్రీ పార్థసారథి అప్పారావుగారు కృష్ణమూర్తిశాస్త్రిగారి కయాచితముగ వేయిరూప్యములొసఁగి నాలుగైదువందల రూప్యముల విలువగల పచ్చలయుంగరమును బహూకరించి, కృష్ణమూర్తిశాస్త్రిగారు సంకల్పించిన ముద్రాలయస్థాపనకు నైతము పెద్ద విరాళమును ప్రసాదించిరి. పార్థసారథి అప్పారావుగారు '....కావ్యప్రియుఁ డార్యసన్నుతుఁడు వైష్ణవభక్తిరతుండు లాస్యవిద్యాప్రతిపాదకుండు సరసాగ్రణి....' (హృదయాభిరామము, 1—35) అని హృదయాభిరామకర్తచే కీర్తింపఁబడియున్నాఁడు. వీరికి గ్రంథాలయస్థాపనమన్నను, తన్నిర్వహణమన్నను మిక్కిలి యాదరముండెడిది. నేఁడు హైదరాబాదునందు విలసిల్లుచున్న శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయము వీరి ప్రోత్సాహమువలననే స్థాపింపఁబడినది. 1901 సెప్టెంబరు ఒకటవతేదీన రామకోటిలోని రావిచెట్టు రంగారావుగారి గృహమునందు జరిగిన పై గ్రంథాలయ స్థాపనోత్సవము రాజా శ్రీ పార్థసారథి అప్పారావుగారి యాధిపత్యమున నిర్వహింపఁబడినది. ఆమరణము శ్రీ రాజాగారు పై గ్రంథాలయపోషకులుగా నుండిరి.

పార్థసారథి అప్పారావుగారి కుమారులు నారయ్యప్పారావుగారు '....ఆగమధర్మకర్మరతుఁ డాంగ్లకళాభ్యసనుండు పాలితాభ్యాగత సంశ్రితార్థికవిపండితనాయకమండనుండు....' (హృదయాభిరామము, 1—38). ఈయన సంస్కృతాంధ్రములయందును విశారదుఁడఁట ! (చూ. పైది, 1—40). నారయ అప్పారావుగారి ముగ్గురుకుమారులలో కడగొట్టువాఁడైన వేంకటనరసింహాప్పారావు హృదయాభిరామకృతిభర్త. ఈతఁడు '....గానవిద్యా కలితాంతరంగుఁడు, వదాన్యుఁడు, ధర్మపథానుయాయి, సుశ్లోకుఁ డుదాత్తమానసుఁడు సూరిజనావన కృత్యపరీక్షకుశలుండు, సూనృతవచస్కుఁడునై పెంపొందు....' (పైది, 1—41) యుండువాఁడు. భద్రాచలము కుమారరాజా శ్రీ రాజా వేంకటనరసింహ అప్పారావుబహద్దరువారు కవియగు శిష్టా వెంకటసుబ్బయ్యగారిని తమసన్నిధికి పిలిపించి కావ్యవిషయమును విని 'ప్రచురణభారము వహింతుము, ఏ దేవునకైనను కృతియిం'డని పలుకఁగా కవి—

'హాని శ్రీనాథకవిరాజు పొగడకున్న
రాజు వీరభద్రారెడ్డి తేజమేది
పెద్దనామల గ్రంథాలు వెతలకున్నఁ
గృష్ణరాయల పేరేది కీర్తినిలయ' అని బదులిడి మీరే యేల గ్రహింప

రాదని కుమారరాజాగారిని కోరెను. అప్పుడు కుమారరాజాగారు, 'నరాంకితము నింద్యమని పోతన వచింపలేదా? రాజులకు రాజు శ్రీ మహావిష్ణువున కొసంగు' డని కవిని ప్రేరేచిరి. కాని కవి యందులకు సమ్మతింపక కావ్యరసాస్వాదన ప్రియులగు కుమారరాజాగారికే తమకృతియగు హృదయాభిరామమును గృతి యిచ్చిరి. ఇది నాలుగాశ్వాసముల శృంగారప్రబంధము. ఇతివృత్త మత్యాధునికము. అందును సాంఘికము. శూద్రకుని వసంతసేనకు వంకలుదిద్దఁగలిగిన సుగుణాలరాశియగు నొకవేశ్య కథానాయిక. చారుదత్తుని మించిన సదాచార సంపత్తిగలవాఁడు కథానాయకుఁడు. విరజాపురవాస్తవ్యుఁడగు రామయ యను బ్రాహ్మణోత్తముఁడు సుందరి యను వెలవెలఁదిని వలచి వలపింపఁజేసి కూడి మాడి సుఖించిన కథ యిది. చూడఁగాచూడఁగా మృచ్ఛకటికాచ్ఛాయలు అచ్చముగా పాత్రచిత్రణమున అచ్చుగ్రుద్దినట్టు కన్పట్టుచున్నవి. అందులకే కవి 'కేవల కల్పనంబును గేవల మిశ్రమంబును గాక కేవలసత్యంబును శృంగార రసప్రధానంబును నగు హృదయాభిరామంబను ప్రబంధరాజంబు....' (1–15) అని తన యెత్తుగడనుగూర్చి వ్యక్తీకరించినాఁడు. ప్రబంధమంతయును ప్రాచీన ఫక్కిని పకడ్బందుగా నడచినది. కథాగతికిగాని, పాత్రచిత్రణమునకుగాని అడుకనటువంటి అనావశ్యకవర్ణము లీ కృతియందు కలికమునకైనను గానరావు. మాదిరికి కొన్ని పద్యములను తిలకింపుఁడు :

'అలినీలాలకముల్ స్మితప్రచుర వక్త్రాంభోజరాజంబునున్
గులుకుంగుబ్బల యుబ్బుఁ దేనెపలుకుల్ గుత్తంపు మైడీవయున్
దిలకింపన్ బులకింపకుండుటకు నీ దేహంబు లేమంతగా
శిలలా లోహములా కఠోరకులిశశ్రేణీసమానంబులా' — 1–57.

'మగువల చూపుటంపముల మ్రగ్గనివాఁడు, మనోహరంబులౌ
మగువల మాటలన్ మరఁగి మ్రందనివాఁడు, సవిభ్రమంబులౌ
మగువల చేష్టలం దెలివిమాసి చలింపని యట్టివాఁడు ము
జ్జగముల లేఁడు లేఁడనుచు చాటరె తొల్లిట ధీమదగ్రణుల్' —2–58.

'ఎన్నఁడు శ్యామలాపురపుటింతులఁ గూడి మెలంగినారమో
యున్నతసైకతస్థలుల నొప్పులకుప్పల నాడినారమో
యెన్నఁడవన్నియున్ గనుల కిప్పుడు కట్టినయట్లు తోఁచు, నా
యన్నిటికంటె మిన్నయగు నా చెలి ప్రేమకు నుద్దియున్నదే' — 4–47.

వేశ్యాసంబంధమును వీడుమని కథానాయకున కాతని మిత్రుఁ డొకఁడు గఱపిన నీతిబోధ యందలి—

ఒకసతితోడి తృప్తిగనకుండిన నిష్టమువచ్చినంత మం
ది కుల లతాంగనామణుల ధీరతఁ బెండిలియాడరాదె నా

టకములు నర్మవాక్యములు టక్కులునున్ నయగారముల్ క్రమల్
కొకిబికిభావముల్ గలుగు క్రూరల వేశ్యలఁ గూడనేటికిన్' —3—72.

అను నీ పద్యము పాండురంగమాహాత్మ్యమునందలి —

'కామవికార మూత్మ నవగాఢత దాల్చిన యేని నిర్భర
శ్రీ మెఱయంగ రూపగుణశీల కులోన్నతి గల్గు విప్రవ
న్యామణులన్ సహస్రమయినన్ వరియించి రమించరాదె....'—3—41.

'నర్మ గర్భోక్తులు నక్కుటక్కులు వింత
నయగారములు బహునాటకములు....' (3—43) అను పద్యములకు
అనుకరణము. శ్లేషోక్తి చాతుర్యముగల యీ క్రింది పద్యమును పరిశీలింపుఁడు.
కథానాయకుఁడగు రామయతో నాయికయగు సుందరి పలికిన పలుకులివి :

'పదములందను రక్తి పరిఢవిల్లును మీకు
పదములందనురక్తి పరఁగు మాకు
అర్థ మందాసక్తి యతిశయిల్లును మీకు
నర్థమందాసక్తి యధరు మాకు
సకలకళాశాస్త్ర వికసనంబును మీకు
సకలకళాశాస్త్ర సరణి మాకు
సరసుల కామోదసరణి గూర్చుట మీకు
సరసుల కామోద సరణి మాకు
సభల రంజింపఁజేయు నాసక్తి మీకు
సభల రంజింపఁజేయు నాసక్తి మాకు
అన్నిటను మీకు మాకును నైక్యమమరఁ
గడకు శయ్యావిభాగ మేర్పడఁగనగునె' ——1—79.

ఇది కాశీ కృష్ణాచార్యుల అవధానయాత్ర యందలి క్రిందిపద్యమున
కనుకరణముగాఁ దోఁచుచున్నది :

'నూతనాలంకారభూతి మీకు మహీంద్ర
నూతనాలంకారభూతి మాకు
కువలయానందంపుఁ గొల్పు మీకు మహీంద్ర
కువలయానందంపుఁ గొల్పు మాకు
విపులార్థకోశాభివృద్ధి మీకు మహీంద్ర
విపులార్థకోశాభివృద్ధి మాకు
అఖిలరాజకరగ్రహాశ మీకు మహీంద్ర
అఖిలరాజకరగ్రహాశ మాకు
భూ సురేంద్రులు మీ రేము భూసురేంద్రు
లము సుమీ ! గాన నన్నింట సమత మీకు

మారుఁ గల దొంటఁ గనుము సమత్వబుద్ధి
పండితాళిసరోజ! గద్వాలరాజ!!'

హృదయాభిరామ కృతిభర్తయగు వేంకటనరసింహ అప్పారావుగారి యన్న గారును, పాల్వంచ — భద్రాచల సంస్థానాధీశ్వరులునగు శ్రీ రాజా విజయ అప్పారావు నవై అశ్వారావుబహద్దరువారును సాహిత్యాభిమానులు. బూర్గం పాడు, పాల్వంచ ప్రాంతములలో నెలకొనిన ఆంధ్రవాఙ్మయసమితికి విజయ అప్పారావుగారు మహారాజపోషకులు. అశ్వారావుపేటయందలి అశ్వారాయాంధ్ర భాషానిలయము ఈ సంస్థానాధీశ్వరుల భాషాభిరుచికి ప్రబలనిదర్శనము. పాల్వంచసంస్థాన విద్యాశాఖాధికారియును, ఆంధ్రవాఙ్మయసేవాసమితి కార్యదర్శి యునునగు శ్రీ కొత్తపల్లి వెంకటరామలక్ష్మినారాయణ శర్మగారు 'పాల్వంచ సంస్థానచరిత్ర'ను వ్రాసినారు. పాల్వంచ సంస్థానాధీశ్వరులైన కీ. శే. మహాబూబ్ సర్ఫ రాజవంతు శ్రీ రాజా పార్థసారథి అప్పారావు నవై అశ్వారావుబహద్దరువారి జీవిత మిందు వర్ణితము. శ్రీ శర్మగారికి విజయనగరము లోని రీసెర్చి యూనివర్సిటీవారు 'సాహిత్య విశారద' బిరుదమును ప్రసాదించి యుండిరి.

## ఉపజీవ్య గ్రంథసూచి


1. సురవరము ప్రతాపరెడ్డిగారు, నిజామురాష్ట్రములోని ఆంధ్రసంస్థానముల చరిత్ర. శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయ రజతోత్సవసంచిక, పుటలు 39—49.

2. అనంతపంతుల రామలింగస్వామి, శ్రీ కృష్ణకవిజీవితము, 1965, పు. 85.

3. శిష్టా వెంకటసుబ్బయ్య, హృదయాభిరామప్రబంధము, 1940.

4. బులుసు వేంకటరమణయ్య, ఆంధ్రకవిసప్తశతి, పు. 250.

5. A. Vadivelu, The Aristocracy of Southern India, Vol. I, pp. 79 a-79 l.

6. W. W. Hunter, Imperial Gazetteer of India, New Edition, Oxford, 1908, Vol. VIII, p. 22 and Vol. XIX, pp. 373, 374.

7. C. A. Souter and K. N. K. Ayyar, Gazetteer of the East Godavari District, Vol. II, Madras, 1935.

# పిఠాపురము

## ప్రవేశిక

రాజమండ్రి సర్కారులో కాకినాడ, ప్రోలునాడు, సెలపాక పరగణాలతోఁ గూడిన పిఠాపురిసంస్థానము చాల ప్రాచీనతను, ప్రాధాన్యమును గలిగి యుండినది. సంస్థానమంతయు పిఠాపురము, సామర్లకోట, కరప, మల్లవరము, పలివెల, కడియము అను ఆఱు తాణాలు. అనంతరకాలమునందు ఇతర సంస్థానాధీశులనుండి అనంతవరము, పోలవరము, ఏజన్సీ వీరవరము, పట్టిసము, తోటపల్లి మొదలగునవి క్రయములో ఖరీదు చేసినవేగాని అసలు సంస్థానములోని భాగములుగావు. చివరి జమీందారు హయాములో అమిలాపురము, ఉత్తరార్కాడు, చోడవరము, లుని, రాజమండ్రి ప్రాంతములలోని ఎస్టేటు గ్రామములనేకము ఖరీదుచేయఁబడి పిఠాపురసంస్థానము ఎంతో విస్తరించినది. పూర్వపు ఎస్టేటులోని గ్రామములు 128 మాత్రమే. తరువాత కొనిన ఎస్టేటులతో కలిసి మొత్తము గ్రామములు 168. సంస్థాన వైశాల్యము 400 చ. మై. పోలవరముతో కలిపి 743 చ. మై. ఇంచుమించు మూఁడులక్షల జనాభా, పండ్రెండు లక్షలు సాలుసరి రాఁబడి. పేష్కషు రెండున్నరలక్షలకు పైఁబడి.

ఈ సంస్థానమునకు రాజధాని యయిన పిఠాపురము చాల ప్రాచీనమయిన పట్టణము. సముద్రగుప్తుని అలహాబాదు శాసనమున ఉట్టంకింపఁబడిన మహేంద్రుఁడు పిష్టపురాధిపతి. రెండవపులకేశి ఐహోలు శాసనమునందును, విష్ణువర్ధనుని తిమ్మాపుర శాసనమునందును, శక్తివర్మ రాగోలుశాసనము నందును పిష్టపురము ప్రసక్తమయినది*. ఇది కొంతకాలము పూర్వచాళుక్యుల రాజధాని; కొంతకాలము వెలనాటిచోడుల విడిదిపట్టు. పండ్రెండవ శతాబ్దాంతమున గజపతుల వశమయినది. కొండవీటిరెడ్లు కొంతకాలము దీనిని పాలించిరి. వెంటపల్లివారను కమ్మవారు కొంతకాలము (క్రీ. శ. 1572–1647) గోల్కొండ నవాబుల కాలమున దీనిపై తమ ప్రభుతను వెలయించిరఁట. ఆ పిమ్మట గోలకొండ నవాబులు దీనిని 'చిట్నీవీడి' అను పేరుగల వెలమ దొరల కిచ్చిరఁట. పిఠాపురము సంస్థానాధిపతుల కూటస్థునకు మేనమామయని పరిగణింపఁబడుచున్న రామారాయణింగారు 'చిట్నీవీడి' వారి కుదురునకు చెందినవారు.

*కుందూరి ఈశ్వరదత్తు, ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, పుటలు 216, 217.

## సంస్థాన చరిత్రము

కాకతీయచక్రవర్తుల కాలమునాఁడు చక్రవర్తి కంగరక్షకులుగ పద్మనాయకకులోత్తంసులు పెక్కండ్రు నియమితులై యుండిరఁట. వీరిలో డెబ్బదియేడు గోత్రముల వెలమవారు సుప్రసిద్ధులు. 'గడిదేటి కాకతిగణపతిఁ గొలిచియు నిల నేలు ప్రభుపు లీ వెలమవాడు'. ఈ డెబ్బదియేడు గోత్రముల వారికిని పిల్లలమర్రి బేతాళనాయఁడు మూలపురుషుఁ డని చరిత్రకారులు భావించు చున్నారు. బొబ్బిలి, పిఠాపురము, నూజివీడు, నరసరావుపేట, చల్లపల్లి, వెంకటగిరి మొదలగు సంస్థానాధీశులు ఈ బేతాళనాయఁడు మూలపురుషుఁడుగాఁ గలిగిన డెబ్బదియేడు గోత్రములకు చెందినవారు. నేఁటికిని ఈ సంస్థానాధీశుల యౌరసులందఱును సమీపబంధువులుగ నున్నారు.

పూర్వోక్తమయిన డెబ్బదియేడు గోత్రములలో రేచెర్ల గోత్రమొకటి. ఈ రేచెర్ల గోత్రమునకు చెందినవాఁడు సింగమనీఁడు. పూసపాటి మాధవ వర్మతో జరిగిన యుద్ధమునందు సింగమనీని కుమారునకుచెందిన వారందఱును వీరస్వర్గము నలంకరించిరి. సింగమనీని భార్య యానాఁటికి గర్భవతి యఁట. రాజాశ్రయమునందలి వింజమూరి నరసన్న అనువారు సింగమనీని రాణికి ఆశ్రయ మిచ్చి యామెను కన్నకూఁతురు వోలె సాఁకి సంరక్షించిరఁట ! ఈమె కొడుకు అనపోతమనీఁడు. నరసన్నగారి యాచార్యకమున సుశిక్షితుఁడైన అనపోతమనీఁడు మాధవవర్మను జయించి పితృపైతామహమగు స్వీయరాజ్య మును తిరిగి సంపాదించెనఁట. ఇతనికి గంపెఁడుసంతానము. వీరిలో నొకఁడు సర్వజ్ఞసింగమనీఁడు. ఈతఁడు 'కైలాస, మెతుకు' జాగీరులకు ఏలిక. మఱియొక కొడుకు శ్రీశైల సమీపము నందలి వెలుగోడునకు ప్రభువు. వెలుగోడు పాలకుల సంతతివారే నేఁటి వెంకటగిరి వెలుగోటివారు.

ఢిల్లీ సర్దారులగు గోలకొండవారికి పిఠాపుర సంస్థానపాలకుల పూర్వులు రాజమండ్రిలో ప్రతినిధులుగా నుండిరి. చిట్టిని రామారాయణింగారు అపుత్రకు లగుటచేత నతని మేనల్లురును, గోలకొండలో నవాబునొద్ద సర్దారులునునగు తెనుఁగురాయణింగారు (1612—1672) పిఠాపురమునకు పాలకులయిరి. వీరి తమ మూలపురుషునకు పండ్రెండవ తరమువారు. ఇతని తరువాత కృష్ణారావు పాలకుఁడు. ఈయన బహుకాలము జబ్బుపడి సామర్లకోటలో విశ్రాంతి తీసికొనుచుండి తీవ్రమగు తన యనారోగ్యస్థితినిగూర్చి గోలకొండలోని మొగలువైస్రాయితో సాకల్యముగ వివరించి సంప్రతింపులు నిర్వహించు నిమిత్తము తనసోదరుఁడయిన రంగశాయిరావును (1611—1672) రాయబారము పంపియుండెను. రంగశాయిరావు చదరంగపుటాటలో చాలసమర్థుఁడు. చదరంగ మనినచో చెవికోసికొనెడి మొగలువైస్రాయి రంగశాయిరావును

మిగుల గౌరవించుచు నాతనితో కాలక్షేపముచేయుచుండెను. ఒకనాటి చదరంగపుటాటలో పొరపాటు జరిగినందున అభిమానధనుఁడగు రంగశాయిరావు ఆత్మహత్య గావించికొనెనఁట. మొగలువైస్రాయి యీ యాకస్మిక సంఘటనకు మిక్కిలి దుఃఖించి ఇతని యన్నగారు చంద్రారాయణింగారిని పిలిపించి కాకినాడ, ప్రోలునాడు, సెలపాక మొదలగు సీమలను కౌలునకు దయచేయించిరి.

చంద్రారాయణింగారి ముఖ్యపట్టణము పిఠాపురము. వీరి తరువాత పవితరములకుఁజెందిన పాలకులందఱును సమర్థులు, సౌమ్యులు. కాని ఎందువలననో మొగలువైస్రాయి 1748 లో పిఠాపురము వారితో తంగమ్మపేటయొద్ద యుద్ధమొనరించి కొందఱు ముఖ్యులను ఖైదుగావించెను. కుమార మహీపతిరాయణింగారి కాలమున ఆనందగజపతి మహారాజు పిఠాపురముపై దండెత్తెను. అప్పటికే యింగ్లీషు, డచ్చి, ఫ్రెంచి కుంఫిణీల వారు సాగరాంధ్రము నందు గిడ్డంగులను నిర్మించి దేశీయప్రభులకు కలహములు జరిగినపుడేదో యొకపక్ష మవలంబించి లాభములు సంపాదించుచుండిరి. చివరకు వెంకటనీలాద్రిరాయణింగారు (1778—1828) పిఠాపురపాలకులుగా మొగల్ వైస్రాయిచే గుర్తింపఁబడిరి. ఈ వెంకటనీలాద్రి రాయణింగారి కాలమందే ఇంగ్లీషు కుంఫిణీవారితో శాశ్వతపరిష్కారము జరిగినది. నీలాద్రి రాయణింగారి కుమారుఁడు వేంకటసూర్యరాయణింగారు (1824—1850) తండ్రి మరణకాలము నాఁటికి పసివారగుటచేత సంస్థానము కోర్టు ఆఫ్ వార్డ్సు పర్యవేక్షణమున పదునాలేండ్లుండినది*.

సూర్యరాయణింగారు 1844 లో జమీపాలనమునకుపచ్చి ఆఱేండ్లు మాత్రము పాలించి 1850 లో మరణించిరి. ఇతనికి నలుగురు మైనరు కొడుకులు. సంస్థానము మరల కోర్టు ఆఫ్ వార్డ్సు పరమయినది. ఈ మైనరులలో రెండవవారిని బొబ్బిలి సంస్థానమునకు దత్తుగానిచ్చిరి. ఈ నలుగురు సోదరులలో పెద్దవా రకాలమరణము నందుటచే మూఁడవవారైన రాజా రావు వేంకట మహీపతి గంగాధర రామారావుబహద్దరుగారు (1844—1890) 1861 లో జమీకివచ్చిరి. వీరికాలమునందు ఎస్టేటు అత్యున్నతదశకు వచ్చినది. 1879 నాఁటి రంపపితూరీ నణఁచుటలో రాజాగారు బ్రిటీషువారికి తోడ్పడిరి. వీరు గొప్పదాతలు. 1890 లో వీరు మరణింపఁగా వీరి మైనరు కుమారుఁడు సూర్యరావుబహద్దరుగారి తరపున కోర్టు ఆఫ్ వార్డ్సు వారు 1906 దాఁక జమీపాలనమును నిర్వహించిరి. 1906 లో వీరు జమీయధికారమును స్వీకరించిరి. 1924 లో వీరికి 'మహారాజా' బిరుదమువచ్చినది. మహారాజ రావు

*దిగవల్లి వేంకటశివరావు, రాజమహేంద్రవరం జిల్లా శిరస్తాదారుకథ, భారతి, 1943, సెప్టెంబరు, పుటలు 293—300.

వేంకటకుమార మహీపతి సూర్యారావుబహద్దరుగారి జ్యేష్ఠ పుత్రులు యువరాజా రావు వేంకట మహీపతి గంగాధర రామారావుగారు 1910 లో జన్మించిరి. మహారాజా వారికి నలువురు పుత్రికలు. ఇరువురు పుత్రులు. పుత్రులలో యువరాజు కవి; పండితుడు. పెద్దకొమార్తె మంగయ్యమ్మను అస్సాములోని క్షత్రియ జమీందారుల కిచ్చిరి. రెండవ కొమరితయగు భావయ్యమ్మను, మూఁడవతనయయగు సీతాదేవిని నూజివీడు జమీందారులు వివాహమాడిరి. నాల్గవతనయ కమలాదేవి. పలివెల, తోటపల్లి, అనంతవరం, ఏజన్సీవీరవరం ఎస్టేటులను కుమారుల కిద్దఱకు పంచియిచ్చి మహారాజాగారు సంస్థానమును పాలించిరి. జమీంవారీ రద్దుచట్టము మేరకు పిఠాపురము సంస్థానము ఆంధ్రరాష్ట్రమున కలిసి పోయినది.

## సాహిత్యపోషణము

సాగరాంధ్ర సంస్థానాధిపతులలో సాహితీపోషణము విషయముగా పిఠాపురపాలకులు మొదట పరిగణింపఁదగినవారు. ఈ వంశీయుల పూర్వులలో నొకఁడుగా సంభావింపఁబడుచున్న సర్వజ్ఞసింగభూపాలుఁడు రత్నపాంచాలికా రసార్ణవసుధాకరాది గీర్వాణకృతినిర్మాతగా ప్రసిద్ధుఁడు. తరతరములుగా పిఠాపురము రావువారి నాశ్రయించియుండిన వింజమూరి వంశమువాఁడగు సోమేశకవి రాఘవయాదవీయమను సంస్కృతశ్లేష కావ్యమునకు కర్త. కవి గౌతమసగోత్రుఁడు, నరసన్నభట్టుపౌత్రుఁడు, కృష్ణసూరిపుత్రుఁడు. గోవింద గురుశిష్యుఁడు. రామాయణ భాగవతార్థములు రెండును బొందుపడు రీతిలో నీ కావ్యము వివిధవృత్తములలో సంతరింపఁబడినది. అర్థద్వయయుక్త కావ్యమును నిర్మింతునని కవిప్రతిజ్ఞ.

'తథాఽపి రామస్య కృపావలంబాత్
కృష్ణస్య చాశ్చర్యకరం కవీనాం
శ్లిష్టం కరిష్యామహమాశుకావ్యం
శ్రావ్యం సతాం రాఘవయాదవీయం'
'కథాశ్చ రామాయణకాండ షట్కే
వసంతి యే భాగవతస్య భవ్యాః
స్కంధే విచిత్రా దశమేచ తాసాం
కుర్యామహం సంఘటనా క్రమేణ'

కవిగారి కేడవతరమువారయిన వింజమూరి వెంకన్నపంతులుగారు దీని ప్రకాశకులు.*

* ఆంధ్ర ప్రచారిణీ ముద్రాక్షరశాల, కాకినాడ, 1950 ; లిఖిత ప్రతి కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషద్గ్రంథాలయమునఁ గలదు.

పిఠాపురము వారి కోవలోని 18 వ తరమువారగు రావు మాధవ రాయనింగారు (1679–1704) ఎక్కలంక వీరభద్రకవి (1680–1740) కృతమగు వాసవదత్తాపరిణయమును గృతినంది కృతి కర్తకు కోనసీమలో వృద్ధగౌతమీతీర పరిసరమున మాన్యములిచ్చి సత్కరించిరి. సుబంధుని 'వాసవదత్త' రూపకమునకిది తెలుఁగు సేఁత. ఈయన 'వృత్తులుగల్పించి విశ్రుతంబుగ విప్రసమితికి నగ్రహారంబులొసఁగె' (వాసవదత్తాపరిణయ కృత్యవతారిక). సమకాలికులగు ఏనుఁగు లక్ష్మణకవి ప్రభృతులు వీరభద్ర కవిని ప్రశంసించిరి.

ఈఁమలపల్లి భవానీశంకరకవి తన శృంగారమంజరి* కావ్యమునందు—

'అభియాతిమానవప్రభుమౌళి మహీష్ణుణి
  రాజి నీరాజిత రాజితాంఘ్రి
నీరేరుహాంధ్రైన శ్రీరావు మాధవ
  రాయశౌరికి నతిప్రౌఢరీతి
వాసవదత్తాది భాసురకృతు లనే
  కంబులొనరించి తత్కరుణచేత
హారకేయూరాగ్రహార విస్ఫార తు
  రంగముల్ రంగుమీఱంగనంది
సకల సుకవీశ్వరాంభోజ నికరహేళి
యై యలరు ఎక్కలంకాన్వవాయకలశ
జలధిశశి వీరభద్రు మత్సఖు నుతించి
తదనుమతిఁ గృతి యొనరింతు ముదముతోడ' అని ప్రస్తుతించినాఁడు

శృంగారమంజరి పర్వతవర్ధనకవి గీర్వాణకృతికి తెలుఁగఁట!

బహుళప్రబంధకర్తయగు కూచిమంచి తిమ్మకవి రసికజనమనోభిరామాది రసవత్కృతులను పిఠాపురము ప్రభువు మాధవరాయలు పరిశీలించి కవికి కవిసార్వభౌమ బిరుదమును ప్రసాదించిరి. మొదటి మాధవరాయలే (1656–1704) తిమ్మకవి కీ బిరుదును ప్రసాదించినట్లు కొందఱును, చిన్నమాధవరాయలే బిరుదప్రదాతయని కొందఱును భావించుచున్నారు. తిమ్మకవి రచనలు 1715 నుండి 1753 దాఁక రచితములయినవి. ఈ కాలము చిన్నమాధవరాయల కాలము (1710–1755) నకు దగ్గఱగానున్నది. ఇందేది సిద్ధాంతపక్షీయమో, ఏది పూర్వపక్ష పక్షీయమో సుపరీక్షితము గావలసియున్నది. సుభద్రాపరిణయ గ్రంథకర్తయగు కూచిమంచి జగ్గకవియు, శతకంఠ రామాయణకర్తయును, జగ్గకవి ప్రథమపుత్రుడునునగు గంగన కవియును మాధవరాయనింగారిచే సమ్మానింపఁబడిరఁట.

*ప్రాచ్యలిఖిత గ్రంథాలయ లిఖితప్రతి, ఆర్. నెం. 341 (b).

నాఁటినుండి నేఁటిదాఁక కూచిమంచి జగ్గకవి, తిమ్మకవి వంశీయులే పిఠాపురిపరిసరములందలి జల్లూరు, చంద్రమపాలెముల గ్రామకరణికములను, ఈనాములను అనుభవించుచున్నారు. వక్కలంక వీరభద్రకవికి సహాధ్యాయి యయిన ఈఁదులపల్లి భవానీశంకరకవి యీ మాధవస్వామిని సందర్శించి యేదియో గొప్పసత్కారమును బొందిన ట్లాతని ధర్మఖండములోని పీఠికాపుర వర్ణనాదికమువలన నూహింప వీలగుచున్నది. పెద్దమాధవస్వామిని తరువాత రాజ్యమునకు వచ్చిన వారి సోదరులు నరసింహరాయనింగారు (16[illegible]–17[illegible]) వేదవేదాంగ పారీణులగు దర్భావారి కుటుంబమునకు సామర్లకోట సమీపమునఁ గల 'హుసేనుపురము' అను గ్రామమును సర్వకరపరిహారముగా 'నరసింహరాయ పురాగ్రహారము' గాఁజేసి సమర్పించిరి.

1786–1793 మధ్య పిఠాపురమును పాలించిన కుమార వేంకటమహీపతి రాయనింగారు (1765–1793) 1786లో జమీకివచ్చి కుంతీమాధవస్వామి ప్రాకారమును నిర్మించి యాభరణాదులను సమర్పించిరి. దేవులపల్లి బాపన్నకవి వీరి యాస్థానకవి చంద్రుడు. 'తారావళి' యను సంస్కృతకావ్యమును రామాయణార్థ బోధకముగా, నక్షత్రనామ చిహ్నితముగా రచించిరి. రాజాగారు కవికి 'ఫకీరుద్దీన్‌పాలెము' నందొక సుక్షేత్రము నొసఁగి సత్కరించిరి.

మహీపతిరాయనింగారి తరువాత పిఠాపురమును 1793–1828 మధ్య నేలిన వేంకటనీలాద్రిరాయనింగారు (1778–1828) కూడ కవిపండిత పోషకులు. వీరి యమాత్యులగు అవసరాల పద్మరాజుగారు పండితరంజనాభి శోభితమగు బాలభాగవతచంపూప్రబంధమును రచించిరి. ఇదే 'పద్మరాజ చంపు' వను పేర పండితలోకప్రసిద్ధము. ఇది శృంగారరసప్రధానము. పద్మరాజుగారు వర్ణాధికభోజరాజుగా (పద్మ = అంభోజ) ఈ కావ్యమునందు చమత్కార గర్భితముగా ప్రస్తుతింపఁబడినారు. ఆస్థానపండితులలో నొకరగు రామశాస్త్రిగారీచంపువునకు 'సుధీ చంద్రిక' యను వ్యాఖ్యానమును సంధానించిరి. వీనికే 'కవి రంజని' యను మఱియొక వ్యాఖ్యానమును రాఘవాచార్యులుగారు నిర్మించిరి.

దేవులపల్లి రామశాస్త్రి రాజాభ్యుదయ చంపువను స్వతంత్రసంస్కృత ప్రబంధమును రచించినవాఁడు. ఆస్థాన విద్వత్కవియు, తర్కశాస్త్ర నిధియును నగు దువ్వూరి విశ్వనాథ శాస్త్రిగారు రాజాగారి యాదేశము మేరకు 'మాధవవిలాసభాణము' అను నొక శృంగారరస ప్రచుర రచనను కైసేసిరి. శ్రీ కుంతీమాధవస్వామి వారి రథోత్సవసమయమునందలి స్త్రీ పురుషుల శృంగారవిలాసముల యనువర్ణ మిందలి కథాశరీరము. తర్కశాస్త్ర పారంగతులును, సహస్రావధానులును, సమస్తసంస్థానములు పర్యటించి జయపత్రికలందినవారును, పిఠాపురాస్థానపండితులును నగు ప్రతివాద భయంకర రాఘవాచార్యుల

గారు శ్రీ రాజా రావు నీలాద్రిరాయణింగారిచే అర్ధాసనాద్యనేక గౌరవసత్కా-రములందినవారు.

కూచిమంచి తిమ్మకవి ప్రపౌత్రుఁడును కూచిమంచి చినజగ్గకవిపుత్రుఁడును చంద్రమపాలెము వాస్తవ్యుఁడునగు తిమ్మకవి 'సుజన మనః కుముద చంద్రిక[1]' యను గద్య కావ్యమును సంతరించినవాఁడు. కవి కుక్కుటేశ్వర స్వామి భక్తుఁడు. శివపారమ్యబోధక మీకృతి. మహాభాగుఁడను కళింగదేశ విప్రుఁడు స్వర్గమునకేఁగి యింద్రున కిందలి కథను దెలిపిన ట్లీకథ నిర్వహింపఁ బడినది. కేరళాధిపతి సంగరోన్ముఖుని తనయుఁడగు కరాళవక్త్రుని యొక్కయు, నతని నాయిక మంజరి యొక్కయు జీవితవిశేషము లిందలి యితివృత్తము.

ఈ కావ్యవిషయమున దేశమునందు కొన్ని భ్రాంతులేర్పడి యున్నవి.[2] ఇది చంపూప్రబంధమనియు, కూచిమంచి తిమ్మకవి రచించిన రసికజన మనోభిరామమునకు సంస్కృతీకరణమనియు పరిశోధకపండితుల యభిప్రాయము. వాస్తవముగనిది గద్యకావ్యము. దేవతాస్తుతిసందర్భములలో కొన్ని శ్లోకములు భిన్నభిన్న వృత్తములు నిందులేకపోలేదు. అక్కడక్కడ నెదురుపడెడి కొన్ని వృత్తములు ఈ కావ్య స్వరూపమును మార్చివేయఁజాలవు. విశేషించి గద్యకావ్యములందు క్వాచిత్కముగా పద్యములు దొరలుచుండుట సర్వసామాన్యము, శాస్త్రాఽవిరుద్ధము. గద్యభాగము చూర్ణికలని యిందు వ్యవహరింపఁబడినది. కావున దీనిని చంపూప్రబంధమనుట సరికాదని మిత్రులు డా. పి. శ్రీరామమూర్తిగారు సకల ప్రమాణములతో స్థాపించిరి.[3] ఇఁక వారును వీరును తలంచుచున్న ట్లీ కావ్యమునకును రసికజనమనోభిరామమునకును యత్కించిత్సామ్యమును గానరాదు. ఈ రెండింటి యితివృత్తములుగాని కథాగతి గాని ఒకటికావు. పిఠాపురాస్థాన పండితులగు దేవులపల్లి సీతారామాంతర్వాణుల యొద్ద తాను శాస్త్ర విద్యాభ్యాసము చేసినట్లు తిమ్మకవి వాకొనినాఁడు.

రావణదమ్మీయమను నామాంతరముగల లంకావిజయద్వ్యర్థి కావ్యమును రచించిన పిండిప్రోలు లక్ష్మణకవి (1770—1840) తండ్రియగు గోపాల మంత్రి, మహీపతి నామబిరుదాంకులగు పిఠాపురము పాలకులయొద్ద అమాత్య పదవిలోనుండెనని—

1 'సరసహృత్కుముదచంద్రిక' యని ప్రాచ్యలిఖిత గ్రంథాలయ ప్రతి, ఆర్. నెం. 912.

2 సుజనమనఃకుముద చంద్రిక లిఖిత ప్రతులు రెండు ఆంధ్రవిశ్వకళాపరిషద్గ్రంథాలయమునన్నవి. మొదటిది అసమగ్రము; రెండవది సంపూర్ణప్రతి. రసికజన మనోభిరామమున కిది సంస్కృతానువాదమని గ్రంథాలయమువారి జ్ఞాపిక.

3 P. Sriramamurti, 'Sujanamanah Kumuda Chandrika' a paper read to the 22nd Session of the All India Oriental Conference at Gauhati, 1965.

'తత్పురమున నియతిదళ రథకుంభినీ
పతిభటాశ్వముఖ్యబలచయాప్తిఁ
దగు మహిపతి సమితిఁదనరు గో
పాల మంత్రి బుద్ధిపటిమఁదనరు' —లంకా. 1–2.

అను పద్యమున భంగ్యంతరముగా సూచితమగుచున్నదని ఊహింప నగునేమో? పిండిప్రోలువారు గోదావరి మండలమునందలి రామచంద్రపురమునకు సమీపమునఁగల కుయ్యేరను గ్రామమునకుఁ గరణములుగా నుండిరి. గ్రామకరణములు కూడ అమాత్యకోటిలోని వారేకదా! లక్ష్మణకవి వాస్తవముగా పిఠాపురాస్థానకవి కాకపోయినను, పిఠాపుర ప్రభువులగు రావు వంశీయుల సౌశీల్యమును కీర్తించియున్నాఁడనుటకు లంకావిజయము నందలి క్రింది పద్యములే ప్రత్యక్ష సాక్ష్యములు. లక్ష్మణకవి పరమగు నర్థమున దమ్మన్నతో లక్ష్మణకవి పలుకులు :

'సతతము రావుల సద్వం
శ తిలకరాజులవనిం గుశలతరులను సు
స్థితి వఱదిరుగఁగ వనచరు
నితరునివలె ననుఁ జులుకఁగనెంచి చెడకుమీ' —2–78.

ప్రాజ్ఞత నెవ్విధంబునను రామునకుందగు సాటిరావు స
ర్వజ్ఞ నృసింహుఁ డాయన సువంశమునన్ జనియించి చెడ్డ దు
ష్ప్రజ్ఞుఁడవీవు కానఁ గువిచారములన్నియుమాని ధర్మ గో
ష్ఠిజ్ఞులుమెచ్చ చొప్పుగని సీతను వేవిడు మంత మేలగున్' —2–87.

యామినీపూర్ణతిలకా విలాసకర్తయును, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి పినముత్తాతగారును నగు చెళ్ళపిళ్ళ నరసకవి (1795–1840) తాను 'పూజ్యతర ప్రాజ్యరాజ్య సత్పీఠికాపురవర సామ్రాజ్య పరివృఢుఁడననియు, విమల రేచెర్ల గోత్రపవిత్రమూర్తి రావు వేంకటనీలాద్రి రాయ నృపతిచేత సత్కృతిఁబొంది ప్రసిద్ధినొందినట్టి విఖ్యాత యశుఁడననియు యామినీపూర్ణతిలకావిలాస కావ్యావతారికలోఁ బేర్కొనినాఁడు (1–20). కృతిపతియగు రఘురామచంద్రమూర్తి 'సప్తసప్తాభిజనగోత్రుఁ' (1–24) డనుటలో డెబ్బదియేడు గోత్రముల వెలమదొరల ప్రసక్తి భంగ్యంతరముగా సూచితమగుట గమనార్హము. నీలాద్రినృపతి మేనమామలగు చింతపట్ల వేంకటరాయ మాధవరాయ సోదరులకు నరసకవి విద్యాగురువులు. నరసకవి పూర్వులకు పిఠాపురపాలకులు అఱువది యెకరముల పరిమితిగల భూమిని కట్టుబడిగా నిచ్చియుండిరఁట* !

రాజా గారు వక్కలంక వీరభద్రకవిపౌత్రుఁడగు చినవీరభద్రకవిని సాదరముగాఁ బిలిపించి యాకవిచే వాసవదత్తాపరిణయములోని తమ వంశ

* చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, యామినీపూర్ణతిలకావిలాస పీఠిక, పుటలు 10–12.

వర్ణనమునకు మాధవనృపాలునినుండి తమవరకుఁగల చరిత్రమును వ్రాయించి వాసవదత్తాపరిణయ ప్రబంధమున నీ నూతనచారిత్రకభాగమును చేర్పించి కవిని బహూకరించిరి.

వేంకటనీలాద్రిరాయనింగారి పుత్రులు వేంకటసూర్యరాయనింగారు స్వల్పకాలము మాత్రమే జమీని పాలించిరి. తాటిపర్తిశాస్త్రులును, తాళ్ళూరి సింహాలుననగు తణికెళ్ళ సుబ్బయశాస్త్రిగారు రచియించిన 'సూర్యరాయ తారావళి' యను సంస్కృతకావ్యమును సూర్యరాయనింగారు కృతిసంది కవికి తాటిపర్తిలో విశేషముగా నీనాముభూముల నొసఁగిరఁట.

పద్మనాయకవంశజుఁడును నారపేల్లి గోత్రజుఁడును దుగ్గుదుర్తి నివాసి యుననగు రేమెల వేంకటరాయకవి (1820–1860) పిఠాపుర ప్రభువుల సమాదరణమును బడసి ఉత్తరాపరిణయమను ప్రబంధమును సంతరించెనఁట.

## రాజా గంగాధర రామారాయబహద్దరు

తరువాతి పిఠాపురపాలకుఁడగు రాజా రావు వేంకటమహీపతిగంగాధర రామారావుబహద్దరు (1844–1890) గొప్ప విద్యాపోషకులు. కవులు, గాయకులు, వేదవేత్తలు, శాస్త్రజ్ఞులు మొదలగువారు లెక్కకు మిక్కిలిగా వీరి యాదరణమును బొందిరి. రాజాగారు సంస్కృతాంధ్రాంగ్ల హిందూస్థానీ భాషలయందు మంచిపరిచయముగలవారఁట. 'రాజా వారు ఎవరేనా పండితులు వస్తే వారితో ధారాళముగా సంస్కృతమే మాట్లాడేవారని వినికిడి. ఆ కారణం చేత వారు బాల్యంలో సంస్కృతభాష అభ్యసించి వుండాలి*'. ఒకానొక సందర్భమునఁ దమ యాస్థానపండితులతోఁగలిసి విజయనగర సంస్థానమునకేఁగి విజయరామమహారాజ సభాస్థలిని సంస్కృతభాషలో ననర్గళముగ సంభాషించి విజయనగర ప్రభువులను, తదాస్థానపండితులను నాశ్చర్యచకితులుగా నొనర్చిరఁట. వీరి యాస్థానకవులు దేవులపల్లి సోదరకవులు. దేవులపల్లి సోదరకవుల సాహిత్యపరిశ్రమము జగద్విదితము. వీరిలో జ్యేష్ఠులగు సుబ్బరాయశాస్త్రిగారు రాజావారి కోరికమేరకు 'రావువంశముక్తావళి' యను గ్రంథమును సంస్కృతమున రచించి శ్రీవారి కంకితమీఁగా వీరెంతయో సంతోషించి తమ రాజ్యమునే స్వీకరింపుఁడని సుబ్బరాయశాస్త్రిగారిని కోరిరఁట. ఆ మీఁద కవితారాజ్యమే తమకు చాలునని కవిగారు ఉచితరీతిని జవాబిచ్చి రాజాగారిని సంతృప్తిపఱిచినట్లు మహేంద్రవిజయకావ్యపీఠిక సాక్ష్యమిచ్చుచున్నది. దేవులపల్లి సోదరకవులే శ్రీ రాజావారి తనయులగు వేంకట కుమారమహీపతిసూర్యరావుబహద్దరుగారికి ప్రథమవిద్యాగురువులు.

* చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, కథలు-గాథలు, సం. 1, పు. 13.

## దేవులపల్లి కవిపరంపర

దేవులపల్లివారి కుటుంబము చిరకాలముగా, అనుస్యూతముగా పీఠికాపురాస్థానాశ్రయమున వర్ధిల్లుచు వచ్చినది. ఈ వంశమువారు పీఠికా పురాస్థాన విద్వాంసులుగా సమ్మానములందుచు, ప్రభువుల యనుమతిఁబడసి యితరసంస్థానములకు నయిత నరిగి తదధిపతులను తమ ప్రతిభాపాండితీ వైభవములచే మెప్పించి సత్కారము లందుచుండెడివారు. రావువారి వంశ్రము పాలెము దేవులపల్లివారి కాణయాచి. వీరు తెలగాణ్యులు. కౌండిన్యసగోత్రము వారు. వీరి మూలపురుషుఁడు వేంకటసూరిమణి. వీరి పూర్వులలో నొకఁడైన రామశాస్త్రిగారు విజయనగర సంస్థానాధీశ్వరులయిన విజయరామనృపాలుని నుండి వెలగవాడయను నగ్రహారమును బడసినవారు. పై రామశాస్త్రిగారి మనుమఁడగు రామశాస్త్రి సాహితీదర్పణమను నలంకారగ్రంథమును, బాల భాగవతమునకు వ్యాఖ్యానమును మఱియు ననేకనాటకములను సంతరించి వేంకటనీలాద్రిరాయప్రభువు వారివలన 'సాహిత్యచక్రవర్తి' యను బిరుదము నందిన వాఁడఁట. ఈ రామశాస్త్రి తమ్ముని కుమారుఁడగు కృష్ణశాస్త్రి విశ్వగుణాదర్శమునకు వ్యాఖ్యానము, తర్కసారమను న్యాయశాస్త్ర గ్రంథమును, సాహితీ సారమను నలంకారశాస్త్రమును రచించి శిష్యప్రశిష్యకోటికి సర్వవిద్యా ప్రదాతయై వెలసినవాఁడఁట. న్యాయ కావ్య రస దోష గుణ శబ్దాలంకార అర్థా లంకారములను ఏడు ప్రకరణములుగలదిగా విరచితమైనది సాహితీసారము. క్రీ. శ. 1798లో మంత్రి ప్రెగ్గడరామరాజుచే లిఖితమయిన దీని వ్రాఁతప్రతి ఆంధ్రవిశ్వకళాపరిషద్గ్రంథాలయమునఁ గలదు[1].

వల్లభాచార్య విరచిత వైద్యచింతామణిని ఆంధ్రచింతామణి యను పేర నాంధ్రీకరించిన దేవులపల్లి వేంకటనరసకవి వీరి కుటుంబమునకు చెందినవాఁడు కాఁడు. ఆంధ్రచింతామణికర్త కాశ్యపగోత్రుఁడు, శ్రీనివాస మంత్రి పుత్రుఁడు.[2]

మహేంద్రవిజయకర్తలగు దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి (1835–[illegible]) గారి ఆంధ్ర లక్షణోపదేశికులు కూచిమంచి వెంకటరాయకవిగారు. కవి సార్వ భౌముఁడగు కూచిమంచి తిమ్మకవికి వేంకటరాయ కవి ప్రపౌత్రుఁడు; సుజనమనః కుముద చంద్రికా కర్తయగు తిమ్మకవికి పుత్రులు ; దేవులపల్లి బుచ్చయశాస్త్రికి శిష్యులు. సుకవి మనోరంజనియను ఛందోగ్రంథమునకుఁ గర్తలు. గంగాధర రామరాయబహద్దరుగారు వేంకట రాయకవిగారికి 'లాక్షణికచక్రవర్తి' యను బిరుదము నొసఁగి యుండిరఁట. వరకవుల వదలి దుష్టకవుల నాదరించెడు

[1] Acc. No. 34082, Cl. No. Ms. T. 491.25, K 92–1.

[2] D.No. 2406, A Descriptive Catalogue of the Telugu Manuscripts in the Government Oriental Manuscripts Library, Madras, Vol. XI, Medicine, 1948.

శుపతుల రీతిని నిష్ఫయముగా నిరసించినవాఁడు వేంకటరాయకవి.

పిఠాపురము రావువంశమువారి 'అఖీఖత్తు'ను సంస్కృతమున 'రావువంశ ముక్తావళి' యను పేర చంపూప్రబంధముగ సుబ్బరాయశాస్త్రిగారు సంతరింపఁగా, వీరి తమ్ములు తమ్మనశాస్త్రిగారు ఉరఫ్ వెంకటకృష్ణశాస్త్రి (1856–1912) దీనిని తెనుఁగున వెలయించిరి. 1890 లో గంగాధరరామరాయ బహద్దరుగారు పరమపదింపఁగా—

'శతలేఖినీ పద్యసంధానమరసి మా
యల్లురటంచు నెయ్యమునఁబిలిచె
నెలమి వంశావళిఁగృతి గాంచి వంశంబు
చిగిరించె ననుచు హర్షించి పొగడెఁ
బృథులసింహాసనం బెక్కించి రాజ్యంబు
మీదే యటంచు నర్మిలి యొసంగెఁ
గొమరు విద్యాభ్యాస గోష్ఠిఁ జిరంజీవి
మీ శిష్యుఁడంచుఁ బేర్మిని వచించెఁ
బ్రథిత దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి
యస్మదాస్థాన విద్వాంసుఁడనుచుఁ బిలిచె
నట్టి శ్రీ రావు రామరాయాధినాథు
నాకమున కంపె దైవ మేమందు నకట'

అని సుబ్బరాయశాస్త్రి వాపోవుచు చెప్పిన పద్యము 'ఎదురైనచోఁ దన మదకరీంద్రము డిగ్గి....' యను నాంధ్రకవితాపితామహుని పద్యమున కను కరణము.

సుబ్బరాయ శాస్త్రిగారు రావువంశముక్తావళినే గాక శ్రీరామపంచాశత్తు, మహేంద్రవిజయము, రామరాయవిలాసము, మల్హాణస్తవము, రాజనీతి ప్రకాశమగు కుమారశతకము, నీతిప్రధానమగు మందేశ్వరశతకమును రచించిరి.

సంస్థానకవీశ్వరులు దేవులపల్లి తమ్మన్నశాస్త్రిగారు రచించిన నయనోల్లాస మను మూఁడాశ్వాసముల ప్రబంధమునకు కృతి ప్రేరకులు సూర్యరావు బహద్దరుగారు. కవిగారికంటిజబ్బు బాగుకాఁగా—ఆయానందమునకు రాజాగారు కోర్టు వివాదములలో విజయులైన యానందముతోడుకాఁగా నయనోల్లాసము రచింపఁబడినది. భారతములోని చ్యవనోపాఖ్యాన కథయిందు స్వీకృతమయి, ప్రబంధరూపమున నిబంధింపఁబడినది. యతిరాజ విజయము కవిగారి కృత్యంతరము.

## అల్లమరాజుకవులు

ఆరామద్రావిడశాఖీయులును, చేఁబ్రోలుగ్రామవాస్తవ్యులుననగు అల్లమ

రాజు సుబ్రహ్మణ్యకవిగారు (1831–1892) రాజాగారికి తమ 'భద్రాపరిణయ' మను నాలుగాశ్వాసముల శృంగారప్రబంధమును గృతియిచ్చిరి. శ్రీకృష్ణుని యష్టమహిషులలో నొకతెయగు భద్రాదేవిపరిణయకథ యందలి యితివృత్తము. ఈ ప్రబంధము కాణాదము పెద్దనసోమయాజి రచియించిన భద్రాపరిణయమునకు అచ్చుపు నకలు. పూర్వాపూర్వ మహాకవుల యనల్ప శిల్పద్యోతకములగు కథా భాగములను, మనోహరములగు పద్యభావములను, జాతీయతాపరిపుష్టములగు నానుడులను నుత్తరోత్తర కవులెరవుతెచ్చికొనుట మన మెఱుఁగుదుము. పదబంధములకో, పద్యపాదములకో మక్కువపడుటయు, దక్కఁజేసికొనుటయు పోనిమ్మని సరిపుచ్చికొనఁగలము కాని, పదులుపదుల పద్యములను, నూఱులకొలఁది పద్యపాదములను, వేయాఱు పదబంధములను ఎరవుతెచ్చి సొంతకయితలో నిబిడీకరించుట సరియయినదిగాఁ దోఁపదు. దీనిని అచ్చపు గ్రంథచౌర్యమని వంగూరి సుబ్బారావుగారభిప్రాయపడిరి. పూర్వకవులమీఁది భక్తిప్రపత్తులను, వారి మనోజ్ఞభావములయెడల విశేషలోలుపతయు తప్పుకాఁజాలవు కాన దీనిని గ్రంథచౌర్య మనరాదని నడకుదుటివా రొకరకపు తునితగవు చేసిరి[1]. ఈ కృతి సుబ్రహ్మణ్యకవిగారి కీర్తికి మాయనిమచ్చగా నుండక తప్పదు.

అల్లమరాజు వేంకటకవిగారు కొన్ని కీర్తనలను, రాజాగారిపై 'గంగాధర రామరాయ ఘనజనగేయా' యను మకుటముతో నీతిబోధకశతకము నొకదానిని రచించిరఁట. ఆస్థానపండితులలో నొకరు గుంటూరి సీతారామదీక్షితులుగారు యమోల్లాససంస్కృతకావ్యమునకు 'నీవి' యను వ్యాఖ్యానమును సమకూర్చిరి. చిలాపజ్జుల సూర్యప్రకాశశాస్త్రిగారు సూర్యశతకము, దీన చింతామణిశతకము మున్నగు బహుగ్రంథములను రచించిరి. ఆరవెల్లి గోత్రజుఁడును, వెంకమాంబాఅప్పయల పుత్రుఁడును, దుగ్గుదుర్తివాస్తవ్యుఁడును, పిఠాపురముప కాశ్రితుఁడునునగు రేమెల రామదాసు (1870 ప్రాంతము) మహిజామనోహర శతక కర్త[2].

## పండిత సత్కారము

ఇంద్రకంటి విశ్వపతిశాస్త్రి, శతావధాని మాడభూషి వేంకటాచార్యులు, ఎల్లమిల్లి లక్ష్మీనారాయణకవి, దండిభట్ల విశ్వనాథశాస్త్రి, కప్పా నరసింహశాస్త్రి, ఉప్పులూరి భీమశంకరశాస్త్రి, మద్దూరి దీక్షితులు, యడవల్లి శ్రీరామశాస్త్రి, భాగవతుల హరిశాస్త్రి, పరవస్తు రంగాచార్యులు, పొక్కులూరు వేంకటశాస్త్రి, తణికెళ్ళ సుబ్బన్నశాస్త్రి, సోంభట్ల రామస్వామిశాస్త్రి మొదలగు దిగ్గంతులవంటి

1 భద్రాపరిణయమునకు నడకుదుటివారి ఉపోద్ఘాతము, పు. 44.

2 ఇతఁడార్వేల నియోగియని శతకకవుల చరిత్రము, చూ పు. 683; శేషాద్రి రమణకవులు పేర్కొనుట విచారణీయము ఆరవెల్లివారు పద్మనాయక కులజులు.

పండితప్రకాండులు రాజాగారివలన ఈనాములు, వార్షికములు మున్నగువానిని సంపాదించిరి. ఇంగు రామస్వామిశాస్త్రిగారికి జేగురుపాడులో పదునాలుగుపుట్ల మాన్యమును, అయినపల్లి వాస్తవ్యులు బులుసు పాపయ్యశాస్త్రిగారికి వానపల్లి గ్రామమున నిరువదిపుట్ల మాన్యమును రాజాగారు ప్రసాదించి యుండిరి.

శ్రీ రాజాగారు పిఠాపురము, కాకినాడలలో వేదపాఠశాలలను, కాకినాడలో కళాశాలను స్థాపించి యటు వేదవిద్యను, నిటు రాజవిద్యను సమదృష్టితో పోషించిరి.

గోదావరిమండలమునందలి పెద్దాడవాస్తవ్యుఁడగు మిక్కిలి మల్లికార్జున కవి (1805–1875) రచించిన నాచికేతుచరిత్రము గంగాధరరామరాయబహద్దరు గారి అమాత్యులగు వాడ్రేవు చలమయ్యగారి కంకితము.

'....ప్రీతిసల్పితి నాచికేతుచరిత్రంబు
  గద్యపద్యములచే హృద్యముగను....
అహహ నీ ధన్యత గణింప నలవియగునె
భువిని మిక్కిలి సత్కులాంభోధిచంద్ర
సకల సద్గుణసాంద్ర వాచాఫణీంద్ర
వినుత విబుధేంద్ర మల్లికార్జునకవీంద్ర'

అని కవికృత్యంతరమగు నిర్వచన విక్రమార్కచరిత్ర ప్రబంధావతారికలో విస్పృతము. విక్రమార్కచరిత్రము నండూరి కామయమంత్రి కంకితము. రామచంద్రచరిత్రము, బేతాళపంచవింశతి కవి యితరకృతులు. చరమదశలో కవి భగవద్గీతను పద్యమయముగా నాంధ్రీకరించెనఁట ! ఈయనకుమారులు దుర్గయ్య శాస్త్రిగారు ఆనాఁటి గోదావరిమండలమునందలి గొప్పపండితులలో నొకరు*

## రాజా సూర్యరావుబహద్దరు

గంగాధర రామరాయబహద్దరుగారి కుమారులు శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతిసూర్యరావుబహద్దరుగారు (1885–1964) 'ఆంధ్ర భోజ', 'సాహిత్యచక్రవర్తి' బిరుదవిరాజితులు.

'శ్రీమన్మహారాజశేఖరగ్రామణి
  పద్మనాయకవర్గ పద్మహేళి
రేచెర్లగోత్రధాత్రీ పాలరత్నంబు
  రావు వంశాబ్ధి రాకావిధుండు
శ్రీ మంగయాంబికాకృత సుకృతఫలంబు
  రామరాట్పుత్రిక తపస్స్తోమమూర్తి....

* పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి, మిక్కిలి మల్లికార్జునకవి, గ్రంథాలయ సర్వస్వము, 1916, పుటలు 338–340.

......................................శ్రీ కు
మారమహీపతి సూర్యరాణ్మనుజవిభుఁడు'

—నయనోల్లాసము, I–11.

విద్యాపోషణమునందును, వితరణగుణమునందును, ధర్మనిర్వహణమునందును తండ్రిని మించిన తనయుఁడు. దేవులపల్లి సోదరకవులు, బ్రహర్షి సర్ రఘుపతి వేంకటరత్నమునాయఁడుగారు వీరి గురుశేఖరులు. ఆండ్రూసు, రవీంద్రుఁడు, సరోజిని, జగదీశచంద్రుఁడు వీరి ఆప్తమిత్రులు. బ్రహ్మోపాసనను, బ్రాహ్మ్మసేవను సమర్థముగా నిర్వహించిన మహావ్యక్తి.

ఆర్షధర్మము ప్రస్ఫుటముగా విస్తరింపఁజేయవలయుచో తద్వాహకమగు సంస్కృతభాషను, అందలి సర్వశాస్త్రములను ప్రచురపఱుచుట ప్రధాన కర్తవ్యము. అప్పటికే ఉర్లాము మొదలగు సంస్థానములలో వేదశాస్త్రములలో పోటీపరీక్షలేర్పఱిచి యాద్యవిద్యలగు నార్షవిద్యలను పోషించుచుండుటను రాజాగారు గమనించి తాముకూడనట్టి పోటీ పద్ధతిలో ప్రతివర్షము శరన్నవరాత్రముల సందర్భమున వేదవేదాంగములలో, సర్వశాస్త్రములలో పరీక్షలు పెట్టించియు, నవీనాంధ్రప్రబంధరచనలపోటీ నొకదాని నేర్పఱిచియు అందు తీర్ణులగువారికిని, విశేషార్హతలుఁగలవారికిని విజయదశమినాఁడు బహుమతిప్రదానమొనర్చియు, సంస్కృతాంధ్రభాషలను, శాస్త్రసాహిత్యములను పెంపొందింపనుద్యమించిరి.

మహారాజాగా రేర్పఱిచిన పోటీపరీక్షలలో అద్వైతవిభాగమునకు దెందుకూరి నరసింహశాస్త్రిగారును, న్యాయశాస్త్రవిభాగమునకు శ్రీపాద లక్ష్మీనృసింహశాస్త్రిగారును, వ్యాకరణవిభాగమునకు వేదుల సూర్యనారాయణశాస్త్రిగారును, తాతా సుబ్బరాయశాస్త్రిగారును, వేదవిభాగమునకు కాశీవంటల ఆమ్నాయోర్ధ్వవాచస్పతి వదలి లక్ష్మీనారాయణశాస్త్రిగారును, విశిష్టాద్వైతవిభాగమునకు గుదిమెళ్ళ వేంకటరంగాచార్యులుగారును, కిళాంబి ధర్మాచార్యులుగారును ముఖ్యపరీక్షకులుగా నుండెడివారు.

ఆంధ్రసాహిత్యపరిషదవతరణవికాసములకు మూలము పిఠాపురమురాజావారే. పరిషత్పక్షమున అముద్రితాంధ్రగ్రంథములెన్నియో సేకరింపఁబడి, యెన్నియో ముద్రితములయినవి. పరిషత్పోషణభారము చాలభాగము రాజాగారే వహించిరి. పరిషత్పక్షమున ప్రసిద్ధ పండితపర్యవేక్షణమున నిర్మితమయిన సూర్యరాయాంధ్ర మను బృహన్నిఘంటు వీ ప్రభుపతంసుని వితరణగుణమునకును, ఆంధ్రభాషాదరణమునకును చక్కని తార్కాణము. పలుపలుకులేల, పిఠాపురము రావువంశమువారి కీర్తిమూర్తిని చిరస్థాయిగా నిలుపుట కిదియొక్కటి చాలు.

ఆంధ్రసాహిత్యపరిషత్తు, ఆంధ్రప్రచారిణీగ్రంథమాల, ఆంధ్రభాషాభివర్ధినీ సంఘము, ఆర్యభారతీగ్రంథమాలిక, వావిళ్ళ రామస్వామిశాస్త్రి అండ్ సన్స్,

విజ్ఞానచంద్రికా గ్రంథమండలి, వేగుంజుక్కగ్రంథమాల మున్నగు గ్రంథ ప్రకాశకసంస్థలకు రాజాగారు భూరిగా విరాళములిచ్చి విద్యావిజ్ఞానవ్యాప్తికి తోడ్పడిరి.

కందుకూరి వీరేశలింగముపంతులు, చిలకమర్తి లక్ష్మీనరసింహము, ఆదిపూడి సోమనాథరాయకవి, పానుగంటి లక్ష్మీనృసింహరావు, వేంకట రామకృష్ణకవులు, వేదము వేంకటరాయశాస్త్రి, వావిలకొలను సుబ్బారావు, కాలెంపూడి రాజమన్నారుకవి, కాశీ కృష్ణాచార్యులు, పురాణపండ మల్లయ్య శాస్త్రి, కూచి నరసింహము మున్నగు కవిపండితుల రచనలు ముద్రితమగుటకు రాజాగారు సాయపడిరి.

పురాణపండ మల్లయ్యశాస్త్రిగారి లఘుటీకతో ప్రభావతీప్రద్యుమ్నమును, మల్లయ్యశాస్త్రిగారి సుబోధినీ వ్యాఖ్యాన సహితముగా భద్రాపరిణయమును, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి పరిష్కారముతో కళాపూర్ణోదయమును, నడకుదుటివారి పీఠికాపరిష్కారములతో తాళ్ళపాకవారి ద్విపదపరమయోగి విలాసమును, పేకుమళ్ళ అచ్యుతరావుగారి పీఠికాయుక్తమగు చింతలపూడి ఎల్లనార్యుని విష్ణుమాయా నాటకమును, పురాణపండ మల్లయ్యశాస్త్రిగారిచే అనూదితమయిన ఆంధ్రబ్రహ్మసూత్రభాష్యమును రాజాగారు స్వయముగ ప్రచురింపఁజేసి యార్షధర్మాభిరతిని, ఆంధ్రసాహితీపోషకాభిలాషను వెల్లడించిరి. సర్వజ్ఞసింగభూపతి సుమనోమనోజ్ఞ కవితాప్రజ్ఞ కాకరమగు రత్నపాంచాలికా నాటికకు ఆంధ్రానువాదము చేయించి ఎడపెడ సంస్కృతాంధ్ర విభాగములుండు నట్లు మూలముతోకూడ అనువాదమును ముద్రింపించి ప్రకటించినారు. సవిమర్శమును, సయుక్తికమునునగు వీరి యీ గ్రంథపీఠిక రాజాగారి సాహితీప్రియత్వమును, భాషాపటుత్వమునే కాక వారి రసగ్రహణశక్తిని, సత్యనిర్ణయబుద్ధిని వ్యక్తీకరించునట్టిది.

చావలి నృసింహసూరి తనయుఁడగు రామసుధి బుధరంజనీ వ్యాఖ్యా సహితమును సూర్యరాయ యశోభూషణపర్యాయనామకమును నగు 'సాహిత్య చింతామణి' యను నలంకారశాస్త్రగ్రంథమును, కందుకూరివారి ఆంధ్రకవుల చరిత్రమును, పిఠాపురాస్థానకవులు శతావధానులు వేంకటరామకృష్ణకవులు రచించిన దమయంతీకళ్యాణ వ్యాసాభ్యుదయ విశ్వగుణాదర్శ కథాసరిత్సాగ రాదులు, కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి బ్రహ్మానందమను నచ్చతెలుఁగు ప్రబంధమును, మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి షడ్దర్శన సంగ్రహమును సూర్యరావుబహద్దరుగారు కృతిస్వీకరించిన గ్రంథములలో కొన్ని.

ఆదిపూడి సోమనాథరాయ ప్రణీతమగు విజయేంద్రవిజయమను నవ్యప్రబంధము పిఠాపురము రాజాగారేర్పఱిచిన నవ్యాంధ్ర ప్రబంధరచన

పోటిపరీక్ష నిమిత్తము రచితమయినది. హర్షలతా విజయేంద్రులను నాయికా నాయకుల అభ్యుదయగాథ నభివర్ణించు కల్పితేతివృత్త ప్రధానమైన కమనీయ కావ్య మిది.

తుమురాడ సంగమేశ్వరశాస్త్రి, వీణ శేషయ్య, గోవిందస్వామి పిళ్ళె, మైసూరు రాచప్ప మొదలగు ప్రసిద్ధ సంగీతవిద్వాంసులును, కాకినాడలోని సరస్వతీగానసభవారును రాజాగారి కళాప్రియత్వమును చవిచూచినవారు. చేమకూర భాష్యకారరావు మున్నగు చిత్రకారులను బొంబాయి మొదలగు తావులకుసంపి చదివించి ఆదరించియు, చిత్రికళాప్రదర్శనముల నేర్పఱిచియు చిత్రకళను రాజాగారు పోషించిరి.

కాకినాడలోని పిఠాపురం రాజా కాలేజీకి రెండున్నరలక్షలును, అనాథ శరణాలయమునకు రెండు లక్షలును, పిఠాపురములోని భావయ్యమ్మారావుగారి ఉన్నత పాఠశాలకు 50 వేలును, రాజమహేంద్రవరములోని హితకారిణీ సమాజమువారి పాఠశాలకు 50 వేలును, కలకత్తాలోని సిటీకాలేజికి 30 వేలును విరాళమిచ్చిరి. 1927 లో ఆంధ్ర విశ్వకళాపరిషత్తునకు ప్రో-ఛాన్సలర్‌గా నుండిరి. 1938 లో ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారి డి.లిట్. గౌరవపట్టమును బడసిరి. 'లలితసుమనోజ్ఞ కావ్యమంజుల లతాంతమాలికాభరణా! వినిర్మల విశేష సుగుణ మాణిక్య దివ్యతేజోవిరాజి దీనజన హృదయాంతరస్థిరవిహార రామరాయేంద్ర శ్రీ సూర్యరాయజయము' అని నవ్యరవి దేవులపల్లి వేంకటకృష్ణ శాస్త్రి సూర్యరాయలకు జేజేపెట్టినారు.

## పిఠాపురము యువరాజు

సూర్యరావుబహద్దరుగారి కుమారుఁడు యువరాజా రావు వేంకటమహీపతి గంగాధరరామారావుగారు. వీరు 1910 లో జన్మించి తిరుపాచూరు సంస్థానాధీశ్వరులగు శ్రీ రాజా ఇనుగంటి వేంకటరాయనింగారి కడగొట్టు తనయయగు వేదవతీ దేవిగారిని 1929 లో పరిణయమాడిరి. 1930 లో తండ్రిగారితోపాటు యువరాజుగారు ఎనిమిదినెలలపాటు యూరప్, అమెరికా ఖండములను దర్శించి వచ్చిరి. యువరాజాగారు గీర్వాణాంధ్రాంగ్ల భాషాకోవిదులు. శతావధానులు వేంకటరామ కృష్ణకవులు వీరి విద్యాగురువులు. నవ్యాంధ్ర సాహిత్యవీథులలో యువరాజాగారి పౌర క్రొత్తనడక. అపూర్వకల్పనాచమత్కృతి, స్వతంత్ర భావనాశక్తి, వినూత్న వ్యక్తీకరణరీతి వీరి నాజూకుపోకడలలోని విశిష్టతలు. చినుకుల చిందులు అను ఖండ కావ్యమును, పరికృతి, దేవుడు, ప్రేమ మొదలగు పంద్రెండంశములపై జిజ్ఞాసను రేకెత్తించు రీతిని వ్యావహారిక భాషలో వ్రాయఁబడిన 'సువిశాల మిదం విశ్వమ్' అను గద్యకృతియును, 'ఆలోకము నుండి ఆహ్వానము' అను నాలుగు అంకముల నాటకమును,

స్వార్థత్యాగమను నాలుగంకముల నాటకమును, తరంగములను ఖండకావ్య సంపుటియును వీరి ముఖ్యరచనలు. పెద్దనగారి మనుచరిత్ర ప్రబంధములోని మొదటి మూఁడాశ్వాసముల కథను ఇతివృత్తముగా స్వీకరించి పెద్దన పద్యములనే వాడుచు నడుమ నడుమ కొన్ని సంధానవాక్యముల నాయాపాత్రముల ముఖమున చెప్పించుచు నిర్వహింపఁబడిన వరూధినీ ప్రవరాఖ్యము అను నాలుగంకాల నాటకముకూడ వీరికృతియే. ఇది వీరి తండ్రిగారి కంకితము. వేంకటపార్వతీశ్వరకవులు రచించిన శ్రీ రామరాజ నీతి యను కృతియు, బృందావనమను పద్యకావ్యమును, సి. వి. యస్. నారాయణ దాసుగారి 'ముక్తధార' నాటికా సంపుటియును యువరాజావారి కంకితము. రాజులకును ప్రకృతులకును నవశ్యానుష్ఠేయములగు నీతులు 'శ్రీరామరాజనీతి' లో పద్య రూపమున సంగ్రథితములు. రవీంద్రకవీంద్రుఁడు రచించిన ముక్తధార మొదలగు నాటికల యనువాదము నారాయణదాసుగారి రచనము.

## ఉపజీవ్య గ్రంథసూచి


1. శ్రీరాం వీరబ్రహ్మకవి, శ్రీ పీఠికాపుర సంస్థానచరిత్రము.
2. కాశీ కృష్ణాచార్యులు, అవధానయాత్ర, పుటలు 165–168.
3. పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి, పీఠికాపుర సంస్థానము – వాఙ్మయ పోషణము, శ్రీ మహారాజా సూర్యరాయ షష్టిపూర్తి సమ్మానసంపుటము, పుటలు 38–52.
4. డా. గిడుగు సీతాపతి, పంతులుగారి సమకాలికులు, వీరేశలింగముపంతులుగారి స్మారకసంచిక.
5. ఆంధ్రవిజ్ఞానము, సంపుటములు 1, 2, 6.
6. తెలుగువిజ్ఞానసర్వస్వము, సంపుటములు 3, 6.
7. అద్దేపల్లి నాగగోపాలరావు. ఆంధ్రభోజుఁడు, సర్ సి. ఆర్. రెడ్డి కళాశాలా పత్రిక, 1964, పుటలు 5–7.
8. W. W. Hunter, Imperial Gazetteer of India, Vol. XX, New Edition, 1908, pp. 153–156.
9. C. A. Souter and K. N. K. Ayyar, Gazetteer of the East Godavari District, Vol. II, Madras, 1935.
10. V. L. Sastri, Encyclopaedia of the Madras Presidency and the Adjacent States, pp. 475–477.
11. M. Sankara Linge Gowda, Zamindari Taxation Enquiry Committee Report, Vol. I (Pithapuram Zamindari), 1936.
12. Report of the Madras Estates Land Act Committee, Part II, pp. 51–55.
13. M. A. M. P. Vol. I, p. 57.

# పుంగనూరు

## ప్రవేశిక

పడమటి పాళయములలో పుంగనూరు సంస్థానముకూడ ప్రాచీన చరిత్రము కలిగినది. ఇది నేఁటి చిత్తూరుమండలము లోనిది. వైశాల్యము 648 చ.మై. గ్రామములు 675. ఇందులో సర్వదుంబాల యీనాములు 28, జంగములకును బ్రాహ్మణులకును నీఁబడిన శ్రోత్రియములు 51, నౌకర్ పేష్ 15, అమర్ మక్తా (నిర్దిష్టమయిన పన్ను చెల్లించెడివి) 43, అమర్ బార్ పానే (రివెన్యూలో నూటికిరువదియైదువంతున శిస్తుగలవి) 96 చేరియున్నవి. 1858లో దత్తమండలముల సర్దుబాట్లలో పుంగనూరు సంస్థానము ఉత్తరార్కాడు జిల్లాకు మార్పఁబడినది. అంతకుపూర్వము విశాలమయిన కడప మండలములో నొక భాగముగా నుండినది. ఆ దరిమిలా జరిగిన జిల్లాల పునర్విభజనములో క్రొత్తగా రూపొందిన చిత్తూరుమండలము నం దంతర్భాగ మయినది. 1878లో ఈ సంస్థానము రాఁబడి రూ. 2,86,000 లు. సాలుసరి పేష్కషు 66వేల పైఁబడి. 1938లో రాఁబడి రూ. 1,62,196 లు. పేష్కషు రూ. 91,169 లు.

## సంస్థాన చరిత్రము

పుంగనూరు పాళయగాండ్ర పూర్వులు పదుమూడవ శతాబ్దినుండి యీ ప్రాంతమును పాలించుచుండిరఁట! ఆ పిమ్మట విజయనగర సామ్రాజ్యమునకు సామంతులుగా వ్యవహరించిరి. అక్కడ ఉగలిగినపుడు అయిదువేల కాల్బలము నాయత్తపఱచిపంపు అమరనాయంకరము నిబంధనముమీఁద వీరికి మైసూరు సీమలోఁగూడ కొన్ని జాగీరు లుండినవి. వీరు వీరశైవలింగాయతులు. ఇంటి పేరు సుగుటూరివారు. 1642లో నీ సంస్థానాధీశులు బిజాపూరు సుల్తానుచే పదచ్యుతినొంది, పుంగనూరు పట్టణమునకు సమీపములోని ఆవులపల్లి ప్రాంతమునకు పాఱిపోయి తలదాఁచికొనిరి. పరిస్థితులు కొంత సర్దుకొనిన పిమ్మట పుంగనూరు పాలకులు హైదరాబాదుకుపోయి, నవాబునకు నజరానాలు సమర్పించి ఆవులపల్లి, పుంగనూరు సీమలను జాగీరులుగా సంపాదించిరి. ఇవి పూర్వము మదనపల్లి పాళయగాని యేలుబడిలోనివి. పుంగనూరు పాలకులు ఔరంగజేబు కాలమువరకు ఆఱువేలవరహాలు కప్పము చెల్లించుచుండిరి.

1713 దాఁక పుంగనూరు హైదరాబాదునకు సామంతరాజ్యముగానుండినది. కాని 1713లో కడప నవాబు అబ్దుల్ అలీఖాన్ పుంగనూరు పాలకుని

ఓడించి తనకే కప్పము కట్టునట్లు చేసెను. 32,000 వరహాలు కప్పమును. 2,000 అమరము సేనయును ఆయత్తపఱుచు షరతుమీఁద క్రొత్తపట్టా ప్రసాదింపఁబడినది. 1747లో ఈ సంస్థానాధిపతి కందూరు, సదముసీమలు కూడ తన పూర్వపుఎస్టేటులోని భాగములుగావున వీనిపైకూడ తనకు హక్కుగలదని నిరూపించి కడప నవాబుల యనుమతిమీఁద వానిని తనసంస్థానమునఁ జేర్చి కొనెను.

1755లో జరిగిన మరాఠీదండయాత్రలవలన పుంగనూరు సంస్థానాధిపత్యము పూర్వపాలకుల వశమునుండి తప్పిపోయినది. పాళయగాఁడును నతని సమీపజ్ఞాతులు చాలమందియును మరాఠీలతోడి పోరులో మరణించిరి. మరాఠీ సేనాని మాధవరావు క్రొత్తపాళయగానిని నియమించి 32,000 వరహాల కప్పము నేర్పాటుచేసెను. తరువాతి యిరువదేండ్లలో సంస్థానము చాలచేతులు మాఱినది. 1774లో హైదరాలీ పుంగనూరు నాక్రమించి యప్పటికప్పుడు 45 వేల వరహాల కప్పము వసూలుచేసి సాలీనా కప్పమును 30 వేలుగా నిర్ణయించెను. 1782లో జరిగిన వందవాసియుద్ధమున హైదరాలీ పక్షమున పోరాడి పుంగనూరు పాళయగాఁడు మరణించెను. ఆ పిమ్మట వెనుకటిపాళయగాని కొడుకు పట్టమునకువచ్చెను. కాని టిప్పుసుల్తాను కప్పము చెల్లింపలేదను సాకుపెట్టి 1787లో పాళయగానిని పదచ్యుతుని గావించెను. 1791 నాఁటి మైసూరుయుద్ధము సందర్భమున ఈ పాళయగాఁడు మరల జమీని పొందఁ గలిగెను. కప్పము సరిగా చెల్లనందున టిప్పుసుల్తాను 1795లో మరల పాళయగానిని తొలఁగించెను. మైసూరుయుద్ధసందర్భముగా నీ సంస్థానప్రభువులు కార్నువాలీసునకు రవాణాసామగ్రిని ఆయత్తముచేసి సాయపడిరఁట. 1799లో టిప్పుసుల్తాను మరణించిన తరువాత సంస్థానపరిపాలనము మరల పాళయగానికి వచ్చి అఱువదివేల కప్పము ఖరారయినది.

కుంఫిణీ హయాములో ఈ సంస్థానము బలము చాలవరకు క్షీణించినది. సొంతసేనల నుంచికొనుపద్ధతి రద్దయినది. 1808లో మూఁడేండ్లపాటు ఈ సంస్థానము కప్పులన కీఁబడినది. ఆ పిమ్మట 1825 దాఁక కడపమండలము కలెక్టరు ఆధిపత్యమున ఈ సంస్థానమున రైతువారీ విధాన మమలుచేయఁబడినది. 1825లో సంస్థానాధిపతి చేసిన విజ్ఞప్తిని పురస్కరించికొని కుంఫిణీవారు సంస్థానాధిపత్యమును నతనిపరము గావించిరి. 1832లో సంస్థానాధీశ్వరుఁడు నిస్సంతుగా మరణించి నందున సంస్థానాధిపత్యము నిమిత్తము పెద్ద వివాదము పుట్టినది. పరిష్కారము కుదిరి, మరణించిన రాజాగారి సోదరులకు సంస్థానాధిపత్యము సంక్రమించినది. 1891లో శాశ్వతపుసన్నదు ప్రసాదింపఁబడినది. 1879లో సంస్థానమును పాలించిన రాజా సుగుటూరు ఇమ్మడి శంకరరాయ యశోవంతబహద్దరును,వారి తరువాతి పాలకులు రాజా సుగుటూరు ఇమ్మడి

సాంబశివచిక్కరాయ యశోవంతబహద్దరును చాల ముఖ్యులు. ఇమ్మడి సాంబశివచిక్కరాయ యశోవంత బహద్దరు వారు సి. ఐ. ఇ. బిరుదాంకితులు. రాజా సుగుటూరు ఇమ్మడి వీరబసవచిక్కరాయ యశోవంతబహద్దరుజమీందారు వారు సంస్థాన పాలకులలో చివరివారు.

## సాహిత్యపోషణము

సుగుటూరివారి పాలకవంశము చిత్తూరు, కోలారు, ముళబాగళు ప్రాంతములలో చాల ప్రసిద్ధమయినది. మైసూరు సీమలో వీరి శాసనములు చాలఁగలవు. ముళబాగళు ప్రాంతమునందలి సుగుటూరివారు కొంతకాలము మైసూరు ప్రభువులకు సామంతులుగా నుండిరి. వీరికి చిక్కరాయ బిరుదముండి నది. సుగుటూరి ముమ్మడి తిమ్మభూపతి (1614—1630) సంస్కృతాంధ్ర కర్ణాటములలో విద్వత్కవియఁట. శివదర్పణ రసికజనమనోరంజన కౌముదీ వ్యాఖ్యానము లితని గీర్వాణకృతులు. రాజేంద్రచోళచరిత్ర, కుమారార్జునీయము, సౌందరేశచరిత్ర వీరి తెలుఁగు రచనలు. శంకరసంహిత వీరి కన్నడ రచన యఁట. సుగుటూరి చిక్కరాయేంద్రుని కోరిక మేరకు బద్దెవీటి దత్తప్ప కవి 'గణితదీపిక' యను పద్యకావ్యము సంతరించెనఁట. ఈ చిక్కరాయప్రభువు పదునారవ శతాబ్ది ఉత్తరార్ధపు వాఁడఁట. దీని లిఖితప్రతి చెన్నపురి అడయారు గ్రంథాలయమునఁగలదు. దత్తప్పకవి తాను పుల్లయ్య మంత్రి పుత్రుఁడననియు '....ధాత్రిపై రాజులు సుగుటూరి చికరాయ మహేంద్రుఁడు గారవింప....' సమున్నతిగాంచిన వాఁడననియు చెప్పుకొనినాఁడు.

సుగుటూరివారికిని ముళబాగళు పాలకులకును పూర్వమునుండియు సంబంధబాంధవము లుండినట్లు తెలియుచున్నది. శివరహస్యఖండ కృతిపతియగు ముళబాగళు భూపతి యగ్రజయగు నంజాంబ యొక సుగుటూరి ముమ్మడి చిక్కరాయనిఁ బెండ్లియాడినది. శివరహస్యఖండము బాలసరస్వతి కోడూరువేంకటాచలకవి ప్రణీతము. అష్టాదశ పురాణములలో స్కాందము చాలపెద్దది. అందలి సనత్కుమారాది సంహితలలో శంకరసంహిత ద్వాదశఖండసహితము. ఈ పండ్రెండింటిలో శివరహస్యఖండము మొదటిది. ఇది సంభవ అసుర వీర మహేంద్ర యుద్ధ దేవ దక్ష ఉపదేశములను సప్తకాండసంయుతము. దీని యాంధ్రీకరణమే వేంకటాచలకవి రచనము.

వేంకటాచలకవి మాతులుఁడగు ఉరుటూరి వేంకటకృష్ణకవి రాఘవ యాదవ పాండవీయాది మహాప్రబంధనిర్మాతయై శ్లేషకవితాపితామహుఁడని ప్రఖ్యాతి వడసెనఁట.

ముళబాగళు పెదలింగన తనయయగు చెన్నమాంబను సుగుటూరి యిమ్మడి తిమ్మనృపాలుఁడు పరిణయమాడి తమ్మనృపాలుని కనెను. ఇతఁడు—

'ప్రకటారాతి విదార్యనర్గళభుజాప్రావీణ్య మింపార వా
రక నెంతే మధురాపురీ విభుని దర్పంబెల్ల వారించి భూ
రి కృపాణోద్ధతిచేత వేంకటపతి శ్రీ రాయసన్మాన్యుఁడై
చికరాయాఖ్య వహించె భాసుర జయశ్రీధుర్యుఁడై వేడుకన్.'

పుంగనూరు పాలకులకును మఙ్బాగళ ప్రభువులకునుగల సంబంధము లింకను ముమ్ముందు నిర్ణీతముకావలసియున్నవి.

పుంగనూరు మాణిక్యస్వామి ముద్రగల పదములకు కర్తలెవరో విజ్ఞులు వివేచింపవలసియున్నది.

పుంగనూరు చివరి పాలకులయిన ఇమ్మడి వీరబసపచిక్కరాయ యశోవంతబహద్దరు జమీందారువారు ఆంధ్రసాహిత్యపోషకులు. పూతలపట్టు శ్రీరాములు రెడ్డిగా రాంధ్రీకరించిన కంబరామాయణగ్రంథప్రచురణము నిమిత్తము భూరిగా విరాళము నొసంగిరి.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. బులుసు వేంకటరమణయ్య, ఆంధ్రకవిసప్తశతి, పు. 93.

2. V. L. Sastri, Encyclopaedia of the Madras Presidency and the Adjacent States, pp. 468,469.

3. Imperial Gazetteer, Provincial Series, Madras, II, pp. 22, 23.

4. J. D. B. Gribble, A Manual of the District of Cuddapah in the Presidency of Madras, pp. 89, 90.

5. C. F. Brackenbury, Gazetteer of the Cuddapah District.

6. N. Venkata Rao, The Southern School in Telugu Literature, pp. 448–450.

7. M.A.M.P. Vol. II, pp. 294–301.

# పెద్దాపురము

## ప్రవేశిక

పెద్దాపురము ప్రాగాంధ్రమునందలి పురాతనసంస్థానములలో నొకటి. ఇంచుమించు మూఁడువందలయేండ్లకు పైఁబడిన పూర్వచరిత్ర కలది. గోదావరీమండలములోని చాలభాగమును, కృష్ణా గుంటూరుమండలములలోని కొంతభాగమును, విశాఖపట్టణముమండలములోని కొన్నిగ్రామములు తోటపల్లి, రంప, చోడవరము మొదలగు మన్యపుసీమలును ఒకనాఁటి పెద్దాపురపు సంస్థానమునందలివి. సంస్థానముఖ్యపట్టణ మయిన పెద్దాపురము తూర్పుగోదావరి మండలములో రాజమహేంద్రవరమున కీశాన్య దిశలో పదికోసుల దూరమున నున్నది. శాశ్వతపరిష్కారకాలము (1803) నాఁటికి పెద్దాపురసంస్థానపు ఆదాయము పదిలక్షలు. సాలుసరి పేష్కషు ఆఱున్నరలక్షలు. చాఁపంత సంస్థానము చిరిగి చదరయయి చివరిదశలో కొట్టాము, తుని ఎస్టేటులరూపమున పరిణతినందె, ఆధునికయుగమున ఆంధ్రప్రదేశరాష్ట్రమున అంతర్లీనమయినది. రాజా వత్సవాయి వేంకటసూర్యనారాయణజగపతిరాజు పేర నమోదయియుండిన కొట్టాము ఎస్టేటు రాఁబడి రెండున్నరలక్షలు. పేష్కషు రూ. 26,173 లు. ఈ ఎస్టేటు ముఖ్యపట్టణము తాండవనదిగట్టునఁగల తుని.

## సంస్థాన చరిత్రము

పెద్దాపురసంస్థానపాలకుల పూర్వులు ఉత్తరదేశమునుండి వలసవచ్చి గోదావరి, నెల్లూరు, కృష్ణా, విశాఖపట్టణమండలములలో స్థిరపడిన క్షత్రియ కుటుంబములలో నొక కోవవారు. వీరిలో మందపాటివారు, వత్సవాయివారునని రెండువర్గములవారు ముఖ్యులు. కాశ్యపసగోత్రులగు మందపాటివారు ఒంగోలు నందును, వసిష్ఠగోత్రులగు వత్సవాయివారు పెద్దాపురమునందును పాలకులుగా ప్రసిద్ధులయిరి. వీరు సూర్యవంశోద్భవులగు నాంధ్రక్షత్రియులు. వీరిది వసిష్ఠ గోత్రము ; ఆంధ్రక్షత్రియులలో పరిచ్ఛేదసంజ్ఞ కలవారు. వీరి మూలపురుషుఁడు దుర్జయుఁడఁట ! గుడిమెట్టసాగిపోతరాజు వీరి పూర్వులలో నొకఁడఁట ! వీరి కూటస్థులు వత్సవాయి శ్రీరామరాజుగారు. సాగిపోతరాజుగారి మనుమని మనుమఁ డయిన రామరాజుగారి కాలమున 'వత్సవాయి'గ్రామము వీరికి రాజధానియగుటచే వీరు వత్సవాయి గృహనామకు లయినటులు దెలియుచున్నది*. వీరిపూర్వులు

* గూడవల్లి రామబ్రహ్మం, చాగివారు, భారతి, 1932, నవంబరు, పుటలు

కొంతకాలము ఈ ప్రాంతమునేలిన రెడ్డిరాజులకు సరదారులుఁగా నుండిరఁట!

వత్సవాయి చతుర్భుజ తిమ్మరాయజగపతిబహద్దరుగారు సంస్థాన సంపాదకులు. పరిసరములందలి పాలకులనోడించి, రాజ్యమును విస్తరింపఁజేసి పెద్దాపురములో నొకకోటను గట్టిరి. వీరితండ్రి వత్సవాయి పేరరాజుగారు. తల్లి గొట్టుముక్కలవారి యాఁడుఁబడుచగు నారమాంబగారు.

'తిమ్మరాజ శిఖామణి తేజరిల్లె
నతని కీర్తి నటించు శీతాద్రిసేతు
మధ్య పృథ్వీశ్వరాస్థాన మంటపములు'

—రామవిలాసము, అవతారిక, పు. 21.

ఆనాఁటి సుబాదారయిన షేర్ మొహమ్మద్ ఖానుఁడు చతుర్భుజతిమ్మరాజు బహద్దరుగారి వీరోచితకృత్యములను మెచ్చి యొకకత్తిని బహూకరించెనఁట!

'షేరుమొహమ్మదు క్షితిపశేఖరుఁ డద్భుతశౌర్యధైర్య దు
ర్వారుఁడు మెచ్చి పైఁడియొఱవాల్దన కేల నొసంగువేళ దై
త్యారిసమానమూర్తి తనహస్తము మీఁదుగనందె వార్ధిగం
భీరుఁడు వత్సవాయికుల పేరయ తిమ్మనృపాలుఁడున్నతిన్'

—పైది, పు. 23.

తిమ్మరాజుగారికాలము పదునాఱవ శతాబ్ది ఉత్తరార్ధము (1555–1607). వీరు సప్తసంతానముల నిల్పి ప్రశస్తిఁగాంచినవారు.

వీరి కుమారుఁడు రాయజగపతి (1607–1646) జగదేకవీర రాజాధిరాజ రాయవేశ్యాభుజంగాది రమ్యబిరుదశాలి. నవాబులు సాధింపలేని దుర్గముల నవలీల గెలిచి కీర్తిని విలిచిన వీరుఁడు; మహమదుబేగు నదిమి మెచ్చఁదగిన ధమామీలు దెచ్చికొనిన ధీరుఁడు.

'పీఠికాపురి కిమ్మూరు బిక్కవోలు
తునియుఁ గొర్థాము మొల్లేరు ఘనత నేలె
వత్సవయి తిమ్మభూపాలవరుని సుతుఁదు
రాజమాత్రుఁడె రాయపరాజశౌరి' —తుల్యామాహాత్మ్యము.

రాయజగపతిరాజుగారికి సూరమాంబవలన సార్వభౌమ తిమ్మజగపతి (1618–1688), బలభద్రజగపతి అను నిరువురుకుమారులు. సార్వభౌమ తిమ్మజగపతి 1649 నుండి 1688 దాఁక సంస్థానమును పాలించెను. ఈయన గొప్ప యుద్ధవీరుఁడు.

'దుగరాజు మొదలైన దొరలను భంగించి
విశ్వంభరుని యుద్ధవిరతుఁజేసె' —రామవిలాసము, పు. 29.

769–777; పెనుమెచ్చ సత్యనారాయణరాజు, చాగివారు, భారతి, 1933, ఫిబ్రవరి, పుటలు 273–275; త్యాగరాజు లేక సాగ్నిరాజు శబ్దముల వికృతి చాగిరాజు అని వీరి నిరూపణము.

ఇందలి విశ్వంభరదేవుఁడు 1672–1676 మధ్య జయపూరును పాలించినవాఁడు. సార్వభౌమ తిమ్మజగపతికి సంతతిలేనందున వీరిసోదరుఁడు బలభద్రజగపతిరాజుగారికి వెంకాంబవలనఁ గలిగిన కుమారులు ఉద్దండరాయ జగపతి సంస్థానపాలనమునకు వచ్చిరి. '....ఘనరాజమండలనిరోధము చేసిన జాపరల్లి వింధ్యగిరిని నామశేష మగునట్టుగ....' (పైది, పు. 38) కావించిన వీరుఁ డితఁడు. వీరి పాలనము 1688 నుండి 1714 వరకు సాఁగినది. 1714 లో ఉద్దండరాయజగపతిగారు మరణించుటతో వీరి ముగ్గురుకుమారులు తిమ్మ భూపతి, బలభద్రక్షితిపతి, సూరనృపతి మైనరులయినందున నీతనిభార్య రాగమ్మ గారు పెద్దకుమారుఁడయిన కళాతిమ్మజగపతిపేర రాజ్యపాలనము చేపట్టిరి. ఈమె గొట్టుముక్కలవారి యాఁడుఁబడుచు. ఈమె పాలన మించుమించుగా నిరువదియేండ్లపాటు సాఁగినది.

రాగమ్మగారికాలమున పెద్దాపురసంస్థానమునకు పెద్దవిపత్తు దాపుర మయినది. మొగలుపాదుషాలపాలనము నందలి దక్కనుసుబాలోని యిరువది రెండు పరగణాలలో రాజమండ్రియొకటి. ఔరంగజేబుమరణముతో మొగలు పాదుషాలకు సుబాదారుగానుండిన కమురుద్దీన్ ఆసఫ్‌జా స్వతంత్రుఁడయ్యెను. రాజమండ్రిలో రుస్తుంఖానను అధికారనామముగల 'హాజీ హుసేను' అనువాఁడు సుబాదారు ప్రతినిధిగానుండెను. జమీందారులనుండి శిస్తులను వసూలుచేయుట రుస్తుంఖానుపని. వీని కుమారుఁడు నూరుద్దీన్. వీరిద్దఱును పూర్వము పెద్దా పురమువారి కొలువులో కొంతకాలముండినవారు.

రుస్తుంఖాను చాలక్రూరుఁడు. వీని చండశాసనము జమీందారుల కందఱకును కంటకముగ నుండెడిది. మొగలితుఱ్ఱునకుఁజెందిన కలిదెండి రామరాజు, నూజివీటికిచెందిన సుబ్బన్న మొదలగు జమీందారులు రుస్తుంఖానుపై తిరుగఁబడి రెండుసార్లు యుద్ధముచేసి యోడిపోయిరి. మొగలితుఱ్ఱు కైఫీయతు ప్రకారము మొగలితుఱ్ఱుజమీందారు రుస్తుంఖానుపోరుపడలేక సంస్థానమును వదలి పాఱిపోయి నూజివీటి సుబ్బన్నగారితో కలసి పెద్దాపురమువారి నాశ్రయించిరఁట.

పెద్దాపురమువారి సేనల తోడ్పాటుతో వీరు రుస్తుంఖానునెదిరించి యోడి పోయిరి. ఆ పిమ్మట పిఠాపురముజమీందారు రావు వేంకటకృష్ణారావుగారి సాయమునువేఁడి రుస్తుంఖాను నోడించుటకు వ్యూహములు పన్నుచుండిరి. దీని నెఱిఁగి రుస్తుంఖానుఁడు వీరిపై దండెత్తి యీ మువ్వురనోడించి తోటపల్లి మన్యములను పట్టించెను. ఆ పిమ్మట రుస్తుంఖానుఁడు మాయోపాయముచే పెద్దాపురమును వశపఱిచికొనెను. సామర్లకోట, కిమ్మూరు, పూసపాటి కైఫీ యతులు రుస్తుంఖానుని చర్యలను విపులముగా వర్ణించినవి. పెద్దాపురమువారిపట్ల రుస్తుంఖానుఁడు ప్రదర్శించిన ద్రోహబుద్ధి యతనికొడుకగు నూరుద్దీనునకు

నచ్చక పిఠాపురమునొద్ద తండ్రినిచంపి సర్లష్కరగు అన్వరుద్దీను ననుమతితో రాజమండ్రికి తండ్రికిబదులుగా జిల్లాదారుఁడయ్యెను. ఆ పిమ్మట విజయనగరము విజయరామరాజుతో జరిగిన చేబ్రోలుయుద్ధమున నూరుద్దీను హతుఁడయ్యెను.

రాగమ్మగారి ముగ్గురుకుమారులలో చివరి యిద్దఱును రుస్తుంఖాను కపట ప్రబంధమున కెరయయియుండిరి. మొదటివాఁడగు కళాతిమ్మజగపతితనయుఁడు రాయజగపతి విజయనగరము వారి* తోడ్పాటుతో మరల పెద్దాపురసంస్థానమును సంపాదించి పాలించెను. రాయజగపతికి సీతాంబవలనఁగలిగిన కుమారులు విద్వత్తిమ్మజగపతిగారు (1760—1797). ఈయన కుమారుడు రాయజగపతి (1797—1804). ఈయనకాలమునందే యింగ్లీషు కుంఫిణీవారు శాశ్వతకర పరిష్కారమును జరిపించి 1802 లో సంస్థానాధిపత్యమునకు సన్నదు నిచ్చిరి. ఈయన 1805 లో మరణించిరి. ఈయనకు లక్ష్మీనరసయ్యమ్మ, బుచ్చి సీతయ్యమ్మ, బుచ్చిబంగారయ్యమ్మయనియు ముగ్గురు భార్యలు. పట్టపురాణి యగు లక్ష్మీనరసయ్యమ్మగారు చౌదువాడలోని దాట్లవారి ఆఁడుఁబడుచు. ఈమెకు బుచ్చితిమ్మజగపతి (1795—1801) యను కుమారుఁడు కలిగెనుగాని యీ బాలుఁడు పసితనముననే తండ్రికిముందే మరణించినందున తిమ్మజగపతి యను సమీపజ్ఞాతుల బాలు నొకనిని దత్తుగాస్వీకరించిరి. ఆ బాలుఁడును మూఁడేండ్ల ప్రాయమునందే మరణించెను.

రెండవమాఱు ఆమె దత్తుచేసికొన ప్రయత్నింపఁగా వత్సవాయివారి సమీపజ్ఞాతులును, భీమవరపుకోట వాస్తవ్యులునునగు వత్సవాయి జగన్నాథరాజు గారు ఎట్టిపక్షమునందును రెండవదత్తు కూడదని యాక్షేపించుచు నొకవ్యాజ్యము తెచ్చి సదరదాలత్ కోర్టులో వాదించిరి. రెండవదత్తు శాస్త్రసమ్మతము కాదని న్యాయస్థానమువారు తీర్పు చెప్పిరి. రాజమండ్రి కలెక్టరుగారు వాదిప్రతివాదు లిరువురకు రాజీచేసి లక్ష్మీనరసయ్యమ్మగారు బ్రదికియున్నంతకాలము సంస్థానమును పాలించుటకును, ఆమె యనంతరము జగన్నాథరాజుగారికిఁగాని, యతని వారసులకుఁగాని సంస్థానము చెందుటకును, అందాఁక జగన్నాథరాజు గారి సుఖజీవనము నిమిత్తము పెద్దాపురముజమీలోని 'కొత్తాము' ముఠాను జగన్నాథరాజుగారి కిచ్చుటకునునిర్ణయించిరి. ఈ రాజీ మేరకు క్రీ.శ. 1810 లో కొత్తాము ఎస్టేటు పెద్దాపురము జమీనుండి విడిపోయి జగన్నాథరాజుగారి స్వాధీనమునకు వచ్చినది. లక్ష్మీనరసయ్యమ్మగారు 1814 లో మరణింపఁగా సంస్థానాధిపత్యమునకు మరల వివాదములు మొదలయినవి. జగన్నాథరాజు గారును లక్ష్మీనరసయ్యమ్మగారి సవతి యగు బుచ్చిసీతయ్యమ్మదేవిగారును నించుమించు పదునాలుగేండ్లు ఈ వ్యాజ్యమును నడిపించిరి. జగన్నాథరాజుగారు

*విజయనగర పాలకుఁడయిన పూసపాటి సీతారామచంద్రరాజుగారును, కళాతిమ్మ జగపతిగారును తోడియల్లుండ్రు.

1814–1817 లో సంస్థానమును పాలించిరి కూడ. 1817–1828 మధ్య సంస్థానము కలెక్టరుగారి పర్యవేక్షణమున నుండినది. చిట్టచివరకు 1828 లో రాణులందఱ యనంతరమే సంస్థానము జగన్నాథరాజుగారి వశమగునట్లు కోర్టులో తీర్పు చెప్పఁబడినది. బుచ్చి సీతయ్యమ్మదేవిగారు 1833 దాఁక పాలించి మరణించిరి. ఈమె పెద్దాపురమునందును ఒంటిమామిడి గ్రామము నందును సత్రములు నిర్మించిరి.

బుచ్చిసీతయ్యమ్మగారు తమభర్తగారు వారిభార్యలు ముగ్గురకును దత్తుచేసి కొను నధికారమిచ్చి రను నెపముతో తమ సవతిగారయిన లక్ష్మీనరసయ్యమ్మగారి దత్తస్వీకారము ఫలింపలేదుగనుక తాము దత్తుచేసికొనుటకభ్యంతరముండఁ గూడదని నిశ్చయించి కోటగంద్రేడు గ్రామముననున్న తమ మేనత్త మనుమలును, వత్సవాయి నరసరాజుగారి పౌత్రులును నయిన వేంకటపతి రాజుగారిని దీసికొని వచ్చి పెంచికొనుచుండిరి. ఈ నరసరాజుగారు చతుర్భుజ తిమ్మజగపతిరాజుగారి పెదతాతగారి సంతతిలోని వారును, రామవిలాస కృతిభర్తలగు వత్సవాయి గోపరాజుగారికి సమీపబంధువులును, దొంతమూరు వాస్తవ్యులును నయియుండిరి. విజయనగరసంస్థానమునందలి దాట్ల వేంకటరాజు కుముందానుగారికి నరసరాజుగారల్లురు. నరసరాజుగారందుచేత విజయనగర సంస్థానములోనిదగు కోటగంద్రేడు గ్రామమున కరిగి యచ్చటనే స్థిరపడియుండి పద్మనాభయుద్ధమున మరణించిరి.

బుచ్చిసీతయ్యమ్మగారి యీ దత్తత చెల్లదని కోర్టు తీర్పుచెప్పినది. బుచ్చిసీతయ్యమ్మగారి మరణము తరువాత సంస్థానము మరల తగవులలో పడినది. కాని 1836 లో రాయజగపతిరాజుగారి మూఁడవ భార్యయగు బుచ్చిబంగారయ్యమ్మగారు సంస్థానాధిపత్యమునకు వచ్చిరి. ఈమె సిద్ధాంతం నివాసులగు నల్లపరాజు శ్రీహరిరాజుగారి తోఁబుట్టువులు. మొగలితుర్రు జమీందారులగు కలిదిండివారికి వీరు సమీపబంధువులు. ఈమె రెండేండ్లు మాత్రము పాలించి మరణించెను. ఈమె తరువాత సంస్థానము జగన్నాథ రాజుగారి ఇరువురు పుత్రులలో జ్యేష్ఠులయిన రాజా సూర్యనారాయణజగపతి రాజుగారి వశమయినది.

ఇంచుమించుగా ముప్పదియేండ్లపాటు సంస్థానవ్యవహారములు న్యాయ స్థానములలో వివాదముపడియున్నందువలనను, సరియైన పర్యవేక్షణము లోపించుట వలనను, సుస్థిరపరిపాలనము లేనందువలనను సంస్థానము ఆర్థికముగా చిక్కులలో పడినది. ఈ యిక్కట్టులలో నున్నందున 1847 లో కిర్లమపూడి, దొంతమూరు, వీరవరము, కోలంక, కదలి, గొల్లప్రోలు, జగ్గమపేట, పలివెల, గోపాలపురము, కపిలేశ్వరపురము, తోటపల్లి మొదలగు పెద్దాపురము జమీలోని ముఠాలు ఏలము వేయఁబడి యన్యాక్రాంతములయినవి.

కొత్తాము ఎస్టేటు మినహా మిగిలిన పెద్దాపురసంస్థానభూమి ప్రభుత్వము స్వాధీనమయినది. రాజా సూర్యనారాయణజగపతిరాజు గారికి నెలకు రూ. 600 లు తవుజీ నిచ్చుచువచ్చిరి. వీరు 1847 దాఁక పాలించిరి. 1847 లో పెద్దాపురసంస్థానము కుంఫిణీప్రభుత్వము పరమయినది.

సూర్యనారాయణజగపతిరాజుగారి తరువాత రాజా జగన్నాథరాజుగారి ద్వితీయపుత్రులు రాజా వేంకటసింహాద్రిరాజుబహద్దరు (1843—1911) వదిన గారిపై దావాచేసి గెలిచి, 1879 లో కొత్తాముఎస్టేటు పాలనమును స్వీకరించిరి. వీరు తమ పూర్వులదగు పెద్దాపురసంస్థానమును తమకు ప్రసాదింపవలసినదని గవర్నరు గారికి విజ్ఞప్తిని పంపించిరి. కాని వీరి కోరిక నెఱవేరలేదు. వీరి యేకైక పుత్రుఁడు పసితనమునందే మరణించెను. చేతికందనున్న చెట్టంతకొడుకు అకాల మరణమునందుట వీరి దురదృష్టము. వీరితరువాత వీరిభార్య శ్రీ రాణీ వత్సవాయి వేంకటసుభద్రయ్యమ్మారావుగారు (1861—1933) ఇరువది రెండేండ్లపాటు ఎస్టేటు వ్యవహారములను సరిచూచుచు, భర్త స్థాపించిన ధర్మసంస్థలను నేర్పుగా నిర్వహించుచువచ్చిరి. కిర్లమపూడి ఎస్టేటునుండి 38 గ్రామములను, విశాఖపట్టణము మండలములోని కొన్ని ఏజెన్సీ గ్రామములను, పెక్కు ఇనాము గ్రామములను, ఇంకను ఎన్నో చిన్నచిన్న యెస్టేటులను కొని తమ యెస్టేటును నలుగడల పెంపుగావించిరి. వీరి దత్తపుత్రులు శ్రీ రాజా వత్సవాయి వేంకటసూర్యనారాయణరాజుబహద్దరుగారు 1932 లో జమీకివచ్చి సంస్థాన పాలనమును వహించియుండిరి.

## సాహిత్యపోషణము

పెద్దాపుర సంస్థానపాలకులు పెక్కురు విద్వత్ప్రభువులు. వీరిలో కొందఱు సమరాంగణమునందును, సాహితీరంగమునందును సమానాసక్తి శక్తులు గలిగినవారు. అనేకాగ్రహారములిచ్చి ద్విజసంతతి కాశ్రయమిచ్చినది వీరిశాఖ. సప్తసంతానములను ప్రతిష్ఠించి చరితార్థులయిన వీరి కథలు, గాథలు గోదావరీతీరభూములలో పెక్కులు నేఁటికిని జోళ్ళరోకళ్ళ పాడుట సర్వ సామాన్యము. వీనిలో కొన్నింటిని అక్షరరూపమున నవతరింపఁజేసిన వారు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు*. సంస్థానమునందంతటను వీరు నెలకొల్పిన అగ్రహారములు, అన్నసత్రములు, ఆరామములు, ఆలయములు, తటాకములు, విద్యాలయములు, వైద్యశాలలు వీరి ధార్మికతకు, ఔదార్యమునకు ప్రబల నిదర్శనములు. సాహిత్యమేగాక తక్కిన శాస్త్రములు, లలితకళలు, హస్తకళలు ఈ ప్రభుపోషణము నందినవి.

వేంకటసింహాద్రిజగపతిరాజున కంకితమీఁబడిన కువలయామోద మను

* చూ. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి చిన్నకథలు.

నాలంకారికగ్రంథమునందు పెద్దాపురసంస్థానవైభవమును, కవిపండితపోషణమును నిట్లు వర్ణింపఁబడినవి :

'శ్రీ రత్నాకర మేఖలావలయిత భ్రాజన్మహీమండలీ
నానాస్థానసరోరు నాయకమహారత్నం సముల్లాసితమ్
శ్రీ పెద్దాపుర భవ్యనామక మహాసంస్థాన మాసీద్భువై
శ్లాఘ్యం సత్కవిమండలైర్విలసితమ్ సంసేవితమ్ రాజభిః'

సంస్థానసంపాదకుఁడు చతుర్భుజతిమ్మజగపతిరాజుగారి వైదగ్ధ్యమును గొనియాడుచు నానాఁటి విజయనగరముప్రభువు విజయరామరాజు కూర్చెనని చెప్పఁబడుచున్న ఈ చాటువును చూడుఁడు :

'అంభోజం కలయన్ సదృక్ష మవనే సాహిత్యరీత్యామ్ దృశో
ర్మాంధాతార మపార సంపది మహాభావే యశోరాశిషు
శత్రూణాం పురభంజనే ధృతి గుణే కిం చోరగేంద్రంమతి
ప్రాగల్భ్యే ప్రతిభాతి తిమ్మనృపతిః పాకాహితప్రాభవః'—ఒక చాటువు.

## తొలి కవిపండితులు

1600 ప్రాంతమువాఁడగు వెణుతురుపల్లి విశ్వనాథకవి రచించిన 'శేష ధర్మములు' అను పద్యకావ్యము చతుర్భుజతిమ్మజగపతిరాజుగారి కంకిత మీఁబడినది. 'విశ్వనాథకవీంద్ర విరచిత శేషధర్మ ప్రబంధము సాదరముగనందె' నని రామవిలాసకావ్య మీ విషయమునే పేర్కొనుచున్నది (చూ. అవతారిక, పు. 22). విశ్వనాథకవి యార్వేల నియోగి, వేంకటామాత్య తనూజుఁడు, ఏనుగు పెదలక్ష్మణకవికి మేనమామ. ఏనుగు లక్ష్మణకవిచే స్తుతింపఁబడినవాఁడు. 'ప్రత్యక్ష బాహాట పాంచాల శయ్యలఁ జదివింపనేర్తు నేఁ జదువనేర్తు'నను బిరుదును నిలిపికొనిన బులుసు రామగోవిందశాస్త్రి తిమ్మజగపతి యాస్థాన పౌరాణికుఁడు. పెద్దాపురముసంస్థానమునందలి పలివెల ముఠాలోని ఒక కుగ్రామ మీతని నివాసము*. చతుర్భుజతిమ్మజగపతిరాజుగారి తనయులగు రాయపజగపతి (1607–1647) 'ప్రశస్తవ్యమగు హరిభక్తిసుధోదయంబను మహాకృతి రత్న మందుకొనియె' నని రామవిలాసకథనము (చూ. అవతారిక, పు. 25).

వత్సవాయి బలభద్రజగపతిరాజు శ్రీరామశతకకర్త లగుటయేగాక కిరాతార్జునీయ కృతిభర్తలు నయిరని రామవిలాస కృత్యవతారిక సాక్ష్యమిచ్చుచున్నది.

'అమితఖ్యాతికి మూలమైన కృతిఁ దానందెన్ గిరాతార్జునీ
యము ; శ్రీరాముల పేరఁ బద్యశతకం బాహాధి నిర్మించె భో

* శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, ప్రత్యక్షశయ్య, ఆంధ్రపత్రిక, సంవత్సరాదిసంచిక, విక్రమ, 1910, పుటలు 132–138.

జ మహీజాని గతిన్ బ్రసిద్ధిc గనియెన్ సాహిత్యసారజ్ఞుcడై
రమణన్ శ్రీ బలభద్రరాజు ప్రజలన్ రక్షించె ధర్మస్థితిన్' —పు. 31.

ఈ పద్యమునందుc బ్రసక్తమయిన కృతులు రెండును మృగ్యము. కిరాతార్జునీయ కృతికర్తృనామమును దెలియవచ్చుటలేదు.

## ఏనుగు కుటుంబ కవులు

పెద్దాపురసంస్థానము నాశ్రయించిన ఏనుగువారికుటుంబము పండిత కవివంశము. లక్ష్మణకవి తండ్రియగు తిమ్మకవి పార్థివాస్థానపూజితుcడు; సరస కవితాప్రవీణుcడు. గౌరీపరిణయప్రబంధకర్త అనంతకవి లక్ష్మణకవి కగ్రజుcడు. రామవిలాసాదికృతులను రచించిన ఏనుగు లక్ష్మణకవి పెదలక్ష్మణ (లచ్చన) కవిగారికి మనుమcడు.

ఈ లచ్చనకవినిగుఱించి లక్ష్మణకవి తన రామేశ్వర మాహాత్మ్యము నందు—

'సరసప్రౌఢవచోవిలాస విబుధాచార్యున్ సువర్ణక్షమా
ధరధీరున్ వివిధప్రబంధ రచనాదక్షున్ శివధ్యాన త
త్పరచిత్తున్ బ్రణమత్సమస్తధరణీపాలున్ సుభద్రా మనో
హరునిన్ గొల్చెద మత్పితామహుని లచ్చామాత్యచూడామణిన్'
—1–15.

అని కొనియాడియున్నాcడు. బలభద్రజగపతిరాజుగారి యన్నగారగు సార్వభౌమ తిమ్మజగపతిరాజుగారు (1649–1688) ఏనుగు లచ్చనకవి (పెదలక్ష్మణకవి) రచియించిన ద్రౌపదీపరిణయ ప్రబంధమునకు కృతిభర్త. ఈ ద్రౌపదీపరిణయము 'సురుచిర శబ్దభావరస గుంభ దలంకృతి మాధురీ మనోహర'ముcట (చూ. రామ విలాసము, పు. 29).

ఏనుగు లచ్చనకవి తుల్యామాహాత్మ్యమును వత్సవాయి కస్తూరిరంగ శౌరి కుమారులు జగన్నాథరాజునకును, 'ధ్రువచరిత్రము'ను వత్సవాయి జగ్గరాజు నకును గృతియిచ్చిరి. కృతిభర్తలిద్దఱును వత్సవాయివంశమునకు రాజ బంధువులు.

'హేమనగేంద్రధీరుcడగు నేనుగులక్ష్మణ సత్కవీంద్రుcడు
ద్దామ సుధామయోక్తి వితతంబగునట్లు రచించినట్టి తు
ల్యామహిమప్రబంధము గుణాఢ్యులు మెచ్చc బరిగ్రహించెc బ్ర
జ్ఞామహితుండు జగ్గనృపచంద్రుcడు శాశ్వతకీర్తి సందిలన్'
—రామవిలాసము, పు. 94.

తుల్యామాహాత్మ్యము స్థలపురాణము. తుల్యానది గోదావరిశాఖలలో నొకటి. ఇది ధవళేశ్వరమునుండి కాకినాడ, రామచంద్రపురముతాలూకాలమధ్య

ప్రవహించుచు, కాకినాడకు రెండుకోసుల దక్షిణమున సముద్రమునఁ గలియు చున్నది. కృతిభర్తయగు వత్సవాయి జగన్నాథరాజు—

'శోభితాపస్తంబసూత్రు వాధూలస
గోత్రపవిత్రు సద్గుణసమేతు
నేనుగు గరకమంత్రీంద్రుని పౌత్రుని
వెణుతురుబలి కవి వేంకటాద్రి
దౌహిత్రు విశ్వనాథకవి మేనల్లుని
పేరెన్నికైనట్టి పేరమాంబ
కును గుర్వమంత్రికి నెనరగుఁ బుత్రుని
లక్షణజ్ఞుండగు లచ్చమంత్రి
నచ్చనాఖ్యుని బిలిపించి యగ్రభాగ
మునను గూర్చుండ నియమించి ముదముగదుర
భుజముపైఁ జేయిచేర్చి సభ్యులు వినంగ
నెంతయును గారవింపుచు....'

భూదేవికి ఆదిశేషుఁడు దెలిపిన తుల్యభాగామాహాత్మ్యమును తెలుఁగుసేయుమని కోరఁగా, నానావధాననిధియును, సంగీతకళామహోదధియును నగు లచ్చనకవి దీనిని రచించినాఁడు.

'లక్ష్మీశుని పేర పదకవిత్వము విసకరి చేసిన'వాఁడఁట లచ్చనకవి*.

వేంకటక్షితిపతిపుత్రుఁడగు వత్సవాయిజగ్గభూవరుఁడు—

'సాహస విక్రమార్కుఁడని సర్వనృపాలురు బ్రస్తుతింప ను
త్సాహముఁబూని కార్యములు చక్కఁగ దిద్ది నిజాముచేత స
ద్వాహనభూషణాంబర సువస్తుతతుల్ బహుమానమందె....' సవాఁడు.

వత్సవాయి తిమ్మభూపతికి కుడిభుజముగా వర్తించినవాఁడు. ఈ జగ్గనృపాలుఁడే—

'కవిరుల సార్వభౌముఁడనఁగాఁదగు నేనుగు లక్ష్మణార్యుచే
ధ్రువచరితప్రబంధము బుధుల్వినుతింపఁగ నంది భోగభు
గ్భవన మహాసుఖానుభవకారణమైన యశంబుగాంచి....'నవాఁడు

—చూ. రామవిలాసము, పుటలు 50, 51.

ఉద్దండరాయజగపతి (1688—1714) 'సూరిదారిద్ర్యాంధకారంబునకుఁ దన వితరణం బినకర ప్రతతిగాఁగ' (రామవిలాసము, పు. 32) వర్తించినవాఁడు. రాగమ్మ (1714—1734) గారి పెద్దకుమారులగు కళాతిమ్మజగపతి 'ధీరులు సన్నుతింప బహుదేశలిపుల్ బహుదేశభాషలున్ సారకవిత్వసౌష్ఠవ రసజ్ఞత యున్ దన సూక్ష్మబుద్ధిచే నేరిచె....' (పైది, పు. 35) నఁట ! ఈ తిమ్మనరనాథుని

* పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి, ఏనుగు పెదలక్ష్మణకవి - తుల్యా మాహాత్మ్యము, గ్రంథాలయసర్వస్వము, 1916, పుటలు 249—252.

సన్నిధినున్న సజ్జనులందఱును '....భవ్య కావ్యవిదులై నుతికెక్కి....' (పైది, పు. 35) రఁట ; తిమ్మజగపతితమ్ముఁడగు సూరనృపాలుఁడు '....గుణవద్ద్విజ సంతతికెల్లఁ గొంగు బంగారము....' (పైది, పు. 36).

కళాతిమ్మజగపతికుమారులగు రాయపజగపతి (1749–1759) భద్రాద్రి రామభక్తుఁడు. 'పదములుఁ గీర్తనల్ రుచిరపద్యశతంబులు రాగమాలికల్ మృదు పద దండకంబులు[1] సమిద్ధగతి రచియించి కామితప్రదునకు భద్రశైల రఘు భర్తకుఁ గానుకగా నొసంగె....' (పైది, పు. 39) నఁట ;

మీర్జా నల్లపరాజు వేంకటపతిరాజుగారు పద్యరూపమున రచించిన అశ్వశాస్త్రము రాయజగపతి (1749–1759) కంకితము. నల్లపరాజువారు క్షత్రియులు. వీరి మూలపురుషులు నల్లపరాజు రంగరాజుగారు. ఈ వంశీయులలో నొకరగు వేంకటపతిరాజుగారు మీర్జా, రాజాబహద్దరు బిరుదులను బొంది యేలూరునకు సర్లష్కరుగా నిజాముచే నియమితులయి యుండిరి.

వత్సవాయివారి సమీపజ్ఞాతులగు కృష్ణమరాజు '....హాటకాంబర సమీహిత ఘోటక భూషణావళుల్ హెచ్చిన వేడ్కతోడ సుకవీంద్రులకున్ బహుమానయుక్తిగా నిచ్చిన మేటి....' (పైది, పు. 68) యఁట ;

## ఆణివిళ్ళ వేంకటశాస్త్రి

పదునెనిమిదవశతాబ్ది పూర్వభాగమునకుఁజెందిన ఆణివిళ్ళ వేంకటశాస్త్రి పెద్దాపురసంస్థానాధీశ్వరుల యాశ్రితులు. ఈ వేంకటశాస్త్రిగారికి వార్ధకదశలో పెద్దాపురముసంస్థానమువారు అగ్రహారమును ప్రసాదింప సంకల్పింపఁగా, మంత్రి పాణంగిపల్లి రామచంద్రుఁడుగారి కుతంత్రమువలన నెఱవేరలేదఁట[2]. వెంకటశాస్త్రి నారాయణశాస్త్రికుమారులు ; బాలకాళిదాస బిరుదాంకితులు. ఈయన రచించిన 'చిత్రచమత్కారమంజరి' వత్సవాయి జగపతిమహారాజున కంకితము. వెంకటశాస్త్రి గొప్ప యాలంకారికుఁడు. అలంకారసుధాసింధువు, రసప్రపంచము నను నలంకార గ్రంథములను, మాహేశ్వరకావ్యము, భాస్కరప్రశస్తి, రుక్మిణీ పరిణయము అను కావ్యములను రచించినవాఁడు. ఈయన కొంతకాలము నూజివీడుసంస్థానమునందును నివసించి తత్పాలకుఁడగు మేకా వెంకటనరసింహ అప్పారాయస్తుతిపరములగు నుదాహరణములతోఁ గూడిన 'అప్పారాయ యశశ్చంద్రోదయ' మను నలంకారగ్రంథమును వినిర్మించినవాఁడు.

## ఏనుగు లక్ష్మణకవి

ఏనుగు లక్ష్మణకవికృతమగు రామవిలాసము చతుర్భుజతిమ్మజగపతి

[1] చూ. రావూరి దొరసామిశర్మ, దండకవాఙ్మయము, రాయజగపతిరాజరచిత భద్రాద్రి రామదండకము, ఆంధ్రపత్రిక, సంవత్సరాదిసంచిక, హేమలంబ, 1957.

[2] చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, కథలు - గాథలు, పు. 180.

రాజుగారి పెద్దతాతగారికోవకు చెందిన వత్సవాయి సింహాద్రిరాజు కుమారులు గోపరాజు (1759—1793) గారి కంకితము. దంతులూరి జగన్నాథరాజుపుత్రిక జానకీదేవి గోపరాజుతల్లి. గోపరాజు 'బహుపురాణశ్రేష్ఠ భాగవతగ్రంథ పరమార్థవేది. కమనీయగుణభవ్యకావ్య నాటకపరిజ్ఞానప్రవీణుఁడు. పరవస్తు రామానుజాచార్య గురుభక్తినిపుణుఁడు. లక్ష్మణకవి ఆర్వేల నియోగి. వీరి దాపస్తంబసూత్రము; వాధూలసగోత్రము. ఇంటిపేరు పైఁడిపాటివారు. తండ్రి తిమ్మకవి; తల్లి పేరమ; తమ్ముఁడు వీరభద్రుఁడు. వీరి పూర్వులలో నొకరికి పెద్దాపురసంస్థానాధీశ్వరు లొక యేనుఁగును బహుమతిగా నిచ్చుటచే నేనుఁగు వారని యింటిపేరు మాఱినది. ప్రాచేతస మహాకవిప్రణీత రామాయణ రమ్య కథానుసారియగు రామవిలాసమునేగాక ఆంధ్రనామసంగ్రహము, గీర్వాణ సూర్యశతకము, జాహ్నవీమాహాత్మ్యము, నృసింహదండకము, రామేశ్వర మాహాత్మ్యము, విశ్వామిత్రచరిత్రము, విశ్వేశ్వరోదాహరణము, సుభాషిత రత్నావళి—యున్నగు గ్రంథములను రచించినవాఁడు లక్ష్మణకవి.

రాయజగపతి తనయులగు విస్సతిమ్మజగపతి (1760—1797) '....విద్యావిత్తంబులరాశి....' (రామవిలాసము, పు. 40). 'సిరిగందమునఁ దావి సిరివినొందినటీవి....వత్సవయ తిమ్మభూపాలవరునియందుఁ బండితాశ్రిత పరకవి పక్షపాతగుణము సహజ....' (పైది, పు. 40) మని కవి పేర్కొనుట స్వభావోక్తి. తిమ్మభూపాలుఁడు సూరిసంఘములకు కనకాంబరభూషారత్న సద్వస్తువుల నొసఁగి సమ్మానించుచుండెడివాఁడఁట!

## సలజర్ల గంగరాజు

రాయజగపతి (1797—1804) గారి కాలమునందు పెదబ్రహ్మదేవము వాస్తవ్యుఁడును, తిట్టుకవితలో దిట్టయును నగు సలజర్ల గంగరాజుగారు ప్రసిద్ధుఁడు. అప్పటి పెద్దాపురము దివానగు అనప్పిండి విస్సన్న కర్కోటకుఁ డఁట! అతనిమేల్బడిలో ప్రజలు పెక్కు చిక్కుల నందుచుండఁగా విని గంగరాజు దివాను సంతికముసకరిగి మూఁడవస్థానమున 'హ' కారమునుగూర్చి పద్యమల్లి చదివెనఁట. కొన్నాళ్ళ కీ దివాను మరణించెనను వాడుక కలదఁట! ఈ గంగరాజు వ్రాసిన కృతులేవియో తెలియవు*.

## చావలి రామశాస్త్రి

ప్రసిద్ధాలంకారికులు చావలి రామశాస్త్రి రచించిన 'కువలయామోద' మను నలంకారగ్రంథము కొత్తాము సంస్థానాధీశులు రాజా శ్రీ వెంకట సింహాద్రిజగపతిరాజు బహద్దరుగారికి అంకితము. ఈ రామశాస్త్రి శ్లేషయమక

* శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి. ఆంధ్రాభ్యుదయము, చతుర్థా. 67—70.

చక్రవర్తి బిరుదవిరాజితుఁడు. అనే కాంధ్ర సంస్థానములలో సమ్మానము లందిన విద్వన్మణి. 'అలంకారముక్తావళి' యనునది వీరి మఱియొకరచనము.

## హోతా వేంకటకృష్ణకవి

కొతాము సంస్థానాస్థానస్థిత సత్కవీశ్వరుఁడగు హోతా వేంకటకృష్ణకవి జగత్పతి సుభాషితము, ప్రభావతీప్రద్యుమ్నము అను గ్రంథములను శ్రీ రాజా వత్సవాయి వేంకటసింహాద్రిజగపతిరాజుబహద్దరుగారి కంకితమిచ్చిరి. ప్రభావతీ ప్రద్యుమ్నమనునది పింగళి సూరనార్యుని ప్రబంధముననుసరించి సంధానింపఁ బడిన యేడంకముల నాటకము రాజావారి ప్రోత్సాహమున విరచితము. సూర్యాన్వయమునందలి క్షత్రియశాఖలలో నొకటిగా సంభావితమయిన వత్స వాయివారి వంశవర్ణన మిందు విపులముగాఁ గలదు.

వేంకటసింహాద్రిజగపతిరాయబహద్దరుగారు పెద్దాపుర సంస్థానమునకు పరిశిష్టమయిన కొతాము ఎస్టేటును తుని పట్టణము రాజధానిగా పాలించినవారు. సంస్కృతాంధ్రములయందును, ఉర్దూ భాషయందును వీరికి చక్కనిపాండిత్య ముండినది. లలితకళలయెడల వీరికిఁగల యభిరుచియును, ఖగోళశాస్త్రము, ఆయుర్వేదములలో* వీరికిఁ గల అభినివేశమును ప్రత్యేక ప్రశంసకు పాత్రము లయినవి. సాహిత్యపోషణమునందు పూర్వపాలకులరీతులను పుణికిపుచ్చుకొనిన వారు. వీరి సీతారామనిలయ ముద్రాక్షరశాలలో రామవిలాసా ద్యాంధ్ర కావ్యములు, అనేక వైద్యగ్రంథములు అచ్చు వేయింపఁబడినవి. తునిలో ఒక పాఠశాల, పెద్దసత్రమును రాజాగారు స్థాపించిరి.

రాజాగారి మరణానంతరము వీరిభార్య మహారాణీ వేంకటసుభద్ర య్యమ్మాదేవిగారు ఎస్టేటుపాలనమును వహించిరి. వీరి పాలనకాలమునందు కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి, చిలుకూరి సోమనాథశాస్త్రి, వత్సవాయి వేంకట నీలాద్రిరాజు (1881—1939) మొదలగువారు ఈ సంస్థానమువారి సమ్మానము లనుబడసిరి. బ్రహ్మయ్యశాస్త్రిగారి పెద్దాపురసంస్థానచరిత్ర విమర్శనము ప్రఖ్యాత పరిశోధకరచనము.

## కవిభూషణ వేంకటనీలాద్రిరాజు

వేంకటనీలాద్రిరాజుగారు పెద్దాపుర సంస్థానపాలకులకు రాజబంధువు : సమీపజ్ఞాతులుగూడ. వత్సవాయి వేంకటసీతారామరాజపుత్రులు. కవిరాజ, కవి భూషణ బిరుదాంచితులు, శతావధానులు. కాళిదాసుని మేఘసందేశము, అభిజ్ఞాన శాకుంతలము మొదలగువానిని వీరు రసనిర్భరముగ నాంధ్రీకరించిరి. శాకుంతలము నందలి అతిప్రసిద్ధమగు శ్లోకము—'యాస్యత్యద్య....'ను నీలాద్రిరాజుగారెట్లనువదించిరో పరికింపుఁడు :

*ఆంధ్రపత్రిక, సంవత్సరాది సంచిక, వృష, 1941, పు. 154.

'ఉల్లము నేఁడు బెంగగొనియుండె శకుంతల వెళ్ళునంచుఁ గ
న్నీళ్ళనడంప గద్గదికనిండె వగన్ జడమయ్యెఁ జూడ్కి- పెం
దల్లడ మౌర! మా దృశవనస్థునకే యిటు పుట్టె నెంత చిం
తిల్లుదురో గృహస్థులవనిన్ గనిపెంచిన కూఁతునంపుచోన్.'—చతుర్థా.

రాజా వత్సవాయి వేంకటసూర్యనారాయణజగపతిరాజబహద్దరుగారిని దత్త స్వీకరించు సందర్భమునందు వేంకటనీలాద్రిరాజుగారు తెనిఁగించిన యభిజ్ఞాన శాకుంతలము వేంకటసింహాద్రిజగపతిమహారాజా నాటకశాలాభవనమునఁ బ్రదర్శింపఁబడినది.

తుని మహారాణీగారు ఆంధ్రసాహిత్య పరిష దుద్ధారకులలో నొకరు. ఆంధ్ర సాహిత్యపరిషత్తు, ఆంధ్రప్రచారిణీగ్రంథమాల, ఆంధ్రేతిహాస పరిశోధక మండలి మొదలగు విద్యాసంస్థలకు రాజపోషకులుగా నుండిరి. తునిలో వేద పాఠశాలను, రూ. 30 వేలు వెచ్చించి 1922లో రాణీ గోషాఆస్పత్రిని, రూ. 70 వేలు ఖర్చుపెట్టి 1923 లో ఉన్నతపాఠశాలను రాణీగారు స్థాపించిరి. కలియుగ భీముఁడు, జగత్ప్రసిద్ధ మల్లయుద్ధవీరుఁడు కోడిరామమూర్తినాయఁడు (1880—1938) తుని పాలకుల ప్రోత్సాహము నందినవాఁడు.

## పరవస్తు వేంకటరంగాచార్యులు

విశాఖపట్టణవాస్తవ్యులు పరవస్తు శ్రీనివాసాచార్యుల పుత్రులును మహామహోపాధ్యాయ బిరుద విరాజితులునునగు వేంకటరంగాచార్యులుగారు (1822 --1900) తమ జీవితము చరమదశలో కొత్తాముఎస్టేటువారి యాస్థానమున పండితులుగానుండిరి. ఆచార్యులుగారు సకలశాస్త్రముల పారముచూచిన మహాపండితులు. వేంకటరంగనాథస్వామి అయ్యవారలు (1875—1918) రంగాచార్యుల జ్యేష్ఠపుత్రులు. సంస్కృత ప్రాకృతభాషలలో జితశ్రములు. విశాఖపట్టణమునందలి 'గ్రంథ ప్రదర్శిని' నిర్వాహకులు*.

వత్సవాయి వేంకటసూర్యనారాయణజగపతిరాజుబహద్దరుగారు కూడ భాషాపోషకులు. అనేకగ్రంథప్రకాశకసంస్థలకు, విద్యాసంస్థలకు, సాహిత్య పత్రికలకు పోషకులుగా నుండిరి.

## వత్సవాయి రాయజగపతివర్మ

రాజారాయజగపతి (1797—1804) ద్వితీయ భార్యయగు బుచ్చిసీతయ్యమ్మ (1828—1833) రాణిగారి దత్తుఁడగు వత్సవాయి వేంకటపతిరాజుగారి కోవకుఁజెందిన రాయజగపతివర్మగారు ప్రసిద్ధ గ్రంథపరిశోధకులు. వీరు

*యీయూణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు, పరవస్తు పండితత్రయము, ఆంధ్రపత్రిక, సంవత్సరాది సంచిక, అంగీరస, 1932, పుటలు 181—184.

అనేక చారిత్రకాధారములను పరిశీలించి పెద్దాపుర సంస్థానచరిత్రమును ప్రచురించిరి. పద్మనాభయుద్ధము, రామవిలాసము మున్నగు చారిత్రక కావ్యముల సంశోధిత ముద్రణములను గావించిరి. చామర్లకోట కైఫీయతును సంపాదించి ప్రకటించిరి.

## కొన్ని చాటుపులు

పెద్దాపుర సంస్థానపాలకులకు సంబంధించిన చాటుపులు శతాధికముగా లభ్యమగుచున్నవి. అందు కొన్నిచాటుపులు:

'తిరుగ వత్సవాయికుల తిమ్మజగత్పతి కీర్తిహారమా
హార శరద్విజన్మ కులిశాయుధజాతుల మించె రూపమా
హార శర ద్విజన్మ కులిశాయుధజాతుల మించె శౌర్యమా
హార శర ద్విజన్మ కులిశాయుధజాతుల మించె నెంచగన్'.

శ్లేషచమత్కార గర్భితమయిన శబ్దాలంకారప్రాధాన్య మీ చాటుపునందుఁ గన్పట్టుచున్నది.

దరిద్రుఁడయిన యొక పండితుఁడు రాజు ప్రాపును జేరి దారిద్ర్యమునిట్లు గద్దించు చున్నాఁడు.

'తేకుపతోడ వత్సవయి తిమ్మజగత్పతి ప్రాపుసేరితిన్
రాకు దరిద్రమా యిఁకఁ బరాకునసైన గిరాకునైన నీ
పోకలు సాఁగవింకఁ జెడిపోవక మాపగవారిఁజేరుమా
దీకొని వచ్చితేని నినుఁదిట్టక కొట్టకమాన నిమ్మహిన్'

చల్లా వెంకయకవి రచనముగా క్రిందిచాటువు ప్రసిద్ధము.

రాజులరాజు లోభి, యొక రాజులరా జతిమూర్ఖుఁడు,
గ్రాజుల రాజు జారుడు, విరాజుల రాజొక పక్షి, తారకా
రాజుల రాజు దోషి. ఫణిరాజుల రాజొక వక్రగామి, యీ
రాజవతంస వత్సవయి రాజమహీపతి తిమ్మభూపతీ!

వక్కలంక వీరభద్రకవి రచనముగా క్రిందిచాటువు ప్రచారములో నున్నది.

'అతఁడు రాజకిరీటుఁడఖిల రాజకిరీట
  ఘటితపదాబ్జసంగతులు మీరు....
వత్సవాయి జగత్పతీశ్వరతనూజ
ఘనసుగుణసాంద్ర జగపతిక్ష్మాతలేంద్ర'.

మఱియొక చాటువు:

'ఆరయ వత్సవాయ తెలగాధిపనందన నారసింహ మీ
ద్వారము గర్వితాహితవిదారము, సత్కవిబంధురక్షణో

దారము, సత్యశౌచనయధర్మవిచారము, కామలోభవి
స్తారనివారమున్ సదుపచారము దైన్యనివార మారయన్'.

మాగాపు శరభకవి రాయజగపతిని గూర్చి చెప్పినచాటువు :

'ఇతఁడా రంగదభంగసంగరచమూహేతిచ్ఛటాపావకో
ద్ధతకీలాశలభాయమాన రిపురాడ్దారాశ్రుధారా నవీ
న తరంగిణ్యబలాసమాగమసమానందః పయోధి స్తుతా
యత శౌర్యోజ్వలుఁడైన వత్సవయ రాయక్ష్మాపదుండీతఁడా !'

రాయజగపతి (1797—1804) గారి కుమారులగు బుచ్చితిమ్మజగపతి బహద్దరు మీఁది చాటువొకటి :

'డాబాలోఁ గూర్చున్నాఁ
డే బాలుఁడు ముద్దుగుమ్మ ! యెవ్వరె చెపుమా ?
బాబాషు నీ వెఱుంగవె
బాబాజీ బుచ్చితిమ్మబహదరె చెలియా !'

## మహారాణి బుచ్చిసీతయ్యమ్మ సత్రము ; కళాశాల

రాయజగపతి (1797—1804) రెండవ భార్యయగు బుచ్చి సీతయ్యమ్మ గారు తాము పెద్దాపురసంస్థానమును పాలించిన కాలము (క్రీ.శ. 1828—1833)లో పెద్దాపురమునందును, ఒంటిమామిడి గ్రామమునందును సత్రములు నిర్మించి యుండిరని పూర్వము వివరింపఁబడినది. పెద్దాపురమునందలి సత్రమును గుఱించి యేనుగుల వీరాస్వామయ్యగారు తమ కాశీయాత్రచరిత్రలో ప్రస్తుతించి యున్నారు. 'యీ వూళ్ళో (పెద్దాపురము) మూడు సంవత్సరములుగా యీ జమీందారుని భార్య అమ్మన్న అనే పురుషుని గొప్పయిల్లు స్వాధీనముచేసికొని యొక అన్నసత్రము వేసియున్నది. ఆ స్థలము బాగా విశాలముగా వున్నందున అందులోనే యీ రాత్రి వసించినాను'*. ఈ సత్రమునకు అయిదాఱువందల యెకరముల సుక్షేత్రమును కొన్నిలక్షలకు పైఁబడిన నిధులు నున్నవి. ఈ నిధులలో కొంతమొత్తము నేఁడు పెద్దాపురములో నెలకొనిన కళాశాలాస్థాపనము నిమిత్తము వినియోగింపఁబడుటయు, ఏతత్ సంస్థ మహారాణి వత్సవాయి బుచ్చిసీతయ్యమ్మాదేవిగారిపేర వెలయుటయు, ఈ విషయమున పెద్దాపుర రాజన్యుల సంతతి వారగు రాజా వత్సవాయి కృష్ణమరాజబహద్దరుగారు ప్రముఖ పాత్రము వహించుటయు ముదావహములగు సంఘటనములు.

*కాశీయాత్ర చరిత్ర, పు. 341.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. ఏనుగు లక్ష్మణకవి, రామవిలాసము.

2. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి, పెద్దాపురసంస్థానచరిత్రవిమర్శనము.
3. వి. ఆర్. జగపతివర్మ, పెద్దాపురసంస్థానచరిత్రము.
4. వి. ఆర్. జగపతివర్మ (సంపా.), చామర్లకోటకైఫీదు.
5. దువ్వూరి జగన్నాథశర్మ, క్షత్రియకులగోత్రప్రకాశిక.
6. ఆంధ్రవిజ్ఞానము, సంపుటములు 1, 6.
7. తెలుగువిజ్ఞానసర్వస్వము, సంపుటము 3.
8. చాటువులు.
9. చాగంటి శేషయ్య, ఆంధ్రకవితరంగిణి, సంపుటము 12.
10. A. Vadivelu, The Aristocracy of Southern India, Vol. I, pp. 174–181
11. V. L. Sastri, Encyclopaedia of the Madras Presidency and the Adjacent States, p. 439.
12. C. A. Souter and K. N. K. Ayyar, Gazetteer of the East Godavari District, Vol. II, Madras, 1935.
13. Report of the Madras Estates Land Act Committee, Part I and II, Madras, 1938.

# పోలవరము

## ప్రవేశిక

ఇది గోదావరిమండలమునందలి నవీనమయిన ప్రొప్రయిటరీ ఎస్టేటు. తూర్పు గోదావరిమండలములోని 87 జమీందారీలలో నొకటి. శాశ్వతకర నిర్ణయకాలము (1803) నాఁడు ఈ ఎస్టేటు శ్రీ రెడ్డి లక్ష్మీనారాయణదేవుగారి పేర సమోదయియుండినది. తరువాతి పాలకుఁడగు పోలవరము రాజా మంగపతిదేవుగారికాలమున 1812 లో ఎస్టేటంతయును సేలముచేయఁబడినది. అప్పుడు దానిని నూజివీడు జమీందారు రామచంద్రఅప్పారావుగారు ఖరీదుచేసియుండిరి. 1814 లో ఈ అప్పారావుగారు మరణింపఁగా కొచ్చెర్లకోటవారి పూర్వులొకరు దీనిని విక్రయించికొనియుండిరి. ఈ సంస్థానమునకు రాజధాని పోలవరము. శాశ్వతకరనిర్ణయమునాఁటికి ఈ ఎస్టేటు ఆదాయము రూ. 1,74,158 లు; పేష్కషు రూ. 1,05,700 లు. 1938 నాఁటి లెక్కల మేరకు పోలవరము ఎస్టేటు ఎ, బి – భాగముల మొత్తము ఆదాయము రూ. 23,638 లు; పేష్కషు రూ. 10,510 లు. మొదట పోలవరము తాలూకా పూర్తిగాను, ఎర్నగూడెము, రాజమండ్రి తాలూకాలలో చాల భాగములతోను కూడిన ఎస్టేటిది. గంగోలు, గూటాల, బిల్లిమిల్లి ఎస్టేటులు ఒకనాఁటి పోలవరము సంస్థానములోని భాగములు. 1935 నాఁటికి రూ. 1,417 ల పేష్కషుతో ఒక్క గ్రామముమాత్రము ప్రాఁత ఎస్టేటుపేర ఎ భాగముగా మిగిలినది. తక్కిన ఎస్టేటు బి భాగమును ఋణములక్రింద పిఠాపురము రాజాగారు జమ వేసికొనిరి.

## సంస్థాన చరిత్రము

ఈ సంస్థానమును పాలించినవారు కొచ్చెర్లకోట వంశీయులు. వీరాఱువేలనియోగులు. కొచ్చెర్లకోట వేంకటజగన్నాథరావుగారు పోలవరము ఎస్టేటునకు మొదట అధికారిగానుండిరి. గణపవరము, గూటాల, జంగారెడ్డిగూడెము, తడువాయి మున్నగు ఎస్టేటులుగూడ ఇతనికే చెందియుండెను. సరియైన పర్యవేక్షణము లేక ఈ ఎస్టేటులు అధ్వాన్నస్థితిలో నుండినవి. జగన్నాథరావుగారి సమీపజ్ఞాతులలో నొకరగు కొచ్చెర్లకోట వేంకటకృష్ణరాజు గారు కృష్ణా గోదావరి మండలములలో శిరస్తదారుగా నుండిరి. ఈ వేంకటకృష్ణరాజుగారికి వేంకటరాయణింగారు, రామన్నగారు, పెద్దసుబ్బరాయణింగారు,

చిన్నసుబ్బరాయణింగారు అని నలువురుకుమారులు. వేంకటకృష్ణరాజుగారు సొంతడబ్బుతో కృష్ణామండలమందొక ఎస్టేటును ఖరీదుచేసి యుండిరి. వీరి పెద్దకుమారులైన వేంకటరాయణింగారు ఎస్టేటును వృద్ధిచేసిరి.

పోలవరము ఎస్టేటుదారులగు వేంకటజగన్నాథరావుగారు పెద్దసుబ్బ రాయణింగారికి జంగారెడ్డిగూడెము, తడువాయి ఎస్టేటులను, రామన్నగారికి గణపవరం ఎస్టేటును ఇచ్చివేసి యుండిరి.

వేంకటజన్నాథరావుగారి జ్ఞాతిసోదరులు మీఁదపేర్కొనిన వేంకట రాయణింగారు. వేంకటరాయణింగారి ధర్మకార్యతత్పరత ఆ నాడు దేశమందంతట వ్యాపించి యుండెడిది. ఇంగ్లీషుకుంఫిణీలో ప్రసిద్ధపదవిలోనుండిన ఏనుగుల వీరాస్వామయ్యగారు తమ కాశీయాత్రచరిత్ర (1830–1831) నాఁటి దినచర్యలో ఈ వేంకటరాయణింగారి ధర్మములనుగుఱించి ప్రసంగించియున్నారు :

'అన్నింటిలోనూ బందరు కాకినాడ జిల్లాల జమీన్‌దారులు చాలా ధర్మబుద్ధిగలవారు. రాజా కొచ్చర్లకోట వేంకటరాయణింగారు రెండావృత్తులు కుటుంబ సహితముగా తులాభారము తూగి రెండావృత్తులు లక్ష బ్రాహ్మణ భోజనము చేయించి అనేకయాగాలు చేయించినారు*'.

పోలవరము జమీందారు వేంకటజగన్నాథరావుగారి కుమారులు రామచంద్ర వేంకటకృష్ణారావుగారు. వీరి కుమారులు వేంకటజగన్నాథరావుగారు. ఈ జగన్నాథరావుగారు మంత్రతంత్రముల మీఁద గొప్ప నమ్మకము కలవారని వృద్ధులు చెప్పుచుందురు. పోలవరమునకు దగ్గఱనున్న పట్టసాచలక్షేత్రమునందు వెలసిన వీరభద్రేశ్వరస్వామి దేవాలయమునందు దేవీజపము గావించుచు దేవి ప్రత్యక్షముకాఁగా భయపడి మరణించినట్లు కథ. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి ఆంధ్రాభ్యుదయమునందీ విషయమిట్లు నిరూపింపఁబడినది.

'పోలవరేశ్వరుండయిన పూరుషరత్నము రే యొకప్పుడా
కాళి సమక్షమందు జపకార్యమునందు నిమగ్నుఁడై మనూ
చ్చాలనమాచరింప నిమిషంబున నాతనిఁ గ్రోసు దవ్వనం
దూలఁగపైచెనందురు కనుంగొన నబ్బ మిదేటి చెయ్దికో'

—ఆంధ్రాభ్యుదయము 4–13.

ఈ వేంకటజగన్నాథరావు తన యిరువదియైదవ యేఁటనే మరణించెను. ఇతని భార్య కామాయమ్మ. వీరికి సంతతిలేనందున కామాయమ్మ తన చెల్లెలి కొడుకైన కృష్ణారావుగారిని (1871–1919) అయిదేండ్లబాలుని దత్తుచేసికొనిరి. ఈ బాలుఁడే పెరిగి పెద్దవాడయి రాజా కొచ్చెర్లకోట రామచంద్రవేంకట కృష్ణారావు అను పేర పోలవరము జమీందారీని పాలించెను.

ఈ దత్తుఁడు పెద్దాడవంశమునకుఁ జెందినవాఁడు. పెద్దాడవారు గౌతమ

*కాశీయాత్రచరిత్ర, దిగవల్లి వేంకటశివరావుగారిచే సంపాదితము, 1941, పు. 350.

గోత్రులు. వీరవాసర వాస్తవ్యులు. పట్టసమంత్రి వీరి మూలపురుషుఁడఁట. పెద్దాడ సూరయ ఈ వంశమునందలి పూర్వులలో నొకఁడు. సూరయ భార్య సావిత్రమ్మ. ఈమె ముంజులూరి పద్మరాజుగారి పుత్రిక. సూరయ కుమారుఁడు పెద్దాడ నాగరాజామాత్యులు (1760–1825) మచిలీపట్టణములో ఆ నాఁడు పేరుమోసిన ప్లీడరు. నాగరాజామాత్యులు శకుంతలాపరిణయ ప్రబంధకర్త. వీరికుమారులు మల్లికార్జునుఁడు. ఈతని కుమారుడు నాగరాజు. ఈ రెండవ నాగరాజుగారు పోలవరమునకు దత్తులయిన కృష్ణారావుగారికి తండ్రి.

కృష్ణారావుగారు పసితనమునుండియు పాలకజననియగు కామాయమ్మగారి సంరక్షణమునందే పెరిగిరి. రాజమండ్రిలోను, మద్రాసు క్రిస్టియను కళాశాలలోను చదివి 1896 లో పట్టభద్రులయిరి. మద్రాసు లెజిస్లేటివుకౌన్సిలు సభ్యులుగా కొంతకాలము పనిచేసిరి. ఆ పిమ్మట కాంగ్రెసువాదిగా మారి, హోంరూలు ఉద్యమములో పాల్గొనిరి. సంతతి లేనందున 1919 లో మరణించుచు దత్తుతీసికొనుటకు భార్య కధికారమొసఁగిరి. ఆ పిమ్మట దత్తకుమారులే పోలవరమును పాలించిరి.

## సాహిత్యపోషణము

శ్రీ రాజా కొచ్చెర్లకోట రామచంద్రవేంకటకృష్ణారాయ బహద్దరువారి ప్రపితామహులగు పెద్దాడ నాగరాజామాత్యులు మూఁడాశ్వాసములు గల శకుంతలాపరిణయమను శృంగారప్రబంధమును సంధానించినవారు. తెనుఁగునందు శకుంతలాపరిణయ కథాత్మకములగు ప్రబంధములు నాలుగయిదున్నవి. నాగరాజామాత్యుని రచన ప్రాయికముగా భారతకథానుసారి. ఇందు మనుచరిత్రచ్ఛాయలధికము. నాగరాజుగారు మొగలితుర్రు సంస్థానమునందు శ్రీ రాజా కలిదిండి తిరుపతిరాజుగారి యాస్థానమున ముప్పదిసంవత్సరములపాటు విద్వత్కవిగానుండిరఁట. వీరి సోదరుఁడగు గంటలరాయని దౌహిత్రుఁడు కవిజీవితకర్తలగు గురజాడ శ్రీరామమూర్తిగారు. నాగరాజామాత్యుని శకుంతలా పరిణయము పోలవరము జమీందారుగారిచే చెన్నపట్టణము ఆనందముద్రాక్షరశాలలో 1900 లో ప్రచురితము.

## మతుకుమల్లి కృష్ణశాస్త్రి

మాల్యాశైల లక్ష్మీనృసింహ సులలిత కృపాలబ్ధ కవితాచమత్కృతియా కలితుఁడయిన మతుకుమల్లి కృష్ణశాస్త్రి రచియించిన వీరభద్రశతకము పోలవరము జమీందారులైన శ్రీ రాజా కొచ్చెర్లకోట వేంకటజగన్నాథరావుబహద్దరువారి (క్రీ.శ. 1880 ప్రాంతము) ప్రేరణముచే రచితము. అప్పటి మైనరు రాజాగారగు రామచంద్రవేంకటకృష్ణారావుగారి యభ్యుదయము నిమిత్తముగా

నిది వెలయింపఁబడినది. గోదావరీమండలమునందలి పట్టిసాచలక్షేత్రమున వెలసిన వీరభద్రేశ్వరుని పేర—

'దక్షరూక్షాధ్వరధ్వంస దక్షరౌద్ర
భద్రకాళీ మనోనీరభవదినేంద్ర
భవ్యగోదావరీమధ్య పట్టిసాఖ్య
విపులగిరివర నిర్ణిద్ర వీరభద్ర' అని ఎత్తుగీతియంతయు మకుటముగాఁ

గలిగిన 109 సీసపద్యములలో నీ శతకము కూర్పఁబడినది[1]. శతకకర్తయగు మతుకుమల్లి కృష్ణశాస్త్రి సుప్రసిద్ధ విద్వత్కవులును, నరసరావుపేటసంస్థానాస్థాన విద్వాంసులు నగు కనకాద్రిశాస్త్రిగారి ద్వితీయపుత్త్రుఁడు. షట్ఛాస్త్రపారంగతులును, వల్లూరుసంస్థానాధిపతుల యాస్థానవిద్యాధికారియును నగు మతుకుమల్లి నరసింహశాస్త్రిగారి తమ్ముఁడు. కాని, శతకకవులచరిత్ర అనుబంధమునందు కృష్ణశాస్త్రి నరసింహశాస్త్రితనయుఁడని నిర్ణయింపఁబడుటకు కారణము తెలియదు[2]. నరసింహశాస్త్రిగారికి రఘూత్తమరాయశాస్త్రి, నరహర్యక్షశాస్త్రి, సరస్వతిశాస్త్రి అను మువ్వురు కుమారులు మాత్రమే యున్నట్లు మతుకుమల్లివారి వంశవృక్షమునుబట్టి నిర్ణయింప వీలగుచున్నది. కనకాద్రిశాస్త్రి తమ్ములగు మాధవశాస్త్రి, మంగళాద్రిశాస్త్రి సంతతులయందుఁగూడ కృష్ణశాస్త్రి నామకులొక్కరును గన్పట్టుటలేదు. కావున జానకాంబాకనకాద్రిశాస్త్రుల తనయుఁడును నరసింహశాస్త్రి తమ్ముఁడును నగు మతుకుమల్లి కృష్ణశాస్త్రియే యీ వీరభద్రశతకకర్తయని నిర్ధారింపవచ్చును. అందలి యొకపద్యము :

'శ్రితపంకజపతంగ ! కృతసూర్యసుతభంగ !
  మౌనిసన్నుతశృంగ ! మహిమతుంగ !
నతకేతనపతంగ ! హితకరస్తకురంగ !
  హృతమదవదనంగ ! భృతమతంగ !
పతమౌళితతగంగ ! భవ్యదృష్టితరంగ !
  సప్తకంధినిషంగ ! సమరభంగ !
నుతిమధురసభృంగ ! వితతర్షభతురంగ !
  ధవళవిలసదంగ ! ధనదసంగ !
దక్షరూక్షాధ్వరధ్వంస దక్షరౌద్ర
భద్రకాళీ మనోనీరభవదినేంద్ర
భవ్యగోదావరీమధ్య పట్టిసాఖ్య
విపులగిరివర నిర్ణిద్ర వీరభద్ర'.

[1] ఆర్ష ముద్రాక్షరశాల, విశాఖపట్టణము, 1884.

[2] చూ. శతకకవుల చరిత్రము, అనుబంధము, పు. 868.

## కృష్ణారావుగారి కృషి

కృష్ణారావుగారికి చిన్నతనమునుండియు సంస్కృతాంధ్రములమీఁద మక్కువ మిక్కుటము. వీరు మద్రాసు క్రిష్టియను కళాశాలలో విద్యార్థిగా నున్నప్పుడే 1895 లో 'ఆంధ్రభాషోజ్జీవని' యను సంస్థను స్థాపించి, దాని కుపాధ్యక్షులుగా నుండిరి. ఈ సంస్థకు ఆనందాచార్యులుగారధ్యక్షులు. భాషా పాండిత్యముండి సాహితీవ్యవసాయము సాఁగించిన కొలఁదిమంది తెలుఁగు జమీందారులలో కృష్ణారావుగారొకరు. ఈయన కవియై, పండితుఁడై కవిపండితు లనేకులను పోషించి ఆంధ్రభాషకు, సాహిత్యమునకు పరిగణింపఁదగిన సేవ చేసినవారు.

1898 లో కృష్ణారావుగారు 'సరస్వతి' యను సాహిత్యపత్రికను నెలకొల్పి, చిలకమర్తి లక్ష్మీనరసింహము, దివాకర్ల తిరుపతిశాస్త్రి, కొత్తపల్లి సూర్యారావు మొదలగువారి తోడ్పాటుతో దానిని ఇరువదియేండ్లపాటు నిర్వహించిరి*. ఈ పత్రికయందు తాడూరి లక్ష్మీనరసింహారావు, కొమర్రాజు వేంకటలక్ష్మణరావు, దాసు శ్రీరాములు, తిరుపతివేంకటకవులు, వడ్డాది సుబ్బారాయకవి, చిలకమర్తి లక్ష్మీనరసింహము మున్నగు ఆధునికాంధ్ర కవిపండితవిమర్శకుల సాహితీపరిశ్రమము ప్రకటితమగుచుండెడిది. ఆధునికుల రచనములేగాక, ప్రాచీనులగు శ్రీనాథుఁడు, మారన, పినవీరభద్రుఁడు, మట్ల అనంతభూపాలుఁడు, కందుకూరు రుద్రకవి, దామెర్ల వెంగళభూపాలుఁడు, సవరము చిననారాయణనాయకుఁడు మొదలగు ప్రాచీనకవుల రచనములుకూడ 'సరస్వతి' పత్రికయందు పరంపరగా ప్రచురితము లగుచుండినవి.

రాజాగారు అపవాదతరంగిణి, ప్రభువిశ్వాసము, మిల్లరుదొరవారి జీవితము, రాజతరంగిణి, సాహసికకథార్ణవము మున్నగు స్వీయరచనలను ప్రచురించిరి. రాజతరంగిణి ఎనిమిదితరంగములు కలది. ఇది కల్హణుని రాజతరంగిణి యను సంస్కృతకృతి కాంధ్రీకరణము.

## తిరుపతివేంకటకవులు

సుప్రసిద్ధులగు తిరుపతివేంకటకవులు పోలవరముజమీందారుల యాస్థాన కవులు. వీరిలో మొదటివారగు దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు వెలనాటివారు; కవితకు వెలనాఁటినవారు; జమీందారుగారి సరస్వతి పత్రికానిర్వహణమున చేదోడువాదోడుగా నుండినవారు. రెండవవారు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు. శ్రీ రాజాగారు వీరిని కేవలము ఆస్థానకవులుగానేగాక, గురువులుగా, కూర్చు మిత్రులుగా సంభావించుచుండిరి.

* చిలకమర్తివారి స్వీయచరిత్రము, అభ్యుదయ రచయితలసంఘ ప్రచురణము, పు. 144.

'పీటపైఁ గూర్చుండి పిలువ నంపకయుండ
నేదినంబున భుజియింపలేదు
మొదటనుండియు తుట్టతుదదాఁక నౌకరీతి
గురుభావమున లోటు జరుపలేదు'

అని తిరుపతిశాస్త్రిగారు రాజావారి నిర్యాణసందర్భమున వ్రాసిన వ్రాఁతలు వీరి మధ్యఁగల స్నేహసంశుద్ధిని బ్రకటించుచున్నవి.

'బుద్ధచరిత్ర' తిరుపతివేంకటకవుల రచనలలో ఉత్కృష్టమైన కృతియని పరిశోధకుల అభిప్రాయము. ఇట్టి బుద్ధచరిత్రమును కృతినందు భాగ్యము కృష్ణారావుగారికే దక్కినది. ఏతత్ కృతికర్తలుకూడ—

'ఎవని హూణాగమాతివిభూతి తెల్పెఁద
త్ప్రాపకంబైన బి. ఏ. పదంబు
ఎవని భాషాభిమానవిభవంబు వచించు
నెంచి చేయించు సత్కృతిచయంబు
ఎవని కవీంద్రగౌరవము చాటించు ము
ద్రాపిత ప్రాక్కవిగ్రంథపటలి
ఎవని యగణ్యపుణ్యవిశేష మెఱిఁగించు
నత్తకోడండ్ర యన్యోన్యమైత్రి
యతఁడు కొచ్చెర్లకోట వంశాంబురాశి
చంద్రుఁ డురుకీర్తిసాంద్రుఁడు శాంతిపరుఁడు
రామచంద్రవేంకటకృష్ణరాయచంద్రుఁ
డనితరప్రతిభాశాలి యనియుఁ దలచి'

విద్వత్ప్రభువులగు కృష్ణరాయలకుఁ దమ బుద్ధచరిత్రమును కృతి ఇచ్చిరి.

'ఇతఁ డతికవితాలోలుప
మతియని వర్ణింపనేల మాటిమాటికి నీ సం
గతి ప్రతిమాసమున సర
స్వతియే ప్రతిదేశమేఁగి చాటుచునుండన్'

అని బుద్ధచరిత్రమందలి అవతారికాపద్యములో కృష్ణరాయల కవితాప్రియత్వమును గూర్చి రేఖామాత్రముగా నిరూపింపఁబడినది.

కృష్ణరాయఁడనపత్యుఁడై 1919 లో మరణించిన పిదప సంస్థానాధిపత్యమును వహించిన యాతని ధర్మపత్ని బుచ్చాయమ్మగారు విద్యాపోషణము మాటయు నెత్తలేదు. రాజాగారి నాశ్రయించిన కవిపండితు లెల్లరును దిక్కుదిక్కులకు చెదరిపోయిరి. కృష్ణరాయని మరణానంతరము తిరుపతిశాస్త్రిగారు రెండేండ్లు జీవించియుండిరి. ఈ రెండేండ్ల కాలమునందును, తిరుపతిశాస్త్రి మరణానంతరమును తిరుపతిశాస్త్రిగారి కుటుంబమున కార్థికసాహాయ్య మొనర్చిన

వారు కోలంక జమీందారిణి రామాయమ్మగారు. ఈ యంశమును చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు తమ ప్రభావతీప్రద్యుమ్న నాటక ప్రస్తావనలో నిట్లు నిరూపించిరి :

'తిరుపతి వేంకటేశ్వరసుధీరవితల్లజులందు నొక్కనిన్
దిరుపతిశాస్త్రి నెంతయుఁ బదింబదిగాఁ బదునెన్మిదేండ్లు న
బ్బురముగఁ జెంత నిల్పికొనెఁ బోలవరక్షితినేత కృష్ణరా
వరమర లేనిమేటి సఖుఁడై పొరపొచ్చము లేకయుండఁగన్'

'కవినా చ విభుర్విభునా చ కవిః' యను సూక్తి తిరుపతివేంకటకవులకును పోలవరము జమీందారులకును చక్కగా సమన్వయించును. అందులకే ప్రభునిర్యాణానంతరము తిరుపతివేంకటకవులు——

'ఆ చంద్రార్కము పేరునిల్పుటకు మున్నార్జించెఁ దా నీతివి
ద్యాచాణక్యుఁడు కృష్ణభూపతి కవిత్వఖ్యాతులన్ మమ్ము....'

అని తమయౌద్ధత్యమును తమపోషకుని సత్పాత్రపరణశక్తిని ఒక్కమాటలో ప్రకటించిరి.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. శ్రీరాం వీరబ్రహ్మకవి, నానారాజన్య చరిత్రము, పుటలు 168—173.
2. తిరుపతివేంకటకవులు, నానారాజ సందర్శనము, పుటలు 109, 110; 140—142; 205—208.
3. చిలకమర్తి లక్ష్మీనరసింహము, స్వీయచరిత్రము.
4. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, ఆంధ్రాభ్యుదయము, పుటలు 241—243.
5. నిడుదవోలు వేంకటరావు, శతకకవులచరిత్ర, అనుబంధము, పుటలు 868, 869.
6. మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, ఆంధ్రరచయితలు, పుటలు 244—250.
7. V. L. Sastri, Encyclopaedia of the Madras Presidency and the Adjacent States, Madras, pp. 424, 425.
8. C. A. Souter and K. N. K. Ayyar, Gazetteer of the East Godavari District, Vol. II, Madras, 1935.

# బనగానపల్లి

## ప్రవేశిక

ఆంధ్రప్రదేశమునందు బనగానపల్లి సంస్థానమొక్కటియే స్వదేశ సంస్థానము (Native State). తక్కిన సంస్థానములన్నియును జమీందారీ ఫాయాకుఁ జెందినవి. హైదరాబాదు, మైసూరు, తిరువాన్కూరు, ఇండోర్, గ్వాలియర్, కథియవాడ్, పాటియాలా మున్నగు భారతీయసంస్థానముల స్థాయికిఁ జేరినది బనగానపల్లిసంస్థానము. ఆ నాఁటి 675 స్వదేశసంస్థానములలో 175 సంస్థానములు గవర్నరు జనరల్ పర్యవేక్షణముక్రిందను, 500 సంస్థానములు ఆ యా రాష్ట్ర ప్రభుత్వముల అజమాయిషీక్రిందను ప్రవర్తిల్లినవి.* మొగలుపాదుషాల కాలమునందును, నిజాము హయామునందును బ్రిటీష్ ప్రభుత్వ పాలనకాలమందును బనగానపల్లి సంస్థానము ఆ యా ప్రభుత్వముల సార్వభౌమాధికారము నంగీకరించినను కప్పము చెల్లించుటనుండి మినహాయింపఁబడియుండినది. వీరికి తొమ్మిదిఫిరంగుల కాల్పు గౌరవముకూడ ప్రసాదింపఁబడియుండినది.

ఈ సంస్థానము కర్నూలు మండలము నందలి కోయిలకుంట్ల, నంద్యాల ద్రోణాచలము తాలూకాల మధ్య నమరియుండినది. దీని వైశాల్యము 275 చ. మై. జనాభా 1881 లెక్కల ప్రకారము 30,754 మంది. ఇందులో హిందువులు 24,798. 1901 లెక్కల మేరకు 32,279 మంది. 1931 లెక్కల ననుసరించి 36,646 మంది. ఈ సంస్థానమునందుఁగల మొత్తము గ్రామములు 63. ఇందులో రెండు బేచిరాక్ గ్రామములు, రెండువందల లోపు జనాభాగల గ్రామములు 21 గలవు. జాగీరులు కాక తక్కిన సంస్థానము సాలుసరిరాఁబడి మూఁడున్నరలక్షలు.

ఈ సంస్థానమున 13 చిన్నజాగీరులు, 28 గ్రామములతో నేర్పడి యుండినవి. ఈ జాగీరుల సాలుసరి రాఁబడి రెండున్నర లక్షల పైఁబడి. ఈ జాగీరుదారులందఱును నవాబునకు పరంపరాసంబంధి బంధువులు: సమీప జ్ఞాతులు. వీరందఱును నవాబు చెప్పుచేతలలోనివారు. శిస్తులు వసూలు చేసికొనుటతప్ప వీరి కితరము లయిన యధికారము లేవియును లేవు. సంస్థానము నందలి సివిల్, క్రిమినల్ వ్యవహారములన్నియు నవాబు నధికారమునకు,

* వింజమూరి గోవిందరాజులు, స్వదేశసంస్థానములు — హైందవరాజ్యాంగ పరిణామము, ఆంధ్రపత్రిక, సంవత్సరాది సంచిక, కాళయుక్తి, 1918, పుటలు 81—82.

పరిష్కారమునకులోఁబడినవి. గవర్నరు జనరలు ఏజెంటు (కర్నూలుజిల్లా కలెక్టరు) అనుమతిమీఁద మరణశిక్షల నమలుపఱుచు నధికారమును నవాబున కుండినది. సంస్థానసంపాదకుని తమ్ముఁడగు ఫజల్ ఇ అలీఖానున కిఁబడిన చెంచలిమల జాగీరుకూడ ఫజల్ ఇ అలీఖాన్ నిస్సంతుగా చనిపోయిన పిమ్మట బనగానపల్లిలో కలిసిపోయినది.

జుర్రేఱు, కుందేఱు ఈ సంస్థానమునందలి చిన్ననదులు. కుందేఱు ఎఱ్ఱమలలో పడమటితట్టునఁబుట్టి, బనగానపల్లి సంస్థానమునఁబ్రవహించి కడపమండలములోని కమలాపురము నొద్ద పెన్నేటిలో కలియుచున్నది. సంస్థానపు జనాభాలో నాలవవంతు మాత్రము ముస్లిములు. వీరిలో నెక్కువ మంది సున్నీశాఖకు చెందినవారు. నవాబు షియా శాఖానుయాయి.

## సంస్థాన చరిత్రము

సంస్థానపాలకుల పూర్వులు పారసీకదేశీయులు ; సయ్యద్ తెగకు చెందిన వారు. రెండవ సయ్యద్ అబ్బాస్ (క్రీ.శ. 1633) పారసీకసింహాసన మధిష్ఠించిన నాఁడు సయ్యద్ మొహమ్మద్ ఖాన్ రజ్వీ ఆయనకు వజీరు. రజ్వీకి సయ్యద్ హుసేన్ అలీఖాన్, సయ్యద్ తహేర్ అలీఖాన్ అని ఇద్దఱు కొడుకులు. రజ్వీ మరణానంతరము పాదుషా తహేర్ బుద్ధికుశలతకు, సూక్ష్మగ్రాహితకు మెచ్చి యతనినే తనవజీరుగా నియమింప నిశ్చయించెనఁట ! అన్నయగు హుసేనలీకి ఈ నిర్ణయము నచ్చక తమ్ముని చంపింప కుట్రలుపన్నఁగా తల్లి కిది తెలిసి చాల ధనమిచ్చి చిన్నకొడుకును దేశమును వదలి మఱియెచ్చట నైనను తల దాఁచికొమ్మని చెప్పి పంపెనఁట ! తహేర్ భారతదేశమునకు వచ్చెనఁట !

సరిగా నీ కాలమున భారతదేశమునందు మొగలుసామ్రాజ్య మత్యుచ్చ దశలో నుండినది. అది షాజహాన్‌పాలనకాలము. అలీ అదిల్‌షా అప్పటి బిజాపూర్ సుల్తాను. సుల్తానుమంత్రియగు సయ్యద్ అసదలీఖాన్ సయ్యద్ తహేర్ అలీఖానునకు తన మనుమరాలినిచ్చి నిఖాచేయించెను. అసదలీ చనిపోయిన పిమ్మట అతనిస్థానములో తహేరును నియమింపవలెనని సుల్తాను తలపోసినాఁడు. అసదలీ తనయు లిది యెఱిఁగి యసూయాగ్రస్తులై తహేర్‌ను చంపించిరి. తహేర్‌కు సయ్యదసదలీఖాన్, సయ్యద్ మొహమ్మద్ ఖాన్ అని ఇద్దఱుకుమారులు. తహేర్ భార్య కొడుకులిద్దఱను వెంటనిడికొని యార్కాటునకుఁబోయి ఆర్కాటు నవాబు సాదత్ ఉల్లాఖాను నాశ్రయమున నుండెను. మొహమ్మద్ ఖాన్ ఆర్కాటు నవాబు కొలువున మన్‌సబ్‌దారుగా ప్రవేశించి పిమ్మట సేనానియయ్యెను. ఈ మొహమ్మద్ ఖాన్ అప్పటి బనగానపల్లి జాగీరుదారయిన ఫజల్ ఇ అలీఖాన్ మనుమరాలిని పెండ్లాడి యా పిమ్మట బనగానపల్లికి నవాబయ్యెను.

ఔరంగజేబు పెద్దవజీరయిన ముబారక్ ఖాన్ బంధువును, అలాకొలి

కుమారుఁడును నగు మొహమ్మద్ బేగ్ ఖానునకు బనగానపల్లి జాగీరుగా నీఁబడి యుండినది. ఇతని తమ్ముఁడగు ఫజల్ ఇ అలీఖాన్ బనగానపల్లికి దాపునఁగల 'చెంచలిమల'కు ఖిల్లేదారు. ఇతఁడు నిస్సంతుగా మరణింపఁగా చెంచలిమల బనగానపల్లిలో లీనమయినది. మొగలుల యధికారము క్షీణించి హైదరాబాదులో మొగలుపాదుషాలప్రతినిధి దక్కనుసుబాదారయిన ఆసఫ్ జా నిజామ్ ఉల్ ముల్క్ స్వతంత్రుఁడుకాఁగా ఈ యదను చూచికొని మొహమ్మద్ బేగ్ ఖాన్ నవాబయ్యెను. దక్షిణదేశయాత్రలసందర్భమున ఆసఫ్ జా, బేగ్ యొక్క యధికారమును గుర్తించి సన్నదును ప్రసాదించినాఁడు. ఈ సన్నదులో ఈ జాగీరు బిజాపూరు సుదా, నంద్యాల సర్కారులోనిదిగా వర్ణింపఁబడినది. అక్కఱ గలిగినపు డశ్వసేనతో తోడ్పడు నిమిత్తమును, జాగీరునందలి ప్రధాన దుర్గాదులను మంచిస్థితిలో నుంచునిమిత్తమును ఈ జాగీరీఁబడినది.

బేగ్ కుమారుఁడు ఫజల్ ఇ అలీఖాన్ తండ్రికంటె ముందు చనిపోఁగా బేగ్ మనుమఁడు గుల్లినవాబ్ జాగీరునకువచ్చెను. ఇతఁడు పదియేండ్ల పసి బాలుఁడు. ఇతని మేనత్తమగఁడు మొహమ్మద్ బేగ్ ఖాన్ లౌగ్ అధికారము వశపఱచికొని యెనిమిదేండ్లు పాలించెను. ఆ పిమ్మట నితఁడు గుల్లినవాబ్ చే పదచ్యుతుఁడు గావింపఁబడెను. ఆర్కాటునవాబు మరణానంతరము తహేరలీ ఖాను రెండవకొడుకయిన మొహమ్మద్ ఖాన్ బనగానపల్లికివచ్చి గుల్లినవాబు సోదరిని పరిణయమాడెను. గుల్లినవాబునకు సంతతిలేదు. ఇతనిసోదరికి మొహమ్మద్ ఖానువలన హుసేన్ నలీ, అసదలీ యని యిరువురు పుత్రులు. గుల్లి నవాబు మేనల్లురను కన్నకొడుకులవలె ముద్దుగాపెంచి పెద్దవానిని బనగానపల్లికి, చిన్నవానిని చెంచలిమలకు నవాబులుగ నేర్పాటుచేసినాఁడు.

గుల్లినవాబు కర్నూలునవాబునకు నామమాత్రముగ కొంత కప్పము చెల్లించుచుండెను. ఇతని కాలమునందే హైదరాలీ బనగానపల్లిపై దండెత్తి నవాబును లోఁబఱచికొనియుండెను. 1782 లో గుల్లినవాబు మరణించెను. హుసేనలీ నలుగురు కుమారులు మైనరులు. పినతండ్రి అసదలీ రాజ్యవ్యవ హారములు చూచుచుండెను. అసదలీ తనయాజ్ఞలను ధిక్కరించెనను నెపముపెట్టి టిప్పుసుల్తాన్ బనగానపల్లిని జయించి మొహమ్మద్ యూసఫ్ ను బనగానపల్లికి ఖిల్లేదారుగా నియమించెను. హుసేనలీ భార్యాపుత్రులు, మైనరుల పితృవ్యుఁడును, చెంచలిమల నవాబును నగు అసదలీఖానును* సంస్థానమును వదలి ఏడెనిమి దేండ్లు హైదరాబాదులో నిజామునాశ్రయమున నుండి, నిజాము తోడిచ్చిన సేనలతోవచ్చి తుమ్మలపల్లియుద్ధమున ఖిల్లేదారయిన యూసఫ్ ను పాఱఁదోలి, గుత్తిసుబాదారయిన కుతుబుద్దీన్ ఖాన్ సేనానిగాఁగల టిప్పుసుల్తానుసేననుకూడ ఓడించిరి.

* అసదలీఖానని తాడిపత్రి కైఫీయతు, పు. 58.

హుసేన్ అలీ పెద్దకుమారుఁడగు ఘులామ్ మొహమ్మదలీఖాన్ బనగానపల్లి నవాబుగాను, ఇతని పినతండ్రియునునగు అసదలీఖాన్ చెంచలిమల నవాబుగాను కుదురుకొనిరి. అసదలీకి నలుగురు కుమారులు; ఒక కూఁతురు. ఈ తనయను బనగానపల్లినవాబు ఘులామ్ అలీఖానున కిచ్చి, చెంచలిమల సంస్థానమును అల్లునకరణముగా నొసఁగి, తన నలుగురు కొడుకులను అల్లునిపోషణయందే యుండునట్లు ఏర్పాటుగావించెను.

అసదలీఖాను సంస్థాన వ్యవహారములను చక్కఁబెట్టుచుండుటవలన ఘులామ్ మొహమ్మద్ అలీ హైదరాబాదులో స్థిరపడి యనేక యుద్ధములలో నిజామునకును, కుంఫిణీవారికిని తోడ్పడి పేరుప్రతిష్ఠలు గడించెను. నిజామ్ ఈతనిసేవలకు సంతోషించి 'మన్సూరుద్ దౌలా బహద్దర్' అను బిరుదమును ప్రసాదించెను. మరాఠాయుద్ధములలో నితని కుడిచేతివ్రేళ్ళు తెగిపోఁగా నాయుధోపజీవనమును వదలి సంస్థానపాలనమును నిర్వహించుచుండెను. ఇతఁడు తన సంస్థానమున జాగీర్దారీపద్ధతిని ప్రవేశపెట్టి సమీపజ్ఞాతులకు జాగీరులను ప్రసాదించి వారి మంచిని సంపాదించెను.

1800 లో నిజాము బనగానపల్లిమీఁది యధికారములను బ్రిటిష్‌కుంఫిణీకి దత్తముగావించినాఁడు. ఘులామ్ మొహమ్మద్ అలీ తాను జీవించి ఉండఁగానే 1821 లో తన పెద్దకొడుకు హుసేన్ అలీని గద్దెనెక్కించి 1824 లో మరణించెను. హుసేన్ అలీకి పుత్రసంతతిలేదు. ఇతనికాలమున సంస్థానము ఆర్థికముగ చాల చిదికిపోయినది. 1825—1848 మధ్య బకాయిపసూలు నిమిత్తము ఇంగ్లీషుకుంఫిణీవారు రాజ్యవ్యవహారములను పర్యవేక్షించిరి. 1848 లో సంస్థానమును తిరిగి స్వాధీనపఱిచి సన్నదు నిచ్చులోఁగా హుసేన్ అలీ మరణించెను. ఫజల్ ఇ అలీఖాన్ చిన్నకొడుకయిన ఘులామ్ మొహమ్మదలీ ఖాన్ పై హుసేనలీ తనయయగు ఇమ్దాద్ బేగమును పెండ్లాడి సంస్థానాధికారి యయ్యెను. 1849 లో ఈ ఘులామ్ అలీ పేర సన్నదు ప్రసాదింపఁబడినది. 1867 లో నితనికి సి.ఐ.ఇ. బిరుదము వచ్చినది.

ఇతఁడు 1868 లో పురుషసంతతిలేకుండ మరణింపఁగా ఇతనిపుత్రికను ఈతని పెద్దయన్న సయ్యద్ అసదలీఖాన్ కుమారుఁడయిన సయ్యద్ ఫతే అలీఖాన్ పెండ్లాడి నవాబయ్యెను. ఇతని పాలన మించుమించుగా ముప్పదియేండ్ల పాటు సాఁగినది. 1876 లో ప్రిన్సాఫ్‌వేల్సు రాకసందర్భమున ఫతే అలీఖానునకు సి.ఎస్.ఐ. బిరుద మొసఁగఁబడినది. బనగానపల్లిపాలకులకు 1879 లో నవాబు బిరుదము పైతృకస్వామ్యముగా ప్రసాదింపఁబడినది. సంస్థానము మరల అప్పులపాలయినది. 1905 లో సంస్థానము మద్రాసుప్రభుత్వము స్వాధీనమునకు వచ్చినది. ఫతే అలీఖాన్ పెద్దకుమారుని జ్యేష్ఠపుత్రుఁడు హిజ్ ఎక్సెలెన్సీ నవాబ్ సయ్యద్ ఘులామ్ అలీఖాన్ బహద్దరు 1908 లో సంస్థానమున కధిపతి

యయ్యెను. ఈయన ఇంగ్లీషు, పారసి, హిందుస్తానీ భాషలలో మంచి పరిచయము గలవారు. నవాబు దివానగు ఖాన్‌బహద్దరు ఖాజా అక్బర్ హుసేన్‌ఖాన్ సాహెబు ఉర్దూలో మంచి పండితుఁడు, కవి. ఉర్దూ సాహిత్యమున నీయనకు మంచి పేరు గలదు. ఉర్దూ ఇంగ్లీషు భాషలలో దేశచరిత్ర జీవితచరిత్రలకు సంబంధించిన గ్రంథములనేకములు వీరి గ్రంథాలయమునఁ గలవు. నవాబుగారి పెద్దకుమారులు మీర్ సయ్యద్ ఫజల్-ఇ అలీఖాన్ బహద్దరు (1901–1922) అజ్మీరులోని మేయో కాలేజీలో చదివినవారు. తండ్రి మరణానంతరము 1922లో మీర్ ఫజల్ ఇ అలీఖాన్ బహద్దరుగారు పట్టమునకు వచ్చిరి. వీరికి పిమ్మట వీరి కుమారులు నవాబ్ మీర్ ఘులామ్ అలీఖాన్‌బహద్దరుగారు సంస్థానమును పాలించిరి. ఆ పిమ్మట ఈ సంస్థానము కర్నూలు మండలములోని ఒక తాలూకాగా పరిణతమయి ఆంధ్రప్రదేశమున అంతర్లీనమయినది.

## సాహిత్యపోషణము

సంస్థానపాలకులు ముస్లిములు. విశేషించి పారసీక దేశమునుండి వచ్చినవారి సంతతికి చెందినవారు. వీరు ముఖ్యముగా పారసి, హిందుస్తానీ భాషలను పోషించిరి. బనగానపల్లి నవాబులలో చాలమంది ఉర్దూ పారసీకము లలో మంచి పండితులు. సంస్థానప్రజలలో అత్యంత అయిదువంతులు హిందువు లగుట వలనను, వారి మాతృభాష తెలుఁగగుట వలనను బనగానపల్లి నవాబులు హిందూమతమును, ఆంధ్రభాషను గౌరవించుచునే వచ్చిరి.

బనగానపల్లి నవాబులకు మతసహన మెక్కువ. ఇస్లాము మతమునందు 'షియా' యను సనాతనశాఖకు చెందినప్పటికిని వారు హిందువుల దేవతలను, నమ్మకములను గౌరవించుచుండిరి. కాలజ్ఞానవచనతత్త్వములను విరచించిన కందిమల్లాయపల్లె వీరబ్రహ్మేంద్రయోగి ఈ సంస్థానమునకుఁ జెందినవారు. వీరబ్రహ్మముగారి మహిమలను గుర్తించి వారికి విశేషప్రచారప్రశస్తులను గల్పించినవారు బనగానపల్లి నవాబులు. వీరబ్రహ్మము బనగానపల్లి నవాబుల మధ్య నడచిన వని ప్రచారములోనున్న పుక్కిటి పురాణములు పెక్కు లున్నవి.

కర్నూలు నవాబులకు సమీపబంధువులు బనగానపల్లి నవాబులు. బనగానపల్లి దగ్గఱనున్న యొకజాగీరున కధిపతి భ్రాజత్ ఖాన్. నందికొట్టుకూరు సిద్ధయోగీంద్రుఁడు భ్రాజత్ ఖానునకు బ్రహ్మోపదేశము చేసి విద్యాగురు వయ్యెనఁట! ఈ యోగి భ్రాజత్ ఖాను ననుమతి మీఁద సిద్ధయోగీశ్వర విలాసమను మూఁడాశ్వాసముల ద్విపద కావ్యమును రచించెనఁట!

'శ్రీ గురుఁడయినట్టి చిక్కయ్యఁ గొలిచి
యోగీశ్వరవిలాస మొప్పంగ నేను

సిద్ధయోగీశ్వర స్థిరనామమంది
సిద్ధసత్కీర్తి భ్రాజిత్ ఖానుమియ్య
యనుమతి ద్విపదకావ్యంబు గావించి
ఘనత బ్రహ్మేశలింగమున కంకితము
గా నొనరించి........'
'శ్రీ మీరు ముగితిదారికి మూలమయిన
యా మహాకావ్యవృత్తాంత మెట్లనిన
దొరసి మదీయసూక్తుల వినుమయ్య
మెఱసి భ్రాజిత్ ఖానుమియ్య మాయయ్య....'

భ్రాజత్ ఖాన్ సిద్ధయోగీశ్వర విలాస కృతి ప్రేరకుఁడే గాక ఏతత్కృతి శ్రోత యనియు పూర్వోద్ధృతభాగమునుబట్టి నిరూపింపనగుచున్నది. యోగీశ్వర విలాస లిఖితప్రతిని కర్నూలుమండలము నందికొట్కూరు వాస్తవ్యులు భాష్యాంత వైయాకరణులు నీలకంఠశాస్త్రిగారు పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రిగారికిచ్చిరఁట! ఆంధ్రసాహిత్యపరిషద్ గ్రంథాలయము కొఱకు శ్రీ శాస్త్రిగారు సేకరించిన యీ లిఖితప్రతి పరిషద్ గ్రంథాలయమున నున్నదేమో చూడవలసియున్నది.* వీరబ్రహ్మేంద్రయోగి శిష్యుఁడగు దూదేకుల సిద్ధప్పయు, సిద్ధయోగీశ్వర విలాసకర్తయగు నీ నందికొట్కూరు సిద్ధయోగీంద్రుఁడును అభిన్నులని పెండ్యాలవారి యభిప్రాయము. కాని నామసామ్యము గల వీరిరువురును భిన్నులు. సిద్ధయోగీశ్వరవిలాసమందలి '....పిలిచి శిష్యుని దనపీఠంబు మ్రోల నిలువఁబెట్టి విభూతి నిటల తలమున, ధరియించి హస్త మస్తక యోగ లీల....' యను పంక్తులను బట్టి సిద్ధయోగీంద్రుఁడు లింగాయతి యనియు, 'ఏ కులమని నన్ విపరమడిగితే, ఏ కులమని దెలుపుదు లోకులకు పలుగాకులకు' నను తత్త్వమును బట్టి వీరబ్రహ్మేంద్ర శిష్యుఁడగు సిద్ధప్ప దూదేకుల కులమువాఁడనియు స్పష్టపడుటవలన నీ యిరువురును భిన్నులని నిర్ణయించుట యుక్తియుక్తము.

యోగీశ్వరవిలాస కావ్యమునందు అల్లమప్రభుప్ప అక్కమహాదేవి కుపదేశించిన వీరశైవమతసిద్ధాంతములు వివృతములయినవి.

'నిత్యంబు శివయోగనిష్ఠలు పూని
యెలమి శ్రీ సిద్ధయోగీంద్రాహ్వయమునఁ
గలియుగంబందు విఖ్యాతివహించి

* ప్రాచ్యలిఖిత గ్రంథాలయమున D. No. 1178, 1179 సంఖ్యలుగల రెండు ప్రతులు కలవు. ఇదిగ్రంథాలయ పత్రికలో ప్రచురితము. పరిష్కర్తలు: మల్లంపల్లి శరభయ్య, తీర్థం శ్రీధరమూర్తి. vide Bulletin of the Oriental Manuscripts Library, Madras, Vol. X, No. 2, pp. 49-71.

యోగీశ్వరవిలాస మర్వీలో నేను
బాగైన ద్విపదకావ్యంబు రచింతు'*

అని వివరించిన యీ కవి 'బాలబ్రహ్మలింగ విగ్రహం విశాలకృపాలబ్ధి' యయిన కవితాశక్తి గలవాఁడఁట: బాలబ్రహ్మలింగ మనఁగా శ్రీశైలపాదక్షేత్రమగు బాలబ్రహ్మేశ్వరమునందు వెలసిన దేవతామూర్తి.

సుప్రసిద్ధతర్క-వేదాంతపండితులును, ఆశుకవితాప్రవీణులును నగు తిరుమల బుక్కపట్టణము శ్రీనివాసాచార్యులుగారు బనగానపల్లిలో సంస్థానోద్యోగు లేర్పఱచిన సభలో ఘంటాశతకములను జెప్పి మెప్పించి సమ్మానములందిరఁట: ఈ ఆచార్యులుగారు ఆత్మకూరుసంస్థానమున పండితులుగానుండి తిరుపతి వేంకటకవులతో శాస్త్రార్థము చేసినవారు.

బనగానపల్లి నవాబులు చక్కని కళాదృష్టికలవారు. దేశీయములగు కళారూపముల నాదరించుటలో వారికిఁగల యభినివేశము ప్రశంసనీయము. కూచిపూఁడి భాగవతసంప్రదాయము విజయనగరపాలకుల కాలమునాఁటికే ప్రథమాశ్రయమును సంపాదించియుండెనని విమర్శకవతంసు లూహించు చున్నారు. తుళువ వీరనరసింహరాయల నాఁటి కూచిపూఁడివారి ప్రదర్శనములు జగమెఱిఁగినవి. ఈ సంప్రదాయమును తమసంస్థానమునందు విరివిగా ప్రచారముసేయవలయునను నాశయముతో క్రీ. శ. 1700—1750 ప్రాంతమున బనగానపల్లినవాబుగారు కూచిపూఁడినుండి ప్రసిద్ధకళావేత్తల కుటుంబములను కొన్నింటిని రప్పించి వీరికి కపట్రాల, కోటకొండ సీమలలో అనేకభూములను ఈనాములుగాఁ బ్రసాదించి వారిచేత భాగవత కళాప్రచారమును జేయించిరి. ఆ నాఁడు నవాబుగారి యాహ్వానము మేరకు కూచిపూఁడినుండి తరలిపోయిన కుటుంబములలో చల్లావారి దొక కుటుంబమఁట:

చల్లావారు వెలనాటి వైదికులు. వీరిలో చల్లా భాగవతము దాసుభొట్లు ప్రధానుఁడు. భాగవత మనునది వీరికి పౌరుషవాచకమగు ఉపనామమఁట: సిద్ధేంద్రయోగి నేర్పించిన పారిజాతాపహరణప్రదర్శక రీతులను పరంపరాయాతముగా పుణికిపుచ్చుకొనినవారు చల్లావారు. ఇటీవల కథాపశేషులైన భరతశాస్త్రి శ్రీ లక్ష్మీనారాయణశాస్త్రిగారు మూలపురుషులకు తొమ్మిదవతరము వారఁట: శ్రీ శాస్త్రిగారు ఆ కళాకాదులకుటుంబమునకుఁ జెందిన నాట్యకళావిశారదులు. క్షేత్రయ్యపదములను, గొల్లకలాపమును, భామాకలాపమును, తరంగములను శాస్త్రోక్తముగా అభినయించుటలో శ్రీ శాస్త్రి గా రందెవేసిన చేయి; జయదేవుని అష్టపదులను సంస్కృత వ్యాఖ్యాన సహితముగా అభినయించుటలో దిట్టలు.

*D. No. 1178 Paper Ms., D. No. 1179 Palm-leaf Ms., A Descriptive Catalogue of the Telugu Manuscripts in Govt. Oriental Manuscripts Library, Madras, Vol. IV, 1936.

సంగీత నృత్యకళలలోనే గాక, సంస్కృతాంధ్రములయందును ఎక్కువ పరిశ్రమము చేసినవారట వీరు. క్రీ.శ. 1760 ప్రాంతముల బనగానపల్లె నవాబు కర్నూలునకు సమీపమున తుంగభద్ర కావలిగట్టున నున్న అలంపురమునకు దాపునఁగల కపట్రాల గ్రామమును కూచిపూడి భాగవతులకు ఈనాముగా నిచ్చిరఁట ! చల్లావారు, చింతావారు దానప్రతిగ్రహీతలఁట !*

* మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, కోటకొండ భాగవతులు, ఆంధ్రప్రభ వార పత్రిక, 1967, జనవరి, 25, పు. 47.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. రాయలసీమ పత్రిక, రాయలసీమ భోగట్టా, రాయలసీమలోనుండు స్వదేశ సంస్థానములు, పు. 20.

2. తాడిపత్రి కైఫీయతు.

3. పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి, నా కర్నూలుమండలసంచారము, సారస్వతసర్వస్వము, సంపుటము 1, సంచిక 5, పు. 25; సంచికలు 11, 12, పుటలు 15—23.

4. చిగవల్లి వేంకటశివరావు, స్వదేశసంస్థానములు, ప్రభాతము, బెజవాడ, 1934, అక్టోబరు, పుటలు 112—116.

5. A. Vadivelu, The Aristocracy of Southern India. Vol. I, 1903, pp. 1–32.

6. Narahari Gopalakrishnamah Chetty, A Manual of the Kurnool District in the Presidency of Madras, pp. 245–252.

7. V. L. Sastri, Encyclopaedia of the Madras Presidency and the Adjacent States, pp. 267–275.

8. W. W. Hunter, Imperial Gazetteer of India. Vol. VI, pp. 371–378.

9. Memoranda on the Indian States, 1936, pp. 138, 139.

10. British Enactments in force in Indian States. 1930, Vol. VI.

11. A. Vadivelu, The Ruling Chiefs, Nobles and Zamindars of India, Vol. 1, Madras, 1915, pp. 448–450.

# బొబ్బిలి

## ప్రవేశిక

తూర్పుకనుమల చాలులో, నాగావళీపరీవాహ సీమలో గజపతినగరము, చికాకోలు, చీపురుపల్లి, పార్వతీపురము, పాలకొండ, సాలూరు తాలూకాల మధ్య నేఁటి శ్రీకాకుళము మండలము నందు బొబ్బిలి జమీందారీ వ్యాపించి యుండినది. విశాఖపట్టణమునకు నైరృతిదిశలో డెబ్బదిమైళ్ళ దూరములో బొబ్బిలి పట్టణమున్నది. బొబ్బిలి పట్టణ మీ సంస్థానమునకు రాజధాని. ఈ పట్టణమున్న స్థలమును చికాకోలు నవాబు షేర్ మొహమ్మద్ ఖాన్ చేత నీ సంస్థానపాలకులకు ప్రసాదింపఁబడుటవలన నచట కట్టిన కోటకు, పేటకు నివేశనదాత పేరు 'బెబ్బులి' పేర బెబ్బులి (షేర్ అనఁగా పెద్దపులి) యని వ్యవహరింపఁగా నదే జనులవాడుకలో 'బొబ్బిలి' యైనదఁట!* ధ్వనిపరిణామసూత్రముల మేరకు బెబ్బులి, బొబ్బిలియగుననుట శాస్త్రవిరుద్ధము కాదు కాని, యీ వ్యుత్పత్తి చరిత్రగతి కనుగుణముగా నున్నదో లేదో చరిత్రకారు లింకను యోజించి చివరి మాటను చెప్పవలసియున్నది.

కావిటి, బొబ్బిలి, రాజాము, సీతానగరము అను నాలుగు ఠాణాలుగా నీ సంస్థానము పరిపాలనసౌలభ్యము నిమిత్తము విభజింపఁబడి యుండినది. ఒక్కొక్క ఠాణా ఒక్కొక్క అమీను నధికారముక్రింద పర్యవేక్షింపఁబడుచుండెడిది. ఈ సంస్థానము విస్తీర్ణము 920 చ.మై. 202 జిరాయితీ గ్రామములు, 70 అగ్రహారములు, 6 మొఖాసా గ్రామములు ఈ సంస్థానమున నుండినవి. ప్రాఁత జమీందారీ 300 చ.మైళ్ళ విస్తీర్ణమును, 139 జిరాయితీ గ్రామములును, 53 అగ్రహారములును, 5 మొఖాసా గ్రామములును కలిగియుండెడిది. జగ్గంపేట ఎస్టేటునుండి దొంతమూరు, రాయవరము భాగములు రావుబుచ్చివేంకటరావునకు వారసురాలయిన వెంగాయమ్మనుండి బొబ్బిలిరాజాగారిచే 1903, 1908లలో ఖరీదుచేయఁబడి 1916 లో నివి బొబ్బిలిరాజాగారి ద్వితీయపుత్రుఁడయిన రామకృష్ణరంగారావుబహద్దరునకు వీలుద్వారమున దఖలుపడి యుండినవి.

* 'షే రనఁ దురుష్కభాషను జెలఁగును బులి
పెద్దపులి యను పదమయ్యె బెబ్బులియన
బెబ్బులియె నాఁడు నాఁటికి బొబ్బిలియనఁ
బొలిచె నక్షరములుమార్పుఁ బొంద నిపుడు'

—ప్రపదన పారిజాతము, అవతారిక, పు. 8.

రూ. 11,902 లు పేష్కషుగల కిర్లమపూఁడి ఎస్టేటుభాగములను రామకృష్ణ రంగారావుబహద్దరుగారు కొనుగోలుచేసియుండిరి. ఈ సంస్థానమునందు నాగావళి, వేగవతి, సువర్ణముఖి మొదలగునవి ముఖ్యనదులు. ఈ సంస్థానము నందలి అన్నమరాజుపేట, తుమ్మపాల మఱి యాఱు గ్రామములును విజయ నగరము జమీందారులకు కవులునకీఁబడుచువచ్చినవి. శాశ్వతకరనిర్ణయము నాఁటి దీని యిజ్జాయింపు ఆదాయము రూ. 1,28,240 లు. ఆ నాఁటి పేష్కషు రూ. 90,000 లు. 1938 నాఁటిలెక్కల ప్రకారము రాఁబడి ఆఱులక్షల యిరువది యాఱువేలకు పైఁబడి. పేష్కషు రూ. 83,442 లు. 'ఆర్బల్ నాట్' కంపెనీ వారి నీలిమందు కార్ఖానాలు పదునాలుగు ఈ జమీందారీలో నుండినవి.

## సంస్థాన చరిత్రము

సంస్థానపాలకులు హరిపాదోద్భవులైన వెలమదొరలు. అత్యంత ప్రతాపాఢ్యులయిన ఈ దొరలలో రావువారు బలవంతులు. వీరిది రేచెర్లగోత్రము. ఇనుగంటి, చింతపల్లి, చెలికాని, తాండ్ర, దామెర గృహనామకు లగు వెలమ దొరలు బొబ్బిలి పాలకకుటుంబముతో నెయ్యము, వియ్యముకలవారు. వెంకట గిరివారికిని బొబ్బిలివారికిని మూలపురుషులొకరే. మూలపురుషుని నుండి పదు నైదవతరమువాఁడగు నిర్వాణ రాయప్పనాయఁడు నేఁటి కర్నూలు మండలము నందలి వెలుగోడును పాలించినవాఁడు. ఇతనికే పెద్దరాయఁడను వాడుక పేరుండెనఁట! కొందఱు బొబ్బిలికి మూలపురుషుఁడు రాజాధర్మారావుగారని వ్రాసిరి. పెద్దరాయఁడు మూలపురుషుఁడని కార్మికేలు, హంటరు మొదలగు వారంగీకరించిరి. 'బొబ్బిలివారి వంశావళి'లో —

'అమ్మహావిష్ణుదయకుఁ బాత్రమ్ములగుచు
డెబ్బదేడు గోత్రమ్ముల ఠీవిమెఱయ
మానధనులయినట్టి పద్మజకులంబు
వారు వొలుతురు భువి వెల్మవారనంగ' —1—13

'అలడెబ్బదేడు గోత్రం
బులవారికి నాదిపీఠముగఁ బెక్కు తరం
బులనుండి గౌరవంబునఁ
బొలుతురు వేంకటగిరిప్రభువులు ప్రసిద్ధిన్' —1—14

'అలవేంకటగిరి పురరా
జులలోఁ బదునేనవ పురుషుండగుచు మహిన్
బొలిచెఁబెదరాయఁడాతఁడె
వెలసెను నిర్వాణరాయవిభుఁడను పేరన్' —1—19

పెద్దరాయఁడను నామాంతరముగల నిర్వాణ రాయప్పనాయఁడే మూల

పురుషుఁడుగా నిరూపింపఁబడినాఁడు.

ఈ రాయఁడప్పగారును, విజయనగరసంస్థానపాలకుల పూర్వులలో ఆనాఁటి పాలకుఁడును చికాకోలు నవాబు షేర్ మొహమ్మద్ ఖాన్ పదునేఁడవ శతాబ్ది మధ్యభాగము (క్రీ. శ. 1652) నందు మొగలుపాదుషా తరపున కళింగ సీమపై దాడి సాఁగించినపుడు ఖానుని వెంటవచ్చి తోడ్పడిరఁట! రాయఁడప్ప తోడ్పాటునకు సంతోషించి రాజాము ఎస్టేటును రాయఁడప్పకు మొగలుపాదుషా. షేర్ మొహమ్మద్ ఖాన్ ద్వారమున ప్రసాదించెనఁట! రాయఁడప్ప ఎస్టేటునందు కోటకట్టి దానికి తన ప్రభువు పేరుంచెనఁట. రాయఁడప్ప కుమారుఁడు లింగప్ప. బొబ్బిలికోటనిర్మాత లింగప్పయని కొందఱందురు. తండ్రికాలము నందే లింగప్పకు ఢంకా నగారా నౌబత్ శ్వేతచ్ఛత్రము రాజా బిరుదము మున్నగు రాజలాంఛనములు ప్రసాదింపఁబడియుండినవఁట.

లింగప్ప మొగలుపాదుషాలకు, చికాకోలు నవాబులకు తలలోని నాలుకగా ప్రవర్తించినవాఁడఁట! షేర్ మొహమ్మద్ ఖాన్ కుమారుఁడు వేఁట మార్గమున మాఁకసీమల కరిగినపుడు పితూరీదారులెవ్వరో అతనిని బంధింపఁగా, ఖానుని అనుమతి మేరకు లింగప్ప సాహసించి మన్యపు ప్రాంతములన్నిటిని గాలించి, పితూరీదారులను చెఱపట్టి, ఖానునికొడుకును విడిపించి నవాబుమన్ననలను బడసెనఁట! దీనికిఁబ్రతిఫలముగా లింగప్ప పండ్రెండు పోటుగ్రామములను నవాబునుండి బహుమతిగాఁ బొందెనఁట! ఈ సంఘటనము నేఁటి శ్రీకాకుళము మండలమునందలి పలాసాకు చేరువలోఁగల 'రంగవాక' యనుచోట జరిగిన దఁట. ఈ రంగవాక విజయమును పురస్కరించికొని నవాబు లింగప్పకు 'రంగరాయ' బిరుదమును బ్రసాదించెనఁట. లింగపరంగేంద్రుఁడు మహా యోధుఁడని సంకల్పసూర్యోదయావతారిక స్పష్టపఱచుచున్నది. నాఁటినుండి లింగప్పరంగరాయల వంశీయులీ బిరుదమును పౌరుషచిహ్నముగా పరంపరగా తమ నామముల చివర ధరించుచు వచ్చిరి.

లింగప్పకు సంతతిలేనందున వెంకటగిరి ప్రభువులకోవలోని మాధవ రాయల మూఁడవ కుమారుఁడగు వెంగళరావుగారిని దత్తుతెచ్చిరి. పెద్దరాయఁడు గారిని కూడ లెక్కించినచో బొబ్బిలి పాలకులలో నీ వెంగళరావుగారు మూఁడవ వారు. పాలకజనకుఁడు మరణించునాఁటికి వెంగళరావు పిన్నవయసువాఁడు. అందువలనఁ గొంతకాలము తండ్రియగు మాధవరావును, వెంగళరావు పెద్దన్న పమ్మారావును, మఱియొకయన్న నారప్పరావును సంస్థానవ్యవహారములను చక్కదిద్దిరి. వెంగళరావునకు రంగపతిరంగారావు, పెదజనార్దనరంగారావు అని యిరువురు కుమారులు. జనార్దనరంగారావుగారు లక్కవరపుకోటను సంపాదించి పాలించిరి. రంగపతిరంగారావుగారి కుమారులు రాజారాయఁడప్ప రంగారావుగారు. ఈయన తన తండ్రి మరణకాలమునాఁటికి చాలపసివాఁడు.

లక్కవరపుకోట పాలకుఁడును, ఇతని పినతండ్రి యగు రాజా పెదజనార్దన రంగారావుగారి కుమారుఁడును నగు రాజా వెంకటపతిరంగారావు కొంతకాలము ఎస్టేటువ్యవహారములను పర్యవేక్షించిరి. ఆ పిమ్మట రాయఁడప్పరంగారావుగారు స్వయముగా రాజ్యమును పాలించిరి. వీరికి సంతతిలేనందున రాజా గోపాలకృష్ణ రంగారావు బహద్దరుగారిని దత్తుతీసికొనిరి. ఈ గోపాలకృష్ణ రంగారావుగారు బొబ్బిలిపాలకుల పరంపరా సంబంధియగు రావు గోపాలరావుగారి పెద్ద కుమారుఁడు. గోపాలకృష్ణ రంగారావుగారి తమ్ముఁడు బొబ్బిలి ముట్టడిలోఁ బ్రసిద్ధుఁడయిన వెంగళ రంగారావుగారు. గోపాలకృష్ణ రంగారావుగారి భార్య మల్లమదేవి. ఈమె కసింకోటవాస్తవ్యులు, పద్మనాయక కులోత్తములు శ్రీ చెలికాని వెంకయాంబారామరాయల పుత్రిక. ఈమెసోదరియగు జగ్గమాంబ పిఠాపురము పెదనీలాద్రిరాయనింగారి (క్రీ.శ. 1730–1776) భార్య.

1756 లో చెలరేఁగిన ఉత్తరసర్కారులలోని జమీందారుల పితూరీల నణఁచుటకై గొప్పసేనతో తరలివచ్చిన ఫ్రెంచిసేనాని బుస్సీదొరగారికి విజయ నగరము పెదవిజయరామరాజు (1717–1757) చాల తోడ్పడిరి. నిజామునుండి ఫ్రెంచివారికి ఉత్తరసర్కారు లీఁబడినపుడు చికాకోలు, రాజమహేంద్రవరము సర్కారులను పెదవిజయరామరాజుగారికి కవులున కిచ్చుటకు బుస్సీదొరగా రామోదించియుండిరి. ఈ సీమయందలి పితూరీలకు మూలము బొబ్బిలిపాలకులని పెదవిజయరామరాజు బుస్సీదొరను నమ్మించి బొబ్బిలికోటను ముట్టడింపఁ జేసిరి. 1757 లో బొబ్బిలిముట్టడి జరిగి చరిత్రలో ప్రసిద్ధమయినది.

బొబ్బిలిరాణియగు మల్లమాంబ తన జోహారుకాలమున తన ముద్దుల తనయుఁడగు గోపాలవేంకటరంగారావు (1751–1801) ను వెంకటలక్ష్మి యను దాసిచేతికిచ్చి తన చెలియలగు జగ్గమాంబయొద్దకు సామర్లకోటకు పంపించినది. అప్పటి కింకను పెదనీలాద్రిరాయనింగారు పట్టమునకు రాలేదు*. రాజవంశీయుఁడయినను సంస్థానభాగస్వామికాక, సంస్థానపాలకునివలన వార్షిక భరణమును బొందుచున్న సామాన్యుఁడగు రాజబంధువుగా మాత్రమే యుండిన వాఁడు. బొబ్బిలిముట్టడితరువాత బుస్సీదొరగారు మరణించిన బొబ్బిలిరాజాగారి కుమారుఁడయిన గోపాలవేంకటరంగారావును పిలిపించి చిన్నరంగారావనుపేర బొబ్బిలికధిపతిగా నియమించిరి.

1766 లో విజయనగరసంస్థానము దివాను సీతారామరాజు ఈ గోపాల వేంకటరంగారావుగారిని మోసముతో బంధించితెచ్చి విజయనగరముకోటలో ఖైదుచేసి బొబ్బిలిని వశపఱచికొనెను. క్రీ.శ. 1766–1794 మధ్య బొబ్బిలి సంస్థానము విజయనగర సంస్థానములో నొకభాగముగా నుండినది. కాని

* ఈ నీలాద్రిరాయనింగారు క్రీ. శ. 1762–1776 మధ్య పిఠాపురమును పాలించినవారు.

1790 లో చినరంగారావు ఖైదునుండి తప్పించికొని సామర్లకోటకు పాటిపోయి పినతల్లి జగ్గమాంబ సంరక్షణమునఁ గొంతకాలము గడపి, ఆ పిమ్మట హైదరాబాదున కరిగి చాలకాల మచట వేచియుండి, నిజాముదయకు పాత్రుఁడయి తిరిగి వచ్చులోఁగా ఉత్తరసర్కారులు ఇంగ్లీషుకుంఫిణీపాలనక్రిందికి వచ్చి యుండినవి. 1794 లో నార్తరనుడివిజను కలెక్టరుగారు నిజామునుండి సిఫార్సులు తెచ్చిన చినరంగారావును బిలిపించి పూర్వపు తాలూకాలను తిరిగి కవులున కిప్పించిరి. 1801 లో చినరంగారావు మరణించెను. ఈయనకు సంతతి లేనందున పాత్తేరులోని రావు సుబ్బమాంబా అన్నారావుగారల పుత్రుఁడగు చిన్నవాని నొకనిని దత్తు స్వీకరించిరఁట ! కాని చినరంగరాయల పరోక్షమున బొబ్బిలిరాజ్యమును శత్రురాజు లాక్రమింపఁగా రాయఁడప్పతండ్రియగు అన్నా రాయఁడు—

'రిపులం బాఱఁగఁ దోలి బొబ్బిలి ధరిత్రీనాథునిం గ్రమ్మఱన్
నృపతు ల్మెచ్చఁగఁ దత్పురిన్ నిలిపెఁ బెంపేపార మీ తండ్రి నే
రుపుతో వేంకటరంగభూవిభుఁ డపుత్రుండై హయస్యందన
ద్విపవిత్తాదులతోడ మీ కొసఁగె మైత్రిన్ రాజ్య మాత్మీయమున్'

అని సంకల్పసూర్యోదయ లిఖితప్రతులు సాక్ష్యమిచ్చుచున్నవి.

బొబ్బిలియాస్థానవిద్వాంసుఁడగు కొటికెలపూఁడి వేంకటకృష్ణసోమయాజి రాయఁడప్పరంగారాయల కంకితముగా రచించిన శ్వేతాచలమాహాత్మ్యము నందును ఈ యంశము ప్రసక్తమయినది. రావు కులీనుఁడగు అన్నారావు సోదరబంధుసహితుఁడయి—

'రంగరాయఁడు మున్నేలు రాజ్యమెల్ల
విక్రమాతిశయమున నాక్రమించి
సకల మానవనాథులు సన్నుతింప
తీర్థయాత్రకుఁ జనిన యాత్మీయవంశ్యుఁ
గ్రమ్మఱను దెచ్చి నిలిపెఁ దద్రాజ్యముననుʼ

అంతేకాదు. అన్నారాయల పుత్రుఁడగు రాయఁడప్ప చినరంగారావునకు దత్తుఁడయి బొబ్బిలి నేలినట్లును అందు వివృతము.

'శ్రీ రాయణప్పరంగ
క్ష్మారమణుం డేలుకొనును మహివేంకటరం
గారాయనికిం దత్తుం
డై రాజితకీర్తి ధవళితాంగుండగుచున్'

రాజా జనార్దనరంగారాయకృతమగు మిత్రవిందా పరిణయము నందును రాయఁడప్ప అన్నారాయ పుత్రుఁడుగానే ఉట్టంకింపఁబడినాఁడు. చినరంగరాయల దత్తుఁడను ప్రసంగమే కానరాదు.

ఈతడే రాజా రాయఁడప్పరంగారావు (1790—1830) అనుపేర బొబ్బిలిని 1802—1830 మధ్య పాలించిన ప్రభువు. బొబ్బిలిపట్టణములోని వేణుగోపాలస్వామి ఆలయమును కట్టించుటకు వీరే మొదలుపెట్టినవారు. వీరు కృతికర్తలుగను, కృతిభర్తలుగను పేర్వడసినవారు. రాజా రాయఁడప్పరంగారావు గారికి ఇద్దఱుభార్యలు. చెలికానివారి యాఁడుఁబడుచు చెల్లయ్యమ్మ మొదటి భార్య; ఇనుగంటివారి యాఁడుఁబడుచు బుచ్చయ్యమ్మ రెండవభార్య. చెల్లయ్యమ్మగారికి శ్వేతాచలపతిరంగారావు (1810—1862), జనార్దనరంగారావు, సీతారామచంద్రరంగారావు, వేంకటరంగారావు అను నలువురుపుత్రులును, అయిదుగురు పుత్రికలును, బుచ్చయ్యమ్మగారికి సీతయ్యమ్మ యను తనయయును జన్మించిరి.

రాజా శ్వేతాచలపతిరంగారావుబహద్దరుగారు 1830 లో పట్టమునకువచ్చి ముప్పదిరెండేండ్లు పాలించి 1862 లో పరమపదించిరి. తనతండ్రి రాయఁడప్ప రంగారావుగారు మొదలుపెట్టిన వేణుగోపాలస్వామి దేవాలయనిర్మాణమును 1837 లో వీరు పూర్తిచేసిరి. వీరు తొమ్మిదవతరమువారు. వీరు గోదావరి మండలములోని చింతపట్లవారి యాఁడుఁబడుచు వేంకటరమణమ్మ*ను, ఈమె మరణింపఁగా దామెరవారి కన్యయగు వెంగాయమ్మను వివాహమాడిరి. కాని, సంతతిలేనందున పిఠాపురముసంస్థానాధీశ్వరులు రాజా రావు వేంకటసూర్య రాయనింగారి (1844—1850) ద్వితీయపుత్రులగు సీతారామకృష్ణుల (1845—1868) ను దత్తు తీసికొనిరి. ఈయన రాజా సీతారామకృష్ణరాయఁడప్ప రంగారావుబహద్దరు అనుపేర బొబ్బిలిని 1863 నుండి అయిదేండ్లపాటు పాలించి 1868 లో పిన్నవయస్సుననే మరణించిరి. 1864 లో బొబ్బిలిలోని ఆంగ్లో వర్నాక్యులర్ పాఠశాలను వీరే స్థాపించినవారు. ఈయనభార్య ఇనుగంటి వారి యాఁడుఁబడుచు లక్ష్మీచెల్లయ్యమ్మ.

ఈ రాజదంపతులు నిస్సంతయినందున వేంకటగిరిసంస్థానపాలకులు శ్రీ సర్వజ్ఞకుమారయాచేంద్రుల (1832—1892) మూఁడవకుమారులగు రంగ మన్నారుకృష్ణయాచేంద్రుల (1862—1926) ను రాణీ లక్ష్మీచెల్లయ్యమ్మగారు 1872 లో దత్తుతెచ్చిరి. శ్రీ చెల్లయ్యమ్మగారు 1887 లో మరణించిరి. రంగమన్నారుకృష్ణయాచేంద్రులు వేంకటశ్వేతాచలపతిరంగారావు అనుపేర 1881 లో బొబ్బిలిజమీపాలనమును స్వీకరించిరి. బొబ్బిలిపాలకులలో పదు నొకొండవవారగు వీరు అతిప్రసిద్ధులు. ఇంగ్లీషుప్రభుత్వమువారినుండి వీరు

* 'ఆర్యులు నుతింపఁదనరు మదగ్రజన్మ
రాణి వేంకటరమణాంబ రమణఁదలఁతు' —రాజా శ్వేతాచలపతిరంగారాయ బహద్దరు (1830—1862) గారి తమ్ములయిన జనార్దనరంగరాయల మిత్రవిందా పరిణయ కృత్యవతారిక.

మహారాజ, సర్ మొదలగు బిరుదములను సంపాదించిరి. 1893 లో యూరప్ ఖండమందు పర్యటించి విక్టోరియామహారాణిని దర్శించివచ్చిరి. నాలుగు పర్యాయములు మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలులో సభ్యులుగా నుండిరి. వీరి పెద్ద కుమారులు రాజా వేంకటకుమారకృష్ణరంగారావు (1880—1920). వీరు 1917లో జమీకి వచ్చిరి. వీరి తరువాత రాజా సర్ శ్వేతాచలపతిరామకృష్ణరంగారావు బహద్దరు (1901— ) వారు 1920 లో బొబ్బిలిపాలకులయిరి. వీరు జస్టిస్ పార్టీ నాయకులుగానుండి 1932—37 లో మద్రాసుముఖ్యమంత్రిగా పనిచేసి కె.సి.ఐ.ఇ. బిరుదమును పొందిరి. ప్రస్తుతము ఆంధ్రశాసనసభాసభ్యులు.

## సాహిత్యపోషణము

బొబ్బిలిపాలకవంశమువారు ఇంచుమించుగా నేడవతరముపరకు సాహిత్యవ్యాసంగములయందు అంతగా కల్పించికొన్నట్లుగా నిదర్శనములు కానరావు. సంస్థానస్థాపకులగు రాజా నిర్వాణరాయఁడప్ప, రాజా లింగప్ప రంగారావుగారలు సంస్థాననిర్మాణమునందే సంలీనమై యుండినవారు. నిర్వాణ రాయప్పనాయఁడు 'సుకవిరాజమరున్మణి' (వెలుగోటివారి వంశావళి, 293) యనియు, అతని '....కొలువెల్లన్ గవిగాయకావళి....' (పైది, 189) తో నిండియుండెడిదనియు, మల్లనకవినామకుఁడొకఁడు 'రాయప విజయ'మను కావ్యమును రచించెననియు (పైది, 218) వినుట తప్ప తక్కిన వివరములు మృగ్యములు. ఆ తరువాతి తరములవారికికూడ సంస్థానమును సుస్థిరము సేయుటయందో, విస్తరింపఁజేయుటయందో, శత్రురాజుల దాడుల నెదుర్కొనుట యందో సరిపోయినది. ఆఱవతరమువారయిన గోపాలకృష్ణ రంగారావుగారికి విజయనగరమువారి యెత్తులపై పైయెత్తులను వేయుటయందే గడచినది. వీరి కుమారులగు చినరంగారావుగారి జీవితకాల మేఁబదియేండ్లు. ఇంచుమించుగా పదియేండ్లు(1757—1766) ప్రవాసమునందును ముప్పదియేండ్లు(1766—1794) విజయనగరము ఖైదులోను వీరి బ్రదుకు చెల్లిపోయినది. 1794 లో రాజ్యము చేతికివచ్చిన కొలఁదికాలమునకే 1801 లో చిన్నరంగారావుగారు మరణించిరి. వీరి దత్తపుత్రుఁడుగా సంభావింపఁబడుచున్న రాజా శ్రీ రాయఁడప్ప రంగారావు గారితో నీ సంస్థానపాలకుల కృతిస్వీకారపూర్వక సాహిత్యపోషణమునకు 'నాంది' జరిగినది. కొత్ర, కొటికెలపూఁడి, మండపాక, మండలేముల, నుసర్లవంటి పండిత కవికుటుంబములు బొబ్బిలి పోషణమున వర్ధిల్లినవి.

## కొత్ర బాలకవి

బొబ్బిలి సంస్థానము నాశ్రయించిన పూర్వకవులలో కొత్ర బాలకవి (1730—1790) యొకఁడు. ఈయన అసలుపేరు వేంకటేశ్వరకవి. తెలగాణ్య

శాఖకుఁ జెందిన వైదికులు. కౌశిక గోత్రులు, సోమనార్య పుత్రులు. బొబ్బిలివారి తాణాపట్టణమగు రాజామునకు చేరువనున్న 'ఇల్లంనాయఁడువలస' వీరి నివాస గ్రామము. ఇది కొట్రవారికి బొబ్బిలి సంస్థానాధీశ్వరు లగ్రహారముగఁ బ్రసాదించినది. కొట్రవారిది పండితవంశము. ఇతఁ డించుమించుగా అడిదము సూరకవికి సమకాలికుఁడు. 'కొట్రా బాలకవీంద్రు శేఖరుఁడు మాకుం బూజ్యుఁ డెల్లప్పుడున్' అను అడిదము సూరకవి చాటువును బట్టి కొట్ర బాలకవి అడిదము సూరకవిచే స్తుతింపఁబడినట్లు తెలియుచున్నది.

'నరుని నొగలుమీఁద హరియున్నచందాన
సూరకవిపరేణ్యు జోడుఁ గూడు
కొట్ర బాలకవి యకుంఠవాగ్ధాటికిఁ
బర్వతాలుగాఁడు పాటిపోయె'

అనుచాటువునుబట్టి వీరిద్దఱు నాప్తమిత్రులని స్పష్టపడుచున్నది.

బాలకవి కొన్నిశతకములను, ప్రబంధములను రచించెననియు, వీనిలో ఖిల్లాణ చరిత్రమను ప్రబంధము ప్రశస్తకృతియనియుఁ జెప్పుదురుగాని అది లభ్యము కాలేదు. కొట్ర బాలకవి పేర 'విమలాంగీ పరిణయ' మను రెండాశ్వాసముల ప్రబంధము తాళపత్రప్రతి యొకటి చెన్నపురి ప్రాచ్య లిఖిత గ్రంథాలయమునఁ గలదు.[1] మాంధాతృ చక్రవర్తి కుంతల దేశాధీశుని కొమార్తెయగు విమలాంగిని వలచి పరిణయమాడిన కథ ప్రబంధ ఫక్కిలో నిందుఁ దీర్పఁబడినది. ఇది వేంకటేశ్వరాంకితము. లభ్యమైనప్రతి యసంపూర్ణము. నాయికా శీతలోపచారములు, జలక్రీడలవరకుఁ గలదు. ఇందలి దొకపద్యము :

'బొమ్మలు దీర్చినట్లొలయు బొమ్మల గ్రేవుల మూపు లంబుజా
తమ్ముల వీఁగ నొత్తు స్ఫురితమ్ములవేఁ దలమించు కన్ను లం
గమ్మ నిరాకరించు రుచిగమ్మిన కమ్మని మేలు జాళువా
నమ్మకచెల్ల ! వీని నొబఁ గమ్మకరాంకున కైన నున్నదే'

## రాయఁడప్పరంగారావుబహద్దరు

రాయఁడప్పరంగారావుగారు (1790—1830) కర్తయు, కారయితయు. వీరి రచనము సంకల్పసూర్యోదయమను కావ్యము.[2] తార్కికసింహ

[1] R. No. 564, మొదటి రెండాశ్వాసములు మాత్రమే కలవు,

[2] బొబ్బిలి పాలకవంశ వివరణమునెడల ముద్రితప్రతికిని, లిఖితప్రతులకును (ప్రాచ్య లిఖితగ్రంథాలయము R. No. 428 తాళపత్రప్రతి, R. No. 469 కాకితపు ప్రతి) అవతారికాఽశ్వాసాంతగద్యముల పాఠభేదములుకలవు. బొబ్బిలి రాజాగారు (1881—1926) సవరణలతో ముద్రింపించుటయే దీనికి మూలకారణము.

వేంకటనాథవేదాంత దేశికాచార్యుల 'సంకల్పసూర్యోదయ' మను గీర్వాణ రూపకమునకిది పద్యరూపమగు తెలుఁగుసేఁత. వేదాంతదేశికుల సంకల్ప సూర్యోదయము విశిష్టాద్వైతమతసిద్ధాంతసార సముద్బోధకము. ఇది పది యంకముల ప్రకరణమను రూపకము. ఇందు పంచవిధమయిన శారీరక శాస్త్రార్థము విశదీకరింపఁబడినది. దీనిని యథామూలముగా గద్యపద్య సమ్మిశ్రితముగా పదియాశ్వాసముల కృతిగా రాయఁడప్ప రంగారావుగా రాంధ్రీ కరించి బొబ్బిలివారి కులదైవమగు శ్రీ వేణుగోపాలస్వామివారికి కృతి సమర్పణము గావించి ధన్యులయిరి. తాను నిఖిలశాస్త్ర వాసనాసముదిత విజ్ఞానము కలవాఁడనని కృతికర్త వివరించినాఁడు. గరిమెళ్ళ సుబ్బయ్యయను కవి యీ కృతినిర్మాణమునందు రాజావారికి తోడుగానుండెనఁట.

శ్రీవైష్ణవసంప్రదాయము మేరకు కావ్యావతారిక యందు ముకుంద స్తుతియు, తత్పరికరపరివారసంస్తుతియు, పన్నిద్దఱాళ్వారులు, దేశికులగు కందాళ వేంకటాచార్యులు, రాజపురోహితులగు కొటికెలపూఁడి వేంకటకృష్ణాఽ హితాగ్ని మున్నగువారినిగూర్చి చేసిన స్తోత్రములును కలవు.

'సకలచమత్క్రియల్ దెలిసి శబ్దదరిద్రులుగాక కావ్య నా
టకరచనా బలాబల విడంబనముల్ గ్రహియించు సత్ప్రబం
ధ కవులతో వివాదపడినన్ బడవచ్చునుగాక సిగ్గుజెం
దక విహరించు దుష్కవివితానము చెంతకుఁ బోవవచ్చునే'

అని కుకవినింద చేయఁబడినది. శైలి దెలియుటకు మచ్చునకు రెండు పద్యములు :

'ఈ మునివాసమందుఁ బగలించుక యైనను లేవు తాపముల్
యామినులందు శీతభయ మారసిచూచిన లేదు, సింహముల్
సామజముల్ సఖిత్వమున సన్నుతి కెక్కె, శుకంబు లెల్ల వి
ద్యా మహిమన్ బఠించు నిగమాంతము భూరుహశాఖ లెక్కుచున్'.

—స్థానవిశేషసంగ్రహంబను షష్ఠాశ్వాసము, పు. 162.

'నిజమాయాతటినీనిమగ్నుఁడగు వానిన్ గ్రమ్మఱన్ వేడ్కతో
సుజనుల్ మెచ్చఁగ నుద్ధరించు కృప నక్షత్రంబుగా వశ్యుఁడై
త్రిజగత్సన్నుతి నొప్పు విష్ణుఁడు ప్రపత్తిజ్యోత్స్న చేత న్విప
ద్విజతాపంబు లణంచి తానొసఁగు నిర్వాణైకకల్యాణముల్'

—నిశ్శ్రేయసలాభంబను దశమాశ్వాసము, పు. 239.

రాజా శ్రీ రాయఁడప్పరంగారావుగారు సుప్రసిద్ధులగు విద్వాంసులను దేశదేశములనుండి రప్పించి వారికిఁ గుటుంబపారంపర్యముగ జీవనపర్యాప్త ములగు ననేకాగ్రహారము లొసఁగి వేదవేదాంగములను నానావిధకళలను బ్రోత్సహించి పెంపొందింపఁజేసిరి. 'ఋగ్యజుస్సామ వేదశాఖ లెలమి

భూదేవతా కుమారులకుఁ దెల్పు వేదవేత్తల కెల్లను వివిధధనములిచ్చి పోషించిన వారు రాయఁడప్ప రంగారావుగారు. దీనికి ప్రపదన పారిజాతము సాక్ష్యము.

'పురమున వేదశాస్త్రములఁ బూర్ణముగాఁగ నెఱింగినట్టి స
త్పురుషులనుంచి వారికిఁ బ్రభూతసుఖస్థితినిచ్చి వారిచే
నిరత మనేకవిద్యల ననేకులు నేరుచునట్లు లమ్మహీ
వరుఁడొనరించె విద్యలకు వాసముగాఁ బుర మొప్పునట్లుగన్'

—ప్రపదన పారిజాతము, అవతారిక, పు. 15.

## కొటికెలపూఁడి వేంకటకృష్ణసోమయాజి

రాయఁడప్పరంగారావుగారి యాస్థానకవి కొటికెలపూఁడి వేంకటకృష్ణ సోమయాజి. ఈయన వెలనాటి బ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. హరితస గోత్రుఁడు. తాత శివరామయ్య, తండ్రి వేంకటరామయ్య. కొటికెలపూఁడివారు తరతరములుగ బొబ్బిలి వారికి హితులు, పురోహితులు. ఈ విషయము కూర్మ క్షేత్రమాహాత్మ్యమునుబట్టి నిరూపింపనగును.

'హితులు మదన్వవాయజుల కెల్ల పురోహితు లార్యలోకపా
లిత కవితాప్రకల్పిత దిలీపచరిత్రముఖోజ్జ్వలత్ప్రబం
ధతతులు హౌరికాగ్రణు లుదారగుణాన్వితచిత్తు లస్మదా
శ్రితులు సమస్తసూరినుతశేముషులెన్నఁ దరంబె మిమ్ములన్'

అని కృతిపతి కృతికర్తను గూర్చి పలికినట్లు వ్రాయఁబడినది. వేంకటకృష్ణకవి తారకబ్రహ్మము, దిలీపచరిత్రము, ప్రబోధచంద్రోదయము, మేఘసందేశము, విజ్ఞానేశ్వరము, శ్వేతాచలమాహాత్మ్యమను పేరుగల కూర్మక్షేత్రమాహాత్మ్యము మున్నగు కావ్యములను రచించినవాఁడు. ఆశ్వాసత్రయ పరిమితమగు ప్రబోధ చంద్రోదయము కృష్ణమిశ్రుని గీర్వాణకృతి కాంధ్రీకృతి. మూఁడాశ్వాసములు గల కూర్మక్షేత్రమాహాత్మ్యము రాయఁడప్పరంగారావుగారికి కృతి; పద్మ పురాణస్థ భాగమునకిది యాంధ్రీకరణము. నాలుగాశ్వాసముల దిలీప చరిత్రము శ్రీరామాంకితము. తారకబ్రహ్మము రామ మహిమానువర్ణనము. మేఘ సందేశము కాళిదాసునకు తెలుఁగుసేఁత.

కూర్మక్షేత్రమాహాత్మ్యమునందలి యొకమాదిరి పద్యము :

'ఆ మాటల్ విని భూవిభుండు నిజభార్యన్ సద్వ్రతాసక్తికిన్
శ్రీమన్మాధవభక్తికిన్ బొగడి ధాత్రిన్ మూఢచిత్తుండనై
భామారత్నము పాటి బుద్ధి గణుతింపం బూనఁగాలేక యా
సోమార్కాం బవకీర్తిపాలయితి నంచున్ లోనఁ జింతిల్లుచున్'

వేంకటకృష్ణసోమయాజి కృత్యంతరమగు విజ్ఞానేశ్వరీయము (వ్యవహార కాండము) ఇనుగంటి సీతారామరాయ ప్రేరణమున విరచితము. ఆచార

ప్రాయశ్చిత్త వ్యవహారములను మూఁడు కాండములుగల యాజ్ఞవల్క్యస్మృతి ప్రాచీనధర్మశాస్త్రము. దీనికి విజ్ఞానేశ్వరుఁడు మితాక్షర యను పేర సంతరించిన వ్యాఖ్యానమునకు పండితలోకమున విజ్ఞానేశ్వరీయమని వ్యవహారము. మూల మటికి కాక దీనిని పూర్తిగా విజ్ఞానేశ్వరీయమును నీతఁ డాంధ్రీకరించినాఁడు. బొబ్బిలి పాలకుల రాజా రాయఁడప్ప రంగారాయ నిమోగములయందు భాష్యకారుఁడును, ప్రధాన పండితుఁడును, వారికి సహాయుఁడును నగు సీతారామ ప్రభువులో '...ధర్మశాస్త్ర కథిత వ్యవహారకాండమును నాంధ్రీకరింపుఁ'డని కోరఁగా, ఆయురారోగ్యముల గ్రంథముగా నని దీనిని రచించినాఁడు.*

## కొటివెలపూఁడి కోదండరామకవి

కోదండరామకవి వెంకటసోమయాజి సింగనప్రోలు సోమయాజుల పుత్రుఁడు. అష్టోత్తరత్రింశ దాంధ్రగీర్వాణ గ్రంథకర్తయఁట. నానా వేదాంత తోషనిధి. జ్యోతిషాయుర్వేద విద్యాపారగుఁడు. రాద్ధాంతిక సంగీతజ్ఞుఁడు. ఉభయ కవిత్వరచనాసల్పాభరీసురీణుఁడు. శ్వేతాచలాధీశ ఘనాపది మాల్లఘ్న విశేష భూషితుఁడు. ప్రపదనపారిజాత ప్రబంధ నిర్మాణ నిష్ణాతుఁడు.

'అభ్యసించితివి శాస్త్రం బాది సూతోద్ధ సకల వేదాంతశాస్త్రము లమలము'

ప్రపదనపారిజాత అవతారిక. పు. 6.

అని కృతిపతి రాజా శ్వేతాచలపతి రంగారాయబహద్దరు (1810-1862) కృతికర్తతో పలికిన పలుకులను బట్టి వీరిద్దరును సమకాలికులని స్పష్టమగు చున్నది. నృసింహపురాణ తారకబ్రహ్మమహాత్మ్య శివ పురాణ నిఘంటులును, జానకీరామ జానకీవల్లభ వేదచూడామణి భారతీ మాధవ మారుతి రాజసుతంస రామప్రభు వేణుగోపాల శ్రీసత్యాద్యనేక శతకములును సిద్ధాంత లింగాది గణిత శాస్త్ర గ్రంథములును కోదండరామకవి కృత్యంతరములు. ఇనుగంటి సీతారామచంద్ర ప్రభువర్యుఁడు కృతికర్తయగు శ్వేతాచలపతి రంగారావుగారికి మేనత్తమగఁడు. ఆయన పూర్వాచార్య ప్రోక్తమగు ప్రపదనము నుద్ధరించి కృతికర్తకు సారళ్యముగా సద్దాని నుపదేశించియుండెనఁట ! ఆ ప్రపత్తి రీతి నాంధ్రకృతిగాఁ జేయింపుమని భగవద్రామానుజులు స్వప్నమున సాక్షాత్కరించి కృతికర్తను బ్రబోధింపఁగా నాయన కోదండరామ కవిని పిలిపించి యీ కృతిని నిర్మింపఁజేసెనఁట. విశిష్టాద్వైత సిద్ధాంతమునకుఁ బ్రధానములగు ద్వయ మంత్ర తిరుమంత్రార్థములను భక్తిప్రపత్తుల స్వరూపమును మఱియు నత్యంతా వశ్యకములగు నాధ్యాత్మికాంశములను గొన్నింటిని ముముక్షుజనోపయోగముగా నిరూపించు అయిదాశ్వాసముల దివ్యప్రబంధము ప్రపదన పారిజాతము. కృతి భర్త 'వేదశాస్త్రపురాణ విద్యలందధికులై బ్రహ్మవాదము సేయు బ్రాహ్మణులును,

*R. No. 593 ప్రాచ్యలిఖిత గ్రంథాలయ ప్రతి.

మండితాన్వీక్షికీ దండనీతిత్రయీవార్తాఖ్యలగు సచివవ్రజంబు....' (ప్రపదన. పు. 4) నిరంతరము బలసికొలువ గోష్ఠినుండెడు వాఁడఁట. కృతిభర్త పౌత్రులగు మహారాజా శ్రీ రావు సర్ వేంకటశ్వేతాచలపతిరంగారావు బహద్దరువారి సమాదరణమున నీ ప్రపదనపారిజాత కృతి ప్రకాశితము. మచ్చునకు ఒండు రెండు పద్యములు :

'పచ్చనివాఁడు, విష్ణుపదభక్తి పెలింగెడువాఁడు, వాణిపై
ముచ్చటగల్గువాఁడు, నలుమోములవాఁడు, త్రయీపురాణముల్
మెచ్చినవాఁడు, లోకముల లీల సృజించినవాఁడు, పాపముల్
వ్రచ్చినవాఁడు, తద్భువనపల్లభుఁడైన విధాత ప్రీతితోన్'

—ప్రథమ. పు. 24.

'హరికిన్ జీవులు శేషభూతులు, సమస్తాత్మాళికిన్ శేషి శ్రీ
హరియే కాని యొరుండుకాఁడని యుకారార్థంబు లక్ష్మీపతీ
తర శేషిత్వగత భ్రమాత్మకమతిన్ దామిశ్రమున్ జాలభా
స్కరు మాడ్కిన్ నిమిషంబు లోపలఁ దొలంగంజేయు దాసాళికిన్'

—ద్వితీయ. పు. 57.

'సూత్రపతీశు పంపున విశుద్ధచరిత్రులు హేమరత్న స
ద్వేత్రధరుల్ మహోజ్జ్వలులు విష్ణుభటుల్ చనుదెంచి యాతనిన్
స్తోత్రములాచరించుచును దూర్యరవంబులతో ధ్వజాళితో
పాత్రల యాటతోడ హరి పాలికి పేఁగొని పోయి యచ్చటన్'

—పంచమ. పు. 132.

ఇఁక కవి కృత్యంతరముల నవలోకింతము. అతా శ్వాసములుగల నృసింహపురాణము గీర్వాణకృతి కాంధ్రీకరణము. 'శ్రీరమ్యంబగు బొబ్బిలీ పురమునన్ శ్వేతాచలాధీశ రంగారాయాగ్రణి గొల్వఁ బార్శ్వములవేడ్కన్ రుక్మిణీ సత్యభామారత్నంబులు నిల్వ భక్తజనులన్ బాలించు గోపాలకా ఖీరగ్రామణి'కిది యంకితము. బ్రహ్మాండపురాణ మంత్రఖండస్థిత తారకబ్రహ్మ మాహాత్మ్యమునకుఁ దెలుఁగుసేఁత పంచాశ్వాస పరిమితమగు తారకబ్రహ్మ మాహాత్మ్యము. విష్ణువు దశరథనందనుఁడయి జన్మించి శంబరుఁడను రాక్షసుని సంహరించిన కథ యిందలి ప్రధానేతివృత్తము.

'జానకీరామ దేవతాసార్వభౌమ' యను మకుటముతోడి 303 సీసపద్యముల జానకీరామ శతకమును, 'శ్రీ జానకీవల్లభా' యను మకుటముగల శార్దూల మత్తేభ వృత్త సంభరితమగు జానకీవల్లభ శతకమును, 'రామా దేవచూడామణీ' యను మకుటముగల దేవచూడామణి శతకమును, భారతీ యను మకుటముతో నొప్పి భారతీస్తవరూపమగు భారతీ శతకమును, మాధవా మకుటభూషితమును విష్ణుస్తుతిపరమును నగు మాధవశతకమును, మారుతీ యను మకుటముగల

మారుతిశతకమును, రామ రాజపతంసాయను మకుటముగలిగి శ్రీరామస్తుత్యాత్మక మగు రాజవతంస శతకమును, 'శ్రీ వేణుగోపాలకా' యను మకుటముతో వేణుగోపాలాంకితమగు వేణుగోపాల శతకమును, లక్ష్మీస్తుతిరూపమగు శ్రీసతి శతకమును కోదండరామకవి రచించిన శతకసంచయమున ప్రశస్తరచనములు.

ఆర్యభటీయ గణితమందలి పట్టీకార గణితరీతిని దెలుపు ఆర్యాస్పృత్త ద్వితయమునకు వ్యావహారికాంధ్రమున సంధానించిన వ్యాఖ్యానము సుధా తరంగము. రచనాకాలము శా. శ. 1766 (క్రీ. శ. 1844).

శతకములనుండి మాదిరికి కొన్ని పద్యములు :

'శ్రీ రంజిల్లు మొగంబుతోఁ గటకకాంచీహారకోటీర మం
జీరోదార విభూషణవ్రజముతో శీతాంశు తుల్యాభతోఁ
గారుణ్యామృతపూర పూరిత కటాక్షశ్రీలతో భూరిశృం
గారాకారముతోడ వచ్చినను వేడ్కన్ బ్రోవుమీ భారతీ'

—భారతీ శతకము.

'కంజాప్తాన్వయ దుగ్ధవారినిధి రాకాచంద్రు సద్వాక్యముల్
కంజాక్షీమణియైన సీతకును దత్కాంతామతల్లీ వచః
పుంజంబుల్ రఘుభర్తకున్ దెలుపుచున్ బుత్రాకృతిన్ వారిచెం
తం జెల్వారఁ జరించి మించిన నినున్ ధ్యానించెదన్ మారుతీ'

—మారుతి శతకము.

'శ్రీ సీతాకరపద్మసేవితములై సిందూరశోణంబులై
ప్రాసాదధ్వజ శంఖచక్ర భిదురాబ్జచ్ఛత్ర చాపాదిరు
గ్వాసక్తాకములై మునీశ్వర మనోగమ్యంబులై భక్తసం
త్రాసంబుల్ తొలఁగించు త్వచ్చరణముల్ ధ్యానింతు రామప్రభూ'

—రామప్రభు శతకము.

'సిరులం దూఁగెడు బొబ్బిలీపురమునన్ శ్వేతాచలాధీశభూ
వరుఁ డర్పింపఁగ హేమరత్నమయ భాస్వద్దివ్యగేహంబునన్
సరిగాఁ బార్శ్వములన్ విదర్భతనయా సాత్రాజితుల్ గొల్వ సు
స్థిరతన్ నిల్చిననీకు మ్రొక్కెదనుమీ శ్రీ వేణుగోపాలకా'

—వేణుగోపాల శతకము.

## జనార్దన రంగారాయబహద్దరు

ప్రపదనపారిజాత కృతిపతియగు శ్వేతాచలపతి రంగారాయబహద్దరుగారి సోదరులగు రాజా జనార్దనరంగారావుగారు మృదుమధురోభయకవితావైచిత్రి గల విద్వత్కవులు. పోషితసత్కవినికాయ బిరుదలాంఛనులు. హరిభక్తి సుధోదయమను తాత్త్విక ప్రబంధమును, మిత్రవిందాపరిణయమను శృంగార

ప్రబంధము జనార్దనరంగారావుగారి ప్రతిభాపాండిత్యములకు నికషోపలముల వంటివి. హరిభక్తిసుధోదయము శ్రీమన్నారదీయమునందలి హరిభక్తి సుధోదయమున కాంధ్రానువాదము. మూలగ్రంథము ఇరువది యధ్యాయములలోఁ గలదు. నాలుగాశ్వాసములు గల మిత్రవిందా పరిణయము శ్రీకృష్ణలీలావిలాస ప్రదర్శకమగు శృంగారప్రబంధము. శ్రీకృష్ణుఁడు మిత్రవిందను బరిణయ మాడుట యిందలి యితివృత్తము. ప్రాచీనధోరణిలో ప్రబంధఫక్కిలో సంత రింపఁ బడిన ఈ కృతి శ్రీరామచంద్రమూర్తి కంకితము. 'ఆంధ్రభాషా విలాసిని' యను మాసపత్రికయందు తొలుత వెలువడుచుండి ఆ పిమ్మట చిత్రాడ శ్రీరామవిలాసగ్రంథమాలా కుసుమముగాఁ బ్రచురిత మయినది.[1]

'భవ్యగుణజాల వేణుగోపాలబాల' యను మకుటముతో 'సిరుల వెలుంగు బొబ్బిలిపుర వరమునఁ బరగు శ్వేతాచలపతి నరవర మందిరోత్తర భాగమందుఁ జెన్నొందు....మంగళ తరాలయమున రుక్మిణి సత్యభామాది మదవతులు గొలువ....' వెలసిన వేణుగోపాలుని పేర వెలసిన నూఱు సీసపద్యముల వేణుగోపాల శతకము జనార్దన రంగారాయల కృత్యంతరము.[2]

## మండపాక కవులు

బొబ్బిలి సంస్థానము నాశ్రయించిన కుటుంబములలో మండపాకవారి వంశము సుప్రసిద్ధము. మండపాక పేరయకవి, మండపాక కామకవి, మండ పాక పార్వతీశ్వరశాస్త్రి, మండపాక ఇమ్మడి కామకవి మొదలగు వారు బొబ్బిలి సంస్థాన కవులలో ముఖ్యులు. మండపాకవారు వేగినాటి వైదికులు, పారాశర గోత్రజులు. వీరి పూర్వులు విజయనగరము పెద విజయరామగజపతి (1710—1757) వలనను సమ్మానితులఁట! వీరిలోనొకఁడు మండపాక లచ్చన్న; లచ్చన్న కుమారుఁడు పేరయ్య. పేరయ్య కుమారుఁడు కామకవి. బొబ్బిలి సమీపమునఁగల కామనవలస యగ్రహారము వీరి నివాసము. ఈ యగ్రహారము పూర్వ ప్రభువులు ప్రసాదించినదఁట! పేరయకవి నిరోష్ఠ్య దాశరథీ శతకము, కుముద్వతీ పరిణయము, ఇందుమతీ పరిణయము మున్నగు గ్రంథములను రచించి యుండిరఁట! బొబ్బిలిలో మండపాకవారి యిల్లు పరశురామప్రీతియైన తఱి నీ కృతులన్నియు బూడిదయైనట్లు చెప్పుచున్నారు. అయినను ఆ యా గ్రంథముల లోనివని స్మృతిలోనున్న కొన్ని పద్యములను మాత్రము మండపాక వంశీయులు సేకరించియున్నట్లు తెలియుచున్నది. 'శ్రీమీఱ నుభయభాషామిశ్ర సంస్కృతుల్ తద్జ్ఞు లెన్న మదంకితములు సేసి యశము గాంచిన పేరయ మనీషిమణి....' (రాధాకృష్ణసంవాదము, 1—29) అని పేరయకవి పౌత్రుఁడగు

[1] కాకితపు ప్రతి, R. No. 461 (a) ప్రాచ్యలిఖిత గ్రంథాలయము.

[2] తాళపత్ర ప్రతి, R. No. 433 ప్రాచ్యలిఖిత గ్రంథాలయము.

పార్వతీశ్వరకవిని శ్రీకృష్ణుఁడు సంబోధించినట్లున్న పద్యమునుబట్టి పేరయ్య కవి సత్కృతులు కొన్ని రచించినట్లు భావింపవచ్చు.

## మండపాక కామకవి

మండపాక కామకవి (1810—1872) పితృపాదుల సన్నిధిని కావ్య పంచకము పూర్తిచేసి అలంకార శాస్త్రము నభ్యసించి సాహిత్యవిద్యలో నాఱితేరినవాఁడయి పెక్కు గ్రంథములను రచియించెనఁట! వానిలో కార్తీకవ్రతమాహాత్మ్యము, బలరామక్షేత్రమాహాత్మ్యము, బ్రహ్మోత్తరఖండము, జానకీరామ రామచంద్రప్రభు శ్రీసూర్యనారాయణ శతకములును, కొన్ని అష్టకములు, దండకములును బేర్కొనఁదగినవి. ఈయన కృతులలో బలరామ క్షేత్రమాహాత్మ్యము ప్రధానమైనది. కృష్ణాగ్రజుఁడగు బలరామునిచే వరాహ వర్తినీవిషయమున ప్రతిష్ఠితములయిన అయిదు శైవక్షేత్రములకథ స్థల పురాణముగా అయిదాశ్వాసములలో సంధానింపఁబడిన కావ్యమిది. కామకవి శిష్యుఁడును, సహస్ర కంధరరామాయణకర్తయును నగు ముద్దు లక్ష్మీనారాయణ కవి తనగురువు సాహితీవిభవదీపితుఁడనియు, సత్కవితాధురంధరుఁడనియు పరికీర్తనము సేసినాఁడు.

## మండపాక పార్వతీశ్వరశాస్త్రి

మండపాక కామకవిగారికి రామస్వామిశాస్త్రి, పార్వతీశ్వరశాస్త్రి, పేరయ శాస్త్రి అని మువ్వురుకుమారులు. అవధూతానుభూతి, గీతాశాస్త్రము, వేదాంతకృతి కదంబము మున్నగునవి రామస్వామిశాస్త్రి (1831—1888) రచనలు. చిట్టచివరి వాఁడగు పేరయశాస్త్రి మంత్రశాస్త్రవేత్తయఁట! ద్వితీయుఁడగు పార్వతీశ్వర శాస్త్రి (1833—1897) బొబ్బిలిసంస్థానాస్థానకవి. శ్వేతాచలపతిరంగారావుగారి కాశ్రితుఁడు. ఈయన శతాధిక గ్రంథకర్త. బ్రహ్మేశ వేంకటశైలనాయక చంద్రఖండకలాప సూర్యనారాయణ మొదలయిన పదునైదు ఏకప్రాస శతకములు; కాశికావిశ్వనాథ జగన్నాయక వరాహనృసింహ హరిహరేశ్వర— మున్నగు పాతిక చిత్రకవిత్వ శతకములు; ఉమాసంహిత, అమరుకము, కాంచీ పురమాహాత్మ్యము మున్నగు నాంధ్రీకృతులును, జగదీశ వేణుగోపాల—మొద లయిన నక్షత్రమాలికలు; జగదీశతారావళి మొదలయిన తారావళులు; వర్ణన మాలికలు, స్తుతికదంబములు, కీర్తనలు, కృతులు, పదములు, జావళులు, చిత్ర కథలు, యాత్రాచరిత్రలు, ఉపన్యాసములు, సహస్రాధికములగు చాటువులును; కవితావినోదకోశ కాశీశ్వరాష్టకాది గీర్వాణకృతులును వీరి గంటమునుండి వెలు వడినవి. వీరిరచన లన్నింటికంటె శ్రీకృష్ణాభ్యుదయ రాధాకృష్ణసంవాద ప్రబంధ ములు మేల్తరములయిన రచనలు. రాధాకృష్ణసంవాదము వేంకటగిరిప్రభువు రాజ

గోపాలకృష్ణయాచేంద్రుల (1878–1916) పట్టాభిషేకోత్సవచరితము. రాధాకృష్ణుల సంవాదరూపమున చమత్కారాపాదకముగా సకలకవితావినోదకోశమాలికగా సంధానింపఁబడినవి. కవికర్ణరసాయనమగు కావ్యము. శ్రీకృష్ణాభ్యుదయ మేకాశ్వాసప్రబంధము. శ్రీకృష్ణకథలోని ముఖ్యఘట్టము లిందు సంక్షేపరూపమున నిరూపితము. పార్వతీశ్వరశాస్త్రిగారు వ్రాసిన ప్రబంధసంబంధబంధనిబంధనగ్రంథము చిత్రబంధకవిత్వలక్షణములు లక్ష్యములతో ఛత్రబంధాంతర్గతశతబంధనామావళీసహితముగా నిర్ధారితమయిన చిత్రకృతి. సహస్రకంధరరామాయణకర్త 'మధురసుకవితాధురీణు వరకళాస్పదు మండపాకకులజవిదితయశుని పార్వతీశు వినుతియొనర్తున్' అని గురుపుత్రుని కవితాపటిమను ఉపశ్లోకించినాఁడు.

## మండలేముల వేంకటరామకవి

కౌండిన్యసగోత్రుఁడును, వేంకమాంబాబంగారార్యుల పుత్రుఁడును నగు నీ కవి (1810–1870) క్రియాయోగసారమను ఎనిమిదియాశ్వాసముల పద్యకావ్యమునకుఁ గర్త. రామచంద్రశతకనిర్మాతయగు కొట్ర వేంకటరామకవి యాతని మాతామహుఁడు. సుసర్ల సుబ్రహ్మణ్యదీక్షితుఁడు గురువరేణ్యుఁడు. 'సేతుశీత నగాస్తోదయశైల మధ్య సకలాంతర్వాణి కంఠీరవుఁడ'నని కవి తన యౌద్ధత్యమును జాటినాఁడు.

ఇనుగంటి చెల్లమాంబా సీతారామచంద్రుల జ్యేష్ఠసుతుఁడగు రామరాయలు (1810–1870) క్రియాయోగసారకృతిప్రేరకుఁడు. పుణ్యజాహ్నవీజనకమగు మాధవపదపద్మమున నెగడిన వెలమకులమున ఘనగుణు లినుగంటివారు. వీరు పెంపాలగోత్రజులు. వీరికుదురున కేశవరాయఁడాద్యుఁడు. సీతారామచంద్రవిభుఁడు ఇనుగంటివారికోవలో ప్రఖ్యాతుఁడు; బొబ్బిలిరాజా రాయఁడప్పరంగారాయల (1790–1830) వియ్యంకుఁడీతఁడు; రాజా శ్వేతాచలపతిరంగరాయల (1830–1862) మేనత్తమగఁడు; పూర్వాచార్యప్రోక్తమయిన ప్రపదనరీతి నుద్ధరించి శ్వేతాచలపతిరంగారాయల కుపదేశించిన విశిష్టాద్వైతసిద్ధాంతవిజ్ఞాని; బొబ్బిలిసంస్థానము సర్వసేనాని; ముఖ్యప్రధాని. సీతారామప్రభుకుమారుఁడు రామరాయలు రాజా రాయఁడప్పరంగారాయల యల్లుఁడు. ఉంగరాడ, కింతలి, మంతెన ఎస్టేటుదారుఁడు. రాజా రాయఁడప్పరంగారాయలకు ఇనుగంటివారి యాఁడుఁబడుచగు బుచ్చమాంబికవలనఁ గలిగిన సీతయ్యమ్మ రామరాయలభార్య.

'సకలకళావిశారదులు సత్కవు లెంతయు సంతసింపఁగా
నొకయెడ శబ్దపాటవము నొక్కయెడన్ రసగుంఫనంబు వే
తొకయెడ నర్థగౌరవము నుద్యదలంకృతులుండునట్లు....'

సంఘటించిన కృతియిది.

పద్మపురాణోత్తరఖండాంతర్గతమగు క్రియాయోగసారము దీనికి మూలము[1].

## మండలేముల సీతారామశాస్త్రి

శ్రీ శాస్త్రిగారు రాజాగారి యాజ్ఞమేరకు బొబ్బిలివారి వంశావళిని 616 పద్యములలో నేకాశ్వాసగ్రంథముగా సమకూర్చిరి. నాఁటి బొబ్బిలి మహారాజా వారు రచించిన 'History of Zamindari of Bobbili' యను నాంగ్ల గ్రంథమున కిది పద్యరూపాంధ్రీకరణము. ఇందులో మొదటి 104 పద్యములు బొబ్బిలిపూర్వచరిత్రకును, తక్కిన 512 ను నాఁటి రాజాగారి పరిపాలనమునకును సంబంధించినవి. ప్రసన్న పారిజాత సంకల్ప సూర్యోదయాది కావ్యములలోని అవతారికాభాగములందలి బొబ్బిలిరాజన్యుల వంశావళీవిషయమును వివరించి విరచించినవాఁడీ కవి[2]. కవి కౌండిన్య గోత్రజుఁడు. వేంకటగోవింద సుతుఁడు. మసర్ల సీతారామాంతర్వాణుల శిష్యుఁడు. వేంకటరాయకవి విస్పష్టకోపటిష్టాంధ్ర కవిత్వమర్యాదుఁడు. పితృపితామహ సుసంప్రదాయాగత ప్రబంధపటిమయుఁడు.

మహారాజా సర్ వేంకటశ్వేతాచలపతిరంగారావు (1862-1926) గారి యాస్థానమునందింకను కొటికెలపూఁడి వేంకటకృష్ణసోమయాజి, కొండూరి వేంకటాచార్యులయ్యవారలు, పీసపాటి వెంకటేశ్వరులు, మసర్ల సీతారామశాస్త్రి, మసర్ల చినసుబ్రహ్మణ్యశాస్త్రి, చిలకమర్తి వేంకటాచార్యులు మొదలగు విద్వన్మణు లనేకు లుండిరి.

## కొటికెలపూఁడి వేంకటకృష్ణసోమయాజి

కొటికెలపూఁడి వేంకటకృష్ణసోమయాజులు సుప్రసిద్ధ పండితవంశము నకు చెందినవారు. బొబ్బిలిపాలకుల కాశ్రితులు; వేంకటకృష్ణమూర్తి పౌత్రులు; రామదాసపుత్రులు; రాజావారి ప్రోత్సాహముమీఁద బొబ్బిలిపట్టణమునం దేర్పడిన బుధానందినీసభాకార్యదర్శి. బొబ్బిలిరాజావారి కీసభ రక్షస్థలి. ఈ సోమయాజులు గారు ప్రసిద్ధ జ్యోతిశ్శాస్త్రవేత్తలు. 22 విలసనములును, 1,500 శ్లోకములును గల 'హోరికచంద్రికా' యను వీరి జ్యోతిషగ్రంథము సంస్కృతమున రచింపఁ

[1] R. No. 561 ప్రాచ్యలిఖిత గ్రంథాలయము కాకితపు ప్రతి. సౌమ్యసంవత్సరము వైశాఖ బహుళ విదియ జయవారమునకరికి లేఖకుఁడు మద్దా శంకరప్ప రామారావుగారికి దాఖలుచేసిన తాళపత్రప్రతి కిది పుత్రిక. బొబ్బిలి మండలేముల సీతారామశాస్త్రిగారి ప్రతి నుండి ఎత్తి వ్రాసినది.

[2] 'వంశపురుషక్రమమ్ము తత్ప్రభునిదేశమునఁ దదాస్థానపండితుఁడు తనరు మండ లేములకుల సీతారామభూమిసురుఁడు మాలుపునొసర్చి వ్రాసె సీ తీరుగాఁగ'

—ప్రసన్న పారిజాతము, పు. 7.

బడినది. వీరు శాస్త్రవేత్తలేకాక సంఘసంస్కరణవిషయములందును పరిశ్రమము సలుపుచుండెడివారు. శ్రుతిస్మృతుల నవలోడనముచేసి విధవావివాహము దూష్య మని నిరూపించుచు వీరు వ్రాసిన 'విధవావివాహ నిరాసకోపన్యాసము' బుధా నందినీసభాపక్షమున బొబ్బిలిపట్టణమునందలి రంగారాయముద్రాక్షరశాలలోఁ బ్రచురితము.

## మహారాజా సర్ వేంకటశ్వేతాచలపతి రంగారాయబహద్దరు

బొబ్బిలిమహారాజావారు పండితపోషకులగుటయేగాక, స్వయముగా నాంధ్రాంగ్లములయందనేకగ్రంథములను రచియించినవారు. 'Advice to the Indian Artistocracy', 'History of Bobbili Zamindari' మున్నగు ఆంగ్లకృతులును, హిందూమతము, శ్రీ మహాభారత శ్రీ మద్రామాయణ విమర్శము మున్నగు నాంధ్రకృతులును వీరి ముఖ్యరచనలు. వీరు రచించిన హిందూమత*మను గ్రంథమునందు మతత్రయము, జన్మాంతర స్మృతి, భగవదారాధనము, జ్యోతిశ్శాస్త్రవిషయము, అవివేకపు నమ్మకములు, అవతారములు, వ్రతములు మున్నగు 166 విషయములు విమర్శకదృష్టితో వ్రాయఁబడినవి. ఆరాధనలు, వ్రతములు, ఆచారములు, వ్యావహారిక హిందూ మతము, పారమార్థిక హిందూమతము అని అయిదు ముఖ్యవిభాగములుగా నీ గ్రంథము విభజింపఁబడినది. అప్పటి విజయనగరము మహారాజావారి కళాశాలాధ్యక్షులగు కిళాంబి రామానుజాచార్యులుగారు దీని కవతారికను సంతరించిరి. ఈ గ్రంథము రాజాగారికోరికమేరకు ఎమ్. కృష్ణమాచార్యులుగారు 'Hindu Religion' అనుపేర ఆంగ్లమున అనువదించిరి.

ఆర్షసంస్కృతికి అపూర్వదర్పణములయిన భారతరామాయణములమీఁద బొబ్బిలిమహారాజావారు 'శ్రీ మహాభారత శ్రీ మద్రామాయణ విమర్శము' అను పేర పాశ్చాత్య సంస్కారవాసనతో నొక విమర్శకగ్రంథమును వెలువరించి యుండిరి. ఈ రచనను ప్రశంసించుచు గుమ్మలూరి సంగమేశ్వరశాస్త్రి, ముడుంబై నరసింహస్వామి, నిష్ఠల సుబ్రహ్మణ్యశాస్త్రి, మండపాక లక్ష్మీ నారాయణశాస్త్రి, నడాదూర్ అనంతాళ్వార్ మొదలగు విజయనగర పండితు లును, బొబ్బిలిపట్టణమునందలి బుధానందినీ సభాపండితులును అభిప్రాయము లిచ్చిరి.

బొబ్బిలిమహారాజావారు 1898లో ఉదకమండలములో జరిగిన లెజిస్లేటివ్ కౌన్సిల్ సమావేశములో 'మద్రాసు పెనెన్సీబిల్లు (1898)' మీఁద రఘువంశము, మనుస్మృతి మున్నగు ప్రాచీనగ్రంథములనుండి ఉదాహరణములు చూపించుచు చేసిన ఉపన్యాసము వారి పాండిత్యమునకు, చారిత్రకజ్ఞానమునకు తార్కాణము.

* వైజయంతీ ముద్రాశాల, చెన్నపురి, 1910.

వీరాంధ్రవిశ్వకళాపరిషత్తునకు ప్రథమాధ్యక్షకల్పులు (First Pro-Chancellor, 1926)[1]. బొబ్బిలిమహారాజావారు 1926 లో లక్షరూపాయలను సంస్కృతాంధ్ర భాషలలో అధ్యయన పరిశోధనల నిమిత్తము ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు విరాళమిచ్చిరి. ఈ నిధిమీఁద వచ్చు రాఁబడిలో మూఁడింట రెండువంతులు తెలుఁగునకు, మిగిలిన యొకవంతు సంస్కృతమునకు వెచ్చపెట్టునట్లుగా సెనేటువారు తీర్మానించిరి. తెలుఁగుపాలికి వచ్చిన వంతును ఆంధ్రభాషాసాహిత్య చరిత్రముల సంకలనమునకు, ప్రచురణమునకు వినియోగింప నిశ్చయించిరి. సంస్కృతములో ఉత్తమ పరిశోధకుల నాహ్వానించి పండితవృత్తి నిచ్చుటకు నిర్ణయించిరి. 1932–33 తరువాత అరుదైన పుస్తకములను ప్రచురించు నిమిత్తము ఈ నిధిమీఁది రాఁబడి ఉపయోగింపఁబడవలయునని నిర్ణయము జరిగినది[2].

వీరి తరువాతి పాలకులయిన జమీందారులు ముఖ్యముగా రాజా రావు సర్ వేంకట శ్వేతాచలపతిరామకృష్ణరంగారావుగారును విద్యాపోషణవిషయమున పూర్వ రాజన్యులకుఁ దీసిపోనివారు. తిరుపతివేంకటకవులు, పిశుపాటి చిదంబర శాస్త్రి మున్నగు శతావధానులు వీరి సమ్మానముల నందిరి. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారు తాము రచించిన బొబ్బిలిపట్టాభిషేకగ్రంథమును బొబ్బిలిరాజాగారి కంకిత మిచ్చిరి. ఇది నాలుగాశ్వాసముల కావ్యము. ఈ కావ్యమును కృతినిచ్చుచు వేంకటశాస్త్రిగారు చెప్పిన పద్యములు వారి గడుసుదనమునకు నిదర్శనములు.

'పెద్దతనంబునం గనిన బిడ్డ, సుధామధురానులాప మే
విద్దెయు గాని నేర్పిన వివేకిని పుట్టిన మెట్టినిండ్లకున్
దద్దయుఁ గీర్తిఁ దేఁదగినధన్యఁ గవిత్వపుఁగన్య నిచ్చితిన్
దిద్దను దిద్దఁగాఁబడదు దీనిస్వభావ మెఱుంగఁజెప్పితిన్'

బొబ్బిలిపట్టాభిషేకవర్ణన మిందలి ఇతివృత్తము.

## బొబ్బిలిపాలకుల విద్యాపోషణము

రాజా సర్ శ్వేతాచలపతిరామకృష్ణరంగారావు బహద్దరుగారు జస్టిసుపార్టీ పక్షమున మద్రాసు ముఖ్యమంత్రిగా నుండిరి. 1931–36 మధ్య ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు ప్రో-ఛాన్సలర్‌గా వ్యవహరించిరి. 1937 లో ఆంధ్రవిశ్వవిద్యాలయమువారి డాక్టరేట్ గౌరవబిరుదమును పొందిరి. రాజమండ్రి ఆంధ్రేతిహాస పరిశోధకమండలి యావజ్జీవసభ్యులు.

చెన్నపురి సివిలుసర్వీసు ఉద్యోగియగు గెలెటిదొర ఆంగ్లమున కూర్చిన వ్యావహారికాంధ్రభాషానిఘంటువు ఆనాఁటి చెన్నపురిరాష్ట్ర ముఖ్యమంత్రియును,

[1] Andhra University Silver Jubilee Souvenir, 1926–1951.

[2] Andhra University Annual Register, 1937–38, p. 147.

ఆంధ్రవిశ్వవిద్యాలయము ప్రో-ఛాన్సలరును నగు బొబ్బిలిరాజా రామకృష్ణ రంగారావున కంకితము[1].

బొబ్బిలిమహారాజావారి గ్రంథాలయమునందలి అలంకార ఆగమ ఇతిహాస జ్యోతిష ధర్మ పురాణ మంత్ర శ్రౌత శాఖలకు సంబంధించిన తాళపత్ర గ్రంథములు సుమారు 200 ఆంధ్రవిశ్వకళాపరిషద్గ్రంథాలయమునకు బహూకరింపఁబడినవి. పజ్జల చినసీతారామస్వామిశాస్త్రిగారి వైయాకరణపారిజాతము చెన్నపురీరాష్ట్ర సింహాసనాధ్యక్షసచివాగ్రగణ్యుఁడయిన బొబ్బిలిమహారాజావారి కంకితము. విశాఖపట్టణమునందలి పరవస్తువారి ఆర్షవిద్యాపాఠశాలకు బొబ్బిలి పాలకులు ప్రధాన పోషకులుగా నుండిరి. బొబ్బిలిరాజావారిపేర ఇటీవల నొక కళాశాల బొబ్బిలిలో స్థాపితమయినది.

బొబ్బిలిపాలకులు సంగీతమునుగూడ నభిమానించి ఆదరించిరి. నంది గానము వెంకయ్యగారు బొబ్బిలిసంస్థాన సంగీతవిద్వాంసులు. తుమురాడ సంగమేశ్వరశాస్త్రిగారు వెంకయ్యగారి శిష్యుఁడు; ద్వారంవారు తుమురాడ వారి శిష్యులు. వీణావాదనతత్త్వజ్ఞులగు వాసా దాసన్న, వాసా సాంబయ్య, వాసా కామయ్య మొదలగువారు బొబ్బిలిసంస్థానము నలంకరించి పేర్గాంచిన వైణికసార్వభౌములు. వైణికకులమున వాసావారి సంప్రదాయము సుప్రసిద్ధము. వాసావారి వంశీయులు దరువులు, స్వరజతులు మొదలైనవానిని రచించిరని తెలియుచున్నది.

బొబ్బిలిజమీందారులు ఆయుర్వేద వైద్యవిధానము నభిమానించి పోషించిరి[2].

[1] Galletti's Telugu Dictionary, Oxford University Press, London, 1935.

[2] ఆంధ్రపత్రిక, సంవత్సరాది సంచిక, వృష, 1941, పు. 154.

## ఉపజీవ్య గ్రంథసూచి


1. విశాఖపట్టణముజిల్లా వృత్తాంతసంగ్రహము, పుటలు 525—529.
2. మంచలేముల సీతారామశాస్త్రి, బొబ్బిలివారి వంశావళి, 1914.
3. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, బొబ్బిలిపట్టాభిషేకము, వావిళ్ళ, చెన్నపురి, 1932.
4. అడిదము రామారావు, విస్మృతకళింగాంధ్రకవులు.
5. బుర్రా శేషగిరిరావు, బొబ్బిలిముట్టడి, వేదవ్యాస ప్రెస్, విజయనగరము, 1942.
6. తిరుపతివేంకటకవులు, నానారాజసందర్శనము, పుటలు 247—250, 289—293.
7. మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, ఆంధ్రరచయితలు.
8. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, ఆంధ్రాభ్యుదయము, పుటలు 147—150.
9. కవికొండల వేంకటసత్యనారాయణమూర్తి, విజయరామగజపతి.
10. కవికొండల వేంకటసత్యనారాయణమూర్తి, విశాఖమండల చరిత్రము.

11. తెలుగువిజ్ఞానసర్వస్వము, సంపుటము 3, పుటలు 1171-1175.

12. ఆంధ్రవిజ్ఞానము, సంపుటము 2.

13. రాయఁడప్పరంగారావు, సంకల్పసూర్యోదయము, శ్రీ రంగారాయ ముద్రాశాల, బొబ్బిలి, 1906.

14. జనార్దనరంగారావు, మిత్రవిందాపరిణయము, శ్రీరామవిలాస గ్రంథమాల, చిత్రాడ.

15. కొటికెలపూఁడి కోదండరామకవి, ప్రమదన పారిజాతము, శారదాంబావిలాస ముద్రాక్షరశాల, చెన్నపురి, 1906.

16. Robert Orme, A History of the Military Transactions of the British Nation in Indostan, Vol. II, pp. 253-260.

17. Report of the Estates Land Act Committee, Part II, pp. 15-20.

18. A. Vadivelu, The Aristocracy of Southern India, Vol. I, pp. 33-62.

19. V. L. Sastry, Encyclopaedia of the Madras Presidency and the Adjacent States, pp. 417-421.

20. Rangarao Bahadur, Maharajah of Bobbili, Account of the Bobbili Zamindari, Second Edition, Madras, 1907.

21. M.A.M.P. Vol. I, p. 60.

22. Bobbili Raja, Hindu Religion, Rendered into English by M. Krishnamachariar, Addison Press, Madras, 1918.

23. Andhra University Annual Register, 1937-1938.

24. The Madras Court of Wards Manual, Madras, 1907.

25. W. W. Hunter, Imperial Gazetteer of India, Vol. III, p. 21; Vol. VIII, pp. 252, 253.

26. Gustav Oppert, Lists of Sanskrit Manuscripts in Private Libraries of Southern India, Vol. I, Madras, 1880; Vol. II, Madras, 1885.

27. A. Vadivelu, The Ruling Chiefs, Nobles and Zamindars of India, Vol. I, Madras, 1915, pp. 508-511.

# బోరవెల్లి

## ప్రవేశిక

తెలంగాణా ప్రాంతమునందు ప్రసిద్ధమైన సంస్థానమిది. ఈ సంస్థానాధీశ్వరులు పాకనాటిరెడ్లు. వీరిది మిడిమిళ్ళ గోత్రము. 'ముష్టిపల్లి' అనునది వీరి గృహనామము. వోలుకంటి సోమేశ్వరుఁడు వీరి యిలువేలుపు. గృహ గోత్ర శాఖానామములు సమానముగా నుండుటను బట్టి వీరును గద్వాలసంస్థానాధిపతులును సన్నిహితజ్ఞాతులు కావచ్చును. ఒకప్పుడు స్వతంత్రముగానున్న బోరవెల్లిసంస్థాన మేకారణముననో గద్వాలసంస్థానములో కలిసిపోయినది. బోరవెల్లి సంస్థానాధీశులెవరో నిస్సంతుగా పరమపదింపఁగా సమీపదాయాదులగు గద్వాల సంస్థానాధీశ్వరుల కీ సంస్థానము సంక్రమించియుండవచ్చును.

## సంస్థాన చరిత్రము

చింతలపల్లి ఛాయాపతికవి రచియించిన రాఘవాభ్యుదయ ప్రబంధము* లోని అవతారిక యందలి కృతిశ్రోత వంశావతారవర్ణనము (119–147) మేరకు బోరవెల్లి సంస్థానాధిపతుల పూర్వ చరిత్ర మిట్లున్నది. వీరి మూల పురుషుఁడు నాడగౌడు తమ్మారెడ్డి. బోరవెల్లి రాజధానిగా ఐజసీమను పాలించిన వాఁడీతఁడు. ఈతని భార్య మాచమ్మ. వీరి కుమారుఁడు నల్లారెడ్డి. నల్లారెడ్డికి మల్లాంబ తిమ్మాంబయని యిరువురుభార్యలు. మల్లాంబవలన పెదసోమ, చినసోమ యను నిరువురుపుత్రులును, తిమ్మాంబవలన తమ్మారెడ్డి, పాపారెడ్డి యను నిద్దరు కుమారులును, మల్లాంబయను పుత్రికయును కల్గిరి. నల్లారెడ్డికి తిమ్మాంబవలన జన్మించిన పెదసోమభూపాలునకు లచ్చమాంబవలన వెంకట రెడ్డి యను కుమారుఁడు కల్గెను. పెదసోమభూపాలుని తమ్ముఁడగు చినసోమ భూపాలునకు సంతతియున్నట్లు కానరాదు. చినసోమభూపాలుని భార్యయును, గద్వాల పెదసోమభూపాలుని తనయయునునగు గిరియమ్మ యీ వెంకటరెడ్డిని పెంచి పెద్దచేసినది. ఈ వెంకటరెడ్డియే రాఘవాభ్యుదయ కృతిశ్రోత. దత్తజనయిత్రి యగు గిరియమ్మముఖమున గద్వాల పెదసోమభూపాలునికి (1663–1712) దౌహిత్రుఁడు గావున వెంకటరెడ్డిని పదునెనిమిదవ శతాబ్ది వాఁడుగా సంభావింపవచ్చును.

*ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ, హైదరాబాదు వారి ప్రచురణము, 1965; పరిష్కర్త : డా. బిరుదురాజు రామరాజు.

## సాహిత్యపోషణము

బోరవెల్లి సంస్థానాధీశ్వరుల యాశ్రయమున వెలసిన కృతులు రెండు కన్పట్టుచున్నవి. లయగ్రాహి గరుడాచలకవి రచియించిన రామాయణ కథాత్మక మగు కౌసలేయచరిత్రము అను ప్రబంధమును చింతలపల్లి భాస్కరకవి రచించిన రాఘవాభ్యుదయమను నాఱాశ్వాసముల ప్రబంధమును ముఖ్యములు. పెదసోమ భూపాలుని భార్యయగు గిరియమ్మయే కౌసలేయచరిత్ర రచనకు ప్రోత్సాహకు రాలు. బోరవెల్లి సంస్థానాధిపతుల కులదైవమగు శ్రీ కేశవస్వామి కంకితముగా కౌసలేయ చరితము విరచితము. కవిపోషకులగు నీ సంస్థానాధీశుల వంశాను చరిత మిందలి కృత్యవతరణికలో విపులముగా వర్ణింపఁబడినది.

### లయగ్రాహి గరుడాచలకవి

గ్రంథస్థనిదర్శనములనుబట్టియు, నితర చారిత్ర కాధారములనుబట్టియు గరుడాచలకవి రమారమి గద్వాల పెదసోమభూపాలునకు సమకాలికుఁడుగాఁ గన్పట్టుచున్నాఁడు.

'శ్రీ విలసిల్లు బోర్వెలిపురిన్ తెలిదీవిని నిల్చు వైఖరిన్
భావము రంజిలన్ నిలిచి భాసిలు కేశవదేవుఁడాత్మప
ష్ఠావితతాలయంబునను గూర్మిని నిల్పినరీతి నిల్పితన్
శ్రీవనితాశిరోమణిని శ్రీ గిరియమ్మ గృహాంతరంబునన్'

అన్నది గ్రంథారంభ పద్యము. తరువాతి పద్యములలో క్రమముగా లక్ష్మీదేవి. సంస్థానాధీశుల కులదైవమగు పోల్గంటి సోమేశ్వరుఁడు, పార్వతి, బ్రహ్మ, సరస్వతి, గణేశ్వరుఁడు స్తుతింపఁబడినారు. 'భారత రామాయణముల్ రచించిన మునీంద్ర శ్రేష్ఠులు' ఎనిమిదవ పద్యమున కీర్తింపఁబడినారు. తొమ్మిదవ పద్యము గీర్వాణభాషాకవిస్తుతిపరము, పదియవపద్య మాంధ్రకవిస్తుతి. ఆ తరువాతి యాఱు పద్యములలో కవి వంశవర్ణనము కలదు. వీరి మూల పురుషుఁడు మాధవకవి.

'మాధవభక్తియుక్తుఁ డసమానకవిత్వగురుండు కృష్ణరా
యాధిపదత్తసద్గజవరాదిమహాబహుమానశాలి గం
గాధర కీర్తిపాత్రుఁడు జగత్కవిచంద్రుఁడు మత్కులేంద్రుఁడౌ
మాధవుఁ డస్మదాదులకు మాన్యుఁడుగాఁడె తలంచిచూచినన్'

ఈ కృష్ణరాయాధిపుఁడు ప్రసిద్ధుఁడగు కృష్ణదేవరాయలే కావోవు. రాయలచే నిట్లు సత్కరింపఁబడిన ఈ కవి కృతులేవియో అవి యెందుదాఁగినవో తెలియరాదు. ఈ మాధవకవి కాఱవతరమువాఁడు కవి జనకుఁడగు నృసింహకవి. ఇఁక, కవి గురువు 'కాశీ సేతు మధ్యావనీభాగఖ్యాతి విరాజమానుఁడును, మహా

భాష్యాది షట్ఛాస్త్ర విద్యాగారుఁడును, నరసింహ సత్కవి కుమారాగ్రేసరుఁడును నగు బోర్వెల్లి యోగానంద కవీంద్రుఁడఁట'! తెలంగాణా వాస్తవ్యుఁడును, భగవద్గీతార్థదర్పణకారుఁడుననగు పూడూరి కృష్ణయామాత్యునిగురువగు యోగానందుఁడితఁడే కావచ్చునని సంభావింపఁబడుచున్నది.

బోర్వెల్లిలో వెలసిన కేశవస్వామియే కవికి కలలో కాన్పించి కౌసలేయ చరిత్రమును తన కంకితముసేయుమని యాదేశించెనఁట!

'గిరియమ్మ నాకు మెచ్చుగ
శరణము గట్టించి యొక్కసత్కృతి నాపై
విరచింపఁజేయవలెనని
కరమురుదుగఁ దలఁచినది జగద్ధితమిదియున్'
'ఈ కృతియే మదంకిత మహీనమతిన్ రచియింపఁజేయు మం
చా కమలాక్షియా గిరియమాంబకు నే కలలో వచించెదన్
జోకఁగ నీ కభీష్టములు జొప్పడు శ్రీనరసింహమూర్తినై
నీకిలువేలుపై తగిన నీరజనాథుఁడ నేనె బాలకా'

యని కేశవస్వామి యుద్బోధించెనఁట! తెల్లవాఱఁగనే గిరియాంబారాజ్ఞి యాజ్ఞ రాఁగా, కవి యాస్థానమున కరిగి యామె ప్రేరణమున నీకృతిని కైసేసెనఁట! గిరియమాంబ 'కట్టించె కేశవాగారంబు భూమిపైఁ బరగు కుబేరపుష్పక మనంగ, చదివించె విద్యార్థి జనుల కన్నముపెట్టి వేదశాస్త్రపురాణ విద్యలెల్ల'. ఇంకను ఆలయారామ ప్రతిష్ఠాదికము లొనర్చి ప్రశస్తకృతులు వినిర్మింపఁజేసి, సప్తసంతానప్రశస్తినిగాంచినదఁట గిరియమ్మ.

## చింతలపల్లి ఛాయాపతి

గిరియమ్మ దత్తపుత్రుఁడు వెంకటపతి. ఈతని కాలమున బోర్వెల్లి సంస్థానాస్థాన కవి చింతలపల్లి ఛాయాపతి. చింతలపల్లివారిది సుప్రసిద్ధపండిత వంశము. వీరి పూర్వుఁడును, మనకవి ఛాయాపతికేడవతరమువాఁడును నగు ఎల్లయ '....సాధుకవితా సిద్ధాంత రాద్ధాంత వాగ్ఝేలా పాటవనిర్జితార్యుఁ'డఁట (రాఘవా, 1–91). '.... అచ్యుతరాయలచేత .... అగ్రహారము లమోఘములంగొని కామలాపురిన్' (1–92) 'కాపురమున్న ....' (1–93) వాఁడఁట! ఎల్లయసతి అనంతమాంబ 'శంఖవరాగ్రహార రక్షపరతంత్ర ....' (1–93) యై యొప్పినది. వీరి కుమారుఁడు అనంత సమాఖ్యుఁడు 'నిత్యబుధానుకూలి....వరదానవినోది (1–94). ఛాయాపతి ప్రపితామహుఁడగు మూర్తికవి 'విద్యాలంకారుఁడు .... ప్రౌఢాలంకార చక్రవర్తి బహుశాస్త్రాధ్యాపనస్ఫూర్తి ....' (1–99)యఁట. పితామహుఁడగు వీరరాఘవకవి 'విద్యారణోత్సవ నైయాయిక చక్రవర్తి గురు శబ్దజ్ఞానధౌరేయుఁడు....' (1–100)నునఁట! తండ్రియు, పినతండ్రులును

‘నూతన కాళిదాసులు....’ (1–101) అంటః తండ్రియగు గోపాలకవిప్రశస్తి ‘...జాములోపల నార్యాశతకంబు వజ్రగిరి గోపాలాంకితంబుగా చేసిన.... కవిరాజు....’ అని మధురవాణీవిలాస కృత్యవతారికా విశదము. మూఁడవ పినతండ్రి వెంకటపతి తనయుఁడు వీరరాఘవకవి మధురవాణీ విలాసకర్త*. నాలుగవ పినతండ్రి అప్పకవి కుమారుఁడు సంజీవకవి చంద్రాంగదోపాఖ్యాన కర్త; మహాచాటు వచః ప్రవీణుఁడు (1-108). ఛాయాపతి మహబూబునగర మండలమునందలి గంగాపురనివాసి; పదునెనిమిదవ శతాబ్దివాఁడు. వీరరాఘవ కవిపౌత్రుఁడు; గోపాలకవి పుత్రుఁడు. తిరుమల శ్రీనివాసాచార్యు లితని విద్యా గురువు. సంస్థానాధీశ్వరుఁడగు వెంకటపతి లేక వెంకటరెడ్డి కావ్య విశ్రోత. కవికి శేషాచలస్వామి కలలో కన్పించి —

‘ప్రకటైకస్థితినైతి నే నఖిలకుంభస్మూర్తినై నాదగో
నికులాంభోనిధిపూర్ణ సోముఁడన వన్నెల్మీఱు సోమాధినా
యకమూర్ధన్యునకున్ గిరమ్మకు సుతుండై ధీరుఁడౌ వేంకట
న్నకు లీలాస్పదమైన బోరువెలి పుణ్యస్థాన మాస్థానిగన్’

1-83.

‘ఆ పురమున ననవరతము
కాఁపురమొనరించు నాదగౌండ్లకు మేలై
ధీపటుఁడు వేంకటన్నయ
నా పటిమన్మించె పాకనాటి కులమునన్’ 1-84.

‘అతఁడు మదంఘ్రిభక్తియుతుఁ డాయన యీకృతి విన్న మత్సమ
ర్పితముగఁ జేయుమంచు నిను ప్రీతియొనర్చును నీవునున్ సమా
హితమతినట్ల సల్ప నుభయేప్సితముల్ తదుపాధియుక్తి సం
తతము ఫలించు మత్కరుణఁ దత్కృతిభర్తను నేనె కావునన్’

1-85.

అని యాదేశింపఁ గవి యట్లే యాచరించి యిహపరముల సాధించి తరించినాఁడు. చిత్రకవితా ప్రాభవము విస్తారముగా కల్గి ఆఱాశ్వాసముల మేర విస్తరించిన దీ కృతి. తాను ‘ఆంధ్ర గీర్వాణ కవితా సవఘంటసురత్రాణ బిరుదాంకుఁడ’నని కవి స్వీయప్రతిభను విశదీకరించినాఁడు.

కృత్యవతారికయందు కవి నాఁటి సాహిత్యపోషకులను గూర్చి విసరిన విసరు గమనింపఁ దగినది.

కేవల సరసపదాన్యం
డీ వసుమతి లేఁడు కలిగెనేని కవిత్వ

*దీని తాళపత్రప్రతి హైదరాబాదు లక్ష్మణరాయ పరిశోధకమండలి గ్రంథాలయమునఁగలదఁట.

శ్రీ వెలయఁ జేసి కవులు ప్ర
భావంబులు సూపరే ప్రబంధక్రియలన్' —1—48.
'పట్టుమని కాసు చేతన్
బెట్టెడువాఁడొకఁడు లేఁడు బీదల కిలలో
కట్టిడి లోభి నరాధము
లిట్టి దురాత్ములకు సుకృతులీయందగవే' —1—58.
'పరఫలమది పోనాడిన
పరకవి కిహమున యథేష్టవస్తువు లొసఁగే
నరుఁడేఁడీ స్వల్పుఁడగు
దొరను కృతిన్నిలిపి యుభయతో భ్రష్టుఁడగున్ —1—59.

అని నీచనరుల నీసడించి తన కృతిని భగవదర్పితము చేసినాఁడు.

'తిరమగుచోటు, నింటికొరత తీర్పరి పెద్ద, నిజానుకూల సుం
దరి, యుచితజ్ఞుఁడై బహుళదాతగు నేత, సుధీ సహాయమున్
హరి కరుణాకటాక్షమును నబ్బినఁ గాక మహాప్రబంధముల్
సరసిజసూతికిన్ బలుకుచానకునైన రచింప శక్యమే' —1—70.

అన్న పద్యము 'నిరుపహతి స్థలంబు....' అను అల్లసానివారి చాటువు ననుకరించునట్టిది.

చక్కఁదనంబు తీవియును జవ్వనమున్ గల ప్రాణవల్లభుం
డక్కున గూర్చి ముద్దుగొని యక్కఱ దీఱఁగ గారవింపఁగా
సొక్కి సుఖింప లేని యల సుందరి కా యెలప్రాయమేల సొం
పెక్కుడు రూపమేల కళలేల విలాసము లేల యారయన్' —3—285.

అను సుందరి పద్యము మనుచరిత్రమునందలి 'చొక్కపుఁబ్రాయమున్ మిగుల సోయగమ్ముంగల ప్రాణనాయకుం డెక్కుడు పశ్యతన్ రతుల యేఁకటఁ దీర్చి ....' (మను. 3—7) అను పద్యమున కనుకృతి. ఈ ప్రబంధరాజమునందు రఘు అజమహారాజుల చరిత్రము విపులముగా వర్ణితము. మొదటి రెండాశ్వాసములలో రఘువుకథయు, చివరి నాలుగాశ్వాసములలో అజుని చరితము విస్తృతము. కాళిదాసు రఘువంశమందలి 4—7 సర్గలలోని కథాభాగ మీ కావ్యమునకు మొదలుసంచి. కాళిదాసుని అనేకశ్లోకముల నాంధ్రీకరించి కవి తనకృతిలో నిమిడ్చినాఁడు. మచ్చునకు కొన్ని పద్యములు :

'అనిమొన నెట్టిశూరులకునైన జయాపజయంబు లొందుటల్
సను విధిచోదితంబులివి సాహసమానము లీ యహంకృతుల్
పనిగొనవిప్పుడేమి పగవాసెను సఖ్యమొనర్చి యేఁట న
వ్వనములు వెట్టుచున్ సరసభావమునన్ మను బొమ్మ భూవరా'
—2—114.

'అలరు బెడంగు కెంజిగురుటాకు గుడారము మొల్లపువ్వుఁదీ
గల బిగిత్రాళ్ళ గట్టిగను గట్టిన దట్టపుటంటిమట్టలం
దొలికెడి పచ్చకప్పురముతోఁ గయిసేసిన గచ్చుటర్గుపై
బెళుకు మిటారి చెంగలువపీఠము నిల్పె వసంతుఁడింపుగాన్' —4—24.
బోరవెల్లి సంస్థానాధీశ్వరుల కీర్తివల్లికకు పాలవెల్లివంటి వీ కృతులు.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. కందుకూరి వీరేశలింగముపంతులు, ఆంధ్రకవుల చరిత్రము, తృతీయభాగము. పుటలు 194—196.

2. సురవరము ప్రతాపరెడ్డి, గోలకొండకవుల సంచిక.

3. చాగంటి శేషయ్య, ఆంధ్రకవితరంగిణి, సంపుటము 12, పుటలు 199—212.

4. ఆదిరాజు వీరభద్రరావు, తాళపత్ర గ్రంథములు, తెలంగాణము, మొదటిభాగము, దేశోద్ధారక గ్రంథమాల, సికిందరాబాదు, 1956.

5. డా. బిరుదురాజు రామరాజు, మరుగుపడిన మాణిక్యాలు, పుటలు 44—50.

6. బులుసు వేంకటరమణయ్య, ఆంధ్రకవి సప్తశతి, పుటలు 71, 225, 280.

7. డా. బిరుదురాజు రామరాజు, రాఘవాభ్యుదయ పీఠిక, పుటలు 1—9.

8. ఆరుద్ర, సమగ్రాంధ్ర సాహిత్యం, సంపుటము 11, పుటలు 203—217.

9. మారేమండ రామారావు, గద్వాల సంస్థానము, కాకతీయసంచిక, పుటలు 261—272.

# మాడుగుల

## ప్రవేశిక

ఇది విశాఖపట్టణ మండలమునందలి ప్రాచీనమైన కొండ జమీందారీలలో నొకటి. ఇందు 77 జిరాయితీ గ్రామములు, 26 అగ్రహారములు ఉండినవి. శాశ్వత పరిష్కారము నాఁటి పేష్కషు 30 వేలు. జమీందారీ రిపోర్టునాఁటి ఆదాయము రెండుంబాతిక లక్షలకు పైమాట. పేష్కషు మాత్రము పెరుగలేదు. భూములు చాలసారవంతమైనవి. అయినను శీతోష్ణస్థితి అంత ఆరోగ్యకరమైనది కాదు*. ఈ సంస్థానమునఁ బ్రవహించు సీలేరు నది మీఁదఁగల మత్స్యకుండమను తీర్థమునందలి చేఁపలను సంస్థానప్రజలు అతి పవిత్రములని సంభావింతురు. మాడుగులకు పశ్చిమోత్తరదిశ యందుఁగల కొండల చాలులో నుండు పాడేరులో తమపూర్వులు మొదట మకాము చేసినట్లు ఈ సంస్థానపు పాలకులు చెప్పుదురు. మొన్నమొన్నఁటిదాఁక ఈసంస్థాన పాలకుల పట్టాభిషేకోత్సవములు లాంఛనముగ తొలుత పాడేరునందే జరిగెడివఁట. మత్స్యాకృతిగల గద్దెయొకటి శిలానిర్మితమగునది నేఁటికిని పాడేరులోఁగలదఁట. వీరి ధ్వజములు మత్స్య లాంఛనముగలవి. ఈ జమీందారులు సంతకము చేయుటకుముందు మత్స్యా కృతిని లిఖించుటకూడ కద్దు. ఈ సంస్థానమునందు చిన్న చిన్న ముఠాదారు లెక్కువ. ఈ ముఠాదారులు ప్రజలనుండి శిస్తులు వసూలుచేసి తమ వాటాపోఁగా మిగిలినది జమీందారునకు చెల్లించెడివారు.

## సంస్థాన చరిత్రము

ఈ సంస్థానపాలకులు పాండవుల సమీపబంధువులగు మత్స్యదేశ ప్రభువుల సంతతివారమని చెప్పుటకలదు. వాస్తవముగా అలనాఁటి మత్స్యదేశ ప్రభువుల సంతతికి చెందినవారో కారో స్పష్టముగా నిరూపించుటకు సరియైన చారిత్రకాధారములు లేవుగాని మత్స్యధ్వజములు, మత్స్యాకృతి గల గద్దెలు, సంతకము చేయుటలో మత్స్యాకృతిని లిఖించుటయు, సంస్థానపాలకులు మత్స్య కులము వారగుటయు, మత్స్యకుండమునందలి చేఁపలను పవిత్రముగా భావించు టయు మాత్రము ఈ సంస్థానపాలకుల విశిష్ట లక్షణములుగా గోచరించుచున్నవి. వీరు జయపుర సంస్థానము వారి కూటస్థునికి సన్నిహిత బంధువులనియు,

* మాడ్గులనీళ్ళు మానెడు గన్కా పుచ్చుకుంటే జన్మం వున్నంతకాలమున్ను చలిజ్వరాలు వదలవు' (పూసపాటి రాజుల పూర్వోత్రం).

ఆయనతోఁగూడ ఉత్తరదేశమునుండి ఈ దేశమునకు తరలివచ్చెననియు, ఆయనకు ప్రతినిధిగా మాడుగులసీమకు పాలకుఁడుగా వీరిపూర్వుఁడొకఁడు 'భూపతి' యను బిరుదముతో నియమింపఁబడెననియు మఱియొక గాథ కలదు. వీరిపూర్వులు జయపురమువారికి సమీపజ్ఞాతులనుట మాత్రము ఇటీవలి సంబంధ బాంధవములనుబట్టి కూడ నిస్సంశయము. వీరిపూర్వులు జయపురము రాజన్యులకు నెమలిపింఛము పట్టెడివారఁట! వీరి మూలపురుషుఁడు చోళభూపతిదేవు (721–771). క్రీ.శ. 771 నుండి 1700 వరకు ఇరువదియొక్కరు మాడుగులను పాలించిరఁట!

విజయనగరమువారిపై తిరుగుబాటుచేసిన కొండజమీందారులతోఁజేరి కుంఫిణీవారి సేనలతో తలపడినందున నాఁటి మాడుగుల జమీందారు లింగభూపతిని మాడుగుల జమీందారీ యధికారమునుండి తొలఁగించుటకుఁగాను పూసపాటి సీతారామరాజు పెద్దయెత్తున ప్రయత్నములు సాఁగించినాఁడు. సీతారామరాజు తమపై దండెత్తివచ్చినచో పరస్పరము సాయపడుటకు అనకాపల్లి జమీందారు పాయకరాయనింగారును, మాడుగుల లింగభూపతియును ఒడంబడికలు చేసికొనియుండిరి. కాని రణనీతినిపుణుఁడగు సీతారామరాజు వ్యూహరచనములముందు వీరియేర్పాటులు కొనసాఁగలేదు. విజయనగరము సర్వసేనాని సాగి నారాయణరాజు లింగభూపతిని పాఱఁదోలి మాడుగులను వశపఱచికొని అచట విజయనగరమువారి ఠాణా యేర్పఱిచి తగు నధికారి వర్గమును నియమించి కట్టుదిట్టము గావించెను. లింగభూపతి చేయునదిలేక గోదావరి మన్యములకు వలసపోయి అచట మరణించెను.

1794 లో పద్మనాభయుద్ధమున విజయనగరము విజయరామరాజుగారు వీరమరణము పొందువరకు లింగభూపతివంశీయులు జయపురమునందే దీర్ఘప్రవాసము గడపిరి. ఆ తరువాత కొంతకాలమునకు విశాఖపట్టణమండలము కలెక్టరుగారు జయపురమునుండి వీరి కుటుంబమును రావించి లింగభూపతి సోదరుని కుమారులలో జ్యేష్ఠుఁడును, కృష్ణభూపతి తనూజుఁడును నగు జగన్నాథభూపతికి మాడుగులను మామూలు షరతులతో కవులునకిప్పించిరి. కాని చిరకాలము సాఁగిన యుద్ధాద్యుపప్లవములవలన దేశము చాలపాలు ఉజాడయియుండినది. ఉన్నప్రజలు కటికపస్తులతో కాలముగడపుచుండిరి. ప్రజలు లేరు, పనిలేదు; పంటలేదు, సంపదలేదు. దేశమెల్లెడల ఇనుపగజ్జెలతల్లి నాట్యము సేయుచుండినది.

సంస్థాన మిట్టి యిక్కట్టులలోఁ గొట్టుమిట్టాడుచుండఁగా లింగభూపతి పినతండ్రికి ఒక ఉంపుడుగత్తెవలన పుట్టిన కుమారుఁడగు అప్పలభూపతి యనునతఁడు జగన్నాథభూపతి సంస్థానపుహక్కును సవాలుచేయుచు పెద్దవివాదమును లేవఁదీసెను. ఆయనవాదము ప్రమాణబద్ధము, శాస్త్రసంశుద్ధము కానందున

నిరాకరింపఁబడినది. కాని ఆయన తనపట్టునువీడక ఏజన్సీప్రాంతీయములో తన పక్షమును బలపఱచికొనుచు, వేలకొలఁది రూప్యములు జనులనుండి నయముననో, భయముననో జమచేసికొనుచు ప్రాంతగొడవకు వడసువెట్టసాఁగెను. ఈ యింటిలోనివారు ఇట్లు పదునైదేండ్లపాటుసాఁగి జగన్నాథభూపతిని మిక్కిలి కలవరపఱచినది. అప్పలభూపతి మరణానంతరము అలెగ్జాండరువారుగారు విశాఖపట్టణమండలము కలెక్టరుగా నున్నప్పుడు జగన్నాథభూపతితో శాశ్వత పరిష్కారము జరిగినది. మాడుగులకు పట్టిన పీడ మాసిపోయినది.

జగన్నాథభూపతి యనంతర మాతని యౌరసుఁడు లింగభూపతి (క్రీ.శ. 1817–1831) మాడుగులను పాలించెను. లింగభూపతి యనంతరము ఆయన పెద్దభార్యయగు రామయ్యకు 1831 లో జమీ దఖలుపడినది. లింగభూపతికి పురుషసంతతి లేదు. జోగిమణిదేవి యను కూఁతురుమాత్ర ముండినది. ఈమె జయపూరు సంస్థానములోని కల్యాణసింగపురము ఎస్టేటుదారులు శ్రీ ముకుందదేవుగారిని వివాహమాడినది. జగన్నాథభూపతికి లింగభూపతి కాక, హరిహరభూపతి, కృష్ణభూపతి యని మఱి యిరువురు కుమారులుండిరి. లింగభూపతి 1831 లో మరణించుటచే సంస్థానము 1832 లో హరిహరభూపతికి సంక్రమించినది. హరిహరభూపతి నయితము నిస్సంతగుటవలన ఆయన మరణానంతరము ఆయనతమ్ముఁడగు కృష్ణభూపతి (1813–1875) 1853లో జమీందారయ్యెను.

1875 లో ఈ కృష్ణభూపతి మరణింపఁగా సంస్థానము 1886 వఱకు కోర్టు ఆఫ్ వార్డ్సు వశమున నుండినది. కృష్ణభూపతికి శ్రీ సీతాపట్టమహాదేవి, శ్రీ నీలమణిపట్టమహాదేవి యని యిరువురు భార్యలు. వీరిరువురు అక్కసెల్లెండ్రు; గుణుపుర రాజపుత్రికలు. సీతాపట్టమహాదేవిగారు 1886 లో జయపురసంస్థానము పెదదుగరాజుమహారాజులుంగారయిన కృష్ణచంద్రదేవుగారి నడిగి వారి కుమారులు శ్రీ విక్రమదేవవర్మ (1869–1951) గారిని ఏడేండ్ల బాలుని దత్తునిగా స్వీకరించిరి. ఈ దత్తస్వీకారము జయపురమువారికి సుతరాము ఇష్టములేదు. ఈ దత్తును కృష్ణభూపతి రెండవభార్యయగు నీలమణిపట్టమహాదేవిగా రాక్షేపించుచు నొక వ్యాజ్యము తెచ్చిరి. సర్వసాక్ష్యములను బరీక్షించి దత్తత చెల్లనేరదని ప్రీవీకౌన్సిలువారు 1889 లో తీర్పునిచ్చిరి. కాని, ఈ తీర్పు రాకముందే 1886 లో నీలమణిపట్టమహాదేవిగారు మరణించిరి. దత్తత చెల్లనికారణమున విక్రమదేవవర్మగారు మాడుగులనువీడి తల్లిదండ్రుల యొద్దకు తిరిగి వెడలిపోయిరి. 1876–1889 మధ్య సంస్థానము కోర్టు ఆఫ్ వార్డ్సు పరమున నుండినది. 1889 నుండి 1901 దాఁక సీతాపట్టమహాదేవిగారే ప్రీవీకౌన్సిలు తీర్పుమేరకు జమీందారిణిగా పాలించిరి. 1901 మే 4 వ తేదీన సీతాపట్టమహాదేవిగారు మరణించిరి.

రామయాంబాలింగభూపతుల తనయయును, కల్యాణసింగపురము ఎస్టేటు దారు శ్రీ ముకుందదేవుగారి భార్యయును నగు జోగిమణిదేవిగారికి మాడుగుల జమీ సంక్రమించినది. ఈమెకుమారుఁడు కృష్ణదేవు. ఈ కృష్ణదేవు నిస్సంతుగా మరణించుటచే ఆయనభార్య నీలాదేవి ముకుందదేవునుతనిని దత్తు తీసికొనెను. ముకుందదేవు మాడుగులకును వారసుఁడుగా గుర్తింపఁబడినాఁడు. కృష్ణభూపతి (1853—1875) ద్వితీయభార్యయగు నీలమణిపట్టమహాదేవిగారికి అమ్మి మహాదేవి యని యొక కూఁతురుండినది. ఈమె జయపురము మహారాజులు శ్రీ రామచంద్రదేవుగారి తమ్ములయిన విశ్వంభరదేవుగారి భార్య. అమ్మి మహాదేవి 1895 లో మరణించియుండినది. రాజేంద్రమణిదేవి వీరి కూఁతురు. ఈమెయును నిస్సంతగు వితంతువు. 1901లో మాడుగులను పై ముకుందదేవు, రాజేంద్రమణిదేవి యీ యిద్దఱకును పంపకము గావించిరి. 1905లో ముకుంద దేవు నిస్సంతుగా మరణించుటచే నాయనభార్య చంద్రమణిమహాదేవిగారు వారి వంతు జమీకి వచ్చిరి. 1931 ప్రాంతముల మాడుగుల జయపురము సంస్థానమున సంలీనమయి, ఉత్కలరాష్ట్రావతరణముతో చెన్నపురిరాష్ట్రమున శేషించి చిట్టచివరకు ఆంధ్రరాష్ట్రమున అంతర్భూతమయినది.

## సాహిత్యపోషణము

మాడుగుల 'లింగభూపతి బహు ధర్మాత్ముఁడు. ఇటువంటి రాజు ఆ తాలూకాలో పుట్టబోడు. మాడ్గుల తాలూకాలో బ్రాహ్మణమాన్యాలు పసతిగా జరిగినట్లు మరివఖ తాలూకాలో లేదు'* అను ఏకైకోద్ధరణమునందలి ప్రశంస తప్ప కృష్ణభూపతి (క్రీ. శ. 1853—1875) కాలమువరకు ఈ సంస్థానమువారు కావించిన సాహిత్యపోషణమునకు నిదర్శనములు కానరావు. విజయనగర సామ్రాజ్యమునకు కృష్ణదేవరాయ లెట్టివారో మాడుగుల సంస్థానమునకు కృష్ణ భూపతి యట్టివారు. కృష్ణభూపతి సంస్కృతాంధ్రములలో గొప్ప పండితుఁడు. విద్వత్కవిబృంద పరిపోషకుఁడు. ఈయన కభినవకృష్ణదేవరాయలను దండి బిరు దుండినది. అడిదము బాలభాస్కరుఁడు, శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి, అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి, అల్లమరాజు రామకృష్ణకవి, ఇంద్రగంటి గోపాలశాస్త్రి, పేరి సర్వేశ్వరశాస్త్రి, మంత్రిప్రెగ్గడ సూర్యప్రకాశకవి మొదలగువారు కృష్ణభూపతి యాస్థానకవి పండితులు. పురాణం సూర్యనారాయణ తీర్థులు, భమిడిపాటి యజ్ఞనారాయణశర్మ, త్యాడి వేంకటశాస్త్రి, త్యాడి పట్టాభిశాస్త్రి మున్నగువారు ఆధునికకాలమునందు మాడుగుల మన్ననలనందిన విద్వత్కవులు.

## అడిదము బాలభాస్కరకవి

అడిదము బాలభాస్కరుఁడు (1808—1874) అడిదము సూరకవి

* పూసపాటిరాజుల పూర్వోత్తరం.

(1720–1785) మునిమనుమఁడు. అడిదమువారి వంశమున బాలభాస్కర నామకులు ముగ్గురు కలరు. మొదటి బాలభాస్కరకవి (1690–1750) సుప్రసిద్ధుఁడగు సూరకవీంద్రుని కన్నతండ్రి; ఇతఁడే శుద్ధాంధ్రరామాయణకర్త. రెండవ బాలభాస్కరుఁడు సూరకవి పుత్రుఁడు; వట్టి పండితపుత్రుఁడు. సూరకవి మనుమఁడగు సూరన (1778–1823)కు పుత్రుఁడగు మూఁడవ బాల భాస్కరుఁడు ప్రస్తుతచర్చలో ప్రసక్తుఁడు. మాడుగుల కృష్ణభూపతి బాల భాస్కర కవిని సమ్మానించినట్లు మాడుగుల సంస్థానాస్థాన కవీశ్వరుఁడగు మంత్రిప్రెగ్గడ ప్రకాశకవి రచించిన క్రింది చాటురచనము వలన నిరూపింపనగు చున్నది.

'సాగాకల కవు లిద్దఱు
బాగొందిరి కృష్ణమూర్తి భాస్కరులు మహా
భోగులు గవ్యనురాగులు
గోగణపాలకులు మాడుగుల సభలోనన్'

అడిదము బాలభాస్కరకవికి కృష్ణభూపతి వార్షిక మేర్పఱిచి గౌరవించెనఁట! విజయనగరము తాలూకాలోని రెల్లివలస బాలభాస్కరకవి నివాస గ్రామము. అడిదము వారు ఆర్వేల నియోగులు. వసిష్ఠ గోత్రులు, ఆపస్తంబ సూత్రులు. బాలభాస్కరకవి పితృపాదులసన్నిధిని విద్యలనభ్యసించి సంస్కృతాంధ్రము లందు సుశిక్షితుఁడై సరససాహిత్యపరిశ్రమము గావించినవాఁడు.*

బాలభాస్కరకవి రచించిన యుద్గ్రంథము లెవ్వియును లభ్యముకాలేదు. జానకీరామ భోగలింగ శ్రీ వేంకటేశ్వర సింహశైలనృసింహాది శతకములు, కొన్ని చాటురచనములు మాత్రము దొరకుచున్నవి. మాడుగులకు సంబంధించిన శ్రీ కృష్ణభూపతి తారావళి యను కందపద్య రచనముకూడ లభ్యమైనది. అశ్విన్యాది నక్షత్రనామము లిముడ్పఁబడిన యిరువదియేడు పద్యముల ఖండ కావ్యమును తారావళియందురు. కృష్ణభూపతి తారావళినుండి మాదిరికి కొన్ని పద్యములు:

'శ్రీ మన్మృగరాజాశ్వని
సోమకళాభరణ గౌరి శుంభద్విభవ
స్తోమ మిదు నీకు శ్రితసుర
భూమిజ మత్స్యకుల కృష్ణభూపలలామా'

'వర రత్నాంచిత వలయా
భరణీతకరుఁడవగు నిన్నుఁ బ్రస్తుతిసేయన్
దరమా సత్కవివరులకు
సరసాగ్రణి! కృష్ణభూప! స్మరనిభరూపా!'

*అడిదము రామారావు, విస్మృత కళింగాంధ్ర కవులు, పుటలు 146–149.

'రేవతియను కామిని వను
సేవింపఁగఁదలఁచు సుగుణశీలి నసుమాం
దై విలసిల్లెడు వానిం
భావించెదఁ గృష్ణభూప! భావజరూపా!'
'తారావళియను కావ్యము
తారావళికరణిఁ గూర్చి తనరఁగ సీసన్
బేరుగ నొసఁగితి నిదిగో నీ
భూరికృపన్ బ్రోవు కృష్ణభూపతివర్యా!'

బాలభాస్కరకవియు నతని ప్రపితామహుఁడగు సూరకవివలె శాపానుగ్రహ సమర్థుఁడఁట. ఇతఁడు చల్లా పట్టాభిరామయ్య యను మొఖాసాదారుని జెడఁదిట్టినట్లు ప్రతీతి[1].

## శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి

మాడుగుల కృష్ణభూపతిచే సత్కరింపఁబడిన మఱియొక కవి శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి. ఈయన కాసలనాటి బ్రాహ్మణుఁడు[2]. వసిష్ఠ గోత్రోద్భవుఁడు. ఆపస్తంబ సూత్రపవిత్రుఁడు. గౌరమాంబా సర్వశాస్త్రుల తనయుఁడు. జననము పిఠాపురము చెంతనున్న రావర్తి గ్రామము. తూర్పు గోదావరి మండలములోని రామచంద్రపురమునకు సమీపమునఁగల గొల్లపాలెమున కొంతకాలము కాఁపురము. బులుసు అచ్చయ శిష్యుఁడు. ఈయన సంస్కృతాంధ్రములలో పేరు పొందిన కవి. సంగీత సాహిత్యముల సమానప్రతిభఁగల పండితుఁడు. అభినవ భట్టుమూర్తి యన్నది యీతని బిరుదు. పిండిప్రోలు లక్ష్మణకవికి ప్రతిద్వంద్వి యని చరిత్రకారుల నిర్ధారణము. కాళహస్తి, పిఠాపురము, జగ్గంపేట, కోటరామచంద్రపురము మున్నగు నితరసంస్థానములలోఁ గూడ సమ్మానము లందినవాఁడు.

నాటకదీపము, పంచతంత్రము, వసుచరిత్ర వ్యాఖ్యానము, సింహాచలక్షేత్ర మాహాత్మ్యము, వేంకటాచల మాహాత్మ్యము, సర్వకామదా పరిణయము, స్త్రీ నీతిశాస్త్రము, హనుమచ్ఛతకము మొదలైన యాంధ్ర గ్రంథములును. అశ్వశాస్త్రము, రామాయణ కథాత్మకమగు కంకణబంధము, జగన్నాథక్షేత్ర యాత్రా చరిత్ర పరమైన నీలశైలనాథీయము, మదనాభ్యుదయ మనోల్లాస పల్లవీపల్లవోల్లాసభాణములు, బాలవ్యాకరణమున కనువాదరూపమగు పాణిని కారికావళి మున్నగు ప్రసిద్ధగీర్వాణభాషాకృతులేగాక శతాధికములగు చాటువులు,

[1] వేటూరి ప్రభాకరశాస్త్రి, చాటుపద్యమణిమంజరి, పు. 172; అడిదము సూరకవి జీవితమునకు నిడుదవోలువారి పీఠిక, పు. 10.

[2] తెలగాణ్య వైదికబ్రాహ్మణుఁడని ఆంధ్రకవిసప్తశతి, పు. 40.

దండకములు, నాటకములు, స్తోత్రములు అనేకములు కృష్ణమూర్తిశాస్త్రి కృతము లచ్చుపడి కలవు. మాడుగులలో సాలీనా వేయిరూప్యముల రాఁబడిగల మాన్యములఁబడసి వారి యాస్థానమునఁ గవిపండిత శిరోభూషణమై యలరారి మాడుగులలోనే పరమపదించిరి.

కృష్ణభూపతి మీఁద కృష్ణమూర్తిశాస్త్రిగారు చెప్పిన చాటు వొకటి అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి సంకలితమగు చాటుధారాచమత్కారసారమునందు సంగ్రహితము యియున్నది. అది ఇది :

'శ్రీకృష్ణభూపకీర్త్యవసర గిరి గరిసరిసమేతి వీణేయమ్
బ్రూతే తత్తాత హితాధికతా కథితేతి మురజోను'

శ్రీ కృష్ణభూపతి కీర్తి యొక్క ఉచ్చారణసమయవాక్య విషయమునందు ఈ వీణ (గరిసరిః) నాగభూషణునితో సమానమని పలుకుచున్నది. ఈ మృదంగము కృష్ణభూపతి కీర్తి సరస్వతికంటె ఆధిక్యము కలదని చెప్పుచున్నది. శ్రీ కృష్ణ భూపతి నామ్నోరాజ్ఞః కీర్తేః; అవసరగిరి : ఉచ్చారణ సమయ వాక్య విషయే : ఇయం వీణా : తత్సభాయాం పరిదృశ్యమానా పల్లకీ ; గరమేషా మస్తీతి గరిణ స్సర్పాః ; తే సరాణి మాల్యాని యస్యసః గరిసరిః : శివః, తేన సమాః ఇతి బ్రూతే : ధవళత్వా దీశ్వర తుల్యేతిభావః ; మురజః : మృదంగః ; తత్తాతస్య : బ్రహ్మణః, కస్మింశ్చిత్కాలాంతరే శివః బ్రహ్మ లలాట సముద్భవ ఇతి విష్ణుపురాణ శ్రవణాత్, తస్య బ్రహ్మణః హితా : సరస్వతీ ; తస్యాః అధికతా సరస్వత్యాప్యతిశాయితా కథితా ఇతి బ్రూతే.

సంగీతశాస్త్రసంప్రదాయములను జోడించి రచించిన యీ చాటువు చమత్కారచారుభంగా నున్నది.

## అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి

'ఏమేటి మాడ్గుల కృష్ణభూపాలుని
సభయందుఁ గవులచే శ్లాఘనందె' (ఆంధ్ర చంపూభారతము, 1—33).

మాడుగులవారి మన్ననలను పొందిన మఱియొక కవి అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి (1831—1892). ఇతనిది ఆరామ ద్రావిడశాఖ. గంగమాంబా రంగధామార్యుల పుత్రుఁడు. 'పీఠపురపర సమీపస్థిత చేఁబ్రోలు నామ సంవసథ వాసుఁడు', 'ఉభయభాషారచనిత్వ విలసితుఁడు'. కృష్ణభూపతి కంకితముగా ప్రత్యక్షరశ్లేష పద్యావళిని రచియించెను. 'ప్రత్యక్షర శ్లేషపద్యాళి మాడ్గుల కృష్ణ భూపతి సభం గీర్తిఁగంటి' (శ్రీకృష్ణకల్యాణము, పు. 4). 'మత్స్యకులదీప దివ్యమహన్మహస్సురూప పరమగుణధామ కృష్ణభూపతిలలామ' యను మకుటముతో రహించిన సీసపద్యశతకము 1853 లో రచించి కృష్ణభూపతికి సమర్పించెను. 1853 నుండి 1869 దాఁక వీరికి మాడుగులలో వాస్తికము లుండినవి.

'బొండుమల్లెలకు సమ్మోహనసౌగంధ్యంబు
చెఱకుఁగోలకు సముంచితమధురిమ
కంఠీరవమున కుగ్రప్రభావసమృద్ధి
యంచకుఁ బాలు నీ రెంచు నేర్పు
గండుఁగోయిలకుఁ జక్కని కలధ్వనిలీల
ప్రహ్లాదునకు హరిభక్తినియతి
మలయానిలమునకు లలితశీతలవృత్తి
వాణికిఁ బ్రాచుర్యవర్ణనంబు
నీకు వితరణశీలంబు లోకమెల్లఁ
బొగడుచుండఁగఁ దోడనె పుట్టె నౌర
మత్స్యకులదీప! దివ్యమన్మథసురూప!
పరమగుణధామ! కృష్ణభూపతిలలామ!'
అని సుబ్రహ్మణ్యకవి వర్ణించిన తీరు కృష్ణభూపతిపట్ల స్వభావోక్తియుక్తమని పండితకోటి సంభావించుచున్నది.

## అల్లమరాజు రామకృష్ణకవి

అల్లమరాజు సుబ్రహ్మణ్యకవికి సపతీయన్నయగు అల్లమరాజు రామకృష్ణకవి కూడ మాడుగుల కృష్ణభూపతిని దర్శించి సత్కారము లందినవాఁడు. ఇతఁడు దక్షారామ భీమేశపదభక్తుఁడు. అచ్చతెలుఁగుభాగవత అధ్యాత్మ రామాయణ కవిచకోరచంద్రోదయ గౌతమీమాహాత్మ్య ద్రౌపదీపరిణయ మదాలసాపరిణయ వైనతేయవిజయ శంతనువిలాస సత్యభామావిలాస సుకవిజనమనోరంజన సుశోభాపరిణయ హనుమదాఖ్యానాది కావ్యనిర్మాత. రామకృష్ణీయ మన్నది యాంధ్రశబ్దచింతామణికి రామకృష్ణకవి సంతరించిన వ్యాఖ్యానము.

## మంత్రిప్రెగ్గడ సూర్యప్రకాశకవి

మాడుగులసంస్థానాస్థాన పండితకవులలో మంత్రిప్రెగ్గడ సూర్యప్రకాశకవి (1808–1873) ముఖ్యులు*. ఈయన ఆర్వేల నియోగి, హరితసగోత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు, సీతమా శరభనల పుత్రుఁడు. ఆఱాశ్వాసములు గల సీతారామచరిత మను ప్రబంధము, సుభద్రాపరిణయ పారిజాతాపహరణ కథలు రెండును జోడింపఁబడిన కృష్ణార్జున చరిత్ర మను ద్వ్యర్థికావ్యము, 'భీమలింగ కలుషవిభంగా' యను మకుటముగల నూఱు కందపద్యములు గల భీమలింగ శతకమును ఈ కవికృతులు.

* గిడుగు సీతాపతి, పంతులుగారి సమకాలికులు — యుగపురుషుఁడు వీరేశలింగం, శ్రీ కందుకూరి వీరేశలింగ స్మారకోత్సవసంచిక, పు. 177.

'చెలు వెసఁగ రాజసభలన్
బలుకని సరిపోరు బుధులు పాసిన యూరున్
గలిగియు లేని ధనంబదు
కలకంఠర భీమలింగ కలుషవిభంగా' ---భీమలింగశతకము.

కృష్ణభూపతిమీఁద ప్రకాశకవి చెప్పిన కొన్ని చాటువు లిట పరిశీలింపఁ దగినవి :

'కృష్ణభూపతి సంకాశం కృష్ణభూపతి సన్నిభమ్
కృష్ణభూపతి నీకాశం కృష్ణభూపతి సద్యశః'

కృష్ణభూపతి సద్యశః : మాడుగుల సంస్థానాధిపతేః శ్రీకృష్ణ భూపాలస్య కీర్తిః. కృష్ణభూపతి సద్యశము పాలకడలివలెను, సరస్వతివలెను, గంగానది వలెను ఉన్నదని నానార్థములనుబట్టి సమన్వయము. మఱియొక చాటువు :

'విక్రమేఽర్జునముఖాః కృష్ణభూపాల తే హితాః
విక్రమేఽర్జునముఖాః కృష్ణభూపాల తేఽహితాః

హే కృష్ణభూపాలా ! విక్రమమునందు పాండవమధ్యమాదులు నీకు హితులు. నీ ప్రతాపమువలని పరాభవ దైన్యముచేనైన ధవళవదనులు నీ అహితులు అని తాత్పర్యము.

ఇంకొక చాటువు :

'చేతులే గోతులే బాలే కాకులే వానముక్కులే
రుచిం పశ్యామి సుశ్యామే కచానాం తవ మంజులామ్'

చేతులే : హే లక్ష్మీసమానే, గోతులేచ : సరస్వతీసమానే, సుశ్యామే బాలే, తవ కచానాం : కుస్తలానామ్, మంజులామ్ : మనోహరామ్, రుచిమ్ : కాన్తిమ్. వానముక్కులే : వానముచః మేఘాః, తేషాం కులే : సముదాయే, కాకులేచ : వాయస కులేచ పశ్యామి. ఇందలి ప్రథమపాదమునందలి పదములు తెలుఁగుమాటలేమో యను భ్రాంతిని కలిగించుచున్నవి.

## పేరి సర్వేశ్వరశాస్త్రి

సర్వేశ్వరశాస్త్రిగారు మాడుగులసంస్థానాధీశ్వరుల ఆహ్వానముమీఁద మాడుగులపండితులుగా నుండిరి. సంస్థానాధీశ్వరు లిచ్చిన మాన్యములు పెద సందిపల్లి ముఠాలో నున్నందున శాస్త్రిగారు దేనాడ వసతిగా నుండిరి. శ్రీ శాస్త్రి గారి సంతతికి చెందినవారే పేరి వేంకటేశ్వరశాస్త్రిగారు.

## ఇంద్రగంటి గోపాలశాస్త్రి

ప్రసిద్ధ వ్యాకరణశాస్త్రవేత్తలగు ఇంద్రగంటి గోపాలశాస్త్రులు మాడుగుల ఆస్థానపండితులు. చిలుకూరి చతుష్టయములో మొదటి యిద్దఱయిన సోమనాథ

శాస్త్రి, పాపయ్యశాస్త్రి రాముడిని పూర్తిచేసిన తరువాత శ్రీ గోపాలశాస్త్రిగారి యొద్దనే వ్యాఖ్యానగ్రంథములను పఠించిరి.

'శ్రీ మాడుగుల కృష్ణభూపతి.... మొదలగు మహాప్రభువుల మార్గమునఁ బ్రస్తుతము పీఠికాపురాధీశ్వరులు విద్యాగౌరవమును నిలుపఁ బండితపరీక్ష లుంచి ప్రయత్నించుచున్నారు' అను ఆంధ్రవాఙ్మయచరిత్రకారుల ప్రస్తుతి కృష్ణభూపతిపట్ల ప్రత్యక్షరసత్యము*.

* వంగూరి సుబ్బారావు, ఆంధ్రవాఙ్మయచరిత్రము. ద్వితీయముద్రణము, పుటలు 110, 111.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. కందుకూరి వీరేశలింగముపంతులు, ఆంధ్రకవుల చరిత్రము, తృతీయభాగము, పుటలు 95—110, 312—315, 317—324.

2. కందుకూరి బాలసూర్యప్రసాదరావు, ఆంధ్రవిజ్ఞానము, సంపుటము 1, పు. 180; సంపుటము 5, పు. 2345; సంపుటము 6, పుటలు 3206—3208.

3. వంగూరి సుబ్బారావు, శతకకవుల చరిత్రము.

4. విశాఖపట్టణముజిల్లా వృత్తాంతసంగ్రహము, పుటలు 529—533.

5. అడిదము రామారావు, విస్మృత కళింగాంధ్రకవులు, 1940, పుటలు 46—53; 146—149.

6. కవికొండల వేంకటసత్యనారాయణమూర్తి, విశాఖమండలచరిత్రము, పుటలు 118, 119.

7. చాటుధారా చమత్కారసారము, అల్లమరాజు సుబ్రహ్మణ్యకవిసంకలితము, పుటలు 38, 39.

8. అడిదము రామారావు, అడిదము సూరకవిజీవితము, వావిళ్ళ, చెన్నపురి, 1955.

9. A. Vadivelu, The Aristocracy of Southern India, Vol. II, pp. 196–200.

# ముక్త్యాల

## ప్రవేశిక

ఇది కృష్ణామండలమునందలి ప్రాచీనమైన సంస్థానములలో నొకటి. నిన్న మొన్నటిదాఁక నిలిచిన వాసిరెడ్డివారి సంస్థాన మిది యొకటియే. ఈ వంశీయుల ఏలుబడిలోని తక్కిన సంస్థానములు నడుమంతరముగ నంతరించినవి. కృష్ణానదీతటమున వెలసిన ముక్త్యాల పట్టణ మీ సంస్థాన పాలకుల ముఖ్యనివాసము; ఇది జగ్గయ్యపేట కాఱుమైళ్ళ దూరము. ఈ సంస్థానమును 'చింతలపాటి వంతు' అని కూడ వ్యవహరించెడివారు. శాశ్వత పరిష్కార కాలము (క్రీ. శ. 1802) నాఁడు వాసిరెడ్డి వెంకటాద్రి నాయని యౌద్ధత్యము వలన నీ సంస్థానమును నాతని 'చింతపల్లి వంతు' ఎస్టేటుతో కూడ వెంకటాద్రి నాయని పేర నమోదయి యుండినది. వెంకటాద్రి నాయని మరణానంతర మాతని వారసులలో వ్యవహారదక్షత లోపించినందున చింతలపాటి వంతుతో కూడిన అమరావతి సంస్థానము జప్తు చేయఁబడి 1848 లో కుంఫిణీ స్వాధీన మయినది. ఆ తర్వాత భవానీముక్తీశ్వరప్రసాదబహద్దరుగారు వాస్తవవిషయములను కుంఫిణీవారికి నివేదించి 1863 లో సంస్థానమును పునఃప్రతిష్ఠ యొనర్చినవారు. 1904 నాఁటి అవిభాజ్యపు ఎస్టేటుల చట్టము ii నకు లోఁబడిన ఎస్టేటులలో నిది యొకటి. ఇం దిరువదిమూఁడు గ్రామము లుండినవి. ఆ నాఁటి పేష్కషు రూ. 17 వేలు; రాఁబడి రూ. 78 వేలు.

## సంస్థాన చరిత్రము

ఈ సంస్థాన పాలకులు 'వాసిరెడ్డి' యను నింటిపేరు గల కమ్మవారు; వల్లుట్ల గోత్రజులు. భూలోక దేవేంద్రుఁడను ప్రసిద్ధినొందిన వాసిరెడ్డి వెంకటాద్రి నాయని తాత తాతగారైన వాసిరెడ్డి రాఘవయ్యగారి కడగొట్టు తమ్ముఁడగు చంద్రమౌళిగారి సంతతికి చెందినవారు ముక్త్యాల సంస్థానాధీశ్వరులు.* వీరి మూలపురుషుఁడు అనవేమారెడ్డి కొలువులో నుండి వాసిగాంచి 'వాసిరెడ్డి' యను సార్థకబిరుదమునందిన సదాశివనాయఁడు. ఈ సదాశివనాయని పుత్రుఁడు గిరిమల్లికార్జుననాయఁడు.

ఇతని సంతతికి చెందిన చంద్రమౌళీశ్వరులు హైదరాబాదు నవాబు సుబాదారుని మెప్పించి నూతక్కి జాగీరును సంపాదించినవారు. ఈతని

* ఇతర వివరములకు చూ. ఈ గ్రంథమందలి అమరావతి సంస్థానచరిత్రము.

కుమారుఁడు 'లేరీతని పాటి జమీదారులని సుబాలు మెచ్చఁదగ వేమల కవ్వీరపనీఁడు ప్రభుత్వముఁ బ్రారూఢింజేసె ముస్తుఫాన్నగరెల్లన్' (ద్రౌపదీ పరిణయము, 1–67). ఈ వీరపనీని కుమారులు రాఘవయ్య, రామన్న, చంద్రమౌళి యనువారు ముప్వురు. వీరు ఢిల్లీ పురికేఁగి, పాదుషా షాజహాను దర్శనముచేసి, తమ విక్రమక్రియా రచనచే పాదుషాను మెప్పించి అతనిచేత నందిగామసీమ కెల్లను జమీదారీ, మిరాసి మన్నె, చౌదరి, రాజా బహద్దరు, దేశాయి, సర్దేశముఖి ముఖ్యలాంఛనములను పొందివచ్చి రాజ్యమును జేసిరఁట!

ఆ పిమ్మట హైదరాబాదు సుబాదారుని భేటీచేసి, ఫసలి 1080 లో సంస్థానపు పంపకములకు సన్నదులు సంపాదించి, ఎవరివంతునకు వచ్చిన రాజ్యభాగమును వారు పాలించుచు వచ్చిరి (పైది, 1–70).

వీరిలో మూఁడవవాఁడగు చంద్రమౌళి ముక్త్యాలతేండ్లకు మొదలిరాజు; చింతలపాటి నేత. ఇతని కుమారుడు రాఘవయ్య 1714 లో రాజ్యమునకు వచ్చెను. రాఘవయ్య ఔరంగజేబునుండి బహద్దరాది బిరుదాంకితాబులను బడసిన వాఁడు.* ఇతనికి రాజమౌళి, లక్ష్మీపతి యని ఇర్వురు కుమారులు. రాజమౌళి తన సంస్థానమునందు కాలువలను త్రవ్వించి వ్యవసాయాభివృద్ధికి తోడ్పడెను. వీరి కుమారులు చంద్రమౌళి. ఈయన భార్య నీరుకొండ పార్వతి. చంద్రమౌళి గారికి రామలింగన్న, వీరపనీఁడు అని యిద్దఱు పుత్రులు. రామలింగన్న (1745–1763) ముక్త్యాలదుర్గ నిర్మాత. చిఱుమామిళ్ళ వెంకటాంబ, పుతుంబాక పద్మాక్షి ఈయన భార్యలు. వీరపనీఁడు కొండపల్లి, కొండవీడు, వినుకొండ, బెల్లముకొండ, మేచురుసాల దుర్గములను జయించెనఁట (ద్రౌపదీ. 1–207). 1763 లో వీరపనీఁడు నిస్సంతుగా మరణించెను.

రామలింగన్నగారికి రాజమౌళి, లక్ష్మీపతి, రాఘవయ్య, చంద్రమౌళి, వెంకటాద్రి అని అయిదుగురు కుమారులు. జ్యేష్ఠుఁడురాజమౌళి 'యవన రాడ్దత్త రాజాబహద్దరాది రమ్య బిరుదాంకరింఛోళి....' (పైది. 1–219) యఁట! నాల్గవ కుమారుఁడగు చంద్రమౌళికి లక్ష్మీదేవివలన జన్మించినవాఁడు చినవెంకటాద్రి. ఈతని భార్య చిఱుమామిళ్ళ పాపమాంబ. ఈయనకు భవానీముక్తీశ్వరప్రసాదు, చంద్రమౌళీశ్వరప్రసాదు, సదాశివప్రసాదు అని ముగ్గురు కుమారులు. జ్యేష్ఠులగు భవానీముక్తీశ్వరప్రసాదబహద్దరువారు 1824 నుండి సంస్థాన పాలనమును స్వీకరించిరి. వీరి భార్య చిఱుమామిళ్ళ సౌభాగ్యవతి. వీరికి ఉమామహేశ్వరప్రసాదు, వెంకటాద్రి యని ఇద్దఱు కుమారులు.

రాజ్యపాలన మొనర్చిన ఉమామహేశ్వరప్రసాదు (1887–1901) గారికి పుత్రసంతతిలేదు. నలుగురు పుత్రికలు మాత్రముండిరి. అందువలన తమ్ముఁ

* A. Vadivelu, Vol. II, p. 261.

దగు వెంకటాద్రి కుమారుని చంద్రమౌళీశ్వరప్రసాదును దత్తు తీసికొనిరి. చంద్రమౌళీశ్వరప్రసాదుగారి భార్య చల్లపల్లి జమీందారు యార్లగడ్డ మల్లికార్జున ప్రసాదనాయఁడుబహద్దరుగారి తనయ యగు వేంకటదుర్గమాంబ. ఈమెకు సంతతి కలుగనందున శాకమూరివారి ఆఁడుఁబడుచగు కనకవల్లీదేవిని రెండవ భార్యగా స్వీకరించిరి. వీరికి రామగోపాలకృష్ణమహేశ్వరప్రసాదబహద్దరు గారను కుమారులు 1918 లో జన్మించిరి. వీరు చల్లపల్లి రాజా అంకినీఁడు ప్రసాదుబహద్దరుగారి తనయ రాజ్యలక్ష్మిగారిని పరిణయమాడిరి. ఈ దంపతుల కుమారులు చూడానంద రామగోపాలకృష్ణచంద్రకుమార ప్రసాదు.

పై చంద్రమౌళీశ్వరప్రసాదుగారి తమ్ములగు దుర్గానదాశివేశ్వరప్రసాదు గారు జయంతిపురము రాజావారు. 1937 లో శాసనసభా సభ్యులు, రచయితలు. చల్లపల్లి జమీందారు యార్లగడ్డ శివరామప్రసాదుగారు ఉమామహేశ్వరప్రసాదు గారి దౌహిత్రులు; ఉమామహేశ్వరప్రసాదుగారి పుత్రికయగు భవానీదేవిగారికి వీరు పుత్రులు.

## సాహిత్యపోషణము

ముక్త్యాలవారి కుదురునందు సాహిత్య పోషకుఁడగు మొదటిరాజు శ్రీ రాజా వాసిరెడ్డి చినవేంకటాద్రిప్రభువు (1787—1828). ఈయన ముక్త్యాల దుర్గ నిర్మాతయగు రామలింగన్న (1745—1763) గారి పౌత్రుఁడు.

## తాతంభట్టు గురుమూర్తిశాస్త్రి

వీరి ప్రేరణాదరణముల వలన తాతంభట్టు గురుమూర్తిశాస్త్రిగారు కృష్ణానదీ మాహాత్మ్యమను కావ్యమును రచియించి ముక్తీశ్వరపురమున వెలసిన భవానీముక్తీశ్వరస్వామివారి కంకిత మొసఁగిరి. ఈ విషయమునే ద్రౌపదీ పరిణయము 'భవ్యకృష్ణామహత్వంబను గ్రంథము గృతినందుకొనియె నే క్షితి వరుండు' (1–240) అని పేర్కొనినది. చినవేంకటాద్రి 'భక్తిమై స్కాంద మేఁబదిఖండము లఖండముగ గురుబోధవలన వినినవాఁ' డఁట! షట్కాల శివపూజాధురంధరుఁడఁట! కృష్ణానదీ మాహాత్మ్యము మూఁడాశ్వాసముల పద్యకావ్యము. కృష్ణానదీ మాహాత్మ్యమిందు ప్రతిపాదితము.

కృతిప్రేరకులు గురుమూర్తిశాస్త్రిగారికి చింతలపాడు గ్రామమున కుచ్చెల భూమి సీనాముగా నొసఁగిరఁట! ఈ భూమిని నేఁటికిని కవిసంతతి వా రనుభ వించు చున్నారఁట! కవి నందిగామ తాలూకాలోని ఏటూరి గ్రామనివాసి. ఇతని యితరకృతు లలభ్యములు. ముక్త్యాల రాజాగారి పుస్తకాలయమందున్న జీర్ణతాళ పత్రప్రతి యాధారముగా కృష్ణామాహాత్మ్యము ముక్త్యాలవారి స్వకీయ మాహిష్మతీ ముద్రాలయమున కృతిప్రేరకుల ప్రపౌత్రులగు రాజా శ్రీ వాసిరెడ్డి చంద్రమౌళీ శ్వరప్రసాదబహద్దరు వారిచే ప్రచురితము.

ఈ వనమెంకటాద్రికి చిలుకమర్తి వెంకయామాత్యుని పౌత్రులగు పుత్రులలో జ్యేష్ఠులు భవానీ ముక్తీశ్వరప్రసాదరాయుఁడు ఉన్నారు. వీరు కొప్పరాజు సుబ్బరాయకవికృతమగు రాంబీమాహాత్మ్యమును కృతినందిరి; అట్లే వాడి రామయకవి (1840-1918) కృతమగు ద్రౌపదీవస్త్రాపహరణమునకు[1] ప్రేరకులు. భవానీముక్తీశ్వరప్రసాదరాయుఁడు నియోగి బ్రాహ్మణకులోత్తంసులగు వీరేశ్వరశాస్త్రిచే పంచాక్షరీ మంత్రోపదేశమును పొందినాఁడు. 'సాహితీగీతాది సత్కళాభూషణులకెల్ల ముంగాపు యీ ప్రభుమణి' యని కవుల కైవారమును గాంచినవాడు. 'అహరహాదితోషిత ప్రతోషిత స్వగృహ పండితజన మండలుఁ' డీయన.

## కొప్పరాజు సుబ్బరాయకవి

కొప్పరాజు గృహనామముగల కవి పండిత కుటుంబములు సత్తెనపల్లి తాలూకాలో నేఁటికిని వర్ధిల్లుచున్నవి. 'త్రికూటాచల మాహాత్మ్య'[2] మను నవాశ్వాసములుగల క్షేత్రమాహాత్మ్యమును రచించిన నరసింహకవి (1820-1870) యొకఁడు కొప్పరాజు గృహనామముఁడుగాఁ గన్పట్టుచున్నాఁడు. ప్రదోషవ్రత మహాత్మ్యము, పుష్పరదోచిత స్తవము, మల్హణసూక్తి సంగ్రహము, సూతసంహితా కవికృత్యంతరములు. సత్తెనపల్లి తాలూకాలోని కోసూరు కవి నివాసగ్రామము. కొప్పరాజు అను ప్రఖ్యాత పురుషుని పేర తమ వంశనామము ప్రసిద్ధమయినదని కవి కృత్యవతరణికలోఁ జెప్పికొనినాఁడు. కొప్పరాజువారాత్రేయ గోత్రజులు. నరసింహకవి పితామహుఁడగు అనంతామాత్యుఁడు ....

'కణభుగ్వాగ్విభవంబుఁ గొల్లగొని సాంఖ్యదక్షపాదోక్తి లక్షణ మెల్లన్ దననామ్ముఁజేసికొని వ్యాసప్రోక్త భాషాంతరన్
గణనప్రాప్త సమస్త వర్ణచయముల్ గాఁ గల్గి వర్తించి....' (త్రికూటా. 1-45) న వాఁడఁట; కవి పెదతాతయగు వీరయామాత్యుఁడు ...
'రాజశ్రీ మలరాజ సూరధరణీరాట్చంద్రు రాజ్యంబు ని
ర్వ్యాజ ప్రక్రియఁ జక్కఁ జేయుచుఁ దదీయామేయసమ్యక్కృపా
రాజద్భాగ్యరమా విలాసములచే....' (పైది 1-40) రంజిల్లినవాఁడు. కవి తండ్రియగు లింగనమంత్రి — —

'వేదశాస్త్ర పురాణ వివిధాగమస్మృతి
కవితాద్యలంకార కావ్యవేది....

[1] ద్రౌపదీవస్త్రాపహరణము పదవేలు, ద్వి. భా. పు. 270; శ్రీరాం వీరబ్రహ్మకవి. నానారాజన్యచరిత్రము, పు. 77.

[2] శ్రీమత్త్రికూటాచలమాహాత్మ్యము, పరిష్కర్త: భాగవతుల వేంకటసుబ్బారావు, అజంతాప్రింటర్సు, సికిందరాబాదు, 1959.

సకలరాజన్యసంసన్మధ్యసంచారి
విద్వజ్జనానీక వినుతకీర్తి....'. —పైది 1—52

ఈ లింగనయే - ...

'తమ్ములిరువురు నుభయ పార్శ్వమ్ములందు
వాసు దక్షిణ భుజములవలె భజింప
నొప్పు రాజన్యసభలఁ దా నుచితలీలఁ
గావ్యరచనాచమత్కృతుల్ గనినవాఁడు' —పైది 1—53

'రసములొలుకఁ విద్వన్మనోరంజనాఖ్య
మయిన కృతిచెప్పి వీరభద్రాంకితంబుఁ
జేసె, శంభు స్తవంబులుఁ జేసెపెక్కు
శివగణాగ్ర్యుండు లింగనకవివరుండు' —పైది, 1—54.

ఈ లింగనకవిసోదరులు శేషనరసింహాఖ్యులు. త్రికూటాచల మాహాత్మ్య కర్త యగు నరసింహకవి కుమారుఁడు సుబ్బయశాస్త్రి (1850—1890). ఈ సుబ్బయ శాస్త్రియే కాంచీ మాహాత్మ్యకర్తయగు సుబ్బరాయకవి యగునో కాదో నిర్ధారింప నవుపడినదికాదు.

## అమరవాది రామకవి

'భారత నందనాంతరమునందు కల్పవల్లీమచర్చిక' యఁట ద్రౌపదీపరిణయశ్రీవార్త. దానిని దివ్యకృతిగా సంఘటింపుమని కృతిప్రేరకుఁడు — వట్టి కర్పూర తాంబూల జాంబూనదాంబరాభరణాదులు కాక — యుర్వరాప్రదానంబు గావించి అమరవాది రామకవిని కోరినాఁడు. ఈ యంశము రామయకవి కృత్యంతరమగు వాసిరెడ్డీయమునందును —

'అల ద్రౌపదీ పరిణయము
వెలయ మదుక్తకృతి నొంది స్వీయంబగు చిం
తలపాటి గ్రామమునఁ గు
చ్చల మాన్యము నా కతండొసఁగె బహుమతిగాన్'

అని స్మరింపఁబడినది.

కవి హారితసగోత్రుఁడు ; పేరేశ్వరసూరి పుత్రుఁడు. కవి తాతతాత తండ్రి గంగాధరాధ్వరి ; కాశీపండిత సమ్మానితుఁడు. తాతతాత గణేశ్వరదీక్షితులు వరకళానిధి. తాతతండ్రి యజ్ఞన్నశాస్త్రి సాతారరాట్కృతార్చనుఁడు. తాత రాజశేఖరసోమయాజి వాసిరెడ్డివారి యాస్థానకవి. సత్తెనపల్లి తాలూకాలోని బాలేముట్లు అగ్రహారము రామయకవి యభిజనము. ద్రౌపదీపరిణయము 8 ఆశ్వాసముల ప్రబంధము. కృతిప్రేరక రాజవంశావతారము కృత్యవతారికలో

232 పద్యములలో విపులముగా వర్ణింపఁబడినది*. కావ్యభాగమునుండి మచ్చు నకుఁ గొన్నిపద్యములు —

'పూర్వజుకన్న మున్న విరిబోఁడి పరించుట నీతిగాదఁటం
చోర్వక నిన్ను బిట్టలుక నుల్లసమాడితిగాని కామినీ!
పార్వణచంద్రమండలనిభంబగు నీ నగుమోముఁ జుప్పలి
ద్గర్వము మాన్చు నీ కబరిగాంచినవానికి మోహముబ్బదే' —6–368

'చతురంభోధిపరీత భూభవనరక్షాదక్షులం దోర్మహ
శ్శతపత్రాతవిధూతశార్వరుల రాజశ్రేష్ఠులన్ వీరి స
మ్మతి జామాతలగా వరించె ద్రుపదక్ష్మాభర్త శర్యంబె నా
కృతికైనన్ గణుతింపఁ బార్షతుని భాగ్యంబంచు నయ్యంగనల్' —8–324

## ఆతుకూరి పాపకవి

లలితాంబోపాఖ్యానము 8 ఆశ్వాసములుగల కావ్యము ఆతుకూరి పాప యామాత్య ప్రణీతము. ధాన్యవాటి అమరేశ్వరస్వామి కంకితము. దేవీ భాగవతము నాంధ్రీకరించిన ములుగు పాపయారాధ్యులీ కవికి శిష్యుఁడను వదంతికలదు కావున కవి పదునెనిమిదవ శతాబ్ద్యంతమున నున్నట్లూహింప వచ్చు. ఈ యుపాఖ్యానము బ్రహ్మాండపురాణములోనిది. సత్యజ్ఞానానంద మయుఁడగు హయగ్రీవుఁడు ధర్మజిజ్ఞాసాపరాయణుఁడగు అగస్త్యమహా మునికిఁ జెప్పిన కథయిది. దక్షయాగము మొదలుగా తారకాసురదమనము దాఁకఁ గల కథ యిందు విస్తృతము. ముక్త్యాల సంస్థానములోని శ్రీ లక్ష్మీనర సింహక్షేత్రమగు వేదాద్రికి సమీపమునఁగల కాంచేనిపల్లి అగ్రహారములో నీ కవికి వాసిరెడ్డివారిచ్చిన మాన్యము లుండెనని తెలియుచున్నది. ముక్త్యాల రాజా చంద్రమౌళీశ్వర ప్రసాదుబహద్దరువారిచే మాహిష్మతీ ముద్రణాలయమున నిది ముద్రితము.

## శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

భవానీముక్తీశ్వరప్రసాదబహద్దరుగారి పౌత్రులగు చంద్రమౌళీశ్వర ప్రసాదుగారు అనేకగ్రంథములను గృతినందిరి. కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణ మూర్తిశాస్త్రి రచితమగు వేదాద్రిమాహాత్మ్యము శ్రీ చంద్రమౌళీశ్వరప్రసాద బహద్దరుగారికంకితము. ఇందలి కథ కేవలము కల్పితము కాదఁట! బ్రహ్మాండ పురాణమునఁగల బీజప్రాయములైన సూచనలను బురస్కరించికొని కృతిభర్త పితామహులగు భవానీముక్తీశ్వరప్రసాదుగారు వ్రాయించి ప్రకటించిన ఒక

*'ఘనవాక్ప్రౌఢిమ ద్రౌపదీపరిణయ గ్రంథాది మా వంశ వర్ణనముం జేసితివంచు వింటి....' — వాసిరెడ్డీయ కృత్యవతారిక.

చిన్నకృతి యాధారముగా కవిసార్వభౌములు దీనిని రచించిరి. అయిదాశ్వాసములుగల క్షేత్రమాహాత్మ్యమిది.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి శ్రీ కృష్ణభారతముగూడ రాజా శ్రీ చంద్రమౌళీశ్వరబహద్దరుగారి కంకితము. కృతిభర్తప్రేరణమున శ్రీపాదవారు సుమారు ఇరువదివేల గద్యపద్యములుగల శ్రీకృష్ణభారతము నాంధ్రీకరించిరి. వ్యాసభారతమున కిది యథామూలానువాదము. ఈ యాంధ్రీకరణ సందర్భమునందు ముక్త్యాల ప్రభువులు శ్రీపాదవారికి నెలకు నూటపదునారు రూపికల చొప్పున పండ్రెండేండ్లపాటు పంపించిరఁట.* శ్రీ శాస్త్రిగారి తనయుల వివాహములకయిన వ్యయమును సయితము శ్రీరాజావారే భరించిరఁట! కృష్ణమూర్తి శాస్త్రిగారిని ముక్త్యాల ప్రభువు చంద్రమౌళీశ్వరప్రసాదబహద్దరుగారు 'తన యాస్థానకవీంద్రమాత్రునిగఁ జిత్తంబందుఁ జర్చింప కిష్టునిగా, మిత్రునిగా, గురూత్తమునిగాఁ, జుట్టంబుగా నెంచుచు' గౌరవించుచుండెడివారఁట!

'అడిగినదానికన్న నధికార్థములర్థులకిచ్చు, నోటితో
నుడివినదానికన్నఁ గడు నూల్కొనిచేయును, జెన్నుమీఱ నె
య్యెడ దురితంబులం బలుకఁ, డిప్పటిరాజమహేంద్రుఁడెన్న మా
యెడయఁడు భారతప్రియుఁ డహోయని యెంచెద భాగధేయమున్'

అని కృష్ణభారతపీఠికలో కృతికర్త కృతిభర్తను ప్రశంసించిరి.

శ్రీపాదవారి మఱియొకకృతి యగు విజయవిలాస కృతి విమర్శనము చంద్రమౌళీశ్వరప్రసాదు బహద్దరుగారికే యంకితము. ఇది చేమకూర వేంకట కవి విజయవిలాసమును గూర్చిన విమర్శనగ్రంథము. వేంకటకవి కృతితో కూచిమంచి జగ్గకవి కృతమగు సుభద్రాపరిణయ కావ్యమును పోల్చి తారతమ్య వివేచనము చేయఁబడిన రచనమిది.

## పిశుపాటి చిదంబరశాస్త్రి

1922 లో ముక్త్యాలజమీందారుల సన్నిధిని శతావధాని పిశుపాటి చిదంబరశాస్త్రి గారు ఆశుకవితాప్రదర్శనమును సలిపి 'కపోతకిరాతకథ' ను శతపద్యపరిమితిగా నిర్మించి సమ్మానమునందిరి.

## చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి

వీరు ముక్త్యాలరాజాగారిని దర్శించి చెప్పిన పద్యములు అభినవభోజులును, అర్థిజనకల్పభూజులునునగు ముక్త్యాలరాజుల శుభ్రకీర్తికి చక్కని తార్కాణములు.

'గోదాతీరమునందు భారతము దిఙ్నాలంకషోద్యద్యశః
ప్రాదుర్భావుఁడు రాజరాజు తెనిఁగింపంజేసెఁ గృష్ణానదీ

*కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి స్వీయచరిత్రము, ఆంధ్ర సర్వస్వ పత్రిక, సంపాదకుఁడు: ఏడిద వేంకటరావు, 1924, సంచిక 6, పుటలు 238–240.

భూదారుండవు నీవు నట్టిపనికే భూయఃప్రయత్నమ్ము నా
పాదింపంగలవాఁడవై యశము సంపాదించితో భూపతీ!'
—నానారాజ. పు. 241.

'ములుగు పాపయారాధ్యులు మున్ను దేవి
భాగవతమును మీ వంశపార్థివుల స
మక్షమందె తెలింగించె నంతకన్న
వేయిరెట్లు భారతకృతి విభుత మిన్న' —పైది.

'నా తోఁబుట్టువు భారతంపుఁ గృతికిన్ నాథుండ వీవౌటచే
నీతోఁ జుట్టఱికంబు....' (పైది. పు. 242) తనకొదవినదని వేంకట
శాస్త్రిగారు రాజాగారితో చమత్కరించిరి[1].

'చనుటకు శక్తి చాలమి వెసన్ గరపత్రము లంపినంతనే
ధనమిడు ఱేఁడులున్ గల రుదారులు కొందఱు నాకు; వారిలో
ఘనుఁ డల వాసిరెడ్డి కులకాంతుఁడు శ్రీ శశిమౌళి యొక్కఁడై
నను నటుఁవ్రాసిపుచ్చుటకు నా మది సిగ్గిలు....' అని చెళ్ళపిళ్ళవారు మఱి
యొక సందర్భమున చంద్రమౌళీశ్వరుల వదాన్యతను బ్రస్తుతించిరి.

## విశ్వనాథ సత్యనారాయణ

కళాప్రపూర్ణ విశ్వనాథ సత్యనారాయణగారి రామాయణ కల్పవృక్షమునకు కృతిశ్రోత చంద్రమౌళీశ్వరప్రసాదు బహద్దరుగారు '...ముక్తినేల యవని పాలుఁడు చంద్రమౌళి నృపతి వినిన లీలగాను' ఈ గ్రంథము రచింపఁబడినది. 'సత్యకవి వక్త ముక్త్యాలస్వామి శ్రోత', '....ముక్త్యాల చంద్రమౌళీశ్వరుండు దీనివిని యేమి ఫలము సాధించుటకును గోరె నది సమకూర్పుము స్వామి' యని కృతికర్త పేర్కొని నాఁడు[2].

## ప్రాచీనగ్రంథ ప్రచురణము

కటికినేని రామయకవి కృతమగు బ్రహ్మానంద చంద్రిక యను తత్త్వ గ్రంథమును, మాధవ పండిత కృతమగు కూటముద్గరమను ఆయుర్వేద వైద్య గ్రంథమును, మిట్టపల్లి సీతారామచంద్రసూరి కవి రచితమగు కాల నిర్ణయ చంద్రిక యను జ్యోతిష గ్రంథమును, భోజకృతికి అప్పనమంత్రి చేసిన ఆంధ్రానువాదము 'చారుచర్య' యను గ్రంథమును, అమరవాది రామయకవి కృతమగు ద్రౌపదీ పరిణయమును, తాతంభట్టు గురుమూర్తిశాస్త్రి ప్రణీతమగు కృష్ణామాహాత్మ్యమును, కొప్పరాజు సుబ్బరాయకవికృతమగు కాంచీపుర మాహా

1 చెళ్ళపిళ్ళ, నా ముక్త్యాల ప్రయాణము, కృష్ణాపత్రిక, 1935, నవంబరు, 30.
2 చూ. పండిత కొత్త సత్యనారాయణచౌదరిగారి కల్పవృక్ష విమర్శనము.

త్మ్యమును, చర్ల వేంకటశాస్త్రి రచిత వేంకటాద్రి గుణరత్నావళియను నలంకార గ్రంథమును, ఆతుకూరి పాపయామాత్యప్రణీతమగు లలితాంబోపాఖ్యానమును, మల్లమపల్లి బుచ్చికవి కృతమగు హాలాస్యమాహాత్మ్యమను ఆఱాశ్వాసముల ప్రబంధమును, కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి కృతమగు విజయవిలాస కృతివిమర్శనము, వేటూరి ప్రభాకరశాస్త్రి రచితమగు నీతినిధి, విశ్వనాథ సత్యనారాయణరచితమగు రామాయాణ కల్పవృక్షము మొదలగు ప్రాచీనార్వాచీన సంస్కృతాంధ్ర గ్రంథములను ముద్రింపించిన ఘనత చంద్రమౌళీశ్వర ప్రసాదుబహద్దరుగారిది.

చంద్రమౌళీశ్వరప్రసాదబహద్దరుగారి విద్యాభిమానము, లలితకళాభిరుచి, దేశహితైకచింత ప్రశంసకు పాత్రములు. అనేక తాళపత్ర గ్రంథములను సేకరించి ముద్రణాలయము నొకదానిని స్థాపించి మంచి పండితులచే అముద్రిత కృతులను పరిష్కరింపించి చక్కని ముద్రణములను ప్రచురింపించిరి. మీఁద పేర్కొనిన ప్రాచీన గ్రంథములు కాక ఉద్భటారాధ్య చరిత్రము, నాచికేతూపాఖ్యానము మొదలగు గ్రంథములు వీరి మాహిష్మతీ ముద్రాక్షరశాలలో ముద్రితములు. వీరు ప్రశస్తమైన ఆయుర్వేద ఔషధాలయమును స్థాపించి, ఆయుర్వేద వైద్యములో శాస్త్రీయ పరిశోధనలను ప్రోత్సహించిరి*. ఆయుర్వేదాచార్య ఆచంట లక్ష్మీపతిగారి 'ఆయుర్వేద దర్శనము'ను ప్రకటింపఁజేసిరి.

'సంగీతరత్న' బిరుదాంకితులు పిరాట్ల శంకరశాస్త్రిగారు ముక్త్యాలసంస్థానాస్థాన సంగీతవిద్వాంసులు. వీరు త్యాగరాయ ప్రశిష్యులగు తిరువత్తూరు నాగయ్యగారి శిష్యులు. సాహిత్యమునందును ప్రవేశము గలవారు. అనేక కీర్తనలు, వర్ణములు రచించుటయేగాక శంకరశతక మను కృతినిగూడ రచించినవారు. ఆంధ్ర రవివర్మ బిరుదవిరాజితులును, ఆత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజులుగారి పుత్రులును నగు ఆత్మూరి రామమోహనరావుగారిని ముక్త్యాల సంస్థానాధీశులు పోషించిరి. వీరిచేత భారతకథయందలి ముఖ్యఘట్టములకు చిత్రములు వ్రాయించి, వానిని చేర్చి శ్రీకృష్ణభారతమును సచిత్రముగా ముద్రింపించిరి.

## జయంతిపురము రాజా దుర్గాసదాశివప్రసాదుబహద్దరు

చంద్రమౌళీశ్వరప్రసాదబహద్దరుగారి సోదరులు సదాశివప్రసాదు, దుర్గాసదాశివప్రసాదు, గౌరీపర్వతమహదేవతాటూరులు కూడ సరస సాహిత్యాభిరుచి గల వారు. జయంతి పురము రాజాగారగు దుర్గాసదాశివప్రసాదు 'నృత్యుత్సాహ ప్రాపిత గైర్వాణ్యాంధ్రీశ్రీపారుఁడు'. 1924 నుండి విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలికార్యవర్గసభ్యులు. వీరుబౌద్ధులకు పరమప్రమాణములనఁదగిన త్రిపిట

* ఆంధ్రపత్రిక, సంవత్సరాదిసంచిక, వృష, 1941, పు. 154.

కముల సారమును 'ధమ్మపదము' ను ఆంధ్రీకరించిరి. ఆంధ్రీకర్తలయిన దుర్గా సదాశివేశ్వర ప్రసాదబహద్దరుగారు సంస్కృత ప్రాకృతాంధ్రాంగ్లముల యందే కాక పాలీ, హిందీ, కర్ణాటక భాషలలో నుంచి పరిచయముగలవారు. ధమ్మ పదమునకు 'బుద్ధగీత' యని నామాంతరము. ఆర్షమతానుయాయులకు భగ వద్గీతవలె బౌద్ధమతానుసారులకిది పవిత్రమును, పరమప్రమాణమును. ఇది ఇరువదియారు సర్గల గ్రంథము. ఇందలిభాష ప్రాకృతము. మూలముతోపాటు ఆంధ్రానువాదమును ముద్రితము. కొంతకాలము వీరు 'సరస్వతి' యను సాహిత్య పత్రికను సంపాదకులుగా నిర్వహించిరి.

దుర్గాసదాశివేశ్వర ప్రసాదుబహద్దరుగారు నేఁటికిని సాహిత్యమునకును, ఆయుర్వేదమునకును సంబంధించిన రచనలు చేయుచుండుట ముదావహము. 'ఆ నాటి విద్యావినోదాలు', 'ఏది ప్రాచీనము — రామాయణమా, భారతమా?', 'సంస్కృతము మృతభాష అనడము మృష' — మొదలగు సాహిత్యవ్యాసములు, ప్రయోగమాల, ప్రసాదనయోగాలు, అందానికి ఆరోగ్యానికి — మొదలగు ఆయుర్వేద సంబంధిరచనలు వీరి ఇటీవలి రచనలు,

## రాజా రామగోపాలకృష్ణమహేశ్వరప్రసాదు

చంద్రమౌళీశ్వరప్రసాదబహద్దరుగారి కుమారులు రాజా శ్రీ రామ గోపాలకృష్ణమహేశ్వరప్రసాదబహద్దరుగారు. వీరు చంద్రమౌళిగారి రెండవ భార్య పుత్రులు. చల్లపల్లిరాజా అంకినీడు ప్రసాదు (1877–1927) గారికి వీరు అల్లురు. చంద్రమౌళీశ్వరవరప్రసాద ధాత్రీపతి శ్రోతగా ముక్త్యాలవేఁడుల ప్రాపునఁ బెరిగిన కల్పవృక్షమును ప్రకటించినవారు వీరు. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు రచించిన 'నీతినిధి'* యను కావ్యము యువరాజాగా నున్న రోజులలో వీరి కంకిత మొనఁగఁబడినది. 'Economy of Human Life' అను ఆంగ్ల గ్రంథమున కిది యనువాదము.

'వంశదీపకుఁడైన నీ వలన నింక
కులమునకు నెంత విఖ్యాతి కలుగవలెనొ
వృద్ధినందుమా యవి యెల్ల వెల్లడింప
మహితతేజ! ముక్త్యాల కుమారరాజ' అని శాస్త్రిగారి దీవెన.

1949 లో వీరి ప్రోత్సాహముతో వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ముక్త్యాల పరిసరముల లభించు ప్రాచీన శిథిల శిలాశిల్పఖండములను, తదితర పురావృత్త విషయక సామగ్రిని ప్రోవుచేసి ముక్త్యాలగ్రామమున నొక ప్రదర్శనశాల నేర్పఱుచు నిమిత్తము సంస్థానమునందంతటను పర్యటించి, పరిశీలనము సాఁగించి, ఇక్ష్వాకులు మొదలుగా కాకతీయులవరకుఁ గల శిలాశిల్పములు,

* ఆంధ్రపత్రికా కార్యాలయము, చెన్నపురి, 1926.

శాసనములు మున్నగునవి సేకరించియుండిరి. ప్రభాకరశాస్త్రిగారు పరమపదించుటతో ఈ ఉద్యమము కొంత వెనుకపడినది. ఆ పిమ్మట రాజాగారి పూనికతో దీనికి పునఃప్రవృత్తి కలుగఁగా వేటూరి శంకరశాస్త్రిగారు 'భోగాల పోటిదిబ్బ'ను త్రవ్వించి పురావస్తు శకలము లనేకము సేకరించి భద్రపఱిచిరి*.

ఇటీవల చల్లపల్లిరాజా శివరామప్రసాదుగారి షష్టిపూర్త్యుత్సవ సందర్భమున లక్ష్మీపురమున జరిగిన కవిసమ్మేళనమునందు ముక్త్యాలరాజా రామగోపాలకృష్ణ మహేశ్వరప్రసాదబహద్దరుగారు పాల్గొని స్వాగతోపన్యాస మొసఁగి తమసాహిత్యాభిరుచిని ప్రకటించిరి.

* వేటూరి శంకరశాస్త్రి, ముక్త్యాల పరిసరాలు : బౌద్ధ స్తూపారామ శిథిలాలు, పరిశోధన, 1955, మార్చి, పుటలు 1–18.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. వాసిరెడ్డి వెంకటసుబ్బదాసు, వాసిరెడ్డివారి వంశచరిత్రము.
2. శ్రీరాం వీరబ్రహ్మకవి, నానారాజన్యచరిత్రము, పుటలు 46–82.
3. దరువూరి వీరయ్య, గుంటూరుమండల సర్వస్వం, వాసిరెడ్డివారి వంశచరిత్ర, పుటలు 121–130.
4. కొత్త భావయ్యచౌదరి, కమ్మవారి చరిత్రము, పుటలు 262–268.
5. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, కథలు - గాథలు, సంపుటము 2, పుటలు 60–89.
6. తిరుపతివేంకటకవులు, నానారాజ సందర్శనము, పుటలు 240–243.
7. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, శ్రీకృష్ణ స్వీయచరిత్రము, రాజమండ్రి, 1959.
8. అనంతపంతుల రామలింగస్వామి, శ్రీకృష్ణకవి జీవితచరిత్రము, మలి కూర్పు, 1965.
9. అయ్యదేవర కాళేశ్వరరావు, నా జీవితకథ — నవ్యాంధ్రము, విక్టరీ ప్రెస్, విజయవాడ, 1959.
10. A. Vadivelu, The Aristocracy of Southern India, Vol. II, pp. 257–274.

# ముత్యాలపాడు (పెదపవని)

## ప్రవేశిక

ఇది నెల్లూరు మండలము కావలి, కందుకూరు తాలూకాలలోనిది. ప్రాచీన సంస్థానములలో నొకటి. పెదపవని యనియు దీని నామాంతరము. పేష్కషు రూ. 2,000 లు. పెదపవని రాజనివాసము. ఆర్కాటు నవాబు మద్దత్తుగల కాళహస్తి జమీందారులు 1738 ప్రాంతముల ఈ సంస్థానమునందలి కొమ్మి మొదలైన సమీప గ్రామములను ఆక్రమించి కాళహస్తి జమీకి చెందిన పామూరు తాలూకాలో చేర్చికొనిరి.

## సంస్థాన చరిత్రము

ఈ సంస్థాన పాలకుల మూల పురుషుఁడైన చిన్నని నరసారాయనింగారు హైదరాబాద్ సుబాలోని ఆమలూరు, గూడె మను గ్రామములను స్వాధీనపఱిచి కొని నవాబునకు సామంతుఁడై యుండెనఁట! ఇతని కుమారుఁడైన లక్ష్మీ కాంతరాయనింగారు నవాబు మీఁద తిరుగుబాటుచేసిన జాగీరుదారుల నోడించి, వారిని బాడుదలవట్టి తెచ్చి నవాబునుండి 'భూపాలరాయ ఖాలేరావు' బిరుదును, వెలిగందల, హనుమకొండ జాగీరులను సంపాదించెనఁట! వీరి కుమారుఁడు నరసింగ భూపాలఖాలే రావు. ఈయన తనయుఁడు ధర్మభూపాల ఖాలే రాయ నింగారు. ఈ ధర్మభూపాల ఖాలే రాయనింగారు ముత్యాలపాటి సంస్థానాధి పతులకు కూటస్థుఁడఁట!

ఔరంగజేబు సేనాని యగు జుల్ఫికార్ ఖాన్ దక్షిణ హిందూదేశములోని కల్లోలముల నణఁచుటకు వచ్చినపుడు వాని సేనలో దండనాయకుఁడుగా ధర్మ భూపాల ఖాలే రాయనింగారు వర్తించినట్లు స్థానిక చరిత్రలు తెలుపుచున్నవఁట! ఈ సందర్భమునందు ధర్మ భూపాల ఖాలే రాయనింగారు ప్రదర్శించిన సాహ సమునకును, స్వామి భక్తికిని నవాబు సంతోషించి గండికోట తాలూకాను జాగీరుగా ప్రసాదించెనఁట! ఆ పిమ్మట ధర్మ భూపాల ఖాలే రాయనింగారు చంద్రగిరి, చిత్తూరు తాలూకాలను దీసికొని అచట నవాబు పక్షమున ఫౌజు దారుగా నుండెనఁట! ఆ పిమ్మట నెల్లూరి మండలములోని రాపూరి జాగీరులోని అనేక గ్రామములకు 'దేశముఖి ఫర్మానా' ను సంపాదించి ప్రాముఖ్యమునకు వచ్చిరి.

ఈయన కుమారుఁడు వెంకట కృష్ణ భూపాల ఖాలే రాయనింగారు.

వీరు హైదరాబాదు నవాబులనుండి కంభము, ఉదయగిరి సీమలకు దేశముఖి సన్నదును సంపాదించిరి. వీరికి సంతతి లేనందున సమీపజ్ఞాతులలోని యొక చిన్నవానిని దత్తు తీసికొని పెంచి పెద్దచేసి రామచంద్ర భూపాల ఖాలే రాయనిం గారను పేరుపెట్టి సంస్థానాధిపత్యము నప్పగించిరి. ఈ దత్తతను నవాబు ప్రతినిధి యగు నెల్లూరు ఫౌజుదారు గుర్తించి క్రొత్తగా సన్నదులను జారీ చేయించెను. రామచంద్ర భూపాల ఖాలే రాయనింగారికి సంతతి లేనందున అతని సోదరుఁడు వేంకటరాయ భూపాల ఖాలే రావు ఆ తరువాత పాలకుఁడుగా నియమితుఁడయినాఁడు. ఇతని పెద్ద కుమారుఁడు నరసింగ భూపాల ఖాలే రాయనింగారు. నరసింహుఁడు మరణించు నాఁటికి కొడుకులు మైనరులగుటచే నరసింహుని సోదరుఁడగు వేంకట కృష్ణ భూపాల ఖాలే రాయనింగారు తన పేర సన్నదు వ్రాయించికొనిరి, ఇతని తరువాత నీతని పెద్ద కొడుకు వెంకట రాయ భూపాల ఖాలే రాయనింగారు జమీకి వచ్చిరి. ఇతని కాలమునందే ఇంగ్లీషు కుంఫిణీవారికిని సంస్థానమునకును సరాసరి సంబంధము లేర్పడినవి. పదియవ తరము జమీందారు 1813 లో నిస్సంతుగా మరణించుట చేత నతని భార్య రామచంద్ర భూపాల ఖాలే రాయనింగారిని దత్తు తెచ్చిరి. ఇతఁడు బహుకాలము సంస్థానమును పాలించి, 'రాజా' బిరుదమునంది 1860 లో మరణించెను. ఈయన పెద్దకుమారులు రాజా వేంకటనరసింగభూపాల ఖాలేరాయనింగారు సంస్థానపాలకులలో పండ్రెండవతరమువారు.

ఈ కోవలోని శ్రీ రాజా సీతారామచంద్ర శ్రీరంగ భూపాల ఖాలే రాయనింగారు 1911 లో జమీందారులైరి. కిర్లమపూడి జమీందారులైన శ్రీ రాజా ఇనుగంటి వెంకట రాజగోపాల బుచ్చితమ్మయ్యగారి తనయను వీరు పరిణయమాడిరి. వీరి కుమారులు వేంకట సత్యనారాయణ భూపాల ఖాలే రావు. వీరు వెంకటగిరి రాజా గోవిందకృష్ణయాచేంద్రుల అల్లురు; నేఁటి వెంకటగిరి జమీందారుల బావమఱఁదులు. వీరే పెదపవని చివరి జమీందారులు.

## సాహిత్యపోషణము

ఈ సంస్థానాధీశుల యాస్థానములో నాది నుండియు మతుకుమల్లి వంశము వారు దివానులుగా, పండితులుగా వంశపరంపరగా నుండెడివారు. వీరిలో మతుకుమల్లి వెంగళప్పగారు ముఖ్యులు. ఇతని కుమారుఁడు మాదయా మాత్యుఁడు. ఇతనికి 'చతుష్షష్టి కళల మాదయ మంత్రి' యను వ్యవహార నామముండినదఁట ! ఈయనయును ఖాలే రాయనింగారి యాస్థానములో దివా నుగా నుండిరఁట !

మతుకుమల్లివారు కాశ్యప గోత్రులు, ఆపస్తంబ సూత్రులు, మాల్యాద్రి నృసింహస్వామిభక్తులు. చతుష్షష్టికళల మాదయామాత్యుని జ్యేష్ఠకుమారుఁడు

కృష్ణయ్య. ఈ కృష్ణయ్య ప్రపౌత్రుఁడగు మాధవ మంత్రి అభినవ భారతగ్రంథ కర్త. ఇది అనంతభట్టకవి విరచితమగు సంస్కృత చంపూ భారతమునను సరించి విస్తృతముగను, కవిత్రయ రచితాంధ్ర భారతమును బట్టి సంగ్రహరూపముగను విరచితమైనది. ఈ కావ్యము హరిహర హిరణ్యగర్భైకాత్మకుడగు రమా వైరాముపతి వాగ్యువతీరామునకు త్రిమూర్తిస్వరూపునకు అంకితము. నెల్లూరిసీమ వాఁడే యయిన తిక్కన తన భారత కృతిని హరిహరేశ్వరున కంకిత మీఁగా ఆ సీమకే చెందిన మడుపుమల్లి మాధవమంత్రి తన యభినవ భారత కృతిని హరిహర హిరణ్యగర్భేశ్వరున కంకితమిచ్చి తన నెఱజాణతనమును ప్రకటించినాఁడు.

మాధవమంత్రి అగ్రజులగు కనకామాత్యుఁడు వాసిరెడ్డివారి సంస్థాన పండితుఁడఁట! వీరు పిమ్మట మాణిక్యారావు వంశీయుల వలన చినరావూరి లోని మాన్యములను సంపాదించిరి. నెల్లూరుమండలమునందు ప్రఖ్యాతిగాయకు లయిన వీణ వీరాస్వామి అయ్యంగారు (19వ శతాబ్ది) ముత్యాలపాడు సంస్థానాస్థాన సంగీతవిద్వాంసులు. వీరు బుచ్చిరెడ్డిపాళెము వాస్తవ్యులు.

ముత్యాలపాడు జమీందారులలో పండ్రెండవ తరము వారైన రాజా శ్రీ నృసింహ భూపాల భాలేరాయనింగారు ఆంధ్రభాషాపోషకులు. వీరు నెల్లూరునుండి పూండ్ల రామకృష్ణయ్యగారి సంపాదకత్వమున వెలువడుచుండిన 'అముద్రిత గ్రంథ చింతామణి' యను సాహిత్య మాసపత్రికకు నిత్యపోషకులుగాను, అనేక గ్రంథప్రచురణ సంస్థలకు రాజపోషకులుగాను నుండిరి. 1911 నాఁటి జమీం దారులు శ్రీ రాజా సీతారామచంద్ర శ్రీ రంగ భూపాల భాలే రాయనింగారు సంగీత సాహిత్యములలో విశేషాసక్తి కలవారు. ఆంధ్ర సాహిత్య పరిషద ధ్యక్షులుగా నుండి వీరు భాషా సాహిత్యముల యభ్యుదయమున కెంతేని తోడ్పడిరి. 1919 లో నెల్లూరులో జరిగిన ఆంధ్ర సాహిత్య పరిషదష్టమ వార్షికోత్సవ ఆహ్వానసంఘాధ్యక్షులుగా వీరొసఁగిన స్వాగతోపన్యాసము మహాసభకు విచ్చేసిన మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ తాతా సుబ్బరాయశాస్త్రి, కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రి వంటి ఉద్దండపండితుల మెచ్చికోలును పొందినది[1]. 'సూర్యరాయ నిఘంటువును వ్రాయించి యాంధ్ర ప్రపంచముయొక్క గొప్ప లోటును దీర్ప నడుకట్టిన పరిషత్తువారు, ఆంగ్ల సంస్కృతములకుం బలె నాంధ్ర మునకు సలక్షణశైలిని సంపూర్ణమగు వ్యాకరణమును రచియింపఁజేసి యీ లోటునుగూడఁ బాపవలసిన వారై యున్నారని విన్నవించెద' అని రాజాగా రానాఁటి తమ ఉపన్యాసమునందు సూచించుట గమనింపఁదగినది[2].

[1] నెల్లూరు జిల్లాలోని సంస్థానముల చరిత్ర, పు. 82, విక్రమసింహపురి మండల సర్వస్వము, ద్వితీయఖండము.

[2] ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక, సిద్ధార్థి, చైత్రవైశాఖజ్యేష్ఠాషాఢములు, సంపుటి 8, సంచికలు 1, 2, పుటలు 13–24.

ప్రతివర్షము చైత్రమాసమున రాజాగారు వసంతోత్సవమును నిర్వహించి సంగీతవిద్వాంసులను, కవిపండితులను సత్కరించెడివారు. వీరికి సంగీతమన్న నభిమానమెక్కువ. బండేపల్లి సుబ్బయ్యశాస్త్రులుగారు వీరి ఆస్థాన పండితులలో నొకరు.

కళానిధి, మహోపాధ్యాయ, విద్యారణ్యపంచానన, విద్యావాచస్పతీత్యాది బిరుదాంకితులగు శ్రీమాన్ కళత్తూరు విక్రాల రామచంద్రాచార్యులుగారు (1879–1932) కలికివాయ గ్రామ వాస్తవ్యులు ఈ సంస్థానమున బహుకాల మాస్థాన పండితులుగా నుండిరి. వీరు తెంగళ శ్రీవైష్ణవశాఖకు చెందినవారు. భారద్వాజ గోత్రులు ; ఆపస్తంబసూత్రులు. తమ తండ్రియగు రాఘవాచార్యుల సన్నిధిని, మేనమామ యగు పర్ణశాల రాఘవాచార్యుల యొద్దను శాస్త్రాదుల పారము పరిశీలించినవారు. షడంగ విశిష్టక్రమాంత యజుర్వేద పారీణులు ; జైమినీయ పూర్వమీమాంసా పారంగతులు. వీరు ఆత్మకూరు, కాళహస్తి, గద్వాల, దోమకొండ, నరసరావుపేట, నూజివీడు, వనపర్తి మున్నగు ఆస్థానములను సైతము దర్శించి తమ పాండితీపటిమను ప్రకటించి సత్కారములందిరి. వీరు శతాధిక గ్రంథకర్తలు. కల్పసూత్ర సంగ్రహము, చిత్ర పంచాంగము, జనక జీవిత చరిత్రము, మానాంతరబోధము, వేదాంతము జడ్జిమెంట్, స్వరోచ్చారణ వైఖరి మున్నగు శాస్త్రగ్రంథములు వీరి ముఖ్యరచనలు. వీరి పాండిత్యమును దెలుపు శ్లోకమొకటి :

> 'వేదానాం సదనం తదర్థశరణం వేదాంగవిద్యాధనం
> షడ్దర్శిన్యవధారణం సకలవిద్యారణ్యపంచాననం
> వాగ్గంగాభరణం యశోధికరణం దుర్వాదివాం భీషణం
> విక్రాలాన్వయ భూషణం శుభగుణం శ్రీరామచంద్రం భజే'.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. శ్రీరాం వీరబ్రహ్మకవి, నానారాజన్యచరిత్రము, పుటలు 39–45.

2. పూండ్ల రామకృష్ణయ్య, అముద్రిత గ్రంథ చింతామణి, 1886, ఏప్రిల్, సంపుటము 1, సంచిక 11.

3. విక్రాల శేషాచార్యులు, శ్రీ విక్రాల రామచంద్రాచార్యుల ప్రతిభ, భారతి, 1961 మే, పుటలు 23–32.

4. విక్రాల శేషాచార్యులు, పండితప్రకాండులు శ్రీ విక్రాల రామచంద్రాచార్యులు, ఆంధ్రప్రభ, 1967, ఏప్రిల్ 10, పు. 6.

5. Boswell, A.C. John, A Manual of the Nellore District in the Presidency of Madras, Chapter XXVII, pp. 712–740.

6. A. Vadivelu, The Aristocracy of Southern India, Vol. I.

# మునగాల

## ప్రవేశిక

కృష్ణామండలములోని నందిగామతాలూకాలోని దీ యెస్టేటు. బందరు—హైదరాబాదు రహదారిలో బందరునకు నూటయిరువది మైళ్ళ దూరమున మునగాల సంస్థాన మున్నది. ఇది నాఁటి బ్రిటీషుప్రాంతములో నెలకొనియుండెను. నిజాము రాష్ట్రము నలుగడల దీనిని చుట్టియుండినది. విస్తీర్ణము 100 చ. మై. కాకతీయ చక్రవర్తులకు సామంతులుగా నుండిన యీ సంస్థానపాలకులు చాల ప్రాచీనులు*. ముకుందప్ప, సూరన్న, నరసన్న యనువారు వీరి పూర్వులలో కొందఱు. మునగాలపాలకురాలు కీసర లచ్చమ్మారావుగారు. పదునెనిమిదవ శతాబ్ది చివర ఉత్తరసర్కారులలోని ఆధిపత్యమునకు ఇంగ్లీషు, ఫ్రెంచి కుంఫిణీలవారలకు జరిగిన యుద్ధములలో లచ్చమ్మారావుగారు ఇంగ్లీషుకుంఫిణీ వారికి చేదోడువాదోడుగా నుండినందున 1802 లో సన్నదులిచ్చినపుడు నాలుగున్నరవేల పేష్కషు మాత్రమే నిర్ణయించిరి. 1937 నాఁటి ఆదాయము 125 వేలు. 'జద్దితుల్ అక్రాన్' అనునది యీ ఎస్టేటుదారుల కులక్రమాగత బిరుదము.

## సంస్థాన చరిత్రము

మెకంజీకథనముమేరకు గుర్లపాటి అయ్యన్నదేశాయి వీరి పూర్వులలో నొకఁడు. క్రీ.శ. 1693 లో అయ్యన్నదేశాయి, అంతకు కొంతముందు ఆయన కుమారుఁడును మరణించుటవలన కోడలు సుభద్రమ్మకు సంస్థానము సంక్రమించినది. సంస్థాన వ్యవహారములను పరిచూచుట కామెకు శక్తి చాలనందున ఆమెసోదరుఁడగు కీసర ముకుందప్ప మునగాలపరగణాకు పాలకుఁడయి, మొగలుపాదుషా ఔరంగజేబునుండి సన్నదులను సంపాదించెను.

నరసన్న భార్యయును, ముకుందప్ప కోడలును నగు లచ్చాయమ్మ ఆ తరువాతి పాలకురాలు. ఈమె యుద్ధతంత్రములను, రాజ్యతంత్రములను పేరు పెంపులు బడసిన నారీమణి. ఈమెకుమారుఁడు వెంకటరామన్న.

వెంకటరామన్నగారి జ్యేష్ఠకుమారుఁడగు వెంకటనరసింహారావు 1802లో ఇంగ్లీషుకుంఫిణీవారినుండి సన్నద్-ఇ-మిల్కియత్ ఇస్తిమిరార్ స్వీకరించిరి.

*A. Vadivelu, The Aristocracy of Southern India, Vol. II, p. 301.

వీరి యనంతరము వీరి కుమారులు కోదండరామయ్యగారు రాజ్యమునకు వచ్చి, 1814 లో అకాలమరణముపాలయిరి. వీరి కుమారులు వేంకటనరసింహారావు పసివారగుటచే 1814–1818 మధ్య సంస్థానము కోర్ట్ ఆఫ్ వార్డ్స్ వశమున నుండినది. యుక్తవయస్సు వచ్చిన తరువాత వేంకటనరసింహారావు 1818 లో జమీపాలనమును స్వీకరించి పదునెనిమిదేండ్లు పాలించి 1836 లో పరమ పదించిరి. వీరికి సంతతిలేనందున దత్తపుత్రుని స్వీకరించియుండిరి. దత్తపుత్రులగు కోదండరామయ్య మైనరగుటచే సంస్థానము మరల పదునాలుగేండ్లపాటు కోర్ట్ ఆఫ్ వార్డ్స్ పరమున నుండినది. కోదండరామయ్యగారు 1850 లో జమీకి వచ్చిరి. ఈయన 1854 లో మరణించిరి. ఈయనభార్య రుక్కమ్మ. ఈమె జమీని పదునాలుగు సంవత్సరములు పాలించి 1868 లో గతించిరి.

ఈమెపుత్రిక లచ్చమ్మారావు. 1873 లో జమీందారిణియై, ఈమె నిజాము రాష్ట్రియులో ప్రముఖులగు దేశముఖు నాయని వెంకటరామయ్యగారిని వివాహ మాడిరి. లచ్చమ్మారావుగారి ఎస్టేటు మేనేజరుగా కొమఱ్ఱాజు వెంకటప్పయ్య గారుండిరి. ఈమెభర్త వెంకటరామయ్యగారు పిన్నవయసుననే మరణించిరి. ఈమె ఇరువదినాలుగేండ్లు జమీని పాలించి 1892 లో మరణించిరి. ఈమె యనంతరము దత్తపుత్రుఁడు శ్రీ నాయని వెంకటరంగారావు బహద్దరువారు పదమూఁడేండ్ల వయస్సువారు. వీరు 1879 లో జన్మించిరి. 1883 లో దత్త స్వీకారార్హులైరి. 1892 నుండి సంస్థానము కోర్ట్ ఆఫ్ వార్డ్స్ స్వాధీనమైనది.

లచ్చమ్మారావుగారి మరణానంతరము లచ్చమ్మారావుగారి దత్తత చెల్లదని ఈమెతండ్రి కోదండరామయ్యగారి వారసులగు కీసరవారు వ్యాజ్యము తెచ్చిరి. ఈ వ్యాజ్యము చిరకాలము నడచి చివరకు దత్తపుత్రున కనుకూలముగా మాఱినది. 1900 లో వెంకటరంగారావు బహద్దరువారు ఎస్టేటు ఆధిపత్యమునకు వచ్చిరి. వీరి దివానులు సుప్రసిద్ధాంధ్రపరిశోధకులు కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణ రావు పంతులుగారు (1877–1923). రాజాగారి తనయులు రామకృష్ణారెడ్డి, గోపాలకృష్ణారెడ్డి అనువారు ఉన్నతవిద్యాపట్టభద్రులు. వీరి రెండవపుత్రికయగు రాణి సరళాదేవిగారు వనపర్తి సంస్థానాధీశ్వరులు రాజా కృష్ణదేవరాయలవారి పట్టమహిషి. సరళాదేవిగారి కుమారులు రాజా రామేశ్వరరావు బహద్దరుగారు. వీరు పార్లమెంటు సభ్యులు. మునగాలరాజాగారి మొదటి అల్లుఁడు రాజగోపాల రెడ్డి; మూఁడవ అల్లుఁడు ఎస్.ఎమ్. రెడ్డి. ఇరువురును సీమచదువులు చదివి బారిస్టరుపట్టమును పొందినవారు. 1958 లో రాజాగారు స్వర్గస్థులయిరి. అంతకు ముందే ఎస్టేటును అంతరించియుండినది.

## సాహిత్యపోషణము

1873–1892 మధ్య మునగాలసంస్థానమును పాలించిన శ్రీ రాజా నాయని

లచ్చమ్మారావుగారు మంచి సాహిత్యాభిరుచి కలవారు. వీరి ఎస్టేటుమేనేజరు కొమఱ్ఱాజు వెంకటప్పయ్యగారు. వేంకటప్ప కేసరినృపాలశేఖరుని మంత్రియని సేతుమాహాత్మ్యము పేర్కొనినది. లచ్చమ్మారావుగారి భర్త వెంకటరామయ్య గారు మరణించువరకు వెంకటప్పయ్యగారు మేనేజరుగా నుండిరి. ఆయన ఆ పిమ్మట కుటుంబముతో స్వగ్రామమగు పెనుగంచిప్రోలునకు వచ్చి కొలఁది కాలములో మరణించిరి. వెంకటప్పయ్యగారిభార్య గంగమ్మ. ఆమె తన సంతాన మగు అచ్చమాంబను, లక్ష్మణరాయలను దీసికొని తన సోదరుఁడైన భండారు మాధవరావుగారియొద్దకు నాగపురమునకుఁ బోయినది. మాధవరావుగారు నాగ పురమునందు పబ్లిక్‌వర్క్సుశాఖలో ఇంజినీరు. ఆయన స్వగ్రామము నందిగామ తాలూకాలోని కంచెలగ్రామము. కొలఁదికాలములో భార్య నిస్సంతుగా మర ణింపఁగా మాధవరావుగారు మేనఁగోడలైన అచ్చమాంబను పెండ్లాడిరి. అబలా సచ్చరిత్రరత్నమాలారచయిత్రిగా భండారు అచ్చమాంబప్రసిద్ధి జగమెఱిఁగిన మాట. లక్ష్మణరావుగారు తన మేనమామయును, బావగారునునైన మాధవరావు గారి పర్యవేక్షణమున విద్య నభ్యసించిరి. 1900 లో నాయని వెంకటరంగారావు గారు మునగాలసంస్థానాధిపత్యమునకు వచ్చిన పిమ్మట చిన్ననాఁటి నెచ్చెలియగు లక్ష్మణరావుగారిని పిలిపించి దివానుగా నియమించిరి. 1923 దాఁక లక్ష్మణరావు గారు దివానుగానుండి పరమపదించిరి. అనఁగా ఇంచుమించు ఏఁబదియేండ్లు కొమఱ్ఱాజువారి కుటుంబమునకును, మునగాల సంస్థానమునకును సంబంధ ముంటినది.

## వరదరాజ నందికేశ్వరకవి

ఈ కవి కొమఱ్ఱాజు వెంకటప్పయ్యగారి ప్రేరణముచే 'శివతత్త్వ సుధానిధి' అను మూఁడాశ్వాసముల ప్రబంధమును సంధానించిరి. కవి కౌశిక గోత్రజుఁడు, ఆపస్తంబసూత్రుఁడు, జ్ఞానానందదేశికేంద్రుల శిష్యుఁడు. ఇది స్కాందమునుండి ఆంధ్రీకరింపఁబడినది. ఈ నందికేశ్వరశాస్త్రియే రచించిన 'సేతుమాహాత్మ్యము' అను కృతికిఁగూడ వెంకటప్పయ్యగారు కృతిప్రేరకులు. శివతత్త్వసుధానిధి మునగాల జమీందారీలోని ముఖ్యస్థానమగు నడిగూడెము— ఈ కావ్యమున నిది 'నిడుగుడుముల' యని ప్రయుక్తము—లో వెలసిన సారంగేశ్వరస్వామి కంకితము. రెండవదియగు సేతుమాహాత్మ్యము లేక సేతు ఖండము కృష్ణామండలమునందలి పెనుగంచిప్రోలులో వెలసిన శంభులింగేశ్వర స్వామికిఁ గృతి. సేతుమాహాత్మ్యము అయిదాశ్వాసముల ప్రబంధము. స్కాంద పురాణాంతర్గత సేతుఖండమున కాంధ్రీకరణము; రామేశ్వరక్షేత్రమాహాత్మ్య ప్రతిపాదకము. ఇది అముద్రితము. ప్రాచ్యలిఖితభాండాగారపు సంఖ్య ఆర్. 676 (కాకితపు వ్రాతప్రతి). శివతత్త్వసుధానిధి 1874 లో ముద్రితము. ఇవిరెండును

'ఆంధ్రశైవవాఙ్మయము'నకు సంబంధించిన ప్రశస్తకృతులు[1].

## కొమఱ్ఱాజు రామలింగకవి

వెంకటప్పయ్యగారి పినతండ్రియగు రామేశ్వరుఁడు లేక రామలింగకవి వీరభద్ర శ్రీ గిరిమల్లేశ్వర శతకములకుఁ గర్త. 'రామలింగార్యపోష సద్రాజ ఘోష శరణు శ్రీ గిరిమల్లేశ శాంకరీశ' యను మకుటముగల శ్రీ గిరిమల్లేశ శతకము సీసపద్యమయము. స్వమతభూషణము, పరమతదూషణము వెల్లివిరిసిన రచన మిది. 'వీరభద్ర కారుణ్యనిధీ' యను మకుటముఁగల మూఁడుకందములతో నొప్పినది వీరభద్రశతకము. కొలుపులూరిలో వెలసిన వీరభద్రస్వామిపేర నిది ప్రవర్తితము.

## కొమఱ్ఱాజు వెంకటశివుఁడు

వెంకటప్పయ్యగారి అగ్రజుఁడగు వెంకటశివుఁడుగారు రేపాల రాజలింగ శతకకర్త. మునగాలకు రెండుపరువుల దూరమునఁ గల రేపాలగ్రామములో వెలసిన రామలింగస్వామియే శతకమునందలి రాజలింగము. ఈ శతకమున నూటయిరువదేడు సీసపద్యములు 'భావభవభంగ గౌరి హృత్పద్మభృంగ రాజిత శుభాంగ రేపాలరాజలింగ' యను మకుటముతో నున్నవి. శివపారమ్యమును ప్రతిపాదించు శతక మిది. వెంకటప్పయ్య, వెంకటశివుఁడు అను రెండు నామములును ఒకేవ్యక్తికి చెందినవని కొందఱు భ్రమపడుటవలన వెంకటప్పయ్య రేపాల రాజలింగ శతకకర్తయని వ్రాయుట జరిగినది[2]. కాని పూర్వోక్తములైన సేతుమాహాత్మ్య శివతత్త్వ సుధానిధి కావ్యములందలి కృత్యవతారికలలో ప్రపంచితమైన కొమఱ్ఱాజువారి వంశావళిని పరికించినచో ఇది కేవలము భ్రాంతి యనియు, ప్రమాదమనియు నిర్ధారితమగుచున్నది. రేపాలరాజ లింగశతకకర్త వెంకటశివుఁడనుటయు స్థితిస్థాపకాంశము. చూడుఁడు :

> 'ఘనిఁ గొమఱ్ఱాజు వేంకటశివుఁడనంగ
> వెలసి రచియించితిని బ్రోవవలయు దయను
> భావభవభంగ గౌరిహృత్పద్మభృంగ
> రాజితశుభాంగ రేపాలరాజలింగ'

వెంకటప్పయ్యగారి తండ్రియగు లక్ష్మణరాయల (లక్ష్మీశలింగమున)కు మొదటిభార్య సంగమాంబవలన వేంకటశివుఁడు, వెంకటప్పయ్య అను నిద్దఱు పుత్రులును, మహాలక్ష్మియను ద్వితీయ కళత్రమువలన సంగమేశ్వరుఁడను

1 విదుదవోలు వేంకటరావు, ప్రబంధావతారికలు – కొమఱ్ఱాజువారి వంశావళి. ఆంధ్ర ప్రదేశ్, 1961, ఫిబ్రవరి, పుటలు 7–13.

2 శతకకవుల చరిత్రము, పుటలు 581, 691, 692 ; శేషాద్రిరమణకవులు, పీఠిక, భక్తిరస శతకసంపుటము 2, పు. 29.

నాకతనయుఁడును ఉన్నట్లు సేతుమాహాత్మ్య కావ్యము సాక్ష్యమిచ్చుచున్నది. కొమఱ్ఱాజువారు శైవులైన ఆఱువేలనియోగులు. భారద్వాజసగోత్రులు. ఉద్భటా రాధ్య శేఖరుఁడగు వీరభద్రగురుశిష్యులు. శివతత్త్వసుధానిధిలో –

'ఆ రాజమౌళి పూర్ణకృ
పారసమున సకలరాజ్యభరవహనత చే
కూరఁ గొమఱ్ఱాజు కులో
ద్ధారకుఁడగు వేంకటప్పధార్మికుఁడలరెన్'

అని వెంకటప్పయ్య ప్రశంసింపఁ బడినాఁడు. వెంకటప్పయ్యగారి పితామహు లును, లక్ష్మీశలింగము కన్నతండ్రియునునగు నాగేశుఁడు అమరావతి ప్రభువు వాసిరెడ్డి వేంకటాద్రినాయని మంత్రి. నాగేశునకు చొక్కమాంబ వలన వెంక టప్ప, అక్షయలింగము, బసవన, లక్ష్మణరాయలు, రామేశ్వరుఁడు అని అయిదుగురు పుత్రులు. వీరిలో నాల్గవ వాఁడగు లక్ష్మణరాయలు నాగేశుని అగ్రజుఁడగు రాజేశ్వరామాత్యునకుదత్తుఁడు.

## కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు

లక్ష్మణరావుగారు (1877–1923) జగమెఱిఁగిన పరిశోధక పండితులు. విజ్ఞానచంద్రికా గ్రంథమండలి నిర్వాహకులు. మొట్టమొదట మునగాలరాజాగారి కాంతరంగిక కార్యదర్శి. పిమ్మట ఆమరణము మునగాలజమీందారీ దివాను. రాజాగారికిని రావుగారికిని విడఁదీయరాని మైత్రియుండినది. రాజావారు సరసులు; సహృదయులు. చక్కని సంస్కారము, సరససాహిత్యాభిలాషగల విద్యావంతులు. దివానుగా లక్ష్మణరావుగారు మునగాల పరగణాకు చేసిన సేవ విస్మరింపరానిది. వీరి బహుముఖసేవ లీ చిన్న సంస్థానమునకు పరిమితముకాకుండ విశాలాంధ్ర మునకంతటికిని ఉపకరించుతీరున రావుగారికి విశేషావకాశములను ఒడఁగూర్చిన మునగాల రాజాగారు నిజముగా నభినందనీయులు. ఉత్తమపరిశోధకులుగా, ప్రప్రథమ ఆంధ్రవిజ్ఞానసర్వస్వ సంపాదకులుగా, విజ్ఞానచంద్రికా గ్రంథ మండలివంటి ఉత్తమ గ్రంథప్రచురణ సంస్థానిర్వాహకులుగా లక్ష్మణరావుగారు సాధించినఫలము శ్లాఘాపాత్రము.

'తనువు రుజావృతంబయిన, దార్ఢ్యము తప్పుచునున్న, భాషపైఁ
గనికరముంచి తీవ్రకృషి కర్షకురీతినొనర్చి తత్ఫలం
బనిశము నాంధ్రలోకమునకై వినియోగమొనర్చియుంట నీ
జననము సార్థకంబయి పొసంగెను లక్ష్మణరాయధీమణీ'*

యని సత్కవిలోకప్రశస్తినిగాంచిన లక్ష్మణరావుగారు ధన్యులలో ధన్యులు.

* శేషాద్రిరమణకవులు.

## రాజా నాయని వెంకటరంగారావుబహద్దరు

మునగాల జమీందారు శ్రీ రాజా నాయని వెంకటరంగారావుబహద్దరువారు (1879—1958) బందరు నోబుల్ కళాశాలలోను, మద్రాసులోను చదివిరి. దేశభాషాభిమానులు. ఉత్తమ సంస్కారము కలవారు. ఆదిపూడి సోమనాథరావు (1867—1941) గారి శ్రీకృష్ణదేవరాయచరిత్ర ప్రబంధమును కృతినంది కర్తను బహూరీతుల సమ్మానించిరి. బందరులోని సరస్వతీ గ్రంథమాలిక, కాకినాడలోని ఆంధ్రప్రచారిణీగ్రంథమాల, మద్రాసులోని ఆర్యభారతీగ్రంథ మాలిక, రాజమహేంద్రవరములోని ఆంధ్రేతిహాసపరిశోధకమండలి మొదలగు సంస్థలకు రాజాగారు రాజపోషకులు. విజ్ఞానచంద్రికా గ్రంథమండలి స్థాపకులు. ఈ మండలి పక్షమున ప్రచురితములైన గ్రంథములు నాఁటికి నేఁటికి ఆంధ్ర పరిశోధకప్రపంచమున కాదర్శమూర్తులు.

గుంటూరులోని శ్రీ శారదానికేతనము పాలకవర్గమునకు రాజాగా రధ్యక్షులు*. ఈ నికేతనమునకుగాను గుంటూరు బ్రాడీపేట పరిసరములలో పదివేల చదరపు గజముల పరిమితియును, 80 వేల రూ.ల విలువయును గల నివేశనస్థలమును రాజాగారు దానమిచ్చిరి. హైదరాబాదునందలి శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము పోషకులలో మునగాల రాజాగారు మొదటివారు. ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో శ్రీ కొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారి స్మృత్యర్థము రాజాగా రొకనిధిని ఏర్పాటుచేసిరి. బందరు జాతీయకళాశాలకు రూ. 8 వేలు విరాళముగా నిచ్చిరి. రాజాగారు గెలెటి యను పాశ్చాత్యభాషాపరిశీలకుఁడు వ్యావహారికాంధ్ర నిఘంటువును ప్రకటించుటలో ముఖ్యపోషకులుగా నుండిరి. ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు శ్రీ రాజాగారికి కళాప్రపూర్ణ బిరుదమిచ్చి గౌరవించిరి.

* దేశభక్త కొండ వెంకటప్పయ్య స్వీయచరిత్రము, ద్వితీయభాగము, ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారసంఘము, విజయవాడ, 1955, పుటలు 125, 126.

## ఉపజీవ్య గ్రంథసూచి


1. శ్రీరాం వీరబ్రహ్మకవి, నానారాజన్యచరిత్రము, పుటలు 83—92.
2. అయ్యదేవర కాళేశ్వరరావు, నా జీవితకథ — నవ్యాంధ్రము.
3. తెలుగువిజ్ఞానసర్వస్వము, సంపుటము 3.
4. వంగూరి సుబ్బారావు, శతకకవులచరిత్రము, పుటలు 581, 691, 692.
5. భక్తిరసశతక సంపుటము 2, వావిళ్ళ, చెన్నపురి.
6. A. Vadivelu, The Aristocracy of Southern India, Vol. II, 1903, pp. 300 – 306.
7. Report of the Madras Estates Land Act Committee, Part II, Madras. 1938.

# మేరంగి

## ప్రవేశిక

శ్రీకాకుళము మండలము పార్వతీపురము తాలూకాలో పార్వతీపురమునకు తూర్పుగా తొమ్మిది మైళ్ళ దూరమున మేరంగి యున్నది. ఈ ప్రాంతము నందలి ప్రాచీనమైన కొండజమీందారీలలో నిదియొకటి. 'మేరంగి కురుపాము మేనరాజులను' అని పిల్లల దసరా పద్యములలో నైతము పేరుకెక్కిన మేటి సంస్థానము మేరంగి. ఇందు 49 జిరాయితీ గ్రామములు, 9 అగ్రహారములు ఉండినవి. దీని పేష్కషు దాదాపుగా పందొమ్మిది వేలుండెడిది. 'శత్రుచెర్ల' యనునది మేరంగి జమీందారులకు పరంపరగా వచ్చుచున్న కులబిరుదముగా వాడుకపడియున్నది. 'శత్రువులను సంహరించువారు' అని కార్మికేల్ దొరగారి వివరణము. శత్రుశల్యుఁడను బిరుదమున కిది వికృతియఁట!

'మేరంగి నొసఁగె గూర్మని శత్రుశల్యుఁడ
న్న బిరుదముతో జగన్నాథదొరకు' —ప్రభాస శాప.

కురుపాము జమీందారులకు 'వైరిచెర్ల' యనునది కులక్రమాగతమగు బిరుద నామము. ఇది వైరిశల్య శబ్దమునకు వికృతియని వాదింతురు. వాస్తవముగా చక్రవర్తులు తమక్రింది సరదారులో, సామంతులో తమ శత్రురాజులను చెఱపట్టి తెచ్చినందులకు ప్రసాదించెడి బిరుదముగా 'శత్రుచెఱల', 'వైరిచెఱల' అను బిరుదములు రూఢములయి యుండుననుట సుసంభావ్యము. అవియే జనులవాడుకలో శత్రుచెర్ల, వైరిచెర్లలుగ మార్పాటునొంది యుండనగు. ఇవి వైరిసమాసము లని ఆక్షేపముసేయు పుణ్యజనులు కొందఱుండకపోరు. ఇట్టివి బిరుదావళిలో సర్వసామాన్య మనియు, ఈరీతి సమాసకల్పనమును వికృతివివేకకర్త మొదలగు వ్యాకర్తలు అంగీకరించిరనియును* సమాధానము.

## సంస్థాన చరిత్రము

జయపుర సంస్థానమును పాలించిన విశ్వంభరదేవు (క్రీ. శ. 1672–1676) గారి కాలమున నీ జమీందారీ యేర్పడియుండినది. విశ్వంభరదేవుగారి తరువాత జయపురము నేలినరఘునాథకృష్ణదేవు రాచఱికములో మేరంగి జమీం

* 'భవే ద్విరుదశబ్దేషు యథేచ్ఛం వర్ణకల్పనా
గ్రామమానుష్య బిరుదశబ్దానా మపి సోమతః'
—వికృతివివేకము, హలంత పరిచ్ఛేదము, కారిక 9.

దారగు తమ్మరాయఁడు అను వ్యవహారనామముకల ధర్మరాజుదొర జయపురా ధీశ్వరుల ప్రసక్తి లేకుండఁగా స్వతంత్రుఁడగుటకు సకల ప్రయత్నములు సాఁగించెను. జయపుర పాలకుఁడు పెద్ద సేనలతో పైనెత్తిరాఁగా ధర్మరాజుదొర యీ యొత్తిడి కాఁగలేక పర్లాకిమిడికి పాఱిపోయి తత్పాలకుల యాశ్రయమున శరణమునుఁబొందియుండెను.

ధర్మరాజుదొర పోఁబడిని, పర్లాకిమిడివారి యెత్తుగడను గమనించి జయపురమువారు శత్రుశేషము పనికిరాదను గట్టి పట్టుదలతో తమ శత్రువునకు శరణమొసఁగిన పర్లాకిమిడిపై దండెత్తుటకు యుద్ధసన్నాహములు చేసిరి. బలవంతులతో తలపడుట తలకుమాలిన పనియని పర్లాకిమిడి పాలకులు గుర్తించి జయపురమునందలి బత్తిలిసీమను తమకిచ్చినచో తమ యాశ్రయమునందలి తమ్మరాయని అప్పగించెదమని బేరముపెట్టి జయపురమునకు రాయబారము నంపిరి. సరిహద్దు తగాదాలలో నలుగుడుపడుచున్న బత్తిలిసీమ బెడదను వదలించికొనుట తమకును గూడ శ్రేయమను భావనతో జయపురమువారు పర్లాకిమిడివారు అడుగుటయే తడవుగా ఉభయతారకముగా బత్తిలిసీమను పర్లాకిమిడికి బదలాయించిరి. రాయబారము నిబంధనముల మేరకు పర్లాకిమిడి రాజాగారు తమ యాశ్రయమునందున్న మేరంగి జమీందారు ధర్మరాజుదొరను జయపురమువారి కొప్పగించిరి.

ఇంత రగడకు కారణమైన తమ్మరాయని తలకొట్టించి, తమ భృత్య కోటిలో ముఖ్యుఁడగు జగ్గన్న అను నామాంతరముగల జగన్నాథరాజునకు మేరంగి జమీందారీని ప్రసాదించి పూర్వపు జమీందారుగారి 'వితంతుభార్య' ను ఆయన పెండ్లియాడునట్లుగా నిర్ణయించిరి. జగన్నాథరాజునకు జమీందారీ పట్టము కట్టునపుడు 'శత్రుచెర్ల' యను బిరుదమునుగూడ ప్రసాదించిరి.

మీఁది నిరూపణము ప్రకారము మేరంగి జమీందారుల మూలపురుషుఁడు శత్రుచెర్ల జగన్నాథరాజు. మేరంగి, కురుపాము జమీందారీలు ఇరుగు పొరుగు సీమలలోనివి. ఫ్రెంచి కుంఫిణీవారిని ఈ ప్రాంతములోనుండి తఱిమివేయు కాలమునందు కురుపాము సంస్థానపాలకుఁడైన శివరామరాజు (1740—1794) తన రాజ్యమునకు సమీపమునందున్న మేరంగి సంస్థానమును బలవంతముగా నాక్రమించి స్వీయరాజ్యసీమలను విస్తరింపఁ జేసినాఁడు. విజయనగర సంస్థాన ప్రతినిధియగు సీతారామరాజుగారు పిట్టపోరు పిల్లితీర్చినట్లు శివరామరాజును అధికారమునుండి తప్పించి ఖైదుచేసి మేరంగి, కురుపాము జమీందారీలను రెండింటిని విజయనగరములో కలిపివేసిరి.

విజయనగరము ఆక్రమించిన జమీందారీల నన్నింటిని వేఱువేఱుగా విడఁదీసి పూర్వపాలకులకో వారి సంతతివారికో ప్రసాదించువరకు ఈ రెండు జమీందారీలు కూడ విజయనగరమువారి యేలుబడిలో నుండినవి. 1795 లో

వీనిని పూర్వపాలక కుటుంబములవారికి తిరిగి యిప్పించిరి. ఈ యేర్పాటు మూలమున మేరంగి కుటుంబములోని పెద్దకోవకు చెందిన శత్రుచెర్ల గంగరాజుగారికి మేరంగి సంస్థానము దఖలుపడినది. ఈయనతోడనే కుంఫిణీవారు శాశ్వతపరిష్కారమును నిర్ణయించిరి.

శత్రుచెర్ల గంగరాజుగారికి ఔరసత్వపు వివాదములలో మేరంగి కుటుంబములోని మఱియొకకోవకు చెందిన వెంకటరాజు అనునతఁడు ప్రత్యర్థి. ఈ వెంకటరాజు కుమారుఁడు జగన్నాథరాజు. మేరంగి జమీందారీలో తనకు వంతురావలయునని జగన్నాథరాజు గంగరాజుగారిని జీవితకాలమంతయు వ్యథ పెట్టుచు వచ్చెను. సాధుప్రవృత్తి, ఉదారచిత్తవృత్తి కల గంగరాజుగారు కార్యము నిదర్శించి వృథావివాద మెందులకని కలెక్టరు వెబ్బుదొరగారి సూచనల ననుసరించి కొన్ని జమీగ్రామములను జగన్నాథరాజున కిచ్చి రాజీపడిరి. ఈ లోఁగా గంగరాజు చనిపోఁగా అయిదేండ్ల వయసుగల ఆయన కొడుకు చంద్రశేఖరరాజునకు జమీందారీ దఖలుపడినది. అందుపైని జమీందారీ అంతయు తనకే చెందవలెనని జగన్నాథరాజు వ్యాజ్యముతెచ్చి అది యొక కొలికికిరాకపూర్వమే చనిపోయెను.

ఆయన సోదరుఁడగు వీరభద్రరాజు అంతతో ఆఁగక నాలుగాకు లెక్కువ చదివి వ్యాజ్యమునింకను ముందునకు నడపించెను. చిట్టచివరకు మైనరు జమీందారగు చంద్రశేఖరరాజు పక్షమున తీర్పు చెప్పఁబడినది. ఈ తీర్పు తనకు సుతరాము సమ్మతముకానందున వీరభద్రరాజు ఆయుధజనమును సమకూర్చి కొని మైనరు జమీందారును, జమీ మేనేజరు కుమారులను చెఱపట్టి తక్కిన సంస్థానోద్యోగులతో నిమిత్తములేకుండ స్వతంత్రించి సంస్థానపు రాఁబడులను జబర్దస్తీగా జమచేసికొనుచుండెను. కుంఫిణీవారు హుటాహుటిని ఆయన మీఁదికి కొన్ని పటాలములను కూచిచేయించి, ఓడించి, 1809 లో అత్యల్పమగు పింఛను (నెలకు రూ. 83–5–4) ఇచ్చి సమాధానపఱిచిరి.

కాని అల్లరుల కలవాటుపడిన వీరభద్రరాజు 1816లో మరల పితూరీలను లేవఁదీసెను. పింఛనును నెలకు రూ. 1,500 లకు హెచ్చింతుమని కుంఫిణీ వారెంత నచ్చఁజెప్పినను దురాశాపరుఁడగు వీరభద్రరాజు ససేమిరా వినలేదు. మైనరు జమీందారు మాతామహుఁడగు దాలయ్యదొరను వీరభద్రరాజు దొంగపోటుగా చంపించెను. చివరకు వీరభద్రరాజు పట్టుకొనఁబడి సర్క్యూటుకోర్టు వారి యెదుట హాజరుసేయఁబడి విచారణ జరిగినమీఁద సత్ప్రవర్తన కలిగి యుండుటకును, సెలవయినపుడు హుజూరున హాజరగుటకును నఫరు జామీను పుచ్చికొని ఫౌజుదారీ అదాలత్ కోర్టువారు ఆయనను విడుదలచేసి విశాఖపట్టణములో నివసించునట్లు కట్టడగావించిరి. కాని ఆయన పూర్వపద్ధతి యేమాత్రము మాఱనందునను, ఆ దరిమిలా సంస్థానమున చెదరుచెదరుగా

చెలరేఁగిన హింసాచర్యల కీతని కుమ్మక్కు ఉన్నదను గట్టినమ్మకము కలిగి నందునను కుంఫిణీదొరతనమువారు వీరభద్రరాజును 1821 మార్చినెలలో చెంగల్పట్టునకు పంపించి నెలవారీ 'లవణను' నిచ్చుచు వచ్చిరి. ఆ తరువాత కొంతకాలమునకు వీరభద్రరాజు మరణించెను.

ఈ గడబిడలలో పిచ్చివాఁడయినట్లు రసెల్‌దొరవలన వివరింపఁ బడిన చిన్నజమీందారు చంద్రశేఖరరాజు అలవిమాలిన అప్పులలో మునిఁగి యుండెను. సాలుసరి జమలు చెల్లుబడికాక సుమా రేఁబదివేలకు పైఁబడిన పేష్కషుమొత్తము బకాయిపడియుండెను. అందువలన తాలూకా జప్తుచేయఁబడి సివిలుకోర్టువారివలన వేలము వేయఁబడినది. దీనిని ఖరీదుచేయుట కెవ్వరికిని ధైర్యము చాలనందున 1833 లో కుంఫిణీప్రభుత్వమువారిపేర రూ. 500 లకు నామమాత్రపు విక్రయము జరిగెను.

చిన్నజమీందారుగారి కొడుకు జగన్నాథరాజు తొమ్మిదేండ్ల బాలుఁడు. ఆనాఁటి మద్రాసు గవర్నరు ఫ్రెడరిక్ ఆడమ్ పాలకొండ మకాములో నుండఁగా మైనరుజమీందారు జగన్నాథరాజు, దివాను కృష్ణచంద్రుఁడును దర్శించి సంస్థాన వ్యవహారములను నివేదించియుండిరి. అసలుజమీందారగు చంద్రశేఖరరాజు కూడ గవర్నరుగారిని దర్శించుట కాయన మకామునకు రాఁగా దర్శనము దొరకలేదు*. పాలకొండపితూరీలో ముఖ్యులైన అచ్చుపువలస భాయీలు అను పేర ప్రసిద్ధులైన కృష్ణందొర, అప్పన్నదొర అను నిరువురను, వారి పరివారమును అణఁచుటలో మేరంగిసంస్థానము దివాను కృష్ణచంద్రుఁడుగారును, మేరంగి మైనరుజమీందారుగారును కుంఫిణీకి మిక్కిలిగా తోడ్పడినందున ఆ మెహనతు నకుఁగాను దివానుగారి అభ్యర్థనముమీఁద పూర్వపు పేష్కషుతో 1835 లో క్రొత్తసన్నదును మేరంగి మైనరు జమీందారు జగన్నాథరాజుపేర కుంఫిణీవారు ప్రసాదించిరి.

1843 లో జగన్నాథరాజునకు యుక్తవయస్సు వచ్చువరకు జమీందారీని ఎనిమిదేండ్లపాటు కోర్ట్ ఆఫ్ వార్డ్స్‌వారి పర్యవేక్షణములో నుంచిరి. 1843 నుండి 1864 దాఁక జమీని పాలించి జగన్నాథరాజు మరణింపఁగా ఆయన పెద్ద కుమారుఁడు చంద్రశేఖరరాజునకు జమీందారీ సంక్రమించినది. తరువాత ఈ జమీందారీని శత్రుచెర్ల ప్రతాపరుద్రరాజు, శత్రుచెర్ల బాలగంగాధరనారాయణరాజు మొదలగువారు నిర్వహించిరి. ఆంధ్ర, కురుపాము జమీందారులతో మేరంగి జమీందారులకు సంబంధబాంధవములు గలవు. వీరి మాతృభాష ఓఢ్రము. కాని తెలుఁగుభాషను వీరు అభ్యసించిరి. తెలుఁగువారిని తమ దివానులుగా నియమించు చుండిరి. మార్కొండ నీలయ్యయును, మార్కొండ ఆదెయ్యయును, బెహరా దాలయ్య పట్నాయకుగారును, ఆచంట బాపిరాజుగారును, ఆచంట వేంకటరాయ

* Russel's Report, President's Minute, paras 29, 30.

సాంఖ్యాయనశర్మగారును మేరంగిసంస్థానము దివానులుగానుండి సంస్థానాభ్యుదయమునకు శక్తివంచనలేక పాటుపడిరి.

## సాహిత్యపోషణము

మేరంగిదర్బారులో సాధారణమైన సాహితీచర్చలు, శాస్త్రగోష్ఠులతోపాటు శతఘంటకవనము, సమస్యాపూరణము మొదలగునవి ప్రసిద్ధములుగా నుండెనఁట! మేరంగి సంస్థానమునందు సమ్మానము పొందినవారిలో గొట్టి సాంబమూర్తిశాస్త్రి, నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి, వేంకటకవి, ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మ, జగ్గరాజకవి మొదలైనవారు ముఖ్యులు.

## నడిమింటివారు

తూర్పుగోదావరి మండలమునుండి నాగావళీ నదీతీరమున కరుదెంచి కురుపాముసంస్థానాధీశ్వరుల సమ్మానములందిన పండితకుటుంబమగు నడిమింటి వారికి 'గొట్టివలస' యను నగ్రహారమును మేరంగిసంస్థానాధీశులు దయచేయించియుండిరఁట![1] నడిమింటి చయనులు, నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి, నడిమింటి భగవత్పతంజలిశాస్త్రి కళింగసీమయందేగాక సర్వభారతమునందును ప్రశస్తినిబడసిన మహాపండితులు.

## గొట్టి సాంబమూర్తిశాస్త్రి

ఈయన నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రిగారికి సమకాలికులు; చిన్ననాఁటి నెచ్చెలి కూడ! సర్వమంగళేశ్వరశాస్త్రిగారీతనిని గోదావరిమండలము నుండి తోడ్కొనివచ్చి నాగావళినది యొడ్డున నాగూరున కావలివైపునఁ గల గ్రామమును మేరంగి జమీందారులచే నగ్రహారముగా నిప్పించిరఁట![2] ఈ యగ్రహార మిప్పటికిని 'సాంబన్నవలస' యని పిలువఁబడుచున్నదఁట! సర్వమంగళేశ్వరశాస్త్రివంటి పండితకవి ప్రశంసల నందికొన్న మహాపండితుఁడు సాంబమూర్తిశాస్త్రి. ఈయన పార్థివలింగపూజాధురంధరుఁడఁట!

## వేంకటకవి

కౌశికగోత్రుఁడును, గౌరీపతిపుత్రుఁడును నగు వేంకటకవి (1790—1850) యాంధ్రీకరించిన కార్తికమాహాత్మ్య మను మూఁడాశ్వాసముల పద్య కావ్యము మేరంగిసంస్థానాధీశ్వరుల దివానగు మార్కండ ఆదెయామాత్యున కంకితము. కవి సూరపార్యుని ప్రపౌత్రుఁడు, కృష్ణాఖ్యుని పౌత్రుఁడు. 'కపిగోత్ర

1 సర్వమంగళేశ్వరశాస్త్రి, జీవితచరిత్రము, పు. 2.

2 పైది, పు. 44.

కలశాబ్ధికల్లోర మిత్రుఁడగు నృసింహుని దౌహిత్రుఁడు'. జానకీ మనోహర ఘన కరుణాలబ్ధ భూరి కవితాప్త యశోధనుఁడు. ప్రాకృతుఁడయిన యీ కవిని సుకవీంద్రపట్టమున నిలిపినవారు కావేటి వేంకటాఖ్యుఁడు, శ్రీనివాసార్యుఁడును. వీరు కవికి విద్యాగురువులు, ముద్రాగురువులును కాఁబోలు.

కృతిపతి ఆదెయామాత్యుఁడు చిత్రగుప్తవంశముగా సంభావింపఁబడు చున్న సృష్టికరణ కులమువాఁడు. వీరి పూర్వులు తొలుత పురుషోత్తమక్షేత్ర మగు జగన్నాథమునఁ గాఁపురముండినవారు. వీరి మూలపురుషుఁడు మార్కొండ పట్నాయకుఁడు. ఇతఁడు జగన్నాథమునుండి భార్యయగు భాగమ్మతోఁ గూడ తరలివచ్చి విజయనగరసంస్థాన పాలకుఁడగు మొదటి విజయరామనరేంద్రుని యొద్ద సరదామీఁదఁగ సరదారుఁడుగా కుదిరి, కొల్లామున నివసించుచుండెనఁట:

మార్కొండ పట్నాయకుని కుమారుఁడు మాదన. మాదన తనయుఁడు సోమన. ఈ సోమన 'బర్బరావనీనాయక ప్రాజ్య రాజ్యవర్ధనుఁడు'. ఈ బర్బర రాజ్య మేదియో తెలియదు. ఏదో యొక కొంత జమీందారీ కానోపు: సోమన పుత్రుఁడు నీలయమంత్రి.

'శ్రీమన్మేరంగిపురీధాముఁడు శ్రీ గంగరాజ* ధరణీనాథ
గ్రామణి యీ మహనీయుని సామోపాయమునఁ జెందె శాశ్వతకీర్తిన్'

ధీజితదేవగురుఁడగు నీలయమంత్రివరుఁడు మేరంగిపురవరేశుఁడగు గంగరాజుకడ నమాత్యుఁడుగా నుండినవాఁడు. ఇతఁడధికృతసప్త సంతానాది సత్కార్యుఁడు. ఇతనికి పొన్నమాంబవలనఁ గలిగిన కుమారుఁడు కృతిపతి యగు ఆదెయామాత్యుఁడు. ఇతఁడు గంగరాజు పుత్రపౌత్రులగు చంద్రశేఖర రాజు (1798–1833), జగన్నాథరాజు (1824–1864) ల యొద్ద సచివుఁడుగా నుండి విశేషఖ్యాతిని బడసినట్లు కృత్యవతారికయందలి క్రిందిపద్యము ప్రమాణము :

'శ్రీ శత్రుచెర్లవంశేశుఁ డీశ్వరపాద
 భజనపరుండు శోభాపరుండు
చంద్రశేఖరమహీజాని యే మంత్రిశు
 నీతిఁ జేకొని మహాఖ్యాతిఁ గాంచెఁ
దత్పరోక్షంబునఁ దత్పుత్రుఁ డఖిల వి
 ద్యామయుండు వినిర్జితామయుండు
శ్రీమజ్జగన్నాథ నృపచంద్రుఁ డే మంత్రి
 చంద్రుని నమ్మి నిస్సంశయమతి

* రంగరాజను లిఖితప్రతిపాఠము సరికాదు. క్రీ.శ. 1795–1803 మధ్య మేరంగిని పాలించిన జమీందారు శత్రుచెర్ల గంగరాజు (1770–1803). మేరంగిపాలకులలో రంగ రాజు నామకులు కన్పట్టరు.

....అట్టి యాదెయమంత్రి....'

ఇట్టి ఆదెయమంత్రికి కార్తికమాహాత్మ్యకృతి యంకితము.

'నారాయణాంశజనితుం డీ రసికశ్రేష్ఠుఁ డితని కే నిచ్చెద సు

శ్రీ రంజిలఁ గృతిరత్నం బౌరాయని సుకవిజనము లభినుతిసేయన్'

సప్తసంతానములు నిలిపిన ఆదెయామాత్యుఁడు 'వేంకటకవి కిచ్చె నిరాతంకముగా గ్రామమొకటి ధరణీశ కృపా సంకలితోద్యముఁడై....'. ఆ గ్రామమేదియో యెఱుకపడలేదు.

మేరంగిపాలకుఁడగు జగన్నాథరాజు 'సహజ దయాఖని, శత్రు చెర్లాన్వయ క్షీరపారావార శీతలఘృణి, సకలభాషాజ్ఞానశాలి, మనోంబుజకీలితశూలి, గుణాల వాలుఁ, దమిత భూసురపాలుఁ' డని కీర్తింపఁబడినాఁడు.

స్కాందపురాణోక్తమగు కార్తికమాహాత్మ్యమున కీ కావ్యము తెలుఁగు సేఁత*.

## ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మ

మేరంగిసంస్థానమున పండితుఁడుగను, దివానుగను వ్యవహరించిన వేంకటరాయసాంఖ్యాయనశర్మ (1864--1933) గారు జగమెఱిఁగిన జగా పండితులు. ఈయన వ్యవహారనామము వేంకటరావుపంతులు. శర్మగారితండ్రి బాపిరాజుగారు కూడ మేరంగి దివానులుగా నుండిరి. శర్మగారి ఉన్నతవిద్యా భ్యాసమునకు మేరంగి జమీంవారులే సాయపడిరి. వీరు తొలుత మేరంగి జమీందారుల కొలువులో శిరస్తదారుగా ప్రవేశించి తండ్రియనంతరము దివానుగా నియమితులైరి. సంస్కృత ప్రాకృతాంధ్రాంగ్లభాషలయందు వీరికి పరినిష్ఠితమైన పాండిత్యముండినది. చందమామ, ఆంధ్ర పద్యావళి (ఖండకావ్య సంపుటులు), సుధానిధి, మనోరమ యను పద్యకావ్యములు ; మనోరమ, పార్థపరాజయము, అవదాతకలభకములను స్వతంత్ర నాటకములు ; ఉత్తరరామచరిత్రము, విక్ర మోర్వశీయము అను నాంధ్రీకృతరూపకములు ; రహస్య దర్పణము అను విజ్ఞానవిషయక వ్యాససంపుటియు వీరి ముఖ్యకృతులు. వీరి ఖండకావ్యమగు చందమామ మొదట పోలవరముజమీందారుల యాజమాన్యమున నడచిన సరస్వతీపత్రికలో ప్రచురితము. శర్మగారు 'సుజనప్రమోదిని', 'కల్పలత' పత్రికాసంపాదకులు కూడ.

శ్రీ శర్మగారు వట్టి కవిమాత్రమే కాదు. సంస్థానాభ్యుదయమునకై నూతన పథకములు విరచించి నిపుణముగా నిర్వహించిన మేటి. మేరంగి సంస్థానమున మైకా విరివిగా కలదు. మేరంగి జమీందారులను ప్రోత్సహించి శర్మగారు మైకాగనుల త్రవ్వకమును సాఁగించిరి. మొదట గొప్ప లాభములు

* ప్రాచ్యలిఖిత గ్రంథాలయము, ప్రతి, R. No. 286.

వచ్చినని కాని ప్రథమ ప్రపంచ సంగ్రామ కాలమున వచ్చిన ఆర్థిక సంక్షోభము మూలమున ధరలు పడిపోయి మైకాకు గిరాకి తగ్గి కొంత నష్టము వచ్చినది. ఈ యంశమును పురస్కరించికొని కవితారంగమున శర్మగారికి ప్రత్యర్థిగా నుండిన మేరంగిసంస్థానాస్థానకవియగు జగ్గరాజకవి—

'మై కమ్మించిన పంతులు

పైకం బేపాటొ రాజు భాండారములోన్' అని శ్లేషార్థముతో నెత్తిపొడిచె నఁట! శర్మగారి సర్వతోముఖప్రతిభకు సంతసించి మేరంగి జమీందారు లీనాముగా కొన్ని భూములను శర్మగారికొసఁగి సత్కరించిరఁట![1] నాఁటి జమీందారుల సంతతికిఁ జెందిన శత్రుచెర్ల ప్రతాపరుద్రరాజు, శత్రుచెర్ల బాల గంగాధరనారాయణరాజు ఆచంట రామమూర్తిపంతులుగారియొద్ద విద్యాభ్యాసము గావించి శ్రీ శర్మగారి ప్రత్యేకపర్యవేక్షణలో పెరిగినవారు.

శ్రీ శర్మగారు మహోపాధ్యాయ బిరుదాంకితులు. వీరికి సంగీత నాట్య చిత్రలేఖనాది లలితకళలయందును, భౌతిక రాసాయానికాది శాస్త్రములయందును గొప్ప పరిచయ ముండెడిదఁట! 1923 లో నండూరున జరిగిన ఆఱవ సారస్వత మహాసభ కధ్యక్షులు[2]. తణుకులో 1924 లో జరిగిన ఆంధ్రసాహిత్యపరిషత్తువారి త్రయోదశ వార్షికోత్సవసభకు వీరగ్రాసనాధిపతులు. తెనాలిలో 1929 లో జరిగిన ప్రథమాంధ్ర నాటకకళాపరిషత్సభాపతులు. సమయస్ఫూర్తియు, వాక్చాతుర్యము, పరేంగితజ్ఞతయు శర్మగారి విశిష్ట లక్షణములు.

మేరంగిజమీందారుల కీర్తిపొలమునకు శ్రీ శర్మగారు పొలమేర.

1 భూషణం, సాంఖ్యాయనశర్మగారి సారథ్యంలో మేరంగి, ఆంధ్రప్రభ, ఆదివారము సంచిక, 1964, నవంబరు 5, పు. 7.

2 శారద, మచిలీపట్టణము, సంపుటము 2, సంచిక 1, పుటలు 1–12.

## ఉపజీవ్య గ్రంథసూచి


1. విశాఖపట్టణముజిల్లా వృత్తాంత సంగ్రహము, పుటలు 544–548.
2. రాజా మృత్యుంజయనిశ్శంకి బహద్దరు, హిల్ జమీందారుల చరితము, పుటలు 11, 12.
3. మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, ఆంధ్ర రచయితలు, పుటలు 201–205.
4. G. E. Russel, Reports on the Disturbances in Parlakimedy, Vizagapatam and Goomsoor in 1832–1836, Vol. I, Madras, 1856, pp. 34–36.
5. M.A.M.P., Vol. III, p. 500.

# రాచూరు - రేపల్లె

## ప్రవేశిక

ఇవి గుంటూరు మండలమునందు వెలసిన ప్రాచీనసంస్థానములు. ఈ సంస్థానపాలకుల రాజధానులు గుంటూరు మండలము నందలి రాచూరు రేపల్లెలు. ప్రప్రథమమున ఒకే సంస్థానముగా నుండి అనంతరకాలమునం దాసంస్థానము రాచూరు, రేపల్లె అను రెండు భాగములుగా విడిపోయి రెండు వంతులుగా నేర్పడినది. కూచిపూఁడి, గుంటూరు, చీరాల, తాడికొండ, నాదెండ్ల, నూతక్కి, పొణం, పొలడ్లు, పులివఱ్ఱు, ప్రత్తిపాడు, మంగళగిరి, మునిగోరు, రావిపూడి, సంతరావూరు అను సి పదునాలుగు సముతులతో ఏనూట ఎనుబది నాలుగు గ్రామములతోఁ గూడిన మూర్తిజాన్నగరు సర్కారు వీరి పూర్వుల తొలి సంస్థానము.

'....అమరె మూర్తుజాన్నగర సింహాసనమున
చామరచ్ఛత్ర వేణునిస్సాణ పణవ
ముఖ నిఖిలరాజచిహ్నముల్ మ్రోలఁ దనరఁ
బ్రథన జయశాలి మానికరాయమౌళి'

—ధనుర్విద్యా విలాస కృత్యవతరణిక, 29.

అని నాఁటి కొండవీటి జిల్లాలో హుజూరు నాయకుఁడు, ఖిల్లాదారు హోదాలో నున్న మాణిక్యరావు దేశముఖు పేర్కొనఁబడినాఁడు. పిమ్మట ఇనగుర్తిపాడు, కట్టెంపూడి, గారపాడుసముతు, జానం చుండూరు, నుదురుమాడుఖండ్రిక. పూండ్ల, పెదపూడి, పొత్తూరుసముతు, మండూరు, వల్లూరు, నుద్దపల్లి మొదలగు ప్రాంతములు ఈ సంస్థానమునం దుండినవి. జమీందారీరద్దు చట్టము నాఁటికి పూర్వమే యీ సంస్థాన మంతరించియుండినది.

## సంస్థాన చరిత్రము

సంస్థాన పాలకులు శ్రీమహావిష్ణుచరణ రాజీవయుగళి నవతరించిన పద్మనాయక కులసంభవులు. వీరిది 'పుణ్యపలి' గోత్రము. ఈ గోత్రజులలో మాణిక్యారావువారి కుదురు గొప్పది. వీరి తొల్లిటి యింటిపేరు 'కృష్ణానేని' వారు. మొదటి నివాసము తెలంగాణమఁట! ఇప్పటికిని వీరి పరంపరా సంబంధులు చాలమంది హనుమకొండ పరిసరముల విస్తరించియున్నారఁట! 'మాణిక్యారావు వా' రను వీరి గృహనామము గోలకొండ సులతాను కుతుబ్ షాహీ

యిచ్చిన గౌరవనామమఁట; జైనులలో మాణిక్యచంద్ర మాణిక్యసేన మాణిక్యదేవాది నామములు మాణిక్యపద ఘటితములు గలవు. తెలంగాణమున మాణిక్యప్రభువను యోగీంద్రుఁడెప్పుడో వెలసెనఁట. వారి శిష్యపరంపర నేఁడును తెలంగాణమునఁ గలదు. ఇది వారిపేర నేర్పడిన బిరుదేమోయని వేటూరి వారి యోజన.*

పద్మనాయక గోత్రముల వారిలో ప్రసిద్ధుఁడైన మాణిక్యారాయఁడను నతఁడు రణోద్యోగంబు లందాప్తుఁడయి కుతుబ్‌షాహీకి కుడిబుజముగా నుండె నఁట. కొండవీడు, కోవెలకొండ, పెదకొండపల్లి, మెదకు మొదలగు దుర్గము లను శత్రువుల దాడులనుండి కాపాడినందులకు మెచ్చి, కుతుబ్‌షాహీ మాణిక్యారాయనికి పెద్దబిరుదు లిచ్చెనఁట.

'అజానేయము రత్నకుండలయుగం బాందోళికారత్నమున్
ప్రాజాపత్యము మూర్తుజాన్నగరసామ్రాజ్యంపుమన్నెర్కమున్
రాజా మానికరావఁటంచు నభిదానం బిచ్చినన్ ప్రీతుఁడై
భ్రాజిష్ణుండగుచున్ దగున్ గుతుపషా పాచ్ఛా సమక్షంబునన్'

—ధనుర్విద్యా విలాసము, అవతరణిక, పు. 23.

'డెబ్బదియేడు గోత్రముల తీవినెసంగెడు పద్మనాయకుల' (పైది, 1—17) లో 'పున్నెపలి క్షీరాబ్ధి చంద్రులు' (పైది, 1—52) 'కుతుపశా నను[గ్రహంబున నేనూటయెనుబదినాలుగు పరగ్రామంబులఁ బ్రసిద్ధంబగు మూర్తుజాన్నగరంబున కుం దావలంబైన రాజ్యంబునకు మన్నెటికంబును, దక్కంగల సమ్మానం బులం బడసి యప్పాదుశా పసుపున మూర్తుజాన్నగరంబు బ్రవేశించి....' (పైది, 1—24) కొండవీడు మొదటి రాజధానిగా పాలించినవారు. కృష్ణాసేని మాణిక్యారావుగారి వంశము అనంతరకాలమందు వంశకర్త పేర 'మాణిక్యారావు వారు' అను వాడుకతో ప్రచురమయినది. మాణిక్యారాయని పుత్రపౌత్రాదులు గోల్కొండ నవాబుల కాలమున కొండవీటి సీమలో హుజూర్ నాయకులుగా, ఖిల్లాదారులుగా నుండి 'పౌరుషశాలియై తనరు పాదుషహా హిత మాచరింపుచు.... వారికి వారికిం దగినవైభవముల్ గని....' (పైది, 1—18) వర్ధిల్లిరి. ఈ వంశము నందలి యాద్యులందఱును కుతుపశా పాచ్ఛా హితాపాదులై వర్తించి యనేక సత్కారముల నందినవారు.

మాణిక్యారాయని కుమారుఁడు కొండలరాయఁడు అబ్దుల్లా పాదుషా కాశ్రితుఁడు; సులతానబ్దుల పాదుశాహునకు మెచ్చులు గూర్చువాఁడు. ఈయన కుమారుఁడు తిరుమలప్రభుఁడు. తిరుమలప్రభుని ప్రపౌత్రుఁడు అప్పప్రభుఁడు ఔరంగజేబుచే సమ్మానితుఁడు. మూర్తుజాన్నగర పాలకుఁడగు నితఁడు 1705 నాఁటికి రేపల్లెలో కోటను గట్టించియుండెను. అప్పప్రభుని కుమారుఁడు తిరుపతి

* ధనుర్విద్యా విలాసమునకు వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పీఠిక, పు. 38.

రాయఁడు. తిరుపతిరాయనికి చక్రమాంబవలన వెంకటరాయ, కృష్ణ, అప్ప, రమణ, వల్లభరాయ, సీతన్న యని యాఱుగురు కుమారులు. వెంకటరాయల కుమారుఁడు గోపాలుఁడు, అప్పావనీపతి తనయుఁడు రఘుపతి నవాబులనుండి రాజా కితాబులను, జెండా, నగారా మొదలగు గౌరవచిహ్నములను బడసిన వారు. ఉద్ధతులగు వాసిరెడ్డివారి యొత్తిడి కాఁగ లేక వీరి పలుకుబడి నానాఁటికి క్షీణించుచు వచ్చినది.

అన్నలందఱును, వారి పిల్లలలోని కొందఱును సంస్థానమును పాలించి మరణించిన పిమ్మట చిట్టచివరివాఁడైన సీతన్న (1737—1778) కు సంస్థానము సంక్రమించినది. సీతన్నకు లక్ష్మమ్మవలన జంగన్న, తిరుపతిరాయఁడు నని ఇద్దఱు కుమారులు. పెద్దవాఁడగు జంగన్న 1779—1811 మధ్య సంస్థానమును పాలించెను. క్రీ. శ. 1787 నుండి 'మూర్తుజాన్నగరు' (గుంటూరు) సర్కారు కుంఫిణీ ప్రభుత్వమువారి వశములో నుండినది. 1792 లో అన్నదమ్ముల మధ్య కలఁతలేర్పడి జమీ రెండు విభాగములయినది. జంగన్న కాలమునందే శాశ్వతకర నిర్ణయము జరిగినది. ఇందలి రేపల్లె వంతు జ్యేష్ఠుఁడగు జంగన్నకువచ్చినది.

'ఆయురారోగ్య పుత్రపౌత్రాభివృద్ధి
గలిగి రేపల్లె నగరశృంగార సౌధ
రత్నసింహాసనస్థితి రాజ్యమేలు
భవ్యగుణశాలి జంగభూపాలమౌళి'

—అవతారిక, ధనుర్విద్యా విలాసము.

రాచూరు వంతు తమ్ముఁడగు తిరుపతిరాయనికి వచ్చినది.

జంగన్నగారికి భావయ్య, సీతన్న యని యిరువురు పుత్రులు. రాచూరి జమీందారు లయిన తిరుపతిరాయని పుత్రులిద్దఱును నిస్సంతుగా మరణించుట వలన రాచూరి భాగము మరల రేపల్లెవారికి దఖలుపడినది. భావయ్యగారు ఈ రెండు జమీలను పాలించుచువచ్చిరి.

ఆర్థికదుస్థితివలన సంస్థానమునందలి పెక్కు సీమలను ముఖ్యముగా పొన్నూరువగైరా యిరువదిరెండు గ్రామములను అమరావతి పాలకుఁడు వాసిరెడ్డి వేంకటాద్రినాయఁడు, రాచూరు తాలూకా భాగములను నరసరావుపేట పాలకుఁడు మల్రాజు పెదగుండారాయఁడు మొదలగువారికి విక్రయించిరి. సీతన్నారావుగారి కుమారులు జంగన్నారావుగారు (1817—1870) తండ్రి మరణకాలము నాఁటికి మైనరయినందున 1828—1835 సంవత్సరముల మధ్య సంస్థానము కోర్టుఆఫ్‌వార్డ్సు వశముననుండినది. జంగన్నారావుగారు 1835 లో జమీకివచ్చి 1846 దాఁక పాలించిరి. కొన్ని యేండ్లుగా సంస్థానము పేష్కషు సరిగా చెల్లక బకాయి పెరిగిపోయినందున 1846 లో రేపల్లె జమీందారీ జప్తు చేయఁబడి యేలమునకు వచ్చినది. ఎవరును పాటపాడనందున కుంఫిణీ ప్రభుత్వమే

ఖరీదుచేసినది. రేపల్లె జమీందారీ యిట్లంతరించినది.

ఈ జమీందారీలోని రాచూరి భాగము నిదివరకే నరసరావుపేట సంస్థానాధీశ్వరులు విక్రయించికొని యుండిరి. భావయ్యగారికి అచ్చమాంబ వలన జన్మించిన వెంకటగోపాలరావుగారు (1870—1883) కేవలము పింఛనుదారులుగా నుండిరి. వీరు 1883 లో పరమపదించిరి. వీరు రాచూరి జమీందారుల కోవలోనివారు. వెంకటగోపాలరావుగారి కుమారులు వెంకటమార్కండేయరావుగారు.* వీరు చిన్నతనముననే గతించిరి. వీరి కుమారులు వెంకట హయగ్రీవరావుగారు. వీరు 1918 లో జన్మించిరి; నేటికిని సజీవులు. రాచూరి జమీందారుల కోవవారు పల్లెకోనకు చేరువఁగల రాచూరు గ్రామము నివాసముగాఁ గలవారు. వెంకట హయగ్రీవరావుగారు రాచూరి జమీందారుల సంతతికి చెందినవారు. రేపల్లె జమీందారుల వంశీయులు రేపల్లె యొద్దనున్న ఉల్లిపాలెమునందు నివసించుచుండుటవలన వీరిని ఉల్లిపాలెము జమీందారులనియు వ్యవహరించిరి.

## సాహిత్యపోషణము

పదునెనిమిదవ శతాబ్ది మధ్యభాగము దాఁక నీ వంశీయుల సాహిత్య సమారాధక చరిత్రము మనకు స్పష్టముగా తెలియదు. వీరు అనేకాగ్రహారములు, దేవాలయములు నిర్మించి దేవబ్రాహ్మణ వృత్తులను సంరక్షించిరి. చక్రమాంబా తిరుపతిరాయల పెద్దకుమారుఁడును, రేపల్లె జమీందారుఁడును నగు జంగన్న (1779—1811) 'సప్తసంతాన ప్రశస్తిని గాంచి వరకవీశ్వరుల దీవనలు గాంచి' (1—55) మించినవాఁడని ధనుర్విద్యా విలాసమునఁ బేర్కొనఁబడినది గాని యాయన పోషించిన కవులెవరో వారు రచించిన కృతులెవ్వియో తెలియదు. అయితము వేదావధానులు, రాయప్రోలు సూరంభొట్లు, పట్టెము రామలింగ దీక్షితులు, పోతుకుచ్చి పాపంభొట్లు, నేతి తెలగావధానులు, బూరుగుల నిమ్మంభొట్లు మొదలగు వేదశాస్త్ర పండితులకు జంగన్నారావుగారు చెటి 82 కుం. భూమిని దానముచేసినట్లు మాత్రము నిదర్శనములున్నవి.

## కృష్ణానేని తిరుపతిమాణిక్యరాయఁడు

జంగన్న తమ్ముఁడును రాచూరి పట్టణాధిపతియు (1—61) ను నగు తిరుపతిరాయఁడు ధనుర్విద్యా విలాసకృతి ప్రేరకుఁడు. మొహమ్మదు జాఫర నామధేయుఁడగు శరాసనగురుని యాశ్రయమున ధనుర్విద్యా రహస్యముల నేర్చినవాఁడు కృష్ణానేని తిరుపతిమాణిక్యరాయ ప్రభువు.

'శ్రీమన్మహాదేవ సేవానుభావంబు
గాని ధనుర్ధరుఁడైన గుహునిలీల

* ఆంధ్రపత్రిక, సంవత్సరాది సంచిక, క్రోధన, 1925, పు. 332.

గాధేయ బోధంబుగాంచి కోదండ దీ
క్షాగురుండైన దాశరథిలీల
పరశురాము భజించి శరశరాసన కళా
ఘనుఁడైన జాహ్నవీతనయులీల
ద్రోణు నారాధించి బాణాసనాభ్యాస
పటిమంబుగాంచిన పార్థులీల
శ్రీమహమ్మదజాఫరు నామధేయుఁ
డగు శరాసనగురువరు నాశ్రయంబుఁ
బడసి విలుదాల్చి కలియుగపార్థుఁడనఁగఁ
బ్రౌఢిఁ జెలువొందెఁ దిరుపతిరాయశౌరి' —1–60.

అష్టాదశవిద్యలలో ధనురాగమము మిక్కిలి గణనీయమనియు, దీనిని కావ్యముగా వెలయింపఁజేయుమనియు, సప్తసంతానములందు కావ్యము సనాతనమనియు—

'నరుఁడా కుంభజు వేఁడినట్లు గురుఁడానందంబునం గ్రీడితోఁ
బరిపాటిం వినిపించినట్లుగఁ గథాభాగంబు భాగించి క్రొ
వ్విరులం చేనియ గూర్చు కైపడి ధనుర్విద్యా విలాసాహ్వయం
బొరయం గావ్యము మాకు నర్పణముగా యోజింపుముత్సాహివై'
—1–71.

అని కోదండరామమూర్తి కృతిప్రేరకుఁడగు తిరుపతిరాయనికిఁ గలలో కని పించి యాదేశించెనఁట.

## అకలంకము కృష్ణకవి

తిరుపతిరాయఁడు ధనుర్విద్యావిశేషములను వివరింపఁగాఁ దదాస్థాన కవియగు కృష్ణమాచార్యుఁడు తెలుఁగున ధనుర్విద్యావిలాసమను పేర మూఁడా శ్వాసముల కృతిగా కృతిప్రేరకుని యిలువేల్పు కృష్ణానదీతీరమున రేపని పురమున జానకీ సమేతుఁడయి అర్చాస్వరూపమున విలసిల్లుచున్న కోదండ రామస్వామి కర్పితముగ రచియించినాఁడు. కవి మైత్రేయ సగోత్రుఁడు. రామానుజ పాద భక్తుఁడు. 'కౌసల్యానందన కటాక్షవీక్షణ పరంపరాసాదిత కవితావిచిత్ర సుకవి జనానుగ్రహపాత్రుఁడు'. మరుత్తనయారాధనలబ్ధ చారు కవితాధీరుఁడు. ఇది యే సంస్కృతకృతికిని ఆంధ్రీకరణము గాదు.

ఈ కవి మఱియొక కృతి శకుంతలా పరిణయమను శృంగారప్రబంధము చిలుమామిళ్ళ పాపయ్య యను నామాంతరము గల వేంకటాద్రినాయనింగారి ప్రేరణమున రచితమై తిరుపతి వేంకటేశ్వరస్వామి కర్పితమై యున్నది. శకుంతలా పరిణయమునందు కృతికర్త కృష్ణకవి యనియు, కృష్ణమాచార్యుఁ డనియు వ్యవహృతుఁడు. 'ఇది శ్రీమత్కౌసల్యానందన ప్రసాద సమాసాదిత

కవితా విచిత్ర మైత్రేయసగోత్ర నృసింహగురుపుత్ర కృష్ణమాచార్య ప్రణీతం బయిన శకుంతలా పరిణయము....' అని యాశ్వాసాంత గద్యములయందు కృష్ణమాచార్యుఁడనియు—

'పాత్రుఁడవై మైత్రేయస
గోత్రుఁడవై నారసింహగురువర్యునకున్
బుత్రుఁడవై వెలయుదు వి
ద్ధాత్రిన్ మావసువు సేయఁదగు కృష్ణకవీ!'

యని యవతారికాభాగమునందు కృష్ణకవి యనియు నుట్టంకింపఁబడుట గమనింపఁ దగినది. ధారాశుద్ధి, ధనురాగమవిషయసమృద్ధికలిగిన ప్రౌఢకావ్యమిది. కృతి ప్రేరకుల పూర్వరాజధాని కొండవీడు ఈ కావ్యమున నిట్లు పరికీర్తితమయినది.

'పసమించు భీష్మక ప్రముఖావనీపాల
కులకు వజ్రపుజోడు కొండవీడు
శత్రు రాజాధిరాజ విరాజదైశ్వర్య
కుదిరంబు మురుద్రాడు కొండవీడు
అఖిలయాచక రాజహంసయూధములకు
క్రొందామరలకొడు కొండవీడు
దేవతాయతనమై దీపించుకల్యాణ
కుధరంబుసైదోడు కొండవీడు
హరిహరవిరించి ముఖదేవతావతంస
సంసదభిరామ హేమ విశాలశాల
జాగ్ర దగ్రముహుర్ముహుశ్చటులపటహ
ఘుమఘుమ ధ్వానములగూడు కొండవీడు.'

'పరరాజ్య పరదుర్గవరవైభవశ్రీలఁ గొనకొని విడనాడు కొండవీడు' అను పద్యమున కిది యనుకరణము. మాదిరి కొకపద్యము.

'శరసంధాన విధాన తానకములన్ సంధిల్లు నిర్దోషముల్
పరిభావించి ధనుఃకళానుకలనా భాస్వన్మనోవృత్తియై
శరసంధాన విమోచనమ్ముల విశేషమ్ముల్ పిసాళింపుచున్
నరుఁడానందము నొందుచుండు ధరణీనాథుల్ ప్రశంసింపఁగాన్'
—నారాచనిర్మాణము, 199.

## ఉరుటూరి వేంకటకృష్ణకవి

హరితస గోత్రుఁడును, అపస్తంబసూత్రుఁడును, ఉరుటూరి వెంగన్నమంత్రి తనయుఁడును నగు వేంకటకృష్ణ సుకవి ఆకాశరాపణ సంహారమను

గ్రంథము*ను కృష్ణానేని తిరుపతిమాణిక్యారాయప్రభుని ప్రేరణమున రచించి కృష్ణానేనివారి కులదైవమగు ఈపని కోదండరామస్వామికిఁ గృతి యిచ్చినాఁడు. శ్లేషకవితా పితామహుఁడగు నితఁడింకను రాఘవపాండవయాదవీయాది బహు ప్రబంధ నిబంధన ప్రవీణుఁడయినట్లు ఆకాశరావణ సంహార కావ్యమునందలి యాశ్వాసాంత గద్యమువలనఁ దెలియుచున్నది. 'ఇది శ్రీవిష్ణుచిత్తముని చరణ సేవాధురీణ రాఘవ పాండవ యాదవీయాది బహుప్రబంధ నిబంధన ప్రవీణ....సంస్కృతాంధ్ర భాషాచతుర్విధ వివిధ కవితానిలయ వెంగనమంత్రి తనయ వినయవిశంకట వేంకటకృష్ణకవి....'.

> 'అరి బలములోన నొకఁడైన సంశ్రితలము
> ముల్లుగాఁడక యున్నాఁడు మోదమెసఁగ
> నింక నేరీతిసాధింతు నెద్దివెరవు
> సురలగెల్చిన బలమెల్లఁ జూఱవోయె'

అని రావణుఁడు చింతించు పద్యముతో కథాభాగ మారంభమగు చున్నది. లభ్యమయిన అవతారికా భాగమునందలి కృతిప్రేరకుని వంశావతార మంతయు నించుమించుగా ధనుర్విద్యా విలాస కృత్యవతారికకు మక్కీకి మక్కీగానకలు. ఇది లేఖకుల చెయివాటో, పాఠకుల అలవాటో, లేక ఈ రెండు గ్రంథములెత్తి వ్రాయఁబడిన తాటియాకు లటునిటు కలిసిపోవుటవలని పొరపాటో కావచ్చు. అంతేకాని, చతుర్విధ కవితానిలయుఁడగు నీకవి మఱియొక కవి కూర్చిన యవతారికాభాగమును సొంతముచేసికొనునంత కక్కుఱితి గలవాఁడుకాఁడు. శివరహస్యఖండ కృతికర్తయును, ముఖబాగళ ప్రభు నాశ్రితుఁడును నగు బాలసరస్వతి కోడూరి వేంకటాచలకవి కీ కృష్ణకవి మాతులుఁడు.

కృష్ణా గుంటూరు మండలములయందు వితరణ గుణమునకును, విక్రమ క్రమమునకును మాణిక్యారావువారి వంశము పేరుపొందినది. భావన్నారావుగారు సంగంజాగర్లమూడిలోని సంగమేశ్వర దేవాలయమున కీనాముగా భూముల నిచ్చిన పుణ్యమూర్తి. వీరి తనయులగు వెంకటగోపాలరావుగారు సకల కళా రసికులు; నిరతాన్నదాతలు. వీరు అశ్వారోహణ ధనుర్విద్యాపాటవముల జితశ్రములఁట ! వీరి ముఖ్య నివాసస్థానము పల్లెకోనకు చేరువలోఁగల రాచూరు. ఈ వంశీయులకు సంబంధించిన అనేకచాటువులు వ్యాప్తిలో నున్నవి. భావన్నా రావుగారి మీఁది పద్యము :

> 'సుమమౌక్తికాకల్ప సుప్రతీకంబుతో
> కంబుతోఁ బుండరీకంబుతోడ

*యుద్ధకాండ కథాభాగము మాత్రము కలిగి అతి శిథిలావస్థలోనున్న ఆకాశరావణ సంహార కావ్యప్రతి ప్రాచ్యలిఖిత గ్రంథాలయమున నున్నది. R. No. 663.

పల్లవకుసుమసంవాదనైకాంతుతోఁ
గంతుతో రోహిణీకాంతుతోడ
అధిగతపరమోగ్రుఁడైన స్వర్భానుతో
భానుతో నల చిత్రభానుతోడ
దండిగా దేవ కోదండాభిరాముతో
రాముతో నందనారాముతోడ
నీదు సత్కీర్తి నీమూర్తి నీ ప్రతాప
దీప్తి నీ దోర్బలస్ఫూర్తి దీటుమిగిలి
యలరె మాణిక్యరాయ వంశాబ్ధిసోమ
భాసురగుణాళి భావభూపాలమౌళి'

—చాటుపద్యమణిమంజరి, ద్వి. భా., పు. 94.

'ఒకతాత రుతుబుశా ప్రకటదక్షిణభుజా
దండుఁడై కోవెలకొండ యేలె
నెలమి రెండవతాత యిభరాముపాదుశా
పంపునఁ బెదకొండపల్లె యేలె
మహిమించు ముమ్మడి మాణిక్యరాయండు
వినుతికెక్కిన కొండవీటి నేలె
రాణించు రఘుపతిమాణిక్యరాయండు
పరభయంకరవృత్తిఁ బరిఢవిల్లె
తండ్రికంటెను బెదతండ్రితండ్రి కంటె
తాత ముత్తాతలకు నెల్ల ఖ్యాతి దనర
మన్నెగంటి కృష్ణానేని వంశమునను
నిర్మలోపాయ బళిర మాణిక్యరాయ' —పైది, పుటలు 94, 95.

ఇది అచ్చమాంబా భావన్నారావుగారల తనయుఁడగు రాజా వెంకట గోపాలరాయ మాణిక్యరాయబహద్దవారి మీఁది ప్రశంసాపద్యము. 'మాణిక్య రాడ్వంశ మందారభూజంబు', 'పద్మనాయకమనః పద్మహేళి', 'మన్నె కులోద్యాన మధుమాసపైకంబు', 'పుణ్యవలిగోత్ర వితతాబ్ధి చంద్రుఁడు', 'అర్థిచాతక వార్షుకాంబుదంబు', 'సత్కవీశ్వర నితాంతవర్ణిత స్వాంతుఁడు' అనియు నీ వెంకటగోపాలరావుగారు అనేక చాటూక్తులలోఁ గీర్తింపఁబడినారు (చూ. పైది, పుటలు 94—96).

ఈ వెంకటగోపాలరావుగారి పౌత్రులును, రాజ్యలక్ష్మ్యంబా మార్కండేయరాయల పుత్రులును రాచూరు జమీందారులును నగు శ్రీ రాజా మాణిక్యా రాయ వెంకటహయగ్రీవరావుబహద్దరుగారును విద్యాపోషకులు; ఉదారాశయ సంపన్నులు. వినయాశ్రమము వారి శుక్లయజుర్వేదీయాంధ్రానువాద గ్రంథ

ముద్రణమునకుఁగాను తమతల్లి జ్ఞాపకార్థము రూ. 2,500 లు విరాళము సర్పించి వేదవిద్యావ్యాప్తికిఁ దోడ్పడిరి. ధనుర్విద్యా విలాసకృతి లిఖితప్రతి ప్రదాతలు వీరే.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. కందుకూరి వీరేశలింగము పంతులు. ఆంధ్రకవుల చరిత్రము, తృతీయ భాగము, పుటలు 249—251.

2. వేటూరి ప్రభాకరశాస్త్రి, ధనుర్విద్యావిలాసకృతిపీఠిక.

3. అక్కిరాజు ఉమాకాంతము, అరవదేశమునందలి ఆంధ్రవాఙ్మయము, పుటలు 81—92.

4. చాటుపద్య మణిమంజరి, ద్వితీయభాగము, 1922.

5. దరువూరి వీరయ్య, గుంటూరుమండలసర్వస్వం, పుటలు 134, 135.

6. A Descriptive Catalogue of Telugu Manuscripts in Government Oriental Manuscripts Library, Madras, Vol. XIV (Telugu Local Tracts), 1952.

# లక్కవరము

## ప్రవేశిక

గోదావరీమండలములోని లక్కవరము, బిల్లుమిల్లి మొదలగు ఎస్టేటులు మంత్రిప్రెగ్గడవారివి. జంగారెడ్డిగూడెము, దిప్పకాయలపాడు, బయ్యనగూడెము, వెల్ల, సరిపల్లి మొదలగు మిఠాలు బిల్లుమిల్లి యెస్టేటులోనివి. ఈ యెస్టేటు పోలవరముతాలూకాలోనిది. ఇవి నవీనమైన ప్రొప్రయిటరీ యెస్టేటులు. 1937 లో వీని రాఁబడి రూ. 22,770 లు. పేష్కషు ఇంచుమించు నాలుగువేలు.

## సంస్థాన చరిత్రము

మంత్రిప్రెగ్గడవారు ఆఱువేల నియోగులు, హరితసగోత్రోద్భవులు, ఆపస్తంబసూత్రులు. వీరి నివాసస్థానము ఏలూరు. వీరి మూలపురుషుఁడు గురురాజు. ఈయన ఏలూరులోని మార్కండేయగంగాధరాలయ నిర్మాత. ఈతని వంశమున ప్రసిద్ధుఁడు అప్పలరాజు. ఈయన తనయుఁడు భుజంగరాయఁడు. ఈయన లక్కవరము మొదలగు ఎస్టేటులకు జమీందారుఁడు. 'స్వధీభుజబల సంపాదిత రాజ్యరమాధురీణుఁడు'. ఈయన ఎస్టేటును విస్తరింపఁజేసి, సాంఘికసేవాకార్యక్రమములయందు విశేషాసక్తిని ప్రదర్శించి, ప్రభుత్వమువారి నుండి 'రాజా బహద్దర్'ాది బిరుదములను బొందినవారు.

భుజంగరావుగారికి చిన్నమ, శేషమ, సీతమ, రంగమ యని నలుగురు భార్యలు. చిన్నమవలన మల్లికార్జునప్రసాదరావు అను కుమారుఁడును, రామమ్మ యను కొమార్తెయును, శేషమ్మవలన సుబ్బమ్మ, శేషమ్మ లను నిరువురు పుత్రికలును కలిగిరి.

మల్లికార్జునప్రసాదరావు అనేక సత్రములు వేయించి, భూరిదానపత్రములు వ్రాయించి, సత్క్రియలఁగావించి, యేలూరు సందలి మార్కండేయగంగాధరాలయమున వీరభద్రప్రతిష్ఠఁగావించి ప్రతిష్ఠను బడసినవారు. వీరిభార్య రాణి సీతావిజయలక్ష్మీదేవిగారు. వీరికి సంతతి లేనందున సమీపజ్ఞాతులగు మంత్రిప్రెగ్గడ వేంకమాంబా మల్లయామాత్యవర్యుల కుమారులగు భుజంగరావుగారిని (1876–1943) దత్తుగా స్వీకరించిరి. పాలకజననియగు రాణి సీతావిజయలక్ష్మీదేవిగారు మరణించినందున మల్లికార్జునప్రసాదరాయల సవతితల్లియగు శేషమ్మ పెంపకములో దత్తుఁడగు భుజంగరావు పెరిగి పెద్దవాఁడయ్యెను.

రాజా మంత్రిప్రెగ్గడ భుజంగరావుగారు వేగాయమ్మపేట జమీందారిణి

గారి మనుమరాలగు చిన్నమ్మారావుగారిని పరిణయమాడిరి. దక్షారామగ్రామము నకు సమీపమునఁగల వేగాయమ్మపేట లేక దొడ్డమపేట జమీందారిణి శ్రీ రాజా వాద్రేవు రంగనాయకమ్మగారు. ఈమెకు పురుషసంతతి లేదు. ఈమె తనయ మహాలక్ష్మమ్మ. ఈమెను సమీపబంధువులగు కస్తూరి నరసింహారావుగారి కిచ్చి యిల్లటిక ముంచికొనిరి. ఈ దంపతుల పుత్రికయే సుబ్బమ్మగారు. ఈమె వ్యవహారనామము రాణి చిన్నమ్మదేవి. వేగాయమ్మపేట జమీందారు వాద్రేవు విశ్వసుందరరావు భుజంగరాయల బావమఱఁది; అయ్యగారి వీరభద్రరావు తోడియల్లుఁడు.

రాజా భుజంగరావుగారి కుమారులు పద్మనాభదుర్గామల్లికార్జునప్రసాద రావు బహద్దరు. భుజంగరాయల ప్రథమపుత్రిక హైమవతీ సీతావిజయలక్ష్మని పడ్లమన్నాటి వేంకటరామయ్యపంతులుగారి కుమారులు సత్యనారాయణగారి కిచ్చిరి. ఉర్లాముజమీందారు రాజా కందుకూరి లక్ష్మీప్రసాదరావు రాజా భుజంగ రావుగారి వియ్యంకులు. ఉర్లాముజమీందారు కుమారులు కందుకూరి బాలసూర్య ప్రసాదరావు భుజంగరాయల యేడపయల్లుఁడు.

భుజంగరావుగారు ఏలూరు, బెజవాడ, గుంటూరు మొదలగు పట్టణముల యందు అనేక ధర్మసంస్థలను స్థాపించి, వాని సక్రమనిర్వహణమునకు తగు వసతులను సమకూర్చిన ధర్మకార్యతత్పరులు.

## సాహిత్య పోషణము

భుజంగరావుగారు మామూలు జమీందారులును, సామాన్య రచయితలును కారు. వీరు శతాధికగ్రంథరచయితలు, వితరణచతురులు, దర్శనాచార్య బిరు దాంకితులు. సంస్కృతాంధ్రాంగ్లములయందు వీరికిఁగల ప్రతిభాపాండిత్యములకు వీరు సంతరించిన చతురకృతులే చక్కని సాక్ష్యములు. దిగ్దంతులవంటి పండితులు కూడిన సభలో వీరు అష్టావధానమొనర్చి విజయమునుగాంచి సభాపతులైన మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నముపంతులుగారిచే ప్రశంసలను పొందినవారు. అనువాదములు, అవధానములు, ఆశుకవిత్వము, కథలు, గాథలు, చాటుపులు, జీవితచరిత్రలు, నవలలు, నాటకములు, ప్రబంధములు, ప్రహసనములు, వచనకావ్యములు, వాఙ్మయచరిత్రము, శతకములు—ఇత్యాది సకల సాహిత్యశాఖలలో వీరి పరిశ్రమము కొనసాఁగినది. కావ్యనిషేవణము, కవిపండితసమాదరణము, పత్రికానిర్వహణము, ప్రాచీన కావ్యప్రచురణము వీరి సాహిత్యకృషిలోని ముఖ్యాంశములు.

## భుజంగరాయకృతులు

వీరు రచించిన కృతులలో వసంతకుసుమము, వారకాంత, శివ

పురాణము, మార్కండేయచరితము, శంకరతారావళి మొదలగు పద్యకావ్యము లును; విద్యున్మాల, శశిరేఖ, చిత్రహరిశ్చంద్ర, పాండవాజ్ఞాతవాసాది స్వతంత్ర నాటకములును: ఉత్తరరామచరిత్రము, ప్రసన్నరాఘవము, శాకుంతలము మొదలైన ఆంధ్రీకృతనాటకములును; 'చారుమతి' మొదలయిన ఆంగ్లనాట కానువాదములును; చమత్కారస్నేహ విధవావివాహ నిరపవాద మహాయోగ రహస్యాది ప్రహసనములును; మనోరమ, రాజహంస, వాసంతిక, విజయాంక సాహసము మున్నగు నవలలును; సంస్కృతభాషావాఙ్మయము, గానామృతము, శిశుసంజీవని మొదలగు వచనకావ్యములును; భగవద్గీత, తత్త్వమీమాంస, శివగీతలు మొదలగు తాత్త్విక రచనలును; క్రీస్తుమతసారము, క్రైస్తవగూఢార్థ దీపిక, మత్తయి, లూకా, మార్కు, యోహాను, సువార్తలు, సత్క్రైస్తవ శతకము మొదలగు క్రైస్తవగ్రంథములును ముఖ్యమైనవి. భుజంగరావుగారు ఆంగ్లభాషయందుకూడ పేరువొందిన రచయితలు. Inner Doctrines of Christianity, The Power of Christ, Baptism, A History of Telugu Literature మొదలగునవి వీరి యాంగ్లకృతులు. చివరికృతిని పి. చెంచయ్యగారి తోడ్పాటున సంతరించిరి. వీరి ప్రథమపుత్రిక హైమవతి పరిణయసందర్భమున 232 మంది విద్వత్కవులు అందిచ్చిన యాశీఃపద్యము లతో ఆయా కవుల సంక్షిప్తచరిత్రములు చేర్చి వీరు 'హైమవతీపరిణయము' లేక 'ఆధునిక కవిజీవితములు' అను పేరుపెట్టి ప్రకటించిన గ్రంథము చాల విలువకలది. వీరికి సర్వమతములయందును సహనమును, సమదృష్టియును, సానుభూతియును కలదు. ప్రాచీనార్షధర్మముపట్లను వీరికి విశేష భక్తిప్రపత్తు లుండెడివి. 'తత్త్వమీమాంస' యను 854 పద్యములుగల వీరి తాత్త్విక గ్రంథము బహుమత సిద్ధాంతములను సాంతము పరిశీలించి, సర్వమత సమన్వయదృష్టితో సత్యపదార్థతత్త్వమును దర్శించి, ఆయా మతములలోని బాగోగులను నిశితముగా విమర్శించి కూర్చిన సంపుటీకరణము. వీరికవిత్వము చాలవరకు లక్షణబద్ధము.

రాజాగారి రచనారీతుల నెఱుఁగుటకు మచ్చునకుఁ గొన్ని పద్యములు:

> 'అరిగెడు మా శకుంతల యఁటంచు మనంబున బెంగగూరె; దు
> ష్కరమగు నశ్రురోధమునఁ గంఠము మగ్గె; సలంతఁ జూడ్కి సొం
> పఱె; వనవాసి నేనె యకటా! యిటులర్మిలిగుంద నింక ను
> ద్ధుర తనయావియోగనవదుఃఖము గేస్తుల నెట్లు లేచునో'
>
> —శాకుంతలము, అంక. 4, వ. 6.

> 'స్థిరదంష్ట్రోత్కటకోటిమధ్య విచలజ్జిహ్వోజ్వలచ్ఛింజినీ
> స్ఫురితోద్గారి ఘనాళి ఘర్ఘర రవస్తోమాస్పదంబై చరా

చర భూతగ్రసనోద్యదంతక హసచ్చండాస్యయంత్ర ప్రభా
స్వరజృంభావిపులోదరంబగుచు నీ చాపంబు దీపించుతన్'
---ఉత్తరరామచరిత్రము, అంక. 4, ప. 29.

'అలమందాకిని హేమపద్మముల నొయ్యం బువ్వొడిందీసి యు
జ్జ్వల పీయూషరసంబునన్ బదను హత్తంజేసి; సమ్మోద ని
ర్మలచిత్తంబున నల్వచెల్వను సృజింపంబోలుఁ గాకున్న నీ
లలితాంగద్యుతి మాధురీవిభవముల్ గాన్పించునే కాంతలన్'
—విద్యున్మాల, అంక. 1, ప. 9.

'కడళిపై నావ చుక్కాని నడపువాని
యభిమతానుసారంబుగ నరుగునట్లు
సకలజీవులు దైవవిజ్ఞానసరణి
ననుసరించి తరించెద రనవరతము'
—తత్త్వమీమాంస. 443.

## భుజంగరాయ స్వీకృతులు

వీరు కృతినొందిన గ్రంథము లసంఖ్యాకములు. ఆదిపూడి ప్రభాకరకవి కృతములగు ఆంధ్రపరాశరస్మృతి, కవిరాజసందర్శనము, నేతి సుబ్బరాయ శాస్త్రి విరచితమగు ధర్మజరాజసూయ మను వచనకావ్యము, కోన వేంకటరాయ శర్మ రచితములగు దండనాథులు, ప్రాచీన హిందూదేశ రాజ్యాంగ చరిత్రము, కూచి సత్యనారాయణ కూర్చిన పద్మినీప్రభాకరాఖ్యమహాప్రబంధము. అన్నమ రాజు సుబ్బరాయనిర్మితమగు హనుమజ్జీవితసత్ప్రబంధము, మచ్చ సూర్యరాయ కవి ప్రపంచయుద్ధచరిత్ర మను పద్యకావ్యము, కొత్తపల్లి సుందరరామకవి భుజంగరాయ, భుజంగ భూపాలశతకములు, అడవి సాంబశివరావు రచించిన భుజంగనృపాలశేఖరశతకము, నందిరాజు చలపతిరాయకవి రాజకళింగగంగు నాటకము, రావూరి చిట్టివెంకటసుబ్రహ్మణ్యకవి భుజంగరాయ సందర్శనము, చిల్లరిగె యోగానందకవి కనకపల్లి యను నవల, కాలనాథభట్ట నారాయణశాస్త్రి హనుమద్విజయ మను సంస్కృత పద్యకావ్యము మున్నగునవి వీ రంకితము నొందిన ముఖ్యకృతులలో కొన్ని.

## ప్రాచీనగ్రంథప్రచురణము

'మంజువాణి' అనుపేర నొక సాహిత్యమాసపత్రికను, ఒక ముద్రాక్షర శాలను ఏలూరునందు నెలకొల్పి, ప్రాచీనార్వాచీనగ్రంథముల ననేకము ముద్రింపించి భాషోపకార మొనర్చిరి. వీరు ప్రచురపఱిచిన ప్రాచీనగ్రంథము లలో కూచిమంచి తిమ్మకవికృతమగు సర్వలక్షణసారసంగ్రహమును, అహో

బలపతి రచించిన కవిశిరోభూషణమును, అడిదము సూరకవి ఆంధ్రీకరించిన చంద్రాలోకమును, కుమారధూర్జటికృతమగు కృష్ణరాయవిజయమును, తిరుమల బుక్కపట్టణము కిరీటివేంకటాచార్యులు రచించిన అచలాత్మజాపరిణయమును, ఏనుగు లక్ష్మణకవి కైసేసిన రామేశ్వర మాహాత్మ్యమును, సారంగు తమ్మయ సంతరించిన వైజయంతీవిలాసమును, ముక్కు తిమ్మన నిర్మించిన పారిజాతాప హరణమును, రాకమాని మూర్తికవి సంధానించిన రాజవాహనవిజయమును, కొటికెలపూఁడి వేంకటకృష్ణకవిరచితమగు దిలీపచరిత్రమును ముఖ్యమైనవి. ఆంధ్రలోకోక్తిచంద్రిక, సంస్కృతలోకోక్తిచంద్రిక, శకటరేఫనిర్ణయము మున్నగునవిసైతము వీరివలన ముద్రణమునందినవి.

## ఆస్థానకవిపండితులు

శొంఠి భద్రాద్రిరామశాస్త్రి (1856–1915), కోన వేంకటరాయశర్మ, కొత్తపల్లి సుందరరామయ్య, నోరి సీతాకాంతశాస్త్రి, దేవరకొండ మాణిక్యశాస్త్రి, అకొండి వ్యాసమూర్తిశాస్త్రి, కూచి సత్యనారాయణ, నందిరాజు చలపతిరాయ కవి, దామరాజు శోభనాచలము భుజంగరావుగారి ఆస్థానకవిపండితులు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, తిరుపతివేంకటకవులు, కార్యమపూఁడి రాజమన్నారుకవి, వేదము వేంకటరాయశాస్త్రి, శ్రీనివాస సోదరకవులు, కొప్పరపు సోదరకవులు, ఆదిపూడి ప్రభాకరకవి, గుడుపూటి ఇందుమతీదేవి మున్నగువారు భుజంగ రాయని యాస్థానమున సమ్మానముపడసిన విద్వత్కవులు.

భుజంగరాయల శశిరేఖాపరిణయనాటకమును సుప్రసిద్ధులు ముప్పిడి జగ్గ రాజాదులు పిఠాపురములో నెలకొల్పిన నాటకసమాజమువారు ఆంధ్రదేశములో బహువారములు ప్రదర్శించి కృతికర్తకు పేరుపెంపులను దెచ్చిపెట్టిరి.

భుజంగరాయలనుగూర్చి శ్రీ వేమూరి శ్రీరామశాస్త్రిగారు చెప్పిన ప్రాసంగికపద్యము :

'రాజని యంద్రు గాక శశి, రాజని వజ్రివచింత్రుగాక, రా
డ్రాజుగ నెంత్రుగాఁక ధనరాజును, రాజన నేమి శక్తియో
రాజను మాత్రగాక కవిరాజుగఁ గూడ గణింప నర్హతౌ
రాజు భుజంగరాయఁడె విరాజితకీర్తివిశాలుఁడయ్యెడిన్'

తిరుపతివేంకటకవుల ప్రస్తుతి యిది :

'కవి వవధానివి రాజవు
కవితాకన్యకలఁ గన్యకలఁ బెక్కురఁ గం
టివి జగతిని నీతో సము
లెవరయ్యా ! యో భుజంగపృథ్వీనాథా'

## ఉపజీవ్య గ్రంథసూచి

1. మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, ఆంధ్ర రచయితలు, పుటలు 371–375.

2. హైమవతీపరిణయము, పుటలు 300–305.

3. మంత్రిప్రెగ్గడ భుజంగరావు, రాణీ చిన్నమ్మారావు జీవితము, మంజువాణీ ముద్రాక్షరశాల, ఏలూరు, 1938.

4. భుజంగరాయ నిర్యాణము, 1943.

5. తిరుపతివేంకటకవులు, నానారాజసందర్శనము, పుటలు 185–188; 285, 286.

6. మంత్రిప్రెగ్గడ భుజంగరావు, వసంతకుసుమము, పీఠిక.

7. అద్దేపల్లి నాగగోపాలరావు, తెలుఁగు జమీందారుల సారస్వతసేవ, ఆకాశవాణి, 1958.

# వనపర్తి

## ప్రవేశిక

ఇది మహబూబ్ నగరము మండలములోనిది. వైశాల్యము 450 చ.మై. జనాభా 65 వేలు. గ్రామములు 124. దీనికి 'సూగూరు' సంస్థానమనియు నామాంతరముండినది. ఈ సంస్థానమునకు పూర్వపు రాజధాని సూగూరు. ఈ సంస్థాన పాలకులలో నొకరైన మొదటి రామకృష్ణరావుగారు రాజధానిని సూగూరునుండి వనపర్తికి మార్చుటవలన నాఁటినుండి యీ సంస్థానమునకు పేరు మాఱినది,

## సంస్థాన చరిత్రము

సంస్థానపాలకుల గృహనామము జనుంపల్లివారు. వీరు మోటాటిశాఖకు చెందినరెడ్లు. 'మొటవాడ' నేఁటి కర్నూలు మండలము మార్కాపురముతాలూకా లోని భాగము. మొట్టవాడియని ప్రాచీనాంధ్ర కర్ణాటశాసనములలోని వ్యవహారము. ప్రాగుటూరి యేలిక బిజ్జుల తిమ్మభూపాలుని అనర్ఘరాఘవ కృత్యవతారిక యందును 'మొటవాడ' పదము ప్రయుక్తము[1]. కొణిదెన గ్రామము చెన్న కేశవస్వామి దేవాలయ శిలాశాసనమునందు 'దినకరకులుడైన త్రిభువనములందు కమ్మనాండును గుండికట్టమొట్టవాడియుంజేకొని రూడింగా నేలంగ గొట్టియ దొనయను పట్టణమున' అని మొట్టవాడి ఉట్టంకింపఁబడినది[2]. మొట్టవాడియే మొటవాడగా మాఱినది. మొటవాటి, మోటాటి దీని వికృతులు. వీరి మూల పురుషుఁడు దేశముఖు శ్రీ వీరకృష్ణభూపతి లేక వీరకృష్ణారెడ్డి. వీరిది పెనుబాల గోత్రము. ఇంచుమించు నన్నూరేండ్ల క్రిందట నీయన నేఁటి కర్నూలు మండలము నంద్యాల తాలూకాలోని జనుంపల్లి వాస్తవ్యుఁడఁట! విజయనగర సామ్రాజ్యమునకు లోఁబడిన యొక సామంతుఁడుగా వీరకృష్ణ భూపతి నంద్యాల సీమలో నధికారము నిర్వహించుచుండిన వాఁడఁట. విజయనగర సామ్రాజ్యమును వీరప్రతాప శ్రీ కృష్ణదేవరాయ లేకాతపత్రముగా నేలుచున్న కాలమున నీ కృష్ణారెడ్డి తన పరివారముతో బయలువెడలి పానుగంటి సీమలోని 'పాతపల్లి' యను గ్రామమున స్థిరపడి యచ్చట వర్తకము సాఁగించుచు,

1. తిమ్మభూపాలుని అనర్ఘరాఘవము, ప్రాచ్యలిఖిత గ్రంథాలయము ప్రతి R. No. 629.

2. కుందూరి ఈశ్వరదత్తు, ప్రాచీనాంధ్ర చారిత్రకభూగోళము, పుటలు 272, 273.

స్థానికుల కప్పుసప్పులిచ్చి, విత్తముతోపాటు పెత్తనమును సైతము సంపాదించి, వనపర్తి యిలాఖాకుచెందిన యీ పాతపల్లి గ్రామమును కొని దండిగా గడించి చుట్టుముట్టు ప్రాంతములను క్రమక్రమముగా నాక్రమించి సూగూరు పట్టణమును రాజధానిగా చేసికొని పాలించెనఁట.

వీరకృష్ణభూపతికి నాల్గవతరము వాఁడైన వేముడి వెంకటరెడ్డి హిజరి 1052 (క్రీ.శ. 1633)లో కుతుబ్‌షాకు పదివేలసేనతో యుద్ధమునందు తోడ్పడి నెల్లూరును ఉదయగిరిఖిల్లాను పట్టుకొని సుల్తాను మెప్పులను పొందెనఁట. వెంకటరెడ్డి కుమారులు గోపాలరాయలు. వనపర్తి పాలకవంశమునందు 'బహిరీ' బిరుదమును సంపాదించినవాఁ డితఁడే. ఈ గోపాలరాయలు హిజరీ 1056 (క్రీ. శ. 1637)లో పరమపదించెను. గోపాలరాయలకు పురుషసంతతి లేనం దున సవై వెంకటరెడ్డి దత్తుగా వచ్చియుండెను. వెంకటరెడ్డి కాలమున సంస్థాన మప్పుల పాలైనది. కప్పము సరిగా చెల్లుకాలేదు. నిజాముతో జరిగిన యుద్ధము లలో వెంకటరెడ్డి యోడిపోయి హిజరి 1130 (క్రీ. శ. 1711)లో నాత్మహత్య గావించికొనెనఁట. ఢిల్లీపాదుషాలనుండి యీతని కాలముననే ఈ సంస్థానము వారికి 'సవై' యను బిరుదము ప్రసాదింపఁబడినది.

వెంకటరెడ్డి కుమారుఁడు గోపాలరావు. వెంకటరెడ్డి తన దత్తుతండ్రి పేరట గోపాలపేట యనుగ్రామమును కట్టి దీనిని పాలించుటకు తన తమ్ముఁడు రంగారెడ్డిని నియమించెను. ఇదియే గోపాలపేట సంస్థానము.

వనపర్తివారి వంశమునందు మొదటి రామకృష్ణరావు పేర్కొనఁదగిన పాలకుఁడు. అసూయాగ్రస్తులగు జ్ఞాతులుచేసిన కుట్రమూలముగా నవాబుగారి చెఱసాలలో మూఁడేండ్లపాటుండిరి. పిమ్మట నవాబుగారి యనుగ్రహమువలన కారాగారవిముక్తిని బొందివచ్చిన రామకృష్ణరావు రాజధానిని సూగూరినుండి వనపర్తికి మార్చెను. హిజరి 1236 (క్రీ.శ. 1817)లో నిజామునుండి రాజా బహద్దరు బిరుదము వచ్చినది,

ఇతని తరువాత నితనిదత్తుఁడు రాజా మొదటి రామేశ్వరరావు బహిరీ బల్వంతు బహద్దరుగారు సంస్థానమునకు వచ్చిరి. హిజరి 1238లో వీరి జననము. ఈయన చిన్నతనముననే రాజ్యాధికారమును చేపట్టి పేరుపెంపులను సంపాదించిరి. నిజాము సేనానులలో ముఖ్యులుగా నెన్నికను పొందిరి, అనేక యుద్ధములయందు నిజామునకును ఇంగ్లీషుకుంఫిణీకిని అండగా నుండి క్రీ.శ. 1861లో నీ యుభయులవలన కత్తి, పిస్టలు, రైఫిలు మున్నగు బహుసత్కా రములనుఁ బడసిరి. కుంఫిణీవారి పాలనారీతులను మెలఁకువతో గమనించి తన సంస్థానమునందు శాశ్వతపువన్ను వసూలు పద్ధతిని రాజా రామేశ్వరరావుగారు మొట్టమొదటిసారిగా నమలుపఱిచిరి.

రాజా ప్రథమ రామేశ్వరరాయల దత్తపుత్రులు రాజా రామకృష్ణరాయలు.

వీ రకాలపురణమందుటవలన శ్రీ రాజా యిమ్మడి రామేశ్వరరాయలు దత్తుగా వచ్చిరి. వీరు సర్వసమర్థులు. తమ ప్రజ్ఞాపాటవము నుపయోగించి సంస్థానమును బహుముఖముల నభివృద్ధిపఱిచిరి. వీరి కుమారులు రాజా శ్రీకృష్ణదేవరాయలు, రాజా శ్రీ రామదేవరాయలు. మునగాల రాజా నాయని వేంకటరంగారావు బహద్దరుగారి తనయయగు సరళాదేవిగారు రాజా శ్రీకృష్ణదేవరాయల భార్య. కృష్ణదేవరాయల తమ్ములగు రాజా రామదేవరాయల భార్య పింగళి వెంకట రామారెడ్డిగారి కొమార్తెయగు కుముదినీదేవి. రాజా శ్రీకృష్ణదేవరాయలు పిన్న పయసుననే పరమపదించిరి. వీరి కుమారులు రాజా రామేశ్వరరాయలు. రాజా శ్రీ కృష్ణదేవరాయల మరణానంతరము సంస్థానాధిపత్యమునకు మైనరు తల్లి గారగు రాణి సరళాదేవిగారికిని, ఈమె మఱఁది రామదేవరాయలు గారికిని వ్యాజ్యము నడచినది. ఉభయపక్షములకు హితులును, సన్నిహితులును నగు పెద్దల జోక్యమువలన నుభయులకును రాజీకుదిరినది. రాజా శ్రీకృష్ణదేవరాయల కుమారులగు రాజా రామేశ్వరరాయలు ఉన్నతవిద్యా పట్టభద్రులు. భారత విదేశాంగ శాఖలో కొంతకాలము ఉన్నతపదవులను నిర్వహించినవారు. పార్ల మెంటు సభ్యులుగా పేరుప్రతిష్ఠలు గడించినవారు.

## సాహిత్యపోషణము

నిజాము రాష్ట్రములో సాంస్కృతిక దీపమును నారిపోకుండ కాపాడిన గౌరవము గద్వాల, ఆత్మకూరు, జటప్రోలు మొదలగు సంస్థానములతోపాటు వనపర్తికినిఁ జెందుచున్నది. '....తెలంగాణమున గద్వాల, దోమకొండ, వనపర్తి సంస్థానములు.... ఏర్పడెను. ఈ సంస్థాన పాలకులు తమశక్తి ననుసరించి కవులను పండితులను పోషించి ఆంధ్రసంస్కృతిని కాపాడిరి.'* వనపర్తి సంస్థానాధీశులలో కవిపోషకులతోపాటు కవులుకూడ వెలయుటొక విశేషము.

## రాజా బహిరీ గోపాలరాయలు

సంస్థాన సంపాదకులగు శ్రీ వీరకృష్ణభూపతికి (1510—1550) ఆఱవ తరమువాఁడగు రాజా బహిరీ గోపాలరాయలు చాలప్రసిద్ధుఁడు. షడ్విధప్రాకృత ములయందును సంస్కృతాంధ్రములయందును దృఢమైన వ్యుత్పత్తి గౌరవము కలిగియుండుటచే 'అష్టభాషాకవి' యను బిరుదమును, సమరాంగణవిజయి యగుటచే 'బహిరీ' బిరుదమును వీరికి సార్థకములు. ఈయనను సాధారణముగా 'అష్టభాషా గోపాలరాయ' లని చరిత్రకారులు వ్యవహరింతురు. అష్టభాషా

*ఖండవల్లి లక్ష్మీరంజనం, ఖండవల్లి బాలేందుశేఖరం, ఆంధ్రులచరిత్ర—సంస్కృతి, 1951, పు. 400.

గోపాలరాయలు 'రామచంద్రోదయ' మను యమకకావ్యమును తనతండ్రి యిమ్మడి వెంకటరెడ్డి ప్రతిష్ఠించిన కోదండరామస్వామి స్తోత్రరూపమున సంస్కృతమున సంతరించినాఁడు. శ్రీరంగనాయకస్వామి వసంతోత్సవవర్ణన మొనర్చుచు 'శృంగార మంజరీభాణ'మను నొక రూపకమును సంస్కృతభాషలో రచించెను. రామచంద్రోదయ కావ్యమునకు స్వయముగా గీర్వాణభాషా వ్యాఖ్యను గైసేసినవాఁడు. ఇవి రెండును ముద్రితములు.* కాని యీతఁడు రచించెననుచున్న యాంధ్రకృతులేవియును లభ్యముకాలేదు. అనర్ఘరాఘవ నాటకమును నాంధ్రమున శ్రవ్య కావ్యముగా సంధానించిన బిజ్జుల తిమ్మభూపాలుఁడీ ప్రభువర్యుని మేనల్లుఁడు. తిమ్మభూపాలుఁడు ప్రాగుటూరు పాలకుఁడు.

గోపాలరాయలు దక్షిణదేశ యాత్రలు చేయుచు ఆ యా తీర్థక్షేత్రముల యందలి యుత్తమ పండితరత్నముల నేరి కొనితెచ్చి తన సభాస్థానము నలంకరించినవాఁడు. తటాకారామాలయాది ప్రతిష్ఠలు జరిపి సప్తసంతానప్రశస్తిని సంపాదించినవాఁడు.

చెన్నకృష్ణకవి కృతమును, జనుంపల్లి వల్లభరాయని కంకితమునునగు యాదవ భారతీయమును ద్వ్యర్థికావ్యము వనపర్తి సంస్థానమున ముద్రితమైనది.

## వీరరాఘవాచార్యులు

1770 ప్రాంతము నాఁటి వీరి యాస్థాన పండితులు వీరరాఘవాచార్యులు సంస్కృత భాగవతమునకు విశిష్టాద్వైతపరమగు వీరరాఘవీయవ్యాఖ్యను రచించిరి. దీనిని సురవరము ప్రతాపరెడ్డిగారి సిఫారసుమేరకు వనపర్తిసంస్థానాధీశ్వరులు ముద్రింపించిరి. విశిష్టాద్వైతి ప్రపంచమునకు శిరోధార్యమైనది వీరరాఘవీయవ్యాఖ్య.

వనపర్తివారి కుదురునందలి మొదటి రామకృష్ణరావు మంచిపండితుఁడట. సాధువులను, సన్న్యాసులను, దర్వేషులను నాదరించెడివాఁడఁట. జ్యోతిశ్శాస్త్రము నందద్భుతమైన ప్రజ్ఞకలవాఁడఁట.

## రాజనగర - రంగాపుర గోష్ఠులు

రాజా ప్రథమరామేశ్వరరావుగారు పారసి, అరవము, ఇంగ్లీషు మున్నగు భాషల నభ్యసించినవారఁట! ఈ రామేశ్వరరాయల చిన్నతనమునందు వీరి తల్లిగారు వనపర్తికి సమీపమున పందొమ్మిదవ శతాబ్ద్యారంభమున 'రాజనగర' మను నొక క్రొత్తగ్రామము నిర్మించిరి. అచ్చట స్వర్గీయులగు మొదటి రామకృష్ణరాయల సమాధికలదు. రాజనగరమున ప్రతిష్ఠింపఁబడిన దేవుని పేరు శ్రీ రామకృష్ణస్వామి. ఏఁటేఁట కార్తికపూర్ణిమకు రాజనగరమున వేంచేసిన

* కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, తెలంగాణానాటకాలు, పరిశోధన, 1955, డిసెంబరు—జనవరి, పు. 56.

శ్రీ రామకృష్ణస్వామివారి బ్రహ్మోత్సవముల సందర్భమున దేవతాసన్నిధానము నందు వేదశాస్త్ర పండితుల గోష్ఠులు పెద్దయెత్తున నిర్వహింపఁబడుచు వచ్చినవి. ప్రతివర్షము ఫాల్గుణపూర్ణిమకు శ్రీ రంగాపురమునందలి శ్రీ రంగనాయక స్వామి ఉత్సవసమయములయందు కవిగాయకాది సమ్మేళనముల నేర్పఱిచి కవి గాయకాదులను సమ్మానించెడివారు

రాజా ప్రథమరామేశ్వరరాయల సమకాలికుఁడగు అమరచింత రామ చంద్రకవి (1840—1905) రామేశ్వరరాయల నిట్లు భూషించియున్నాఁడు.

'ఒకచెంత విబుధులౌ యుర్వీసురశ్రేణి
రమణీయ ధర్మమార్గములఁదెలుప
నొకదండ సుకవీంద్రనికరంబు లనవద్య
గద్యపద్యార్థసద్విద్య లెనయ....
....రామేశ్వరక్షితీంద్రుఁడలరె'.

'శ్రీ జనుంపలి కులక్షీరాబ్ధి జనియించి....
....వినుత గుణాఢ్యుఁడై విబుధులఁ బోషించి
సద్ధర్మశీల ప్రసిద్ధిఁగాంచి
అతఁడు పొగడొందు భూమండలాంతరాళ
రమ్య వనపర్తిపట్టణ రాజ్యమునకు
రాజితాకార రామేశ్వరక్షితీంద్ర
చంద్రుఁ డలరెను గాంతి నిస్తంద్రుఁడగుచు'

—గోలకొండ కవులసంచిక, పు. 101.

రెండవ రామేశ్వరరాయలు భాషాపోషకులు. కవి పండితులకు మడులు మాన్యములిచ్చి సత్కరించెడివారు. 1870 ప్రాంతములో బ్రహ్మవిద్యావిలాస ముద్రాక్షరశాల యను నచ్చుకూటమును స్థాపించి యనేకగ్రంథముల నచ్చు వేయించి భాషోపకారమొనర్చిరి.

ఈ సంస్థానమునందలి కడకుంట్ల గ్రామనివాసియగు పాపాశాస్త్రి భారత సంగ్రహ భ్రమరాంబికాసంవాద కావ్యకర్తలు. రాజనగర గ్రామవాస్తవ్యులు సంస్కృతాంధ్ర పండితులు విక్రాల నరసింహాచార్యులు పేరుపొందిన శతావధానులు; సంస్కృతాంధ్రములలో కవిత చెప్పినవారు. కల్యాణి, భారతీస్తుతి మొదలగు ముద్రితగ్రంథములే కాక, ఆంధ్రీకృత మాలతీమాధవము, కురుసంధానము, జగన్మోహనభాణము, మాతాంగదము వీరి అముద్రితరచనలు.

## అక్షింతల సుబ్బాశాస్త్రి

పందొమ్మిదవశతాబ్దిమధ్యభాగమున వనపర్తిసంస్థానములోని రేపర్లగ్రామ వాస్తవ్యుఁడై ఆర్యావృత్తములలో 'భాషార్థ రత్నమాల' యను గ్రంథమును

రచించిన అక్షింతల సుబ్బాశాస్త్రులు వనపర్తివారి యాశ్రితులు. సుబ్బాశాస్త్రులుగారు వేదాంతశాస్త్రమున గొప్పవిజ్ఞానియఁట: వీరొక ప్రహసనమును సైతము వ్రాసిరఁట:

## సింగంపల్లి నరసింహసిద్ధాంతి

సింగంపల్లి నరసింహసిద్ధాంతిగారు మహబూబ్ నగరమండలములోని సింగంపల్లి వాస్తవ్యులు. జ్యోతిశ్శాస్త్రము పారముచూచినవారు. వనపర్తి సంస్థానమువారికి ప్రేమపాత్రులు. మైసూరు సంస్థానాస్థానమున శాస్త్రపరీక్షలలో గెలుపొంది బహూకృతినంది నెలనెల పండితవేతనమును జీవితాంతమును పొందినవారు. 'భూభ్రమణ భ్రాంతి నిరసన' మను గ్రంథము వీరికృతి.

## అర్చకం అయ్యమాచార్యులు

గద్వాల చెన్నకేశవశతకము. పెద్దమందడి చెన్నకేశవ విలాసము, రామేశ్వర విజయము మున్నగు రచనలను సంతరించిన అర్చకం అయ్యమాచార్యులుగారు (క్రీ. శ. 1820 ప్రాంతము) వనపర్తి సమీప గ్రామమగు పెద్ద మందడి గ్రామవాస్తవ్యులు. పందొమ్మిదవశతాబ్దివారు; శ్రీవైష్ణవులు.

## హొసదుర్గము కృష్ణమాచార్యులు

వనపర్తి సంస్థానమున ధర్మాధికారిగానుండిన విద్వత్కవి సార్వభౌములు హొసదుర్గము కృష్ణమాచార్యులు సంస్థానాధీశ్వరుని గుఱించి 'రామేశ్వరవిజయ చంపు' వను ప్రబంధమును రచించిరఁట. వీరు శతాధిక గ్రంథకర్తలు. అలంకార మణిహారము, ఉన్మత్త పాండవము, కేశవోత్సవమాలిక, ప్రసన్నా నందలహరి, రఘునాథ విజయము, శ్రీకృష్ణ పంచరత్నమాల, శ్రీనివాస విలాసము, శ్రీరామాయణ వైభవము మున్నగు శతాధిక గ్రంథములు వీరి కృతులు. వీరు తురీయాశ్రమమును స్వీకరించి శ్రీకృష్ణబ్రహ్మతంత్రపరకాల యతీంద్రమహాదీక్షితులను పేర మైసూరులోని పరకాల పీఠాధిపతులుగా విరాజిల్లిరి. హొసదుర్గము శ్రీనివాసరాఘవాచార్యులు వీరియొక్క పుత్రులు. న్యాయ వ్యాకరణ వేదాంత జ్యోతిష వైద్యశాస్త్ర ప్రవీణులు.

## మానవల్లి రామకృష్ణకవి

జగమెఱిఁగిన పరిశోధక విద్వాంసులగు శ్రీ మానవల్లి రామకృష్ణకవి గారి కాశ్రయమిచ్చి, వారి ముఖమున గ్రంథపరిశోధన ముద్రణాదులు గావింపఁ జేసి యాంధ్ర జగతికి నపూర్వములగు నూతనకృతులను సమర్పింపఁజేసిన కీర్తి వనపర్తి ప్రభువులది.* రామకృష్ణకవిగారు (1866–1957) వనపర్తి

*'....వనపర్తి జీవితం ఈయనను పరిశోధకునిగా తీర్చిదిద్దింది'—తిరుమల రామ చంద్ర, మహిత సాహిత్యజీవి – మానవల్లి రామకృష్ణకవి, భారతి, 1957 అక్టోబరు, పుటలు 22–32.

సంస్థానమున గ్రంథప్రచురణ కార్యనిర్వాహకులుగా పదేండ్లపాటు పనిచేసిరి. ద్రావిడ కర్ణాట మలయాళ ప్రాకృతాది భాషల సీమలు చూచినవారు. సంస్కృతాంధ్రములయందు ఉన్నతపట్టపరీక్షల నందినవారు. వనపర్తి ప్రభువుల యాదరణమున వీరుకావించిన ప్రాచీనగ్రంథ సంపాదనము, తత్ప్రచురణ విధానము, సాహితీతత్త్వ పరిశోధనము అనన్యసామాన్యములు.

కాశీపండితులు తర్కశాస్త్ర పారీణులునగు నంబాకం రాఘవాచార్యులు, శేట్లూరు శేషాచార్యులు, విక్రాల నరసింహాచార్యులు, కంఠీరవాచార్యులు మున్నగువారు వనపర్తి సంస్థానవిద్వాంసులు.

శతావధానులు తిరుపతివేంకటకవులును, కార్యమపూఁడి రాజమన్నారు కవి (1846--1945) గొల్లాపిన్ని మల్లికార్జునశాస్త్రి (1871—1917) వనపర్తి యాస్థానమును సందర్శించినవారు. రాజమన్నారుకవి వనపర్తి రాణిశంకరమ్మ గారి వలన కర్పూర తాంబూలముతో ననుజ్ఞపొంది 'రాజవంశ రత్నావళి' యను సంస్కృతగ్రంథమును తెనిఁగించి సత్కారములనందిరి.

## తిరుపతి వేంకటకవులు

తిరుపతివేంకటకవులు తమ నానారాజ సందర్శనము నందు (పు. 122—129) రాజా రామేశ్వరరాయల నిట్లభ్యర్థించిరి.

'గళమున బిరుదులు కైసేసె నమలపూ
 ర్గద్వాల విజయనగరపురములు
దానికే యాత్మకూర్ధవుఁడేనుఁ గెక్కించు
 నప్పుడొసఁగెఁ జంద్రహారములను
కుడిచేతి కొక బిరుదిడియె నంతకుమున్న
 మొగలుతుర్తి నృసింహభూవరుండు
ఎడమచేతికి మొన్ననిడెఁ దాటికొండ రా
 మారెడ్డి మేల్మిబంగారుమురుగు
నితరసంస్థానముల వంక కేఁగ కీ ప్ర
తిష్ఠ నీక దక్కింప మదిని దలంచి
గండెపెండార మొక్కటి గైకొనంగఁ
గా లెదురుచూచుచున్నదో కాశ్యపీంద్ర' —ప. 165.

## నెమలూరి వేంకటశాస్త్రి

వీరు గోదావరిమండలము ఐలండుపోలవరము వాస్తవ్యులు. ఐలండుకవి పంచకములోనొకరు. చెళ్ళపిళ్ళవారి శిష్యవర్గములో ప్రథమశ్రేణికిఁజెందినవారు.*

* చెళ్ళపిళ్ళ, కథలు—గాథలు, తృతీయభాగము, 1960, పుటలు 235, 236.

'వనపర్తి సంస్థానమునఁ గవీశ్వరుఁడయి పేరుగైకొను నెమలూరికన్న' అని చెళ్ళపిళ్ళవారిచే ఉట్టంకింపఁ బడినవారు. ఐలండుకవి పంచకములో మఱి యొకరగు నిశ్శంకుల కృష్ణమూర్తియును, ఈయనయును 'రామకృష్ణకవు' లను పేరింటి జంటకవులు. ఈ జంటకవులు తిరుపతి వేంకటకవులాంధ్రీక రించుచు విరమించిన దేవీ భాగవతము నవమస్కంధములో చాలపాలు తెనిఁగించిరి. నెమలూరి వేంకటశాస్త్రి వనపర్తి పండితకవిగానుండి వనపర్తి సంస్థానచరిత్రమును బద్యరూపమున సంస్థానాధీశుల కోరికమేరకు నిర్మించిరి.

## సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు తమ 'పువ్వులతోఁట' యను ఖండకావ్యమును వనపర్తి రాజా స్వర్గీయ శ్రీకృష్ణ దేవరాయలవారి యాత్మ కంకితమిచ్చిరి. వనపర్తి పాలకురాలును, రాజా కృష్ణదేవరాయల పట్టపురాణియు నగు రాణి సరళాదేవి యీ గ్రంథముద్రణమునకు సాయపడిరి. శ్రీ శాస్త్రి గారప్పుడప్పుడు, భారతి, సాహితి, సుజాత మొదలగు పత్రికలలో ప్రకటించిన యనిబద్ధకావ్యముల సంపుటియే యీ పువ్వులతోఁట. ఆంధ్రుఁడా, కోకిలా, జన్మభూమి, తృణకణములు, భావకవి, విలాసిని మున్నగు నేఁబది ఖండిక లిందున్నవి.

## చెలమచర్ల రంగాచార్యులు

చెలమచర్ల రంగాచార్యుల యాంధ్రప్రతాపరుద్రయశోభూషణమును విద్వదభిమానులును వదాన్యవరేణ్యులును నగు శ్రీమంతు రాజా రామదేవ బహద్దర్‌గారు ముద్రణవ్యయమును సర్వమును భరించి ముద్రింపించిరి. విద్యా నాథమహాకవి రచించిన ప్రతాపరుద్రయశోభూషణమున కిది యాంధ్రీకరణము. అనువాదముతోపాటు సాహిత్యవిషయజిజ్ఞాసువుల కుపకారకములగు విశేషాంశ ములతో కూడిన రుచిరసమీక్షాసముపేత మీ కృతి.

రాజా కృష్ణదేవరాయల కుమారులగు రాజా ముమ్మడి రామేశ్వరరాయల కాలమునందు విద్యాపోషణమునందు వనపర్తి సంస్థానము సరిక్రొత్తరీతులలో పయనించినది. సురవరము ప్రతాపరెడ్డిగారి సూచనమేరకు వనపర్తి రాజా శ్రీమంత్‌రాజా రామేశ్వరరాయబహద్దరుగారు వీరరాఘవీయ వ్యాఖ్యానసహితముగ భాగవతమును నాగరిలిపిలో ముద్రింపఁజేయుట కిరువదియైదువేల రూపాయల విరాళమునిచ్చిరి.

## వేదశాస్త్ర పరీక్షలు

శ్రీ సురవరము ప్రతాపరెడ్డివంటి సాహితీవేత్తల సూచనలమేరకు వనపర్తి రాజా సవై రాజా రామేశ్వరరావు బహిరీబల్వంత్ బహద్దరు మహా

భూపాలుగారు తమ యిలువేల్పు శ్రీరంగనాయకులు వెలసిన శ్రీ రంగాపుర మున ప్రతివర్షము ఫాల్గుణ పూర్ణిమనాఁడు కవిగాయక సభలను, కార్తికిక పూర్ణిమకు శ్రీ రామకృష్ణస్వామి వేంచేసిన రాజనగరములో శాస్త్రపండిత సభలను నిర్వహించి విద్యావ్యాప్తికి, భాషోద్ధరణకు తోడ్పడుచు వచ్చినవారు. రాజనగరము ఉత్సవసందర్భములో నాయా శాస్త్రములలో లిఖిత మౌఖిక పరీక్షలను నిర్వహించి పరీక్షలలో నెగ్గినవారికి 'విద్వన్మణి' బిరుద ప్రదానముతో పాటు సమ్మానమును జరిపించెడివారు. ఈయా శాస్త్రములలో జరుగు పరీక్షలకు పరీక్షకులుగా దేశములోని దిగ్దంతులవంటి పండితులను నియమించెడివారు. ఖండవల్లి నరసింహశాస్త్రిగారు వ్యాకరణమునకును, వనం సీతారామశాస్త్రిగారు తర్కమునకును, టి. గోపాలాచార్యులవారు వేదమునకును, టి.కె.వి. సుదర్శనా చార్యులుగారు మీమాంసకును, వేదాల తిరుమల రామానుజస్వామిగా రాయుర్వేద మునకును, కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు సాహిత్యమునకును పరీక్షకులుగా నుండెడివారు.

## గ్రంథప్రచురణము

రాజనగరములోని మీఁది యుత్సవముల సందర్భమున శ్రీ వనపర్తి ప్రభువుల సమక్షమున జరిగిన పండితసభలోని విద్వాంసుల శాస్త్రోపన్యాసముల సారము 'శాస్త్రీయ విజ్ఞానము' అను పేర ప్రచురితమైనది. ఖండవల్లి నరసింహ శాస్త్రి, పండిత సింగరయ్యశాస్త్రి, వనము సీతారామశాస్త్రి, కందాడై శ్రీ రంగా చార్యులు, కప్పగంతుల లక్ష్మణశాస్త్రి మున్నగువారి యుపన్యాసముల సారమింతు సంకలనము సేయఁబడినది. వనపర్తి సంస్థాన ప్రభుత్వప్రచురిత మిది.

ప్రాచీనార్షవిద్యారీతులను పరిరక్షించుటయేకాక, యాధునిక యుగమునందు అత్యంతము ప్రాముఖ్యమువహించిన విజ్ఞానశాస్త్రవికాసముపట్లను వనపర్తి ప్రభువులకు ప్రత్యేకదృష్టి యుండినది. విజ్ఞానశాస్త్రవికాసమును గూర్చిన వివరణ గ్రంథముల రచనకు వనపర్తి రాజాగారు పోటీపరీక్ష లేర్పాటుచేయుండిరి. పోటీలో నెగ్గిన శాస్త్రీయ గ్రంథములను బహూకరించుచు వానిని రాజా గారే ముద్రిం పించుచుండిరి. ఇట్టి గ్రంథములలో పరిగణింపఁ దగినవి బేతనభట్ల విశ్వ నాథముగారు రచించిన 'ఆధునిక విజ్ఞానవికాసము' అను విజ్ఞానశాస్త్ర నిరూపక గ్రంథము. ఇందు భౌతిక రసాయన జీవశాస్త్ర రంగములలో సాధింపఁబడిన ప్రగతి యంతయును సంగ్రహముగా, సమగ్రముగా సరళమగుశైలిలో నిరూ పింపఁబడినది.

వనపర్తి సంస్థానమున పేష్కారుగా నుండిన మాదిరాజు విశ్వనాథరావు గారు శాకుంతలాది నాటకములను తెనిఁగించిరి.

వనపర్తి సంస్థానకవులు మాదిరాజు విశ్వనాథరావు. శిరోమణి కప్ప

గంటుల లక్ష్మణశాస్త్రి కర్ణసుందరి నాటకాంధ్రీకర్తలు. ఇది నాలుగంకములు కలది. విక్రమాంకదేవుని యాస్థానమున విద్యాపతిగా నుండెనని పరిశోధకులు భావించుచున్న బిల్హణుడు రచించిన 'కర్ణసుందరి' నాటిక దీనికి మూలము. లక్ష్మణ శాస్త్రిగారు 'ఆంధ్రబిల్హణ' బిరుదాంచితులు.

వనపర్తివారి సంస్థానగ్రంథాలయము చాలవిలువయినది. ఈ గ్రంథాలయమునందలి ముద్రితాముద్రితములగు సంస్కృతాంధ్ర గ్రంథములను హైదరాబాదులోని ఆంధ్రసారస్వత పరిషద్గ్రంథాలయమునకు బహూకరించిరి.

వనపర్తి రాజా రామేశ్వరరాయలు హైదరాబాదులోని ఆంధ్రసారస్వత పరిషత్తు మున్నగు సాహితీసంస్థలతో సంబంధము కలవారు. ఉస్మానియా విశ్వవిద్యాలయ సిండికేటు సభ్యులుగా విద్యారంగమునకు వారు గావించుచున్న సేవ ప్రశంసాపాత్రము. సంస్థానపాలనము పోయినను, సంస్థాన సత్సంప్రదాయములు శ్రీ రామేశ్వరరాయల వారిలో మూఁడుపూవు లారుకాయలుగా వర్ధిల్లుచున్నవనుట కేవలము స్వభావోక్తి।

## ఉపజీవ్య గ్రంథసూచి

1. సురవరము ప్రతాపరెడ్డి, నిజామురాష్ట్రములోని ఆంధ్రసంస్థానముల చరిత్ర. శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయ రజతోత్సవసంచిక, పుటలు 40-43.

2. సురవరము ప్రతాపరెడ్డి, గోలకొండకవులసంచిక.

3. దేవులపల్లి రామానుజరావు, తెలుగుసీమలో సాంస్కృతిక పునరుజ్జీవనము. గద్వాల — వనపర్తి — ఆత్మకూరు సంస్థానములలో సాంస్కృతికసేవ. పుటలు 93-99.

4. కేశవపంతుల నరసింహశాస్త్రి, తెలంగాణాసంస్థానములు - సాహిత్యసేవ. తెలుగువిజ్ఞానసర్వస్వము, సంపుటము 3, పుటలు 1175-1179.

5. అయ్యదేవర కాళేశ్వరరావు, నా జీవితకథ — నవ్యాంధ్రము, 1959.

6. కార్యమపూడి రాజమన్నారుకవి, [illegible].

7. తిరుపతివేంకటకవులు, నానారాజసందర్శనము, పుటలు 122-120.

8. [illegible] విశ్వనాథము, ఆధునికవిజ్ఞానవికాసము.

9. కప్పగంతుల లక్ష్మణశాస్త్రి (సంపాదకులు). [illegible].

10. Captain Hastings Fraser, Our Faithful Ally, The Nizam, London, 1865.

11. S. H. Belgrami, Historical and Descriptive Sketch of His Highness the Nizam's Dominions.

12. V. L. Sastri, Encyclopaedia of the Madras Presidency and the Adjacent States.

# వల్లూరు

## ప్రవేశిక

కృష్ణా మండలములోని మచిలీపట్టణము, బెజవాడ తాలూకాలలోను, పశ్చిమ గోదావరి మండలములోని ఏలూరు తాలూకాలోను ఈ జమీందారీ విస్తరించియుండినది. జమీందారీ మొత్తమిరువది గ్రామములు. భూములు చాల సారవంతములైనవి. కృష్ణానదీప్రవాహోదారసిరములచే సస్యశ్యామలమైన సంస్థానమిది. దీనికి వల్లూరు రాజధాని. కృష్ణామండలమునందలి వుయ్యూరునకు పడమరగా రెండుపరువుల దూరమున కృష్ణానది తూర్పుగట్టున వల్లూరు పట్టణమున్నది. తోటలెక్కువగానుండుటచే తోట్లవల్లూరను* నామాంతరమును దీనికిఁ గలదు. పూర్వమిది కొంతకాలము నూజివీటిజమీందారీలోను, చల్లపల్లి జమీందారీలోను ఉండినది. క్రీ.శ. 1900లలో అన్నదమ్ములవంపకములమూలమున ఈ జమీందారీ రెండుభాగములై పెద్దకొమరునకుచెందినవారివంతు ఉత్తరవల్లూరైనది; చిన్నకొమరునకుచెందినవారివంతు దక్షిణవల్లూరైనది.

## సంస్థాన చరిత్రము

వీరు పట్నాలగోత్రోద్భవపద్మహితులు. వీరి యింటిపేరు బొమ్మదేవర వారు. వీరిగృహనామమునుగూర్చియు, వీరికి జమీందారీ సంక్రమించినతీరును గూర్చియు పృక్కిటిపురాణములు పెక్కులున్నవి. మొదట వీరి యింటిపేరు ఎడ్లవారఁట! తొలుతనుండియు వీరికి పశుసంపద మెండుగానుండుటచే ఎడ్లవారనునింటిపేరిస్వార్థమఁట! వీరు ఎడ్లమీఁద దూరసీమలకు సరకుసరంజామాను తీసికొనిపోయి వర్తకము చేయుచుండెడివారఁట! వీరి కుదురున నాగన్నయను నతఁడు గొప్పయదృష్టజాతకుఁడు. ఎడ్లనాగన్నగారిది వల్లూరుగ్రామము. ఇతఁడొక సామాన్య గృహస్థు. ఇతని జాతకముఫలించి పట్టినది బంగారమై ముట్టినది ముత్యమై సిరిమొత్తికొనిరాఁగా శ్రీమంతుఁడయి యొక సంస్థానాధిపతి యయ్యెనఁట! దీనికి సంబంధించినకథలు రకరకములుగా స్థానికులకథనములో వాడుకపడియున్నవి. ఇట్టికథలలోనొకదానిని ప్రస్తుతము పరిశీలింతము.

అది ఇంగ్లీషుకుంఫిణీవారు టిప్పుసుల్తానుతోడియుద్ధములో సతమతమగు

* '... కొల్చెదఁ దోట్లవల్లూరిపుర శ్రీవేణుగోపప్రభున్' (చెన్నపురీవిలాసము, స్వరూపపద్ధతి). 'శ్రీ తోట్లవల్లూరినగరాంతర కంఠీరవాసనాధీశ్వర ...' (పైది దక్షిణపద్ధతి, దుర్గప్రకరణము).

చున్నకాలము. టిప్పును జయించుటకు బందరునుండి కుంఫిణీసేనను శ్రీరంగ పట్టణమునకు పంపవలసినదని జనరల్ హారిస్‌నుండి బందరులోని మార్టిన్ దొరకు జరూరుహుకుమువచ్చినది. పదియేనువందలమంది సోల్జరులు, నాలుగు వేలమంది నాటుసిపాయీలు, ఇరువది ఫిరంగులు, ఈపటాలములకు కావలసిన భోజనపదార్థములు, బిడారుగుడారములు, తుపాకులు, తూటాలు, మందుగుండు సామగ్రి మున్నగునవి తరలించి కొనిపోవుటకెంత పరివారము ఎంత వాహన సామగ్రి ఎంతసన్నాహము కావలయునో ఊహించికొనవచ్చు. ఆనాఁడు మచిలీ బందరుకోటలో సుంకర గురవయ్యశ్రేష్ఠి కుంఫిణీవారి దుబాసి. ఈయన గొప్ప వర్తకుఁడుకూడ. శ్రేష్ఠికార్యకర్త రావిపాటిబ్రహ్మన్న. బ్రహ్మన్న జటాంత స్వాధ్యాయి ; పండితుఁడు. బ్రహ్మన్న అనుచరుఁడు నాగన్న.

ఈ పటాలమువెంట ఎడ్లసిబ్బందికి నాయకుఁడుగా శ్రీరంగపట్టణము వెళ్ళిననాగన్నకు యుద్ధానంతరము పాడుపడిన శ్రీరంగపట్టణము కోటకొట్టులలో రత్నాలరాసులు, ముత్యాలమూటలు దొరకినవని యీ కథలోని కథనము. పరుల కంటఁబడకుండ వీనిని పెటికగిత్తలకెత్తించికొని రాఁదారి మాఁదారి ప్రొద్దుల కడ కాలుసాఁగించుచు నాగన్న తిరిగి బందరు చేరునాఁటికి గురవయ్య బ్రహ్మన్నలు కాలముచేసియుండిరఁట ! విశ్వాసపాత్రుఁడగు నాగన్న తనదేవరయగు బ్రహ్మన్నపేర బ్రహ్మన్నదేవరయని తమ యింటిపేరుగఁ బెట్టికొనెనఁట ! అదియే జనులవాడుకలో 'బొమ్మదేవర'గా మాఱినట్లు కంచికివెళ్ళినకథ చెప్పు చున్నది. ఈలోఁగా పల్లూరి పరగణాశిస్తుబకాయీలు చెల్లక ఏలమునకు వచ్చినది. బందరుకోటలోని కుంఫిణీఘణీలనుండి కబురురాఁగా బొమ్మదేవరనాగన్నపోయి ఏలములో పల్లూరిపరగణాను తనపేరపాడి పల్లూరి జమీందారుఁడైనాఁడఁట !*

ఇఁక వాస్తవచరిత్రమును వివేచింతము. 1798—99లో టిప్పుసుల్తానున కెదురుగా కుంఫిణీవారు సాఁగించిన యుద్ధములలో కుంఫిణీపటాలములకు వలయు వస్తుసామగ్రిని, బండ్లకెద్దులను ముస్తీదుచేయు కాంట్రాక్టుదారుఁడు బొమ్మ దేవరనాగన్న. మొదట బందరులోని కుంఫిణీసేనలో కస్తురవాణాశాఖలో హెడ్‌మేస్త్రీగానుండి కంట్రాక్టులమూలమున దండిగా సంపాదించి, కుంఫిణీ వారిప్రాపున 1803లో హవేలీ ఎస్టేటైన పల్లూరునుకొని కోటనుకట్టిరి. కోట ప్రాకారముపై రెండెడ్లబండి సులువుగా తిరుగఁగలిగినంత వెడల్పు ఉండెడి దఁట ! 1807లో రాజా నాగన్ననాయఁడు మచిలీపట్టణము, హైదరాబాదులమధ్య సైనికసామగ్రి రవాణాచేయుటకు ఏజెంటుగా నియమింపఁబడిరి. శ్రీరంగపట్ట ణము ముట్టడిలో రాజా నాగన్ననాయఁడుగారొనర్చిన సేవలను కుంఫిణీవారు కొనియాడి కులక్రమాగతముగానుండునట్లు రాజా బిరుదమునిచ్చి గౌరవించిరి.

* భావరాజు వెంకటకృష్ణారావు, 'అదృష్టమంటే', ప్రబుద్ధాంధ్ర, 1934, ఆగస్టు, సంపుటము 5, సంచిక 8, పుటలు 299—303.

1808లో డెబ్బదియేండ్ల వయసున నాగన్ననాయఁడుగారు ఖమ్మంమెట్టు నుండి తిరిగి వచ్చుచు నడిదారిలో జబ్బుపడి మరణించిరి.

ఈతనిభార్య శేషమాంబిక.* ఈతని మొదటి ముగ్గురు కొడుకులు ముందే మరణించియుండిరి. నాల్గవకుమారుఁడైన రాజా వెంకట నరసింహ నాయఁడు తండ్రిమరణించునాఁటికి మైనరు. మైనరునకుబదులుగా తల్లి కొంత కాలము సంస్థానవ్యవహారములు సరిచూచినది. నరసింహనాయఁడుకూడ కుంఫిణీవారికి తలలోనాలుకగా ప్రవర్తించి కుంఫిణీవారి సేనలకూచీకివలయు రస్తు సామగ్రిని దస్తుపఱుచుటలో దిట్టయని పేరుపొంది, ఎస్టేటును బహుముఖముల వృద్ధిపఱిచెను. ఈయనభార్య రాజ్యలక్ష్మి. 1829లో నరసింహనాయఁడు మరణించునాఁటికి ఇతని కుమారుఁడగు ఇమ్మడినాగన్ననాయఁడు అయిదేండ్ల పసివాఁడు. తల్లియగు రాజ్యలక్ష్మి కొలఁదికాలముమాత్రము జీవించి పరమపదించెను.

వెంకటనరసింహనాయని సోదరుఁడగు రాజా వెంకయ్యనాయఁడుగారి భార్య వెంకమ్మగారు నాగన్నకు ప్రాజ్ఞతవచ్చుదాఁక జమీవ్యవహారములను పర్యవేక్షించిరి. 1842లో ఇమ్మడి నాగన్న జమీకివచ్చెను. తాతగారగు రాజా నాగన్ననాయఁడువలె ఈనాగన్నయును అదృష్టజాతకుఁడు. రాజ్యవ్యవహారము లందు అత్యంతనైపుణ్యముకలవాఁడు. గోదావరిమండలములోని వసంతవాడ, కొప్పాక, నారాయణపురము, దుద్దేపూఁడి మొదలగు ఎస్టేటులను ఖరీదుచేసి తన సంస్థానమును విస్తరింపఁజేసెను. కొప్పాకపురవేణుగోపాలదేవాలయాగ్రభాగమున ధ్వజప్రతిష్ఠసలిపెను. వసంతవాడలో వేంకటేశ్వరస్వామి దేవాలయమును నిర్మించెను. 1857నాఁటి సిపాయీలపితూరీగొడవలలోఁబడి కుంఫిణీవారు క్రిందుమీఁదులగుచున్న గడ్డుగడియలలో ఇమ్మడినాగన్న రస్తురవాణా విషయములలో బహుచాకచక్యముతో ప్రవర్తించి వారిమన్ననలను పొందెను. సీమరాణిగా రానతీయ బందరులోనిఅధికారులు 'శాలివాహనశకసంవత్సరంబులు గుణవారణమునింద గణనగల్గు రౌద్రినామకవత్సరమున.... భాసుర స్వర్ణమయమైన దాహువురియు, రమ్య కాశ్మీర పట్టాంబరద్వయంబు ఘనతమీఱ బహూకృతిగా నొసంగిరి' (చెన్నపురీవిలాసము).

నాగన్నగారు శిథిలమగుచున్న వేణుగోపాలస్వామి ఆలయవిమానమంటప ప్రాకారాదులను, అయిదంతస్తుల గాలిగోపురమును గట్టించి ధ్వజస్తంభ శిఖరప్రతిష్ఠలు గావించిరి. స్వామివారి అంగరంగభోగములకు అనురూపమగు భూవసతుల నేర్పఱిచిరి. ఇతని పెద్దకొడుకు రాజా వెంకటనరసింహనాయఁడు బహద్దరు తండ్రి మరణానంతరము 1869లో జమీకి వచ్చెను. ఆనాఁటికి ఇతని

* నాగన్నభార్య రంగమ్మయనికథ; శేషమాంబికయని చెన్నపురీవిలాసము. 'నాగ క్ష్మాపతి శేషమాంబికలకున్ గారాబుపొత్తుండు . . .' (చూ.స్వరూప పద్ధతి, పద్యము 5).

తమ్ముఁడగు రాజా భాష్యకార్లునాయఁడుబహద్దరు పదునైదేండ్ల వాఁడు. నరసింహనాయఁడుగారు తన తాత ముత్తాతలవలె బ్రిటిష్ ప్రభుత్వమువారికి ఇనుపదారులు పడి పొగబండ్లు సలీసుగా నడచుదాఁక రవాణానిమిత్తము ఎడ్లను సప్లయిచేయుచుండెడివారు. ఈయన 'ఢిల్లీశ్వర ప్రసాద సమాసాదిత రాజా బహదరప్రభృతి బిరుదము....'లను పొందినవాఁడు.

1875లో ఏడవ ఎడ్వర్డుప్రభువు వేల్సురాకుమారుఁడుగా భారతదేశ పర్యటనమునకు వచ్చి మదరాసును దర్శించినపుడు రాజా వేంకటనరసింహ నాయఁడుగారు సుశిక్షితమైన నాలుగు హరిణములు లాగెడు బండిని నజరానాగా వేల్సురాకుమారునకు సమర్పించెనఁట! గిండీపార్కులో వేల్సురాకుమారునితో పాటు వల్లూరి రాజాగారు చాలసేపు సవారి తిరిగిరఁట! దీనికి చాల ముచ్చటపడి వేల్సురాకుమారుఁడు హరిణములతోఁగూడ బండిని ఇంగ్లాండునకు తనవెంటఁ గొంపోయెనఁట! ఇందులకు ప్రతిరూపముగా రాజాగారి కొక బంగారుపతకము బహూకరింపఁబడినది.

ఈ జమీందారులకు పూర్వము రైతులు శిస్తును వస్తురూపమున చెల్లించు చుండిరి. ఈయన నగదు రొక్కము రూపమున శిస్తును వసూలుచేయుటను మొదలుపెట్టినవాఁడు. ఎస్టేటు స్థితిగతులను కడుమెలఁకువతో పర్యవేక్షించి లోపములను సరిచేయించి నిపుణముగా పరిపాలనము సాఁగించినందున రాఁబడి సాలీనా మూఁడులక్షలకు పెరిగినది. చిన్నచిన్న యినుపవస్తువులు, తాళములు, ఇనుపపెట్టెలు మొదలగువానిని తయారుచేయు నొక కార్ఖానాను రాజాగారు స్థాపించిరి. సంస్థానమునందలి పంగిడిగూడెమునుండి ఏలూరుకాలువమీఁదఁగల భీమడోలు దాఁక సొంతముగా ఇనుపదారి నిర్మించిరి. ఈ కార్ఖానాలో రైలుబండ్ల చక్రములుగూడ తయారుచేయించెడివారు.

1895 దాఁక జమీ వ్యవహారములు నిమ్మళముగా సాఁగినవి. 1895లో రాజాగారి తమ్ములు భాష్యకార్లునాయఁడుగారు ఎస్టేటులో తమకు భాగము కావలయునని వ్యాజ్యము తెచ్చిరి. మూలపురుషులనుండి అయిదవతరమువరకు అవిభక్తముగా ప్రవర్తితమైన యీ ఎస్టేటు ఆఱవతరమునందు అన్నదమ్ముల వివాదములవలన పంపకములుపడి రెండుభాగములుగా విడిపోయినది. 1900లో ఉత్తరవల్లూరు, దక్షిణవల్లూరు అను విభాగములేర్పడినవి. అన్నకు ఉత్తరవల్లూరు, తమ్మునకు దక్షిణవల్లూరు వచ్చినవి. పంగిడిగూడెము పరగణా ఉత్తరవల్లూరు వారికిని. బందరు గూడూరుపరగణా దక్షిణవల్లూరు వారికిని వంతులయినవి. ఈ విభాగములలో చెఱి ముప్పది గ్రామములు ఒకటిన్నరలక్ష సాలుసరి రాఁబడి గలవి కేటాయింపఁబడినవి. ఉత్తరవల్లూరునకు పంగిడిగూడెము రాజధాని; దక్షిణవల్లూరు వారికి వల్లూరే రాజధాని.

1918లో వేంకటనరసింహనాయఁడుగారు మరణించిరి. వీరికుమారులు

రాజా నాగన్ననాయఁడు బహద్దరుగారు ఉత్తరపల్లూరు జమీకి పాలకులయిరి. వీరిసోదరులు రాజా వేంకటరాయలునాయఁడు బహద్దరుగారు. వేంకటరాయలు గారి కుమారుఁడు రాజా రామేశ్వరప్రసాదరాయలునాయఁడు బహద్దరుగారు.

## దక్షిణవల్లూరు అనంతర చరిత్రము

శ్రీ రాజా నృసింహరాయఁడు బహద్దరుగారి తమ్ములగు శ్రీ రాజా భాష్యకార్లునాయఁడుగారి జమీకి తొలి పాలకుఁడు. 1895 నుండి అన్నగారితో వ్యాజ్యమాడి ప్రీవీకౌన్సిలు దాఁక పోయి జమీలో సమ్మనగము వాటాను సంపాదించిరి. ఈ వాటాయే దక్షిణవల్లూరను పేర 1900లో నేర్పడినది. భాష్యకార్లునాయఁడుగారు 1906 లో మరణించిరి. వీరి కుమారులు రాజా సత్యనారాయణవరప్రసాదరావుబహద్దరు 1897లో జన్మించి 1917 లో జమీకి వచ్చిరి. వీరితరువాత దక్షిణవల్లూరు ఎస్టేటు రెండుభాగములయినవి. ఒకభాగమునకు ఇనుగంటివారు హక్కుదారులయిరి. రెండవభాగమునకు బొమ్మదేవర వేంకటభాష్యకార్లునాయఁడు జమీందారు.

## సాహిత్యపోషణము

రాజా బొమ్మదేవర ఇమ్మడి నాగన్ననాయఁడుబహద్దరుగారికి కవిపండితు లన్న చాలప్రీతి. ఆతని పోషణమునందు చాలమంది కవిపండితులుండెడివారఁట (చూ. చెన్నపురీవిలాసము, స్వరూప పద్ధతి, పద్యము 13). నాగన్న వేణుగోపాలస్వామి భక్తుఁడు. దసరావేడుకలలో ఆయన జాతీయకళలను, క్రీడలను ప్రోత్సహించెడివాఁడు. మల్లయుద్ధములను జరిపించి క్రీడాకారులను సత్కరించెడివాఁడు. త్రిమతాచార్యులను సమానముగా గౌరవించెడివాఁడు. మంచి క్రీడానిపుణుఁడు. చిఱుతపులుల వేఁట యనిన ఈయనకు మోజెక్కువ.

> నాగక్ష్మాపతి శేషమాంబికలకున్ గారాబు పౌత్రుండు పు
> ణ్యాగణ్యాద్భుత కీర్తి వేంకటనృసింహక్షోణి భృద్రాజ్యల
> క్ష్మీ గర్భాంబుధి పూర్ణచంద్రుఁడతఁ డుస్మీల ప్రభావాఢ్యుఁ డా
> నాగక్ష్మారమణప్రచారములు నానాద్వీపవిఖ్యాతముల్
>
> —చెన్నపురీ విలాసము.

ఇమ్మడి నాగన్ననాయఁడు గారికి గ్రంథ ప్రచురణమునందు విశేషాభిలాష యుండెడిది. సుప్రసిద్ధాంధ్రగీర్వాణగ్రంథప్రచురణకర్తలగు వావిళ్ళ రామస్వామిశాస్త్రిగారికి వీరెన్నియోరీతుల తోడ్పడినట్లీ క్రిందిపద్యము తెల్పుచున్నది.

'శ్రీమత్పావన బొమ్మదేవరకుల క్షీరాబ్ధి రాకాసుధా
ధామశ్రీయగు నాగభూపతి జగత్ప్రఖ్యాతిగా వీట నా
రామస్వామిమనీషిచే నిఖిల సద్గ్రంథాళి ముద్రింప లో
కామోదంబగు నట్లొనర్చె ధనసాహాయ్యంబు వాటించుచున్'

## మతుకుమల్లి కుటుంబము

ఇమ్మడి నాగన్ననాయఁడుగారి యాస్థానవిద్వత్కవి మతుకుమల్లి నరసింహశాస్త్రి. మతుకుమల్లి వారిది ఆంధ్రదేశమునందు సుప్రసిద్ధమైన విద్వత్కవివంశము. మతుకుమల్లివారు ఆర్వేల నియోగిబ్రాహ్మణులు ; కాశ్యప గోత్రులు, ఆపస్తంబసూత్రులు. కృష్ణయజు శ్శాఖీయులు. మాల్యాద్రి నృసింహస్వామి భక్తులు.

'మతుకుమల్లి యిల్లు మహివిద్య వెదజల్లు
వరబుధేంద్రులకును బక్కముల్లు
ఎఱిఁగిమెలఁగిరేని నెలమిచే వాటిల్లుఁ
గాన వారియిల్లు ఘనతఁజెందె'

'అతి చమత్కృతిగలిగిన మతుకుమల్లి
వారు శబ్దముకొల్పిన కారణమున
వసుధలోపల మంచెళ్ళవారి యిల్లు
శారదాదేవినాటకశాలయందు
వాసుదేవుని కవితావిలాస మచట
మొలక బంగరుగజ్జెల మ్రోఁతగాదె'*

అని నరసింహశాస్త్రి జననియగు జానకాంబ మతుకుమల్లి వంశమును బ్రశంసించుచు, మంచెళ్ళ వాసుదేవకవి కవితావిలాసమునకు మతుకుమల్లివారే కారకులని సూచించినది.

వీరి మూలపురుషుఁడు కృష్ణయ్య. కృష్ణయ్య ప్రపౌత్రుఁడగు మతుకుమల్లి మాధవకవి అభినవభారతకర్త. నెల్లూరుమండలములోని చిన్న పమిడి, పెద్దపమిడి భాలేరాయణింగారి సంస్థానములో మతుకుమల్లివారు దివానులుగా నుండెడివారు. మాధవమంత్రి అగ్రజుఁడగు కనకయ్య వాసిరెడ్డి వారి యాస్థానపండితుఁడు. కనకయ్య కుమారుఁడు పెదనృసింహము. ఈ పెదనృసింహము సంతతికిచెందిన వారిలో తిరునల్వేలి హిందూకళాశాలలో ప్రిన్సిపాలుగా పనిచేసిన మతుకుమల్లి సుబ్బారావుగారును, 'హితశ్రీ' యను

* నృసింహవిద్వన్మణివిరచితమగు అజచరిత్రము (ఇందుమతీపరిణయము)నకు నందిరాజు చలపతిరావుగారు వ్రాసిన పీఠికలో నుదాహృతములయిన పద్యములు, పు. 2.

పేర ప్రసిద్ధాధునిక కథకులుగా పేరొందిన ప్రసాదరావుగారును పరిగణింపఁ దగినవారు.

అభినవభారత గ్రంథకర్తయగు మాధవమంత్రి కుమారుఁడు చిన నరసింహము. సాంగవేదాధ్యయనపరుఁ డీయన. చిననరసింహము తనయులు కనకాద్రిశాస్త్రిగారు. కనకాద్రిశాస్త్రి షట్ఛాస్త్రముల పారము చూచిన మహాపండితుఁడు. తర్కశాస్త్ర మీయన యభిమాన విషయము. నరసరావుపేట జమీందారుగారగు మల్రాజు గుండారాయనింగారి యాస్థాన పండితులు. మాణిక్యారావు, మానూరి, వాసిరెడ్డివారి సంస్థానములలో సైతము తన పాండితీ ప్రకర్షమూలమునను, సాహిత్య సౌహిత్యమువలనను మాన్యములు సంపాదించిన మహావ్యక్తి కనకాద్రిశాస్త్రి. వీరి తమ్ములు మాధవశాస్త్రి దశావతారస్తవ గ్రంథకర్త. కనకాద్రిశాస్త్రి ద్వితీయ కుమారులగు కృష్ణశాస్త్రి పోలవరము జమీందారుల యాస్థానకవి; వీరు భద్రిశతకకర్త. కనకాద్రిశాస్త్రి భార్యయగు జానకాంబయుఁ గవయిత్రియఁట! ఈమె చదలవాడ సుబ్బయామాత్య పుత్రిక. గణితశాస్త్ర ప్రవీణ. నరసింహశాస్త్రి పౌత్రియును, రఘూత్తమరాయశాస్త్రి పుత్రియును నగు ఇందుమతీదేవి లక్షణాపరిణయమను పద్యప్రబంధమునకుఁ గర్త్రియఁట.

## ముతుకుమల్లి నరసింహశాస్త్రి

జానకాంబా కనకాద్రిశాస్త్రుల జ్యేష్ఠకుమారుఁడయిన మనకవి నృసింహశాస్త్రి (1816–1873) శ్రీ రాజా బొమ్మదేవర నాగన్నగారి ఆస్థానకవియే గాక సమ్మాననిమిత్తము సంస్థానమున కరుదెంచుచుండిన పండితులను పరీక్షించుచుండిన విద్యాధికారి. జగద్గురు శంకరాచార్యపీఠ విద్వాంసునితో తర్కమీమాంసాశాస్త్రములలో మూఁడు వారములపాటు వాదించి మించిన దిట్ట నృసింహ విద్వన్మణి. ఆంధ్ర మేఘసందేశము, ఆంధ్రసిద్ధాంత కౌముది, ఇందుమతీపరిణయము (అజచరిత్రము), చెన్నపురీవిలాసము, జ్యోతిశ్శాస్త్ర సంగ్రహము, పుండ్రనిర్ణయ చంద్రిక, భరతశాస్త్ర సర్వస్వము, వేంకటాచల యాత్రాచరిత్రము, శ్రీకృష్ణ జలక్రీడావిలాస నాటకము, శ్రీ లక్ష్మీనృసింహ త్రిశతి, శ్రీ లక్ష్మీనృసింహ సహస్రనామావళి, సంగీతసార సంగ్రహము మున్నగునవి యీతని రచనలు. ఈతఁ డష్టముఖ గండభేరుండ నృసింహోపాసకుఁడు. కవి నివాసము తెనాలియని కవిసప్తశతి*.

రాజా నాగన్ననాయఁడుగారు నృసింహకవి నిట్లు ప్రశంసించినట్లు చెన్నపురీవిలాసమునందలి అవతారికాభాగము వివరించుచున్నది:

'క్షమ విహరించు వాక్పతి పుట్టినయిలు ము
తుకుమల్లి కులమతల్లిక తదన్వ

*బులుసు వేంకటరమణయ్య, ఆంధ్రకవిసప్తశతి, పు. 115.

యోచితుల్ పెంగళార్యాదులు మాల్యవై
లన్నృసింహ కరుణోపలబ్ధ పరచ
తుష్టి విద్యావిదులు, భవత్ప్రపితామ
హుండు మాధవకవీంద్రోత్తముఁ డభి
నవభారతాది నానాగ్రంథకర్త, నీ
తాత నృసింహవిద్వద్వరుండు
శబ్దశాస్త్రత్రయీ విచక్షణుఁడు, నీదు
జనకుఁడైనట్టి కనకాద్రిశాస్త్రివర్యుఁ
డఖిలశాస్త్రార్థవేది, నీ వద్భుత ప్ర
సిద్ధ సారస్వతుఁడవు నృసింహశాస్త్రి'

కవి 'యత్కించిదభినవప్రబంధ నిబంధనోత్సాహబంధురస్వాంతుఁడై' యున్న యవసరమున —

'జనులెల్లన్ జగతీపుహేంద్రుఁడనఁగా సామ్రాజ్యసంపూర్తిఁ జే
ర్కొన వల్లూరు వసంతవాడ మఱియున్ గూడూరు నా ఖ్యాతిగాం
చిన రాజ్యంబు లనంత ధాన్యధనలక్ష్మీపూర్ణత న్మించఁగా
దనరు న్నాగనరేంద్రుఁ డుద్భటభుజోద్దామ ప్రతాపోన్నతిన్'
'తన గుణశ్రేణి సత్కవికల్పితానల్ప కృతికన్యకల కలంకృతులుగాఁగఁ....
ప్రబలు రాజాబహద్దరు బొమ్మదేవరకుల నాగభూవిభుఁడు'—
'నను మాల్యాద్రి నృసింహభక్త్యుదిత నానాశాస్త్రపాండిత్యశా
లిని శ్రీమత్కనకాద్రిశాస్త్రి సుతు ధీలేఖర్షభాచార్యుఁ బా
వన సత్కాశ్యపగోత్రసంజనితు నాపస్తంబసూత్రున్ సదు
పనిషజ్ఞున్ నరసింహపండితుని సంభావించి పల్కెన్ దయన్'
'పురములలోనఁ జెన్నపురి పూర్ణవిలాసము వర్ణనీయమై
ఖరి యగుగానఁ దత్పుర వికస్వరచారువిలాస వర్ణన
స్ఫురణ నొనర్పు మొక్కకృతి భూరిగభీరతరార్థ గుంఫన
స్మరసభరంబుగా మతుకుమల్లి నృసింహకవీంద్రశేఖరా'

అని సగౌరవముగా నానతియొసఁగినఁ గవి యమ్మహారాజదేవేంద్రున కభ్యుదయ పరంపరాభివృద్ధిగాఁ జెన్నపురీవిలాసంబను ప్రబంధంబును నిబంధించినాఁడు.

'పండితకోటికిన్ మిగుల పామరమండలికిన్ మనంబులం
పండువుసేయునట్లు మృదుపాకముగా విశదార్థకంబుగా
నుండఁగ హూణవైభవములొప్పఁగఁ జేయుమటంచు నాగభూ
మండలభర్త యానతి సమంబుగ నీ కృతి నే నొనర్చితిన్'

అని కవి గ్రంథాంతమున వివరించినాఁడు.

చెన్నపురీవిలాసమునందాఱు పద్ధతులు. ఒక్కొక్కపద్ధతిలో కొన్ని ప్రకరణములు వెరసి 64 ప్రకరణములు, 232 గద్యపద్యములు కలవు. ఇది 1860 ప్రాంతము నాఁటిది[1]. ఆనాఁటి చెన్నపురిపట్టణమును వర్ణించునట్టి యథార్థ రథాకథన కావ్యము; ప్రౌఢపక్కినిసంధానితము[2].

కవి రచనలనుండి మాదిరికి కొన్ని పద్యములు :

'రవిరథ్యంబులఁబోరఁజూచు క్రియ దర్పశ్రీ విజృంభించు మే
ల్జవనంబైన హయంబునెక్కి నిఖిలాశాధర్తలన్ గెల్వఁగా
దివికిం బోవఁగఁదట్టి వాజినెగయన్ దీకొల్పుచున్నట్టుగా
నవు మందోగ్రిలుఁగనుంగ నిప్పటికిఁ బశ్యద్విస్మయాపాదియై'

—చెన్నపురీవిలాసము, మందోగ్రిలుప్రకరణము

'సిగ్గులుకొల్లలాడితివి చీరెలుదాచితి వింతెగాక మ
మ్మెగ్గులు బల్కఁజొచ్చితివి యెంతటిసాహసివౌర కృష్ణ యీ
జగ్గులు నీకెగాక భువి సైఁపఁగ నెవ్వరికైనఁగల్గునా
నిగ్గులుదేరి యొప్పెఁగద నీ సరసత్వము నీ ఘనత్వమున్'

—శ్రీకృష్ణజలక్రీడావిలాస నాటకము.

వల్లూరిసంస్థాన విద్వత్పరీక్షాధికారులగు నృసింహవిద్వన్మణి నిర్వహించిన వేదశాస్త్ర పరీక్షలలోనెగ్గి ఆస్థానమువారి సమ్మానమునో, వార్షికమునో బడసిన శాస్త్రపండితులనేకులు కలరు. వారిలో కొందఱు —

తర్కము; కాశీ నవద్వీప పండితులు కురుగంటి అప్పయ్యశాస్త్రులుగారు. వీరిశిష్యులు పరిమి శివయ్యశాస్త్రులుగారు; ద్వైతమతానుయాయి భీమాచార్యులుగారు, కాశీపండితులు ప్రభల సుందరరామశాస్త్రులుగారు.

వ్యాకరణము : నూజివీటిసంస్థానపండితులు మంత్రవాది రామస్వామి శాస్త్రిగారు, వీరిపుత్రులు సూర్యనారాయణశాస్త్రిగారు, కాశీపండితులు రాజమహేంద్రవర వాస్తవ్యులు మంత్రివాది లక్ష్మీనారాయణశాస్త్రిగారు, బందరుపండితులు కొమాండూరి రఘునాథాచార్యులుగారు.

వేదాంతము : కాలెంపూడి నివాసులగు ఎల్లేపెద్ది రాఘవశాస్త్రులుగారు. వరాహపురాగ్రహార వాస్తవ్యులగు వంకమామిడి రామస్వామిశాస్త్రులుగారు.

ఇంకను పెక్కురుకలరు.

## తిరుపతి వేంకటకవులు

రాజాశ్రీ భాష్యకార్లునాయఁడుగారు తమ పట్టాభిషేకసమయమున తిరుపతి

1. ప్రథమ ముద్రణము, 1863.
2. కొత్తపల్లి వీరభద్రరావు, మతుకుమల్లి నృసింహకవి 'చెన్నపురీవిలాసము', అభ్యుదయ, 1959, జనవరి, పుటలు 15–28.

వేంకటకవులను ఘనముగా సమ్మానించిరి।

'....బొమ్మదేవర సద్వంశవర్ధనుండు
ఘనగుణాఢ్యుండు శ్రీ భాష్యకారనృపతి
పుత్రివతి సతి తన దరిఁ బొలుపుఁదెలుప
శ్రీధవునిగృపఁ బట్టాభిషిక్తుఁడయ్యె'
'చెలులను మంత్రులన్ సుతుల శ్రీకరయౌ సతియున్ మహామహో
జ్జ్వలులగు చుట్టలున్ గవుల సన్నిధి మేల్మిసలంకరింప నై
తులు జయపెట్టి .... .... భాష్యకా
రులు నృపపుంగవుం డతినిరూఢిని బట్టపు భద్రపీఠమం
దెలమి చెలఁగ నొప్పె ...' నని తిరుపతివేంకటకవులు పట్టాభిషేకమును వర్ణించిరి (నానారాజసందర్శనము, ఉత్తరార్ధము, పుటలు 135–136).

భాష్యకార్లునాయఁడుగారి యనంతరము పల్లూరి రాణిగారు (1906-1917) కవిపండిత సమ్మానములను యథాపూర్వముగా నిర్వర్తించుచుండిరి.[1]

వీరి కుమారులు సత్యనారాయణవరప్రసాదుగారు వల్లూరు వేణుగోపాల స్వామివారి ఉత్సవసమయములయందు వేదపారాయణము, పండితప్రకాండుల శాస్త్రచర్చలు, కవితాగోష్ఠులు, అవధానవిధానములు, నాటకప్రదర్శనములు, భరతనాట్యప్రదర్శనములు, సంగీతసభలు, గుఱ్ఱపుపందెములు, మల్లయుద్ధములు, ఇతర జాతీయ కళాప్రదర్శనములు నేర్పఱిచి తమ కళాభిరుచిని ప్రకటించెడి వారు. వీరి యాస్థానగాయకులు ఆంధ్రగాయక పితామహులగు గరికిపర్తి కోటయ్యదేవరగారు. అశ్వధాటి రామమూర్తి, నాగభూషణము మొదలగు సంగీతవిద్వాంసులుకూడ నీ సంస్థానమునందు సత్కారములందినవారు.

'నాఁటి మధ్యాహ్నమునఁ గొల్వుకూటమందు
సరస తిరుపతివేంకటేశ్వరు లిరువుఱుఁ
గవితఁజెప్పిరి పిమ్మట గాయకమణి
నాగభూషణముం బాఁడె నాణెమెసఁగ'

— నానారాజసందర్శనము. పుటలు 192, 193.

తిరుపతివేంకటేశ్వరకవులు పలుమాఱులు 'నూటపదియాఱులు మేలిమి వస్త్రముల్ మొదల్గా మర్యాదకుందగిన కానుకలంది' వల్లూరు జమీందారుల యుదారకథానకము నుగ్గడించిరి. ప్రసిద్ధమల్లయోధుఁడు తోట నరసయ్యగారు (1899–1964) వల్లూరి రాజాగారి ఆశ్రయమునందుండి తాలింఖానాలను నెలకొల్పి చాలమందియువకులనుచేరదీసి వ్యాయామశిక్షణమునిచ్చిరి.[2] దక్షిణవల్లూరు ఎస్టేటులోని చినపులిపాక–బొడ్డపాడు గ్రామముల నెలకొనిన గ్రంథాలయము

[1] ఆర్యమతబోధిని, 1912, సంపుటము 8.

[2] గొతెపాటి వెంకటనరసయ్య, దేవరకోటసీమ సర్వస్వం, పుటలు 88, 89.

జమీందారు 'సత్యనారాయణవరప్రసాదు'గారి పేర వెలసినవి.

వల్లూరునందువెలసిన వేణుగోపాలస్వామి ఈ జమీందారుల కులదైవము. ఈ స్వామిమీఁద కవిపేరెఱుఁగఁగరాని శతకము 'సరసగుణజాల సంగీతసామలోల తోట్లపల్లూరి గోపాలతోయజాక్ష' యను మకుటముగలది యొకటి కలదు. ఆ శతకమునుండి ఒకటిరెండు పద్యములు :

'శ్రీమహిళా హృత్కుశేశయపరఖేల
బలదైత్యసూదన వరవినీల
బుధగురుసంకాశ సుధిత కీర్తివిశాల
దుర్మతి దితిజసందోహ కాల
బర్హిర్ముఖవ్రాత పరిపాలనోల్లోల
కమనీయవిలసిత కనకచేల
సంపూర్ణదాక్షిణ్య సంరక్షితకుచేల
ఘనతరదుష్కృత కంఠికోల
భూరికరుణారసాపాల పుణ్యశీల
భక్తసంఘాత సురసాల భరితశైల
సరసగుణజాల సంగీతసామలోల
తోట్లపల్లూరి గోపాల తోయజాక్ష'

'కాంచనచేలంబు గల్గియుండియు గొల్ల
యిల్లాండ్రచేలంబు లెత్తలేదె
కౌస్తుభరత్నంబు గల్గి సత్రాజిత్తు
కాంచనమణి నపేక్షించలేదె
యురమున శ్రీదేవి యొప్పారుచుండఁగఁ
గుబ్జతో రతికేళిఁ గూడలేదె
యైశ్వర్యనిధియన నలరుచుండియు బలిఁ
జేరి చేసాచి యాచించలేదె
పౌర యిట్టి యపేక్షచే నలరెదీవు
చెలఁగి నా కోర్కెదీర్చి రక్షించు టెట్లు....'*

మఱియు నీ వేణుగోపాలస్వామిమీఁద రాయబట్టు వీరరాఘవ కవిగారు, దాసు శ్రీరాములుగారును కొన్నిపదములను వ్రాసి సన్నుతించిరఁట. దాసు శ్రీరాములుగారు (1846—1908) తమ పండ్రెండవయేఁట 1858లో వల్లూరు సంస్థానములో అష్టావధానాదులొనర్చి వల్లూరి జమీందారు ఇమ్మడి నాగన్న నాయఁడు బహద్దరుగారి నుండి ఉత్తమకవితకు బహుమతిని పొందిరఁట.

* దీవి నరసింహాచార్యులు, తోట్లవల్లూరు వేణుగోపాలస్వామివారు, ఆరాధన, 1957 నవంబరు, సంపుటము 3, సంచిక 11, పుటలు 281-287.

దక్షిణ వల్లూరు జమీందారుగారు అనేక నాటకసంఘములకు పోషకులు. బందరు పురమునందలి 'ఇండియన్ డ్రమెటిక్ కంపెనీ' మొదలగునవి వల్లూరివారి ప్రాపును ప్రోపును బొంది పెంపొందినవి. రంగభూషణ నిడుముక్కల సుబ్బారావుగారి వంటి ఉత్తమనటులను వల్లూరు జమీందారులు సత్కరించిరి.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. మతుకుమల్లి మాధవమంత్రి, అభినవభారతము, అవతారిక.
2. మతుకుమల్లి నరసింహశాస్త్రి, చెన్నపురీవిలాసము, అవతారిక.
3. మతుకుమల్లి నరసింహశాస్త్రి, అజచరిత్రము లేక ఇందుమతీ పరిణయము.
4. శ్రీరాం వీరబ్రహ్మకవి, నానారాజన్యచరిత్రము.
5. తిరుపతివేంకటకవులు, నానారాజసందర్శనము, పుటలు 135, 136, 188-194.
6. తెలుగువిజ్ఞానసర్వస్వము, సంపుటము 3.
7. V. L. Sastri, Encyclopaedia of the Madras Presidency and the Adjacent States, pp. 429–432.

# విజయనగరము

## ప్రవేశిక

ఐతిహాసిక యుగములనుండియు విజయనగర సంస్థాన భూఖండము కళింగదేశము నందలి ఒక భాగము. ఆ తరువాత బాదామి చాళుక్యులు, వేంగీ చాళుక్యులు (క్రీ.శ. 615–1100) దీనిని పాలించిరి. ఆ పిమ్మట గంగ వంశీయు లగు పాలకులు తమ ప్రభుతను వెలయించిరి. త్రిలింగపరమేశ్వరులగు కాక తీయుల బాపుటా ఈ సీమలో కొంతకాలము రెపరెపలాడినది. పదునాలుగు, పదునైదు శతాబ్దుల సంధికాలములో రాజమహేంద్రవరము రెడ్డిరాజులు క్షీరాంభోధి తటమున దిక్చిమాజయ స్తంభములు నిలిపి, 'చీకటియున్ గళింగ యును జిల్కాసముద్రము, సింహశైలము'లను కొంతకాల మేకసితాతపత్రముగా నేలిరి. ఆ దరిమిలా గోలకొండనవాబుల దాడులవలన వారి సర్కారులలో నొకభాగముగా (1568–1652) చలామణియయినది. చికాకోలులోని తమ ఫౌజుదారుని సాయమున గోలకొండ నవాబులు కొంతకాలము (1652–1687) పాలించిరి. 1687–1724 మధ్య ఫౌజుదారుల పరముగ మొగలాయి దొర తనము చెల్లినది. ఆ పిమ్మట స్వల్పకాలము స్వతంత్రుఁడయిన నిజాము నధి కారముక్రిందికి వచ్చినది. ఫౌజుదారుల హయాములోనే బొబ్బిలి, విజయ నగర సంస్థానములు రూపొందినవి. 1753–1758ల మధ్య హైదరాబాదు నిజాము సలాబత్‌జంగ్ ఫర్మానా ప్రకారము ఫరాసు కంఫిణీ పాలనము ప్రవర్తిల్లినది. 1766 నుండి ఇంగ్లీషు కుంఫిణీ ఏలుబడిలోనికి వచ్చినది. 1766–1794 మధ్య ఇంగ్లీషు కుంఫిణీ పటాలముల మద్దతుతో ఇరుగు పొరుగులఁగల మన్యపు సంస్థానములు ఏదోయొక మిషతో విజయనగర పాల కులచే ఆక్రమింపఁబడి విజయనగర సంస్థానము అంచెలంచెలుగ విస్తరించుచు వచ్చినది. 1794 లో జరిగిన పద్మనాభయుద్ధము* తరువాత దేశీయసేనలు రద్దు కావింపఁబడుట వలనను విజయనగరము ఆక్రమణమునందలి పూర్వోక్త సంస్థానములు తత్తత్పాలక వంశీయులకు దఖలుపఱుచుటవలనను విజయనగర సంస్థాన ఔద్ధత్యము చాలమట్టుకు తటిగినది. 1802 లో జరిగిన శాశ్వతకర నిర్ణయమువలన నీ సంస్థానము ఇంగ్లీషు కుంఫిణీ దొరతనముక్రింద నొక జమీందారీగా పరిణతి నొందినది. ఆధునిక యుగమున అమలునకు వచ్చిన

* 1794 జూలై పదవతేదీ అని M.A.M.P. Vol. II, p. 140; Imperial Gazetteer of India, Vol. XXIV, p. 340. 5వ తేదీ అని నిడదవోలు సుందరము పంతులు, కళింగ రాజ్యక్షేత్ర ప్రశంస, కళింగదేశ చరిత్ర, పు. 60.

జమీందారీ రద్దు చట్టముమేరకు నిది ఆంధ్రప్రదేశమున ఐక్యమైనది.

ఈ సంస్థానము అభ్యుదయదశలో నుండినప్పటి వైశాల్యము మూఁడువేల చ. మైళ్ళ పైమాట. పూర్వ పాలకులు గడించినది ఏఁబదియేడు పరగణాల రాజ్యము. 1845లో పదుమూఁడు తాణాలుండినవి. నాటివైశాల్య మించుమించుగా రెండువేల చ. మై. అనగా పుదుక్కోట సంస్థానమునకంటె రమారమి మూఁడురెట్లు పెద్దది. 1938 నాఁటికి విశాఖపట్టణ మండలములోని 181 జమీందారీలలో ప్రాచీన సంస్థానములు ముప్పదియాఱు. హవేలీ ఖండములనుండి 1802 లో ఏర్పడిన యెస్టేటులు పదునాఱు. తక్కిన 129 ఎస్టేటులును 1802 నాఁటి అసలు ఎస్టేటులు పంపకము లగుటచే చీలి యేర్పడినవి. విజయనగర సంస్థానము దాదాపు పదుమూఁడువందల గ్రామములతో పదిలక్షల జనాభాతో ప్రవర్తిల్లినది. 1802 నాఁటి పేష్కషు అయిదులక్షలు; రాఁబడి ఏడులక్షలు. సంస్థానము రద్దుకాకపూర్వము దీని రాఁబడి సుమారు ముప్పదిలక్షలని అంచనా. విజయనగరము, భీమునిపట్టణము, శృంగవరపుకోట తాలూకాలలో పూర్తిగాను, అనకాపల్లి, గజపతినగరము, చీపురుపల్లి, పాలకొండ, విశాఖపట్టణము, సిరిపల్లి, సర్వసిద్ధి తాలూకాలలో చెదురుమదురుగాను ఈ సంస్థానము వ్యాపించియుండెడిది. తూర్పుగోదావరి మండలమునందలి కోటిపల్లి, శ్రీకూర్మము దాపునఁగల హీరమండలము మున్నగు ఎనిమిది ఎస్టేటులుకూడ ఈ జమీందారీకి చెంది యుండినవి.

ఈ సంస్థాన పాలకుల పూర్వరాజధాని కుమిలి (కుంభిలాపురము) యను గ్రామము. ఆ పిమ్మట పొట్నూరు రాజనివాసము. బొబ్బిలియుద్ధమునను నాయకుఁడుగా ప్రసిద్ధుఁడైన పెదవిజయరామరాజు కాలమున గాజులరేఁగ నివాసు లలో విజయరామరాజ జయోదాహరణముగా రూపొందిన విజయనగరము ఈ సంస్థానమునకు తరువాతి రాజధాని. కలకత్తా-మద్రాసు రైలుదారిలో కలకత్తా నుండి 507 మైళ్ళ దూరమునను, మద్రాసునుండి 522 మైళ్ళ దూరమునను, సముద్రతీరమునకు 22 మైళ్ళ దూరమునను విజయనగరము నెలకొనియున్నది.

ఈ సంస్థానమునందలి కోటిపల్లి, పద్మనాభము, రామతీర్థము, శ్రీకూర్మము, సింహాచలము మొదలగు దేవాలయములకు విజయనగరము జమీందారులు పరంపరీణముగా ధర్మకర్తలు. భారతదేశమునందలి సంస్థానాధీశ్వరులలో ఏ కొందఱకో తప్ప మామూలు జమీందారుల కెవ్వరికిని లేని ఫిరంగికాల్పుల గౌరవవందనము అనుమతింపఁబడిన జమీందారీ విజయనగర మొక్కటే.*

*C. D. Maclean, Standing Information regarding the official Administration of the Madras Presidency, Madras, 1879, Appendix, p. xi.

## సంస్థాన చరిత్రము

ఈ సంస్థానపాలకులు కమలాప్తవంశమువారు. గ్రహరాట్కుల విస్తారకులు అని రామకథాసార సంగ్రహాది కావ్యములలో ప్రసక్తులయినారు. ఇక్ష్వాకు వంశీయుఁడైన శ్రీరాముని తనయుఁడగు కుశుని సంతతికి చెందినవారఁట వీరు.[1] వీరు తొలుత ఇనకులమువారలయి, కాశ్యపగోత్రులయినను విప్రశాపవశత కాల్మాషపాది వాసిష్ఠుఁడగుటచే నతని సంతతి వారందఱును వాసిష్ఠులయిరఁట. వసిష్ఠగోత్రజులయందు గ్రహరాట్కుల విభాగములో శిశోదియా శాఖనుండి తామరతంపరగా వీరు వర్ధిల్లిరఁట.[2] ఉత్తర భారతదేశమున ప్రవర్ధమానములయిన తొంబది తొమ్మిది రాజపుత్ర శాఖలలో సమ్మాన్యులయిన ఉదయపురి (మేవాడు) రాజన్యులు విజయనగర పాలకుల పూర్వులఁట.[3] ఉదయపురము, కచ్వాహా, చావడా, ఘూలా, పుంవార, బారీ, సోలంకి—మున్నగు ఉత్తరభారత క్షత్రియకుటుంబములతో విజయనగర పాలకులకు సంబంధబాంధవము ఉండినదఁట.[4]

## 'పూసపాటి' గృహనామము

విజయనగరపాలకుల గృహనామము పూసపాటివారు. మైలమ భీముని సంతతిలోని అమలరాజు కొండపల్లిసీమలోని పూసపాటిగ్రామవాస్తవ్యుఁడగుట వలనఁదత్కులమువారికి పూసపాటివారను గృహనామము సంక్రమించినదని ఒక ఉపపాదనము.[5] 'గగనవాణీవాక్యగౌరవంబునఁ బూసపాటి భూమిని పురీవరముగట్టి వాసిగాంచుట పూసపాటివారను నింటిపేరుగాంచిరి రాచపెద్దలయిన నమలరాజాదిగ ప్రముఖులు మావారు ........' (రాచిరాజుగారి సీసమాలిక). 'పూసపాడను నగరంబు బ్రోచుకతనఁబూసపాటిపురాంకుఁడై పొగడుగనియె' (ఉషాభ్యుదయము, అవతారిక). 'అలపూసపాడనంగను వెలసిన పురమేలుచుంట

1 కుశాన్వయక్రమమునఁ దా జనియించె బుద్ధవర్మ...' (విష్ణుభక్తిసుధాకరము, 29); A. Vadivelu, Ruling Chiefs, Nobles and Zamindars of India, Vol. I, 1959, p. 69.

2 The Hindu, 1897, May 25; Madras Mail, 1897, May 25.

3 విజయరామ గజపతీంద్రచరిత్రము, 6.

4 దువ్వూరి జగన్నాథశర్మ, విజ్జయనగరమ్ - గజపతిమహల్, చంద్రిక, చెన్నపట్టణము, 1935, జూన్, పుటలు 233, 240.

5 'ఆయన (మాధవవర్మ) కొండపల్లిసర్కారులో పూసపాడను గ్రామమునందు నివసించియుండుటచేత పూసపాటివారనుపేరుగలిగినది' — విశాఖపట్టణముజిల్లా వృత్తాంత సంగ్రహము, పు. 301. '.... పూసపాటి రఘునాథరాజు .... కొండపల్లి సర్కారులో పూసపాడు అనే గ్రామంలో కాపురం వుండి ...' — మిమోరెండం.

విశ్వంభరలోపల పూసపాటివారన పిలసిల్లిరి రాజపరులు విఖ్యాతులగుచున్' (నరసభూపాలరాజీయము, పు. 5).

పూష (సూర్య) వంశ్యుల నివాసభూమియగుటచేత ఒకానొక పట్టణము పూషవాటమను పేర ప్రసిద్ధమయి అదియే తద్వాస్తవ్యులగు పాలకుల గృహనామముగా ప్రవర్తిల్లినదను మఱియొక కల్పనము 'పూషవంశ్యులవాసభూమి నాఁదగనొక పూషపాటియనంగఁ జొలుచుపురము కొండపల్లిసీమనొనరించియుండె నందు పామకోత్తుల నది పూసపా దనఁదగె నదిమొదలు పూసపాటివారయిరి యమలరాజవంశజులైనట్టిరాజులెల్ల' (కూర్మపురాణము, అవతారిక, పు. 6) అను నీ ప్రయోగమాధారముగా నేర్పడినది. భ్రమప్రయుక్తములయినట్టి యిట్టి శుష్కయుక్తులు ప్రమాణోపపత్తిప్రాప్తములు కాఁజాలవు.

సంస్కృత మార్కండేయ పురాణోత్తరఖండమునందు ఉట్టంకింపఁబడె నని సంభావించుచున్న 'పుంసపాటుఁడు' మూలపురుషుఁడుగాఁగలిగినవారగు టచే అతని సంతతివారు పూసపాటివారయిరనియు అదియే జనుల వాడుకలో పూసపాటియయినదనియు మఱికొందఱువ్రాఁత.[1] ఇది పూసపాటి శబ్దోత్పత్తికి సంబంధించిన మూఁడవప్రతిపాదనము.

'రాజకన్యాప్రసూతానాం నామాని శ్రుణు భూపతే
- పుంసపాటో మందపాటః కరదండశ్చ వీర్యవాన్
వత్సయూపశ్చ చత్వారో మహానందిసుతాస్తుతే....
పుంసపాటంచరాజానం కళింగవిషయేతు సః'

—మార్కండేయపురాణోత్తరఖండము, అధ్యా. 13.

అర్వాచీనసంఘటనములను నిరూపించు కొన్ని పురాణములలో ప్రత్యక్షమగు నిట్టిభాగములందలి ప్రక్షిప్తపాతములను పరమప్రమాణములుగా నంగీకరించుట సుసంగతముకాదు.

ఉదయపురిరాజన్యుల మూలపురుషుఁడని భావింపఁబడుచున్న శిలాదిత్యుని కతని భార్య పూషావతియందుదయమైన గ్రహరాట్టు, పూషుఁడు నను కుమారులలో రెండవవాఁడు పూసపాటివారికోపకాద్యుఁడని మఱికొందఱు[2]. దీనినికూడ అందనిపొందని వాదముగా నిరాకరింపవచ్చు. వితర్కించి చూచినచో పైనాలుగు వాదములలో మొట్టమొదటియుపపాదనమే యుక్తియుక్తముగాఁగన్పట్టుచున్నది. పూషవా ద్వంశమనునది 'పూసపాటి' యనుమాటకు సంస్కృతీకరణము. పుంసపాట, పూషవాట, పూషావతిశబ్దములకు పూసపాటి వికృతియనుట అవిచారిత రమణీయమైన ప్రతితంత్రసిద్ధాంతము. అసలు ప్రామాణికపుదర్శనములలో

[1] దుర్భాకి జగన్నాథశర్మ, పూసపాటి వంశానుచరితము, పుటలు 61, 74.

[2] కవికొండల వేంకటసత్యనారాయణమూర్తి, విశాఖమండలచరిత్రము, కృతిపతి వంశాభివర్ణనము.

మార్కండేయపురాణమునందు మీఁదిశ్లోకమే కానరాదు. విశేషించి మహానంది శ్రీ పేరుగల కొడుకులున్నట్లు మఱెచ్చటను చెప్పఁబడలేదు.

## 'పరిచ్ఛేది' సంజ్ఞ

ఆంధ్రక్షత్రియశాఖలలో వసిష్ఠగోత్రజులగు పూసపాటివారు పరిచ్ఛేది సంజ్ఞాంకులు.

'శ్రీమన్మహాపరిచ్ఛేది పర్ణాటక కోట కారతివంశపాటయైన
నెగడు వసిష్ఠ కౌండిన్య ధనంజయ కాశ్యపగోత్రముల్ గణనమీరు'

(క్షత్రియగోత్రసీసమాలిక)

మైలమాంబా దేవవర్మల తనయుఁడును, మైలమభీమావరినామ విఖ్యాతుఁడైనవాఁడు చిక్కభీముఁడు పూసపాటివారి మూలపురుషులలో నొకఁడు. చిక్కభీమునిచే నొకసారి పరిభవింపఁబడిన ఘర్జాణనృపాలుఁడు రెండవసారి సిగ్గుమాలి చిక్కభీమునిపై నెత్తిరాఁగా —

'... చిక్కభీముఁడు మహోద్ధురుం డసి వీని నే
లా భీరుం దరిపీఁగుఁ బంపుటని ఘర్జాణుండు సూడంగ న
య్యాభీలాసిని స్వాంగమున్నరికె....'

(కూర్మపురాణము, పు. 6)

'నాఁటి నుండియుఁ దద్వంశ నరవరేణ్యు
లిల పరిచ్ఛేదులనఁగను వెలసిరిట్లు'

(నరసభూపాలరాజీయము, పు. 5.)

ఈ యంశమే ఉషాభ్యుదయ శ్రీకృష్ణవిజయాది కృత్యవతరణికల యందును వర్ణింపఁబడియున్నది.

## పూసపాటివారి పూర్వులు

అనేక శతాబ్దములక్రిందట ఉదయపురిపాలకుల సోదరుఁడగు విజయభూపతి యను నతఁడు స్వీయరాజ్యమునువదలి సూర్యవంశీయుల తొలిరాజధానియగు అయోధ్యకేఁగి దానిని జయించి కొంతకాలముపాలించి క్రీ. శ. 6వ శతాబ్దము నందు దక్షిణభారతదేశమునకు తరలివచ్చి కర్ణాటకసీమయందు నేఁడు బిజాపుర మున్న స్థలమునం దొకదుర్గమును నిర్మించి రాజ్యముచేసెననియు నైతిహ్యము. ఈ విజయభూపతి పేరనేర్పడిన విజయపురమే అనంతరకాలమందు బిజాపుర మయినదఁట! వసిష్ఠగోత్రపవిత్రీకరణధురీణవర చరిత్రుఁడగు నీ విజయ భూపతి దక్షిణభారతదేశమునకు తరలివచ్చునాఁడు కాశ్యప కౌండిన్య ధనంజయ భారద్వాజ గోత్రములకుచెందిన క్షత్త్రియకుటుంబములను తనవెంట తీసికొని

వచ్చెననియు[1] వారే నేఁటి ఉత్తరసర్కారులలోని 129 గృహనామములు[2] కల రాచవారికెల్లరికు పూర్వపురుషులని తెలియుచున్నది.

ఈ విజయభూపతికే బుద్ధవర్మయను నామాంతరముండినదని కొందఱు[3], శిలాదిత్యునికి హంసావతివలనఁ గలిగిన రెండవకుమారుఁడైన ప్రాముసకే విజయరాజనియు, మాధవవర్మయనియు నామాంతరములుండెనని కొందఱు[4], బుద్ధవర్మ విజయభూపతి కుమారుఁడని కొందఱును, విజయభూపతిసంతతికి చెందినవాఁడని మఱికొందఱును వ్రాసిరి. బుద్ధవర్మ కుమారుఁడు మాధవవర్మ యని వసుభూపాల రాజీయకృత్యవతారిక పేర్కొనుచున్నది. ఈ వ్రాఁతల కన్నింటికిని మూలములు పుక్కిటిపురాణములే తప్ప సుస్పష్టమైన చారిత్రకాధారములు గన్పట్టవు.

దక్షిణభారతదేశమునకు తరలివచ్చిన ఉదయపురిరాజబంధువు మాధవవర్మయేయని మఱికొందఱి ఊహాగానము[5]. ఈ మాధవవర్మ బెజవాడకు వచ్చి బెజవాడలో వెలసిన దుర్గాదేవి నారాధించి ఏడుగడియలు సువర్ణవృష్టి కురిపించెననియు కటకము మొదలు కన్యాకుమారివరకుఁగల ప్రాక్సముద్రతీరస్థదేశమును జయించి బెజవాడ రాజధానిగా ప్రభుత్వమును నిర్వహించెననియు కథ. ఇందువలననే బెజవాడ దుర్గాదేవికి కనకదుర్గయనుపేరు సార్థకమైనదనియు మాధవవర్మ వంశీయులు కనకదుర్గావరప్రసాద లబ్ధవైభవులయిరనియు పరంపరాయాతప్రతీతి[6].

1 'అంచు వసిష్ఠ కశ్యప ధనంజయ భరద్వాజ కౌండిన్య గోత్రంబులైన' (శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి సీసమాలిక, ఆంధ్రవిజ్ఞానము, సం. 6, పుటలు 3206–3208). కాని కౌండిన్య కాశ్యప ధనంజయాన్వయజులు మాత్రమే తరలివచ్చినట్లు ఆంధ్ర మార్కండేయ పురాణము, అవతారిక, పు. 10.

2 ఈదరపల్లి, ఉప్పలపాటి, కనుమూరి, గొండ్రాజు, మందపాటి మొదలగు వారు కాశ్యప గోత్రజులు; కాకతిసంజ్ఞికులవారు. దలిపిండి, ముదునూరి మొ॥ వారు కౌండిన్య గోత్రజులు; వర్ణాటసంజ్ఞావిభూషితులు. ఉద్దరాజు, గొట్టిముక్కల, చింతలపాటి, జంపన, దండు, దంతులూరి, దాట్ల, సల్లపరాజు, పెనుమెచ్చ మొ॥ వారు ధనంజయ గోత్రజులు; కోటసంజ్ఞావిహ్వితులు. అల్లూరి, కాకర్లపూడి, పూసపాటి, మంతెన, రుద్రరాజు, వత్సవాయి, సాగిరాజు మొ॥ వారు వసిష్ఠ గోత్రజులు; పరిచ్ఛేదికులాభరణులు. భారద్వాజగోత్రము వారి శాఖ ఉత్పన్నము కాఁగా తక్కిన నాలుగుగోత్రముల శాఖలే ఆంధ్రక్షత్రియులలో నేఁటికిని వర్ధిల్లుచున్నవని వేత్తల విశ్వాసము.

3 ఆంధ్రమార్కండేయపురాణము, అవతారిక, పు. 10.

4 పూసపాటివంశానుచరితము.

5 Madras Standard, 1897, May 25, Tuesday, Editorial.

6 'మును బెజవాడ దుర్గ......మెచ్చఁజేసి......చిరకీర్తులంగనియె మాధవవర్మ......' (నా. పంచ. పీఠిక, 24); 'కనకదుర్గాలసద్దయా గరిమవలనఁ గనకవర్షంబు గురిపించె ఘనులు పొగడ', (వసుభూపాలరాజీయము, అవతారిక. పు. 4); 'ఏయన్వయు క్షమాధీశులు

మాధవవర్మ సమీప సంతతి నిరూపణమునందును పండిత పరిశోధకులలో ఏకాభిప్రాయము కనుపింపదు. విజయనగర రాజవంశావళిని వివరించిన ఉషాభ్యుదయ కూర్మపురాణ నరసభూపాలరాజీయ మార్కండేయపురాణ విష్ణుభక్తిసుధాకర శ్రీకృష్ణవిజయాది కావ్యముల యనువర్ణనము నందును అనురూపత అంతగా ప్రకటీకృతమగుటలేదు. అంతయును గజిబిజిగాఁ గన్పట్టుచున్నది. దేవవర్మ మాధవవర్మ పుత్త్రుఁడని కొందఱు భావింపఁగా, మాధవవర్మ సంతతికి చెందినవాఁడని ఇంకొకకొందఱూహించిరి. మైలమాంబా దేవవర్మల కుమారుఁడు చిక్కభీముఁడు. ఇతఁడే మైలభీముఁడనియు, ఏరువ భీముఁడనియు చాటుకృతులలో విఖ్యాతుఁడు.

మైలభీముని సంతతిలో అమలరాజు ముఖ్యుఁడు. అమలరాజునకు అక్కాంబవలన అయిదుగురు కొడుకులు. వీరిలో ముఖ్యుఁడగు అయ్యపరాజు కులవిస్తారకుఁడు. ఈ అయ్యనభూపాలుని మువ్వురు కుమారులలో తమ్మిరాజు రాజ్యపాలకుఁడు. '....తమ్మభూవరుం డన్నలదేవులం బరిణయంబయియానతి యంచు....గాంచె....తిప్పనృపాలచంద్రుని....మాదవిభు....రాచభూవరుని....' (శ్రీకృష్ణవిజయము). ఈ పుత్త్రయమునందు కడగొట్టువాఁడు మొదటి రాచిరాజుగా చరిత్రములో వ్యవహృతుఁడు. ఇతఁడు చాళుక్యచిరరాజ్య స్థాపనాచార్య బిరుదమును పొందినట్లును ప్రౌఢదేవరాయభూపాల సమ్మాన్యుడై రాజపట్టముగట్టికొనినట్లును దామెరాధీశతిమ్మన నోడించి యరిగాపుగాఁ జేసినట్లును, మాళవాధీశుని మర్దించి మన్నెసుల్తానను మహితబిరుదమునొంది విలసిల్లినట్లును సాహిత్యము సాక్ష్యమిచ్చుచున్నది. ఇతనికి దంతులూరు ఎఱ్ఱమరాజు తనయ సూరమాంబికయందు కలిగిన కొడుకులు మువ్వురలో తమ్మిరాజు ఇమ్మడి తమ్మిరాజుగా చరిత్రలో ప్రసిద్ధుఁడు. ఈ తమ్మిరాజు నందాపుర పరిసరముల గజపతీంద్రునిపుత్త్రుల నోడించి గజపతినామాంకము నాకర్షించిన వీరుఁడని ఉషాభ్యుదయ కథనము. ఇతని మువ్వురుకొడుకులలో రెండవ రాచిరాజు (1500—1550) కటకాధిపతి ప్రతాపరుద్రగజపతిచే అరణముగా నీఁబడిన కేతవరమనుపురము నికేతనముగ వెలసియుండుటచే విజయనగర పాలకులకు కేతవరపురనాయకులు,* మొగలితుర్రిరాజధానీంద్రులు, మొగలితుఱ్ఱి మణికిరీటులు అను వంశక్రమానుగతములగు బిరుదములు సంక్రమించినవి.

బెజవాడ కనకదుర్గా వరజనితులైరి', (వైరాగ్యదర్పణము, అవతారిక, తాళపత్త్ర ప్రతి); 'స్వర్ణగిరిజా ప్రసాదసంజనితమైన హయగజరథాళిలోఁ గూడి......' (రామకృష్ణార్జున రూపనారాయణీయము, అవతారిక, పు. 5).

* 'కటకేశ్వరునిచేతఁగని కేతవర మాత్మపురముగా నేలె నే భూవిభుండు' (శ్రీకృష్ణ విజయము, అవతారిక, 1–121); 'కేతవరపట్టణేశుఁడై కీర్తినించె' (నరసభూపాల రాజీయము, పు. 6); 'వారిలోపల రాచ భూవాసవుండు.....కేతవరపట్టణాధీశుఁడై తనర్చె' (రామకృష్ణార్జున రూపనారాయణీయము, పుటలు 6, 7).

ఈ రెండవరాచిరాజు తమ్ముఁడు తిప్పరాజు. ఇతని మొదటిభార్య గొట్టిముక్కల అన్నమరాజు తనయయగు మల్లమదేవి. రెండవభార్య చింతలపాటి ఉద్దండరాజు తనూజయగు గోపమాంబ. చిన్నభార్యయందుకల్గిన ముగ్గురు కుమారులలో అగ్రజుఁడు పెదకృష్ణభూపతి; రాచిరాజు, తమ్మిరాజు అను నిద్దఱు అవరజులు.[1] పెదకృష్ణభూపతికి తిమ్మాంబవలన పెదజగన్నాథరాజు, చినజగన్నాథరాజు అని ఇరువురు పుత్రులు. పెదజగన్నాథరాజునకు కృష్ణమరాజు, రామరాజు అని యిరువురు కుమారులు. జయపురము విక్రమదేవుగారు బంధుభావమున బాహుబలేంద్రులవారి కొసఁగిన పొట్నూరు, భోగాపురముసీమల నాక్రమించినవాఁడీ కృష్ణమరాజు. ఈతఁడే కుమిలిలో కోటనుగట్టి కాపురముగిలినవాఁడు.[2] స్థలదుర్గ కుంభిలాపురనికేతనులు అను బిరుదము ఇతనివలననే యేర్పడినది. ఇతనికి జగన్నాథరాజు, అన్నమరాజు అని యిద్దఱు తనయులు. కనిష్ఠుఁడు '....త్రైలోక్యరాయ వేశ్యాభుజంగసంగరాంగణ విజయనిశ్శంక బిరుద బాహుబలహేళి యన్నభూపాలమౌళి' (ఉషాభ్యుదయము). ఈ అన్నమరాజునకు వెంగళాంబయందు కృష్ణమరాజు, గోపాలకృష్ణరాజు అని యిరువురు పుత్రులు. కృష్ణమరాజునకు గొట్టెముక్కల కేసమాంబయందు అన్నమరాజు, వెంకటపతి రాజు (1669—1720), ఆనందరాజు (1671—1717) అని ముప్వురుకుమారులు. ఈ యానందరాజు మొదటి ఆనందరాజుగా వ్యవహృతుఁడు.

పెదకృష్ణభూపతి కడగొట్టుకుమారుఁడగు చినజగన్నాథరాజు రెండవ పుత్రుఁడు భూపాలరాజు. ఇతని మూఁడవ కుమారుఁడు కొండ్రాజు. ఈ కొండ్రాజు పెద్దకొడుకు రఘునాథరాజు (1620—1685). రఘునాథరాజునకు మాధవవర్మ యనియు[3] చినతమ్మిరాజు అనియు[4] నామాంతరములుండినవఁట. ఈ రఘునాథ రాజు తొలుత గోలకొండనవాబుల కొలువులో గొప్పసరదారు. అదే కొలువున ఫౌజుదారగు షేర్ మొహమ్మదుఖాను సిఫారసుమీఁద కొండపల్లెసర్కారులో కొంతకాలము సరదారు. ఆ పిమ్మట ఖాను ననుగ్రహమున భోగాపురము వాసస్థానముగా కొన్ని ఇజారాగ్రామములకు సొంతదారయి ప్రసిద్ధికివచ్చినట్లు చరిత్రము. 'మొగలాయిప్రభులకై పూని షేర్ మహమదుఖానుఁడనెడు పేరు గల్గినట్టి సరదారుఁడు మనదేశమును జయింపఁగవచ్చె నాతనితోడ వచ్చినట్టి యిరువురు ప్రభువులలో....రెండవ ప్రభువు విజయనగరరాజ్యము మొదటి

[1] గోపమాంబ పుత్రులను మల్లమాంబ సుతులని విశాఖమండల చరిత్రకర్త వ్రాయుట తప్పు.

[2] ఆంధ్రమార్కండేయపురాణము, అవతారిక, పు. 13.

[3] విశాఖమండలచరిత్రము, పు. 41 ; మిమోరెండం.

[4] శ్రీ విజయనగరమువారి కుటుంబము: పూసపాటి వంశానుచరితము: విజయనగర దర్శిని, పు. 1 ; రంగా. 1—115.

వాఁడుగా గణింపఁబడిన మాధవవర్మయని బుధమిరేఁడు.' (రంగా. 1—115).

రఘునాథరాజకుమారుఁడగు సీతారామచంద్రుఁడు జయపురముపారి సరిదారుఁడు (1669–1672)గా నుండి వారినుండి కుమిలి, గండ్రేడు, దేవుపల్లి పరిగణాలు బహుమతిపడసి పొట్నూరు రాచపట్టుగ ప్రాముఖ్యమునకు వచ్చెను.[1] మొగలుపాదుషా ఔరంగజేబువలన 'జుల్ఫికారు' (రెండుమొనల కత్తి) బహుమతినందినవాఁ డీ సీతారామచంద్రుఁడు.[2] చినజగన్నాథరాజు పౌత్రుని పౌత్రుఁడగు నీ సీతారామచంద్రుఁడు నిస్సంతతుగుటచే పెదజగన్నాథరాజు పౌత్రుని పౌత్రుఁడును రేసమాంబా కృష్ణమరాజుల తృతీయ పుత్రుఁడును నగు మొదటి యానందరాజును దత్తుస్వీకరించిరి.

ఆనందరాజు బాలుఁడగుటచే జ్యేష్ఠసోదరుఁడగు అన్నమరాజును ఆ పిమ్మట రెండవసోదరుఁడగు వెంకటపతిరాజును అధికారము నిర్వహించిరి. వెంకటపతిరాజు అనంతరము ఆనందరాజు పాలకుఁడు. 1717 లో ఆనందరాజు మరణించుటచే ఇతనియన్నయగు వెంకటపతిరాజు కుమారుఁడు సీతారామరాజు రాజ్యమునకువచ్చి కిముడివారితో చెలిమిచేసి వారినుండి మఱికొంతసీమను సంపాదించి రణీతి, బ్రాఁడిముదక, బొంతపల్లి మొదలగు పదునాలుగు పరిగణాల కేలిక యయ్యెను. సీతారామరాజునకును ఆనందరాజు కుమారుఁడగు విజయరామరాజు (1670—1757) నకును మనస్పర్ధలేర్పడుటచే ఆనాఁటి చికాకోలు ఫౌజుదారు అన్వరుద్దీను (1725—1740) సర్దుబాటుచేసి సీతారామరాజునకు దేవుపల్లికోటను, విజయరామరాజునకు విజయనగరమును పంపకమొనర్చెనఁట. ప్రతాపగిరిదుర్గాధిపతితోడి పోరులో 1734లో సీతారామరాజు వీరస్వర్గమలంకరించుటతో[3] ఆయన కుమారుఁడైన రెండవ ఆనందరాజు రెండేండ్ల పసివాఁడగుటచే దేవుపల్లిరాజ్యము తిరిగి విజయరామరాజు చేతికివచ్చినది.

మొదటి ఆనందరాజు కుమారుఁడగు ఈ విజయరామరాజు 'ఆగౌతమీకటకాంతరాళక్షమాతలము నేకాతపత్రముగనేలి' (రంగా. 3—262) నవాఁడు. ఇతఁడు విజయనగరపాలకులలో పెదవిజయరామరాజుగా, ఫరాసుసేనాని బుస్సీదొరకు మిత్రుఁడుగా, బొబ్బిలియుద్ధమునకు మూలకారకుఁడుగా చరిత్రములో పరికీర్తితుఁడు. నిజామునుండి మీర్జా, రాజా మన్యసుల్తానాది మహిత బిరుదములఁ బడసినవాఁడు. ఈతని మొదటిభార్య చింతలపాటి రాచరాజు పుత్రియును నీలనృపశేఖరుని చెల్లెలునునగు చంద్రమాంబ; రెండవభార్య పాకలపాటి సింహాద్రిరాజు పుత్రిక రాజమాంబ. బొబ్బిలియుద్ధావసానమున

[1] శ్రీ పూసపాటివారి చరిత్రము.

[2] 'ఢిల్లీపాద్షా......యిరుమొగములఁ దళతళయని కరముమెఱయుచుండు జుల్ఫికారను ఖడ్గం బరుదుగ నొసఁగె......' (విజయరామగజపతీంద్ర చరిత్రము, 11వ పద్యము).

[3] విజయరామరాజే సీతారామరాజును చంపించెనని ప్రతీతి, చూ, మిమో

(1757 జనవరి) పెదవిజయరామరాజు తాండ్ర పాపయచే హతుఁడుకాఁగా ఆతని పెదతండ్రి పౌత్రుఁడును సీతారామరాజు పుత్రుఁడును అగు రెండవ ఆనందరాజు (1732–1760) పట్టమునకు వచ్చెను.

రెండవ ఆనందరాజు ఆంగ్లేయులతో చెలిమిచేసి[1] కర్నల్ ఫోర్డువారి నాయకత్వమునఁగల ఆంగ్లసేన తోడ్పాటుతో ఉత్తరసర్కారుల లోని సంస్థానాధిపతులను చాలమందిని వశపఱచికొని ఉత్తరసర్కారులనుండి పరాసు వారిని పాఱఁదోలినవాఁడు.[2] ఈ జైత్రయాత్రా సందర్భమున కులదేవతయగు బెజవాడకనకదుర్గనుకొలిచి తిరిగివచ్చుచుండఁగా మార్గమధ్యమునందే ఆనంద రాజు స్ఫోటకమునోఁకి రాజమండ్రిలో 1760లో ముప్పదేడ్లలోపు ప్రాయమున హఠాన్మరణము పాలయినట్లు చరిత్రము.[3] దేవీపూజాధురంధరుఁడగు నీతని పూజాలోపము కారణముగా నీ దుర్మరణము ప్రాప్తమయినట్లు కట్టుకథ.[4]

ఆనందరాజు నిస్సంతగుటవలనను, ఆతని భార్యలిరువురు సహగమన మొనర్చుటవలనను పెదవిజయరామరాజు దేవేరియైన రాణి చంద్రయ్యమ్మగారు విజయనగరపాలకుల జ్ఞాతివర్గములోని ఒకబాలుని విజయరామరాజు అనుపేర నిజామునను మతితో దత్తుగాతెచ్చి రాజవంశమును నిలిపిరి. మొదటి ఆనందరాజు పితామహుఁడైన అన్నమరాజునకు జ్యేష్ఠసోదరుఁడగు జగన్నాథరాజునకు ప్రపౌత్రుఁడు రామభద్రరాజు. వీరు తాళ్ళపాలెము వాస్తవ్యులు. ఈ రామభద్రరాజునకు మొదటిభార్యవలన సీతారామరాజు, రెండవభార్యయగు బంగారుతల్లివలన వెంకటపతిరాజు (1749–1794)ను అను నిరువురు కుమారులు. ఈ వెంకటపతిరాజునే రెండవ విజయరామరాజు అనుపేర చంద్రయ్యమ్మగారు దత్తు తెచ్చినది. ఇతఁడు దత్తువచ్చునాఁటికి పదునొకం డేండ్ల బాలుఁడు. ఈతని సపతియన్న సీతారామరాజు గొప్పవ్యవహారదక్షుఁడు. పసివాఁడగు తమ్మునకు బదులుగా సీతారామరాజే రాజ్యతంత్రమును చేపట్టి ఇంచుమించు పాతికేండ్లు కత్తికెదురులేని పరిపాలనము సాఁగించినవాఁడు.

రెండం, పు. 6; Encyclopaedia of the Madras Presidency and the Adjacent States, p. 379.

[1] Dr. Yusuf Husain Khan, The Cession of the Northern Sarkars to Bussy, Proceedings of the Indian History Congress, Calcutta, 1939, p. 1529. మిమోరెండం, పు. 9.

[2] 'బహుదేశములకెల్ల ప్రభువగు భూశిని గడినిల్వకుండను కదను నొత్తె ఇంగిరేజులతోడ హితమెంచి బందరురేవుపట్టన్నియు శీవినొసగె' (విష్ణుభక్తి సుధాకరము, అవతారిక, 119); Sir George Forrest, The Life of Lord Clive, Vol. II, p. 75; J.D.B. Gribble, A History of the Deccan, Vol. II, pp. 55–57; Col. Malleson, Decisive Battles of India, p. 77.

[3] శ్రీ విజయనగరమువారి కుటుంబము — వ్రాతప్రతి.

[4] గంటి సూర్యనారాయణశాస్త్రి, శ్రీరామతీర్థచరిత్ర, పు. 37.

కృష్ణా మహానదీమధ్య మోర్వీపతులందఱు సీతారామరాజు నౌద్ధత్యమునకొదిగి కప్పములు చెల్లించిరి.[1]

విజయనగరము నౌద్ధత్యమును సహింపని మన్నెరాజులందఱును జయపురము విక్రమదేవు నాయకత్వమున విజయనగర వినాశనమునకై కుట్ర పన్నఁగా సీతారామరాజు వారి పన్నుగడల నెఱిఁగి వారిసీమల నన్నింటి నాక్రమించి, వారినందఱను ఖైదు చేయించెను. అన్న కెదురుచెప్పలేని విజయరామరాజు చాలకాలము నామమాత్రపు పాలకుఁడుగానుండి చిట్టచివరకు ఇంగ్లీషు కుంఫిణీవారి తోడ్పాటు వలన దివాను పదవినుండి అన్నయగు సీతారామరాజును బర్తరపుచేసి రాజ్యమును స్వయముగా పాలింపమొదలిడెను.

ఇంత ఉద్ధతులగు పాలకులు తమకు వశవర్తులుగా నున్నను వీరివలన ఎప్పుడో ఒకప్పుడు తమ అసలు మనుగడకే ముప్పు కలుగవచ్చునను గుండె బెదరు కుంఫిణీవారికుండినది. కుంఫిణీకి చెల్లింపవలసిన పేష్కషు బకాయి మొత్తములు సక్రమముగా చెల్లింపుటలేదనియు కుంఫిణీ నౌకరులమీఁద కుట్రలు చేయుచున్నాఁడనియు మున్నగు కుంటిసాకులతో కుంఫిణీ అధికారులు కోటను వదలిపోవలసినదని విజయరామరాజును ఒత్తిడి చేయఁగా అతఁడు ప్రతిఘటించెను. దీని పర్యవసానమే 1794 జూలై నెలలో జరిగిన పద్మనాభ యుద్ధము.[2] ఉత్తర సర్కారులలో వాగి, చింతలపాటి, జంపన, దంతులూరి, దాట్ల, పెనుమెచ్చ, వత్సవాయ, వేజెళ్ల—మున్నగు గృహనామములుగల క్షత్రియ వంశజులు పెక్కురు విజయరామరాజుతోపాటు ఈ అధర్మరణమున మరణము నొందిరి. కుంఫిణీ అధికారులు విజయనగరమువారి ఆక్రమణమునందలి మన్యపు సంస్థానము[3] లన్నింటిని విడఁదీసి వానిని పూర్వ పాలక వంశీయుల కప్పగించి విజయనగర ప్రాధాన్యమును సంకుచితపఱచిరి.

ఈ రాజ్యోపప్లవము వలన విజయరామరాజు కుమారుఁడైన పదియేండ్ల బాలుఁడు నారాయణగజపతి తల్లి సీతయ్యమ్మతోపాటు రాచపల్లిపూడి బాపిరాజు,[4] కొలగట్ల పట్టాభిరామయ్య అనువారు బాసటగా కొంత రాణువ తోడుగా మన్య ప్రాంతములకు పాఱిపోయి రాణీపురము పాలకుఁడు మఖీ రాజభూపాలరాజు నాశ్రయమున కొన్నాళ్ళు తలదాఁచికొని, ఆ పిమ్మట మక్కువ పరగణాలో

[1] 'ఏవంశ నరపాలురెల్ల మన్యంబులుగొట్టి యప్పనములుగొన్నవాఁడు' (వైరాగ్య దర్పణము, అవతారిక, తాళపత్రప్రతి).

[2] Vizianagaram Treaty, p. 18; M.A.M.P., Vol. II, p. 140. మేనెల అని కొందఱు, జూన్‌నెల అని మఱికొందఱు.

[3] 'రెండవ రామచంద్రదేవు... పూసపాటి విజయరాముఁ బహునామము గెల్చి దొరతనంబునకుఁ దోడ్పడె...' (ప్రభాస శాపవిమోచనము, 25).

[4] పూసపాటి వారి కైఫీయత్తు; విజయనగరచర్త్రి, పు. 6; మిమోరెండం, పు. 10.

నివాసమేర్పఱిచి కొనెను. కుంఫిణీవారెన్ని హామీలనిచ్చినను నారాయణగజపతి కొండలనుండి క్రిందికి దిగివచ్చుటకు ఒప్పుకొనలేదు.[1] చివరకు విజయనగరమునకు వచ్చినను విజయనగరములో నివసింప నిచ్చగింపలేదు. ఇతనితోడనే 1802 లో సాలీనా అయిదులక్షల రూపాయల పేష్కషుతో శాశ్వత పరిష్కారము జరిగినది. ఇట్లు ఈ కోవలో ఇతఁడే మొదటి జమీందారు. ఈ గొడవలలో సంస్థాన వ్యవహారములు అవకతవకల పాలయి సంస్థానము అప్పులలో మునిఁగి పోయినది. ఈ చిక్కులతో చీకాకులతో వేఁగ లేక నారాయణ గజపతి 1817–1822, 1827–1845 మధ్య సంస్థానమును ప్రభుత్వ పర్యవేక్షణమునకు వదలి లక్షరూపాయల సాలుసరి 'లవణము' మీఁద కాశీనగరమున నివసించుచు 1845 లో అచ్చటనే మరణించెను.[2]

నారాయణగజపతికి అప్పలకొండయాంబ వలనఁ గలిగిన కుమారుఁడు విజయరామగజపతి (1826–1879). తండ్రి మరణానంతరము 1845 లో ఈయనకు జమీ హక్కు సంక్రమించినను 1852 దాఁక సంస్థానపాలనము కుంఫిణీ ప్రభుత్వ పర్యవేక్షణమున నుండినది. ఆ పిమ్మట విజయరామ గజపతి సంస్థానపాలనమును స్వీకరించి 1864 లో మహారాజా బిరుదమును 1866 లో K. C. S. I. బిరుదమును పదుమూఁడు ఫిరంగుల కాల్పు గౌరవ వందన మర్యాదయును 1874 లో His Highness బిరుదమును బడసిరి. మూఁడు తడవలు ఇంపీరియల్ లెజిస్లేటివు కౌన్సిలు సభ్యులుగా ఎన్నికయి ప్రతిష్ఠను పొందిరి. వీరి సహధర్మచారిణి కశ్యప గోత్రజులగు ఫ్రేజాసింహా రాజుల కుమారియగు అలక రాజేశ్వరి.[3]

విజయరామ గజపతి జ్యేష్ఠ పుత్త్రిక అప్పలకొండయాంబ. అప్పల కొండయాంబ వింధ్యాద్రిపాద భూములలోని బాగేల్ ఖండము నందలి రీవా సంస్థాన పాలకులు సోలంకి రఘురాజసింహ మహారాజు G. C. S. I. (1854–1880)[4] యొక్క పితృవ్య పుత్రుఁడైన రామరాజ సింహ మహారాజు (మఘోగడ్ పాలకుఁడు) భార్య. ఈమె చిన్నతనముననే విగత భర్తృకయయి విజయ నగరము వచ్చి రాజకార్య నిర్వహణమునందు సోదరునకు తోడ్పడినది. విజయరామ గజపతి పెద్దకుమారుఁడు నారాయణ గజపతి చిన్నతనముననే మరణించి యుండెను. రెండవ పుత్రుఁడగు ఆనందగజపతి (1850–1897)

[1] విశాఖపట్టణము జిల్లా వృత్తాంత సంగ్రహము, పుటలు 393–395.

[2] విజయనగర దర్శిని, పు, 8.

[3] లచింట సుందర రామయ్య, ఘనత కెక్కిన శ్రీ పురుషుల చరిత్రము, పుటలు 111–114.

[4] A. Vadivelu, The Ruling Chiefs, Nobles & Zamindars of India, Vol. I. 1915, pp. 135–137.

తండ్రి మరణానంతరము 1879 లో జమీకి వచ్చి 1881 లో మహారాజా బిరుదమును 1887 లో K. C. I. E. బిరుదమును, 1892 లో G. C. I. E. బిరుదమును పొంది 1881, 1894 లలో శాసన నిర్మాణ సభా సభ్యత్వము బడసి ఆంగ్లేయులచే 'జనమోహనుఁడు' (Prince Charming) అని కీర్తింపఁబడినాఁడు. ఉత్తర హిందూస్థానము నందలి జయపుర సంస్థాన పాలకుఁడగు శ్రీరామసింహాగారి జ్ఞాతియగు రమాకాపతి తనయ బనేసకుమారి (వసంతకుమారీ దేవి – ఛోటా మహారాణి) ఆనందగజపతి భార్య.

ఆనంద గజపతి నడివయస్సుననే 1897[1] లో నిస్సంతుగా మరణించుట వలన జమీ హక్కుల గూర్చి వారసులలో వివాదములు వచ్చినవి. ఆనంద గజపతి మేనమామ (అలక రాజేశ్వరి సోదరుని) యొక్క రెండవ కుమారుని ఆనందగజపతి తన మరణమునకు మూఁడేండ్లు ముందుగా ఒకానొక 'దసరా' ఉత్సవ సందర్భమున దత్తు స్వీకరించి యుండెననియు, మరణకాలము నాఁటికి కొన్ని నెలలకు ముందే ఈ దత్తునకు సంబంధించిన వీలునామా రిజిష్టరయి యుండెననియు తెలియుచున్నది.[2] సంస్థానపు హక్కుకోసము సమీపజ్ఞాతులు పెద జగన్నాథరాజుగారి ద్వితీయ పుత్రుఁడగు రామరాజు కోవకు చెందిన రేఁగ పూసపాటిశాఖ కుమారవెంకటపతిరాజాదులు వివాదములు లేవఁదీయుటవలన 1897-1904 మధ్య సంస్థానము కోర్టు ఆఫ్ వార్డ్స్ వశమున నుండినది. గురజాడ వెంకట అప్పారావు, తాతా సుబ్బారాయశాస్త్రి, నిడుదవోలు సుందరము పంతులు మొదలగువారు శాసనములనుండియు, ధర్మశాస్త్రములనుండియు, కావ్యసాహిత్యము నుండియు ఆవశ్యకములగు ప్రమాణములను సేకరించి విజయరామగజపతి దత్తును న్యాయస్థానము వారంగీకరించునట్లుగా తోడ్పడిరఁట. ఈ వ్యాజ్యమును వేయికనులతో పరిశీలించి విజయమును చేకూర్చిన ఘనత రీవారాణి యశస్వతి, జ్ఞానవతి అప్పలకొండయాంబ గారిదని విజ్ఞుల ప్రకథనము.

ఇట్లు దత్తుఁడుగా వచ్చిన విజయరామ గజపతి (1883–1922)[3] 1904–1922 ల మధ్య సంస్థానమును పాలించిరి. అయోధ్య తాలూక్ దారులలో నొకరైన శ్రీ ఠాకూర్ సురాజ్ బక్షుగారి కొమరిత లలితాంబ వీరి భార్య. వీరివలన

[1] 1897, May 23, 2–00 a.m., The Hindu, May 25, Tuesday, 1897; The Madras Times, 23 May 1897; The Madras Mail, 23 May 1897.

[2] The Madras Times, 23 May, 1897; Madras Mail, 25 May 1897; The Spectator, 1897; Reis and Rayyet, 5 June, 1897; ఆంధ్ర ప్రకాశిక, జూన్ 5, 1897; శశిరేఖ, మే 1897.

[3] Died on Monday the 11th September, 1922, See M. Subba Rao, Sri Viziarama Gajapati, N. M. Printing Works, Vizianagaram, 1922.

కలిగిన కుమారులు అలక నారాయణ గజపతి (1902–1937), విజయానంద గజపతి (సర్. విజయ). విద్యావతీదేవి అలక నారాయణ గజపతుల పుత్త్రులు విజయరామగజపతి (పి.వి.జి. రాజు), విశ్వేశ్వర గజపతి యనువారు. తండ్రి తరువాత విజయరామగజపతి జమీని కొంత కాలము పాలించిరి. వీరి కాలము నందే జమీందారీ రద్దు చట్టముకలన విజయనగరము జమీందారీ ఆంధ్ర రాష్ట్రములో ఐక్యమైనది.

## సాహిత్య పోషణము

ఈ సంస్థాన పాలకుల పూర్వులు కార్య ఖడ్గములయందే కాక వివిధ రంగములందును అసదృశమైన ప్రతిభను, అభిరుచిని ప్రదర్శించి పేరు పొందినవారు. కృతికర్తలుగా, కృతిభర్తలుగా, కృతిప్రేరకులుగా అనేక రసవత్కావ్యముల సృష్టికి వారు నిర్వాహకులయిరి. ఈ సంస్థానమునకు విజయనగరము రాచపట్టుగా మూర్తికట్టినపిమ్మట అది పాలకుల దానసముద్ధురీచణత్వము వలనను, విద్వత్కవిపోషణమువలనను విశిష్ట వితరణగుణము వలనను విద్యల నగరముగా కళల కాణాచిగా నిస్తుల ప్రశస్తిని బడసినది.[1] తొలినాళ్ళలోని బుద్ధవర్మ 'దీనానాథ కవీంద్రగాయకులు కీర్తింపంగఁ గీర్తిశుఁడయి........' దీపించిన వాఁడని భీమయపండని చేబ్రోలు శాసనము కీర్తించుచున్నది.[2] పూసపాటి మాధవవర్మ మీఁది చాటువులు ఒండు రెండు కన్పట్టినను అవి ఆయన సాహితీపోషణమును పట్టియిచ్చునవి కావు. మైలమ భీమనమీఁది చాటుపద్యకోటి వేములవాడ భీమకవి సృష్టిగా పరంపరగా ప్రసిద్ధి నందినది. ఈ చాటు పద్యములన్నియు మైలమభీముని పరాక్రమ క్రమమును ప్రసారించు కైవారపుగాథలు[3].

'సోమకవంశ భీమనృపాల సచివుండు
దండనాథాగ్రణి దానరాజు
వేములవాడ శ్రీ భీమునిచే రామ
గోపాల చరితంబు గొనినమేటి ...'

అని పూసపాటి రాచిరాజకృత సీసమాలికలో పేర్కొనఁబడిన రామగోపాల చరితమే పింగళిసూరన 'భీమన తొల్లి చెప్పెనను పెద్దలమాటయె కాని యందు నొంచేమియు నేమెడన్ నిలుచు టెవ్వరుఁగానరు....' అని సూచించిన

[1] 'వెంకటగిరి....విజయనగరము....మొదలగు రాజస్థానములు సంగీతవినోదములు లేనివిగావు' వేటూరి ప్రభాకరశాస్త్రి అన్నమాచార్యచరిత్ర పీఠిక, తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణ, తిరుపతి, 1966, పు. 121.

[2] South Indian Inscriptions, Vol. VI, No. 103.

[3] చాటుపద్యమణి మంజరి, 1922, పుటలు 58–61.

రాఘవ పాండవీయమని నిడుదవోలువారి నిర్ణయము.[1] ఇది అనుపలభ్యము. భీమనృపాలుని సచివుఁడును, దండనాథాగ్రణియును నగు దానరాజు పెద్దాపురము పత్సవాయి వారికి మూలపురుషుఁడఁట ![2]

అడిదమువారు తరతరములుగా పూసపాటివారి ఆస్థానకవులని పెక్కు చాటువులు చాటుచున్నను పూర్వరంగము నావిష్కరింప నిష్కర్షమైన ఆధారములు బొత్తిగా తక్కువ. కళింగసీమలోని కవికుటుంబములలో ప్రథమ శ్రేణికి చెందినవా రడిదమువారు. పెక్కుతరములుగా వారు విద్వత్కవులుగా, రణనీతి కోవిదులుగా, రాజకీయోద్యోగులుగా పేరుమోసినవారు. మొదట వీరి ఇంటిపేరు మోదుకూరివారఁట. ఆ పిమ్మట అది 'గంధవారణము' వారుగా మారినదఁట.[3] అటు పిమ్మట వీరి కోవకుచెందిన నీలాద్రి కవియను నాతఁడు కళింగరాజుల ఆస్థానకవిగానుండి సమరాంగణమునందును చతురతను ప్రదర్శించి, ప్రభువులనుండి అడిదమును బహుమతిగాఁ బడయుటవలన ఈ బిరుదమే అడిదమువారను గృహనామమునకు దారితీసినది. 'రణరంగవిజయ' మను ప్రభు జైత్రయాత్రాప్రబంధమీ నీలాద్రి కవిరచనమని విమర్శక సంకథనము. ఈ నీలాద్రికవి పూసపాటి తమ్మభూపాలుని ఆస్థానకవియఁట.

పూసపాటి రాచిరాజు (1450—1520) ప్రతాపరుద్ర గజపతి యల్లుఁ డగుటవలన శ్రీకృష్ణదేవరాయల (1509—1530) తోడియల్లుఁడని—

'ప్రథిత గజపతిరాజ వీరప్రతాప
రుద్ర తనయాధినాయ కారూఢ తమ్మ
రాజజనకతఁ గాంచె నే రాజతిలక
మతఁ డలరు తమ్మ విభురాచయ ప్రభుండు'

—శ్రీకృష్ణ విజయము 1–12

'భాషాసతీవజ్ర భూషాకలాపంబు' అగు నీతఁడు నరభారతమును నూతన కృత్యావిష్కృతికి కారకుఁడని తెలియుచున్నది. 'నరభారతాఖ్యాన నవ్య కావ్యమునకు నాయకుండయ్యె నే నరవరుండు' (పైది), 'ఆ రాజన్యులలోన రాచనృపుఁ డౌరా తాలిచెం గండపెండేరంబున్ నరభారతంబను కృతిన్ దీపింపఁగాఁ జేసె....' (విష్ణుభక్తిసుధాకరము, అవతారిక, 49), 'నరభారతాఖ్య కావ్యస్తవనీయ కృతీశుఁడయ్యె ధాత్రీస్థలిలోఁ గవివరు లతని రసజ్ఞత కవిరళముద మొదవహించి యభినుతిసేయన్' (ఉషాభ్యుదయము, అవతారిక, 83), 'వారిలోపల రాచభూవాసవుండు గండపెండేరమును బూనె దండి నూత్న

1 విజయనగరసంస్థానము—ఆంధ్రవాఙ్మయపోషణ, 1965, పు. 18.

2 చాగంటి శేషయ్య, ఆంధ్రకవితరంగిణి, సంపుటము 8, పు. 53.

3 నిడుదవోలు వేంకటరావు, శ్రీరామలింగేశ శతకపీఠిక, శతకసంపుటము, ఆంధ్రప్రదేశసాహిత్య అకాడమీ, హైదరాబాదు, 1966.

భారతంబన కృతిఁజేసె భాసురముగ....' (నరసభూపాల రాజీయము, అవతారిక, పు. 6). మీఁది యుద్ధరణములను బట్టి నవభారత కృతికి రాచిరాజు కృతిభర్తయో కృతికర్తయో నిర్ధారింప ననువుపడకున్నది. ఈ కృతి లభ్యము కాలేదు.

వసిష్ఠగోత్ర సీసమాలిక అను ఏఁబదియాఱు చరణములుగల సీసమాలిక యొకటి రాచిరాజ రచితముగా ప్రసిద్ధము. ఇందు పూసపాటి రాజవంశీయుల వంశావతార వర్ణనము గలదు. ఇది 'ఋతుగగనాబ్ధి చంద్రశకంబునందు సరస సంగీత సాహిత్య చక్రవర్తి రాజమార్తాండ శ్రీ తమ్మి రాజరాజు రాచి రాజోదితంబు....' అఁట. పద్యాంతమున సూచితమయిన కాలము ఋతు గగనాబ్ధి చంద్రశకము శా. శ. 1406 (క్రీ. శ. 1484) అని స్పష్టపడుచున్నది. కాని ఈ సీసమాలికలో పరగణా, పోటుబంటుమానులు, ఫౌజుదారులు మున్నగు అర్వాచీన కాన్యదేశ్యములు విరివిగా ప్రయుక్తమయి యుండుటచే రచనా కాలమంత ప్రాచీనము కాదేమోయను సందేహము కలుగుచున్నది.*

పూసపాటి పెదకృష్ణభూపతి యనుజన్ముఁడగు రాచరాజు కుమారుఁడయిన కృష్ణమరాజు సప్తసంతాన ప్రతిష్ఠాపయితగా, చతుష్షష్టికళావిదుఁడుగా, రుక్మిణీపరిణయ ప్రబంధ కృతిభర్తగా ఉషాభ్యుదయ శ్రీకృష్ణ విజయాది కావ్యావతారికలమూలమునఁ దెలియవచ్చుచున్నదిగాని ఈ ప్రబంధము నుగూర్చిన తక్కిన యానుపానులెఱుఁగ వలనుపడలేదు. ఈ కృష్ణమరాజునకు రెండవ భార్యయగు ఎల్లమాంబవలనఁ గలిగిన మొదటికుమారుఁడు తమ్మరాజు. ఈ తమ్మరాజు ద్వితీయ కుమారుఁడగు జగన్నాథరాజు 'నరలోకంబున నిండెఁ బండిత కవీంద్రశ్రేణి వర్ణింపఁగా....నరవర్యుండగు తమ్మభూవరు జగన్నాథేంద్రు చారిత్రముల్' (శ్రీకృష్ణవిజయావతారిక) అని కీర్తిఁగనినవాఁడు. ఎల్లమాంబా కృష్ణమరాజుల ద్వితీయ కుమారుఁడు గోపాలరాజు. ఈ గోపాల రాజు తనూజుఁడు గోపాలకృష్ణరాజు. 'సుకవినుతులైన యారాజసుతులలోన నీతికుశలుండు గోపాలనృపుని సుతుఁడు కీర్తివహియించె గోపాలకృష్ణ రాజు....'(పైది).

## పూసపాటి తమ్మభూపాలుఁడు

కృతి వినుతుఁడైన ఈ గోపాలకృష్ణరాయ వసుమతీనాథుసతి జగ్గమాంబ. ఈమె గొట్టిముక్కల మల్లపరాజు తనయ. వీరి ద్వితీయపుత్రుఁడే శ్రీకృష్ణ విజయ ప్రబంధ కర్తయగు తమ్మభూపాలుఁడు (1620–1670)† ఇది యైదాశ్వా

* ఆంధ్ర విజ్ఞానము, సంపుటము 5, పుటలు 2701 - 2703.

†గంటి సూర్యనారాయణశాస్త్రి, శ్రీ మహామండలేశ్వర పూసపాటి తమ్మభూపాలుఁడు, వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రులుగారి సమ్మాన సంపుటము, పుటలు 162–170; ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్యం, సంపుటి 10, పు. 238.

సముల శృంగార ప్రబంధము.

'....కృష్ణమూర్తి....నరకుని సంహరించి లలనామణులన్ బరియాలువేల మున్ బరిణయమైన యర్థము ప్రబంధముగా నొనరింపఁగాఁదగున్' అని తన సామాజికులు ప్రోత్సహింపఁగా నీ రాజకవి దీనిని రచించెనఁట. ఇంద్రునిప్రార్థనముమీఁద శ్రీకృష్ణుఁడు నరకుని వధించి విజయియై దేవకన్యలఁ బెండ్లియాడి, పారిజాతాపహరణమొనర్చిన కథ యిందలి యితివృత్తము. పారిజాతాపహరణ గాథకు సత్యభామకోరికకాక చేసినమేలును మఱచిన దేవతల చెడునడతను శిక్షింపఁదలఁచిన శ్రీకృష్ణుని ప్రతీకారచర్య హేతువుగా ఈ ప్రబంధమున నిరూపింపఁబడినది. ఈ ఘట్టమును కవి దర్శించి ప్రదర్శించినరీతిది. ఉభయ భాషావైదుష్యము, చతుర్విధ కవితాచాతుర్యము సువ్యక్తమగురీతిని సంధానితమైన ప్రబంధమిది. 'బెజవాడ కనకదుర్గా భజనాధిక పుణ్యయోగ భావిత కవితా నిజచాతుర్య కవీంద్రద్విజపరసంతోష జనక విజయోన్నతుఁ'డగు నీ కవికృతి బెజవాడ కనకదుర్గకంకితము. దీనిని క్రొత్తలంక మృత్యుంజయకవి రచించి ధనాశాపీడితుఁడయి తమ్మభూపాలుని పేర వెలయించెనను వాదము నిరాధారమని సయుక్తికముగా నిరూపితము †.

## పెనుమళ్ళ సోమనామాత్యుఁడు

ఇతఁడు శ్రీకృష్ణవిజయ ప్రబంధకర్తయగు పూసపాటి తమ్మభూపాలుని అమాత్యుఁడు. నీలయామాత్యపుత్రుఁడు: ఎల్లనారాధ్యశిష్యుఁడు. కవి తాను జైమిని భారత కృతికర్తయగు పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని వంశీయుఁడనని తన కృతియగు సీమంతినీ కల్యాణ ప్రబంధమందు‡ పేర్కొనుట యింకను సుపరీక్షితము గావింపవలసిన యంశము. పినవీరభద్రకవి యాత్మజులు వీరన. మల్లనలు. మల్లన కావ్యదక్షతకు మెచ్చి కటకేంద్రుఁ డొసఁగిన పెనుమళ్ళ గ్రామమున నివసించుటవలన 'పిల్లలమఱ్ఱి'యను గృహనామము 'పెనుమళ్ళ'గా మాఱినదని సోమన కృత్యవతరణికలో స్పష్టపఱచినాఁడు. ఇట్లు మల్లన సోమమంత్రికి కూటస్థుఁడు. సోమన ప్రపితామహుని యన్నయగు చిన్నసోమన ప్రపౌత్రుఁడయిన బసవమంత్రి నందాపుర పాలకుఁడగు కృష్ణదేవుని అమాత్యుఁడు. పినవీరభద్రుఁడు కాశ్యపగోత్రుఁడు. భారద్వాజ గోత్రుఁడగు సోమన కాశ్యపగోత్రుఁడగు పినవీరభద్రుని సంతతికి చెందిన వాఁడనుట పొసఁగదుగదా! లేక సోమనమంత్రి పూర్వులెవరో భారద్వాజ గోత్రజులకు దత్తులయి యుండవచ్చునేమోయని యూహించుట ఉచితపక్షము.

† అడిదము రామారావు, విస్మృత కళింగాంధ్రకవులు 1940, పుటలు 6–8.

‡ సీమంతినీ కల్యాణము, అముద్రితాంధ్రగ్రంథ సర్వస్వ మాలిక, విద్వజ్జనమనోరంజనీ ముద్రాక్షరశాల, పిఠాపురము, 1919.

'భువన ప్రఖ్యాతుఁడయిన యా పూసపాటి తమ్మభూపాలకుని సమ్ముఖమ్ము నందు మంత్రియై తద్దయాసుధామయ కటాక్షమహిమఁ గాంచితివయ్య సోమ ప్రధాని' (సీమంతినీ. 1–81) అని యాతని బంధుమిత్రులు సోమనను ప్రశంసించి '....పార్వతీశ కథాసుధాభరితమైన యొక్క కావ్యంబు....' సేయుమని ప్రోత్సహించిరఁట. సుహృదాదేశమును పురస్కరించికొని స్కాందపురాణము నందలి బ్రహ్మోత్తర ఖండమున విఖ్యాతమయిన సీమంతినీ నామక పుణ్య సీమంతినీ చరిత్రము నంధ్రభాషను అయిదాశ్వాసముల శృంగార ప్రబంధముగాఁ గై సేసి శ్రీశైల భ్రమరాంబాధీశ్వరున కర్పితమొనర్చినాఁడు కవి. సోమవారవ్రత మాహాత్మ్యము నుగ్గడించు ఈ కథ శివపారమ్య నిరూపకము. మాదిరికొక పద్యము :

'సుమనోధర్మములూని లోకవిజిగీషుండైన పంచేషునిన్
సుమనోధర్మమునూని యప్పరమమౌనుల్ గెల్వఁగా నోడి యెం
తమహాశూరుఁడొ యాకఁ దప్పగ యలంతన్ దీర్చుకోఁజాలె ని
త్యము దచ్చిత్తములందు ముక్తివనితా వ్యాసక్తిఁ గల్గింపుచున్'

సోమకవి రచనాచమత్కారములకు ప్రలోభపడి అతని కర్వాచీనుఁడగు అడిదము సూరకవి తన కవిజనరంజనములో సోమకవి పద్యముల ననుకరించి పెక్కు పద్యములు రచియించినాఁడు. †

## పూసపాటి వెంకటపతిరాజు

పెదజగన్నాథరాజు కోవలోని పొట్నూరి కృష్ణమరాజు పుత్రుఁడీతఁడు. అన్నమరాజు పౌత్రుఁడు. ఈతని మనుమఁడగు రెండవ ఆనందరాజే పరాసు వారినోడించి ఆంగ్లేయులతో చెలిమి పాటించినవాఁడు. వెంకటపతిరాజు (1669–1720) 'శ్రీరఘూత్తంసు కరుణా విశేషమునఁ బ్రతిభ గాంచినవాఁడు'. ఈ 'వేంకటరాజు పృథ్వీపాలన మొనర్చెఁ దగచేసె సప్తసంతానములను ముద మొప్పఁగా నుషాభ్యుదయంబను బ్రబంధమును రచించెను బుధులనుమతింప' (ఆంధ్ర మార్కండేయ పురాణము, పీఠిక, పు. 13). ఉషాభ్యుదయము అయిదాశ్వాసముల ప్రౌఢ ప్రబంధము. శృంగార రసప్రధానము. హరివంశ ప్రసిద్ధమగు ఉషానిరుద్ధుల ప్రణయగాథ యిందలి యితివృత్తము. పిల్లవసు చరిత్రములలో నొక్కటియని విమర్శకులచే లెక్కింపఁబడినది. ‡ కవి ప్రతిభా పాండిత్యములకు నికషము ; రసపిపాసువులకు అమృత చషకము. ఇది శ్రీరామతీర్థమున వెలసిన సీతారామునకంకితము.

† చూ. అడిదము రామారావు విస్మృత కళింగాంధ్రకవులు, పుటలు 22–34.

‡ పైది, పుటలు 42, 43; విజయనగర సంస్థానము — ఆంధ్ర వాఙ్మయ పోషణ, పు. 34; గజపతిరాజుల తెలుఁగు సాహిత్యపోషణము, పుటలు 128, 129.

## మొదటి ఆనందరాజు

ఈతఁడు కేసమాంబా కృష్ణమరాజుల కుమారుఁడు. ఉషాభ్యుదయ ప్రబంధకర్తయగు వెంకటపతిరాజునకు తమ్ముఁడు. పినజగన్నాథరాజు కోవకు చెందిన రఘునాథరాజు కుమారుఁడగు సీతారామచంద్రునకు ఈ ఆనందరాజు దత్తుఁడు. ఈతఁడు ప్రతిపద్య మనోహరమగు నవరామాయణమను కావ్యమును రచించినట్లు 'ప్రతిపద్య శిరఃకంపము చేతనవ రామాయణంబు సరసులు మెచ్చఁ గృతులు మతిఁగొన్న సీతాపతి కయ్యానందరాజు భక్తినొసంగెన్' (విష్ణుభక్తిసుధాకరము, అవతారిక, 112), 'ఆనందనృపతి చిదానందమూర్తియౌ రామునిపై భక్తిరాజిలంగఁ బ్రతిపద్యము మనోహరముగ శోభిల నవ రామాయణంబను రమ్యకృతిని రచియించి యర్పించె రామచంద్రునకును....' (ఆంధ్ర కూర్మపురాణము, పీఠిక. పు. 8) అను నుద్ధరణములనుబట్టి అవధారింప వీలయినది. కాని ఈ నవరామాయణ మింతవరకు లభ్యముకాలేదు

## పెదవిజయరామరాజు

బొబ్బిలి యుద్ధమునకు ప్రధాన కారకుఁడుగా సంభావింపఁబడుచున్న పెదవిజయరామరాజు (1670—1756) 'కవిలోకపాలుఁ'డని కార్తిక మాహాత్మ్య కర్త వెంకటకవి పేర్కొనినాఁడు. నవరామాయణ కర్తగా ప్రశంసితుఁడయిన ఆనందరాజే యీతని తండ్రి. తల్లియగు సీతాంబ మొగల్తుర్రు పాలకుఁడగు కలిదిండి రంగరాజుగారి తనయ. ఈ రంగరాజు కుమారుఁడగు రామరాజు పరసావిత్రి చరిత్రమను శృంగార ప్రబంధమునకు కర్త. అనఁగా ఈ రామరాజు విజయరామరాజునకు మేనమామ. 'భూరి విజయరామ భూషణ కృతినందె నగ్రహారములు విప్రాళికిచ్చె' (విష్ణుభక్తి సుధాకరము, అవతారిక, పు.115) నని వినుటయేతప్ప యీ విజయరామ భూషణ కృతిస్వరూప స్వభావము లెట్టివో ఇదమిత్థమ్మని చెప్పఁగరాదు. మండపాక పార్వతీశ్వరశాస్త్రి (1833—1897) గారి వృద్ధ ప్రపితామహుఁడు కామకవి విజయరామావనీ విభునివలన సత్కృతినంది తద్ధనచయమ్మున తాత తండ్రులపేర అగ్రహారికముల నిర్మించెనని శాస్త్రిగారి రాధాకృష్ణ సంవాదకావ్యము* (ప్రథమా. 41, 42) సాక్ష్యమిచ్చుచున్నది.

## గోగులపాటి కూర్మనాథకవి

ఆర్వేలనియోగియును, మౌద్గల్యగోత్రజుఁడును, గౌరమాంబా బుచ్చన్నామాత్యుల పుత్రుఁడును నగు నీ కూర్మన్న (1720—1790) విజయరామరాజు కాలమున విజయనగర సంస్థానాస్థానకవిగా, సంస్థానదేవస్థానోద్యోగిగా

* ఆది సరస్వతీనిలయ ముద్రాక్షరశాల, చెన్నపురము, 1886.

పరీక్షిప్రులనుండి అగ్రహారాదికములఁ బడసినవాఁడు.[1] తిరుమల పెద్దింటి సంపత్కుమార వేంకటాచార్యుల శిష్యుఁడు. ఈతఁడు రచించిన కృతులలో రామతీర్థపతి కంకితముగా సంతరించిన ఏకాంతసేవయను గేయప్రబంధమును, గౌరీకల్యాణ కుమారోదయ గాథలతోకూడిన మూఁడాశ్వాసములుగల మృత్యుంజయ విలాసమను యక్షగానప్రబంధము[2]. లక్ష్మీనారాయణుల సంవాదరూపమగు లక్ష్మీనారాయణ సంవాదము, తిరుమంగయాళ్వారి చారిత్రగాథ లేక చోరసంవాదము, జగన్నాథస్వామివారి రాయబారము అను మూఁడాశ్వాసములుగల లక్ష్మీనారాయణ సంవాదమను కావ్యము[3] చంపకోత్పలములలో సంగ్రథితమయిన రసికజన మనోరంజనమగు సుందరీమణి శతకము, 'వైరిహర రంహా! సింహాద్రినారసింహా' యను మకుటముగల సింహాద్రినారసింహ శతకము[4], 'విజయరామా! రామతీర్థాశ్రయా' యను మకుటముగల విజయరామ శతకము[5] ముఖ్యములయినవి. ఇవి యన్నియును భగవదంకితములు. వీని యన్నింటిలోను సింహాద్రినారసింహ శతకము ప్రచుర ప్రచార ప్రశస్తులను బొందిన ఉత్తమ శతకము.[6]

## అడిదము సూరకవి

సూరకవి (1720—1785) పూర్వులు తొమ్మిది పూరుషాంతరములనుండి కళింగ వసుధాధిపుల యాశ్రయమునుండి కవితా వ్యవసాయము సాఁగించినవారు. ఈతఁడు బొబ్బిలియుద్ధవీరుఁడయిన పెదవిజయరామరాజు (1670—1757) కాలమునను పద్మనాభ యుద్ధవీరుఁడయిన చినవిజయరామరాజు (1747—1794) కాలమునను జీవించినవాఁడు. 'వనము చెళ్లెలి బొడ్డుమీఁదవున కిచ్చి యతనిపంపెను సిరిగాంచు....' (రామలింగేశ శతకము) వారిపై సూరకవి కొట్టినదెబ్బ పెదవిజయరామరాజు భార్య చంద్రయ్యమ్మ సోదరుఁడగు చింతలపాటి నీలాద్రిరాజు నుద్దేశించినది ఈ నీలాద్రిరాజు కూడవిపంచి

1 వరనారాయణాచార్యులు గోపాలపాటి కూర్మనాథ కవి. ఆంధ్రి, 1934 ఆగస్టు, పుటలు 367—375.

2 శ్రీ భారతీనిలయ ముద్రాక్షరశాల. చెన్నపట్టణము, 1883 ; ఆంధ్ర విజ్ఞానసమితి, విజయనగరము, 1941.

3 కూర్మనాథ కవి కృతులు, ద్వితీయసంపుటము, ఆంధ్ర విజ్ఞానసమితి, విజయనగరము, 1941.

4 నరేంద్రనాథ సాహిత్యమండలి, తణుకు, 1962.

5 ఇందలి మూఁడు పద్యములే లభ్యమయినట్లు వరనారాయణాచార్యులు, చూ. కూర్మనాథ కవి కృతులు, ద్వితీయసంపుటము, ఉపోద్ఘాతము, పు. 10.

6 బూర్గుల హనుమచ్ఛాస్త్రి, సింహాద్రి నారసింహ శతక కృతి విమర్శనము, గ్రంథాలయ సర్వస్వము, 1916, పుటలు 206—208 ; నిడుదవోలు వేంకటరావుగారు, కళింగదేశ శతక వాఙ్మయము, కళింగదేశ చరిత్ర, పుటలు 127—133.

జగ్గకవి చంద్రరేఖావిలాప కావ్యముఖమున తిట్లుతినినవాఁడు. 'తనకుఁ బాలింప నెంతటి రాజ్యమబ్బిన నన్యరాష్ట్రాపేక్ష యణఁగిపోదు', 'ఆక్రమింపఁగవచ్చు నన్యరాష్ట్రంబుల ప్రజలనందఱు బాధపఱుపవచ్చు', 'కఠినచిత్తుని రాజ్యాధికారిఁ జేసి యింత యేడ్పించితివి సత్కవీంద్రకోటి'—ఇత్యాది పద్యపఙ్క్తులు ఆనాఁటి విజయనగర సంస్థానమునకు దివానగు సీతారామరాజు నుద్ధత ప్రవృత్తికి పట్టిన దర్పణములవంటివి. తన తాతముత్తాతలు విజయనగర సంస్థానపాలకులనుండి ఈనాములుగాఁబడసిన కంచర, రేగయను మాన్యములు మేకమెడ చన్నుల వంటి పట్టిదండుగమారి భూములని ఈసడించి సూరకవి మన్నెదేశము లన్నియుఁదిరిగి ఆయా సంస్థానపాలకుల నాశ్రయించి యభీష్ట వస్తువులు దెచ్చి భుజించెడివాఁడఁట.

చంద్రమతీ హరిశ్చంద్రుల పరిణయకథ యగు నీతని కవి జనరంజన ప్రబంధము పిల్లవసు చరిత్రమని ప్రశస్తిని బడసినది. సంస్కృత చంద్రాలోకమున కనుకృతియగు ఆంధ్ర చంద్రాలోకము సూరకవి మఱియొక కృతి. కవిసంశయ విచ్ఛేదమను లక్షణగ్రంథము సూరకవి లాక్షణిక దృక్పథమునకు ఉత్తమ నిదర్శనము. కవిజనాంజనకారాదులకిది ఆదర్శరచనము. ఆంధ్ర నామశేషము సూరకవి పద్యనిఘంటువు పైడిపాటి లక్ష్మణకవి కృతమగు ఆంధ్రనామ సంగ్రహమునకు శేషగ్రంథము. సూరకవి రచించిన రామలింగేశ శతకము శ్రీకాకుళ మండలము చీపురుపల్లి సమీపమునఁ గల రామచంద్ర పురాగ్రహారమున వెలసిన రామలింగేశ్వరస్వామిని సంబోధించుచు వ్రాసిన శతకము. ఈ శతకమునందు రాజ్యపాలకుల అధికార దాహము, పరస్పర కలహములు, రాజోద్యోగుల దుష్టప్రవర్తనములు, సామాన్యజనుల యిబ్బందులు మున్నగు సమకాలిక సత్యములను నిర్భీకముగా ప్రకటించిన నిరంకుశుఁడు సూరకవి. 'సూరకవి తిట్టు కమసాలి సుత్తిపెట్టు' అను సూక్తి ప్రత్యక్షరము సత్యమని అభియుక్తోక్తి. ఈతని కృతులన్నియును రామలింగేశ్వరున కంకితములు. 'పూసపాటి కులాంభోధి పూర్ణసోమ సమరజయభీమ గజపతి సార్వభౌమ విమలసద్గుణధామ శ్రీ విజయరామ' యను మకుటముగల సీసపద్యములు సూరన కృతచాటువులని వాడుక‡ ఈతఁడు ఆయా సంస్థానములను తత్తత్పాలకులను దర్శించినపుడు ఆశువుగా చెప్పిన చాటువులు అనేకములు గలవు. కాశీపురము సంస్థానము ముఖజమీందారుల మంత్రియును, తన బంధువునునగు పొణుగుపాటి వెంకటమంత్రినిగూర్చి రచించిన కందపద్య శతకము పొణుగుపాటి వెంకటమంత్రి శతకము.

‡ అడిదము సూరకవి ప్రణీత గ్రంథములు, చింతామణి ముద్రాక్షరశాల, చెన్నపురి, 1899.

## చినవిజయరామరాజు

ఈతఁడు పెదవిజయరామరాజు భార్యయగు చంద్రయమ్మగారిచే దత్తుఁడు. అసలు పేరు వెంకటపతిరాజు. ఈతని పరిపాలన కాలము (1760–1794) న అడిదము సూరకవి, చట్టి సత్యప్ప, పూజారి తమ్మన్న చల్లా సుబ్బారాయశాస్త్రి మున్నగు కవులుండెడివారు. '....విభ్రాజిత పూషవాడీ విజయరామనృపాలుఁడురాజు....', '....మీరాజు? విజయరామ మహారాజతఁడేమి సరిసుఁడా? భోజుఁడయా' అను అడిదము సూరకవి రచితములుగ నూహింపఁ బడుచున్న చాటువులయందు విజయరామ గజపతి రాజత్వము, విద్యాభోజత్వము విశదమగుచున్నవి. 'ఏరాజు విప్రులకిచ్చె సాలగ్రామదానముల్ బహుకోట్లు ధర్మరతిని, ఏరాజు సకల విద్యా రహస్య ప్రవీణత్వంబుచే జగన్మాన్యుఁడయ్యె పూసపాటి కులాంభోధి పూర్ణచంద్రుఁడయిన విజయరామవసుంధరాధిమణికి తగెఁగాక....ఇతర నృపతుల కీ చర్యలెచటఁగలవె' అని చాటూక్తుల నీతని శుభ ప్రసంగము కలదు. 'సల్లక్షణంబుగా సతత చతుర్వేద పారాయణులును జటా వల్లభులును షట్శాస్త్రములను శిష్యవ్రాతములకు శతావృతుల్ చెప్పిన కోవిదులును సంతతాష్టాదశ సంఖ్యాపురాణముల్ నిండారఁజదివిన పండితులును.... అభినుతింపుచునుండ....' (పద్మనాభయుద్ధము, 38) కొలువుండు వాఁడఁట. ఆంధ్రమార్కండేయ పురాణమునుకూడ 'అగ్రజన్ముల కనేకాగ్రహారంబులు నఖిలదానంబులు నమరఁజేసి సకల విద్యారహస్యముల్ నరసకావ్యరచనామనీషా పకాశమలర....' (చూ. అవతారిక, పు. 18) నొప్పినవాఁడని పేర్కొనినది.

ఈ విజయరామరాజు కుమారుఁడు నారాయణబాబు అను వ్యవహార నామముగల నారాయణగజపతిరాజు (1794-1845). ఈతఁడు 'సకల విద్యా విచక్షణుఁ'డని తుమరాడ పాపకవికృతమగు వైరాగ్య దర్పణమునందలి అవతారికాకథనము. పండితపరిషత్తుల ఉపసదనమున శాస్త్రోపసేవనమొనర్చి 'వేద శాస్త్ర పురాణవిద్యలలో సారమంతయు నెఱిఁగిన యట్టివేత్త' (ఆంధ్ర కూర్మ పురాణము, అవతారిక, పు. 13). ఈతని కాలమున 'శ్రీయును బ్రాహ్మియున్ గొదఁ ద్యజించి పరస్పరమైత్రి వీటనిం బాయక కాపురంబు....' (శ్రీ విజయరామ గజపతీంద్ర చరిత్రము, 19) సలిపినట్లు కవులు పేర్కొనిరి. గత శతాబ్దాదిని తంజావూరు నుండి విజయనగరమున కాహూతులయి వచ్చి స్థిరపడిన సంగీత కళానిధి వీణ పెదగురురాయాచార్యులు (1794-1822) ప్రసిద్ధ వాగ్గేయకారులు కూడ. వీరు నారాయణగజపతి ఆస్థానవిద్వాంసులు.

## చాటరాతి లక్ష్మీనరసకవి

నారాయణగజపతి సమాశ్రయమున విలసిల్లిన కవులలో ఈ లక్ష్మీనరస కవి యొకఁడు చాటరాతివారారామ్వేల నియోగులు. వసిష్ఠ గోత్రులు; ఆపస్తంబ

సూత్రులు. లక్ష్మీనరసకవి కనకాంబా వీరరాఘవుల పుత్రుఁడు.

'మన్ననచేసి మ్రొక్కి పలుమాఱు మదిం బ్రణుతింతు భాగ్యసం
పన్నుని వీరరాఘవుని పట్టి యశోజిత పూర్ణచంద్రు వి
ద్వన్నుతశీలు సద్గురు నుదారగుణాఢ్యుని జేటరాతి ల
క్ష్మన్నను రాజపూజితుని నంధ్ర కవిత్వ కళాధురీణునిన్' అని కశ్యప

గోత్రజుఁడును, చెల్లయాంబా జోగిరాజుల పుత్రుఁడుననగు విస్సాప్రెగ్గడ కామరాజకవి తన బేరీజు పద్యములు అను గ్రంథము అవతారికలో తన విద్యా గురునిఁ బ్రస్తుతించినాఁడు. లక్ష్మీనరసకవి విజయనగర సంస్థానమున రాజకీయోద్యోగిగానుండియు కవితా వ్యవసాయముకూడ సాఁగించినవాఁడు. ఈతని కృతులు పద్మనాభయుద్ధము, ఈశ్వరీ పరిణయము, విశేషాంధ్రము, ఖండనారాతి భీమశతకము అనునవి. వీనిలో ఈశ్వరీ పరిణయము కాళిదాసకృత కుమారసంభవ కృతి కాంధ్రీకృతి. ఇది అలభ్యము. 250 పద్యములుగల విశేషాంధ్రము శుద్ధాంధ్రపద పద్యనిఘంటువు. 'ఆంధ్ర సంగ్రహ శేషాదులందు లేని యన్నిటినిఁ గూర్చెనీ విశేషాంధ్రమందు వీరరాఘవ కనకాంబగారిసుతుఁడు చాటరాతి లక్ష్మీనరసయ్యసుకవి.' 'ఖండనారాతి భీమ కోదండరామ' అను మకుటముగల సీసపద్యశతకమే ఈతఁడు రచించిన ఖండనారాతి భీమశతకము.[1] సాంఘిక దురాచార నిరాసకముగా నిది మూర్తికట్టినది.

లక్ష్మీనరసకవి రచించిన ప్రసిద్ధకృతి 'పద్మనాభయుద్ధ'మను పేరున ముద్రితమయిన విజయరామ యశోభూషణమను చారిత్రక కావ్యము.[2] 304 గద్యపద్యములతో కూడిన ఏకాశ్వాస పరిమిత గ్రంథభాగము మాత్రముపలబ్ధము. లభ్యమయిన గ్రంథభాగము చివర '.... దేవర్షిపుంగవుం డిట్లనియె' అని యున్నందున లభ్యమయిన గ్రంథ మసమగ్రమనియు, విజయరామగజపతి (1760-1794) సంపూర్ణ జీవిత చరిత్రమును విజయరామచరిత్రమను పేర కవి రచింపనెంచెననియు విమర్శకుల యూహము.[3] ఇది రామతీర్థములోని సీతారాముల కంకితమని కొందఱూహించుట సమంజసముగాఁ గన్పట్టదు.[4] ఆశ్వాసాద్యంతముల కళింగ నృపాలుఁడగు పూసపాటి నారాయణగజపతీంద్రుని సంబుద్ధియుండుటచే నాతఁడు కృతిపతియో కనీసము కృతిశ్రోతయో యని యూహించుట యుక్తియుక్తము. ఇంగ్లీషు కుంఫిణీ వారికిని నారాయణ గజపతి తండ్రియయిన విజయరామగజపతి (1760-1794)కిని విజయనగరము దాపున

[1] వంగూరి సుబ్బారావు, శతకకవుల చరిత్రము, పుటలు 409-416.

[2] ప్రకాశకులు : వత్సవాయి రాయజగపతివర్మ లక్ష్మీ ప్రింటింగు వర్క్సు, రాజమండ్రి, 1934.

[3] బుర్రా శేషగిరిరావు, పద్మనాభయుద్ధ కావ్యావతారిక, పు. 5.

[4] గురజాడ సూర్యనారాయణమూర్తి, విజయనగరదర్శిని, 1962, పు. 18.

గల పద్మనాభక్షేత్రమున జరిగిన యుద్ధగాథ యీ కావ్యమునందలి యితివృత్తము. చారిత్రక కావ్యముగ సమరరంగ చరిత్రముగ రంగరాయ చరిత్రమువలె నిది యును ప్రసిద్ధమైనది. ఇందు కనోజీ, ఖాయిదా, చెకుముకి, జమాబంద్, జెండా, తయారు, తుకీడీ, దుబాసి, దురాయి, నకీబులు, నిజాము, పాదుషా, పోస్తు, ఫిరంగి, ఓడాయించి, బేడాకి, మద్దత్తు, ముస్తాబు, లడాయి, వాయిదా, శిలేబత్త రులు, షహరుసవారీ, సలాము, సొన్నాయి, హంవీరులు, హాలుసాలు — మున్నగు నూరారు అన్యదేశములును, ఆప్సరులును, ఇంగిలీజు, కంసలేరి, కుంపిణీ, కెప్తాను, పిస్తోలు, ఫయరు, మేస్తరు, రశీదు, లయను, వర్డి, సోల్దారులు మున్నగు పాశ్చాత్య భాషాపదములను కుప్పలుతిప్పలుగాఁ గూర్పఁబడినవి. చాలా, చెయ్యమా, బహుమంది మొదలగు వాడుక పదములుకూడ ఉపయోగింపఁబడి నవి. ప్రకరణోచితముగా నివి ప్రయుక్తములగుటవలన యుటితిస్ఫూర్తిని, ఔచితీదీప్తిని వర్యవసింపఁ జేయుచున్నవి.

## నడిమింటి రామయోగి కవి

నారాయణగజపతి ఆశ్రితకోటిలో రామయోగికవి మొదటివాఁడు. బాల్య మాదిగా విజయనగర ప్రభువుల కోటలో పెరిగి పెద్దయై విద్యాబుద్ధులను నేర్చినవాఁడఁట.† రామయోగి కవి రచనములుగా ఉషాపరిణయము లేక బాణాసురయుద్ధము అను గేయప్రబంధము, భక్తాణ దండకము అనునవి ప్రసిద్ధములు. నారాయణబాబు భార్యయగు రాణీ కొండయాంబగారికి రామయోగి కవి సంస్కృత విద్యాగురువఁట. బాణాసురయుద్ధము పామర జనరంజకముగా సంతరింపఁబడినదయ్యును ప్రౌఢ ప్రబంధరీతులను నయితము పుణికిపుచ్చు కొనినది. భక్తాణ దండకము శివభక్తుఁడగు భక్తాణ రాయని చరిత్రము. ఇది రఘురామున కంకితము. దండకమున కథాకథనరీతిని నిర్వహించుట ఇందలి విశిష్టత. '....నడిమింటి రామజోగి సుకవిరాజా బాహద్దరు మహా బాణాసుర దండకంబు చక్కఁగ నుడివెన్' అని సమకాలికుల ప్రశంసలను బొందినదీకృతి.

ప్రసిద్ధ పండితులును, సర్వతంత్ర స్వతంత్రులును నగు నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి నారాయణ గజపతిచే సమ్మానితుఁడఁట !

'పూషవాదన్వయాబ్ధీందో ! స్వస్తి నారాయణప్రభో !
నేత్రేగాత్రే తథా శ్రోత్రే వక్త్రే పుష్పేషు శోభతే' అని నారాయణ గజపతి నాశీర్వదించి శాస్త్రిగారు సత్కారము లందిరఁట !*

† పిస్మెర్ల కళింగాంధ్ర కవులు, ఆంధ్రవిజ్ఞాన సమితి, విజయనగరము, 1940, పుటలు 106—117.

* వేటూరి ప్రభాకరశాస్త్రి, నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి, త్రిలిఙ్గ, 1922, సంపుటము 25, పుటలు 483, 484.

## కాళ్ళకూరి గౌరీకాంత కవి

ఈతఁడు ప్రత్యక్షముగా విజయనగర రాజుల పోష్యవర్గము నందలి వాఁడుకాఁడు. విజయనగర సంస్థానపాలకుల దండనాయకుఁడును 'నారాయణ గజపతి రాజానుగ్రహ సంపన్నిధానుఁడును' అగు వెలిచేటి గురురాయఁడను కమ్మకులజుని ఆశ్రితుఁడగుటచే పరోక్షముగా విజయనగర సంస్థానకవిగా భావింపవచ్చు. కాళ్ళకూరివారి కుటుంబము తాతముత్తాల తరములనుండియు కవితావృత్తిచే విఖ్యాతిగాంచిన కుటుంబము. భద్రాపరిణయ రసవినోద సీతారామచారిత్ర ముఖకృతులు గౌరీకాంతకవి పూర్వులు సంతరించినవి. ఈతఁడు రచించిన ధర్మనందన విలాసము మూఁడాశ్వాసముల ప్రబంధము వెలిచేటి గురురాయని కంకితము.† శ్రీకాకుళము మండలము రణస్థలము చెంతనున్న బంటుపల్లియను గ్రామము గురురాయని నివాసస్థానము. ఈతని పూర్వులు కళింగదేశ రాజులకడ సేనానులుగానుండి విశేషసమ్మానములను గాంచినవారు.

'నవరత్నస్థగితంపు భూషలును మిన్నాస్వర్ణచేలంబులున్
వివిధారాతి భయంకరాకృతులు ఠీవిన్ బైరిగండంబులున్
జెవిమీఁదం గనుపట్టు నోరసిగలుం జేఖడ్గముల్ పూని భూ
ధవుచెంతన్ బహుమంది కమ్మదొర లౌద్ధత్యంబునం గొల్వఁగన్'‡

చినవిజయరామ గజపతి (1760–1794) కొలువుండినట్లు తెలియుచున్నది.

పాండవ జ్యేష్ఠుఁడగు ధర్మరాజునకును విదేహరాజ తనూజయగు కళావతికిని జరిగిన పరిణయ మీ ప్రబంధమున వర్ణితము. ప్రాచీన ప్రబంధ ఫక్కియందు గతానుగతికముగా అనుకరించి కూర్పఁబడిన రచనమిది.

## విజయరామ గజపతి (1826–1879)

ఇతఁడు నారాయణ గజపతి కుమారుఁడు. బాల్యమున కాశీనివాసము కారణముగా కవిగాయక పండితుల సాంగత్యమున పెరుగుటచే బహుభాషా చతురత, కళాకుశలత, ఆర్షధర్మాభిరతి వీరి కుగ్గుబాలతోఁ బెట్టిన విద్యలుగా అలవడినవి. వేదశాస్త్రాదివిద్యలను బోధించు నిమిత్తము వీరి ఆజ్ఞమేరకు విజయనగరమునందు సంస్కృత కళాశాలా స్థాపనమునకు 1860 లో అంకురార్పణము జరిగినది.* 1857 లో వీరు నెలకొల్పిన చిన్నపాఠశాల 1868 లో ఉన్నతపాఠశాలయై నేఁటి మహారాజ కళాశాలకు మూలమూర్తియయినది.

† కొత్త భావయ్యచౌదరి, కమ్మవారి చరిత్రము, పు. 245; చిరుపూరి నారాయణ రాజు, విస్మృతాంధ్ర కావ్యము, త్రిలిఙ్గ, 1931, మార్చి 16, సోమ., పు. 15.

‡ పద్మనాభ యుద్ధము, 24.

* విజయనగర మహారాజ సంస్కృత కళాశాల రత్నోత్సవ సంచిక.

కలకత్తా, మద్రాసు, అలిఘరు, కటకములందలి విద్యార్థులకు వేయార్లు విద్యార్థివేతనము లేర్పఱిచిరి. కాశీ, అలహాబాదు మొదలగుతావుల అనేక పాఠశాలలు, గ్రంథాలయములు నిర్మింపఁజేసిరి. కవికులభోజుఁడని, విద్వత్ప్రభుఁడని కవిపండితులచే కైవారములనందిరి. ఆస్థాన విద్వాంసులగు దూర్వాసుల సూర్యనారాయణసోమయాజిగారు విజయరామగజపతి మీఁద 20 గీతములు, 15 స్వరజతులు రచించిరి. పూసపాటివారి పూర్వులు గావించిన వీరకృత్యములను, విజయ యాత్రలను వర్ణించుచు సోమయాజిగారు 72 మేళ కర్తలలో కృతులను సంతరించిరఁట. మొహబత్ఖాను, మన్వరుఖానులను హిందూస్థానీ సంగీతవిద్వాంసులు విజయరామగజపతి నాశ్రితులు.• రామలీలా విలాస కర్తయగు పోడూరి వెంకటరాజకవియు కౌసల్యాపరిణయ ప్రబంధ, రామకృష్ణోపాఖ్యాన ద్వ్యర్థికావ్యములను రచించిన శ్రీపాద వెంకటాచలకవి విజయరామగజపతి కాలమున విజయనగర సంస్థానమున వెలసిన కవులలో ముఖ్యులు, 'సంగీత సాహిత్య సరస కవిత్వాభినయనాది మర్మములు....' దెలిసిన కిల్లంపూడి ముత్యాలు రాతని ఆస్థానముననుండి అనేక భజనకీర్తనలను వ్రాసెనఁట.* మండ కామేశ్వరకవి (1824—1892) ఆంధ్రీకరించిన కూర్మ పురాణము విజయరామగజపతి కంకితము.

'ఆజంభారినిగేరి మీఱిన మహోద్యత్తేజులైనట్టి బా
వాజీవారలు కూర్మ సంహితను పూర్వంబాంధ్ర భాషాకృతిన్
గాఁజేయం దమి నానతిచ్చిరని బల్కన్ వింటి నట్లౌట న
య్యోజంజేసి తదంకితంబుగను జేయుం డుజ్జ్వలంబై దగన్'

అని విజయరామగజపతి కుమారుఁడగు ఆనందగజపతి కృతికర్తయగు మండ కామేశ్వరకవిని కోరినట్లు ఆంధ్ర కూర్మపురాణావతారిక † విశదపఱుచుచున్నది. ఈ ఆంధ్రీకృత కూర్మపురాణము ఎనిమిది ఆశ్వాసముల గ్రంథముగ విస్తరించి యున్నది.

కామేశ్వరకవి తెలుఁగున సంతరించిన మఱియొకకృతి తులసీ రామాయణము. హిందీభాషలో తులసీదాసుచేత రచింపఁబడిన రామచరిత మానససరోవరమను గ్రంథమున కిది యాంధ్రీకరణము. అయోధ్యాకాండము తప్ప తక్కిన రామాయణ భాగమంతయు కామేశ్వర కవికృతము. అయోధ్యా కాండ భాగముమాత్రము శిష్టు కృష్ణమూర్తి తెలుఁగుసేఁత. హిందీలో ప్రసిద్ధ ములైన చౌపాయి, దోహా మున్నగు ఛందములే తెలుఁగుసేఁత యందును

• ఎన్. సి. పార్థసారథి, షట్కాల చక్రవర్తి వీణ వెంకటరమణదాసు, ఆంధ్రప్రభ వారపత్రిక, 1968, ఏప్రిల్ 10, పుటలు 30, 31.

* విజయనగర దర్శిని, పు. 21.

† ఎమ్ప్రెస్ ఆఫ్ ఇండియా ప్రెస్, చెన్నపురి, 1888.

ఉపయుక్తమగుట ఈ కృతి యందలి విశిష్టత. ఈ యనువాదమునకు ప్రేరకుఁడు విజయరామ గజపతియని 'మును తులసీరామాయణమును దెనుఁగొనరించి వారి మోదింపంజేసి గౌరవముగాంచిన....' (ఆంధ్రకూర్మ పురాణము, అవతారిక, పు. 3), 'శ్రీ మన్మహారాజ శేఖరులిట మున్ను రామ లీలాగ్రంథరచనఁజేయ మిము నియోగించి రా ఘనతర గ్రంథంబు లయతాళ కృతి సమన్వయముగాఁగ నఖిలపురాణేతిహాసోక్త రామకథా విశేషంబుల కీవి గూర్చి మును తులసీదాసుఁడను మహాకవిచేత కాశీస్థ భాషాప్రకారఫణితి గూర్పఁబడిన రామాయణ గుంఫితార్థ మల్లుఁజేసితిరి....' (రామకథాసార సంగ్రహము, విజయరామవిలాసముద్రాక్షరశాల, విజయనగరము, 1885) అను నుద్ధరణములనుఁబట్టి నిర్ధారింపనగుచున్నది.

పోడూరి వెంకటరాజకవికృతమగు రామలీలావిలాసము మూఁడాశ్వాసముల శృంగారప్రబంధము. విజయరామగజపతి పట్టాభిషేకోత్సవమును ఆనాఁడు జరిగిన శ్రీరామలీలోత్సవాదులు నిందు వర్ణితములగుటనుబట్టి విజయరామగజపతి మహారాజ పట్టాభిషేక మహోత్సవ రామలీలావిలాసంబని దీని పూర్తిపేరు.

> శ్రీ విజయరామరాజన్య శేఖరుండు
> రామలీలోత్సవం బతి రమ్యముగను
> జేయుచుండఁగ నాఁటి త్రేతాయుగంబు
> తోడవచ్చె ననం గనఁ దోఁచె ధరణి
>
> —ఆంధ్రకూర్మ పురాణము, అవతారిక, పు. 16.

శ్రీరామకథతోపాటు విజయరామగజపతి సుగుణసంపత్తియు ఈ రామలీలావిలాస ప్రబంధమునందు చిత్రితము. విజయరామగజపతి ప్రోత్సాహమున విజయనగరమున 1874 లో స్థాపింపఁబడిన 'జగన్నాథవిలాససభ' యను నాటకసమాజమువారు సంస్కృత నాటకములను బ్రదర్శించుచు నూతన ప్రయోగములఁ గావించుచుండిరఁట.[1]

## ఆనందగజపతి

విజయనగర సంస్థాన సాహిత్యచరిత్రలో ఆనందగజపతి (1879--1897) కాలము స్వర్ణయుగమువంటిదని అభియుక్తులు. 'విజయరామనృపాలక పుణ్యపుంజ' (నానారాజసందర్శనము, పూర్వార్ధము, పు. 22) మని, 'ఏము చూచిన రాజులందెల్ల నొక్క విజయనగరమహారాజు పేర్త' (పైది) అని తిరుపతి వేంకటకవులు ఆనందగజపతిని కీర్తించిరి. భాగవతుల హరిశాస్త్రి, మైసూరు

1 శిష్టా రామకృష్ణశాస్త్రి, ఆంధ్రనాటకజగత్తు, Annals of Oriental Research, Vol. XVI, Part II, p. 184.

భీమాచార్యులు, ముడుంబ నృసింహాచార్యస్వామి మున్నగువారు ఆనంద గజపతికి సంస్కృత విద్యాదేశికులు; మేజర్ థామ్సన్, లింగం లక్ష్మీ పండితుఁడు వీరికి ఆంగ్లవిద్యా గురువులు. 'తెలుఁగునను సంస్కృతమునందు లాటెనింగ్లీషు ఫ్రెంచి తురకములఁ గడుం దెలివిపరుండని సూరులు పలుక పఱలు....' (గణికామణీవిలాసము, 16) వాఁడఁట ఆనందగజపతి. ఇరువది భాషలలో ఆయనకు ప్రగాఢ పరిచయ ముండినట్లు పురావృత్త కథాకుశలులు వివరించిరి.[1] శాస్త్ర సాహిత్యములయందేగాక సంగీతాశ్వారోహణాఖేటాది కళలలో బహుముఖమైన ప్రావీణ్య మాయన కుండినట్లును[2] 'కళలకు కళలు రా నానతిచ్చు....' (కూర్మపురాణము, 1–12) కళానిధి యాతఁడనియు, సుప్రసిద్ధ వైణికులు వీణగురురాయాచార్యుల వెంకటరమణదాసుగారి కాయన సంగీతవిద్యా గురువనియు[3] శాస్త్ర చర్చలతో, సంగీత సదస్సులతో, సాహితీ గోష్ఠులతో, సమస్యాపూరణాదికములతో ఆయన సభామండపము సరస్వతీ నర్తనభూమిగా జ్ఞానశ్రీవర్ధనమగు సీమగా ప్రవర్తిల్లుచుండెననియు బహుజ్ఞులు వేనోళ్ళ వినుతించిరి. '....ఆనందగజపతి తర్క వ్యాకరణాలలో గెల్పు వోడులు నిర్ణయించే శక్తివున్న విద్వన్మహారాజు ...' అని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు అనుభవము మీఁద చెప్పినమాట.[4] విద్వద్గోష్ఠులలో మధ్యస్థ మొనర్చిన విద్వచ్ఛిరోమణి ఆనందగజపతి. ఆయన ఆదరింపని కళ, పోషింపని విద్య లేదు.[5] ఆయన సేవలో శిశిరీకరింపని కళాసీమలేదు. 'అన్నివిధాల సాంస్కృతిక ఖనియని చెప్పఁదగిన శ్రీ ఆనందగజపతిమహారాజ పుస్తకభాండాగారాన్ని పరిశీలించి....'[6] సంగీతములో కర్ణాటకరీతితోపాటు హిందూస్థానీ పాశ్చాత్యపద్ధతులకుఁగూడ ఈ సంస్థానమున ప్రోత్సాహము లభించినట్లు విస్సా అప్పారావుగారు వివరించిరి.

ఆనందగజపతి సంస్కృతాంధ్రములలో రచించిన చాటుపులు పెక్కు

[1] Encyclopaedia of the Madras Presidency and the Adjacent States, Vizianagaram Samsthanam, p. 335.

[2] అడిదము రామారావు, ఆనందగజపతి విద్యావినోదములు, ఆంధ్రపత్రిక, తారణ ఉగాది సంచిక, 1944, పుటలు 65-73, 'అఱువది నాలుగై హరువుమీఱెడు కళల్ వన్నె కెక్కఁగఁజేసె వసుధయందు...శ్రీమదానందగజపతి భూమివిభుఁడు' (శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, ఆంధ్రాభ్యుదయము, తృతీయా. 23).

[3] మేడేపల్లి వరాహనరసింహాచార్యులు, ఆనందగజపతి, తెలుగు విజ్ఞానసర్వస్వము, సంపుటము 3, పుటలు 724, 725.

[4] కథలు—గాథలు, సంపుటము 3, పు. 101.

[5] వాసా సూర్యనారాయణశాస్త్రి, శ్రీమదానంద గజపతీంద్రులు – వింతచరిత్రలు, భారతి, విక్రమ శ్రావణము, పుటలు 321–326.

[6] విస్సా అప్పారావు, ఆంధ్రదేశంలో సంగీతం, ఆంధ్రప్రదేశ్, 1963 మే. పు. 42.

లున్నవి.[1] వరదరాజకృతమగు లఘుకౌముదిని వీరే కొంత ఆంధ్రీకరించిరి. పూర్వచారిత్రికాధారములను పరిశీలించి ఆయన వ్రాసిన 'విజయనగరం ట్రీటీ' అనునది ఆంగ్లరచనము. ఇది విజయనగరపాలక కుటుంబ చరిత్రమును సంగ్రహముగా నిరూపించు లఘుకృతి.[2] జావళీలను, తానవర్ణస్వరజతులను కొన్నింటిని కూర్చిరట.[3] సవ్యాఖ్యాన ఋగ్వేద సంహితాముద్రణమునకై మాక్సు ముల్లర్ పండితునకును, శబ్దార్థ సర్వస్వ ప్రచురణమునకు, తారానాథ తర్క వాచస్పతికిని గొప్ప విరాళమునిచ్చిరి. 'హిందూ' (The Hindu) ఆంగ్ల దినపత్రికకు,[4] కొక్కొండ వెంకటరత్నము పంతులు చెన్నపురిలో స్థాపించిన 'ఆంధ్రభాషా సంజీవని' పత్రికకు భూరిగా విరాళమిచ్చి ప్రతిష్ఠాపకు లయిరి. జి. సి. వి. శ్రీనివాసాచార్యుల 'చంద్రహాస', 'హరిశ్చంద్ర' నాటకములు వీరి సమాదరణమునఁ బ్రచురితములు. వరవస్తు రంగాచార్యకృతమగు గురుశబ్దార్థ సర్వస్వమును అచ్చువేయింప నుద్దేశించిరి గాని యది నెఱవేఱకయే ఆనంద గజపతి పరమపదించిరి. విజయనగర సంస్కృత కావ్యమాలిక అను నొక ప్రచురణసంస్థ నేర్పఱచి కాశీపండితుల తోడ్పాటున బృహత్సంహితా వాక్యార్థ చంద్రికాద్యుత్తమ ప్రాచీన సంస్కృత గ్రంథములను బదియేనింటిని ముద్రింపఁ జేసిన యంశము జగమెఱిఁగిన సత్యము. మున్షీ మొహమ్మద్ పాచ్చామియా సాహెబు కూర్చిన 'ఫర్హంగి ఆనందరాజ్' అను ఉర్దూ అరబీ పారశీక భాషాకోశావతారమునకు ప్రేరకుఁడు ఆనందగజపతి. శాస్త్రవాఙ్మయమును, సకల పురాణములను పండిత మండలిచే నాంధ్రీకరింపఁజేయ నుద్యమించిన అపర రాజరాజనరేంద్రుఁ డీయన. 'ఏ సభాస్థలినిగా నిఖిల శాస్త్రంబులు శ్రీమీఱ నాంధ్రీకరింపఁబడియె నీ సదస్సునెగడా వాసిఁజెందెను. మనుధర్మశాస్త్రవ్యాఖ్య దశ విధముల' అను విద్వత్కవుల యభినందనము మీఁది ప్రతిపాదనమున కామ్రేడితము.

ఆనందగజపతిచే ఆదరింపఁబడిన కవిపండితులు ముడుంబై నరసింహాచార్యస్వామి, పేరి కాశీనాథశాస్త్రి, ఇవటూరి నందికేశ్వరశాస్త్రి, మండ చిట్టిరామశాస్త్రి, మండ లక్ష్మీకామేశ్వరశాస్త్రి, కొల్లూరి రామశాస్త్రి, మైసూరు భీమాచార్యులు, భాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రి, నేమాని కోదండరామయజ్వ ప్రభృతులు ముఖ్యులు. ఇంకను ఇతని ఆస్థానమునందు గురజాడ శ్రీరామ

1 కిడాంబి రామానుజాచార్యులు, శ్రీ విజయనగర మహారాజవంశము, ఆంధ్రపత్రిక, ఉగాదిసంచిక, 1911, పుటలు 201–209.

2 Vizianagaram Treaty of November 15th, 1758, Madras, 1894.

3 M. R. Sastri, Royal Composers and Patrons of Music, JAHRS, Vol. 28, pp. 9–12.

4 ఆంధ్రభాషా సంజీవని, నందన ఆషాఢము, పు. 39.

మూర్తి, గురజాడ వెంకట అప్పారావు, కె. యన్. జి. రాజామణిచెట్టి, జి. సి. వి. శ్రీనివాసాచార్యులు, నిడుదవోలు సుందరముపంతులు, ఆదిభట్ల నారాయణదాసు, మేడేపల్లి వెంకటరమణాచార్యులు మున్నగు పండితులు, పరిశోధకులు ఆదరింపఁబడిరి. బహుజనపల్లి సీతారామాచార్యుల త్రిలిఙ్గ లక్షణ శేష మను ప్రౌఢవ్యాకరణము, గురజాడ శ్రీరామమూర్తిగారి కవి జీవితములు, గురజాడ వెంకట అప్పారావుగారి కన్యాశుల్క నాటకము, నీలగిరి పాటలు, తమ్మావి సింగరాచార్య చినసింగరాచార్య రచితమగు గాయక పారిజాతము మొదలగునవి ఆనందగజపతి అంకితముపొందిన గ్రంథములు.

ఆనందగజపతి కాలమున 'శ్రావణపూర్ణిమ' విద్వత్పరీక్షలు నిర్వహింపఁబడుచుండెడివి. ఆస్థానమును దర్శించి సమ్మానము లందినవారిలో మండపాక పార్వతీశ్వరశాస్త్రి, మాడభూషి వెంకటాచార్యులు, తిరుపతివేంకటకవులు, ఆత్మూరి నృసింహ సోమయాజులు ముఖ్యులు. మండపాక పార్వతీశ్వరశాస్త్రి '....విజయనగరమునకేగి యచ్చటఁ బులిగడ్డకులజుఁడౌ నరుణాచలకవీంద్రు పురుషకారగతి శ్రీమదానందగజపతిరాజ మహారాజసన్నిధి నధిగమించి కవితా చమత్కార గౌరవ లాభంబుఁజెంది....' నవాఁడఁట. † అభినవ పండితరాయ బిరుదాంచితుఁడగు మాడభూషి వెంకటాచార్యుఁడు (1835—1895) ఆనంద గజపతిని దర్శించి ఆయనమీఁద 'ఘనదయాసాంద్ర యానంద గజపతీంద్ర' యను మకుటముగల సీసపద్య శతకమును రచించెనఁట. నలువదిమూఁడు సీస పద్యములుగల ఆనందగజపతీంద్ర శతక మొకటిమాత్ర ముపలబ్ధము.‡ వెంకటాచార్యులు నూజివీడు పిఠాపురాస్థానములలో శతావధానాదికములచే సమ్మానితులు. భరతాభ్యుదయ బృహద్వైద్యరత్నాకరాదులు కవికృత్యంతరములు. 'అటుగవ్వాలిటు చెన్నపట్టణము మధ్యన్గల్గు దేశమ్మునన్ జటులస్ఫూర్తి శతావధానములు మెచ్చంజేసియున్నట్టి....' (నానారాజ సందర్శనము, పూర్వార్ధము, పు. 20) తిరుపతి వేంకటకవులు 'ఆనందగజపతి క్ష్మానాథుసభలోనఁ గవనమ్ముచే మెప్పుఁ గాంచినాము' (పైది, పు. 53), 'ఆనందగజపతి క్ష్మానాథుఁడెక్కుడు కవిచంద్రులని మెచ్చి కానుకలొసఁగె' (పైది, ఉత్తరార్థము, పు. 115) అని ఆనందగజపతి వితరణమును పేర్కొనిరి. ఆత్మూరి లక్ష్మీనృసింహ సోమయాజులు (1845—1901) ఆనందగజపతి ఆస్థానమున వేదశాస్త్ర విచారమొనర్చి, అనేకోపన్యాసములొసఁగి మన్ననలను బడసిన మనీషి.* ఈ సోమయాజులుగారి తైత్తిరీయమంత్ర భాగార్థాది వైదిక గ్రంథసంచయము ఆనందగజపతి

† విజయనగర సంస్థానము — ఆంధ్రవాఙ్మయ పోషణ.

‡ చూ. R. No. 591 (b) ప్రాచ్య లిఖిత గ్రంథాలయము.

* ఆత్మూరి లక్ష్మీనృసింహ సోమయాజులవారి జీవితచరిత్ర, 5, వైశ్యధర్మ ప్రకాశిక, ఆంధ్ర గ్రంథాలయ ముద్రాశాల, బెజవాడ, 1922.

సమాదరణమునఁ బ్రకాశితము.

ఇఁక ఆనందగజపతి ఆస్థాన కవిపండితుల సాహిత్యకృషిని సంగ్రహముగా సమీక్షింతము.

## ముడుంబ నరసింహాచార్యస్వామి

విజయరామగజపతి కాలమున సింహాచల క్షేత్రమున వసతిపొందిన వైష్ణవ కుటుంబములలో ముడుంబవారి కుటుంబమొకటి. వీరికి మంచనా, పాలకొండ సంస్థానములలో నయితము వార్షికములుండినవి. వీరిలో నరసింహాచార్యస్వామి (1841–1927) ఆనందగజపతి ఆస్థాన విద్వత్కవులలో ప్రధానుఁడు; ప్రథమ పండితుఁడు. భగవత్కవి యనునది వీరిబిరుదము. సంస్కృతాంధ్రములయందు వీరు యోగవేదాంత కావ్యశాస్త్ర విషయికములగు ద్విశతాధిక కృతులను రచించినవారు. వీరి కృతులలో శ్రీరామచంద్రకథామృతేతిహాసము, కావ్యాలంకార మాలిక, పాతంజల యోగశాస్త్రము ముఖ్యములైనవి. శ్రీరామచంద్రకథామృతేతిహాసము సంస్కృతకావ్యము పరిశిష్టరామాయణా పరనామకము.† పాతంజల యోగశాస్త్రము యోగశాస్త్రము నకు ఆంధ్ర వివరణము. ప్రతిసూత్రమునకు సుదీర్ఘమైన ఆంధ్రవ్యాఖ్యానము సంతరింపఁబడినది.

'పాతంజలస్య శాస్త్రస్య వ్యాసభాష్యానుసారతః
కరోమ్యాంధ్రగిరా టీకాం సౌలభ్యే నార్థసిద్ధయే'

యని ఆంధ్ర టీకాపరిమితి ప్రయోజనములను టీకాకారుఁడు స్పష్టపటిచినాఁడు. ప్రబంధ కల్పవల్లి తృతీయదళముగా నిది ప్రచురితము.‡

## పేరి కాశీనాథశాస్త్రి

వీరు గౌతమగోత్రులగు ద్రావిడులు. భాష్యాంత వ్యాకరణ పండితులు. తర్కాలంకారములలో దృఢమయిన వ్యుత్పత్తి గౌరవముగలవారు. సంస్కృత ప్రాకృతాంధ్రములలో కవితచెప్పినవారు. గంగాస్తవరాజము, గోదావరీలహరి, దుర్గాసౌందర్యశతకము, పరిభాషేందుశేఖర వ్యాఖ్యాకాదంబిని, పాంచాలికారక్షణ నాటకము, యామినీపూర్ణతిలక నాటకము, శాకుంతల నాటకము, సర్వమంగళా విభుత్వస్థాపనము అనునవి వీరి గీర్వాణకృతులు. గౌతమతర్కము, పార్థసారథి శతకము, పూర్వశాకుంతలము, ప్రత్యూష ప్రబోధమననము, భగవద్గీతా సారము, వీథినాటకము, శృంగార రసమంజరి మున్నగునవి శాస్త్రిగారి తెలుఁగురచనలు.

† శ్రీ విజయరామవిలాస ముద్రాక్షరశాల, విజయనగరము, 1915.
‡ రాజయోగి ముద్రాక్షరశాల, కాకినాడ, 1896.

## కొల్లూరి కామశాస్త్రి

ఆనందగజపతి మెచ్చిన విద్వత్కవీంద్రులలో కామశాస్త్రి (1840—1907) గారొకరు. వీరి గ్రంథములు సంస్కృతాంధ్రములయందు కలవు. మూఁడు పరిచ్ఛేదములుగల వీరి ఆంధ్ర ధర్మసింధుసారము[1], పాండురంగవిఠలస్వామి భక్తుఁడును, కాశ్యుపాధ్యాయ పౌత్రుఁడును, అనంతోపాధ్యాయ పుత్రుఁడును, మరాఠీ పండితుఁడును నగు కాశీనాథోపాధ్యాయుఁడు గీర్వాణమున రచించిన కృతికిది యాంధ్రీకరణము. ఇది సర్వసాధారణమయిన స్పష్టభాషలో ఆనంద గజపతి ప్రేరణమున తెనిఁగింపఁబడినది. ఆనందగజపతి ప్రేరణమున బహు జగదుపకారముఁ దెనిఁగించిన కొల్లూరివారి మఱియొక గ్రంథము శూద్ర కమలాకరము, కమలాకరభట్టాచార్యుని సంస్కృతకృతి కిది యాంధ్రీకృతి.[2] 'రఘునాయక భక్తవరప్రదాయకా' యను మకుటముగల రఘునాయక శతకము మఱియొక ప్రౌఢరచనము.[3] శాస్త్రిగారి సంస్కృత రచనలు ముఖ్యముగా దేవతాస్తుతిపరములు. 'శ్రీ నరసింహ దేవకర నఖస్తవః' లేక 'సింహాద్రినాథ కర నఖస్తవః' అను 74 శ్లోకములుగల లఘుకృతి సింహాచలక్షేత్రమున వెలసిన లక్ష్మీనరసింహస్వామి స్తోత్రము. ఆనందగజపతి కోరికమేర కిది సటీకముగా విరచితము.[4] 'శ్రీ కాశీస్తవః' అను సంస్కృతస్తోత్ర గ్రంథము సటీకముగా శాస్త్రసాహిత్య సౌహిత్యాభిలాషులకు ఆకల్ప మభిలాష పూర్వకముగా ఆనందగజపతి యాజ్ఞానుసారము సంధానితము. 85 శ్లోకముల గ్రంథమిది.[5]

## మండ కామేశ్వరకవి

మండ చిట్టికామశాస్త్రి, మండ నరహరికామయ్య మున్నగునవి ఈయన నామాంతరములు. ఆనందగజపతి జనకులగు విజయరామ గజపతి నాఁటి నుండియు మండ కామేశ్వరకవి (1821—1892) ఆస్థాన విద్వత్కవిగా పేరు పొందినవాఁడు. ఈయన విజయరామ గజపతి యాదేశము మేరకు తులసీదాసు రామాయణమును తెనిఁగించినట్లు ఈవరకే తెలిసికొంటిమి. కామేశ్వరకవి ఆంధ్రీకరించిన కూర్మ పురాణము ఆనందగజపతి యాజ్ఞాను సారము విజయరామగజపతి కంకిత మొసఁగఁబడినది. విజయరామ గజపతి భార్య యగు అలకరాజేశ్వరీదేవి కోరికప్రకారము కామేశ్వరకవి మార్కండేయ

[1] ఎమ్‌ప్రెస్ ఆఫ్ ఇండియా ముద్రాక్షరశాల, చెన్నపురి, 1888.

[2] ఆది సరస్వతీనిలయ ముద్రాక్షరశాల, చెన్నపురి, 1887; ద్వి. ము. శారదాంబా విలాస ముద్రాశాల, చెన్నపురి, 1912.

[3] శతక కవుల చరిత్రము, అనుబంధము, పుటలు 801, 802.

[4] శ్రీ విజయరామ విలాస ముద్రాక్షరశాల, విజయనగరము, 1883.

[5] శ్రీ విజయరామ విలాసముద్రాక్షరశాల, విజయనగరము 1884.

పురాణము[1] ను కూడ అలకరాజేశ్వరి కంకితముగా ఎనిమిది ఆశ్వాసముల కావ్యముగా ఆంధ్రీకరించినాఁడు. కూర్మ పురాణములో మార్కండేయ పురాణాంధ్రీకరణ ప్రసక్తికలదు గావున మార్కండేయ పురాణాంధ్రీకరణమునకు తరువాతనే కూర్మపురాణము తెనిఁగింపఁబడినట్లు స్పష్టమగుచున్నది.

కామేశ్వరకవి తెనిఁగించిన మఱియొక రచనము రామకథాసార సంగ్రహము[2] ను మూఁడాశ్వాసముల పద్యకావ్యము. రాజబంధువులలో నొకరగు భూపతిరాజు వెంకటపతిరాజు నభ్యర్థనము మీఁద విజయరామ గజపతి మహారాజు ప్రధాన మంత్రియును, సంస్కృతాంధ్ర విద్యాపరిశీలనాలసన దక్షుఁడును నగు పెనుమెచ్చ జగన్నాథరాజుగారికి కృతిగా నిది యాంధ్రీకృతము. 'తులసీదాసుఁడను మహాకవిచేత కాశీస్థ భాషాప్రకారఫణితి గూర్పఁబడిన రామాయణ గుంఫితార్థమట్లు....గద్యపద్యరచనా విశేషంబు బరిఢవిల్ల నాంధ్ర భాషను....' (రామకథాసార సంగ్రహము. పుటలు 13, 14) యాజ్ఞవల్క్య మునీంద్రుఁడు భరద్వాజునకుఁ జెప్పినట్లుగా కథానిర్వహణ మొనర్పఁబడినది. కామేశ్వరకవి ఆంధ్రమన్వర్థదీపిక, వరాహపురాణము, మత్స్య పురాణము, వాసంతికాస్వప్న నాటకము అను మఱినాలుగు తెలుఁగు రచనలను జేసినట్లు వారి వారసుల కథనము. గరుడ పురాణమునుసైత మాంధ్రీకరించినట్లు మండవంశ సంభవ చరిత్రము నొకయముద్రిత చంపూప్రబంధమువలనఁ దెలియుచున్నది. ఆనందగజపతి కోరికమేరకు నవరాత్రిపూజా సందర్భమును పురస్కరించికొని సంస్కృతమున సంతరించిన 'దేవీలీలాతరంగిణి'[3] లలితాంబికా స్తవము అను దశతరంగ సంగతమగు సంస్కృతకృతి కామేశ్వరకవికృతి. తొలి తొమ్మిదిసర్గలలో పదేసి శ్లోకములు, దశమతరంగమునందు పదునాఱు వెరసి నూటయాఱుశ్లోకము లిందుకలవు. కవికూర్చిన వ్యాఖ్యానముసైతము దీనికి జతసేయఁబడినది.

## మండ లక్ష్మీకామేశ్వరశాస్త్రి

ఈతఁడు (1857–1920) మండ కామేశ్వరకవి జ్యేష్ఠపుత్రుఁడు. ఆనందగజపతి దర్బారు పండితుఁడు; విజయనగరమునకు దత్తుఁడయిన విజయరామగజపతి (1897–1922) కిని ఇతఁ డాశ్రితుఁడు. కల్కివిజయ ప్రబంధము, సర్వమత సంగ్రహము, నీలగిరివర్ణనము,[4] సింహగిరి యాత్రా

1 వేణుగోపాల ముద్రాక్షరశాల, వైశాఖపట్టణము, 1886.

2 శ్రీ విజయరామ విలాస ముద్రాక్షరశాల, విజయనగరము, 1885.

3 శారదాంబావిలాసముద్రాక్షరశాల, చెన్నపురి, 1892.

4 రామస్వామిశెట్టిగారి ముద్రాక్షరశాల, చెన్నపట్టం, 1907.

ప్రకాశిక† శివభక్తివిలాస నాటకము‡, దారిద్ర్యహర శివశతకము, రామచంద్ర శతకము, జార్జిసార్వభౌమప్రశస్తి, ఏకాక్షర ద్వ్యక్షరచాటువులు, సమస్యాపూరణములు, నాగ రథ ఖడ్గ పద్మబంధములు మున్నగు చాటువులు ఇతని తెలుఁగు రచనలు. శ్రీనివాసశతక మనునది సంస్కృతకృతి. సంస్కృతమున రచించిన చాటువులుకూడ అనేకము కలవు. ఈయన రచనలలో కల్కివిజయ ప్రబంధము ప్రధానము. ఇది గద్య పద్యాత్మకము. నిఖిలవిద్యావైదుషీధురీణుఁడగు సీతఁడు పది అధ్యాయములలో సంధానించిన ఆంధ్ర వైశేషికోపస్కారము వైశేషిక దర్శనమున కాంధ్రీకరణము.

ఈతఁడు ఆనందగజపతి ఆదేశముమేరకు గురజాడ వెంకటఅప్పారావు గారి ప్రేరణముమీఁద 'సర్వసిద్ధాంతచంద్రిక' అను శాస్త్రగ్రంథమును రచించినట్లు అముద్రితమగు నీ కృతియందలి అవతారికవలన స్పష్టమగుచున్నది. నవ్యభాషాశాస్త్రదృష్టిలో రచింపఁబడిన వ్యాకరణశాస్త్రమిది. 'గురజాడ వంశ తిలకుఁడు వరవిద్యాధనుఁడు.... అప్పరాయ మంత్రీశ్వరుఁ డుద్బోధంబుఁ జేసె సరసఫణితులన్'

ఎట్లనిన—

"మున్నానందనృపాలమౌళి విబుధామోదంబుగా నాంధ్ర భా
షన్నూత్నంబుగఁ దెన్గువ్యాకృతిని గూర్చన్ నీకు నాజ్ఞప్తిని
చ్చె న్నేఁడా మహితాత్ము గోత్ర సఫలశ్రీనొంద గ్రంథంబు లె
న్నెన్నో గూడెను జూచిహర్షుఁడు యశంబేపార నా వ్యాకృతిన్."

'అని యిట్లు నా కుద్బోధంబుగఁ బలికిన నేను ప్రాచీన నవీనాంధ్రవ్యాకరణంబులఁ బరిశీలించి యాధునిక వ్యవహారంబు నరయుచు నూత్నంబుగ నాంధ్రసూత్రావళిం గూర్ప నారంభించి....' (లిఖితప్రతియందలి అవతారికాభాగము)*.

వీరి తమ్ములగు మండ రామచంద్రశాస్త్రికూడ ఆనందగజపతి దర్బారున పండితులఁట. ఆయుర్వేదమునను మంత్రశాస్త్రమునను ఈయన సిద్ధుఁడని ప్రతీతి. మండ రామేశ్వరకవి (1821—1892) సోదరుని కుమారుఁడగు మండ రామేశ్వరకవి మండ వంశసంభవచరిత్ర కృతికర్త. ఇది హాయనశకము బుతు నేత్రాబ్జజ చంద్రసంఖ్యనలరు వత్సరము (క్రీ శ. 1926) నాఁటికి విరచితమయినట్లు అవతారిక మూలమునఁ దెలియుచున్నది. భారద్వాజసగోత్రులగు మండ వంశీయులయు వీరితో సంబంధబాంధవములుకల ఉపద్రష్ట, చెల్లూరి, దూసి, నడిమింటి, మండపాక, పెరుసోమయాజుల, సింహభట్లప్రభృతి గృహనామ

† జి. రామస్వామిశెట్టిగారి ముద్రాక్షరశాల, చెన్నపట్టణం, 1907.

‡ విజయరామవిలాస ప్రెస్సు, విజయనగరము, 1906.

* పరిశీలించిన లిఖితప్రతి అసమగ్రము. విజయనగరములో మండవారియింట కలదు.

టిలయు కుటుంబ చరిత్రములు కూర్చిన నాలుగాశ్వాసముల చారిత్రక కావ్యమిది. గురజాడ అప్పారాయ ప్రేరణముమీఁద రచితమయిన 'భారతాంధ్రపద నిఘంటువు' (నేఁటి నన్నయ పదప్రయోగ కోశాదులవంటిది) మండవారి యింట లిఖితప్రతులలోఁ గలదు.

## భాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రి

ఇతఁడు (1839—1922) విజయనగర మహారాజ సంస్థాపిత సంస్కృత సంవలితాంగ్ల విద్యామహాపాఠశాలా సంస్కృత పండితుఁడు. ఈతని కృతులు సంస్కృతాంధ్రముల రెంటను గలవు. వంశధారానదీతటమునఁగల ముఖలింగమునొద్ద వాయవ్యరాష్ట్రయుద్ధములో ఆంగ్లప్రభుత్వమునకు తోడుగా పాల్గొనునిమిత్తము ఆనందగజపతి సమీకరించిన సేనావాహిని ఉల్లాసము కొఱకు రచింపఁబడి ప్రయోగింపఁబడిన శ్రీరామవిజయము† ను సంస్కృత నాటక మీతని కృతులలో తొలుత పరిగణింపఁదగినది. లంకావిజయ మిందభివర్ణితము. వీరరసప్రచుర మీ కృతి. ఈ నాటకరచనమును తలస్పర్శముగా విమర్శించుచు గురజాడ వెంకటఅప్పారావుగారు ఆంగ్లభాషలో వ్రాసిన సమీక్ష దీనికి ముఖబంధముగా ముద్రింపఁబడినది. సంక్షిప్తరామచరితము లక్ష్మీనారాయణశాస్త్రిగారి కృత్యంతరము. 'సతతము సంతసమొసంగు సత్యవ్రతికిన్' అను మకుటముగల శతకమును రచింపుఁడనియు, వానిలో నుత్తమమైనదానికి పారితోషిక మీఁబడుననియు ఆనందగజపతి ప్రకటింపఁగా ఆస్థానపండితులు, దేశమునందలి మొత్తము పండితులు సుమారు నన్నూఱుమంది ఈ పోటీ నిమిత్తము శతకములను వ్రాసిపంపిరఁట. ఉత్తమకృతి నిర్ణయము తేలకమునుపే ఆనందగజపతి అకాలమరణము చెందెనఁట. ఈ పోటీనిమిత్తము కృతులను సంతరించినవారిలో వంతుల బ్రహ్మదేవకవి, ముడుంబై నరసింహాచార్యస్వామి, భాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రి, ఆదిభట్ల నారాయణదాసు, కార్యమపూడి రాజమన్నారుకవి, కొల్లూరి కామశాస్త్రి, మేడేపల్లి వెంకటరమణాచార్యులు, నిడదవోలు సుందరంపంతులు, కె. యస్. జి. రామానుజచెట్టి మున్నగువారు కలరు. సమస్యాచ్ఛలమున సమస్యాకల్పకుల ప్రవృత్తిని వ్యక్తీకరింపవచ్చు. ఆనందగజపతికి సత్యవ్రతమనిన ఒక దీక్షవంటిదఁట. లక్ష్మీనారాయణశాస్త్రి రచించిన సత్యవ్రతి శతకము గ్రంథకర్త కుమారుఁడు లింగమూర్తిచేఁ బ్రచురితము ‡ కవితాత్పర్యనిరూపణమగు టిప్పణముగూడ సంగ్రహముగా దీనికుపనిబద్ధము.

† నిర్ణయసాగర ముద్రాక్షరశాల, ముంబాపురి, 1901.

‡ శ్రీరామానుజ ముద్రాక్షరశాల, విజయనగరము, 1929.

## నేమాని కోదండరామయజ్వ

కౌతము మిత్రుండిలన గోత్రజుండు. మహోపాధ్యాయ బిరుద విరాజితుండు. ఆనందగజపతిరాజు నాజ్ఞచే కోదండరామయజ్వయును వీరిని శిష్యుండగు ఇవటూరి నందికేశ్వరశాస్త్రియును నిశ్చయచింతామణి యను పేరుగల మూండు ఖండముల బ్రహ్మమంత్రయజ్ఞ భాష్యమును, పరమపురుషార్థ దివ్యసౌధసమారోహణ సోపానమార్గాయమాణముగా నిర్మాణ మొనర్చిరి *

## గురజాడ శ్రీరామమూర్తి

ఆనంద గజపతిరాజు నాశ్రితులలో గురజాడ శ్రీరామమూర్తిగారు (1851–1899) ప్రసిద్ధ పరిశోధక పండితులు. ప్రబంధకల్పవల్లి, రాజయోగి పత్రికానిర్వాహకులుగాను, ఆంధ్రపద పారిజాత†మను శుద్ధాంధ్ర నిఘంటు రచయితగాను, కవిజీవిత గ్రంథకర్తగాను శ్రీకృష్ణ విజయాది ప్రాచీనగ్రంథ పరిష్కర్తగాను ప్రసిద్ధులు. అప్పయదీక్షిత చారిత్రము, తిమ్మరుసుమంత్రి చరిత్ర, బెండపూడి అన్నమంత్రి చరిత్ర, తెనాలి రామకృష్ణుని కథలు. కళాపూర్ణోదయ కథాసంగ్రహము, షేక్స్పియర్ మహాకవి ఆంగ్లకృతి (మర్చంట్ ఆఫ్ వెనిస్) కాంధ్రీకృతి యగు వెనిసు వణిజు నాటకము. అరేబియన్ నైట్స్ కథల కనువాదమగు చిత్రరత్నాకరము వీరి యితర రచనలు. వీరి కవిజీవితములు ఆనందగజపతి కంకితము.

## గురజాడ వెంకట అప్పారావు

భాషాతత్త్వ ప్రవక్తగా, నవ్యాంధ్రసాహిత్య ప్రయోక్తగా, ప్రాంత కొత్తల వారధిగా, వ్యావహారికభాషామహోద్యమ జగన్నాథ రథసారథిగా విశాలాంధ్రమున ప్రతిష్ఠనార్జించిన ప్రతిభామేరువు గురజాడ అప్పారావుగారు (1862–1915). ఆయన విజయనగరము మహారాజాంగ్ల కళాశాలలో కొంతకాలము ఆంగ్ల భాషోపన్యాసకులు; కొంతకాలము సంస్థాన ప్రాచీన లిపి పాఠకులు. ఆనందగజపతి తలపెట్టిన కన్యాశుల్కాది దురాచారముల నిర్మూలించుటలో అప్పారావుగారిది ప్రముఖపాత్రము. మదరాసు విశ్వవిద్యాలయము వారి 'కాంపోజిషన్ కమిటీ'లో సభ్యులుగానుండి ఈయన ప్రకటించిన అసమ్మతి పత్రము (Minute of Dissent) వ్యావహారిక భాషావాదమునకు వేదము. ఈయన అధీతిబోధాచరణ ప్రచారములందు ఆదర్శమూర్తి: నిజమని నమ్మిన దానిని నిర్భీకముగాఁ బ్రకటించు మహావ్యక్తి. ఈయన రచించిన నీలగిరి పాటలు అను గేయప్రబంధము, కన్యాశుల్క నాటకము ఆనంద గజపతి

* అమెరికన్ ముద్రాక్షరశాల, చెన్నపురి, 1886.

† శారదానిలయ ముద్రాక్షరశాల, చెన్నపురి, 1888.

రాజామణిచెట్టి తన తండ్రి ముఖ్య జీవిత ఘట్టములను దండగాఁ గూర్చిన రచనము గోపాలకృష్ణ దండకము. 'ఆంధ్రగీర్వాణ భాషానురక్తుఁడు'ను, 'అఖిల పురాణేతిహాస ప్రమోదుండు'ను నగు రాజామణిచెట్టి తన తండ్రి జీవిత చరిత్రము సంక్షిప్తముగా స్వీకరించి సీసపద్యరూపమునఁ గైసేసిన గ్రంథము గోపాలకృష్ణమూర్తి శతకము.[1] శివభక్తుఁడగు ఖిల్యాణుఁడు శివుని కాతిథ్యమొసంగి మెప్పించిన గాథయే వస్తువుగాఁ గలిగిన ఏకాఖ్యాన గేయ ప్రబంధము ఖిల్యాణరాజు చరిత్రము.[2] ఆనందగజపతి జనకులగు విజయరామ గజపతి మహారాజు జీవితకథను దిఙ్మాత్రముగాఁ జిత్రించిన పద్యరూపవ్యాసము విజయరామగజపతి మహారాజుగారి చరిత్రము; ఇదే విజయరామ గజపతీంద్ర చరిత్రముకూడ. ఆనందగజపతి సతియగు శ్రీ వనకుమారి మహారాణి (ఛోటా మహారాణి) గుణగణములను కీర్తించు శ్రీ వనకుమారి మహారాణి మహిమ యను ముప్పదియైదు పద్యముల లఘుకృతి రాజామణిచెట్టికృతము. 82 పద్యములు గల విజయరామ గజపతీంద్ర చరిత్రముతో కలిపి ఇది ముద్రింపఁబడినది.[3] వనకుమారి మహిమ, సుగుణ మంజరి యను రెండు కృతులును ఇంచుమించుగా నొకటే. సుగుణ మంజరిలో 29 పద్యములున్నవి. వనకుమారి మహిమలో సుగుణమంజరిలోకంటె ఆఱు పద్యములు (ఒకసుండి పదునొకండు) అదనము. మొత్తము పద్యములు ముప్పదియైదు. చల్లలమ్మ నాచ గొల్లభామ చెప్పిన సొడ్డు — పుట్టింటనున్న స్త్రీలను నమ్మరాదనుట — ను వివరించు 108 పద్యముల కావ్యమే సొడ్డుకథ. చిక్కవోలు పార్వతీశ మను మిత్రుఁడు చెప్పిన కథ ఆధారముగా నిది రచితము. విజయనగరము సబ్‌కలెక్టరుగా నుండిన లాటన్ దొరగారి కంకితము.

## విజయరామ గజపతి

వీరు (1883--1922) 1904 లో పట్టమునకు వచ్చి 'సాహిత్యవేత్తలు సకల కవీశ్వరుల్ పండితు లోకమంతఁ బ్రబలియుండ....' తమ పూర్వులు పోయిన త్రోవలో కళాపోషణము గావించిరి. వీరి కాలమున ఆదిభట్ల నారాయణ దాసు, యనమండ్ర నారాయణమూర్తి, కన్నేపల్లి సాంబశివసుబ్బరామస్వామి, భోగరాజు నారాయణమూర్తి, బుర్రా శేషగిరిరావు, మేదేపల్లి వెంకటరమణాచార్యులు మున్నగువారు ప్రసిద్ధ కవిపండితులు. సంగీత కళాశాలాస్థాపనము, ప్రాచ్య కళాశాలోద్ధరణము, విజయరామ నాటక కళాపరిషత్స్థాపనము, కోటకొండలో నిర్వహించుచుండిన అఖిల భారత క్రీడోత్సవములు విజయరామ

1 శతకవాఙ్మయ సర్వస్వము, అనుబంధము, పుటలు 843 - 845.

2 శారదా నిలయ ముద్రాక్షరశాల, మద్రాసు, 1899.

3 శ్రీహరి ముద్రాక్షరశాల, మద్రాసు, 1896.

గజపతి కళాభిమానమునకు గీటురాళ్ళవంటివి. కొన్ని లక్షలు విరాళ మొసఁగి విజయనగరమునందు ఆంధ్ర విశ్వ విద్యాలయము (Andhra University) స్థాపింపవలయునను ప్రగాఢమైన అభిలాష ఆయనకుండినదఁట. దానికొరకాఁ పేర్పడకముందే వారు 1922 లో మరణించుటవలన అది సాధ్యపడలేదు.*

ఆదిభట్ల నారాయణదాసు (1864–1945) గారి ఉమర్ ఖయ్యామ్ సంస్కృతాంధ్ర భాషాంతరీకరణము విజయరామ గజపతికి కృతి. భగవత్కవి ముడుంబై నరసింహాచార్య స్వామివారి రామచంద్ర కథామృతము సంస్కృత రామాయణము విజయరామ గజపతి సమాదరణమున ముద్రితము. విజయరామ గజపతి యాస్థానకవియగు కన్నెపల్లి సాంబశివరామస్వామి గణేశ్వరి యాది గ్రంథకర్త.

విజయరామగజపతి యాశ్రితులలో యనమండ్ర నారాయణమూర్తి (1870–1930) యొకరు. ఈయన సంస్కృతాంధ్రాంగ్ల భాషా విశారదుఁడు, 'ఆంధ్ర కవిత్వ తత్త్వ భాగ్యయుఁడు. రసజ్ఞుఁడు.' ఆంధ్రాంగ్లములలో కృతులు చెప్పినవాఁడు. ఈయన ప్రేరణతో విజయనగర సంస్థానమువారు ఆంధ్ర సాహిత్యము నభివృద్ధిచేయు తలంపుతో సంస్థాన పక్షమున నవ్యాంధ్ర కావ్య రచనలో ఏఁటేఁట పోటీపరీక్షలు మొదలుపెట్టిరి. 1918 లో దువ్వూరి రామిరెడ్డి (1889–1949) రచించిన వనకుమారి† యను నవ్యాంధ్ర పద్య ప్రబంధము ఉత్తమ రచనముగా ప్రథమ బహుమతి నందినది. శృంగారరస ప్రధానమైన ఈ కావ్యమునకు యనమండ్ర నారాయణమూర్తిగారు ప్రతిభాపూర్వకమైన పీఠికను సంధానించిరి. ఇందలి యవతారికలో విజయరామ గజపతి ప్రశస్తినిఁ దెలుపు పద్యములున్నవి. సంస్కృతాంధ్ర పండితులును, దేవప్రియ చరిత్ర, సేతుబంధాది కావ్యకర్తలును నగు మేదేపల్లి వెంకటరమణాచార్యులు (1862–1943), 'గురుప్రసాద' గ్రంథ రచనవలన నాగేశభట్ట సిద్ధాంత స్థాపకులయి కళాప్రపూర్ణ మహామహోపాధ్యాయ ప్రఖ్యాతి బిరుదముల నందిన తాతా సుబ్బరాయశాస్త్రి (1867–1944) మున్నగువారు విజయనగర సంస్థాన పండితులలో కొందఱు. రాయఁడు శాస్త్రిగారి పాఠప్రవచనముల సుశిక్షితమయిన శిష్యకోటి తెలుఁగునేల నాలుగు చెఱఁగుల విస్తరించి యుండుటచే వారి ప్రశస్త్యము సముజ్జ్వలితము.

*'.. The founding of the Andhra University was the highest desire of His Highness and in well informed circles it was often declared that the Maharaja was willing to give away many lakhs of rupees if the University was to be established at Vizianagaram' (M.V. Subbarao, Sri Viziarama Gajapati, p. 8).

† వావిళ్ల ప్రెస్సు, చెన్నపురి, 1920.

## అలక నారాయణ గజపతి

'లాలితాఖిల విద్యాకళా విహారుఁ'డగు అలక నారాయణ గజపతి (1902 - 1937) 'తనమ భాషాభిలాష నిరంతరాశ్రిత కవిజన కల్పవృక్షంబుగాఁగ....' వర్ధిల్లినట్లు కవులు వర్ణించిరి. విజయనగరము నందలి 'కవిమండలి', 'భారతీతీర్థ' సంస్థ మున్నగునవి అలక నారాయణ గజపతి సమాశ్రయమున విలసిల్లినవి; 'భారతీతీర్థ'కు కులపతులు. ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య. ఆకుండి వెంకటశాస్త్రి వచన రూపమున తెనిఁగించిన కౌటిలీయార్థశాస్త్రము[1] అలక నారాయణ గజపతి కంకితము. కాళిదాసు, షేక్స్పియర్ రచనములనుండి ఆదిభట్ల నారాయణదాసు నవరస ప్రశంసములగు చిఱు ఘట్టముల నేరి 'నవరస తరంగిణి' యను పేర సాంధ్రీకరించిన ఛందఃకృతుల సంపుటి కవితా ప్రీతిగల అలక నారాయణ గజపతికి 'భాషానిరత సుపరిచయ నిర్జిత భారతీ'కి సమర్పితము. కృష్ణాకుమారి. కంకణము. వాసవీ పరిణయము, విమలాదేవి. ఆంధ్రరాష్ట్రము, రామదాస చరిత్ర, పండుగ పట్టము మున్నగు గ్రంథము లను రచించిన భోగరాజు నారాయణమూర్తిగారి (1889 1941) ఆంధ్రవిశ్వ చరిత్రము అలక నారాయణ గజపతికి కృతి భారతీతీర్థ సంస్థాపకప్రస్తావకులగు బుర్రా శేషగిరిరావు (1881-1940) గారి అభిషేక నాటకమను గ్రంథము అలక నారాయణ గజపతి కంకితము యయాతిదేవయానులు ప్రధానపాత్రలుగా శుక్రశాపమునకు తరువాతి కథ యితివృత్తముగా ఎనిమిది రంగములలో రచింపఁబడిన నాటక మిది. శేషగిరిరావుగారి బొబ్బిలి ముట్టడి[3] యను నాటకము అలక నారాయణ గజపతి పవిత్ర స్మృతి చిహ్నముగా ప్రకటితము. ఇందలి భాష వ్యావహారికము. రంగరాయ చరిత్రాది కథాకావ్యములనుండి సందర్భోచితముగా ఎన్నికచేయఁబడిన కొన్ని పద్యములిందు సంధానింపఁబడినవి.

అలక నారాయణ గజపతి సోదరులగు సర్ విజయానంద గజపతి (1905—1965) ఆంధ్ర మహాసభాధ్యక్షులు: కేంద్ర శాసనసభా సభ్యులు: ప్రపంచ ప్రసిద్ధ క్రీడానిపుణులు. తోలేటి వెంకటరెడ్డి రచించిన రాష్ట్రప్రబోధ మను గేయకావ్యము[4] సర్ విజయగారి కంకితము.

## పి. వి. జి. రాజు

అలక నారాయణ గజపతి జ్యేష్ఠపుత్రులగు విజయరామ గజపతి కొంత కాలము ఆంధ్ర ప్రదేశ విద్యాశాఖామాత్యులు. ప్రస్తుతము ఆంధ్ర విశ్వ కళా

1 వేదవ్యాస ముద్రాలయము, విజయనగరము, 1923.
2 వేదవ్యాస ముద్రాక్షరశాల, విజయనగరము, 1922.
3 శ్రీ వేదవ్యాస ప్రెస్. విజయనగరము, 1942.
4 విద్యాప్రెస్, విజయనగరం సిటీ, 1942.

పరిషత్పత్రిక సంచికలు: గంటి సూర్యనారాయణ శాస్త్రిగారి కళింగ విజయనగర చరిత్ర, మామిడి వేంకటరమణయ్యగారి గజపతిరాజుల తెలుఁగు సాహిత్య పోషణము మున్నగు గ్రంథములు వీని సంకేతములు.

## విజయనగర రాజబంధువుల సాహిత్య పోషణము

సంస్థానపాలకులతోపాటు వారి సమీప జ్ఞాతులును, బంధువులును సంస్థాన మర్యాదల ననుసరించి సాగించిన సాహితీ పోషణ చరిత్రము నిట అనుసంధించు టెంతయు సముచితము.

## రేగులవలస పూసపాటివారు

పిన జగన్నాథరాజు శాఖకు చెందినవారు రేగులవలస పూసపాటివారు. పిన జగన్నాథరాజు పౌత్రుఁడగు కొండరాజు '....కళలు గాంచుచు బుధకులమును బోషింప సద్విజ్ఞమణియనఁ జాటుకరుదె వేంకటాచల మాహాత్మ్య విపులకృతిని రచియింప బుధసభఁ జేతఁదాఁటుంచుఁ బలుకఁజెల్లదె యని జనుల్ బ్రస్తుతింపఁ గాంచె శతకీర్తి ఘనరాజు కొండరాజు' (రామకృష్ణార్జున రూప నారాయణీయము, అవతారిక, పు. 8). కొండరాజు రచించిన ఈ వేంకటాచల మాహాత్మ్యము లభ్యము కాలేదు. కొండరాజు ద్వితీయ కుమారుఁడగు కృష్ణభూపాలరాజు రేగులవలస శాఖవారికి మూలపురుషుఁడు. ఇతఁడు తొలుత జయపురమువారి కొలువులో సర్దారుఁడు. పిమ్మట రేగులవలస మొకాసాదారు. కలిదిండి రామరాజ పుత్రికయగు పాపమాంబ యీతని భార్య. వీరి చతుర్థ పుత్రుఁడు భూపాల రాజు సప్త సంతాన ప్రతిష్ఠాపయిత యనియు 'ఇచ్చినాఁడు కవీంద్రుల కీప్సితములు' అనియు విష్ణుభక్తి సుధాకరము పేర్కొనుచున్నది. ఈ భూపాలరాజు భార్య జంపెన అమలరాజు తనయయగు నరసమాంబ.

నరసమాంబా భూపాలరాజుల రెండవ కుమారుఁడే విష్ణుభక్తి సుధాకర పారాశరీయహోరా గ్రంథకర్త. సీతాంబా ఆనందరాజుల కుమారుఁడును, బొబ్బిలియుద్ధ వీరుఁడును అయిన పెదవిజయరామరాజు (1720—1756) విష్ణు భక్తి సుధాకర వ్యాఖ్యకర్త యని కొందఱు వ్రాయుట చింత్యము.*

'భోజసభమాడ్కి నెవ్వని భూరిగోష్ఠి
వెలుఁగు నతఁడు సముంచిత విపులకీర్తి
విష్ణుభక్తి సుధాకర విమల కృతికిఁ
గర్త శ్రీ విజయరామ భూభర్త దనరు'

—రామకృష్ణార్జునరూప నారాయణీయము, అవతారిక పు. 9.

* విజయనగర దర్శిని, పు. 16.

విష్ణుభక్తులగు పన్నిద్దరు ఆళ్వారులలో నొకఁడగు కులశేఖరాళ్వారుల చరిత్ర మిందుఁ జిత్రితము. ఆముక్తమాల్యదా ప్రబంధమునందలి గోదాదేవి గాథను బోలిన దిందలి యితివృత్తము. ప్రాచీనప్రబంధముల ఫక్కిలో నడచిన విష్ణుభక్తి సుధాకర ప్రబంధమునందు విష్ణుచిత్తుని పుత్రి గోదాదేవివలె కులశేఖరుని కూఁతురు నీలాంశజ శ్రీరంగనాథుని పరిణయమయినకథభక్తిముక్తిదాయకముగా వ్యక్తీకరింపఁబడినది. ఇది అయిదాశ్వాసముల ప్రబంధము. శ్రీరామతీర్థ విహారియగు సీతారామునికిది యంకితము.

విజయరామరాజు సంతరించిన మఱియొక గ్రంథము పారాశరీయహోర యను జ్యోతిశ్శాస్త్రసంబంధి రచనము. ఆణివెళ్ళ వెంకటశాస్త్రి కృతమగు సంస్కృతకృతి కిది తెనిఁగింపు, ఏకాశ్వాసపరిమితము. శ్రీరామతీర్థపతికి సీతాపతికి సమర్పితము.

> 'ఇది శ్రీమద్బెజవాడపట్టణ భవానీందీవరాక్షీవరా
> స్పదసంవర్ధిత పూసపాటికుల భూపాలేశపుత్రౌఘ స
> మ్మద విద్వత్ప్రతిభాకన ద్విజయరామక్ష్మాప ప్రోక్త భ
> వ్యదపారాశరహోర సర్వమిల నేకాశ్వాస మింపొందఁగన్.'
>
> —పారాశరీయహోరగ్రంథాంత పద్యము.

ఆనందరాజకుమారుఁడగు పెదవిజయరామరాజు దీని కర్తయని కొందఱు భావించుట చింత్యము.* ఆంధ్రపారాశరీయహోరాకర్తయగు విజయరామరాజు భూపాల రాజపుత్రుఁడని పూర్వోక్తపద్యము సాక్ష్యము. ఈతఁడే విష్ణుభక్తిసుధాకర ప్రబంధకర్త. పెదవిజయరామరాజు ఆనందరాజు కుమారుఁడు.

విష్ణుభక్తిసుధాకర ఆంధ్రపారాశరీయహోరాది గ్రంథ నిర్మాతయగు విజయరామరాజు కుమారుఁడు సీతారామరాజు. ఈ సీతారామరాజు 'నారాధికవిరాణ్మయూరావళికి నీలధారాధరంబు....' (రామకృష్ణార్జునరూప నారాయణీయము, అవతారిక, పు. 9).

## ఓరుగంటి సోమశేఖరకవి

విజయరామరాజు తమ్ముఁడు రామచంద్రరాజు. ఈతని ప్రపౌత్రుఁడును, అచ్యుతాంబా వేంకటపతిరాజ కృష్ణరాజుల పుత్రుఁడును అగు నారాయణరాజును, ఈతని తృతీయపుత్రుఁడగు నరసభూపాలరాజును ఓరుగంటి సోమశేఖరకవి (1818–1903) కి పోషకులు వీరు విజయనగర సమీపముననున్న తాళ్ళవలస వాస్తవ్యులు ; అలమండ, విజయనగరము తాలూకాల కధిపతులు. విషయమిట్లుండ

*విజయనగర సంస్థానము సాహిత్యపోషణము పు. 152 ; తెలుగు విజ్ఞాన సర్వస్వము, సంపుటము 3, పు. 1172 ; నిడుదవోలు వేంకటరావు, తెలుఁగు పారాశరీయహోరపీఠిక, పు. 16.

విజయనగరసంస్థాన పాలకుఁడగు నారాయణగజపతిరాజు (1794–1845) యాస్థానమున ఓరుగంటి సోమశేఖరకవియుండెననియు రామకృష్ణార్జునరూప నారాయణీయత్ర్యర్థికావ్య మా ప్రభువున కంకితమనియు కొందఱు నిర్ణయించుట అవిచారిత రమణీయము.[1] ఈ నిర్ణయమును అవితర్క్యముగ కొందఱంగీకరించుట[2] ప్రామాదికమైనను పూర్వపరిశోధకులపొందిన ప్రమాణబుద్ధి దీనికి హేతువని సరిపెట్టుకొనవలెను. సోమశేఖరకవి ద్రావిడశాఖా బ్రాహ్మణుఁడు. కౌండిన్యగోత్రోద్భవుఁడు. నరసాంబా జోగయార్యుల ప్రథమపుత్రుఁడు. ఇతఁడు మాడుగుల కృష్ణభూపతి ఆస్థానమున కొంతకాలముండి ఆపిమ్మట పూసపాటి నారాయణరాజుగారి నాశ్రయించి తాను రచించిన త్ర్యర్థికావ్యమును 1877 లో నారాయణరాజున కంకితమిచ్చి కృతిపోషకుని పేరుకూడ కావ్యనామమున కలిసివచ్చునట్లుగా రామకృష్ణార్జునరూప నారాయణీయ[3]మని పేరిడెను. రాఘవయాదవపాండవీయ కథలు ముప్పేటగా మూర్తిఁగొనిన కావ్యమిది. ఈ మూఁడింటియందును కథలు నిండు సరసముగా సమర్థముగా నిర్వహింపఁబడినవి.

సోమశేఖరకవి కృత్యంతరమగు నరసభూపాలరాజీయము[4] నారాయణరాజు తృతీయపుత్రుఁడగు నరసభూపాలరాజున కంకితము. నరసభూపాలరాజు '....సంగీత సాహిత్యకృతిపురాణ సకలవిద్యావిశారద శారదానవావతారుండు....' (నరసభూపాల రాజీయము, అవతారిక, పు. 13) అని కీర్తింపఁబడినాఁడు. ఈ నరసభూపాలరాజీయము నరసభూపాలీయమనెడి అలంకారగ్రంథము కాదు. అయిదాశ్వాసములలో పద్యకావ్యమున ప్రబంధపద్ధతిని సంధానితమైన రామాయణగాథ. ప్రథమాశ్వాసమున అవతారికతోడి బాలకాండము, ద్వితీయాశ్వాసమున అయోధ్యాకాండము, తృతీయాశ్వాసమున అరణ్యకాండము, చతుర్థాశ్వాసమున కిష్కింధా సుందరకాండములును, పంచమాశ్వాసమున యుద్ధకాండమును ఇమిడిపోయినవి. రామకృష్ణార్జునరూప నారాయణీయములోని అవతారికయే చిన్నచిన్న మార్పులతో నరసభూపాలరాజీయమున నవతరించినది. ఈ రెండింటికిని తండ్రికొడుకులు క్రమముగా కృతిభర్తలు. వీరి యొకఁడే గాన కృతిపతి వంశావతార వర్ణనము నభేదము. సోమశేఖరకవి రచించిన నరసభూపాలశతకము నరసభూపాలరాజునకే అంకితము. ప్రభావతీపరిణయమను శృంగార ప్రబంధము, హేలావతీపరిణయ మను మూఁడాశ్వాసముల ప్రబంధ

1 విజయనగరదర్శిని, పు. 19.

2 గజపతిరాజుల తెలుఁగు సాహిత్యపోషణము, పు. 88.

3 శారదాముకుట ముద్రాక్షరశాల, విశాఖపట్టణము, 1895.

4 కొటికలపూడి సోమశేఖరకవిప్రణీతమగు నరసభూపాలరాజీయమని ఆంధ్రకవితరంగిణి, సంపుటము 8, పు. 42.

మును. తత్త్వాదర్శమను వేదాంత గ్రంథము, పద్యరూప బాలవ్యాకరణము మరి కృత్యంతరములు.

## రేగ—కొత్తాము పూసపాటివారు

పూసపాటి పెదజగన్నాథరాజు మొదటి కుమారుఁడు కృష్ణమరాజు. ఇతని సంతతియే విజయనగరసంస్థాన పాలకుల వంశము. రెండవ కుమారుఁడు రామరాజు. ఈ రామరాజు ద్వితీయపుత్రుఁడగు కృష్ణమరాజు రేగపూసపాటివారి శాఖ కాద్యుఁడు. ఆదిత్యరాజు, వెంకటపతిరాజు, కృష్ణమరాజు, నరసింహరాజు, కుమారరాజు క్రమముగా ఆకోవలోనివారు. విజయనగర సంస్థాన పాలకులకు రాజ్యఖడ్గముల వలె భుజములుగానుండి పేరు గడించినవారు. కుమారరాజుగారు విజయరామగజపతి (1815-1879) గారివద్ద అమీనుగా నుండిరి. కుమారరాజుగారి హయామునందే వీరు రేగను వదలి కొత్తాము గ్రామమునఁ బ్రవేశించిరి. వీరి అయిదుగురు కుమారులలో రెండవవారగు నరసింహరాజు 'దప్పుల దర్పంబులొప్ప కొత్తామునేలుబడిచేసి'నవారు. వీరి కుమారులు కుమార వెంకటపతిరాజు (1880—1940) విజయరామగజపతి (1904—1922) తోడి దావాలో నెగ్గినవారు. వీరు విశాఖపట్టణము జిల్లాబోర్డు అధ్యక్షులు. రెండుతడవలు మదరాసు శాసనసభాసభ్యులు. 'మునుటమే లోటుగా మండలంబంతయుఁ బాలించుచుండిన పార్థివేంద్రుఁ' డనియు 'ఆశ్రయించిన వారి కర్థినిచ్చుటెగాని పొమ్మన లేదనని సత్పుణ్యమూర్తి' యనియు వీరినిగూర్చిన కవుల స్తోత్రపాఠములు. దుప్పూరి జగన్నాథశర్మగారి 'పూసపాటివారి వంశాను చరితము'. ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణకవిగారి 'రాజపుత్ర తేజఃపుంజము' అను నాటకము, తిరికొండల వేంకటసత్యనారాయణమూర్తిగారి విశాఖమండల చరిత్రము కుమార వెంకటపతిరాజుగారు అంకితమునొందిన కొన్ని కృతులు.

## డెంకాడ పూసపాటివారు

వీరు కోటభోగాపురము నేలిన రఘునాథరాజు కుమారుఁడగు చినకొండ రాజు సంతతికి చెందినవారు. ఏతద్వంశాభరణమగు సూర్యనారాయణరాజుగారు విజయరామరాజీయమను గ్రంథమును ప్రచురింపఁజేసిరి. దుప్పూరి జగన్నాథ శర్మగారి పూసపాటి వంశానుచరితమను గ్రంథమునకు వీరే పోషకులు. ఇది సింహనగేశ్వరునకు పూసపాటి సమాస్థానభూమిపతికి కృతి.

## బుద్ధరాజువారు

నారాయణగజపతి (1794—1845) అపార కృపారసంబున గజాశ్వాందోళికాది నిఖిలైశ్వర్యంబు లనుభవింపుచు సుఖంబుననున్న తద్బంధువర్గంబు

నంటు బుద్ధరాజువారి వంశము విస్తారమయినది. మంగళాపురపరాధిపతియయి నిలిచె, కొండపలస, పాలకొండ జమీలనేలిన అనంతరాజు వీరి మూలపురుషుఁడు. ఇతని కోవలో పద్మనాభరాజు ముఖ్యుఁడు. ఇతని భార్య ఓబ్రాంబిక. వీరి తనయుఁడు చినపద్మరాజు. ఇతని పుత్రుఁడు రామరాజు. రామరాజు తనయుఁడు నృసింహరాజు. ఇతనిభార్య తిరుమలరాజు రామరాజపుత్రికయగు సోమమాంబ. వీరి తనయుఁడు రామరాజు. కానక కన్నకొడుకగు రామరాజు చనిపోఁగా వ్యాకులస్వాంతుఁడయిన నరసింహరాజు నోదార్చుట కొక యోగీంద్రుఁడు చేసిన వైరాగ్యబోధను కథావస్తువుగా స్వీకరించి తుమురాద పానసదాసి రచించిన 'వైరాగ్య దర్పణము' నరసింహరాజున కంకితము. ఇది అముద్రితము.* ఇందలి యొక పద్యము.

'తనయులు లేనివాఁడు ధనధాన్యవిభూషణ వాహనస్త్రీ వాం
ఛనములకో సుఖ్యసంపదలు చాలఁగఁగల్గియు సాంద్రపుష్పప
త్ర నిచయభాసమానమయి వాసనలేని మహీరుహంబు చా
డ్పున ధరనుండు గావునను బుత్రులకన్నను భాగ్యమున్నదే'

పూసపాటిరేగ గ్రామవాసియును పద్మనాభరాజు పుత్రుఁడును నగు బుద్ధరాజు వేంకటపతిరాజు శ్రీరామచంద్రశతకకర్త. 'రామచంద్ర' యను మకుటముగల నూటపదియారు సీసపద్యము లీ శతకమునఁగలవు.†

## కాకర్లపూడివారు

విజయనగర సంస్థానమునందలి అలమంద వీరి నివాసస్థానము. వీరు వసిష్ఠగోత్రజులు. విజయనగరపాలకుల కన్నదమ్ముల వరుసవారు. వెంకటపతిరాజు వీరి పూర్వుఁడు. నారాయణగజపతి (1794—1845) అత్తగారును, జంపెన పద్మనాభరాజు భార్యయు నగు బంగారయ్యమ్మ వీరింటి యాఁడుఁబడుచు. ఈమె తనయయగు లక్ష్మీనరసమాంబ నారాయణగజపతి భార్య. పట్రమాని అన్నయ్యపండితుఁడు రచించిన సీతారామరాజాభ్యుదయ చంపూనాటకమను సంస్కృత కావ్యము కాకర్లపూడి సీతారామరాజు ప్రేరణమున విరచితము. కర్త శ్రీరామపురాగ్రహార నివాసి. సుబ్రహ్మణ్య తనూభవుఁడు. పెద్దింటి తిరుమలాచార్యుల సతీర్థ్యుఁడు.

## గొట్టిముక్కలవారు

వీరు రాజేరు, పాంద్రంగి, కొండపల్లి పాలకులు. వీరికి రేగులవలస

* పరిశీలించిన తాళపత్రప్రతి బొబ్బిలిపండితులు వేదులసీతారామస్వామిశాస్త్రిగారిది; నల మాఘ, శు 5 వరకు దుర్మార్గి అచ్చన్న వ్రాసినది.

† శ్రీరామానుజ ముద్రాక్షరశాల, విజయనగరము, 1928.

20. Ananda Gajapati, Vizianagaram Treaty of November 15th, 1758, Vest & Co., Madras, 1894.

21. Imperial Gazetteer of India, Vol. XXIV, New Edition, Oxford, 1908.

22. V. L. Sastry and M. Venkatarangaiah, Encyclopaedia of the Madras Presidency and the Adjacent States, pp. 376–396.

23. B. Seshagiri Rao, Antiquities of Vizianagaram Raj, The Maharajah's College Magazine, 1921 October, 1922 January–July.

24. B. Narayanamurty, Kalinga in the First Year of the 19th Century A.D., The Maharajah's College Magazine, 1922 April, pp. 105–109.

25. Report of the Madras Estates Land Act Committee, Part II, Madras, 1938.

26. K. Eswara Dutt and K. V. Gopalaratnam, Vizzy Commemoration Souvenir, Vishal Press, New Delhi, 1966.

## సంస్థానచరిత్రము

ఈ సంస్థాన పాలకులు పద్మనాయకకులాసందానుసంధానులు. కాకతి గణపతి చక్రవర్తిని గొలిచిన డెబ్బదియేడు గోత్రముల వెలమవారలలో వీరిది రేచెర్లగోత్రము.[1] వీరి పూర్వులు తెలంగాణమునందలి నల్లగొండ మండలము లోని అమనగల్లు, పిల్లలమఱ్ఱి మొదలగు సీమలలో నివసించినవారు. వీరి మూలపురుషుఁడు బేతిరెడ్డి. బేతాళనాయఁడు అను పర్యాయ వ్యవహార నామములుగల చెవిరెడ్డి యని చరిత్రకారుల యుద్దేశము. చెవిరెడ్డికి పూర్వము పదియవతరమువాఁడు హేమాద్రిరెడ్డి. ఇతని కుమారుఁడు విక్రమరెడ్డి. విక్రమ రెడ్డి తరువాత వీరభద్రారెడ్డి, మహీపతిరెడ్డి, ముక్కంటిరెడ్డి, రామలింగారెడ్డి, ముంజరాజు, కాటరాజు, రామరాజు క్రమముగ ఆయాతరములకు చెందినవారు. రామరాజు కుమారుఁడు చెవిరెడ్డియఁట.[3]

చెవిరెడ్డికి దామానాయఁడు, ప్రసాదిత్యుఁడు, రుద్రుఁడునని త్రేతాగ్నులఁ బోలిన కుమారులు మువ్వురు. వీరు మువ్వురును ముఖ్యముగ నాయుధోప జీవులు. తండ్రియగు చెవిరెడ్డి యచ్చముగా పొలము దున్నిన కాపుఁడు. ఈయన అమనగల్లులోని యొకరైతు. నాఁగటిచాలులో తొమ్మిదిలక్షల నిధి దొరకుటచే చెవిరెడ్డి భాగ్యవంతుఁ డయినట్లు పరంపరాయాతప్రతీతి. నిక్షేప స్థానము నియమము మేరకు నరబలి నొసఁగినఁగాని ధనలక్ష్మి పలుకదు. రేచఁడనువాఁ డీతని కొలువులోనివాఁడు; ప్రభుసేవలో పండినబంటు. నరబలి విషయముగా తన యజమాని సతమత మగుచుండఁగా రేచఁడు తానే బలిపశువు నయ్యెదనని ప్రభువునకు విన్నవించినాఁడు. ఆ నిధిలో తనకు పంపు పెట్ట నక్కఱలేదనియు, తనపేరుమాత్రము వారి యింటిపేరుగాఁ బెట్టుకొనినఁ జాలుననియు, చెవిరెడ్డి సంతతియందు జరుగు నే పెండ్లియయినను మొదట రేచనిసంతతివారిలో నొకరికి పెండ్లిచేసినపిమ్మట జరుగవలెననియు రేచఁడు కోరినాఁడు. ఇవి హిరణ్యాక్షవరములు కావు. రేచని స్వామిభక్తికి, స్వచ్ఛంద సేవకు, త్యాగబుద్ధికి చెవిరెడ్డి చాల సంతసించి వాఁడు కోరినటుల వాగ్దానము చేసి రేచని బలియిచ్చి నిక్షేపమును బడసెనఁట.

ఆపిమ్మట చెవిరెడ్డి పిల్లలమఱ్ఱిలో స్థిరపడి ఓరుగంటి పాలకుల మన్నన

[1] 'కోరి డెబ్బదియేకుఁ గోత్రంబులకు శిరఃకోటీరమై పూజ్య గోత్రమట్టి మేటి రేచెర్లగోత్రము....' (శిశుపాలవధ మహాకావ్యము, అవతారిక, 25). 'సప్తసప్తతి గోత్రము' లని గోపీనాథ రామాయణ పీఠిక.

[2] 'వెలయఁ బిల్లలమఱ్ఱి బేతాళనాయఁడే ఘనవంశమున కాదికర్తయయ్యె' (శిశుపాల వధ).

[3] అనుమనగంటి గోత్రాన్వయుఁడగు పోలిరెడ్డి సుతుఁడు చెవిరెడ్డియని వెలుగోటివారి వంశావళి, పు. 1.

లకు పాత్రుఁడై 'డాలు చమారంబు తాళిచేతల్లాను గజహయంబులతోడ' పెక్కు జాగీరులను పొంది ప్రాముఖ్యమును వచ్చెనఁట. ఇతనికి బేతాళుఁడు ప్రత్యక్ష మగుచుండెననియు అందువలననే చెవిరెడ్డి పట్టినది బంగారమయి, ముట్టినది ముత్యమయి యభ్యుదయము గాంచెనని ప్రజలు కథలుకట్టిరి.[1] ఇతని సంతతికి చెందినవారే డెబ్బదియేడు గోత్రముల వెలమదొరలఁట. ఇందు కథయెంతో, కల్పనమెంతో తేరీజు కట్టలేము.

రైతుబిడ్డలు చెవిరెడ్డి కుమారులు దామానాయుఁడు రాములు నాఁగలిని గాదని కత్తిని చేతఁబట్టి రణరంగమున నాఁడిన రౌద్రసింగములు. వీ రోరుగంటి కాకతీయచక్రవర్తుల శత్రువులను గెలిచి, రాజ్యలాభమును బడసి, కాకతీయ రాజ్యస్థాపనాచార్యులను సార్థక బిరుదమును బొందిరి. చెవిరెడ్డి కయిదవతరము వాఁడు సింగమనాయఁడు. ఇతని కుమారులు అనపోతమాదనలు రాచకొండ దేవరకొండల నేలినవారు. వీరికి నాల్గవతరమువాఁడు రసార్ణవసుధాకరకర్త యగు సర్వజ్ఞసింగభూపాలుఁడు.[2]

చెవిరెడ్డికి తొమ్మిదవతరమువాఁడగు ధర్మారావు పిఠాపుర పాలకులకును, పంద్రెండవతరమువాఁడగు పిల్లమారానాయఁడు మైలవరము సూరానేని వారికిని, పదుమూఁడవతరమువాఁడగు మాదానాయఁడు బొబ్బిలివారికిని మూలపురుషులు.

'అల డెబ్బదేడు గోత్రం
బులవారికి నాదిపీఠముగఁ జెన్నలరం
బులనుండి గౌరవంబునఁ
బొలుపరు వేంకటగిరి ప్రభువులు ప్రసిద్ధిన్'

—బొబ్బిలివారి వంశావళి, 14

పదునైదవ తరమువాఁడు పెదరాయఁడు లేక నిర్వాణ రాయప్పనాయఁడు.[3] వెలుగోటిని జయించినవాఁ డితఁడు. ఇతని కుమారుఁడగు లింగప్పయే బొబ్బిలి పాలకులకు మూలపురుషుఁ డందురు[4] నిర్వాణ రాయప్పనాయని

[1] రాజాకృష్ణ సంవాదము. ప్రథమాశ్వాసము, పు. 95.

[2] అనపోతనాయని జ్యేష్ఠపుత్రుఁడగు పెదసింగమనాయఁడే రసార్ణవసుధాకరకర్త యని వెలుగోటివారి వంశచరిత్రము, పు. 64.

[3] 'అలవేంకటగిరిపుర రాజులలోఁ బదునేనవ పురుషుండగుచు మహిన్ బొలిచెఁ బెదరాయఁ డాతఁడె వెలసెను నిర్వాణరాయ విభుఁడనుపేరన్' (రంగా. I—114); ఇరువదియవ తరమువాఁడయిన పెదయాచమనాయఁడే పెదరాయుఁడనియు ఇతఁడే బొబ్బిలి పాలకులకు మూలపురుషుఁడనియు వెలుగోటివారి వంశచరిత్రము, పుటలు 108, 109; Encyclopaedia, pp. 435, 436; 'మాధవరాయని పుత్త్రులలోఁ గొందఱు వెలుగోడు నివాసులయి ఆ పిమ్మట వేంకటగిరి సంస్థాన ప్రభువులయి వేంకటగిరివారలయిరి'—ఓలేటి భాస్కరరామమూర్తి, పీఠికాపుర సంస్థానము, పు. 7.

[4] The Ruling Chiefs, Nobles & Zamindars of India, p. 490.

వెలసిన వాఁడితఁడే కాఁబోవు.† ఇతని కుమారుఁడు బంగారు యాచమ నాయఁడు (1775-1756) నిజామునకు మిత్రుఁడు. 'అతని పత్నులు పాపమాంబ కృష్ణమాంబ నాథుతోఁ గూడ సహగమనంబుజేసి సురపురికై వెలసి చుప్పటి లోన వెలయు తమ్మంత్ర్యులకు నిలుపేర్పులగుచు' (శిశుపాలవధ, 1-33) బంగారు యాచమ అపుత్రకుఁడయినందున సమీపజ్ఞాతులగు ఆర్వేలపాటివారి చిన్నవానిని పత్తుతెచ్చెను. ఈ దత్తపుత్రుఁడు ఇరువదియైదవ తరమువాఁడగు కుమార యాచమ నాయఁడు (1776-1804). ఇతని కాలమునందే వెంకటగిరి పాలకులు ఇంగ్లీషు కంపెనీ ప్రభుత్వమునకు సేనలతో తోడ్పడుటకు బదులుగ వారి కిమ్మత్తుక్రింద అనుమానమగు పేష్కషును నిర్ణయించి‡ పరాణము పటాలపు సిబ్బందిని తొలఁగించుట జరిగినది. 1802 ఆగష్టు 24 వ తేదీన వెంకటగిరి పాలకులకు సన్నద్-ఇ-మిల్కియత్-ఇస్తిమరార్* ప్రసాదింపఁబడినది.

కుమార యాచమనాయనిగారికి సంతతి లేనందున తమ సోదరుని ఆర్వేలపాటి కొండమనాయని కుమారుని స్వీకారముచేసికొని తమ తండ్రిగారి పేరిట 1804 లో పట్టముకట్టెను. ఈ దత్తుఁడగు బంగారు యాచమనాయఁడు (1804-1845) ఇరువదియారవ తరమువాఁడు సర్ థామస్ మన్రోను మెప్పించి తనపూర్వుల కులక్రమాగతములగు బిరుదములను సంపాదించినవాఁడు. జగ్గాపు నివాసులు శ్రీరామజోగపల్లివారి కన్య అమ్మక్క వీరి భార్య. వీరి ద్వితీయ పుత్రులు సర్వజ్ఞకుమార యాచేంద్ర బహద్దరు (1831—1892) తండ్రి మరణ కాలమునాఁటికి పదునాలుగేండ్లవాఁడగుటచే 1845-1848 మధ్య సంస్థానము కోర్ట్ ఆఫ్ వార్డ్సువారి పర్యవేక్షణమున నుండెను. యుక్తవయస్సు వచ్చిన పిమ్మట 1848 లో జమీందారీ పాలనమును స్వీకరించి 1878 లో సి.యస్.ఐ. బిరుదమును పొందిరి. వీరి భార్య వెల్లంకి రామరాయల పుత్రిక లక్ష్మమ్మగారు. ఈ దంపతులకు రాజగోపాలకృష్ణయాచేంద్ర (1857-1916), రామకృష్ణయాచేంద్ర, రంగమన్నారుకృష్ణ యాచేంద్ర (1862—1926), నవనీతకృష్ణ యాచేంద్ర, ముద్దుకృష్ణ యాచేంద్ర, వెంకటకృష్ణ యాచేంద్ర, వేణుగోపాలకృష్ణ యాచేంద్ర యని ఏడుగురు కుమారులను, లక్ష్మివెంకయ్యమ్మ, రాజ్యలక్ష్మమ్మ యని ఇరువురు పుత్రికలను కలిగిరి.

వీరిలో జ్యేష్ఠులు రాజగోపాలకృష్ణయాచేంద్ర తండ్రిచేతనే వెంకటగిరికి 1879 మార్చిలో పట్టాభిషిక్తులు కావింపఁబడిరి. ఇతనిది ఇరువదియెనిమిదవ

† కస్తూరి రంగకవి, ఆనందరంగరాట్ఛందము, పీఠిక, 114.

‡ C. U. Aitchison, A Collection of Treaties, Engagements and Sannads, Vol. VIII, Calcutta, 1892, p. 53.

* 'బాణరాజులచేత నొప్పగాఁ బడసి రాజ్యమునకు ఇస్తిమిరారిసనదుఁ బొందె.... అతఁడు సామాన్యుఁడె కుమార యాచవిభుఁడు' (శిశుపాల వధ, అవతారిక, 35).

తరము. రాజా సర్వజ్ఞకుమార యాచేంద్రుల రెండవ కుమారులగు రామకృష్ణయాచేంద్రులు* పిఠాపురము రాజా రావు గంగాధర రామరాయలచేత 1873 లో దత్తునగా స్వీకరింపఁబడి యా పిమ్మట పిఠాపురము రాజాగారికి వేంకటమహీపతి సూర్యరావు ఔరసులుగా జన్మించుటచే దత్తత చెల్లనందున వెంకటగిరికి తిరిగి వచ్చిరి. మూఁడవ కుమారులగు రంగమన్నారుకృష్ణ యాచేంద్రులు 1872 లో బొబ్బిలికి దత్తుఁడు. వీరే మహారాజా సర్ రావు వేంకట శ్వేతాచలపతి రంగారావు బహద్దరుగా సుప్రసిద్ధులు. నాల్గవ కుమారులు నవనీతకృష్ణయాచేంద్రులు 1877 లో జటప్రోలు రాజాగారికి దత్తులయి రాజా సురభివేంకటలక్ష్మరాయ బహద్దరు నామమున ప్రఖ్యాతులయిరి. లక్ష్మీవెంకయ్యమ్మ సోమవారపుపేట వాస్తవ్యులు జమీందారు చెలికాని వెంకట గోపాలరాయనింగారి భార్య. రెండవ పుత్రిక రాజ్యలక్ష్మమ్మ తిరుపాచూరు జమీందారు ఇనుగంటి వెంకటరమణారాయనింగారి భార్య.†

వెంకటగిరి రాజా రాజగోపాలకృష్ణ యాచేంద్రులు రెండు తడవలు చెన్నపురి లెజిస్లేటివ్ కౌన్సిలులో సభ్యులు. 1888 లో కె.సి.ఐ.ఇ., 1910 లో మహారాజా, 1915 లో జి.సి.ఐ.ఇ. బిరుదాంచితులు. వీరి కుమారులు ఇరువది తొమ్మిదవ తరమునకు చెందిన గోవిందకృష్ణ యాచేంద్రులు 1917 లో పట్టమునకు వచ్చిరి. వీరు సర్ బిరుదాంకితులు. ఎర్నగూడెము జమీందారులు కావ్యకళానిధి చెలికాని లచ్చారావుగారి పినతండ్రియగు భాస్కరరాయనింగారి పుత్రికయును, సూర్యరాయనింగారి సోదరియును నగు రత్నమాంబ వీరిభార్య. గోవిందకృష్ణ యాచేంద్రుల తరువాత వీరి కుమారులు సర్వజ్ఞకుమారకృష్ణ యాచేంద్రులు జమీని పాలించిరి. వీరు ముప్పదియవ తరమువారు. 1936 దాఁక వీరు నెల్లూరు జిల్లాబోర్డు అధ్యక్షులుగా నుండి ప్రజోపయోగకర కార్యములు పెక్కింటిని గావించిరఁట. వీరి కనిష్ఠసోదరులు ప్రద్యుమ్న కృష్ణయాచేంద్రులు కోలంక—వీరవరము ఎస్టేటులకు దత్తులయియుండిరి. ఆతరువాత వెంకటగిరి సంస్థానము తక్కిన జమీందారీలతోపాటు ఆంధ్రరాష్ట్రమున అంతర్లీనమైనది.

## సాహిత్య పోషణము

వెంకటగిరి విద్యల కాటపట్టు. ఈ ప్రభువులకు తొలుతనుండియు పండితపోషణాసక్తి, కవిజనాదరణ సత్కరణాసక్తి నైరంతరీవిలాసము. విక్రమక్రమముతోపాటు వితరణ గుణమును వెంకటగిరివారికి వెన్నతోఁ

* వీరి పుత్రులు వెంకటగిరి సంస్థానమునందంతర్భాగమగు రాజమహలు ఎస్టేటుకు దత్తులు; తిరుపాచూరు జమీందారుల అల్లురు.

† వాజపేయయాజుల రామసుబ్బారాయఁడు, రాజా వేంకటకృష్ణారావు బహద్దరువారి జీవితము, పు. 1.

బెట్టిన విద్యలు. వెంకటగిరివారి పూర్వపురుషుఁడయిన 'సర్వజ్ఞ సింగయ జన
పతి యెల్లవిద్యలనేర్చి తనపేరు సార్థకముగఁ బండితకోటిచేఁ బలు కవీంద్రుల
చేతఁ బరివేష్టితుండయి ప్రౌఢిమెఱయ విద్యావినోదియై హృద్యమైన రసార్ణవ
సుధాకరంబనఁ బరగు గ్రంథము రచించె సంస్కృతమునఁ బండితుండని
కవివరుండనియును గాంచెఁగీర్తి....' (రంగా. 1—113).

'మతినభ్యసింప వచ్చును
బ్రతిలేదన సకలకళలు ; రానివిరెంతే
యతిదుర్లభములు విక్రమ
వితరణములు పిన్నకొండవిభు రాయనృపా !'*

'ఆస్థానంబున సుకవులు
స్వస్థానము భాషయందు సత్కావ్యములం
బాస్థయు నీవేంకటగిరి
శ్రీస్థానాధిపతికొప్పుఁ జెలువంబగుచున్.'†

అను ప్రశంసలు వీరి ప్రవర్తనమునకు తగినట్టివి.

## పూర్వపాలకుల కృషి

వెంకటగిరి సంస్థానోదయమునకు ఉషోరేఖలువిరిసిన తొలిగడియల
యందే సాహిత్యజ్యోతిరేఖలును యౌగపద్యముగా వెల్లివిరిసినవి. వెలుగోటి
శాసనాంకుఁడును, వెంకటగిరివారి మూలపురుషుఁడును నైన నిర్వాణ రాయప్ప
నాయఁడు కవిపండిత పోషకుఁ డయినట్లు '....రాయభూజాని వదాన్యశేఖరుఁడు
సన్నుత కంచురకుండలద్వయీ మానిత సద్బుధేంద్రుఁడు....' (భానుమతీ
పరిణయము, అవతారిక) అనియును, '....సుకవి రాజమురుస్మణి... ' (వెలు
గోటివారివంశావళి, 293) యగు రాయప్ప '....కొలువెల్లన్ గవిగాయకావళి....'
(పైది, 189) తో నిండియుండెడిదనియు స్పష్టపడుచున్నది.

'శ్రీకాంతుని నిజదాసుని
బ్రాకటముగు సింగవిభుని రాయపజయమున్
శ్రీకరముగఁ గవిమల్లన
వైకుంఠారోహణంబు వరుస రచించెన్' —పైది, 218.

మహానందికి పడమట జరిగిన శత్రురాజులతోడి భయంకర సమరమున
జయలక్ష్మి నాకర్షించియు వీరస్వర్గము నలంకరించిన నిర్వాణ రాయప్పనాయని
విజయగాథను వర్ణించిన మీఁది పద్యమునందలి మల్లనకవి గోత్రాదికము లింకను

* వెలుగోటివారి వంశావళి, 292.

† అముద్రితగ్రంథ చింతామణి, 1887 ఏప్రిల్, సంపుటము 2, సంచిక 11,
పుట 14.

నిర్ణీతము కావలసియున్నవి. రాయప్ప '....బ్రాహ్మణులకు నగ్రహారంబు లొస
గంచె నడిగినట్లు....' (పైది, 191).

రాయప్ప మూఁడవ కుమారుఁడగు కుమార తిమ్మానాయఁడు వెలుగోటి
పాలకుఁడు '....మేల్గదియఁగ నగ్రహారములు భూసురోత్తములకిచ్చిన నెఱ
వాత' (పైది. 224). కుమార తిమ్మానాయని పౌత్రుఁడును, గని తిమ్మానాయని
రెండవపుత్రుఁడును నగు నాయనప్ప '....కవులు విద్వాంసులు గణితజ్ఞు లొక
పంక...ఘటనట గాయక భామినులొకపంక సుచితజ్ఞులగు వైద్యులొకపంకి....
బలసికొలువ మహిని కోభిల్లి నాస్థాన మంటపమున....' (పైది, 252) కొలువు
దీర్చెవాఁడఁట. గని తిమ్మానాయని తృతీయపుత్రుని పౌత్రుఁడగు చెన్నప్ప
నాయఁడు '....సకల పాండిత్యంబు సంగ్రహించిన....' (పైది, 267) వాఁడు.

వెలుగోటివారిలో పదునేడవ తరమువాఁడయిన పినకొండప నాయఁడు
'సకలార్థినిలయ విబుధద్రుమము' (పైది, 270) ఈయనకు తిమ్మాంబ,
అక్కమాంబ, సింగాంబ యని ముగ్గురు భార్యలు. తిమ్మాంబయందు కుమార
తిమ్మప్ప, కోనప్ప, పెదకొండప్ప, రాయప్ప యను నలుగురును, అక్కమాంబ
యందు రంగప్ప, యాచమ, తిమ్మప్ప యను ముగ్గురును, సింగాంబయందు
పెదతిమ్మ, పినతిమ్మ, కొండప్ప*యను ముగ్గురును మొత్తము పదిమంది
పుత్రులు. తిమ్మాంబ కడసారపుఁ గుమారుఁడగు రాయప్ప '....[illegible]
రామార్పిత రాజ్యసుఖనిరతుఁడయి యొప్పు....' (పైది, 281) '....[illegible]
సక్షీణ లక్షణయుక్తి సుకృతిసంతతులు వెలయనిచ్చె విద్వత్కవీంద్రుల కెల్ల
నగ్రహారములు పేరుగల యగ్రహారములును....' (పైది, 285) 'సరస
సత్కవి సద్గోష్ఠి సార్వభౌముఁ' డన్నది యీతని బిరుదముగా నుండినట్లును
సమస్యాపూరణాదికము లీతనికి ప్రీతికరము లయినట్లును ఊహింప వీలగు
చున్నది (పైది, 287, 288).

పినకొండపనాయని జ్యేష్ఠపుత్రుఁడగు కుమారతిమ్మానాయనికి అక్కమ
దేవికిఁ గలిగిన పుత్రుఁడు తిరుపతినాయఁడు. దామెర ధర్మనృపాలుని కొమారిత
ధర్మాంబ తిరుపతినాయని సతి. వీరి కుమారుఁడగు తిమ్మనృపాలుఁడు మంజరి,
తారావళి, ఉదాహరణము మొదలగు కావ్యభేదములలో సంధానింపఁబడిన ఏవో
కొన్ని మహాప్రబంధములను గృతి నందినట్లు —

'దేవ మహీజమందె నొకదిక్కున మంజరి, చంద్రుఁడందెఁ దా
రావళి, వార్షకాంబుధరమందె నుదాహరణంబు వీతసం
భావన మింటివార్తలవి; మన్నన నీవలె నెవ్వరంది రెం
తే వసుధాస్థలిం దిరుపతిప్రభు తిమ్మ! మహాప్రబంధముల్' (పైది,
322) అను పద్యమునందలి యింగితమును వ్యంగ్యవైభవసంగతి సంగిరింప

*కొండధీరుఁడని భానుమతీపరిణయ కృత్యవతరణిక.

పలసియున్నది. ఈ తిమ్మనృపాలుని తమ్ముఁడగు తిరుపతినేని రంగప్ప '...సకల సుకవీంద్ర గాయక సరస విబుధరక్ష దక్షిణ విమలాంతరంగుఁడు....' (పైడి, 323). పెదకొండపనాయని పౌత్రుఁడగు వెంకటపతి సైతము 'బుధజనాధారుఁడు' (పైడి, 348) గా పరికీర్తితుఁడు.

పెదయాచమనాయని కవితాపోషణమునుగూర్చి మనకేమియుఁ దెలియదు గాని —

'ధరనేలు నీ ప్రభుత్వము యయాతి చరిత్ర - పరకీర్తి రాజశేఖర చరిత్ర
వెలయు నీ శౌర్యంబు విక్రమార్క చరిత్ర - ఘనమైన నీతి యా మను చరిత్ర
చూడ నీ హరిభక్తి రుక్మాంగద చరిత్ర - పొసఁగు నీ నిలయంబు వసు చరిత్ర
నిత్యంబు నీ బుద్ధి సత్యధర్మ చరిత్ర - వెలఁగు నీ రూపంబు నల చరిత్ర
యిన్ని చరితలు నీయందె యున్న విపుడు....'

అని యొక కవి పెదయాచమపై చమత్కారముగాఁ గావించిన యీ కైవారపు గమనచరితనము పరిశీలనార్హము. *

పినకొండపనాయని ఆఱవ కుమారుఁడగు యాచమనాయని మనుమఁడును, వెంకటాంబా కస్తూరి రంగప్పల తృతీయ పుత్రుఁడును పెదయాచమనాయని తమ్ముఁడును నగు సర్వజ్ఞసింగమనాయఁడు '.... గీతికాసాహిత్యరస విశాలుఁడు....' (పైడి, 402). పై పినకొండపనాయని తొమ్మిదవ పుత్రుఁడయిన చిన తిమ్మానాయని పౌత్రుఁడును, చెన్నభూపతి పుత్రుఁడునునగు మాలెకొండప నాయఁడు '....కొల్లలుగాఁగ సత్కవులఁ గోరిన కోరిక లిచ్చెడి....' (పైడి, 438) కవిరాజసికుఁడఁట.

## వేటూరి† రంగరాజు

తిమ్మాంబా పినకొండపల చతుర్థ పుత్రుఁడు రాయపనాయఁడు. ఈ రాయపనాయని పుత్రుఁడగు వెంకటాద్రియే వెంకటగిరి నిర్మాత. లింగమాంబికా రాయపల పౌత్రుఁడును వెంకటాద్రి పుత్రుఁడును నగు రాయమహేంద్రుఁడు వేటూరి రంగరాజ కృతమగు భానుమతీ పరిణయమునకు కృతిపతి. 'వెలుగోటి

* వెలుగోటివారి వంశచరిత్రము, పుటలు 109, 110.

† ఇంటిపేరు వెంటూరి వారని బ్రౌణ్యము, 1852 ప్రతి, పీఠి., పు. viii ; ఆంధ్ర కవుల చరిత్రము, ద్వి. భా., పు. 240 ; ఆంధ్రవాఙ్మయ సంగ్రహము, పు. 196 ; ఆంధ్ర విజ్ఞానము, పు. 275 ; వేటూరి వారని నెల్లూరు మాన్యువలు, పు. 699 ; వెట్టూరి వారని శబ్దరత్నాకరము, ప్రథమ ముద్రణ పీఠిక, పు. 25 ; వేటూరు వారని వెలుగోటివారి వంశ చరిత్రము, పు. 95 ; వేటూరివారనుటయే యుక్తమని ఆంధ్రకవి తరంగిణి, సంపుటము 11, పుటలు 172, 173 ; ఆంధ్రకవి సప్తశతి, పు. 178.

వేంకటేంద్రుని కలషు గుణాలంబ చెన్నమాంబా మణికిన్ గలిగిన.......' (భానుమతీ పరిణయ కృత్యవతారిక) ఈ రాయపనాయుడు 'బుధానీకంబుమైత్రి' (వెలుగోటివారి వంశావళి, 372) సమాకర్షించి '....శేష వాల్మీకి రచిత విశేష విలాస మాలించు రాజ వేశ్యాభుజంగుఁ....' (పైది, 376) డయి '....బహు కళావైభవములఁ బ్రొద్దిఁ బొలింప....' (పైది, 378) చు వెలుగోటి కులదీప ముగా, సర్వజ్ఞ సింగమనేని సత్సంతాన రూపముగా వెలసినవాఁడు రాయప్ప గాన విద్యానిధి యనియు, శ్రీ రంగాచార్య పురావి మహాగ్రహార విశేష పరితోషిత వైష్ణవ కుటుంబ సహస్ర సంఖ్యాకుఁడనియు భానుమతీ పరిణయ కృత్యవ తరణిక పేర్కొనినది. రాయప్ప భార్య రాగమాంబ. ఈ రాజ దంపతులకు రంగప్ప, కుమారరంగప్ప అని ఇరువురు పుత్రులు. జ్యేష్ఠుఁడగు రంగప్ప 'ధీర వైష్ణవ సమృద్ధిని జాల వెలయించు నిత్య సూరి కదంబ నియమవృత్తి ...' (పైది. పు. 383).

భానుమతీ పరిణయ కర్త రేటూరి రంగరాజు ఆర్వేల నియోగి. శ్రీవత్స గోత్ర పవిత్రుఁడు. చినగంగనామాత్య పుత్రుఁడు. కందాళ రంగాచార్య లీతని ముద్రాగురువు: అద్దంకి సింగరాచార్య లీతని విద్యాగురువు. రంగరాజకవి ఆంధ్ర కర్ణాట చోళ రాజసభలలో—

'వ్యస్తాక్షరీధుర్య విస్తీర్ణభావంబు
    క్రముక సంఖ్యాఖ్యాన కౌశలంబు
నారోహణావరోహణ లేఖనప్రౌఢి
    యగ్రపద్య గ్రహణాభిరక్తి
యనవలోకిత శారికాభిఖేలనరీతి
    వర సమస్యాపూర్తి వైభవంబు
సముదగ్రశిక్షిత చతురంగ బలకేళి
    కా విలాసము నేకకాలముననె
యలరఁ బ్రకటింపనేర్చి యష్టావధాన
కవిత శతలేఖినీ పద్య గద్యశక్తిఁ
బాటిమీటి....' (భానుమతీ పరిణయ కృత్యవతరణిక) న చిత్రకవితా విశారదుఁడుగా ప్రసిద్ధుఁడు.

భానుమతీ పరిణయము నాలుగాశ్వాసముల శృంగార ప్రబంధము. శ్రీకృష్ణుని పినతండ్రియగు భానునికి పద్మిని యను భార్యవలనఁ గలిగిన పుత్రిక యగు భానుమతికిని పాండవులలో కడగొట్టువాఁడగు సహదేవునకు జరిగిన పరిణయ మిందలి యితివృత్తము. శబ్దాలంకార ప్రచురమైనను ఇందలి కవిత్వము ద్రాక్షాపాక సుశ్రీకమై యొప్పుచున్నది. మాదిరి కొక పద్యము :

'సరసపటీర వాసనలఁ జందన శైల విలాస మొప్పఁగా
సురుచిర కాంచనద్యుతుల సొంపున మేరువుచంద మొందఁగా
సరిది హిమాంబుపూరముల హేమమహీధరలీల మీఱఁగాఁ
బురమునఁ గేళిసౌధములు పొల్పలరారు సమున్నతాకృతిన్'

—1—24

వెంకటగిరివారి కోవలో ఇరువదియాఁడవ తరమువాఁడగు సర్వజ్ఞ కుమార యాచమనాయఁడు (1695–1748) సంస్కృతాంధ్రములయందు గొప్ప పండితుఁడు; సాహితీమర్మజ్ఞుఁడు. కర్తగా కారయితగా పేరుకెక్కినవాఁడు. ఈయనకు విద్వత్కుమార యాచేంద్రులను పర్యాయ నామమును గలదు. 'భూరి విద్యల కారాజు భోజరాజు వీర్యవితరణములకల విక్రమార్కుఁ డుత్తరోత్తర యుక్తిశయయుక్తులందు జీవసన్నిభుఁ డతఁ డని చెప్పవచ్చు' (శిశుపాల వధ, అవతారిక. 27). వీరు కాళీభక్తులు. కాళికానుగ్రహమున వీరికి కవితా సామర్థ్యము గలిగినదఁట! కాళహస్తి జ్ఞానప్రసూనాంబికపై నొక యష్టకమును నొక చూర్ణికను సంస్కృతమున యాచమనాయఁడు రచించినట్లు తెలియుచున్నది.

రుక్మవతీ పరిణయకర్తయగు అనఘము కోదండరామకవి తన పినతండ్రియగు 'కొండకవీంద్రుఁడు సభినవదండి యనఁగఁ బేరుగాంచె ధరణీనాథాఖండలుఁడును వెల్గోటికులమండనుఁడై యొప్పు యాచమహీపతి చేతన్' అని వ్రాసినాఁడఁట! కుమార యాచమనాయని కాశ్రితుఁడగు పురుషోత్తమ పండితుఁడు చతుష్షష్టి విద్యాసంగ్రహమను సంధానగ్రంథము సంస్కృతమున సంధానించెనఁట![1] వీరి యాస్థానమునకు నేటి కందుకూరు తాలూకాలోని తెట్టుగ్రామవాస్తవ్యుఁడు మోచర్ల వెంకన్న యను కవి వచ్చి యాచేంద్రులను దర్శింపఁగా ఆయన షావిశాంతవర్ణములుగల కందపద్యశతక మొక్క గడియలో చెప్పుఁడని కోరఁగా వెంకన్నకవి యట్లే పూర్తిచేసెనఁట.[2] ఆ శతకము లభ్యముగాలేదు గాని అందలివే యని నాలుగు పద్యములుమాత్రము అముద్రితగ్రంథచింతామణిలో ప్రకటింపఁబడినవి.[3] అవి ఇవి :

'షాక్షర మాదిగఁ జేకొని
యాక్షణమున కందపద్య నివహము వరుసన్
వీక్షింపర దయచేసిటు
రాక్షసహర రామ మోక్షరామాధ్యక్షా!'[4]

[1] Journal of S. V. Oriental Research Institute, Vol. VII, ii, pp. 162-168.

[2] యాచమనాయని దర్శించి మెప్పించినవాఁడు మోచర్ల దత్తప్పయని గురజాడ శ్రీరామమూర్తిగారి కవిజీవితములు. వావిళ్ళ, చెన్నపురి, 1955, పుటలు 650–657.

[3] అముద్రితగ్రంథ చింతామణి, 1896 నవంబరు, సంపుటము తొమ్మిది, పు, 101.

[4] 'షాక్షర మాదిగఁజెప్పెద నీక్షణమున గందపద్య నివహ శతకమున్

'షడాశ్రిజన్యాంబరయ
రాడశ్రితవర్గ స్తుతామరస్సరసిజా
తేడుశ్రిత్యాగార పరి
డాశ్రిదేశ్రవర రామ మోక్షరామాధ్యక్షా!'
'షణ్మేఘనాంసృంభవ
రాణ్మానిత సూర్యాన్వయ రాజన్మకుటో
ద్యణ్మండిత శాంతరీక్ష వి
రాణ్మూర్తి రామ మోక్షరామాధ్యక్షా!'
'షట్పదలసితోద్యస్మిన్
త్రిట్పదలాంగ పరిరాజ క్షీరాబ్ధిత గాత్రి
జట్పద జటిపట నానా
రాట్పూజిత రామ మోక్షరామాధ్యక్షా!'

మోచర్ల వెంకన్న సోదరుఁడు దత్తప్ప వెంకటగిరివారి యాస్థానకవి యఁట! ఆశుకవనమునందును సమస్యాపూరణమునందును దత్తప్ప చాల నేర్పరియఁట!† గంటలో 125 పద్యములను పూర్తిచేసియుండెనఁట!‡

## రేనమూరి వేంకటపతికవి

విష్ణుమాయావిలాస ప్రబంధకర్తయగు రేనమూరి వేంకటపతి తనకు సర్వజ్ఞకుమార యాచమనాయఁడు తిక్కయజ్వయను బిరుదమును ప్రసాదించినట్లు '....కుమారేచ భూజనపాలాగ్రణి తిక్కయజ్వ యనుచున్ జాలంగఁ మెచ్చి ప్రోచినఁ బిరుదుపొందిన రేనమూరికులునిన్ శ్రీవేంకటాఖ్యున్ ....' (విష్ణుమాయావిలాసము, అవతారిక); '....కుమార యాచనృపదత్త తిక్కయజ్వ నామాంతరధాముర రేనమూరి....వెంకటపతికవి....' (ప్రైవి. ఆశ్వాసాంతగద్య).

ఇతఁడు వెంకటగిరిప్రభువంశవరలో ఇరువదిమూఁడవ తరమువాఁ డైన సర్వజ్ఞకుమార యాచమనాయని (1697–1748) కాలమునను ఇతని కుమారుఁడును ఇరువదినాలుగవ తరమువాఁడును నగు బంగారు యాచమనాయని (1755–1777) కాలమునందును వీరి యాశ్రయమునం దుండినవాఁడు. సర్వజ్ఞకుమార యాచమనాయనిచే తిక్కయజ్వయను బిరుదమునందిన యీ కవి రచించిన యితరగ్రంథము లేవియో తెలియవు కాని బంగారు యాచమనాయని

'వీక్షింపుము దయలోనను రాక్షసహర రామ మోక్షరామాధ్యక్షా'—అని ఒక పాఠాంతరము, చూ. విక్రమసింహపురిమండల సర్వస్వము, ద్వితీయ ఖండము, పు. 268.

† తెలుఁగు సమస్యలు, మోచర్ల దత్తప్ప విరచితము, వ్యవహార తరంగిణీ ముద్రాక్షరశాల, చెన్నపురి, 1880.

‡ A Manual of Nellore District, p. 699.

అంకితముగా రచించిన విష్ణుమాయావిలాసమను శృంగార ప్రబంధము ప్రసిద్ధమైనది. ఇది 22వ తరమువాఁడగు మొదటి బంగారు యాచమ (1660–1693) కంకితము*ని భావించుట పొరపాటు. విష్ణుమాయావిలాస కృతిపతి బంగారేచ నృపాలుని పౌత్రుఁడనియు, కుమారేచ భూమీంద్రుని పుత్రుఁడనియు కావ్యావతారిక పేర్కొనుటవలనను, మొదటి బంగారుయాచమనాయఁడు పెదయాచమ పౌత్రుఁడగుటవలనను రెండవ బంగారు యాచమయే కృతిభర్తయని నిర్ణయించుట న్యాయము. వెంకటపతి ఆర్వేలనియోగి. కాశ్యపసగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. యజుశ్శాఖాధ్యాయి లింగనామాత్య పౌత్రుఁడు. గంగనామాత్య పుత్రుఁడు. భద్రకాళీ భక్తుఁడు. శ్రీభూపతి లింగ పాదభజనానందుఁడు. దత్తాత్రేయ గురుపాదపద్మారాధకుఁడు. రోసనూరినివాసి.

ఇఁక కృతిభర్తయగు బంగారు యాచమ 'కవి గాయకోత్తమ సాహిత్య సంగీతసార ప్రసంగమెసఁగ ...' 'అఖిల రాజన్యచరితములు కృతిముఖములఁ బ్రబలుటకుఁ బ్రబలములగు సుకవినికరములు కారణములని తలంచినవాఁడు. 'తన కటాక్షస్ఫూర్తి దశదిశాగత కవీశ్వరభరోదయ హేతువనఁ బొదల' ప్రసిద్ధిల్లువాఁడు. కవితరంగిణి యూహించినట్లు బంగారు యాచమ రోసనూరి భూపతికాఁడు. 'రోసనూరిభూపతి గౌరీవరదయానులబ్ధ కామితఫల శృంగార....' యను సంబుద్ధిలోని దేవుఁడు రోసనూరియందలి భూపతిలింగేశ్వరుఁడు. భాగవతము అష్టమస్కంధమునందలి మోహిని అవతారఘట్ట మందలి యితివృత్తము. 'ఇతని కవిత్వము శ్రుతికటువగు నతి మృదులముగానిది. యథోచిత లక్షణ సంపత్తిగలది.'†

విష్ణుమాయావిలాస ప్రబంధమునుండి మచ్చునకు రెండు పద్యములు :

'జలరుహగంధి కోకకుచ సామజయాన మరాళికాలకుం
తల హరిమధ్య సైకతనితంబ తటిన్నిభగాత్రి పూర్ణిమా
విలసితచంద్రబింబముఖి విద్రుమసత్ప్రభాధరోష్ఠి యు
జ్జ్వల నవపల్లవాంఘ్రియయి సంధిలె నా హరి చంద్రశేఖరా' –1–109.

'వీఁకఁ దృషాతురుండు చలివెందరఁ జెందినభంగి దొడ్డగా
నాఁకలిగొన్న యాతఁ డమృతాన్నము గాంచినయట్లుగాఁగఁ దా
నా కలకంఠి ముందటికిఁ గ్రక్కునఁ బోయి కరాబ్జయుగ్మమున్
చేకొని మోడ్చి యిట్లనియెఁ జిత్తజబాణ నితాంతవేదనన్' 3–93.

బంగారు యాచమనాయనిమీఁద కస్తూరి రంగప్పయను కవి పంచరత్నము

*ఆంధ్రకవుల చరిత్రము, తృ.భా., పు. 24: ఆంధ్రవాఙ్మయ సంగ్రహము, పు. 217: ఆంధ్రకవితరంగిణి, సంపుటము 12, పుటలు 213, 214 : ఆంధ్రకవి సప్తశతి, పు. 244.

†చదలవాడ సుందరరామశాస్త్రిగారి ఉపోద్ఘాతము, విష్ణుమాయా విలాసము, శారదాంబావిలాస ముద్రాక్షరశాల, చెన్నపురి, 1898.

అనేకు శృంగార రసయుక్తములైన పదములను జెప్పియున్నాఁడఁట![1] ఈతఁడును ఆనంద రంగరాట్ఛందకర్తయు నొకరే యైనచో కవికాలము పదునెనిమిదవ శతాబ్ది మధ్యభాగము.

## ముడుంబి అప్పయ్యదీక్షితులు

ఇరువదియయిదవ తరమునకు చెందిన కుమార యాచమనాయఁడు (1777-1804) 'విబుధగణములఁ బ్రోచు వివేకి' (గోపీనాథ రామాయణము, అవతారిక, 59) యని ఉపశ్లోకింపఁబడినవాఁడు మీఁది కస్తూరి రంగప్పయే కుమార యాచమనాయని (1777–1804) పై నవరత్నములను పదములను జెప్పినట్లు వెలుగోటివారి వంశచరిత్రము పేర్కొనినది.[2] ముడుంబి అప్పయ్య దీక్షితులచే విష్ణుపురాణమును పద్యకావ్యముగా నాంధ్రీకరింపఁజేసి యొక యగ్రహారమును కవికి కుమార యాచమ దానమొసఁగినట్లు 'వెలయఁగ నన్నరేశ్వరుఁడు విష్ణుపురాణము నాంధ్రభాష నింపలర రచింపఁజేసి దనుజారి కృపాప్తికిఁ బాత్రభూతుఁడై ....' (పైది, 60) అను పద్యభాగమువలన స్పష్టపడుచున్నది.[3]

## నరుకూరి నారాయణప్ప

నరుకూరి నారాయణప్పయను కవి విరచించిన పారిజాతప్రబంధ మను యక్షగానము కుమార యాచమనాయని కంకితము.

'ఘన వెలుగోటి బంగరు యాచనృపతి
తనయ కుమారేచధరణీతలేంద్ర ।
వినవయ్య యిది జగద్వినుతప్రభావ
మిదిపుణ్య చారిత్ర మిది బుధస్తోత్ర
మిదిజన్మ సాఫల్య మెవ్వరువిన్న ....
పరమ కల్యాణులై ప్రబలియుండుదురు'

ఈ యక్షగాన ప్రబంధమును నిబంధించిన కవి విశ్వకర్మకులజుఁడు. నరుకూరి గ్రామవాస్తవ్యులగు కాళయాంబాముత్త ధీవరుల పుత్రుఁడు. కొండూరి వేంకటాచార్యుల శిష్యుఁడు. గ్రంథము నరుకూరి చెన్నకేశవముద్రతోఁ గూడినది.[4]

## ధూర్జటి లింగరాజకవి

కుమార ధూర్జటి కుమారుఁడగు లింగరాజకవి మీఁది కుమార యాచమ

[1] వెలుగోటివారి వంశచరిత్రము, పు. 134.

[2] పైది, పు. 143.

[3] 23 వ తరమునకుఁజెందిన సర్వజ్ఞకుమార యాచమనాయఁడే (1695–1748) ముడింబి అప్పయదీక్షితుల కాశ్రితదాతయఁట. పైది, పు. 123.

[4] ప్రాచ్య లిఖిత గ్రంథాలయము, కాకితపు ప్రతి, R. No. 129.

నాయని ప్రేరణమువలన మణిమంటప ప్రభావమను కృతిని సంతరించినట్లు —

'రచియించితివి కవిప్రతతి సన్నుతి సేయఁ
జతురోక్తి పరమా ప్రతచరిత్ర
పలికితి పాండ్యభూపాలసభ్యులు మెచ్చ
సదలంకృత కవేరజామహత్త్వ
మాచరించితివి కుమారేచ భూపాగ్రణి
ప్రణుతింప మణిమంటప ప్రభావ
మొనరించితివి భక్తియుక్తి శంకరునకు
శతకముల్ మాధుర్య చతురఫణితి
బాల్యముననే సుధీంద్రులు బ్రస్తుతింపఁ
గృతులు ఘటియించి విపుల సత్కృతులు గాంచి
వెలసితివి కీర్తి దిక్కుల విస్తరిల్లఁ
బ్రబల మిత్రాబ్జరవి లింగరాజ సుకవి'

యను నితని కాళహస్తి మాహాత్మ్య కృత్యవతారికా మూలమున నూహింప వీలగుచున్నది.†

పట్టాభిరామయ్య యను కవి లీలావతీ దండకమును కుమార యాచమ నాయని కంకితముగా రచించెనఁట ! ‡

## తిరునాళ్ళ మండపము

వెంకటగిరియందలి దేవాలయములలో కాశీవిశ్వనాథస్వామి దేవాలయము ప్రసిద్ధమైనది. బంగారు యాచమనాయఁడు (1755–1776) ఈ విశ్వనాథ ప్రతిష్ఠను గావించినట్టి పుణ్యమూర్తియని 'విశ్వనాథ ప్రతిష్ఠ గావించి వెలసినట్టి పుణ్యుండు బంగారు యాచవిభుఁడు' (గోపీనాథ రామాయణము. అవతారిక, 58) అను సాక్ష్యమువలన ధ్రువపడుచున్నది కాశీవిశ్వనాథస్వామి యాజ్ఞచే ఒక బ్రాహ్మణుఁడొక దివ్యలింగమును గొనివచ్చి దానిని బంగారు యాచమ నాయని కర్పించి లింగప్రతిష్ఠ సేయుమని ప్రోత్సహింపఁగా ఆతఁడు మహా కైవల్య నదీతీరమున 1760 లో అతి విశాలమైన ఆలయము నొకదానిని కట్టించి అన్నపూర్ణాయుతముగా విశ్వనాథుఁ బ్రతిష్ఠించి కాంచనధ్వజ మెత్తించి ప్రతిష్ఠ గాంచెను. ఇతని చారిత్రములు సకలసుకవి జనసంస్తుతికిఁ బాత్రములఁట !*

ఈయన దత్తకుమారుఁడగు కుమార యాచమనాయఁడు (1776–1804) 'విశ్వేశ్వరాన్నపూర్ణేశ్వరీ గుహాలకు ముదముతోఁ గట్టించె మూఁడు

† Journal of Sri Venkateswara Oriental Research Institute, Tirupati, Vol. VII, ii, pp. 162–168.

‡ వెలుగోటివారి వంశ చరిత్రము పు. 143.

* శిశుపాల వధ. అవతారిక 1–32.

తేర్చు' (శిశుపాల వధ, 1–35), 'వెలఁగి జగంబులం గడు ప్రసిద్ధికి నెక్కఁగ విశ్వనాథు నిశ్చల విభవంబులం దనిపి....' (గోపీనాథ రామాయణము, పీఠిక, 60) విశ్వనాథుని బ్రహ్మోత్సవములను పెద్దయెత్తున జరిపించెడివాఁడు. కాశీ విశ్వనాథస్వామి ఉత్సవ సందర్భములందలి తిరునాళ్ళ వేడుకలను కన్నులకుఁ గట్టినట్లు వర్ణించెడి తిరునాళ్ళ దండక మొకటి అజ్ఞాతకవికర్తృక మగునది కుమార యాచమనాయని కంకితముగాఁ గన్పట్టుచున్నది.[1] వెంకటగిరి వాస్తవ్యుఁడగు గడియారము ఘానుకటశాస్త్రి (క్రీ. శ. 1778 ప్రాంతము) పండిత కవిగా నెల్లూరు మాన్యువలున నుదాహరింపఁబడినాఁడు.[2]

ఇరువదియాఱవ తరమునకు చెందిన బంగారు యాచమనాయఁడు (1804–1845) 'విద్యాధురంధరు' (గోపీనాథ రామాయణ పీఠిక, 61) 'అఖిలార్థులకున్ సురశాఖిశాఖ' (పైది, 62), 'శిష్టమహీసుర భృత్యకోటిఁ బోషించి సమస్త ధర్మములు చేసి ...' (శిశుపాల వధ, 1–39) కీర్తి గాంచినవాఁడు. వెంకటగిరి యాస్థానమునందలి హేమాపతి యను సుందరిమీఁద 'హేమాపతి దండక' మను రచనను గై సేసిన కవి శతఘంటము లింగన్న[3] భోగినీ దండకమును బోలిన దీ కృతి. ఇది సీతారామకవి కృతమని కొందఱు వ్రాఁత[4]. ఇది బంగారు యాచమనాయని కంకితము.

## సర్వజ్ఞ కుమార యాచేంద్రులు

తరువాతి తరమునకుఁ జెందిన సర్వజ్ఞ కుమార యాచమనాయఁడు (1832–1892) వెంకటగిరి వారి వంశములో రసార్ణవ సుధాకర కర్త సర్వజ్ఞ సింగమనీని తరువాత అంతటి విద్యా పరిశ్రమమును విద్వజ్జన పరిశ్రమ పేతృత్వమును గల రాజకవి. ఇతఁడు కృతిభర్తగానే కాక కృతికర్తగాఁ గూడ ప్రసిద్ధుఁడు. సకల విద్యావిదుఁడని, అధ్యాత్మ విద్యా విచ్ఛ్రేష్ఠుఁడని[5] పండిత ప్రశంసల నందిన విద్వత్ప్రభువు. 'తర్కశాస్త్రయుక్తి నుపన్యసించుచో రెండవ గౌతముఁడ'నియు, 'బహువిధ శబ్దనిష్పత్తిఁ గావించుచో నపర పతంజలి' యనియు, 'అఖిల వేదాంత శాస్త్రార్థ తత్త్వ విచారమందు సాక్షాజ్జనకుఁ'డనియు. 'కావ్య నాటకాలంకార కవితాప్రముఖవిద్యలయం దపరభోజుఁ'డనియు,[6]

1 R. No. 717, ప్రాచ్య లిఖిత గ్రంథాలయ ప్రతి.

2 Manual of Nellore Dt., p. 700.

3 వెలుగోటివారి వంశ చరిత్రము, పు. 151; విక్రమసింహపురి మండల సర్వస్వము, తృతీయఖండము, పు. 4.

4 A Manual of Nellore Dt., p. 700.

5 భగవద్గీతాశాస్త్రము, గ్రంథాంతపద్యము.

6 గోపీనాథ రామాయణ పీఠిక, 66.

'ఉత్తరోత్తర మహాయుక్తు లుపన్యసించుచో బృహస్పతియనియు.[1] '....వర్ణిత చరిత్రుండు గ్రంథకర్తృత్వ విఖ్యాతిఁ గనియె....'[2] యనియు, 'గీతార్థ సంగ్రహ నీతి సూత్రాది సత్కృతులలో స్వమతంబుఁ దెలిపినాఁ'[3] డనియు విద్వత్కవిపుంగవులచే కొనియాడఁ బడినవాఁడు.

ఈయన రచించిన గ్రంథము లన్నియును వ్యావహారికభాషకు అతి సమీపమైన సరళగ్రాంథికములో సంధానింపఁ బడినవి. గిడుగు వెంకటరామ మూర్తి పంతులుగారి గద్య చింతామణిలో నీ గ్రంథ భాగము లుద్ధృతములగుట పరిగణనార్హము.[4] అన్నియు నించుమించుగా తాత్త్వికరచనలు. వానిలో కొన్ని ముఖ్య రచనలిట దిక్ప్రదర్శనముగా పరామర్శింపఁ బడినవి. గీతార్థ సార సంగ్రహము[5]: సర్వమతములలోని సారమును వాని పరస్పర వైవిధ్య వైరుధ్యము లను శాస్త్రదృష్టితో చర్చించి సమన్వయింపఁ బడినవి. నాస్తిక వాదమును నిరాకరించు కృతి నాస్తికధ్వాంత భాస్కరము. ఇది 1888 లో ప్రచురితము. నిర్గుణవాద నిరాకరణమను గ్రంథము మతవిషయక విమర్శపరమైనది: 1889లో ప్రకటితము. మనస్సాక్షి యనునది సకల మత స్వరూప నిరూపకమగు వచన రచనము.[6]

రత్నషట్కాంగుళీయకమనునది లఘుస్మృతి. దైవం సత్యం, స్మరణం శరణం, ఉపకారిః కార్యః, సద్ధర్మో నత్యాజ్యః, మానో రక్ష్యః, భవిష్యదాలోచనీయమ్ — ఈ యారు వాక్యము లారు పక్షములుగల అంగుళీయకాకృతి యందు వ్రాయఁబడి వాని మూలతత్త్వములు సుబోధకమగు రీతిలో వివరింపఁ బడిన కృతి యిది.[7] సందిగ్ధ తత్త్వరాద్ధాంత[8] మను పుస్తకము శిష్టవ్యవహార భాషలో రూపెత్తిన ఒక తాత్త్వికరచన. తాత్త్విక ప్రపంచమునందు అస్తినాస్తి వివాదిత్వకులోనైన దేవుఁడు, జీవుని స్వతంత్రత, పునర్జన్మ, మోక్షము, జగత్తు మొదలగు అనేకాంశములిందు పరామృష్టములు. సంగీత నాట్య సంబంధి గ్రంథమే యాచేంద్రులు రచించిన సభారంజని.[9] నాయికా నాయక రస సంగీత తాళ హిందూస్థానీ రాగతాళనాట్యాభినయ శబ్దవాద్య పాండిత్య రహస్యములను

[1] [illegible], అవతారిక, 44.

[2] నానారాజ సందర్శనము, ఉత్తరార్ధము, పు. 296.

[3] రాధాకృష్ణ సంవాదము, ప్రథమా., పు. 126.

[4] గద్య చింతామణి, మొదటి భాగము, వావిళ్ళ ప్రెస్, 1933.

[5] ఆది సరస్వతీ నిలయ ముద్రాక్షర శాల, చెన్నపురి, 1886.

[6] ఆది సరస్వతీ నిలయ ముద్రాక్షర శాల, చెన్నపురి, 1887.

[7] ఆది సరస్వతీ నిలయ ముద్రాక్షర శాల, మద్రాసు, 1889.

[8] శారదాంబా విలాస ముద్రాక్షర శాల, మద్రాసు, 1890.
శారదాంబా విలాస ముద్రాక్షర శాల, చెన్నపురి, 1890.

మితని యభిజనము.[1] కవి తన పదియాఱవయేఁట ఒక మహాయోగివలన సారస్వత విద్యోపదేశమంది తత్ప్రసాదలబ్ధ కవిత్వ విద్యావిశేషుఁడయినట్లు తాను వ్రాసిన శ్రీమద్రామాయణపీఠికవలనఁ దెలియుచున్నది. 'చదివితి నభినవోక్తుల కావ్య నాటకాలంకారములు పెక్కులక్షణంబు లభ్యసించితి సంస్కృతాంధ్ర పురాణంబులన్ని శోధించితి....' (కృష్ణజన్మఖండము, అవతారిక, ప. [illegible]) అని సైతము కవి స్పష్టపఱచియుండుట పరిశీలనార్హము. '....ఆదికావ్యంబును మహాముని ప్రణీతంబును షట్కాండ కథాప్రపంచ సంచితంబైన యాద్యమైన రామాయణమును భాస్కరాదు లొక మర్త్యాంత గ్రంథితాకృతిం జేసిరది సమీచీనంబుగా' (శ్రీమద్రామాయణము, పీఠిక, 39) అనియు, '....ఇమ్మహాకావ్యంబు నాంధ్రీకరణంబున ననూనానతిరిక్తంబుగా భగవదంకితంబుఁ జేసి' యాంధ్రీకరించియుండినవాఁడీ మహాకవి. ఇదియే గోపీనాథరామాయణ మనుపేర లోకమున ప్రసిద్ధమై యున్నది.

గీర్వాణమూలమున కనువాదముగా పద్యప్రబంధముగా రచింపఁబడిన యీ రామాయణము శ్రీకృష్ణాంకితమై యుండుట చేతఁను[2] వెంకటగిరి ప్రభువు సర్వజ్ఞకుమార యాచేంద్రుఁడు కవిని రావించి అగ్రహారములచే బహూకరించి లోకమున నీ కావ్యవ్యాప్తికి తోడ్పడిరి.[3] 'వెలయ వేంకటకవి విరచిత రామాయణాంధ్ర ప్రబంధ కావ్యము విని హర్షమొంది సత్కృపతో జరీశాలువలు దండెకడియము హారములు బహుమతి యొసఁగి మారెళ్ళసీమలోఁ దేరైన పెనుబల్లి గ్రామంబు నగ్రహారంబిచ్చె....' (శకుపాలనము, 1—46). బాలకాండ ప్రభృతి షట్కాండ కథాప్రపంచమంతయు వాల్మీకి హృదయము ననుసరించియు గోవిందరాజీయాది ప్రసిద్ధవ్యాఖ్యల ననుసరించియు ఈ రామాయణ మాంధ్రీకరింపఁబడియున్నది. అందువలన నిది వాల్మీకిహృదయసంవాదియనియు, మహా మాహాత్మ్యదమనియు చెప్పవచ్చును. ఇతని కవిత్వ మతిమనోహరము [illegible] గ్రథితమనియు, పండిత పామరజన హృదయాకర్షకమనియు విమర్శకులు

1 Manual of Nellore District, p. 700.

2 రామాయణ కృష్ణజన్మఖండ భగవద్గీతార్థములు వెంకటగిరి రాజాంకితములని కొందఱు వ్రాయుట ప్రామాదికము. చూ. వెలుగోటివారి వంశచరిత్రము, పుటలు 156, 157: శ్రీరాం వీరబ్రహ్మకవి. నానారాజన్యచరిత్రము, పు. 92.

3 ప్రథమముద్రణము: (ఒకేసంపుటము) లక్ష్మీనృసింహ ముద్రాక్షరశాల, చెన్నపురి, 1877: ద్వితీయముద్రణము: (రెండుసంపుటములలో) శారదానిలయ ముద్రాక్షరశాల, వెంకటగిరి, 1893, 1894: తృతీయముద్రణము: (రెండుసంపుటములలో) ఆదివరలక్ష్మీనిలయ ముద్రాక్షరశాల, చెన్నపురి, 1916: చతుర్థముద్రణము. (రెండు సంపుటములలో) వావిళ్ళ, 1923.

వ్రతి కుమారిని శౌరికర్పించెనేని
హాని కులమునఁ బుట్టినవారలెల్ల
సఖిల కల్యాణభాజను....'

అని [illegible] కవితను కవితాలక్షణములను వివరించినాఁడు. కృష్ణజన్మఖండ మనునది మూడాశ్వాసముల గ్రంథము. ఇందలి యొక పద్యము :

'ఇంటికి మీఁది చేటెఱుఁగ కీగతి నీమది నుబ్బెదేల యు
ద్వ్యంచితభంగి నీ వనిత యష్టమగర్భము నీకు మృత్యువై
పంచత నొందఁ జేయు నరపాల నిజంబని పల్కెఁ గంసుఁ డా
లించి మనంబులోఁ గలవరించి భయంబున ఖడ్గపాణియై'

(ప్రథమాశ్వాసము, పు. 38). కృష్ణజన్మఖండ కృతి వినిర్మితికి మెచ్చి వెంకట [illegible] రాజా కవికి వేయార్ల ధనము, రాధాకృష్ణపురాగ్రహారములో వ్యావసాయము [illegible] గాఁగ సత్కరించెనఁట ![1]

కవి యాంధ్రీకరించిన మూఁడవ గ్రంథము భగవద్గీతా శాస్త్రము. పద్య [illegible]ము. ప్రసిద్ధమైన భగవద్గీత కిది పద్యరూపాంధ్రీకరణము.[2] ద్వితీయాధ్యా యమునుండియే యాంధ్రీకరణ గ్రంథము లభ్యమైనది. అవతారికతోపాటు [illegible] 460 గద్యపద్యము లున్నవి.

'శ్రీ వెల్గోటి కుమారయాచ ధరణీశేంద్రుఁ డధ్యాత్మ వి
ద్యావిచ్ఛ్రేష్ఠుఁడు గోపినాథ కులజుండౌ వేంకటాఖ్యాద్యుచే
దైవానుగ్రహ లబ్ధి హేతువగు గీతాశాస్త్ర మూర్వీజనుల్
సేవింపఁదగు గద్యపద్యములుగాఁ జేయించె నుద్యన్మతిన్'

అను గ్రంథాంత పద్యమునుబట్టి యీతత్కృతి ప్రేరకుఁడు సర్వజ్ఞకుమా రయాచేంద్రుఁడని స్పష్టపడుచున్నది.

వెంకటకవి మఱియొక రచనము బ్రహ్మానంద శతకము.[3] 'బ్రహ్మానంద ముదియరాదె' యను మకుటముతోఁగూడిన నూటముప్పది సీసపద్యములుగల శతకమిది.[4] సర్వజ్ఞకుమార యాచేంద్రుఁడు శ్రీకృష్ణునిఁ గృతి నాయకునిగాఁ జేసి యతఁడు వల్లవస్త్రీలనుగూడి చేసిన లీలావిశేషము లన్నింటిని శృంగా [illegible] రూపమున సంతరింపుమని కోరినట్లు శతకారంభమునందలి పద్య త్రయమువలనఁ దెలియుచున్నది. 6 నుండి 23 వరకుఁగల పద్యములు

1 శిశుపాల వధ మహాకావ్యము, అవతారిక, 1–46.

2 తాళపత్రపు: వెస్లైనాట్టర్, జూబిలీ ముద్రాక్షరశాల, చెన్నపురి, 1899.

3 రామ గ్రంథమాల, పుదుచ్చేరి, 1923.

4 'సంభోగ శృంగార శతకములలో గోపీనాథము వెంకటకవి బ్రహ్మానంద శతకము ముఖ్యమైనది' — నిడుదవోలు వెంకటరావు, శతకకవుల సంపుటము – 1 (అకాడమీ ప్రచురణము), ఆంధ్ర శతక వాఙ్మయ పరిణామ చరిత్ర, పు. xvii.

శాస్త్రచర్చలలో, సాహిత్యగోష్ఠులలో వీనుమిగిలినవాఁడు. ఇతఁడు రచించిన 'శృంగార కల్పవల్లి' యను నలంకార గ్రంథము సర్వజ్ఞ యాచేంద్రున కంకితము. విద్వత్కవి పక్షపాతియగు సర్వజ్ఞ కుమార యాచేంద్రులు కవికి శా.శ. 1773 (క్రీ.శ. 1851) లో వెంకటగిరి తాలూకాలోని వెమురుగుంట యను గ్రామమును సర్వాగ్రహారముగ నొసర్చి సమర్పించిరి.[1] సర్వజ్ఞ కుమార యాచేంద్రుల ఆస్థానములో నింకను గన్నవరము అనంతకృష్ణశాస్త్రులు, గరుడాచల సోమయాజులు మొదలగు పండితులుండిరి.

## రాజగోపాలకృష్ణ యాచేంద్రులు

'మహిత సర్వజ్ఞ కుమారయాచేంద్రమహారాజమణి కుమారాగ్రియుఁడు రామేశ్వరాది యాత్రల కేఁగినప్పుడు దక్షిణ ద్వారకాధ్యక్షుఁడైన శ్రీ రాజగోపాల కృష్ణుఁ బ్రార్థించి తద్దత్తవరప్రసాదమునఁ గన్న తనయుఁడుగాన నితని కదే పేరుంచె....'[2] నఁట! అనురాంధ్ర సాహితీ యుగమునందలి పెక్కు కవులను పోషించినవారు వీరు. కవిపండితుల ప్రతిభాపాండిత్యములను సువిమర్శముగాఁ బరిశీలింపక దర్శనమిచ్చెడివారు కారఁట. స్వయముగ సంస్కృతాంధ్రములలో చక్కని పాండిత్యము కలవారు. పూండ్ల రామకృష్ణయ్యగారి సంపాదకత్వమున నెల్లూరునుండి వెలువడుచుండిన అముద్రితగ్రంథ చింతామణి (1885-1904)కి[3] కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తునకు, హైదరాబాదు శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా గ్రంథ నిలయమునకు వీరు ప్రధాన పోషకులు. వీరు వెంకటగిరితాలూకా లోని 'గొల్లపల్లి' యను గ్రామమును తృణకాష్ఠ జల సమృద్ధిగా ప్రతిష్ఠించి లక్ష్మీనరసమాంబా పురమని తల్లిపేర దానిని అగ్రహార మొసర్చి కవిపండితుల కర్పించిరఁట.[4] వీరి సభాసదనము బహుకవి గురుసేవితముగా పొగడ్తనందెను. శాకుంతలములోని 'క్షామక్షామ కపోల మాననమురః కాఠిన్య ముక్త స్తనమ్' అను శ్లోక పాద సందర్భముగను, 'ముహురంగుళి సంవృతా ధరోష్ఠమ్', 'ప్రతిషేధాక్షర విక్లబాభి రామమ్' అను శ్లోకాంత్యచరణ సందర్భమునందును వెంకటరాయశాస్త్రిగారితో రాజగోపాలకృష్ణ యాచేంద్రులు చేసిన ప్రసంగము

[1] వెలుగోటివారివంశచరిత్రము, పు. 154; శ్రీరామవిలాసవ్యాఖ్యానవి. [illegible] చరిత్రము. పు. 32.

[2] మంథపాక పార్వతీశ్వరకవి కృత శ్రీ కృష్ణాభ్యుదయము. రమానందము ముద్రాక్షరశాల. నెల్లూరు. 1903.

[3] పంగోలు వేంకటరంగయ్య. నెల్లూరు పత్రికాప్రచారము. త్రివేణి, 1922 జూన్ 24, పు. 1.

[4] Encyclopaedia of the Madras Prsidency and the Adjacent States, p. 437.

[5] వెంకటగిరి సంస్థానాధీశులు సర్వజ్ఞ సింగమనాయఁడు వెలుగువారికి పోషకు

రాజాగారి విమర్శక నైపుణికిని, రసజ్ఞతకును తార్కాణము.[1] శృంగార నైషధము సందలి తపనీయదండము, కేళీమయూరాంగన — ఇత్యాది పదబంధముల వివరణములపట్లను వేదమువారితో రాజాగారు సలిపిన చర్చాధోరణి రాజాగారి భాషాప్రియత్వమునకు, పాండితీపటుత్వమునకు ప్రబల నిదర్శనము.[2]

వేదమువారి ప్రతాపరుద్రీయ నాటకముపై 1898 లో అముద్రితగ్రంథ చింతామణ్యను బంధముగ బ్రచురితమయిన రాజగోపాలకృష్ణ యాచేంద్రుల వారి సద్విమర్శనము విమర్శక ప్రపంచమునకు వేగుఁజుక్క వంటిది. వేదము వారి ప్రతాపరుద్రీయ నాటకమును బొబ్బిలియుద్ధ నాటకమును రాజగోపాలకృష్ణ యాచేంద్రుల కంకితము. రసజ్ఞశేఖరులగు శ్రీ రాజావారి సౌహార్దమే తమ బొబ్బిలినాటక రచనమునకు దోహదమయ్యెనని వేదమువారు స్పష్టపఱచిరి. వీరి యాస్థానమున సమ్మానములందిన కవులలో తిరుపతి వెంకటకవులు.[3] గోపీనాథము వెంకటకవి, తిరుమలసెట్టి జగన్నాథకవి, మండపాక పార్వతీశ్వర శాస్త్రి, గోపీనాథము మాలెకొండయ్య, ఎనమచింతల సంజీవరాయశాస్త్రి, మల్లాది సూర్యనారాయణశాస్త్రి, వెల్లాల సదాశివశాస్త్రి, జనమంచి శేషాద్రిశర్మ, చిలకమాటి వేంకటరామానుజశర్మ, బాలాంత్రపు వేంకటరాయకవి మొదలైనవారు ముఖ్యులు. గోపీనాథము వేంకటకవిని గురించి ఇదివరకే వివరింపఁబడినది. ఎనమచింతల సంజీవరాయశాస్త్రిగారి దశకుమార చరిత్రము దండికవి కృత సంస్కృతకృతి కనుకృతి. ప్రౌఢవచనమున అనూదితము. ఇది గుణముల పసపెప్పు యని విమర్శకపతంసుల ప్రశంసల నందినది.[4]

## మండపాక పార్వతీశ్వరశాస్త్రి (1833–1897)

ఈతఁడు బొబ్బిలివారి యాస్థానకవి. బొబ్బిలిరాజా రావు వేంకట శ్వేతాచలపతి రంగారావు (1862–1926) రాజగోపాలకృష్ణ యాచేంద్రుల రెండవ సోదరుఁడు. అందువలన పార్వతీశ్వరశాస్త్రిగారికి వెంకటగిరి సంస్థానమునందును సమ్మానములు జరిగినవి. వెంకటగిరి పాలకుల ప్రోత్సాహముతో పార్వతీశ్వర శాస్త్రి రచించిన నాలుగాశ్వాసముల చారిత్రక ప్రబంధము రాధాకృష్ణ సంవాదము.[5] కృతికర్త కుమారులగు మండపాక కామకవి కూర్చిన లఘు వ్యాఖ్యానము దీనికి కలదు. మునిపూరు కోదండరామరెడ్డిగారు వ్రాయుట వింత. చూ. ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ సాహిత్యోపన్యాసములు, 6, పు. 88.

1 గుఱ్ఱం సుబ్బరామయ్య, వేదము వేంకటరాయ సంస్మృతి, పుటలు 19–23.

2 పైది, పుటలు 53–55.

3 నానారాజ సందర్శనము, పూర్వార్ధము, పుటలు 2–7: 'శ్రీరాజగోపాలకృష్ణ యాచమహేంద్రుని సభ నవధానమ్ము సల్పినాము'. పైది. పు. 53.

4 అముద్రిత గ్రంథ చింతామణి, సంపుటము 2, సంచిక 11, పు. 14.

5 ఆది సరస్వతీ నిలయ ముద్రాక్షరశాల, చెన్నపురము, 1886.

జోడింపఁబడినది. వెంకటగిరి రాజగోపాలకృష్ణ యాచేంద్రులవారి పట్టాభిషేకోత్సవము కన్నులకుఁ గట్టినట్లు వర్ణింపఁబడిన కావ్యమిది. తమ యన్నగారి పట్టాభిషేకోత్సవ గాథను కృతిగా నొసఁగింపుఁడని కవిని బొబ్బిలిరాజాగారు కోరఁగా వెంకటగిరి రాజాగారి అభ్యుదయ పరంపరాభివృద్ధిరూపముగ రాధాకృష్ణ సంవాదరూపముగ శ్రీకృష్ణాంకితముగ నీ కావ్యము సంధానింపఁబడినది.

వెంకటగిరి పట్టాభిషేకోత్సవముఁ జూచివచ్చిన మహేంద్ర పుత్రుఁడు జయంతుఁడు తనకీ జన్మములో పట్టాభిషేక మహోత్సవప్రాప్తిలేదని చింతించి తండ్రితో భంగ్యంతరముగాఁ బ్రస్తావింపఁగ మహేంద్రుని కొలువులోని బృహస్పతినిఁ బిలిపించి యతనియెదుట కొడుకును చీవాట్లుపెట్టెను. బృహస్పతి తండ్రికొడుకులకు రాజీ కుదుర్చును. ఈ సంఘటనమును చూచి నవ్విన కృష్ణుని నవ్వునకు రాధ కారణమడుగఁగ కృష్ణుఁడీ జయంత మహేంద్రుల గాథను వివరించెను. తాను జీవించియుండఁగానే కొడుకునకు పట్టముగట్టు ఉదాత్తుఁడగు రాజీకలియుగమునం దున్నాఁడా యని రాధ ఆశ్చర్యపడియతని వర్తనమును వినిపింప వేఁడును. కృష్ణుఁడు వెలుగోటివారి పూర్వ వంశప్రశంసతో మొదలుపెట్టి పట్టాభిషేక కథను సాంతము వివరించును. కావ్యమంతటను శబ్దాలంకారములు, శ్లేష చమత్కృతులు, వక్రోక్తి నైపుణ్యము. చమత్కార సంఘటనములు, స్వాభావిక వర్ణనములు నిండియున్నవి.

పార్వతీశ్వరశాస్త్రి 'వెలుగోటి లక్ష్మనరసాంబా సర్వజ్ఞ కుమారయాచేంద్ర సుత్రామ సుతసప్తక జ్యేష్ఠ'లగు రాజగోపాలకృష్ణ యాచేంద్రుల కంకితముగా రచియించిన మఱియొక పద్య ప్రబంధము ఏకాశ్వాస పరిమితమగు శ్రీకృష్ణాభ్యుదయము. కృష్ణావతారమునందలి ముఖ్యఘట్టము లిందు సంక్షేపరూపమున సంధానితములు. తొలుత అముద్రితగ్రంథచింతామణిలోఁ బ్రచురితమయి పిమ్మట నిది ప్రత్యేక గ్రంథరూపమున నావిష్కృతము.*

## మల్లాది సూర్యనారాయణశాస్త్రి

ప్రసిద్ధ పండితులగు వీరు వెంకటగిరివారి వితరణమును చవిచూచిన వారు. వీరు రచించిన సంస్కృత కవి జీవితములను గ్రంథము రాజగోపాల కృష్ణ యాచేంద్రుల సమాదరణమునఁ బ్రచురితము.†

మల్లాది వారాంధ్రీకరించిన ఆంధ్ర దశరూపకమను లక్షణ గ్రంథము సైతము వెంకటగిరి రాజాగారి ప్రోత్సాహమున సంతరింపఁబడినది. ఇది

* ప్రకాశకులు : పూండ్ల రామకృష్ణయ్య, రమానిలయ ముద్రాక్షరశాల, నెల్లూరు. 1903.

† శర్వాణీ ముద్రాక్షరశాల, అమలాపురము, 1911.

రాజగోపాలకృష్ణ యాచేంద్రుల కంకితము.[1] ఆంధ్ర దశరూపకకర్త—

'పద్మనాయకకుల కల్పపాదపాగ్ర
జనిత రేచర్ల గోత్రశాఖను జనించు
నిరుపమనిమిదియపు సురుచిర ఫలంబు
రాజగోపాలకృష్ణ ధరావరుండు'

అని కీర్తించుట కేవలము స్వభావోక్తి.

## చిలకపాటి వేంకటరామానుజశర్మ

భారద్వాజ గోత్రుఁడును, పేరిందేవీ తిరుమలాచార్యుల పుత్రుఁడును నగు చిలకపాటి వేంకటరామానుజశర్మ వెంకటగిరివారి యాశ్రితులలో నొకఁడు. వినోద కథా కల్పవల్లి, చిత్ర కథా లహరి, చమత్కార కథా కల్లోలిని, బ్రహ్మోత్తర ఖండము, వచన బ్రహ్మవైవర్త పురాణము మున్నగు నీతని వచనములు వేంకటగిరివారి యాశ్రయమున విలసిల్లినవి. భోజుని తనయలగు తరుణాంబుజ విరిజాంబుజలను ఉదయాదిత్యుఁడను రాజకుమారునకుఁ బెండ్లిచేసిన మహాకవి కాళిదాస చరిత్రము వినోదకథాకల్పవల్లిలోని యితివృత్తము. ఇది శృంగార రస ప్రధానము. షష్ఠగుచ్ఛ సముపేతము; రాజగోపాలకృష్ణ యాచేంద్రుల ప్రేరణమున విరచితము.[2] కాళిదాస చరిత ప్రకరణము[3]ను పది యంకముల నాటకమును రామానుజశర్మగారిచే నిర్మింపఁబడినవి. ఇందలి చరిత్ర [illegible]మైన రాజగోపాలకృష్ణ యాచేంద్రులకు మంగళాశాసనములు పొందు పఱుపఁబడినవి.

## బాలాంత్రపు వేంకటరాయకవి

ఈ కవికృతమగు శ్రీరంగరాయ పట్టాభిషేకమను నామాంతరముగల యాచమనాయేంద్ర విజయమను పదంకముల రూపకము వెంకటగిరివారి ప్రేరణమున రూపొందినది. తోపూరు యుద్ధమున జగ్గరాయాదిఖలుల నోడించి విజయనగర సామ్రాజ్యపాలకుల సంతతివారికి పట్టాభిషేకము గట్టిన వెలుగోటి యాచమనాయని వీరగాథ యిందలి కథా శరీరము.

రాజగోపాలకృష్ణయాచేంద్రులంకను మందపాక పార్వతీశ్వరశాస్త్రి రచితమగు అమరుక కావ్యము, మల్లాదివారి ఉత్తర రామచరిత్రము, చిలకపాటి వారి కాళిదాస చరిత ప్రకరణము, గోపీ కథా కౌముది, తిరుమలసెట్టి జగన్నాథ కవి విరచితమగు హాలాస్య మాహాత్మ్యము, మహాద్వైతము, వెల్లాల సదాశివశాస్త్రి

1 వావిళ్ళ ప్రెస్, మద్రాసు, 1915.
2 వావిళ్ళ ప్రెస్, మద్రాసు, 1950.
3 హిందూ రత్నాకర ముద్రాక్షరశాల, చెన్నపురి.
4 విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల, పిఠాపురము, 1910.

వెలుగోటివారి వంశ చరిత్రము, రాజగోపాలకృష్ణ యాచేంద్ర సంకలితమగు శృంగార పద్యావళి, ఇతర కవి కృతములగు కథా సరిత్సాగరము, గీత గోవిందము, రుక్మిణీ పరిణయము, సుమనో వినోద భాణము మున్నగు గ్రంథములను బ్రకటింపఁజేసియు, జనమంచి శేషాద్రిశర్మగారి బ్రహ్మాండ పురాణ ప్రచురణమునకుఁ దోడ్పడియు వివిధ వాఙ్మయ శాఖల విస్తృతికి, పురోగతికి మూలకారకు లయిరి.

వాల్మీకి రామాయణమునకు శ్లోకానువాదముగ నాంధ్రమున టీకాతాత్పర్యములను, భగవద్గీతేత్యాద్యుద్గ్రంథములకు లఘుటీకలను రచించి, అనేక గ్రంథములను సుపరిష్కృతమొనర్చి ప్రకటించిన విద్యావారిధి చదలువాడ సుందరరామశాస్త్రి (1850—1925), తర్కభూషణము వేంకటాచార్యుల నుద్భట వివాదప్రౌఢి నోడించి మించిన చదలువాడ అనంతరామశాస్త్రి (చిన్నయన శాస్త్రి)యును, వెంకటగిరివారి విద్వత్కవులు. సంస్కృతాంధ్రములయందును, సంగీత సాహిత్యములయందును సమాన ప్రతిభను బ్రదర్శించిన నరసింగి శేషశాస్త్రి, సరస్వతి సూర్యనారాయణశాస్త్రి మున్నగువారు వెంకటగిరి పండితులలో వాసికెక్కినవారు. వెంకటగిరి పాలకులు సాహిత్యముతోపాటు సంగీతమునకుఁగూడ స్థాన మొసఁగి యాదరించినవారు. '....వెంకటగిరి, కాళహస్తి, కార్వేటినగరము, నూజివీడు, చల్లపల్లి, ముక్త్యాల, పిఠాపురము, పెద్దాపురము, విజయనగరము, గద్వాల, వనపర్తి, ఆత్మకూరు మొదలగు రాజాస్థానములు సంగీత వినోదములు లేనివిగావు.'[1]

## ముద్దుకృష్ణ యాచేంద్రులు

రాజగోపాలకృష్ణ యాచేంద్రుల తమ్ములగు ముద్దుకృష్ణ యాచేంద్రులును విద్వత్పోషకులు. వీరు కవిపండితులను పోషించుటయేగాక ప్రాచీనార్వాచీన గీర్వాణాంధ్ర గ్రంథములను బెక్కింటిని స్వకీయముగు ముద్రాక్షరశాలలో ముద్రింపించినవారు. వీరి యాస్థానకవులలో ఉభయభాషాభూషణ బిరుద విభూషితుఁడగు బిరుదురాజు శేషాద్రిరాజు ముఖ్యుఁడు. ఇతఁడు చెంగల్వరాజ పుత్రుఁడు. ఈ కవి చంపూవిరాటపర్వ పుష్పబాణవిలాసాది గ్రంథముల నాంధ్రమున సంధానించినవాఁడు.[2] కాళిదాసు కృతమగు కుమార సంభవమును సైతము ఆశ్వాసముల కావ్యముగఁ దెనిఁగించెను.[3] వీరి కృతు లన్నియును ముద్దుకృష్ణ యాచేంద్రుల కంకితము. తిరుపతి వేంకట

[1] వేటూరి ప్రభాకరశాస్త్రి, అన్నమాచార్య చరిత్ర పీఠిక, తిరుమల తిరుపతి దేవస్థానముల ముద్రాక్షరాలయము, తిరుపతి, 1966, పు. 73.

[2] పుష్పబాణ విలాస విమర్శ, ఆంధ్రభాషా సంజీవని, విజయమార్గశిరము, పు. 86.

[3] ఆంధ్ర కుమారసంభవ కృతి విమర్శనము, పైది, జయ ఆశ్వయుజము.

రావులు[1], పిశుపాటి చిదంబరశాస్త్రి, దేశభట్ల జానకీరామ సుధీమణి, సరస్వతి శేషశాస్త్రి, ముద్దుకృష్ణ యాచేంద్రులచే సత్కరింపఁబడినవారు. తిరుపతి వేంకట కవులకు 'వెంకటగిరిలోన విభుఁడుఁ దదనుజులుఁ జేరి మేనాటపదాలు లిడిరి'.

తమ వంశీయులలో పూర్వుఁడయిన సర్వజ్ఞ సింగభూపాలుఁడు రచించిన రసార్ణవసుధాకరాభిధానముగు నాట్యాలంకార శాస్త్రమును ఉల్లాసత్రితయ యుక్తముగు దానిని మొట్టమొదటిసారిగా ముద్దుకృష్ణ యాచేంద్రులే పండిత పరిష్కృతముగా ముద్రింపించినవారు. 'సర్వజ్ఞ కుమార యాచమహేంద్రస్య నందనస్య శ్రీ మన్ముద్దుకృష్ణ యాచేంద్రస్య నిదేశేన పరిష్కృతమ్' — అని ప్రథమ ముద్రణము ముఖపత్రమునఁ గలదు. రత్నపాంచాలికా ప్రచురణ కర్తలును వీరే. వీరికిఁ బిమ్మటనే పిఠాపురము రాజాగారు దీని ద్వితీయ ముద్రణమునకుఁ గారకులయిరి. గోపీనాథము వెంకటకవి రచించిన శ్రీమద్రామాయణ మహాకావ్యము ముద్దుకృష్ణ యాచేంద్రుల యనుమతిచే స్వీయ ముద్రాశాలయందు ద్వితీయ ముద్రణము నందినది. సంస్కృత భాషయందు రచితమైన కాళహస్తి మాహాత్మ్యమను గ్రంథమును ముద్దుకృష్ణ యాచేంద్రులే ప్రప్రథమముగఁ బ్రచురించిరి. కటికనేని రామయకవి విరచితముగు కువలయానంద ప్రకాశమను నాంధ్రీకృతాలంకారకృతి ప్రకాశకులుగూడ వీరే. పిశుపాటి చిదంబరశాస్త్రిగారి (1892—1951) శ్రీ రామాంజనేయ నాటకమును ముద్దుకృష్ణ యాచేంద్రుల భాషాభిమానముచేఁ బ్రకాశిత మయినది. అముద్రిత గ్రంథ చింతామణి మున్నగు సాహిత్య పత్రికలకు వీరు రాజపోషకులు.

ముద్దుకృష్ణ యాచేంద్రుల తమ్ములగు వేంకటకృష్ణ యాచేంద్రులును సంతతము విద్యా వినోద గోష్ఠియందే గడపెడివారని శ్రీ కృష్ణాభ్యుదయ ప్రబంధ పీఠిక మూలమునఁ దెలియవచ్చుచున్నది.[2]

## వేణుగోపాల యాచేంద్రులు

వీరు తమ అన్నగారును బొబ్బిలి పాలకులును అగు రావు వేంకట శ్వేతాచలపతి రంగారావు వెంట 1893 లో ఇంగ్లండు వెళ్ళి యూరప్ ఖండము నంతయుఁ బర్యటించి వచ్చిరి. వీరు 'కైజర్--హింద్' సువర్ణ పతకాంకితులు; భాషాభిమానులు; కళాపోషకులు; ప్రసిద్ధ క్రీడా నిపుణులు.[3] కాళహస్తి

1 కథలు — గాథలు, ప్రథమ భాగము, పుటలు 440, 441 ; నానారాజ సందర్శనము, పూర్వార్ధము, పుటలు 7–12.

2 శ్రీకృష్ణాభ్యుదయము, రమానిలయ ముద్రాక్షరశాల, నెల్లూరు, 1903, పీఠిక, 3.

3 A. Vadivelu, The Aristocracy of Southern India, Vol. II, pp. 111–119.

శివరాత్ర్యుత్సవముల సందర్భమున కళాకారులను సత్కరించి వ్యయమంతయును భరించెడివారు.

## గోవిందకృష్ణయాచేంద్రులు

రాజగోపాలకృష్ణయాచేంద్రుల కుమారులగు గోవిందకృష్ణయాచేంద్రులును తండ్రివలె కవి పండితాభిమానులు. కాకినాడ ఆంధ్రప్రచారిణీ గ్రంథమాలకు ముచిలీపట్టణము గ్రంథాలయసర్వస్వ పత్రికకు ప్రధాన రాజపోషకులు. తమ పట్టాభిషేక సమయమున (1-2-1917) మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారిని వెంకటగిరికి రప్పించి యాస్థానవిద్వత్కవి గౌరవమును నెఱపి సత్కరించిరి.[1] చింతలపల్లి నరసింహశాస్త్రి యాంధ్రీకరించిన శృంగారకాదంబరి గోవింద కృష్ణుల సమాదరణమునఁ బ్రకాశితమయినది.[2] భట్టబాణుని కాదంబరి కివి యాంధ్రీకరణము. పూర్వభాగమునం దాఱాశ్వాసములు, ఉత్తరభాగమునందు నాలుగాశ్వాసములునుగల పద్యకావ్యము. కవి వసిష్ఠ గోత్రజులు, కరణకమ్మలు. పేరమాంబాత్ర్యంబకశాస్త్రుల తనూభవులు. మేధా దక్షిణామూర్తి మంత్రో పాసకులు. ఈ కృతి మేధా దక్షిణామూర్తి కంకితము. 'కాదంబరీ రసజ్ఞానాం సుధయాకిం ప్రయోజన'మ్మను నెదియుక్తోక్తి సార్థకమగు రీతిని నాంధ్రీకరణ విధానమును సాఁగినది. చిత్రకేతు చరిత్రమను నయిదాశ్వాసముల పద్యగ్రంథము శాస్త్రిగారి కృత్యంతరము. గోవిందకృష్ణయాచేంద్ర పట్టాభిషేక జ్ఞాపకార్థము ప్రచురితము. ఇది షేక్స్పియర్ 'కింగ్ లియర్'న కాంధ్రీకృతి.[3]

ముచిలీపట్టణము వాస్తవ్యులు శ్రీరాం వీరబ్రహ్మ కవిగారు రచించిన నానారాజన్య చరిత్రమను కతిపయాంధ్ర సంస్థానాధీశుల చరిత్రము గోవిందకృష్ణ యాచేంద్రుల కంకితము. రత్నాకరపు సుబ్బరాయకవి 'గోవిందకృష్ణయాచేంద్ర విజయ'మను చారిత్రక గ్రంథమును, నెమలి సుబ్బారాయకవి 'వెలుగోటి కృష్ణయాచేంద్ర చరిత్ర'మను చారిత్రక గ్రంథమును రాజాగారి ప్రేరణమున రచించినట్లు తెలియుచున్నది.[4] 'కవనార్థమ్ముదయించి'న కారణ జన్ములు తిరుపతి వెంకటకవులు వెంకటగిరి సంస్థానమునందు ఘనముగ సమ్మానింపఁ బడిరి. 'వేంకటగిరిరాజు వేంకటగిరిరూపఫణితుల్యులని ధనార్పణ మొనర్చె'[5]

[1] మల్లాది సూర్యనారాయణశాస్త్రి షష్టిపూర్తి సంచిక, (సంపాదకులు : మామిడిపూడి వేంకటరంగయ్య, దివాకర్ల వేంకటావధాని).

[2] వావిళ్ల ప్రెస్, మద్రాసు, 1926.

[3] నేషనలిస్టు ముద్రాక్షరశాల, చెన్నపట్టణము, 1919.

[4] ఆంధ్రవాఙ్మయ సూచిక, ముద్రితగ్రంథముల పట్టిక, పుటలు 59, 195.

[5] అమరవాది రామకవి రచిత పద్యభాగము, గుంటూరు సీమ, పూర్వరంగము, పు. 118.

'వేంకటగిరి రాజు వెట్టివాఁడా! వీరికే వేయినూఱార్ల నిచ్చుటేమి?'[1] మున్నగునవి దీనికి నిదర్శనములు.

గోవిందకృష్ణయాచేంద్రుల ద్వితీయకుమారులు వెంకటరాజగోపాలకృష్ణ యాచేంద్రులు సంస్కృతాంధ్రములలో మంచి పరిచయముగలవారు. పూర్వోక్తమగు ఆంధ్రశృంగారకాదంబరిని ఆమూలచూడముగాఁ బరిశీలించి ప్రకాశార్హమని నిర్ణయించిన మీఁదటనే గోవిందకృష్ణయాచేంద్రులు దీనిని ముద్రింపిరఁట.

గోవిందకృష్ణ యాచేంద్రుల జ్యేష్ఠ కుమారులు సర్వజ్ఞకుమార కృష్ణ యాచేంద్రులు చిఱుతకారుకొటి వయసునుండియు సాహిత్యవిద్యా పక్షపాతము గలవారు. చెళ్ళపిళ్ళ శుభాశీషముల నందినవారు.[2] 1924లో కడపపట్టణములో జరిగిన జనమంచి శేషాద్రిశర్మగారి ఆంధ్రశ్రీమద్రామాయణ కృత్యావిష్కరణోత్సవ సభకు వీరధ్యక్షతవహించి జనమంచివారికి రెండు నూటపదాఱులను, జోడుశాలువలను బహూకరించిరి. శర్మగారి కలివిలాసాది కృతుల ముద్రణమునకు సాయమొనర్చిరి.

> 'గోపీనాథ కవిత్వమాధురికి నెక్కొంగౌతుకంబున్న పృ
> థ్వీపాలాగ్రణి నందనుండు ఘనుఁడా వెల్గోటిసర్వజ్ఞుఁడే
> నీ పాలంగలఁడై సభాధిపతియై నీకోర్కె లీడేర్చువాఁ
> డై పంచారము సేయు నీమహిమ శేషాద్రీశ! సామాన్యమే!'[3] యని

ఆనాఁడే కవిరాజుల ప్రశంసలను బొందినవాఁడీ యువరాజు.

యువరాజాగారును వారి సోదరులు వేంకటరాజగోపాలకృష్ణయాచేంద్రులును పిశుపాటి చిదంబరశాస్త్రిగారిని తమ యాస్థానకవిగా నిలిపికొని శాస్త్రిగారు తెనిఁగించిన పద్మపురాణమును అచ్చువేయించిరి. మొన్న మొన్నటిదాఁక వీరి యాస్థానమునందు విద్వద్గోష్ఠులు, అష్టావధాన శతావధాన సభలు జరుగుచునే యుండినవి. ఇట్లు సర్వజ్ఞసింగభూపాని సద్గుణవార్ధి యాలవాలంబుగా నంకురించిన వెలుగోటివంశశాఖి పూచి కాచి ఫలించి పాఠక సుకవీంద్ర బంధు విద్వజ్జనాశ్రయ మూలమైన రేచెర్ల పేరును శాశ్వతముగ నిలిపినది.

[1] రాళ్ళబండి వెంకటసుబ్బయ్యశాస్త్రి, తిరుపతి వెంకటకవుల గీరతము, ప్రశంసాపర్వపరిశిష్టము.

[2] నానారాజ సందర్శనము, ఉత్తరార్ధము, పుటలు 25—28.

[3] ఆంధ్ర శ్రీమద్రామాయణ పీఠిక, కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి అభినందన పద్యము.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. నేలటూరి వేంకటరమణయ్య, వెలుగోటివారి వంశావళి, మద్రాసు విశ్వవిద్యాలయ ప్రచురణము, 1939.

2. శ్రీరామ్ వీరబ్రహ్మకవి, నానారాజన్య చరిత్రము, పుటలు 1—38.

3. వూండ్ల రామకృష్ణయ్య (సంపాదకుడు), అముద్రితగ్రంథచింతామణి సంపుటములు.

4. కందుకూరి వీరేశలింగముపంతులు, ఆంధ్రకవుల చరిత్రము, ద్వి. భా., తృ. భా.

5. తిరుపతివేంకటకవులు, నానారాజసందర్శనము, పుటలు 1—11.

6. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, కథలు—గాథలు, సంపుటము 1, పు. 440, 441.

7. ఆంధ్రవిజ్ఞానము, సంపుటములు 2, 3, 6.

8. చాగంటి శేషయ్య, ఆంధ్రకవితరంగిణి, సంపుటములు 11, 12.

9. తెలుగు విజ్ఞానసర్వస్వము, సంపుటము 3.

10. జమీందారీకమిటీ రిపోర్టు.

11. వేదము వేంకటకృష్ణశర్మ, శతకవాఙ్మయసర్వస్వము.

12. కల్లూరు వేంకటనారాయణరావు, వీరేశలింగ యుగము, సాధన ప్రింటింగ్ లిమిటెడ్, అనంతపురము, 1965.

13. పుసుగు శ్రీరంగం, నెల్లూరు జిల్లాలోని సంస్థానముల చరిత్ర, విక్రమసింహపురిమండలసర్వస్వము, ద్వితీయ ఖండము, 1963, పుటలు 69—93.

14. J. A. Boyle, Manual of Nellore District, pp. 712-724.

15. M. A. M. P., Vol. I, Zamindaries, p. 56, Vol. II. p. 294.

16. C. U. Aitchison, A Collection of Treaties, Engagements and Sannads, Vol. VIII, Calcutta, 1892, pp. 47–55.

17. W. W. Hunter, Imperial Gazetteer of India, Vol. XXIV, New Edition, Oxford, 1908, pp. 307, 308.

18. A. Vadivelu, The Aristocracy of Southern India, Vol. I, 1903, Vol. II, 1908, pp. 111–119.

19. A. Vadivelu, The Ruling Chiefs, Nobles & Zamindars of India, Vol. I, Madras, 1915, pp. 489–491.

20. V.L. Sastry, Encyclopaedia of the Madras Presidency and the Adjacent States, pp. 712–719.

21. Report of the Madras Estates Land Act Committee, Parts I and II, 1938.

# సంగమువలస

## ప్రవేశిక

విశాఖపట్టణమున కుత్తరముగా నిరువదిపరువుల దూరమునను, పార్వతీపురమునకు పడమరగా రెండుపరువుల దూరమునను ఈ సంస్థాన ముండినది. ఇందు పందొమ్మిది జిరాయితీ గ్రామములు, ఒక అగ్రహారమును ఉండినవి. పేష్కషు రూ. 6,700 లు. ఈ సంస్థానమును ఒకప్పుడు తక్కిన కొంద జమీందారీలతోపాటు జయపురసంస్థానమునందలి యొక భాగము. ఈ వంశమునకు మూలపురుషుఁడుగా సంభావింపఁబడుచున్న దామోదరుఁడు అనునతఁడు ఉత్తరభారతదేశమునుండివచ్చి నందాపురపరిసరములందు స్థిరనివాస మేర్పఱిచికొనియుండెనఁట. ఈ దామోదరుఁడు 'నందాపురరాడ్ధ్వజినీనాథుండై శత్రుజయమ్మొనరించి రాజ్యమాన్యహుఁడయి....' స్వీయశక్తిసామర్థ్యములవలన నందాపురము పరిసరములందుఁగల భూములను వశపఱచికొని ఆ ప్రాంతమునకు క్రమముగా ఏలిక యయ్యెనఁట !*

కార్ముకవిద్యామర్మజ్ఞుఁడగు తమ్మనాఖ్యుఁడను నీ కోవఁజెందిన పాలకుఁడు శత్రువులమీఁద దాడివెడలినపుడెల్లను సంగ్రామవిరతిలేక సంగ్రామవసతి యనుచోట మకాము చేయుచువచ్చెనఁట !† సంగ్రామవిరతి (వసతి)యే ఉచ్చారణ వశమున తెలుఁగులో సంగమువలసగా మాఱినదఁట!‡ ఇది కృత్రిమవ్యుత్పత్తిగాఁ

*ఉత్తరహిందూస్థానమునుండి వలసవచ్చి నందాపురీప్రాంతముల రాజ్యము గడించినది రామచంద్రనరేంద్రుఁ డని శ్రీమన్నిశ్శంకచరిత్ర నిరూపణము. చూ. 40వ పద్యము.

†రామచంద్రుఁడే ఈయుద్ధవీరుఁడఁట : చూ. పైది. 42—44 పద్యములు.

‡'అతఁడు నందాపురాధిపత్యహిత సమితి
సమితి నడగించుటకు నొక్క ఒక్క శిబిర
సన్నివేశంబునొనరించి జయముగొనుట
వ్యవహృతంబయ్యె సంగ్రామవసతి నాఁగ' —నిశ్శంకచరితము, 9.

'...శత్రుగణసంహరణ
శ్రీనొరయుట నప్పురి సంగ్రామవసతియనెడి పేరఁ గరిమ నలరాఁగె'
—శ్రీమన్నిశ్శంకచరిత్రము, 44.

'తెలుఁగు పలుకున సంగమువలస యనుచు
నచటివారలు పలుకుట నదియువసన
విశ్రుతంబయ్యెఁ జాల సుప్రీతమునఁ
దామరప్రాజ్ఞ సామాన్యభణితి నిపుణ' —నిశ్శంకచరితము, 10.

బోఁచుచున్నది. సంగ్రామ శబ్దము 'సంగమ' కావచ్చును గాని వసతి, వసతి శబ్దములు 'వలస' కానేరవు. ధ్వనిపరిణామ సూత్రముల కీ రూపపరిణామ నిరూపణపద్ధతి పూర్తిగా విరుద్ధము. విశేషించి 'వలస' యనునది శ్రీకాకుళ విశాఖపట్టణమండలములయందు ప్రచురముగా గ్రామనామముల ఉత్తరభాగముగాఁ గన్పట్టుచున్నది. 'వలస'యను పదము ఉత్తరభాగముగాఁగలిగిన అన్ని గ్రామములకు నిట్టివ్యుత్పత్తిని ఆరోపించుట అవిచారితరమణీయమని చెప్పకతప్పదు. ఇది సంఘము వలసయో లేక సంగమ ( = కూడిక, కూడుట) వలసయో కావచ్చును.

## సంస్థాన చరిత్రము

ఈ సంస్థానపాలకులు భరితాన్వవాయులయిన చంద్రవంశక్షత్రియులఁట !* వీరి మూలపురుషుఁడు దామోదరుఁడని ముందే వివరింపఁబడినది. వీరి వంశవృక్షమును నిర్మించుటలో చరిత్రకారులలో భిన్నాభిప్రాయములున్నవి. వడివేలు కథనమును, నిశ్శంకచరిత విమర్శనమును, శ్రీమన్నిశ్శంకచరిత్ర యనువర్ణనమును ముఖ్యముగా నీవిషయమున భేదించుచున్నవి. మూలపురుషుని విషయమున మాత్ర మేకవాక్యతయున్నది. వడివేలుకథనముమేరకు మూలపురుషుఁడగు దామోదరుఁడే సంగమువలస నిర్మాత. నిశ్శంకచరితము ప్రకారము దామోదరుని వంశములోని తమ్మన్నయను నామాంతరముగల జియ్యంవారు సంగమువలస పట్టణనిర్మాతగాఁ గన్పట్టుచున్నాఁడు. శ్రీమన్నిశ్శంకచరిత్ర వర్ణనము ననుసరించి రామచంద్రనిశ్శంక సంగమువలస పట్టణనిర్మాత : ఇతఁడే నందాపురీశు మెప్పించి నిశ్శంకబిరుదము నందినవాఁడు.† పై జియ్యంవారనుండి అనంతరవంశవృక్షనిరూపణమునందు భిన్నాభిప్రాయములు లేవు.

దామోదరునినుండి జియ్యంవారవరకుఁగల తరములును, ఆయాతరముల పురుషనామములును భేదించుచున్నవి. నిశ్శంకచరితమునందలి గురులింగనృపుఁడు, వినాయకుఁడు, నీలకంఠుఁడు, మంథన్న, వీరభద్రుఁడు, తమ్మన్న మొదలగు నామములు వడివేలుచరిత్రములో కానరావు. వడివేలుచరిత్రములోని ప్రతాపరుద్ర, రామచంద్ర, నందన్న, జగన్నాథ నామములు నిశ్శంకచరితమునందుఁ గన్పట్టవు. శ్రీమన్నిశ్శంకచరిత్రమునందు ప్రతాపరుద్రప్రసంగము పొడకట్టదు. దీనిని ఇదమిత్థమ్మని నిరూపించుభారము చరిత్రకారులది.

వడివేలుచరిత్రముప్రకారము దామోదరుని కుదురునందు ప్రతాపరుద్రుఁడనువాఁడు జన్మించెను. ఇతఁడు ఇరుగుపొరుగుసీమలను జయించి రాజ్యమును విస్తరింపఁజేసెను. ఈతనితరువాతి ముఖ్యపాలకుఁడు రామచంద్రుఁడు. ఇతఁడు

*'ద్విజరాజవంశమున...' 'ఇందువంశోద్భవ ధరాతలేశ్వరులు...'
—నిశ్శంకచరితము, పద్యములు 2,8.

†శ్రీమన్నిశ్శంకచరిత్రము, 44, 45, 57.

నందాపురరాజునకుఁ గూర్పుమిత్రుఁడు. నందాపురరాజునకు తోడ్పడి అతని శత్రువుల నోడించి రామచంద్రుఁడు ప్రసిద్ధివహించెను. దీనికి సంతోషించి రఘునాథకృష్ణదేవు జ్యేష్ఠతనయుఁడును, అప్పటి నందాపురరాజును నగు రామచంద్రదేవు 'సంగరాంగణమందు నిశ్శంకవృత్తి దోర్బలముమీఱ నహితులఁ దోలినట్టి....' రామచంద్రునకు నిశ్శంకబహద్దర్ బిరుదమునొసంగి సంగమవలస రాజ్యాధిపత్యమును స్థిరీకరించెనఁట.* ఇతనికొడుకు నందన్ననిశ్శంక.† నందన్ననిశ్శంకునకు జగన్నాథనిశ్శంక,‡ కట్టన్ననిశ్శంక యని యిద్దఱు కుమారులు. జగన్నాథనిశ్శంకునకు తొమ్మిదిమంది కొడుకులు. వారిలో పెద్ద వాఁడు జియ్యంపౌరనిశ్శంక. ఈతనికి జియ్యంపౌరనిశ్శంక, పాత్రనిశ్శంక యని యిరువురు పుత్రులు. జియ్యంపౌరనిశ్శంక కాలముననే విజయనగర ప్రభువు పెదవిజయరామరాజు '....జయపురసింహాసనాధీశు...రామచంద్ర మహారాజశేఖరు నత్యంత కపటసఖ్యమునఁ దనకునొగి వశవర్తిగ నొనరించు కొని తన్మహారాజ్యమందు నిజాధికారమెంతయు నెఱపుచు నింపంచునంత....' (శ్రీమన్నిశ్శంకచరిత్రము, 83) రామచంద్రదేవుగారి సోదరుఁడు బలరామ దేవుఁడు దీనికి కటకటపడి సైరణవహింపలేక జయపురమును వదలి నారాయణ పట్టణమునకువచ్చి అఖిలకార్యనిపుణుఁడగు జియ్యంపౌర సాయమునపేక్షించెను.

జియ్యంపౌర తనయనను నారాయణపట్టణమునకు పాలకునిగాఁజేసి మెప్పుపొందెను. ఇట్లు జయపురాధీశుని సోదరునకు తోడ్పడినవాఁడు తమ్మన్న పౌరయని నిశ్శంకచరితముమాత్రము పేర్కొనుచున్నది (చూ. పద్యములు 8-9). తమ్మన్నపౌర, జియ్యంపౌర — ఈ రెండింటిలో నేదోయొకటి మాఱు పేరో ముద్దుపేరో కావచ్చు. ముఖ్యపాలకునకు తమ్మునివంటివాఁడగుటవలన తమ్మన్నయనిగాని లేక ధర్మన్నశబ్దమునకు వికృతి తమ్మన్నయనిగాని నిరూపింపవచ్చు. మఱియొకపక్షమున దామోదరశబ్దమునకు సంక్షేపరూపమగు 'దామ' కు వికృతియనిగాని వివరింపవచ్చు. జియ్యంపౌర పెద్దకొడుకు పెద్దన్ననిశ్శంక. పెద్దన్న గొప్పవీరుఁడు. సంస్థానమును చక్కఁగా పాలించినవాఁడు. జయపురాధిప గౌరవలబ్ధిగర్వుఁడును పీతమణిపురాధినాథుఁడును నగు ఘోసాయినోడించి బెలగాముదాఁక నీతఁడు తఱిమికొట్టెనఁట (చూ. పద్య 14—16). పెద్దన్నకు గంగమాంబవలన తమ్మన్న, వెంకన్న, వీరన్న యను ముగ్గురుకుమారులు

*'...ల మహీశసుతుండు రామచంద్రవిభుండు
సంగమవలస నిశ్శంకబిరుదు
రో నొసంగెను దనయాశ్రితుని కొఱకు...' — సెట్టి లక్ష్మీనరసింహముగారి రామచంద్రదేవపట్టాభిషేకము, విజయరామముద్రాక్షరశాల, విశాఖపట్టణము, 1921, పు. 9.

†మంథనసనిశ్శంకయని శ్రీమన్నిశ్శంకచరిత్రము, 62.

‡జమ్మనసనిశ్శంకయని పైది, 71.

కలరు. తక్కిన కొండజమీందారులతోపాటు క్రీ.శ. 1769 లో ఈ జమీందారు కూడ విజయనగరమువారివలన పదచ్యుతుఁడుగాఁ జేయఁబడి, విజయనగరము దివాణమువారి తప్పుటీలో చేర్పఁబడెను.

'అందు జ్యేష్ఠుఁడు తమ్మనాహ్వయుఁడు రాజ్య
భారము వహింపకయె పరపాత్రిష్ఠుఁడయ్యె
వెనుక వేంకటనిశ్శంకవిభుఁడు నిఖిల
శక్తిషాడ్గుణ్యవిజ్ఞానశాలియయ్యె' --నిశ్శంకచరితము, 20.

పెద్దకొడుకైన తమ్మన్న జమీనిచ్ఛగింపక తీర్థయాత్రలకేఁగి మరణింపఁగా రెండవకొడుకైన వెంకటనిశ్శంకుని 1796లో బ్రిటిష్ కుంఫిణీవారు వారసునిగా గుర్తించి, జమీని విజయనగరము స్వాధీనమునుండి తప్పించి వెంకటనిశ్శంకునకిప్పించిరి. ఈ వెంకటనిశ్శంకునిగారితో కుంఫిణీవారు శాశ్వతపరిష్కారమును జరిపెంచిరి. వెంకటనిశ్శంకునకు ముగ్గురు భార్యలు. పెద్ద భార్యయగు గౌరియనపత్య. ద్వితీయ కళత్రమగు లక్ష్మమ్మవలన పెద్దన్నయను కుమారుఁడును, మూఁడవ భార్యయగు పాపమ్మవలన కట్టున్నయను కుమారుఁడును కలిగిరి. వెంకటనిశ్శంకుఁడు పరమపదించినప్పుడాయనభార్యలు మువ్వురును సహగమన మొనర్చినట్లు తెలియుచున్నది.

తండ్రి తరువాత పెద్దన్న పాలకుఁడయ్యెను. పెద్దన్నకు గంగమ్మ, చంద్రమ్మ, సన్యాసమ్మ యని ముగ్గురు భార్యలు. పెద్దన్నకు చాలకాలము సంతానము కలుగలేదు. మొదటిభార్యయగు గంగమ్మ పెదబొండపల్లి వాస్తవ్యులు మేదినీరావు జగన్నాథరాజు పుత్రిక. మూఁడవ భార్యయగు సన్యాసమ్మ మేదినీరావు రాఘమాంబా రఘునాథరాజుల తనయ. సన్యాసమ్మ తల్లిదండ్రులు గూడ పెద్దన్న ఆశ్రయమునసుండి జమీందారునకు చేదోడువాదోడుగా వర్తించుచుండిరి. వీరికిని పెద్దభార్యయగు గంగమ్మకును పడలేదు. పెదబొండపల్లి వాస్తవ్యులగు మేదినీరావు జగన్నాథరాజు, గోపాలరాజు సోదరులు; వరాహ నృసింహరాజు తనయులు. వెంకటనిశ్శంకు నాశ్రయించినచలి మేదినీరావు పెద్దిరాజు, రఘుపతిరాజులు బాపిరాజు కుమారులు. మేదినీరావు వంశీయులగు బాపిరాజు, వరాహనృసింహరాజులు జ్ఞాతులు. వీరి పుత్రులు పరస్పరకలహముల మూలమున నరవ సంస్థానమును పోగొట్టుకొని పరులవంచలఁ బ్రాకులాడుచుండినవారు. పూర్వమునుండి రాజుచుండిన జ్ఞాతివైరము కూడ గంగమ్మ ప్రవృత్తికి దోహదకారి యయినది. గంగమ్మ గడుసుఁదనము కలది. పెద్దన్నకు చిత్తవిభ్రమ మేర్పడినదని పుకారు పుట్టించి కుంఫిణీ అధికారులను నమ్మించి ఆయమ్మ రాజ్యాధికారమును చేపట్టినది. పెద్దన్న తమ్ముఁడగు కట్టున్న ఈశ్వరభక్తితత్పరుఁడు, ఇహలోక విషయములపై నంతగా దృష్టిలేనివాఁడు. గంగమ్మ పినతండ్రియగు మేదినీరావు గోపాలరాజు కొమార్తె సీతమ్మ కట్టున్న

భార్య. పెద్దన రెండవ భార్యయగు చంద్రమ్మగారు గోపాలరాజు కూతురు. అందువలన గంగమ్మ కత్తి యెదురులేకపోయినది. విభురాజ్యాంగము మంత్రివైభవసంగతిఁ దన వశమొనర్చుకొని అధికారమును సాగించినది.

నిస్పృహాయుఁడగు పెద్దన్న సన్యాసాంబ సోదరులను మనుమలతోఁ గలిసి మచిలీబందరున కేఁగి తన యందువారసత్వమునకు యావద్విషయములను కుంఫిణీవారితో మొఱపెట్టుకొనెను. కుంఫిణీ వారి ప్రార్థనను మన్నింపలేదు. అందులో తమ కనుకూలత కలుగమి చింతించి పెద్దనాదులు బొబ్బిలి సంస్థానాధిపతుల నాశ్రయించి వారి ప్రాపున సంగమవలసను స్వాధీనపఱచికొనఁజూచిరి. కాని గంగమాంబ ప్రతిక్రియాచరణ నదియు వ్యర్థమైనది. సన్యాసాంబకు జనించిన మొదటిబిడ్డ గంగాధర శాసనమునవయిన అధికార ప్రయోగములన మృతిఁజెందినట్లు ప్రజాప్రతిపాద కలదు. సంస్థానము సంపాదనము నిమిత్తము పెద్దన నిశ్శంకుఁడు సన్యాసాంబతోఁగూడి బొబ్బిలికేఁగి బొబ్బిలి రాజాగారి ఆశ్రయములో నుండఁగా సన్యాసాంబ రెండవ గర్భమున మృత్యుంజయుఁడను బాలుఁడు జన్మించెను. సన్యాసాంబ యంతర్వత్నిగా నుండఁగా పెద్దన పరలోకప్రాప్తుఁడయి యుండెను. బొబ్బిలి రాజాగారు ఈ బాలుని అల్లారుముద్దుగా పెంచి, యతనివరముగా కుంఫిణీవారికి సిఫార్సుల నంపిరఁట. ఈ విషయమునే ప్రవచనపారిజాతమిట్లు పేర్కొనుచున్నది :

> 'అవన్ని సంగమవలస భూపతి నిశ్శంకనృపతి మను గముఁగమిచనె
> గాపాడెను రాయఁడపక్షపాలవరుండు కొంతకాలము దనుకన్'
>
> —అవతారిక, ప. [illegible]

దీనితో కుంఫిణీవారు గంగమ్మను రాజ్యచ్యుతను గావించి రాజ్యపాలనమును 'కోర్ట్ ఆఫ్ వార్డ్స్' పరముగావించి మైనరు జమీందారును విశాఖపట్టణమున నుంచి విద్యాబుద్ధులు నేర్పించుటకనువగు వసతుల నేర్పఱిచిరి.

విద్యానయ కోవిదుఁడును, మేనమామయును నగు మకిలీరాజు నరసింహరాజుగారి వెంట మృత్యుంజయ నిశ్శంకబహద్దరు తన చిన్నతనమున విశాఖపట్టణమున కరిగి ఆంగ్లాంధ్రములలో ప్రసిద్ధాధ్యాపకులవద్ద నుండి చదివెను. మహామహోపాధ్యాయ శ్రీమత్పరవస్తు వేంకటరంగాచార్యులుగారి సన్నిధిని సకలవిద్యలు చదివి చతురతను విజ్ఞతను సంపాదించెను. ప్రాజ్ఞతరాఁగా క్రీ.శ. 1847 ప్లవంగ సంవత్సరములో జమీకివచ్చెను. ఇతని మేనమామ సంగమవలసకు తూర్పున కోసెఁడు దూరమున నొకపట్టణమును నిర్మించి దానికి మృత్యుంజయనగరమని పేరుపెట్టెను. అదే అప్పటినుండి యీ జమీందారీకి ముఖ్యపట్టణము. ప్రాఁతకోట పాడువడినది.

కట్టిన్న నిశ్శంకుని దౌహిత్రియగు లక్ష్మీనరసయ్యమ్మ మృత్యుంజయు

నిశ్శంకబహద్దర్ మొదటిభార్య. ఈమె యొక యాఁడుబిడ్డను సన్యాసాంబను ప్రసవించి మరణించినది. రెండవభార్య హీరమణి. ఈమె సురిడాం జమీందారు లక్ష్మీనారాయణసింహుని పుత్రి; పీకటి జమీందారుల దౌహిత్రి. మృత్యుంజయ నిశ్శంక బహద్దరునకు రెండవభార్యవలన నేడుగురు కొడుకులు, ఇరువురు కొమరితలు. కొడుకులలో పిదప ముువ్వురును చిన్నతనముననే మరణించిరి. పెద్దకొడుకు చంద్రశేఖరుఁడు. ప్రతాపరుద్రుఁడు, శంకరుఁడు, వరాహలక్ష్మీనృసింహుఁడు — యీ ముువ్వురును చంద్రశేఖరుని తమ్ములు. లక్ష్మీనరసయ్య, ఇందుమతియను నిరువురు కొమరితలు మేడిసిరావు బాపిరాజు కుమారులగు జగన్నాథరాజునకు, లక్ష్మీపతిరాజునకు క్రమముగా భార్యలు. చంద్రశేఖరుని భార్య పీకటి జమీందారులు వేంకటేశ్వరదేవుని పుత్రిక రాజ్యలక్ష్మి. విశ్వేశ్వరుఁడను కుమారుఁడు, పద్మాలయాభద్రయను కుమారికయు వీరి సంతానము. ఇందుమతీలక్ష్మీపతిరాజుల పుత్రుఁడగు మేడిసిరావు విజయలక్ష్మీనృసింహరాజు పద్మాలయ భర్త. ద్వితీయపుత్రుఁడగు ప్రతాపరుద్రుని భార్య సాలూరు జమీందారులు భళియారసింహ రామచంద్రరాజు తనయ కృష్ణయ్యమ్మ. వీరి కేపురు పుత్రులు. చంద్రశేఖరుఁడు నిండుజవ్వనముననే పరమపదించినందున విశ్వేశ్వరనిశ్శంకబహద్దరు తాతగారి తరువాత జమీందారీకి పాలకుఁడయినాఁడు. కనకమంజరీదేవి యీతని సతి. లోకనాథేశ్వరరాజేశ్వరులు వీరిపుత్రులు.

## సాహిత్యపోషణము

వీరి పూర్వుఁడగు దామోదరుఁడు 'విబుధ సంపోషణాభిరతిని మించిన వాఁడఁట '....సంస్కృతాంధ్రముఖసద్భాషాళి బాల్యంబునన్' (శ్రీమన్నిశ్శంక చరిత్రము, 64) నేర్చిన మంథన్న (నందన్న) నిశ్శంకుఁడు 'నిశ్శంకపురాగ్రహారమును నేమాన గంగనవిద్వన్మణికిచ్చి....' (పైది, 68) నవాఁడఁట ! ఈ సంస్థానాధిపతులలో కృతికర్తగా, కృతిభర్తగా పేరుకెక్కినవాఁడు మృత్యుంజయ నిశ్శంకబహద్దరు వారు. సర్వతోముఖమైన వీరి ప్రజ్ఞాప్రాభవములనుగూర్చి వీరి విద్యాగురువులును ఆస్థానవిద్వత్కవీంద్రులునునగు శ్రీమత్పరవస్తు వేంకట రంగాచార్యులుగారు తమ నిశ్శంకచరితమునందు వర్ణించిన విధానము కేవలము స్వభావోక్తియని యీ ప్రాంతమునందలి పండితులు నేఁటికిని ముచ్చటించి కొనుచుందురు. మచ్చునకు ఆ యనువర్ణనమునందలి కొన్ని పద్యములు :

'సంగీతసాహిత్య సరసవిద్యాగోష్ఠి
  సకలరహస్యవిజ్ఞానుఁడయ్యె
తాళమానప్రౌఢి తత్పరుండయి
  వాద్యవాదకులకు మౌళివర్తియయ్యె
శ్రౌతప్రయోగప్రసంగ విక్రాంతుఁడై

స్మార్తక్రియా పరిశ్రమమునేర్చి
పరమ భేదాభేద వాదనైపుణిచేత
వేదాంతులకు సద్వినోదమొసఁగ
నతుల యమ నియమాసనప్రాణ సంయ
మాదికాష్టాంగసహిత యోగాంతరంగ
సారసముల నెల్లఁ జయ్యనఁ జూఱఁగొనిమె
సంచితవిభుండు మృత్యుంజయప్రభుండు'
'అఖిలశబ్దార్థజ్ఞుఁడయ్యు యాచకులచో
నాస్తి శబ్దము జెప్పనది యెఱుఁగఁడు
స్వాధీనశక్తిత్రయాంచితుఁడయ్యును
శరణన్నచో నెగ్గు సలుపలేఁడు
నీతిశాస్త్రగ్రంథ నిర్మాతయయ్యును
ప్రజలచే నధికరంబు గొనఁడు
అఖిలవిద్యాప్రౌఢుఁడయ్యు నల్పజ్ఞుని
నపమతిసేయఁ డావంతయైన
నాంగ్లరాజ్యాధికారి సౌహార్దయుక్తి
యితరభూపాలురకునెల్ల మేలుసేయఁ
గార స్వార్థంబు వేఁడఁడు ఘనవినీతి
శాలి మృత్యుంజయక్ష్మాపాలమౌళి'
'వైద్యవిద్యానిరవద్యనైపుణి దీన
జనుల రోగముమాన్పి సరిగఁ బ్రోచు
జ్యోతిషశాస్త్ర విజ్ఞాతృత్వమున శుభా
శుభకాలములు మనుష్యులకుఁ దెల్పు
శిల్పవిజ్ఞానవిశేషపరిశ్రుతుఁడౌటఁ
దాన మస్వాదచిత్రముల వ్రాయు
లక్ష్యభేదనమున నర్జునుఁడు గాన
సకలానికాయ మున్నతి ఘటించు
వివిధరత్నపరీక్ష ప్రవేశబుద్ధి
యగుట నిది కృతకం బిది యకృతమనియు
జెప్పనేర్చు నంత విశేషరీతి
నెంచువిధమున నెంచు నరేశ్వరుండు'
—శ్రీమన్నిశ్శంకచరితము, పద్యములు 51, 59, 60.

దీనినిబట్టి మృత్యుంజయనిశ్శంకబహద్దర్ అనేకభాషలలో, శాస్త్రములలో కళలలో ఆరితేరినవారని యెఱుకపడుచున్నది. దేవస్వ బ్రహ్మస్వములక్రింద

వీరి పూర్వులక్షించిన సోమలింగపురము, వెంకటనిశ్శంకపురము, పెద్దనిశ్శంక పురము, నిశ్శంకపురము, గంగమాంబాపురము, సీతమాంబాపురములను నిర్వాహకములుగా ప్రవర్తిల్లఁజేయుటయేకాక, అనేక నూతనగ్రామములను, ఆలయారామతటాకములను నిర్మించి దానదత్తానుపాలన ధర్మశాలిగా మృత్యుంజయ నిశ్శంకబహద్దరు పేర్వడసినాఁడు. 'అనుపమానాంధ్రసంస్కృతా ద్యఖిల భాషలం దతి మనోహరసుధారసాభి మధురలలిత కవితావిలాసంబులకలిగి చెలఁగె జగతి మృత్యుంజయాఖ్యనిశ్శంకనృపతి' (శ్రీమన్నిశ్శంకచరిత్రము, 136). రాజశేఖరవిలాసము, గౌరీవివాహము, శ్రీసూర్యనారాయణచరితము, దశావతార నాటకము, పారిజాతము, హిల్‌జమీంవారుల చరితము, భూమిపాలక విధి దర్పణము, కార్మేకిల్ గుణపత్రికాశ సూక్తిరత్నావళి, మానసబోధ శ్రీశంభు శతకము, భల్లాణచరిత్రము, గుంపసోమేశ్వరచరిత్రము మొదలగునవి యీయన రచించిన ఆంధ్రకృతులలో ముఖ్యములైనవి. 'జనులు సదాచారసంపత్తిఁ జరియింప' సంస్కృతమునందు ఈయన రచించిన నీతిశాస్త్రసంగ్రహము భాషావిషయముగాను, భావవిషయముగాను మేల్తరమైన రచనము. కాళిదాసత్రియమగు శాకుంతల విక్రమోర్వసీయ మాలవికాగ్నిమిత్రములపై ఈయన సంతరించిన వ్యాఖ్యానము లీయన పాండితీపటుత్వమునకు, వ్యాఖ్యానవైదగ్ధ్యమునకు నిదర్శనములు. ఈయన రచనలను కొన్నింటిని క్రమముగా పరిశీలింతము.

నీతిశాస్త్రసంగ్రహము* : ఇది శతశ్లోకసూత్రగుంఫితము. మూఁడు పరిచ్ఛేదములు కలది. సంగమవలస సంస్థానాస్థానపండితులును, ఆంధ్రగీర్వాణాలంకారశాస్త్రప్రవీణులును నగు ఆకెళ్ళ వేంకటశాస్త్రులుగారిచే వ్యాకరణశాణోల్లీఢమై విలసిల్లునటుల నాంధ్రభాషను వ్యాఖ్యానింపఁబడినది. పండితపక్షపాత పరతంత్రులగు కార్మేకిల్ దొరగారి సాదరాలోకపరీక్షిత ప్రశస్తినిబడసినది. సర్వలోకోపకారముగా ప్రసిద్ధములగు నీతివాగ్రత్నములలో కొన్నింటిని హితాచరణతత్పరులగు సుజనులకు కంఠస్థిత రత్నమాలాలంకారముగానుండునట్లు సంగమవలస రాజధాన్యధినాథులగు మృత్యుంజయనిశ్శంకబహద్దరుగారిచే నొనర్పఁబడినది. రెండవకూర్పునందు కృతికర్త కోరికమేరకు చెన్నపురి రెవిన్యూబోర్డు భాషానువాదకులగు శ్రీ పెరుంబుదూరి శేషాచార్యులుగారివలన ఆంగ్లేయభాషలోఁ గొన్నివివరణములు చేర్పఁబడినవి.

'శ్రీ కైలాస పయోరాశీ యమోస్ఫుటతరాలయౌ
భక్త్యాహ మ్ప్రత్యహమ్ నౌమి పార్వతీపరమేశ్వరౌ'

అను దేవతాప్రార్థనముతో కృతి మొదలైనది.

'శ్రీ పరవస్తు వంశాబ్ధిచంద్రమ్ వేంకటపూర్వకమ్

*వర్తమాన తరంగిణీ ముద్రాక్షరశాల, చెన్నపురి 1878.

రంగనాథగురుం వందే సర్వశాస్త్రవిశారదమ్'

ఇది విద్యాగురువులగు పరవస్తువారిపరమైన ప్రపత్తిస్తుతి.

'వాగ్దేవతాంచ విఘ్నేశం నమస్కృత్య త్యాతిభక్తితః
సునీతిసంగ్రహమ్ కుర్వే సర్వేషామ్ సుఖబుద్ధయే'

ఇట్లు వాగ్దేవతా విఘ్నేశ్వరుల ప్రార్థనలనొనర్చి కవి సుఖబోధార్థము తాను నీతిశాస్త్ర సంగ్రహమును చేయనున్నట్లు ప్రతిజ్ఞనల్పినాఁడు. తానంత పండితుఁడైనను—

'క్వ నీతిశాస్త్రవిజ్ఞానమ్ క్వమతి శ్చాల్పసంగతిః
తథాపి విద్వద్దయయా చికీర్షు ర్నీతిసంగ్రహమ్'

ఇట్లు స్వాహంకార పరిహరణరూపమువ తన వినయమును, విజ్ఞతను నిరూపించుకొనినాఁడు. ప్రథమపరిచ్ఛేదమునందు ముప్పదిశ్లోకములును ద్వితీయ తృతీయపరిచ్ఛేదములందు చెఱిముప్పదియైదు శ్లోకములను వెరసి నూఱుశ్లోకము లిందుఁ గలవు. పీఠికాశ్లోకము లైదును అదనము.

పూర్ణచంద్రికావ్యాఖ్య* : కాళిదాసకృత నాటకత్రియమునకు మృత్యుంజయనిశ్శంకబహద్దరుగారొనర్చిన లఘువ్యాఖ్యానములు సంగమవలస వ్యాఖ్యానములనుపేర కళింగసీమలో విస్తృతప్రచారము కలవి. సముద్రాభ్రవసుక్ష్మా (1804) మితశకాబ్దము (క్రీ.శ. 1882)న రచితమయిన శ్రీమన్నిశ్శంకచరితము నందు 'కొత్తగారచియించె శాకుంతలాఖ్యనాటకమునకుఁ బ్రతిపదపేటకంబు'. (పద్య. 69) అని ఉట్టంకింపఁబడుటచే శాకుంతలవ్యాఖ్యయే కాళిదాసత్రియమున కీతఁడు కై చేసిన వ్యాఖ్యలలో మొదటిదని నిర్ధారింపవచ్చు. ఇదియే పూర్ణచంద్రికాఖ్య వ్యాఖ్యానము. 'సుఖబోధాయ బాలానాం క్రియతే పూర్ణచంద్రికా' యని వ్యాఖ్యాతృ ప్రతిజ్ఞ. అతిసంక్షిప్తప్రాచీన వ్యాఖ్యానసంక్లేశిత మానసుల కత్యంతోపకారకముగా నుండుసటులు దీనిని దీర్చితిననియు వివరించినాఁడు.

రత్నదీపికావ్యాఖ్య† : కాళిదాసకృతమగు విక్రమోర్వశీయనాటకమున కిది ప్రతిపదవ్యాఖ్య. మృత్యుంజయభూపాలీయమను ద్వితీయాభిధానముకలది. వ్యాఖ్యాత విద్యాగురువులు పరవస్తు వేంకటరంగాచార్యులుగారిచేతను, సంగమవలస ఆస్థానపండితుఁడు ఆకెళ్ళ వేంకటశాస్త్రిగారిచేతను సమ్యక్పరిశీలితమైన వ్యాఖ్యయిది. సుఖబోధార్థము విరచితమైన ప్రతిపదవ్యాఖ్యకావున వ్యాఖ్యానాంశములలో ఆక్షేపసమాధానాదికములు పరిత్యక్తములైనవి. ఈ నియమమును వ్యాఖ్యాతలే యిట్లు సూచించి సమర్థించికొనియున్నారు.

పదచ్ఛేదః పదార్థోక్తి ర్విగ్రహో వాక్యయోజనా
ఆక్షేపోఽథ సమాధానమ్ వ్యాఖ్యానమ్ షడ్విధమ్ మతమ్'

*వర్తమానతరంగిణీ ముద్రాక్షరశాల, చెన్నపురి, 1882.

†వర్తమానతరంగిణీ ముద్రాక్షరశాల, చెన్నపురి, 1884.

'ఏవం వ్యాఖ్యానస్య లక్షణషాడ్విధ్యం స్థిరమ్ తదేవానుస్మృతం చాస్మాభిః ఏష్వేవ శేషు ఆక్షేపసమాధానయో రేవ గ్రంథవైపుల్య భీరుతయా ప్రపంచో నకృతోఽస్మి న్నాటకవ్యాఖ్యానే ఏవమ్ విద్వాంసో మదీయాశయం విదాం కుర్వన్తు' అని స్పష్టపఱచియున్నారు.

'శ్రీ మృత్యుంజయనిశ్శంక క్షితిపాలవరేణ్య రచ్యతే స్పష్టమ్
శ్రీ రత్నదీపికాఖ్యా వ్యాఖ్యా శ్రీ విక్రమోర్వశీయస్య
కవీం శ్రీ కాళిదాసాద్యా నభివంద్య గురూనపి
సర్వేషాం సుఖబోధార్థం కుర్వే శ్రీ రత్నదీపికామ్'

అని ప్రస్తావనలో వ్యక్తీకరించిరి. అతిసంకుచిత ప్రాచీనవ్యాఖ్యాన సంక్లేశిత మానసులను సంస్కృతభాషాభిలాషులను నగు జనులను దృష్టిలో నిడికొని దీనిని తాము రచింపఁబూనుకొనినట్లు వ్యాఖ్యాతలు వివరించిరి.

విబుధ రంజనీ వ్యాఖ్య* : కాళిదాసకవికృతమగు మాలవికాగ్నిమిత్ర నాటకమునకిది ప్రతిపదవ్యాఖ్య. మృత్యుంజయక్షోణిపాలీయ ద్వితీయనామధేయ సహితము. మృత్యుంజయనిశ్శంకబహదరుగారి కాళిదాసప్రియ వ్యాఖ్యానము లలో నిది మూఁడవది. సూత్రధారాదుల లక్షణమునకు వ్యాఖ్యాత రచించిన విక్రమోర్వశీయ వ్యాఖ్యయగు రత్నదీపికను చూడవలయునని కోరుటచేత విక్రమోర్వశీయవ్యాఖ్య దీనికి పూర్వ రచనమనియు శాకుంతలవ్యాఖ్యాన మిందు దాహృతమగుటచే మాలవికవ్యాఖ్య చివరిదనియు నిర్ణయింపనగును. వ్యాఖ్యాన ప్రారంభమునం దిట్లున్నది :

'శ్రీవాణీనగజాధీశాన్ ప్రణమ్యక్రియతే మయా
శ్రీ మాళవికాగ్ని మిత్రవ్యాఖ్యా విబుధరంజనీ'
'శ్రీ మృత్యుంజయనిశ్శంక భూపాలేన విరచ్యతే
సుఖబోధాయ సర్వేషామ్ వ్యాఖ్యా విబుధరంజనీ'

చెన్నపురిరాజ్యపు మంత్రాంగపరిషత్ సభ్యులును, సర్వవిద్యా ప్రవీణులును, ఆనరబుల్ డేవిడ్ ఫ్రీమాంటిల్ కార్మైకేల్ దొరగారి సూచనమేరకు ఈ వ్యాఖ్యాన త్రయమును వ్రాసిరఁట ! సంస్కృతభాషాసంబంధమైన వీరి యీ కృషిని గుర్తించి, ఏడవ ఎడ్వర్డు ప్రభువు రాయల్ ఏషియాటిక్ సొసైటీ కధ్యక్షులుగా నున్నప్పుడు రాజాగారి కాళిదాసవ్యాఖ్యానములనుగూర్చి గొప్పగా ప్రస్తుతించి రాజాగారిని సొసైటీ సభ్యులుగా నియమించి గౌరవించిరి.†

ఇక రాజాగారి ఆంధ్ర కృతులను గుఱించి :

హిల్ జమీందారుల చరితము‡ : రాజా మృత్యుంజయ నిశ్శంకబహద్దరు

* వర్తమాన తరంగిణీ ముద్రాక్షర శాల, చెన్నపురి, 1884.

† శ్రీమన్నిశ్శంక చరిత్రము, పు. 166.

‡ వర్తమాన తరంగిణీ ముద్రాక్షర శాల, చెన్నపురి, రెండవకూర్పు, 1887.

కృతము. నాఁటి విశాఖపట్టణ మండలము కలెక్టరుగారైన కార్మెకిల్ దొరగారి యాదేశము చొప్పున పురాణేతిహాసాదులను బరిశీలించి జయపుర రాజ్యావతరణము, వారి వంశావళియు, వారిచే నేర్పఱుపఁబడిన కొండజమీందారుల చరిత్రమును సంగ్రహముగా నిరూపింపఁబడిన మూఁడు ప్రకరణముల వచన రచనము.

మానసబోధ శ్రీశంభు శతకము†: 'శ్రీ శంభో శ్రీ శంభో శ్రీ శంభో యనుచు స్మరణసేయుము మనసా' — ఈ ద్వితీయార్ధ పద్యము మకుటముగా, ఏక ప్రాస ప్రధానముగా, ప్రపత్తి నిధానముగా నొనర్పఁబడిన శతసంఖ్యాక కంద పద్యసందంబ మీ కృతి. అక్కడక్కడ టుప్టిక అధోజ్ఞాపికలో నొసఁగఁబడినది.

'శ్రీ విఘ్నేశు నుతించెద
నే విఘ్నములేక బోఁచి నెలమిని నెపుడున్
శ్రీవిధి పత్నులఁ గొలిచెద
శ్రీవిలసిల్లఁగను విద్య సిరియు నొసంగన్'

అను ఇష్టదేవతాప్రార్థనమునకు సంబంధించిన పద్యము శతకాదియందు శతక నియమములకు సంబంధము లేకుండ సంధానింపఁబడినది. ఇట్లే శతాంత మందును —

'వందనమొనర్చి పరవస్తు వంశచంద్రు
లైన శ్రీరంగవర్యుని లలితకృపను
జెంది నేఁ జెప్పి తీ స్తుతి చిత్తమెప్ప
నందముగఁ గందశతక మానందములర'

అను విద్యాగురు స్తుతిపరమైన తేటగీతియును శతకనియమమునకు సంబంధించినది కాదు. మచ్చునకు మాదిరికి ఒండు రెండు పద్యములు :

'శ్రీశైలభ్రమరాంబా
ధీశుని పదపూజనంబె దృఢమనుము సదా
శ్రీశంభో శ్రీశంభో
శ్రీశంభో యనుచు స్మరణసేయుము మనసా'

'శ్రీశుఁడు మృత్యుంజయ భూ
మీశుఁడు వరదుఁడనుచు నెపుడు మేలు దలిర్పన్
శ్రీశంభో .... .... ....
.... .... ....

దశావతార లఘునాటక యక్షగానము : సర్వవిద్యా ప్రవీణుఁడగు మృత్యుంజయనిశ్శంకబహద్దరు 'స్త్రీవేషధారు లచ్చెరుపడఁ బారిజాతమను భామాకలాపము రచించె'నని తనికెళ్ళ ప్రకాశశాస్త్రిగారు తమ నిశ్శంకవంశకావ్యమునఁ

† కేశవరాజు అండు కంపెనీవారి ముద్రాక్షరశాల, మచిలీబందరు, 1873.

చేయించినారు.

ఆంగ్లాధిరాజ్య విఖ్యాపనవేళ శ్రీ మృత్యుంజయనిశ్శంక బహద్దరు విక్టోరియా మహారాజ్ఞిపై ప్రశంసాపద్యరత్నావళి రచించి 'ఎంప్రెస్సాఫిండ్యా పద్యరత్నములు' అను పేర సమర్పించియుండిరి. ఇందైదు కందపద్యములు వాని యాంగ్లానువాద ములు, ప్రెస్సాఫ్ వేల్సు నుపశ్లోకించు రెండు శ్లోకములు వాని యాంగ్లానువాదములు గలవు.[1] మహారాజ్ఞి పట్టాభిషేకోత్సవ సందర్భమున మృత్యుంజయనిశ్శంకబహద్దరువారి పాండిత్యమునకు పరిపాలనాశక్తికిని సూచకముగా యోగ్యతాపత్రము ప్రసాదింపఁబడి యుండినది.

## విశ్వేశ్వరనిశ్శంకబహద్దరు

శ్రీ మృత్యుంజయనిశ్శంక బహద్దరువారి పౌత్రుఁడును, చంద్రశేఖర నిశ్శంక పుత్రుఁడును తరువాతి జమీందారును నగు శ్రీ విశ్వేశ్వరనిశ్శంక బహద్దరుగారు గీర్వాణాంధ్రాంగ్లేయోత్కలాది భాషలలో మిక్కిలి ప్రావీణ్యము కలవారు. ఆంధ్రభాషాభిమానులు. కవితావిషయమున అంతో ఇంతో కృషిచేసిన వారు. విద్యావినయవివేకసంపత్తియందును, దానదయాధర్మపరివృత్తి యందును తాతగారిని పోలినవారు.[2] ఈయన రచించిన గ్రంథము లేవియును లభ్యము కాలేదు కాని పంచమ జార్జిచక్రవర్తి పట్టాభిషేక సమయమును పురస్కరించి కొని విశ్వేశ్వరనిశ్శంకబహద్దరు గీర్వాణాంధ్రభాషలలో రూపొందించిన భాస్కర మాలికా[3] నవరత్నమాలికాది ప్రాస్తావిక పద్యములు కొన్ని లభ్యములైనవి. భాస్కరమాలికనుండి మచ్చునకొక పద్యము :

'ఉరమున శస్త్రనిస్తుల మహోజ్జ్వలమౌక్తికమాలికావళుల్
శిరమున నూత్నరత్నగణ చిత్రిత కాంచనసత్కిరీటమున్
కరమునఁ బ్రాజ్యరాజ్యసుఖకారణ శాత్రవచండదండమున్
సరవి ధరించె జార్జినృపచంద్రముఁ డయ్యభిషేకమౌ తరిన్'.

సాంద్రటీకా నవరత్నమాలిక యందు తొమ్మిది సంస్కృతశ్లోకములు వాని టీకయు చివర పూర్వోక్తశ్లోకములలోని భావములే కూర్పఁబడిన తొమ్మిది పద్యములును గలవు. మాదిరికొక పద్యము :

'పరిషది విబుధానాం పాకహంతేవ సాక్షా
త్సదసి నరపతీనాం జార్జిరాజా చకాసే
పరిసరభువి మేరీచక్రివర్తిన్యపీయం
తమను సముపవిష్టా తత్ప్రియేవా బభాసే'

1 లక్ష్మీ ప్రెస్, విశాఖపట్టణము, 1882.

2 ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, 1911, పు. 250.

3 I.L.P. Press, Vizagapatam, 1911.

దీని యనువాదమిది :

> 'సురపరిషత్తులోన బలసూదనుచందమునన్ సమస్త భూ
> వరసభలోన జార్జివిభువర్యుఁడు శోభవహించెనెంతయున్
> సురపతి సన్నిధానమునఁ జూడఁ బులోమజవోలె జార్జిరా
> ట్పరిసరభాగసంస్థితిని భాసిలె శ్రీమతి మేరిరాణియున్'

సంగమవలస సంస్థానాశ్రితుఁడును, రామమూర్తిశర్మ పుత్రుఁడును నగు నేమాన సూర్యప్రకాశకవి రచించిన శ్రీమన్నిశ్శంకచరిత్రము అను చారిత్రిక కావ్యము విశ్వేశ్వరనిశ్శంకబహద్దరున కంకితము.

హద్దునూరి వేంకటరాయపండితుఁడు మృత్యుంజయనిశ్శంకబహద్దరుగారి ప్రధానసచివుఁడు. ఆతని యనుజుఁడగు హద్దునూరి కృష్ణరాయఁ డేకాంత సచివుఁడు. సంస్కృతాంధ్రాంగ్ల యవసదర్శన విమర్శకుఁడగు దేవరాజు వేంకటరాయఁడు ముఖ్యకార్యదర్శి.

సంగమవలస ఆస్థానమునందు మహామహోపాధ్యాయ పరవస్తు వేంకట రంగాచార్యులుగారును, ఆంధ్రగీర్వాణవైయాకరణులగు ఆకెళ్ళ వేంకటశాస్త్రి గారును,* తనికెళ్ళ ప్రకాశశాస్త్రిగారును ఆస్థానపండితవర్యులుగా నుండిరి. పరవస్తు వేంకటరంగాచార్యులవారి ప్రతిభాపాండిత్యములు జగత్ప్రసిద్ధములు. శ్రీ రంగాచార్యులుగారు తమశిష్యుని సాహిత్యాభిరుచికిని ఆర్షధర్మప్రచార నిరతికిని సంతోషించి శ్రీమన్నిశ్శంకచరితము† అను గ్రంథమును వ్రాసిరి. ఇది నిశ్శంకవంశమువారి చరిత్రమునుదెలుపు చారిత్రిక పద్యప్రబంధము.

సంగమవలస ఆస్థానకవులలో బహుగ్రంథరచయిత తనికెళ్ళ ప్రకాశ శాస్త్రిగారు ‡ ప్రాక్పురరాజకుమారాభ్యుదయము, జగన్నాథరథోత్సవవిలాసము, శ్రీకృష్ణరాయబారము, వేదాంతసిద్ధాంతప్రకాశము, గుణనిధిచరిత్ర నాటకమను శివరాత్రిమాహాత్మ్య యక్షగానము, నిశ్శంకమహీపాలచరిత్రము, వాసంతికా వసంతమను శృంగారప్రబంధము, ధన్వంతరిక్షేత్రమాహాత్మ్యము, చంద్రశేఖర శతకము మొదలగు రచనలు గావించిరి. ఏతద్గ్రంథప్రేరకప్రభువు శ్రీ రాజా మృత్యుంజయనిశ్శంకబహద్దరువారు.

> 'నెన రొప్పారఁ బ్రకాశనామకవి నన్ నిశ్శంకభూమీంద్ర మం
> దనుఁ డాత్మీయ సభాకవీంద్రుఁడగుటన్ రప్పించి మెప్పించి యా

* 'ఆకెళ్ళ వేంకటేశాఖ్యు ననేకశాస్త్రజ్ఞు నాస్థానవిద్వాంసుఁజేసె' —శ్రీమన్నిశ్శంక చరితము, పద్య. 61.

† ఆర్షముద్రాక్షరశాల, విశాఖపట్టణము, 1886.

‡ 'సంస్కృతాంధ్రద్విభాషాతిసాహితీ సుకవన సంపత్సహితులు ప్రకాశశాస్త్రి ముఖ్యు లాస్థాన సుకవిప్రముఖులు....' —శ్రీమన్నిశ్శంకచరిత్రము, 192.

తనితో నిట్లనె నో ప్రకాశకవిచంద్ర! చెప్పవే సూక్తి గుం
ఫనచే నాటక మెద్దియైనను వినన్ మా కాదరంబయ్యెడిన్'

—గుణనిధిచరిత్ర.* పు. 4.

శివరాత్రిజాగరము ప్రశస్తిని, పవిత్రతను ప్రకటించు కాశీఖండమందలి కథ గుణనిధిచరిత్ర. సంగమవలస దివానుగారైన దేవరాజు వేంకటరాయఁడును, వారి సోదరులు కృష్ణారాయఁడును, సంస్థానోద్యోగి వావిలకొలను అప్పారావును ప్రోత్సాహకులుగా నీ కృతి రూపెత్తినది.

సంస్థానాధిపతుల ప్రేరణమున హట్టుసూరి వేంకటరాయసత్పండితుఁడు 'ఆంగ్లహిందుస్థ నామమాల'ను రచించెఁట (చూ. నిశ్శంకచరితము, 69) మృత్యుంజయనిశ్శంకబహద్దరు తృతీయపుత్రుఁడును, విశ్వేశ్వరనిశ్శంకబహద్దరు రెండవపినతండ్రియును నగు '....శంకరనిశ్శంకనరపతి నిరుపమానాంధ్రసంస్కృతాద్యఖిలభాషాప్రవీణుండు గానవిద్యావిదుండు సత్కవిత్వరతుఁడు....'† లోకనాథేశ్వరనిశ్శంకబహద్దరు బరంపురములోని కళాప్రచారకసమితికిఁ బోషకులు.

* ఆర్షముద్రాక్షరశాల, విశాఖపట్టణము, 1899.

† శ్రీమన్నిశ్శంకచరిత్రము, 207.

## ఉపజీవ్య గ్రంథసూచి

1. పరవస్తు వేంకటరంగాచార్యులు, శ్రీమన్నిశ్శంకచరితము, విశాఖపట్టణము, 1886.

2. విశాఖపట్టణముజిల్లా వృత్తాంతసంగ్రహము, పుటలు 541, 542.

3. నేమాన సూర్యప్రకాశము, శ్రీమన్నిశ్శంకచరిత్రము, స్వేచ్ఛావతీప్రెస్సు, బరంపురము, 1913.

4. నిడుదవోలు వేంకటరావు, ఆంధ్రసంస్థానములు — సాహిత్యసేవ, తెలుగు విజ్ఞానసర్వస్వము–3, పుటలు 1171–1175.

5. A. Vadivelu, The Aristocracy of Southern India, Vol. I, pp. 191–196.

6. M. A. M. P., Vol. III, p. 657.

# సాలూరు

## ప్రవేశిక

ఇది నేఁటి శ్రీకాకుళమండలములోనిది. 'సాలూరు జయపురము సవర రాజులును' అని పిల్లల దసరాపద్యములలో పేర్కొనఁబడిన యీ సాలూరు సంస్థానము ప్రాచీనమైన కొండజమీందారీలలో నొకటి. గజపతినగరము, పార్వతీపురము, పొట్టంగి, బొబ్బిలి తాలూకాలమధ్య నిది యమరియుండినది. ఈ సంస్థానమునందు 102 జిరాయితీగ్రామములు, ఇరువదియేఁబు ప్రాచీనాగ్రహారములు, శాశ్వతకరనిర్ణయమున కిటీవల నేర్పడిన తొమ్మిది నవీనాగ్రహారములు, పదునేడు మొఖాసాగ్రామములు వెరసి నూటయేఁబదినాలుగు గ్రామములుండినవి. సంస్థానమంతయు మక్కువ, మరడాము, సాలూరు అని మూఁడు పరగణాలు. 1802 లో రాఁబడి రూ. 66 వేలు. పేష్కషు రూ. 36 వేలు. 1938 లో రాఁబడి రూ. 169 వేలు. పేష్కషు రూ. 28 వేలు. విశాఖపట్టణమున కుత్తరముగ 30 కోసుల దూరమునను, చికాకోలునకు పడమరగ 25 కోసులదూరమునను వేగవతీ నదీతీరమునఁగల సాలూరుపట్టణము దీనికి రాజధాని. సంస్థాననామము ఈపట్టణమువలననే సిద్ధించినది.

## సంస్థాన చరిత్రము

కొండరాజుల వంశమునకుఁజెందిన కిమ్మూరివారిలో జ్యేష్ఠుఁడగు నొక సరదారునకు అతఁడు ప్రదర్శించిన ధైర్యసాహసముల కభినందన చిహ్నముగా సాలూరు, పెద్దపద ప్రాంతములు కలిపిన సంస్థానము జయపురసంస్థాన పాలకుఁడగు విశ్వంభరదేవు (1672–1676) గారిచేత 'పెదబొలియార్ సింహో' అను గౌరవబిరుదముతో ప్రసాదింపఁబడినది.* ప్రధాన శాపవిమోచన కృత్యవతరణిక యందును '....ఒసఁగె పేత్రొక్కచారుడు సాలూరిని బొళియారొ సింహమన్బిరుదుతో విశ్వంభరేశ్వరుండు' (పద్య. 19) అని యీ అంశమే ఆమోదింపఁబడినది.

విశ్వంభరదేవుగారు చినపెగ్గడ యనునొక బ్రాహ్మణునకు తమ కన్యక నిచ్చి వారికే రాజ్యము నరణముగాఁ బ్రసాదించినట్లు సాలూరువారి వంశావళి

*విశాఖపట్టణము జిల్లావృత్తాంతసంగ్రహము, పు. 535; హిల్ జమీందారుల చరితము, పు. 11; Report of the Madras Estates Land Act Committee, Part II, 1938, p. 30.

యందుఁగలదని విజయరామగజపతి గ్రంథకర్తలు వ్రాసిరి*. నిష్ఠల సింహాచల సిద్ధాంతి కృతమగు 'కిమ్మూరి వంశావళి'యు పూర్వోక్తమయిన సాలూరువారి వంశావళియు భిన్నములో అభిన్నములో నిరూపింప వలనుపడలేదుగాని కిమ్మూరి వంశావళియందు సైతము సాలూరుపాలకుల మూలపురుషులు పారాశర గోత్రజులగు బ్రాహ్మణులేయని పేర్కొనఁబడినారు :

'బ్రాహ్మణకులమందు పావనులెందఱో
    పుట్టినా రందు కిమ్మూరివారు
పెద్దప్రగడయును చిన్నప్రగడయును
    సోదరులిద్దరు జోడుగూడి
యోడబేరంబులనాడి ధనముగూర్చి
    కాంచన నవరత్న ఖనులసంగఁ
బేర్వడీనా రిల సర్వజనులచేత
    వారు నియోగులు పౌరుషమున
భూమిపతులతో వ్యవహారములఁ దగిలి
తూర్పుదేశమునకువచ్చి నేర్పుగలిగి
జయపురపతి విక్రమదేవ జనపుతోడఁ
జెర్మిజేసిరి రాకట వల్మఁజగుట.' ---కిమ్మూరివంశావళి, 37.

ఈ ప్రెగడలిద్దఱును శత్రువులతోడి యుద్ధమున జయపుర పాలుఁడగు విక్రమ దేవునకు తోడ్పడి విజయమొసఁగుటచే జయపురాధిపతి ఎంతో సంతోషించి 'రత్నారావను పేరును రత్నసమత్కారము వినుతరాజ్యము—రిన్నారత్నము....' (పైది, 48) అగు లక్ష్మీదేవిని చినప్రెగ్గడ కిచ్చి పెండ్లిగావించి-

'మరిన రేవలసయను గ్రామంబు బట్ట
ణంబుజేసి సాలూరు నామంబుపెట్టి
ప్రకటితముగ రత్నారావునకు నొసంగి
పుత్రికను నల్లునినిరూడ పూని నిలిపె' (పైది, 54).

ఈ రత్నారావు సంతతియే సాలూరు పాలకులని కిమ్మూరి వంశావళి యందు విపులీకరింపఁ బడినది. ఈ కిమ్మూరి వంశావళి సాలూరు చివరి పాలకులలో నొకరగు రాజా లక్ష్మీనరసింహసన్యాసిరాజు పెదబొబ్బిలియారుసింహ బహద్దరు (1885—19 ) గారి ప్రేరణమున రచితమైన కృతికావున సాలూరి పాలకులు బ్రాహ్మణులను వంశము త్రోసిపేయరానిది.

కాని కార్మైకిల్ దొరగారి విశాఖపట్టణముజిల్లా మాన్యువలునందు వీరు 'కొండరాజజాతమువారు'గా పేర్కొనఁబడుటకు కారణము తెలియదు. సాలూరు పాలకులు క్షత్రియులనియే పదివేలుగారి నిర్ధారణము

* కవికొండల వేంకటసత్యనారాయణమూర్తి, విజయరామగజపతి, పు. 84.

కూడ.* కిమ్మూరి వంశావళియందు సాలూరు రాజ్యప్రదాత విక్రమదేవు(డని చరిత్రగతికి విరుద్ధముగ పేర్కొన(బడుట విశ్వాస్యముగా( దో(చదు. విశ్వంభరదేవు (1672--1676) కాలమున సాలూరు జమీందారీ యేర్పడినట్లు చరిత్రలో స్పష్టముగా నిర్ధారింప(బడినది.

కిమ్మూరి వంశావళిగ్రంథమునందు సాలూరిపాలకుల వంశావళి జయపుర రాజపుత్రి లక్ష్మీదేవికి రత్నారావునకు( గలిగిన సంతతిగా నిరూపింప(బడినది. వీరికి అప్పలనరసింహరాజు ఔరసుడు. ఆయనకు కృష్ణరాజు కుమారుడు. ఆ కృష్ణరాజునకు పెదసన్యాసిరాజు, చినసన్యాసిరాజు, పద్మరాజు, నరసరాజు, జగ్గరాజు అని ఐదుగురు తనయులు. పెదసన్యాసిరాజునకు పట్టపురాణి సీతా[illegible]దేవి. వీరు నిస్సంతగుటవలన చినసన్యాసిరాజు తనయు(డగు రామచంద్రరాజును పుత్త్రు(డుగా స్వీకరించిరి.

1760 ప్రాంతముల జయపుర సంస్థానాధికారమునకై తలయెత్తిన జ్ఞాతికలహములో విజయనగర సంస్థానాధీశు లొకపక్షము వహించి గెలిపించి ప్రతిఫలముపేరట సాలూరు మున్నగు జయపుర సామంతరాజ్యములను తమ సరిహద్దులలోనున్నవానిని బలవంతముగా లాగికొనిరి. సాలూరు మొదలయిన జయపురమువారి సరివారులకిది సైపరానిదయి విజయనగరముపై కక్షగట్టి తమ పక్షమును బలపఱచికొను ప్రయత్నములలో నుండ(గా విజయనగర పాలకులు సాలూరు ప్రాబల్యమును తగ్గింపవలయు నుద్దేశముతో సాలూరు జమీలోని మక్కువహూండాను విడ(దీసి సన్యాసిరాజు తమ్ము(డగు నరసరాజు గారికిని, అందరిదేయగు రామభద్రపురము పరగణాను మఱియొక తమ్ము(డగు పద్మరాజుగారికిని పంచియిచ్చి తక్కిన సాలూరు సంస్థానము నామమాత్రముగా పెదసన్యాసిరాజు పరముగా నిలిపిరి. ఆ పెదసన్యాసిరాజు నడివయసుననే మరణింప(గా దత్తపుత్త్రు(డు రామచంద్రరాజు (1772–1801) పసివా(డగుటచేత అతని నిజజనకు(డగు చినసన్యాసిరాజు సంస్థానపాలనమును పర్యవేక్షింప మొదలుపెట్టెను.

రామభద్రపుర పాలకు(డైన పద్మరాజును, మక్కువ పరగణా పాలకు(డైన నరసరాజును విజయనగరము సంస్థానమువారికి వ్యతిరేకముగ చెలరే(గిన కొండ జమీందారీకుట్రలో( జేరకపోవుటవలనను విజయనగరము వారి దివాన్ సీతారామరాజుగారి యనుగ్రహమునకు( బాత్రులగుటచేతను

* A. Vadivelu, The Ruling Chiefs, Nobles & Zamindars of India Vol. I, 1966. p. 697; II "....విశ్వంభరదేవుగారు....సాలూరు ఎస్టేటును గూడ నొకరాచదొరకు( 'పరాక్రమసింహ' మను నర్థమిచ్చు 'బలియారసింహో' అను బిరుదముతో( దనయొక్క సర్దారునకొసంగి ప్రత్యేకపు జమీ నేర్పఱచెను" (నానారాజన్య విఖ్యాతజనచరిత్రము, జయపుర సంస్థానచరిత్ర, పు. 67).

సూర్యరాజు నరసరాజుగారలు తక్కిన కొండజమీందారులవలె విజయనగరము వారిచే బంధింపఁబడలేదు. ఈ కొండజమీందారుల పితూరీలో సాలూరు జమీందారగు సన్యాసిరాజుగారు ముఖ్యపాత్రము వహించియుండిరి. కుట్రదారుల రహస్యసమావేశములో పాల్గొనుటకేఁగిన చినసన్యాసిరాజుగారిని పర్లాకిమిడి ప్రాంతముల విజయనగరమువారి సేనాని దాట్ల వేంకటపతిరాజు పట్టుకొని చెఱపెట్టిరి.

అప్పుడు సాలూరు కోటలో చినసన్యాసిరాజు కుమారులగు రామచంద్రరాజు, భోజరాజు, బుచ్చిరాజు అను వాడుకపేరుగల అప్పలరాజు మాత్రముండిరి. సీతారామరాజు కొంతసేనను పంపి సాలూరుకోటను లగ్గలుపట్టించి రాజకుమారుల ముగ్వురను బంధించితెచ్చి వారి తండ్రిగారితోపాటు వీరిని గజపతినగరము చెంతనున్న దేవుపల్లికోటలో ఖైదుచేసిరి. సాలూరుకోటలోని ధనాగారము కొల్లగొట్టఁబడినది. చినసన్యాసిరాజు ఖైదులోనే 1774లో చనిపోఁగా సాలూరు జమీనంతటిని విజయనగరమువారు దఖలుపఱచికొనిరి. విజయనగరమువారి తాణా ఒకటి సాలూరులో వెలసినది. ఇట్లీ సంస్థానము ఇంచుమించుగా నిరువదియేండ్లపాటు విజయనగరమువారి యిలాఖాలో నుండినది.

1793లో విజయనగరముపాలకులు సాలూరు రాజకుమారుల ముగ్వురను విడుదలచేసి స్వల్పమగు 'భరణము'ల నేర్పఱిచిరి. 1794లో పద్మనాభ యుద్ధమున విజయనగర సంస్థానాధిపతి విజయరామరాజు (1747–1794) వీరస్వర్గమలంకరింపఁగా నార్తరన్ డివిజన్ కలెక్టరుగారు 1796లో సన్యాసిరాజుగారి కుమారులలో జ్యేష్ఠుఁడగు రామచంద్రరాజునకు సాలూరును వప్పులనకిచ్చి సంస్థానమును పునరుద్ధరించిరి. రామచంద్రరాజుభార్య సీతాసోము దేవి. వీరికి సన్యాసిరాజు, నరసరాజు, కృష్ణరాజు, రామచంద్రరాజు, సూర్యరాజు, చినసన్యాసిరాజు అని ఆఱుగురు పుత్రులు.

రామచంద్రరాజు 1801లో చనిపోయినందున ఆయన పెద్దకుమారుఁడగు సన్యాసిరాజుతో 1803లో రూ. 36 వేల సాలుసరి పేష్కషుమీఁద సాలూరు జమీందారీకి శాశ్వతపరిష్కారము జరిగినది. ఈ సన్యాసిరాజునకు నారాయణ రామచంద్రదేవు, నారాయణభోజరాజు అని యిరువురు కుమారులు. 1830లో సన్యాసిరాజు చనిపోఁగా ఆయన కుమారుఁడు నారాయణరామచంద్రదేవునకు జమీందారీ సంక్రమించినది. ఈయన పదునాఱేండ్లు సంస్థానమును పాలించి 1846లో పరమపదించిరి. ఈయనభార్య గుంసూరు జమీందారుల యాఁడుబిడ్డ సీతయ్యాంబ. ఈయన హయాములో పెంట, మెట్టవలస, శ్రీరామపురము అను మూఁడు గ్రామములు బొబ్బిలిపాలకులకు విక్రయింపఁబడినవి.

సీతయ్యాంబవలన నారాయణరామచంద్రదేవునకు సన్యాసిరాజు, జగన్నాథ

సన్యాసిరాజు, సీతారామరాజు, రామభద్రరాజు, నారాయణకృష్ణరాజు, రామచంద్ర రాజు అని అయిదుగురు కుమారులు. నారాయణరామచంద్రదేవు మరణానంతరము ఆయన పెద్దకుమారుడగు సన్యాసిరాజు (1854—1869) ఆనాఁటికి మైనరగుటచే 1846 1854 మధ్య సంస్థానము కోర్టు ఆఫ్ వార్డ్సు పర్యవేక్షణమున నుండినది. ప్రాజ్ఞతరాఁగా ఇతఁడు 1854లో జమీకివచ్చి పదునైదేండ్లు పాలించి 1869లో మరణించెను. ఈ సన్యాసిరాజు భార్య లక్ష్మీనరసయ్య పట్టమహాదేవి. వీరి పుత్రుఁడగు రాజా శ్రీజగన్నాథనారాయణరామచంద్రరాజుగారికి జమీ సంక్రమించినది. ఇతఁ డానాఁటికి మైనరు. అందువలన సంస్థానము మరల 1869 1878 మధ్య కోర్టు ఆఫ్ వార్డ్సు స్వాధీనమున నుండినది.

ఈ కాలమునందే జగన్నాథనారాయణరామచంద్రరాజు పితృవ్యులలో నొకఁడగు జగన్నాథసన్యాసిరాజునకు సాలూరు సంస్థానము అయిదేండ్లపాటు ఇజారాగా నీఁబడినది. ఈతరుణమునందు సంస్థానచరిత్రమునకు సంబంధించిన ప్రామాణికపత్రము లనేకము గల్లంతయినందున సాలూరు సంస్థానపు పూర్వ పూర్వయుగముల యథార్థచరిత్రమును నిర్ణయించుట దుస్సాధ్యముగా నున్నది.

జగన్నాథనారాయణరామచంద్రరాజు (1858 1894) యుక్తవయస్కు వచ్చిన పిమ్మట 1878లో జమీపాలనము చేపట్టెను. ఇతనిభార్య పర్లాకిమిడి జమీందారుల బంధువులగు [illegible] జమీందారుల పుత్రికయగు సీతయ పట్టమహాదేవి. నారాయణరాజు చంచలచిత్తుఁడగువాఁడు. సంస్థానవ్యవహారము లను సరిగా నిర్వహించనందున అప్పులు పేరుకొనిపోయినవి. ఇతని తల్లి లక్ష్మీనరసయ్య పట్టమహాదేవి గూడ సంస్థాన పాలనమును చక్కబెట్టలేక పోయినది. సంస్థానమును చక్కబెట్టుట యిక్కట్లెన్నో చుట్టుముట్టినవి. ఇట్టి ఇబ్బందులున్నట్టుగ 1894లో నారాయణరామచంద్రరాజు మరణించెను.

లక్ష్మీనరసింహసన్యాసిరాజు అను నతఁడు నారాయణరామచంద్రరాజు కుమారుఁడు: జమీందారీకి వారసుఁడు ఇతఁడుకూడ మైనరు. సంస్థానము మరల కోర్టు ఆఫ్ వార్డ్సు మరియు 1906 దాఁక వారి వశమున నుండినది. ఎస్టేటు ఆనాఁటికి అప్పులలో దలమునకలుగా నుండినది. చిన్నవి, పెద్దవి అన్నియు లెక్కించఁగా అప్పులు ఏబదిన్నర లక్షల దాఁక తేలినవి. ఇందులో అందాజుగా అయిదున్నర లక్షలు బొబ్బిలి జమీందారుల కీయవలసిన మొత్తము. ఈ ఋణమును పరిష్కరించు నిమిత్తము పెదపంకి మొదలగు పదిపంద్రెండు గ్రామములను బొబ్బిలిపాలకులకు అప్పులక్రింద జమకట్టవలసి వచ్చినది.

లక్ష్మీనరసింహసన్యాసిరాజు చెన్నపురి న్యూయింగ్టన్ కళాశాలలో 1894 1905 మధ్య పాశ్చాత్యబోధకుల పర్యవేక్షణమున విద్యాభ్యాసము గావించి 1906లో జమీకి వచ్చెను. గంజాము మండలమునందలి చీకటి జమీందారుల ఆఁడుఁబడుచు కృష్ణ పట్టమహాదేవి వీరి మొదటి భార్య: రెండవ

భార్య రజపూటు ఎస్టేటులోని రొత్తా గ్రామములోని యొక రాజకన్య. ఈయనకు మొదటి భార్యవలన ముగ్గురు కుమారులు. పెద్దవాఁడు రామచంద్ర రాజు 1908 లో జన్మించెను. రెండవ కుమారుని చీకటి జమీందారు సోదరుఁడును ఛత్రపురము ఎస్టేటుదారుఁడును నగు రామచంద్రదేవునకు పెంపకమున కిచ్చిరి. లక్ష్మీనరసింహరాజుగారికి పుత్రసంతానము లేనందున ఒక రాచ కొమారితను పెంపకముతెచ్చి తమ కులదేవతయగు కామినీదేవిపేర కామినీ ప్రసాదదేవి యని నామకరణమొనర్చి నయాగఢ్ సంస్థానాధిపతి లడుకిశోర్ సింహుని (1843—1890) దౌహిత్రుఁడగు సూరశ్రీ సీతానాథదేవుగారి కిచ్చి పరిణయ మొనర్చిరి.

రామచంద్రరాజు భార్య 'తర్ల' ఎస్టేటువారల కూఁతురు. వీరి కుమారుఁడు పెదబొలియారుసింహ లక్ష్మీనరసింహ సన్యాసిరాజు. జయపురమువారి రాజబంధువుల ఆఁడుఁబడుచు ఈతని భార్య. ఈతఁడు కొంతకాలము ఆంధ్రప్రదేశ శాసనసభాసభ్యులు.

## సాహిత్యపోషణము

సాలూరు జమీందారులు కవులను, గాయకులనుమాత్రమేకాక వేద పండితులను, శాస్త్రపండితులనుకూడ పోషించినవారు. వీ రోఢ్రు లయినను తెనుఁగును జదువను వ్రాయను మాటాడను నేర్చినవారు. ఓఢ్రభాషా సాహిత్యము లకు వీరొనర్చిన సేవ ఏదియును కానరాదు. వీరి వంశమునందు కృతిభర్తలతో పాటు కృతిప్రేరకులు, కృతికర్తలుకూడ వెలయుటొక విశేషము. మన్నెదేశము లన్నియు తిరిగి నయముననో భయముననో తత్పాలకులవలన సమ్మానము లందిన అడిదము సూరకవి (1720—1780) సాలూరి పాలకుఁడగు సన్న్యాసి రాజు (1746—1792) గారినికూడ దర్శించినట్లు సూరకవి కృతముగా కళింగ సీమలో సంభావితమగుచున్న క్రింది చాటుపద్యము సాక్ష్యము :

‘....జెండా లేస్గులు జంబుఖానలు తివాసీల్ గల్గు మాత్రంబునన్
గొండల్ మూకలు గైదులున్ సవరలున్ కోదుల్ బువిన్ రాజులా
చండాటోప బలారిసింహ బిరుదా! సన్న్యాసిరాజోత్తమా !’*

## కిమ్మూరి బలారిసింహ నరసింహరాజు

రామచంద్రరాజు (1772—1801) కనిష్ఠ సోదరుఁడు బుచ్చిరాజు లేక అప్పలరాజు. అప్పలరాజు అనునది అసలుపేరో ముద్దుపేరో మనకు తెలియదు.

* ఈ చాటువును చదివి, యిది సూరకవి కృతమని సూచించినవారు శ్రీ పురిపండా అప్పలస్వామిగారు.

కావ్యములలోమాత్ర మితఁడు బుచ్చిరాజుగ పేర్కొనఁబడినాఁడు.[1] ఈ బుచ్చి రాజు పుత్రుఁడగు బలారిసింహ నరసింహరాజు ఆంధ్రలాక్షణిక ప్రపంచమున పెద్ద పేరుపెంపులు కలవాఁడు. ఇతఁడు ఆంధ్రశబ్ద చింతామణికి 'కవిజనాంజన'[2] మనుపేర నొక వ్యాఖ్యానమును రచించినవాఁడు. కిమ్మూరి కులాబ్ధిచంద్రుఁడగు నీ కవి సన్నమాంబాబుచ్చిక్ష్మేంద్రుల పుత్రుఁడనియు, పరాశరగోత్రజుఁడనియు –

'శ్రీ కిమ్మూరి కులాబ్ధిచంద్రుఁడను, బుచ్చిక్ష్మేంద్ర పుత్రుండ, వా
ణీ కారుణ్యకటాక్ష లబ్ధకవితోదీర్యత్ప్రికాశుండ, న
స్తోకాంధ్రామర వాగ్విదుండ, నరసక్షోణీశుఁడన్, సన్నమాం
బా కుక్షిప్రభవుండ, రాఘవపదాబ్జాతార్చనాయత్తుఁడన్'

అను నవతారికా పద్యమువలనను, 'ఇది శ్రీరామచంద్ర పాదారవింద పూజా పవిత్ర శ్రీమత్పరాశరగోత్ర సన్నమాంబా బుచ్చిధరాధిపతి పుత్ర శ్రీ బలారి సింహ[3] నరసింహరాజసింహ విరచితంబైన కవిజనాంజనంబను నాంధ్రశబ్ద చింతామణి వ్యాఖ్యానంబునందు ....' అను కవిజనాంజన పరిచ్ఛేదాంత గద్య వలనను తెలియుచున్నది.

చింతామణిలోవలె కవిజనాంజనమునందును సంజ్ఞా సంధి అజంత హలంత క్రియాపరిచ్ఛేదములు కలవు.

'హ్రిస్వముగఁ దీర బాలసరస్వతుండు
చేసె దానికి నేను విశేషముగను
కవిజనోక్తులు లక్ష్యముల్గాఁగఁ జేతుఁ
గవిజనాంజన మనెడి వ్యాఖ్యాన మొకటి'

——కవిజనాంజనము, అవతారిక.

ఆంధ్రశబ్దచింతామణికి బాలసరస్వతి సమకూర్చిన వివరణము మిగుల హ్రస్వముగా నున్నదనియు, దానికి తాను కవిజనోక్తులను లక్ష్యములుగా ప్రదర్శించి కవి జనాంజనమను వ్యాఖ్యానమును సంతరింతు ననియు కవి ప్రతిజ్ఞ యొనర్చినాఁడు. ఇందలి తద్భవరూపప్రదర్శనము అడిదము సూరకవి రచియించిన కవిసంశయ విచ్ఛేదమునందలి తద్భవతరంగమునకు సరిలు లింగము. కవి సంశయ విచ్ఛేద కారుఁడు తద్భవములందలి రూపపరిణామములను తెలుఁగునఁ గొన్ని సూత్రముల రూపమున నిరూపింపఁగా, కవిజనాంజన కర్తయగు నరసింహరాజు ఆ తెలుఁగు

[1] 'ఏ భర్త పినతండ్రు లెసఁగిరి పౌరుషంబున భోజనృపతి బుచ్చినృపతి'—తుమురాడ పాపన ప్రవికృతమగు కాళిందీకల్యాణ కృత్యవతరణిక – తాళపత్రప్రతి.

[2] ప్రకాశకులు, కస్తూరి శివశంకరకవి, సుదర్శనీ ముద్రాక్షర శాల, విశ్వేశ్వరాయ పురము, 1911.

[3] బలారిగజసింహ యని ప్రాచ్యలిఖిత గ్రంథాలయము, తాళపత్రప్రతి, R.No. 521.

సూత్రములనే యథామతిని సంస్కృతీకరించి* వివరణములతో పరివర్తించి నాఁడు. ఇందు 'అది యెట్లంటేను, సంజ్ఞలు కలదని తెలిసేది', 'తెలుసుకొనేది', గ్రంథం విస్తరిస్తున్నదని, 'అచ్చుపరమయితే', 'ఇత్యాదులందున్ను' 'సూత్ర ప్రాయంగా'—మున్నగు వ్యావహారిక రూపములు యథేచ్ఛముగా వాడఁబడినవి. ఈ కృతి శ్రీరామచంద్రున కంకితము.

## తుమురాడ పాపకవి

విస్మృత కళింగాంధ్ర కవులలో నీ తుమురాడ పాపకవి యొకఁడు. ఇతఁడు భారద్వాజ గోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. బుచ్చనార్య పుత్రుఁడు. నిష్ఠల శ్రీ అప్పనాఖ్యుని శిష్యుఁడు. రామచంద్ర కరుణాకటాక్ష లబ్ధోభయ భాషాకవితా విచిత్రుఁడు. ఈతఁడు రచించిన కాళిందీకల్యాణము మూఁడాశ్వాసముల శృంగార ప్రబంధము. సన్న్యాసిరాజమానసాంభోజ భృంగమగు సాకేతరామున కంకితము. సీతాసోమదేవి రామచంద్రరాజు (1772–1801) ల పుత్రుఁడును 1801–1830 మధ్య సాలూరు సంస్థానమునకు పాలకుఁడును అగు సన్న్యాసిరాజే కృతి ప్రేరకుఁడు. 'సమస్తజన మిళింద బృందామందానందకర మధురిభాషా మకరంద బిందుసందీపిత కవీంద్ర వదనారవింద యుతుఁ'డఁట సన్న్యాసిరాజు :

'ఏరాజు తాత బలాఁసింహాంకుఁడై
    భాసిల్లె దెసల సన్యాసినృపుఁడు
ఏ మహీపుని తండ్రి రామచంద్రావనీ
    పాలుండు సత్కీర్తి లోలుఁడలరు
ఏ సామితల్లి సీతాసోమిదేవి నాఁ
    బరగు గుణంబుల పరమసాధ్వి
ఏ భర్త పినతండ్రులెసఁగిరి పౌరుషం
    బున భోజభూపతి బుచ్చినృపతి
ఏ జనేశ్వరు ననుజన్ములెలమి సరస
రాజ కృష్ణావనీశ్వర రామభద్ర
భూప కూర్మేంద్ర సన్న్యాసిభూమినాథు
లలరుచుండుదు రట్టి సన్న్యాసివిభుఁడు'

'శ్రీరామాంఘ్రిసరోరుహద్వితయసంసేవాపరస్వాంతునిన్
భారద్వాజమునీంద్ర గోత్రుఁ బ్రథితాపస్తంబ సూత్రున్ ఘనున్
సూరీంద్రున్ దుమురాడబుచ్చన తనూజున్ బాపనాఖ్యున్ ననున్
జేరంబిల్చి సుధామయోక్తుల వచించెన్ బ్రీతి సంధిల్లఁగన్'

తన పూజాసమయమున సన్నిధిచేసి పరితృప్తిఁ జెందిన శ్రీరామచంద్రుఁడు

* 'ఏకస్మిన్నేవ బిందుస్స్యాత్', 'బిందుర్లోపో భవిష్యతే'—తాళపత్రప్రతి. 114 వ ఆకు.

తన్నొకరు వినూత్న పద్యప్రబంధమునకు కృతిపతిఁ గావింపుమని కోరఁగా సన్న్యాసిరాజు దాశరథి కంకితముగా నొక్క సత్ప్రబంధము సంఘటింపుమని పాపనకవిని వేఁడికొనఁగా నేతత్కావ్యనిషేవణమునకు కవి కడంగినట్లు కాళిందీకల్యాణకృత్యవతరణికవలన తెలియుచున్నది.

ఆంధ్రకవీంద్రస్తుతిలో '....భాస్కరాఖ్యునయ్యన్నను పోతనాహ్వయుని, నప్పకవీంద్రు నహోబలేంద్రునిన్' అని అప్పకవిని, అహోబలుని సయితము పేర్కొనుట పాపనకవి లాక్షణికపక్షపాతమును సూచించుచున్నది. పాపనకవి గొప్ప లాక్షణికుఁడు కూడ. శ్రీకృష్ణుని అష్టమహిషీమణులలో నొకర్తె యగు కాళిందిని కృష్ణుఁడు పరిణయమాడిన కథ యిందలి యితివృత్తము. మచ్చున కొక పద్యము :

'అంతట భూమిపాలుఁడు హయంబు తటాలునడిగ్గి బంధువుల్
చెంతవసింపుచుండ మునిసింహుని పాదములందు మ్రొక్కి య
త్యంత కుతూహలంబున కృతాంజలియై నిను సన్నుతింప నే
నెంతటివాఁడనంచు వచియించి యలంకృతిఁజేసి వేడుకన్'

—ద్వితీయాశ్వాసము. తాళపత్రప్రతి, 28వ ఆకు, మొదటిపైపు.

రామకథాసుధార్ణవము, వైరాగ్యదర్పణము అనునవి పాపకవి కృత్యంతరములు. ఉత్కళభాషలో సిద్ధేశ్వరపరిడా (సారళాదాసు) రచించిన రామాయణము* మాతృకగా శిష్టకరణ కులజుఁడగు దొంకాడ గోపీనాథుఁడు వచనరూపమున తెలిఁగించిన విచిత్రరామాయణమునకు పద్యరూపము రామకథాసుధార్ణవము. ఇది సప్తతరంగ సముపేతము. గోపీనాథకవి దౌహిత్రుఁడగు ఫక్కి లక్ష్మీనృసింహుని ప్రేరణమున నిది విరచితము.

విజయనగరపాలకుఁడగు నారాయణగజపతి (1794–1846) బంధుకోటిలో నొకరగు బుద్ధరాజు నరసింహరాజు కుమారుఁడు రామరాజు చిన్నతనముననే చనిపోఁగా నరసింహరాజు నోదార్చుచు నొక యోగిచేసిన వైరాగ్యబోధను కథావస్తువుగా స్వీకరించి కైసేసిన కృతియే వైరాగ్యదర్పణము. ఇది సైతము శ్రీరామచంద్రున కంకితము.

## తట్టికోట బలరామకవి

గరుడాచల విలాసమను చెంచునాటకమును యక్షగానముగ రచించిన యీ కవి శిష్టకరణ కులజుఁడనియు, ఉత్కళేశ్వరసగోత్రుఁడనియు, సీతమాంబా నారాయణమహంతి సుధీవరుల తనూజుఁడనియు, లక్ష్మణమంత్రి పౌత్రుఁడనియు, ఆంధ్రగీర్వాణ భాషారహస్య విదుఁడనియు, 'గురుతరోత్కళేశసగోత్రుఁడ నారాయణమహంతి పుత్రుఁడ సమధికగుణ లక్ష్మణ

* పురిపండా అప్పలస్వామి, రామాయణకర్తలు, సంస్కృతి, 1960 మే, పు. 1.

పౌత్రుఁడ లసితపాండిత్య నారాయణ సీతమాంబాత్మజుండ.... ఆంధ్రగీర్వాణ భాషారహస్యవిదుఁడ....' అను కృత్యవతారికయందలి పద్యమువలన బోధపడుచున్నది. కవి సాలూరు వాస్తవ్యుఁడు. తన కుటుంబము వారందఱు సాలూరు సంస్థానాధీశ్వరుల యాశ్రయమునందుండి మన్ననలు బొందుచుండినను బలరామకవి యేకారణముననో తనకృతిని సంస్థానాధీశ్వరులకుఁ గృతి యీక శ్రీమన్నారాయణాంకితము గావించినాఁడు. కవి వంశీయులు నేఁటికిని సాలూరున నున్నారఁట. వంశక్రమమునుబట్టి వివేచించి కవి పదునెనిమిదవశతాబ్ది మధ్య భాగమున నున్నట్లు నిర్ణయింపఁబడినది.

ఇందలి కథ పద్మపురాణస్థము. చెంచుకన్య శ్రీనరసింహుని వరించిన గాథ తెలుఁగున శృంగారరసప్రచురముగ సంగ్రథితమైనది. మూఁడాశ్వాసముల గ్రంథభాగము మాత్రము లభ్యమైనది. శ్లేషయమకప్రకృతులతో, చిత్రబంధకవిత్వపు కనకరత్నములతో నిండిన యీకావ్యము మనుచరిత్ర, వసుచరిత్ర, విజయవిలాసము మున్నగు ప్రౌఢప్రబంధములను దలఁపించుచున్నది. మాదిరి కొక పద్యము :

> 'చెలియ మొగంబుతోడ సరిజెందఁదలంచి శశాంకపంకజం
> బులు జలరాశిలోఁ దపముబొందఁగనల్పి సమాజనామమొం
> గలవయి చంద్రుఁడంతటఁ గళంకుఁడ సామ్యము నొందకుండఁగా
> జలజమొకింత వాసనను సాటగుటన్ బగలోట పెంటికిన్*'

## కిమ్మూరి సన్న్యాసిరాజు

విస్మృతకళింగాంధ్రకవులలో నొకఁడయిన ఈతనిని చరిత్రకెక్కించిన చరితార్థులు పురిపండావారు.† కిమ్మూరి సన్న్యాసిరాజకవి 'రఘుకులాబ్ధిచంద్ర రామచంద్ర'యను మకుటముతోఁ గూడిన సీసపద్య శతకమునకు కర్త. 'వసుధ శ్రీ కిమ్మూరి వంశోద్భవుండ సన్న్యాసిరాజాఖ్యచే నలరు నట్టి కవి వరుండను....' అను పద్యభాగముతప్ప కవిజీవితాదుల నెఱుఁగుట కాధారములు లభ్యముకాలేదు. శతకాంతమునందలి పద్యములు శిథిలములగుటవలన కవికాలాదికము లెఱుఁగ వలనుపడుటలేదు. కిమ్మూరు అను గృహనామము ప్రసిద్ధముగ సాలూరు జమీందారులది. సాలూరు జమీందారులకు బొబ్బిలియారుసింహ యను నది వరంపరీణమగు బిరుదము. కవిజనాంజనకర్తయగు కిమ్మూరి నరసింహరాజు తాను 'బలారిసింహ' బిరుదవిరాజితుఁడనని తనగ్రంథమునఁ బ్రకటించి

* గర్భాం అప్పారావు, తట్టికోట బలరామకవిగారి గరుడాచలవిలాస సమీక్ష, బంధుసేవ పత్రిక, ఋక్షిసంవత్సరము, రథోత్సవ సంచిక, పుటలు 77–85.

† పురిపండా అప్పలస్వామి, రామచంద్రశతకము, రాజపుత్రాభివర్ధని పత్రిక, విశాఖపట్టణము, సంపుటము 1, సంచికలు 2, 3, పుటలు 28–31.

కొనినాఁడు. రామచంద్రశతకకర్త తనగ్రంథమున నెక్కడను ఈ బిరుదమును వ్రాసికొనకుందున ఈతఁడు సాలూరు జమీందారుల సమీపజ్ఞాతి కాకపోయినను పరంపరాసంబంధియగుట తథ్యమని పురిపండావారి యభిప్రాయము.

“కిమ్మూరి” యను ఇంటిపేరేకాక సన్న్యాసిరాజనామముకూడ సాలూరు జమీందారులలో నతిప్రచురము. మూలపురుషునినుండి పండ్రెండుతరములు సాఁగిన సాలూరు జమీందారుల వంశావళిలో సన్న్యాసిరాజనామాంకితులు పలువురుంది కన్పట్టుచున్నారు. తరముతరమునకొక సన్న్యాసిరాజైనను మన దృష్టికిఁ దగులుచున్నాఁడు. పాలకసంతతికిఁజెందినవారి నామములే చరిత్ర పుటలలో కన్పట్టుచున్నవిగాని ఆయా తరములలో ఆయా పాలకులకు సోదరులైన వారి సంతతి అనుపానులు స్పష్టముగా మనకుఁ దెలియవు. సాలూరువారికోవ యందు నాల్గవతరములో అయిదుగురు, అయిదవతరములో ముగ్గురు, ఆఱవ తరములో ఆఱుగురు, ఎనిమిదవతరములో ఆఱుగురు అన్నదమ్ములు కలరు. వీరిలో ఏయొకరికోవకో చెందినవాఁడు కావచ్చు మనకవి. విశేషించి ఈ శతకము తాళపత్రప్రతి సాలూరునందలి క్షత్రియకుటుంబమునందు లభ్యమగుట వలనను, నీతని వంశీయులు నేఁటికిని సాలూరు నందుండుటవలనను సన్న్యాసి రాజకవి సాలూరు రాజబంధువుగా నిర్ధారింపవచ్చు.

సన్న్యాసిరాజకవి తన రామచంద్రశతకమున రామాయణకథను సంగ్రహముగా నిబంధించినాఁడు. శతకాది నొకసీసపద్యమున రామాయణ కథను సూక్ష్మముగా వివరించి ఆ ‘సత్కథామృతమును విస్తరించి విగతవృజినుఁడ నయ్యెద’నని కవి వాకొనినాఁడు. రావణునిబాధలుపడలేక దేవతలు యోగనిద్రా సక్తినున్న మహావిష్ణునితో మొఱపెట్టుట మొదలుగా రామాయణకథ విరచితము. ‘ఈతని శైలి మార్దవముకలది; ధార మంచిది. స్పష్టముగ నర్థము వ్యక్తమగును. వ్యర్థపదములు పలుచోట్ల కానవచ్చినను కవిత్వము మొత్తముమీఁద రసవంతము’ అని పురిపండావారు ఈ కావ్యరత్నమునకు ఖరీదుకట్టిన షరాబులు.

మచ్చునకొకపద్యము:

‘సిగను పువ్వులుచుట్టి సింగాణిఁజేబట్టి
భుజముల సమ్ములపొదలుగట్టి
పైఁగా సెచుట్టి లోపలలాగు గట్టి యం
గమునందు వజ్రకంకటమువెట్టి
తమ్ముని కేల్పట్టి తండ్రిని సమకట్టి
నల్లద్రావుడు మూఁకలెల్లఁ గొట్టి
వచ్చెదనని తల్లివరపదంబులముట్టి
దంభంబుమీఱఁ దద్గాధిపట్టి

పెన్నుముట్టవనెడువేళ నీవేషంబు
నీదుధైర్యమహిమ నీదుకోటి
కోటిసూర్యకాంతి కొనియాడఁ జెల్లునా ?
రఘుకులాబ్ధిచంద్ర ! రామచంద్ర !'

సాలూరు సంస్థానాధిపతియును, కిమ్మూరి రామచంద్రరాజు (177?—1801) జ్యేష్ఠపుత్రుఁడును, రామచంద్ర భక్తుఁడును అగు సన్న్యాసిరాజు (1801—1830) ను, ఈ రామచంద్రశతకకర్తయగు కిమ్మూరి సన్న్యాసిరాజును భిన్నులో, అభిన్నులో వివేచింపవలసియున్నది. సంస్థానపాలకుఁడగు సన్న్యాసిరాజు అభినవభోజుఁడనియు సప్తసంతానప్రశస్తిమహితుఁడనియు కిమ్మూరి వంశావళియందుఁ గీర్తింపఁబడినాఁడు.

'ఆలోపాపనకవికృత
కాళిందీపరిణయాఖ్య కావ్యాంకితుఁడై
సాలంకృత తత్కృతి నీ
తాలోలున కర్పణముగా నొనరించెన్'

తుమురాడ పాపనకవికృతమగు కాళిందీకల్యాణప్రబంధమునకు కృతి ప్రేరకుఁడుగ సన్న్యాసిరాజు మన కీవరకే సుపరిచితుఁడు. కాళిందీకల్యాణ కృత్యవతారికయందును, ఆశ్వాసాద్యంతములయందును సన్న్యాసిరాజు గొప్ప శ్రీరామభక్తుఁడని ప్రస్తావితుఁడు. 'సీతాసౌభాగ్యపతికళత్రుఁడు.... సన్న్యాసి క్ష్మాపతికామితప్రదుఁడు....', 'సన్న్యాసి రమణచేతోనివాస,' 'సన్న్యాసినృపాలారాధితపదపంకజ', 'సన్న్యాసి భూమిపాల పెదబలారిసింహాపూజిత', 'సన్న్యాసినృపాలోపాసిత', 'సన్న్యాసిరాణ్మానసాంభోజభృంగ' మొదలగు కృతిపతిపరమైన సంబోధనలనుబట్టి చూచినపుఁడు సన్న్యాసిరాజు రామభక్తి ప్రకటితమగుచున్నది.

అంతేకాదు. కాళిందీపరిణయ కృత్యవతరణికయందు కృతి ప్రేరకుఁడగు సన్న్యాసిరాజు 'రఘురామా' యను మకుటముగల కందపద్యములలో శ్రీరామ చంద్రుని వినుతించినట్లు స్పష్టపఱుపఁబడినది. పూర్వోక్త హేతువులను పురస్కరించికొని ఈ సన్న్యాసిరాజే రామచంద్రశతక కర్త కావచ్చునేమోయని యూహించుట కవకాశముగలదు. మీఁదుమిక్కిలి తండ్రియగు రామచంద్రరాజు నామకీర్తనమును, భగవంతుఁడగు శ్రీరామచంద్రగుణసంకీర్తనమును కలిసి వచ్చునట్లుగ కవి ఈ శతకమునల్లి యుండవచ్చునని యూహించుట కవకాశము లేకపోలేదు.

## అమలాపురము సన్న్యాసికవి

సాలూరు జమీందారుల సమీపజ్ఞాతులలో నొకరగు కిమ్మూరి జగన్నాథ

రాజు పోషణమునందలివాఁడు సన్న్యాసికవి (1800--1860).[1] జగన్నాథరాజు తండ్రి చంద్రశేఖరరాజు. ఈ చంద్రశేఖరరాజు తండ్రి నరసరాజు. సాలూరు జమీందారుల కుదురులో నాల్గవతరమునాఁటి చినసన్న్యాసిరాజునకు నరసరాజు తమ్ముఁడు. సన్న్యాసిరాజుగారి కాలమున సాలూరు సంస్థానము ఉత్తరభాగమగు మక్కువ పరగణాకు నరసరాజుగారు ఇజారాదారు. ఆనాఁటికి విజయనగరము వారి మన్ననలకు పాత్రమయినవాఁ డితఁడు.

విజయనగర సంస్థానపాలకు లాక్రమించిన పూర్వసంస్థానములు పద్మనాభ యుద్ధానంతరము పునరుద్ధరింపఁబడినపుడు సాలూరు సంస్థానము పూర్తిగా ఔరసుఁడగు రామచంద్రరాజు (1772—1801) నకు 1796లో వచ్చినది. సంస్థాన పాలనమును స్వీకరించిన పిమ్మట ఆయానందమును పురస్కరించికొని రామచంద్రరాజు తన సంస్థానములో కలిసియున్న మక్కువ పరగణాను పితృవ్యపుత్రుఁడగు చంద్రశేఖరరాజునకు సాలీనా పదునాలుగు వేల రూపాయల గుత్తకు దఖలుపఱిచియుండెను. గుత్త యొడంబడికపత్రములో కాలపరిమితి యుదాహృతమై యుండలేదు.

ఆ దరిమిలా చంద్రశేఖరరాజీ కిటుకును పట్టుకొని మక్కువపరగణా పితృపైతామహమగు తన సొంత యాస్తియనియు, విజయనగర పాలకుఁడగు ఆనందగజపతియును, జయపురప్రభువు విక్రమదేవవర్మ[2]యును తనతండ్రికి పరగణా బహూకరించి యుండిరనియును స్థాపించి, అందువలన మక్కువ పరగణా తనకు పితృదత్తమైన రాజ్యమగుటయేకాక తన అనుభవములో నున్నదనియు వివాదము మొదలుపెట్టినాఁడు. తన వాదమున కుపబలకముగ కొన్ని యాధారపత్రముల నతఁడు దాఖలు చేసినాఁడు. సదరు పత్రములు ప్రామాణికములు కావనియును, కూటసృష్టియనియును సన్న్యాసిరాజు వాదము. మక్కువ పరగణా తనపేర శాశ్వతముగా పరిష్కారము కావలయుననియు, తనపేరనే సన్నదు జారీచేయఁబడవలయుననియు చంద్రశేఖరరాజు విశ్వ ప్రయత్నములు చేసినాఁడు. కాని ఆయన ప్రయత్నము ఫలింపలేదు. కుంఫిణీ అధికారులు చంద్రశేఖరరాజువాదము హేతుబద్ధముగాదని గుర్తించి మక్కువను వేఱొక సంస్థానముగా రూపొందించుట కంగీకరింపలేదు.[3]

[1] సన్న్యాసికవికిని, సాలూరు పాలకులకును పోష్యపోషక సంబంధములు కలవని తొలుత నాకెఱుఁగఁజెప్పినవారు పూజ్యమిత్రులు శ్రీ పురిపండా అప్పలస్వామిగారు.

[2] '.. పెద్దపదము, రామభద్రపురము, మక్కువ... యను జమీల నేర్పఱిచి విశ్వంభరదేవు తన యాశ్రితుల కొసంగి, వారివలనం గప్పంబులం గొనుచు....' (ప్రభాస శాపవిమోచనము, పీఠిక, 20).

[3] A. Vadivelu, The Ruling Chiefs, Nobles and Zamindars of India, Vol. I, 1915, pp. 697, 698.

1801లో సాలూరు సంస్థానాధిపతి రామచంద్రరాజు మరణించిన
త ఆతని కుమారుఁడగు సన్యాసిరాజునకు చంద్రశేఖరరాజు హక్కులను
గా తోసిరాజని మక్కువ పరగణాతోఁ గూడిన సాలూరు జమీందారీకి
ే సన్నద్-ఇ-మిల్కియత్-ఇస్తిమిరార్ ప్రసాదింపఁబడెనట. అపిమ్మట
వ పరగణాను తిరిగి రాఁబట్టుకొను నిమిత్తము చంద్రశేఖరరాజు
పట్టణములోని జిల్లా అదాలత్ కోర్టులో సన్యాసిరాజుమీఁద సివిలుదావా
చేసినాఁడు. ఇదియును వ్యర్థప్రయత్నమే యయినది.[1] ఈవివాదమునకు
ధించిన సూచన విశాఖపట్టణము జిల్లావృత్తాంత సంగ్రహమునం దిట్లు
పఁబడినది. '....సన్యాసిరాజుగారు మక్కువమహాలునాలో కలిగిన
మను కూడదీసికొనలేదనియు నామాలుంచారు చంద్రశేఖరరాజును వారి
నీయన తండ్రిగారు తమక్కువశిస్తును కమతిచ్చిరనియు నారిప్పులు...
న్న వెక్కుడుశిస్తును చెల్లించుటకుగాని, మాలుండా విడచుటకుగాని
కరింపలేదనియు సదరు కవులుదారునిపై వ్యాజ్యగ్రంథముల జరిగించుటను
వారుగారికి విస్తారముగ వ్యయప్రయాసలు కలుగనైయున్నవనియు....
న అలెగ్జాండరు దొరవారి కభిప్రాయము కలిగినది....'.[2]

ఈ చంద్రశేఖరరాజు తనయుఁడగు జగన్నాథరాజు అముల్యపురము
సికవికి పోషకుఁడు. సాలూరుపాలకుఁడగు సన్యాసిరాజు (1801-
) పందొమ్మిదవశతాబ్ది పూర్వార్ధమున సాలూరు పాలించుటవలన కీమ్మార్తి
కనిష్ఠ సంతతికిఁ జెందిన, సన్యాసిరాజునకు మరుసటి సోదరుఁడగు
నాథరాజు 1820–1890 ప్రాంతమువాఁడని యూహింపనగును. ఈతని
ముమునందలి సన్యాసికవికూడ ఆకాలమువాఁడేయని నిర్ధారింపవచ్చు.

'....శాలివాహనశకాబ్దములు కలగజర్షి విధుసంఖ్యఁదగు రౌద్రివత్సర
శుద్ధ నవమి మిత్రపుత్రవారమున....' సన్యాసికవి ఉద్ఘాటించినట్లు
మ్యుఁడగు దేవులపల్లి చంద్రయ్య పేర్కొనుటవలన కలగజర్షివిధుసంఖ్య
శా.శ. 1782 (క్రీ.శ. 1860) సన్యాసికవి జనన సంవత్సరమని
తెలియనున్నది.[3] కాని సన్యాసికవి 1760 లో మృతిచెందెనని శతకకవుల
చరిత్రము[4]నను, 1860 లో మరణించెనని ఆంధ్రకవిసప్తశతి[5] యందును
ంచుట కాధారము లేదో తెలియదు. జగన్నాథరాజు సంస్థానమున

[1] ibid, p. 698.

[2] విశాఖపట్టణముజిల్లా వృత్తాంతసంగ్రహము, పుటలు 636, 637.

[3] ప్రాచ్యలిఖితగ్రంథాలయము, వ్రాతప్రతి. R. No. 571 (b) సన్యాసికవి
ంగు పంచముఖేశలింగద్వాత్రింశిక.

[4] వంగూరి సుబ్బారావు, శతకకవుల చరిత్రము, పు. 666.

[5] బులుసు వెంకటరమణయ్య, ఆంధ్రకవిసప్తశతి, పు. 282.

ప్రవేశించునాఁటికి సన్న్యాసికవి సూరూఁగుమీసాల సూర్నయామాత్యుని యింట నుండి యుండవలెను. ఆపిమ్మట రాజసేవవలని విరక్తినంది తన యితరకృతులను పరమేశ్వరాంకిత మొనర్చినట్లు ప్రమాణములున్నవి.

'ఊరారితి ధనికులగృహములఁ గోరితి నిఖిలార్థసమితిఁ గొంచించక వేసారితి' ననియు, 'భూతలములోన ధరణీనేతల భజియించుటెల్ల నిష్ఫలము సదా జోతలునీ కొనరించెదఁ జేతులు నెన్నుదుటఁజేర్చి శ్రీముఖలింగా' అనియు శ్రీముఖలింగ శతకమునందును, 'నరిదధిపగరీరా వేసరితిని భూధవులసేవ సలిపి....' అని పంచముఖేశ శతకమునందును సన్న్యాసికవి రాజాశ్రయమును నిరసించుట 'రాజుల్ మత్తులు వారిసేవ నరకప్రాయంబు....' అని ధరణీ పాలురధార్ష్ట్యమును దూషించు ధూర్జటి ధోరణికి అనుప్రాసము.

సన్న్యాసికవి కులాల కులసంజాతుఁడు. బొబ్బిలికి చేరువలోఁగల పాలతేరుగ్రామ వాస్తవ్యుఁడు. గంగాభవానీ కాశీపతుల పుత్రుఁడు. కాట్రికోన లక్ష్మణాఖ్యు తనయ కన్నమాంబ యీతని భార్య. కట్టమూరి కామేశ్వరకవి శిష్యుఁడు. దేవులపల్లి చంద్రయాది శిష్యపరంపరకు గురుదేవుఁడు. కాశీ ప్రముఖాఖిల దివ్యక్షేత్రములను ధర్మపత్నీసమేతుఁడయి దర్శించినవాఁడు. పరమ మాహేశ్వరుఁడు, శతాధిక కృతికర్తగా సంభావితుఁడు. రుద్రాక్ష మాహాత్మ్యము, సోమవారవ్రత మాహాత్మ్యము, కుమ్మరిగుండయ్య కథ మున్నగునవి యీతని పద్యప్రబంధములు. గౌరీరమణ పంచముఖేశ శివ శ్రీముఖలింగ నామకములగు కందపద్యశతకములు, పంచముఖేశ్వరప్రభూ మకుటముతోడి వృత్తశతకమును, సీసపద్యములతోఁగూడిన విశ్వనాథశతకమును, ద్వాత్రింశతి సీసపద్యములతోఁ గూడిన పంచముఖేశలింగ శతకమును కవి కృత్యంతరములు.

ప్రస్తుత చర్చకు సంబంధించినది సన్న్యాసికవి సంధానించిన సర్వాంధ్ర సారసంగ్రహమను పద్యరూప నిఘంటువు.* ఈ నిఘంటు నిర్మాణమునకు ప్రేరకుఁడు కిమ్మూరి జగన్నాథరాజు. ఈ యంశమే అవతారికలో నిరూపింపఁబడినది.

> 'శ్రీకిమ్మరాన్వయ క్షీరపాథోరాశి
> మేదురపూర్ణచంద్రోదయంబు
> చంద్రశేఖర నృపచంద్రశేఖరకృత
> ప్రబలనైర్మల్య తపఃఫలంబు
> సీతమాంబాపురంధ్రీతిలకోజ్జ్వల

* ప్రాచ్యలిఖిత గ్రంథాలయము, కాకితప్రతి, R. No. 611. దీనికి మాతృక ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మగారి తాళపత్ర ప్రతి. శర్మగారి ప్రతిని చూచి మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు నకలువ్రాసికొనిన ప్రతి కవితాసమితి గ్రంథాలయమున నున్నదఁట.

తరంగర్భశుక్తిముక్తాఫలంబు
ఘన సంస్కృతాంధ్రలక్షణగజాశ్వాస్యక్ష
పదరత్నశాస్త్ర సంపన్నిధాన
మనుచు బుధులనుతింపఁ బ్రఖ్యాతిఁ గన్న
శ్రీజగన్నాథరాజ బిడౌజు సమ్మ
ఖమున సర్వాంధ్రసారసంగ్రహ మొనర్తు
సనుచు విజ్ఞాపన మొనర్చు నాత్మనలరి'
'నన్నయ తిక్కనాది కవినాథులొనర్చిన గ్రంథరాజి స
ద్భ్యున్నత లీలఁగాంచి ముదమొప్పఁగ నీకృతిఁ జెప్పినాఁడ....' అని
గ్రంథాంతమున కవి స్పష్టపఱచుటచే సన్న్యాసికవి లభ్యమైన సర్వాంధ్ర
సాహిత్యమును అవలోడనముచేసి దీనిని కూర్చినట్లు తెలియుచున్నది.

'లోకోపకార మీకృతి
వేకావింపు ముచితోక్తి వెలయఁగ నని త
న్మ్యాకాంతాగ్రణి విపుల ద
యాకలితస్వాంతుఁడగుచు నాజ్ఞాపించెన్'
'సరస కిమ్మూరివంశాబ్ధి శశధరుండు
హరిహరాంఘ్రి పయోరుహధ్యాన నిరతుఁ
డైన శ్రీమజ్జగన్నాథ మానవేంద్రు
నాజ్ఞ శిరసావహించి యత్యాదరమున' కవి దీనిని నిర్మించినట్లు స్పష్ట
పడుచున్నది,

సర్వాంధ్రసారసంగ్రహము మూఁడుఆశ్వాసముల గ్రంథము. మొదటి
ఆశ్వాసమున అవతారిక, షష్ఠ్యంతములతో పాటు 196, ద్వితీయాశ్వాసములో
227, తృతీయాశ్వాసములో ఉపసంహార భాగముతో కలిసి 125, వెరసి 548
పద్యము లిం దున్నవి. చంపకోత్పలశార్దూలవృత్తము లరుదుగాను, కందములు,
సీసములు విరివిగాను ఉపయుక్తమైన రచనమిది. ప్రాచీన నిఘంటురచనా
వర్గీకరణపక్కి ననుసరించి వర్గువులవిభాగ మిందు పాటింపఁబడినది*. వేగవతీ
నదీతీరమున సాలూరున వెలసిన పంచముఖేశ్వరస్వామికిది యంకితము.

నాటకాలంకార సాహితీచతురవైభవమెల్ల సంగ్రహించి లలితాంధ్రభాషా
విలాసమున గోస్తనీపరిపాక కోమలకవితా చమత్కారసామర్థ్యమున శతాధిక
కృతులు సంతరించిన విద్వత్కవియని సమకాలికులగు తుమురాడ పాపనాది
కవుల ప్రశంసలను బడసినవాఁడీ సన్న్యాసికవి.

* పురిపండా అప్పలస్వామి, సర్వాంధ్రసార సంగ్రహము, ఆంధ్రప్రభ (దిన
పత్రిక), 1967 ఆగష్టు 15, పుటలు 4, 5.

## రాజా లక్ష్మీనరసింహసన్న్యాసి రాజబహద్దరు

సాలూరు జమీందారులలో పదియవతరమునకుచెందిన లక్ష్మీనరసింహ సన్న్యాసిరాజు సంగీత సాహిత్యములయందు మంచి అభిరుచి కలవాఁడు. లక్ష్మీనరసింహరాజుగారి పట్టపురాణి కృష్ణపట్టమహాదేవి సంగీతకళానిధి. ఈమె సోదరుఁడును చీకటిజమీందారుఁడును అగు రాధామోహన రాజేంద్రదేవు ఒరియా భాషలో పేరుమోసిన కవి, నాటకకర్త. చిన్నతనమున పదేండ్లపాటు చెన్నపురిలో విద్యార్థిగానున్నకాలమున అనేక నాటకప్రదర్శనములు చూచి, వివిధపండితు లనేకులతో సహవాసముచేసిన లక్ష్మీనరసింహ సన్న్యాసిరాజుగారికి చీకటిజమీందారుల నెయ్యముతో కళాభిరుచి మఱింత అధికమయినది.

సాలూరు జమీందారుల మఱియొక మకాము సాలూరునకు దక్షిణమున అయిదారు కోసులదూరమునఁగల మరడాము గ్రామము. శ్రీరామనవమి సందర్భమున మరడాములో పండితగోష్ఠులు, కవితాగానములు, నాటకప్రదర్శనములు, హరికథాకాలక్షేపములు మున్నగు కళాసంస్కృతిపరములగు సమావేశములను లక్ష్మీనరసింహరాజుగారు పెద్దయెత్తున జరిపించెడివారు. సాలూరులో 'శ్రావణి' ఉత్సవములు పూర్వమునుండియు అవిచ్ఛిన్నముగ నిర్వహింపఁబడుచుండెడివి. కవినటగాయక పండితులకు భూరి సంభావనలు ముట్టుచుండెడివి.

లక్ష్మీనరసింహసన్న్యాసిరాజుగారి యాస్థానమున చాడ లక్ష్మణచయనులు, నిష్ఠల సుబ్బావధాని మున్నగు వేదపండితులును, గోడా సీతారామశాస్త్రి మున్నగు మంత్రశాస్త్రవిదులును, సోమదేవము అన్నప్పశాస్త్రి మున్నగు శాస్త్రపండితులును, నిష్ఠల సింహాచలసిద్ధాంతి, కొమ్మూరి సంగమేశ్వరకవి, భోగుల రామమూర్తి మున్నగు కవులును, పట్రాయని నరసింహశాస్త్రి, కొమ్మాజోస్యుల రమణయ్య, మునికొల్ల సూర్యనారాయణ, రాపా వెంకటస్వామి, చీలా పుల్లాజీరావు మున్నగు నటులును, నిష్ఠల కొండయ్యశాస్త్రి, యామిజాల పద్మనాభసూరి మున్నగు పౌరాణికులు, రాంభట్ల లక్ష్మీనారాయణశాస్త్రి మున్నగు ఆయుర్వేదపండితులును ఉండెడివారు.

లక్ష్మీనరసింహసన్న్యాసిరాజుగారు నాటకప్రదర్శనమన్న చెవికోసికొనెడివారు. ప్రసిద్ధులైన నటులతో సీతారామ విలాసనాటకసమాజమను పేర నొక నాటకసంఘమును నెలకొల్పి ఆధునికమైన సమస్తపరికరములతో నాటకములను ప్రయోగింప ప్రోత్సహించుటయేగాక ప్రయోగించెడి అన్ని నాటకముల యందును తా మేదో యొక ముఖ్యపాత్రమును ధరించెడివారు. సీతాకల్యాణము, రుక్మిణీకల్యాణము, లక్షణాస్వయంవరము, పాంచాలీపరిణయము మున్నగు నాటకములు వీరు ప్రదర్శించిన ముఖ్యనాటకములలో కొన్ని. నాటకప్రదర్శనములకు ప్రత్యేకముగ నిర్మింపఁబడిన యొక నాటకశాలగూడ నుండెడిదఁట.

ఇరువదియవ శతాబ్దిము ప్రథమపాదమునందే స్త్రీపాత్రములను స్త్రీలే ధరింపవలె నను నియమముతో అట్టి ఏర్పాట్లు కావించినవారిలో లక్ష్మీనరసింహ సన్న్యాసి రాజుగారు మొదటివారు. ఈ యాస్థానమునందలి బుగత సూరి, తారాద రత్నము మున్నగు సానులు స్త్రీపాత్రములను ధరించెడివారు. కాపా వెంకటస్వామి, మునికొట్ల సూర్యనారాయణ మొదలగు నటులు అప్పటప్పట స్త్రీపాత్రములను కూడ ధరించెడివారట.

## నిష్ఠల సింహాచలసిద్ధాంతి

లక్ష్మీనరసింహ సన్న్యాసిరాజుగారి ఆస్థానకవులలో నితఁడు ప్రసిద్ధుఁడు.

'అనుగతంబయి యన్వయఖ్యాతి బొదలించె
పావనం బెవ్వాని బ్రహ్మనిష్ఠ
భగవత్కథాగాన ఫలవంతమై సాఁగె
కమనీయ మెవ్వాని కావ్యరచన....
అమ్మహాత్ముఁడు కవిరాజహంసకీర్తి
శాలి నిష్ఠల సింహాద్రిశాస్త్రివరుఁడు*....' అని సమకాలిక విద్వత్కవులచే ప్రస్తుతింపఁబడినవాఁడీ సింహాచలసిద్ధాంతి (1877—1946). ఈతఁడు సాలూరు జమీందారుప్రేరణముమీఁద కిమ్మూరి వంశావళి, సీతాకల్యాణము, లక్షణా స్వయంవరము మున్నగు గ్రంథములను రచించినవాఁడు.

ఇందులో 'కిమ్మూరి వంశావళి' యనునది సాలూరు జమీందారుల వంశ కథనము ఇది అయిదాఱువందల పద్యములతోఁగూడిన మూఁడాశ్వాసముల చారిత్రక కావ్యమని గ్రంథకర్తృ తనయులు సీతారామస్వామిశాస్త్రి తెలిపిరిగాని పూర్తిప్రతి లభ్యముకాలేదు. అవతారికయందును మొదటి పందొమ్మిది పద్యములు లేవు. లభ్యమయిన కాకితపుప్రతిలో 20 యవ పద్యమునుండి 95వ పద్యములోని రెండు చరణముల దాఁక గ్రంథమున్నది. సాలూరు జమీందారుల కోవలో ఎనిమిదియవుతరమునకు చెందిన సన్న్యాసిరాజు (1854—1869) చరిత్రముతో నీ ప్రతియందలి కథాభాగము నమాప్తమైనది. పరాశర గోత్రజులును కిమ్మూరి గృహనామకులును నగు పెదప్రెగడ, పినప్రెగడ యను బ్రాహ్మణ సోదరులిరువురు నానారాజన్య సభాస్థలుల మాన్యులై జయపురాధిపతి విక్రమదేవు తోడి చెలిమివలన జయపురమున నివసించుచు శత్రురాజులతోడి యుద్ధమున విక్రమదేవునకు తోడ్పడి విజయము చేకూర్చిరట. దీనిని పురస్కరించికొని జయపురాధిపతి తన పుత్రికయగు లక్ష్మీదేవిని పినప్రెగడకిచ్చి పెండ్లి కావించెనట. ఈ పినప్రెగడ సంతతియే సాలూరు జమీందారుల వంశమని ఈ

* గోరుగంతు అచ్యుతసూర్యనారాయణశర్మ, కావ్యశ్రీ, పరమేశ్వరీ ముద్రణాలయము, అనకాపల్లి, 1951.

కావ్యమున వర్ణింపఁబడినది. లక్ష్మీనృసింహ సన్న్యాసిక్ష్మాతలపాలునాజ్ఞ సింహాచలనామక్ష్మాసురుఁడు రచించిన ఈ సాలూరు క్ష్మేశ చరిత్రము వేగవతీ తటాంచలమున వెలసిన పంచముఖేశ్వరున కంకితము.

సాలూరు రాజాగారు స్థాపించిన సీతారామ విలాస నాటక సమాజము వారి ప్రదర్శనము నిమిత్తము రాజాగారి కోరికమేరకు రచింపఁబడిన నాటకములలో నిష్ఠల సింహాచలకవి రచించిన లక్షణా స్వయంవరమను నాలుగంకముల రూపక మొకటి. 'విరచించె నల మార్గశిర పూర్ణిమా స్థిరవారమునాఁటికి మేరకొలఁది సాలూరు పట్టణాస్థానస్థ నిష్ఠల సింహాచలకవి సహాయంబు కలిమి పరలక్షణా స్వయంవర నాటకంబునున్ లక్ష్మీనృసింహ సన్న్యాసిరాజు....' అను నాటకాంతమునందలి పద్యముమూలమున ఆస్థానకవి నిష్ఠల సింహాచలకవి సాయముతో లక్ష్మీనరసింహసన్న్యాసిరాజే దీనిని రచించినట్లు తెలియుచున్నను ఇతర ప్రమాణములవలన సింహాచలకవియే దీనికి కర్తయని నిరూపింపవచ్చును. ఇందలి దొక పద్యము :

'పాటలగంధి నీ హృదయపద్ధతినెల్ల నెఱుంగఁగోరి యి
చ్చోటికివచ్చి నిన్ సుగుణశోభితఁ జూచితిఁ గార్యసిద్ధుఁడన్
మాటలిఁకేల యంత్రకృత మత్స్యము నాయెడ నొక్క కోలచే
వేటున కేను గూల్తుఁ బృథివీపతులందఱు మోము వంపఁగన్'

—తృతీయాంకము.

సింహాచలకవి సీతారామ విలాస నాటక సమాజమువారికొఱకు వ్రాసిన మఱియొక నాటకము సీతారామ కల్యాణము.

'శ్రీ సాలూరు విశాలసాలగతధాత్రీపాల కిమ్మోరి స
న్న్యాసి ప్రార్థిత రాజశేఖర సుధర్మార్థ సంపాదకుం
డా సుత్రామ ముఖామరప్రణుత కళ్యాణప్రసన్నాత్ముఁడై
దా సౌమిత్రియుతుండు మా విభుఁడు నిత్యైశ్వర్యముల్ మీకిడున్'

అన్నది ఈ నాటకమునందలి నాంది. 'శ్రీ మహారాజ లక్ష్మీనరసింహసన్న్యాసి రాజ్బహద బళియార సింహ బహదరు సాలూరు పట్టణాస్థాన సింహాసనాధీశ్వర శాసనమున....' రచింపఁబడిన దీ నాటకము. ఇందలి దొక పద్యము :

'శ్రీలేకాంతగృహంబులోన మదనక్రీడాసమాసక్తలై
ప్రాలేయానిలమున్ గవాక్షకృత మార్గానీతమున్ స్వేదని
ర్మూలంబౌటనుతించి నైజహితులన్మోహించి పుంభావరే
ఖా లాభార్త సుఖానుభూతలగుఁ దల్లీలా వినోదంబులన్'

ఈ నాటకమునందలి ప్రస్తావననుబట్టి లక్షణాపరిణయము, భద్రాచల మాహాత్మ్యము, శ్రీరామ మహిమాదర్శము, త్రిపుర విజయము మొదలగునవి కవి కృత్యంతరము లని తెలియుచున్నది. వీనిలో లక్షణా పరిణయమను మూఁడాశ్వాసముల శృంగార

ప్రబంధమును, భద్రాచల మాహాత్మ్యమను నిర్వచన కావ్యమును, శ్రీరామ మహిమాదర్శమను వేదాంత గ్రంథమును ముద్రితములు.

రాజాము వాస్తవ్యులును, శతావధాని ఆంధ్రవిద్యావాచస్పతీత్యాది బిరుద విరాజితులును నగు కొమ్మూరి సంగమేశ్వరకవి లక్ష్మీనరసింహసన్న్యాసిరాజు గారి యాస్థానకవులలో నొకరు. రావుబహద్దరు పండిత గానాల రామమూర్తిగారు సంగమేశ్వరకవిని 'నతనానాకవిసార్వభౌమ శిరఃపాదపీఠు'డని ప్రశంసించిరట. విజయనగరము ఆనందగజపతి (1879—1897) ఆస్థానమున పేరు పొందిన కె. ఎస్. జి. రాజామణిచెట్టి సాలూరు సంస్థాన సమ్మానితులలో ముఖ్యులు. రాజామణిచెట్టి సాలూరు జమీందారు పై చెప్పిన ప్రశంసాపద్యములు 'సద్యశశ్చంద్ర సాలూరి జనవరేంద్ర' యను మకుటముతో నొప్పుచున్నవి. చిల్లరిగె సేతుమాధవరావుగారు రచించిన ఆంగ్లేయ వైద్య చింతామణి† యను వైద్యశాస్త్ర గ్రంథము సాలూరి రాజా లక్ష్మీనరసింహ సన్న్యాసిరాజు పెదబలి యారుసింహులు బహద్దరుగారి కంకితము. సాలూరు సంస్థానోద్యోగి యగు భోగుల రామమూర్తికూడ కవియని 'భోగుల కవిచంద్ర రామమూర్తి కవీంద్రా' యను పద్యపాదమునుబట్టి యూహింపనగుచున్నది.

సాలూరు జమీందారులు సాలూరులోని వేదపాఠశాలా నిర్వహణమునకు చాల తోడ్పడిరి. సాహిత్యసార్వభౌములని ప్రశస్తిఁ బడసిన అన్నప్పశాస్త్రి సుధీమణి ఈ వేదపాఠశాల స్థాపకుడు. సాలూరు జమీందారు శ్రీ లక్ష్మీనరసింహ సన్న్యాసిరాజుగారు ఆంధ్ర విశ్వ విద్యాలయమునకు 1926—27 లో రు. 3 వేలు విరాళముగా నిచ్చిరి. అనేక విద్యాసంస్థలకు, గ్రంథప్రచురణ సంస్థలకు వీరు రాజపోషకులుగా నుండిరి.

† మొదటి కూర్పు, 1909 ; రెండవ కూర్పు, సేతు బ్రదర్స్, సేతు ముద్రాక్షరశాల, మచిలీపట్టణము, 1915.

## ఉపజీవ్య గ్రంథసూచి


1. విశాఖపట్టణము జిల్లా వృత్తాంత సంగ్రహము, పుటలు 535-537.
2. రాజా మృత్యుంజయనిశ్శంకబహద్దరు, హిల్ జమీందారుల చరితము.
3. కొమ్మూరి బలారిసింహ నరసింహరాజు, కవిజనాంజనము (ముద్రితప్రతి, తాళపత్ర ప్రతులు).
4. శతకకవుల చరిత్రము, పుటలు 566-572; అనుబంధము, పుటలు 749-752.
5. కవికొండల వెంకటసత్యనారాయణమూర్తి, విజయరామగజపతి.
6. శేషాద్రి రమణకవులు, విశ్వనాథ శతకపీఠిక, భక్తిరస శతకసంపుటము 2, వావిళ్ళ, చెన్నపురి, 1926.

7. అడిదము రామారావు, అడిదము సూరకవి జీవితము, వావిళ్ళ, చెన్నపురి, 1955.

8. కవికొండల వెంకటసత్యనారాయణమూర్తి, విశాఖమండల చరిత్రము, 1927.

9. Manual of Administration of the Madras Presidency, Vol. III, p. 500.

10. A. Vadivelu, The Ruling Chiefs, Nobles & Zamindars of India, G. C. Lokanadham Bros., Madras, 1915, Vol. I, pp. 697–699.

11. Report of the Madras Estates Land Act Committee, Part II, Madras, 1938.

12. Andhra University Annual Register, 1937–38.

# సురపురము

## ప్రవేశిక

సురపుర సంస్థానము పూర్వపు నిజాము రాజ్యమునందలిది. షోరాపుర మనియు, షోలాపురమనియు, సూరాపురమనియు* దీనికి వ్యవహార నామము లుండినవి. కృష్ణా భీమానదుల మధ్యదేశమున కృష్ణానది కుత్తరతీరమున బిజాపూరునకు నైఋతిదిశలో ఈ సంస్థానము వ్యాపించియుండినది. ఇది నేఁడు గుల్బర్గా మండలములోని ఒక సీమ. మెదకు కరీము నగరమండలముల సరిహద్దు ప్రాంతములతోఁగూడి కోసలనాడను వాడుకగలిగిన భూభాగమే యీ కోసల దేశము కావచ్చు. సురపుర సంస్థానాధీశ్వరుల పూర్వులలో నొకఁడగు కోసల నాథ నామక భూపాలుని పేర వీరి వంశము కోసల వంశమనియు వ్యవహృత మైనదఁట: ముదుగల్లు సీమలోని కోసలపేట ఈ వంశీయుల యొకనాఁటి రాజధాని. అందుచే కోసలవంశ మను పేరు వీరి కుదురుపట్ల స్థిరపడినదని కొందఱందురు. ఈ సంస్థానాధీశ్వరుల కాశ్రితులగు ఇమ్మడి అణ్ణయాచార్య, ఇమ్మడి శ్రీనివాసాచార్య రచనములలోఁ బ్రసక్తమైన కోసలవంశ మిదియే. మదరాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయమునందలి 'సురపుర రాజుల వంశావళి' యను తెలుఁగు కైఫీయతును ఆధారముగాఁగొని డాక్టర్ రాఘవన్‌గారు సురపుర సంస్థాన చరిత్రమును పునర్నిర్మించిరి. ఈ వంశీయులు శ్రీరామభక్తుఁడగు నిషాదాధిపతి గుహుని సంతతివారని, మృగయాజీవనులని తెలుఁగు కైఫీయత్తు చెప్పుచున్నది. స్థానికముగా వీరినే బేడరులందురు. బేడరుతెగ జను లీ సంస్థానములో అధిక సంఖ్యాకులు. మైసూరునందలి రత్నగిరి, దక్షిణ మహారాష్ట్రము వీరి పూర్వ నివాస ప్రాంతములు. వీరి ముఖ్యులకు నాయరులని వ్యవహార నామము.

## సంస్థాన చరిత్రము

ఈ సంస్థానమునకు మూలపురుషుఁడు వీరబొమ్మ నాయకుఁడు. ఈతఁడు ఆయుధోపజీవి; కృష్ణా తుంగభద్రానదుల దక్షిణభాగమున సర్దేశముఖీ పదవిలో

* Imperial Gazetteer of India, Vol. 23, p. 149; J. D. B. Gribble, A History of the Deccan, Vol. II, p. 121; Col. Malleson, A History of the Indian Mutiny, Longmans, 1911, Vol. V, p. 85.

నుండి సమకాలికులగు పాలకుల మన్నన లందినవాఁడు. ఈ వంశీయులు గోలకొండ, బీజపూరు సులతానులకును తోడ్పడుచువచ్చిరి. ఈ కుదురులోని కొదమ సింగమైన కల్లప్ప చిన్న హనుమనాయకుఁడు విజాపూరు పాదుషాల వజీరును ముదుగల్లు దేశాయియును నగు 'బహిరీ వసంతరావు' అనునతని నెదిరించి, యోడించి విజయసూచకముగ నాతని బిరుదమును గ్రహించి దానిని నాఁటినుండి తన కులబిరుదముగా ధరించెనని సురపురము కైఫీయత్తు నుడువుచున్నది. వీరు మొగలుపాదుషా యగు ఔరంగజేబును సైత మెదిరించి పేరుపొందిరఁట ! ఈ వంశములోని పాలకులు మహారాష్ట్రులకు సామంతులు. ఆ పిమ్మట పీతాంబర పెదనాయక భూపాలుని కాలమునుండియు సురపుర సంస్థాన పాలకులు నిజామునకు కప్పము కట్టుచుండిరఁట ! పీతాంబరుని తనయుఁడగు పామినాయకుఁడు క్రీ. శ. 1713 లో హసనాపురము కొండచాలులో సురపురమును నిర్మించి నాఁటినుండి దానిని రాజధానిగాఁ జేసికొనెనఁట ! పామినాయకుఁడు క్రీ. శ. 1740 లో మరణింపఁగా నాతని కుమారుఁడు పెదనాయకుఁడు రాజ్యమునకు వచ్చెను. ఇతఁ డయిదేండ్లు మాత్రము పాలించి క్రీ. శ. 1745 లో నిస్సంతుగా దివంగతుఁడయ్యెను. పెదనాయకుని తమ్ముఁడగు ముండిగె వెంకటప్ప తరువాతి వారసుఁడు. వెంకటప్ప పుదుచ్చేరిలో నాజర్ జంగ్ సేనలో పనిచేసి గొప్ప యుద్ధవీరుఁడుగ పేరుపొందిన వాఁడు. ఈ వెంకటప్ప అన్న యనంతరము సురపురము గద్దెనెక్కి 1751 దాఁక పాలించి సంతతిలేకుండ మరణించెను.

ముండిగె వెంకటప్ప పితామహుఁడగు పీతాంబర బహిరీ పెదనాయకుని పౌత్రులలో నొకఁడగు రమణప్ప సంస్థానమున కొక వారసుఁడు. రమణప్పకు పామినాయకుఁడను పేరుగల కుమారుఁ డొకఁ డుండెను. వెంకటప్పకు మఱియొక జ్ఞాతియగు కృష్ణప్ప నాయకుని పుత్రుఁడు మదనగోపాలనాయకుఁడు కూడ నింకొక వారసుఁడు. మరణశయ్యమీఁదనుండి వెంకటప్ప పైయిరువురికోసము కబురంపఁగా పామినాయకుఁడు మాత్రము వచ్చి వెంకటప్ప యాశీస్సులనంది సురపుర సంస్థానాధిపత్యమును స్వీకరించెను. వెంకటప్ప మరణానంతరము మదనగోపాలనాయకుఁడు సంస్థానాధిపత్యము నిమిత్తము పెక్కుప్రయత్నములు చేసెను. కాని పామినాయకుఁడు వాని నోడించి తన యధికారమును సుస్థిర మొనర్చికొనెను.

క్రీ. శ. 1678—1688 మధ్య శాహపురము రాజధానిగా నీ సంస్థానమును పాలించిన పామినాయకుని కొరకు గోపాలకృష్ణ విగ్రహము లభింపఁగా దానిని ప్రతిష్ఠింపఁజేసి వైష్ణవమతమును స్వీకరింపఁగోరి ఆనెగొంది నుండి వైష్ణవాచార్యులగు శంఖవరము శ్రీనివాసాచార్యులుగారిని ఆహ్వానించి ముద్రా స్వీకారమును గావించి యుండెనఁట ! వెంకటప్ప తరువాత 1752 లో గద్దెనెక్కిన పామినాయకుఁడును వైష్ణవమును స్వీకరింపఁగోరి పూర్వ గురుపరంపరలోని

శంఖవరమువారికొలుకు వాకబుచేయఁగా, ఆ నాఁటికి ఉపనీతుఁడుకాని శ్రీనివాసుఁడను బాలుఁడు దప్ప వారి వంశమంతయు నంతరించినదని తెలియవచ్చినది. ఆ సందర్భమున తుంగభద్రా దక్షిణతీరమున బొకుసీమలో గుత్తికి దక్షిణముగా నిరువదైదు కోసుల దూరమునఁగల బుక్కాపట్టణమునుండి అణ్ణయ, చిన్నయ యను వైష్ణవసోదరు లిద్దఱను క్రీ. శ. 1760–66 మధ్య సురపురము రప్పించి, పామినాయకుఁడు వైష్ణవము నాశ్రయించెనఁట. కోసల నాయకుల ముద్రా గురుపుల మనియును, ఆస్థానకవీంద్రుల మనియును వాకొనిన అణ్ణయ, శ్రీనివాసాచార్యులే పామినాయకుఁడు రప్పించిన అణ్ణయ్య, చిన్నయలయి యుందురని ఆచార్య రాఘవన్‌గారి నిర్ధారణము.

పామినాయకుఁడు 1773 లో మరణించెను. పామినాయకునికి తిమ్మమాంబవలనఁ గలిగిన వెంకటప్ప లేక వేంకటనాయకుఁడు తండ్రి తరువాత తక్తెక్కెను. సంస్థానపాలకులలో నితఁ డిరువదిరెండవవాఁడు. వెంకటనాయకుఁడు ఇరువదియెనిమిదేండ్లు సంస్థానము నేలి 1803 లో పరమపదించెను. ఇమ్మడి అణ్ణయ, ఇమ్మడి శ్రీనివాస, ముమ్మడి వెంకటాచార్యులు పేర్కొనిన పామినాయక సుతుఁడీ వెంకటనాయకుఁడే యని నిరూపితమైనది. వెంకటప్ప కడు సమర్థుఁడు. రాజకీయ విషయములందేకాక సాహిత్యవిషయములందును అభిరుచి కలవాఁడు. నిజామలీఖానునుండి బలవంత్ బహిరీ, లోహ్‌బజంగ్, ముజఫర్ద్దౌలా, బబరం ముల్క్ బహదూర్ అను బిరుదములను సంపాదించి రాజకీయముగా సురపురము కీర్తిప్రతిష్ఠలను పెంపొందింపఁజేసెను. 1786 లో మేనమామలదగు దేవగిరిని దౌహిత్రుఁడుగా తన సంస్థానములోఁ జేర్చికొని సంస్థానమును విస్తరింపఁజేసెను.

క్రీ. శ. 1800 లో దత్తమండలములు నిజాము సర్కారునుండి కుంఫిణీ ప్రభుత్వమునకు దత్తముసేయఁబడిన సందర్భమున పాలనాధికారములను పోగొట్టుకొనిన అచటి పాళయగాండ్రు పెక్కురు దిక్కుదెస తెలియని దీన స్థితిలో నుండఁగా వెంకటప్ప వారికి తన సంస్థానమున ఆశ్రయమిచ్చి ఆదుకొనినవాఁడు. వెంకటప్పకు మూఁడవ భార్యయగు నరసింగమ్మవలన కల్గిన చిన్న వెంకటప్ప లేక బాపూసాహేబు అను కొడుకు ఒకఁడు ఉండెను. ఈ బాపూ సాహేబు దత్తమండలములలోని తాడిమఱ్ఱి పాళయగాండ్ర అల్లుఁడు. ఇతఁడు తన పదునెనిమిదవయేఁటనే మరణించుటవలన వెంకటప్ప యనంతరము సంస్థానము చిక్కులపాలైనది. వెంకటప్పభార్య కాటవ్వ కొలఁదినెలలపాటు సంస్థాన పరిపాలనమును నిర్వహించి వారసుఁడగు పెదనాయకునకు ఆ భారము నప్పగించినది. పెదనాయకుని పెద్దకొడుకు వెంకటప్ప. ఇతఁడు తన పట్టాభిషేక సమయమున నిజాము దివానగు రాజా చందూలాలున కేడులక్షల రూప్యములు నజరానాగా సమర్పించెనఁట ! సురపురము కైఫీయతు ఇతనికాలముననే వ్రాయఁ

బడినది. వెంకటప్ప రెండవభార్య కుమారుఁడు కృష్ణప్ప నాయకుఁడు.

ఈ కృష్ణప్ప నాయకుని కుమారుఁడే మెడోస్ టైలర్ దొరగారి రచనములలో ప్రసిద్ధుఁడైన రాజా వెంకటప్ప. సురపురము సంస్థానమున కుంఫిణీ ఏజెంటుగానుండిన ఈ టైలర్ దొరగారి పర్యవేక్షణమున చిన్ననాఁటినుండి తక్కు నెక్కుడాఁక వెంకటప్ప చదువుసాములు నేర్చి పెరిగి పెద్దవాఁడయ్యెను. నిజామునకు సాలుసరి కప్పములు సరిగా చెల్లక బకాయిలు పెరిగినందున 1842—1853 మధ్య సంస్థానము కుంఫిణీ సర్కారువారి సంరక్షణములో నుండినది. ఇతని తల్లి ఈశ్వరమ్మ, పినతండ్రి పెద్దినాయకుఁడు వెంకటప్పకు సంరక్షకులుగా పాత్రిజ్ఞత వచ్చువరకు సంస్థానమును పాలించిరి. ఈశ్వరమ్మ 1853 లో మరణించినది. ఈశ్వరమ్మ హయాములోనే కుంఫిణీకిని, సంస్థానమునకును అరలుపొరలు ఏర్పడియుండినవి.

పైలాపచ్చీసులోనున్న రాజా వెంకటప్ప 1853 లో జమీకి వచ్చెను. 1857 లో తన సేనలో అరబ్బులను, రోహిల్లాలను విరివిగా చేర్చుకొనుచు, కుంఫిణీ అధికారుల మందలింపులను లెక్కచేయక యుండెనఁట. 1858 లో చెలరేఁగిన సిపాయిల ఫితూరీలో నానాసాహేబు మొదలగువారికి నెమ్మరుక్కగా నుండెనని యనుమానించి కుంఫిణీవారు రాజా వెంకటప్పను సంస్థానాధికారము నుండి తొలఁగించి మరణశిక్షను విధించిరి. కాని గవర్నరుజనరలు కరుణించి దీనిని నాలుగేండ్ల కారాగారవాసశిక్షగా మార్చి, నాలుగేండ్లపిమ్మట సంస్థానమును వెంకటప్పకు అప్పగించునట్లు ఉత్తరువు లిచ్చిరి. ఈ క్రొత్త యుత్తరువు మేరకు వెంకటప్పను చెంగల్పట్టునందలి కారాగారమునకుఁ బంపుచుండఁగా దారిలో చేతుపాకితో పేల్చుకొని ఇతఁడు ఆత్మహత్య గావించికొనెనఁట.* సంస్థానము కుంఫిణీ సర్కారు స్వాధీనమయినది. సిపాయీల తిరుగుబాటు సందర్భమున నిజామొనర్చిన తోడ్పాటునకుగాను సురపుర సంస్థానము 1861 మార్చి 4 న నిజామున కీఁబడినది.† సురపురమురాజాగారి వితంతువులగు రాణి రంగమ్మ మొదలగువారికి జీవితకాలమంతము సాలీనా రూ. 26,800 లు కుంఫిణీవారు భరణ మిచ్చిరి. గీర్వాణాంధ్రభాషల కెనలేని సేవచేసి, అనేకాగ్రహారములు భూసురగ్రామణుల కిచ్చి, సురపురము గోపాలకృష్ణుని కులదైవముగా కొలిచిన సురపుర రాజవంశ మిట్లు దయనీయస్థితిలో నంతరించినది.

* Col. Meadows Taylor, The Story of My Life, pp. 330, 331.

† Manual of Administration of Madras Presidency. Vol. I, Relations with Neighbouring States and Provinces, p. II, f.n. I; The Freedom Struggle in Hyderabad, Vol. 11, 1956, p. 100; Source Material for a History of the Freedom Movement in India, Vol. I, 1957, pp. 344–346.

## సాహిత్య పోషణము

సురపురము సంస్థానాధీశ్వరుల యాశ్రయమున దిగ్దంతులవంటి పండితులు విలసిల్లిరి. తిరుమల బుక్కపట్టణము వంశమునకుచెందిన శ్రీనివాస, అణ్ణయ దీక్షిత, కిరీటి వెంకటాచార్య, బుచ్చి వెంకటాచార్య, రంగాచార్య మొదలగు పండితులు సురపురమురాజన్యుల సాహితీకీర్తి పతాకలు. తిరుమల బుక్కపట్టణ వంశమువారు గీర్వాణ భాషాభివృద్ధికి, విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారమునకు సాగించిన రచనలు కొల్లలుగా నున్నవి.

శ్రీనివాసాచార్యుడు రచించిన తత్త్వమార్తాండము, ఆనంద తారతమ్య ఖండన, జిజ్ఞాసాదర్పణము, జ్ఞానరత్న ప్రకాశిక, తత్త్వదర్పణము, ప్రమాణ దర్పణము, ఓంకార వాదార్థ నయమణి కలికా, విరోధనిరోధము, విరోధ వరూధినీ ప్రమాథినీ అను ఖండన గ్రంథము, దీపికా సహిత మగు నయద్యుమణి, ప్రధాన ప్రతి తంత్ర దర్పణము, సిద్ధాంత చింతామణి, దత్త రత్న ప్రదీపిక, గ్రహణ భుక్తి దీపిక, హరిమణి దర్పణము మొదలగు రచనలును పై శ్రీనివాసాచార్యుల అగ్రజుఁడగు అణ్ణయాచార్యుని ఆచార్య వింశతి, తత్త్వగుణాదర్శ చంపువు, వ్యావహారికత్వ ఖండనసారము, అభినవ కర్ణామృతము, రసోదార భాణము మొదలగు రచనలును వెంకటాచార్యుల సిద్ధాంత రత్నావళి, సిద్ధాంత వైజయంతి, జగన్మిథ్యాత్వ ఖండన, దేశికాష్టోత్తర శతనామ స్తోత్రము, ఆనంద తారతమ్య ఖండనము మొదలగు గ్రంథములును, సర్వతంత్ర స్వతంత్ర శ్లేషయమక చక్రవర్తి బుక్కపట్టణము కిరీటి వెంకటాచార్యుల గణ సూత్ర వాదార్థము, అలంకార కౌస్తుభము, శృంగార తరంగిణీ నాటకము, గదాధరీయ ప్రామాణ్య ఖండనము, శృంగారలహరి, దశావతార స్తోత్రము, హయగ్రీవ యతిరాజ దండకములు అను గీర్వాణ రచనములును, సీతాపార్వతుల పరిణయ కథా నిర్వాహకమగు అచలాత్మజా పరిణయమను ఆంధ్ర ద్విసంధాన కావ్యమును*, బుచ్చి వెంకటాచార్యుల వేదాంత కారికావళి, అభినవ శృంగార రసమంజరి, శృంగార సర్వస్వము, కళ్యాణపురంజన నాటకము మొదలగు కృతులును సురపురము పాలకుల సమాదరణమున వెలసిన ప్రశస్త రచనములు.

* 'ఈతఁడు సిరిపుర సంస్థానమునం దాస్థానపండితుఁడుగా నుండె ననియు నేత త్కవికృతి గ్రంథము లాసంస్థానమున శిథిలములైనట్లును చెప్పుచున్నారు. గ్రంథకర్త చరిత్ర తెలియఁజేయఁదగు కృత్యాది పద్యములు లభింప లేదు' (పు. 4, ఉపోద్ఘాతము) అని అచలాత్మజాపరిణయ గ్రంథప్రకాశకులు శ్రీ నందిరాజు చలపతిరావుగారు వ్రాసిరి. తెలుఁగు విజ్ఞాన సర్వస్వము నందును వెంకటాచార్యులు సిరిపుర సంస్థాన విద్వాంసులని పేర్కొనఁ బడినది. చూ. సంపుటము 3. సిరిపుర మనుట అచ్చుతప్పు ; సురపురమనుట యొప్పు.

అచలాత్మజా పరిణయము ద్వ్యర్థి కావ్యము. అచల + ఆత్మజ = పార్వతి ; అచలా + ఆత్మజ = సీత ; ఈ యిరువురి పరిణయ కథలు నిం దిమిడి యున్నవి. గ్రంథము పూర్తిగా లభ్యము కానందున మూఁడాశ్వాసముల కథా భాగము మాత్రము ముద్రితము. సీతాపరముగా అహల్యాశాపవిమోచనఘట్టము దాఁకను, పార్వతీదేవీ పరముగా కామదహనముదాఁకను వచ్చి కథ యాఁగిపోయినది. పరిణయకథాభాగముగల మఱి యొండు రెం డాశ్వాసముల కావ్యము లభ్యము కాలేదు. ఇది తిరుమలప్రభువు వేంకటాచలపతి కంకితము. అచలాత్మజా పరిణయ కథను జెప్పుమని శౌనకముని సూతునిఁ బ్రార్థింపఁగా —

'.... అచలాత్మజామహో
దంతముఁ దెల్పుమంటి వది యంబిక పెండ్లియొ సీత పెండ్లియో
యింతగ రెండు నొక్కపరి వెల్వడఁ జెప్పెదనంచు హృష్టుఁడై'
—1-14.

సూతుఁడు కథను జెప్పెనని కవి చమత్కరించినాఁడు.†

సురపుర రాజవంశమున ప్రసిద్ధ సాహిత్య పోషకుఁడు రాజా బహిరీ పామనృపాలకుఁడు (1752—1773). ఇతఁడు కృతిభర్తయే కాక కృతికర్తకూడ. పామ నృపాలుని భార్గవపురాణము అతని సాహితీపటుత్వమునకు చక్కని నిదర్శనము. భార్గవపురాణము సురపురము వేణుగోపాలున కంకితము. కాణాదము పెద్దనసోమయాజి రచించిన మత్స్యపురాణము, శేషశైలేశలీల యను గ్రంథములు పామనృపాలున కంకితములు.

కాణాదము పెద్దనసోమయాజికవి నందవరీక బ్రాహ్మణుఁడు ; ఆశ్వలాయన సూత్రుఁడు ; ఆత్రేయసగోత్రుఁడు, తిమ్మనార్య పుత్రుఁడు. సురపుర సంస్థానము నందేకాక, గద్వాల సంస్థానమునందును సమ్మానములందిన పండితకవి 'అభినవ అల్లసాని పెద్దన' యని సురపురము పాలకుల కైవారములనందినవాఁడు. వర్గీయ వర్ణములు ('క' నుండి 'మ' వరకు) పరిహరించి తక్కిన వర్ణములతో 'శేష శైలేశ లీల' యను చిత్రకవితా పరిపూరకమగు ప్రబంధమును నిబంధించిన వాఁడు. పెద్దన శబ్దాలంకార ప్రియుఁడు. చిత్రబంధ శ్లేష కవితలలో దిట్ట. అంత్య ప్రాస నియమముల నాగసు ఈతని రచనలలో మిక్కుటము. పెద్దన రచన యగు శేష శైలేశ లీల నుండి అపంచ వర్గీయ సింహావలోకన ముక్త పదగ్రస్త కందమొక దానిని చూడుఁడు :

'నరసా వంశీసురవా
సురవారాశంసి శౌర్య శూర శరహా

† టీకా సహితము, మంజువాణీ ముద్రాక్షరశాల, ఏలూరు, ద్వితీయ ముద్రణము, 1936.

శరహారి హరి స్వరయా
స్వరయావహ లీల యాస్య వశ హాస్యరసా'

రాజా బహిరీ పామనృపాలుని పుత్రుఁడగు వెంకటనాయకుఁడు కూడ సాహిత్య పోషకుఁడు. తత్త్వగుణాదర్శ ఆచార్యవింశతి రసోదారభాణ కావ్యకర్తయగు ఇమ్మడి అణ్ణయాచార్యుఁడును, ఈ యణ్ణయాచార్యుని సోదరుఁడును, తత్త్వమార్తాండ జిజ్ఞాసాదర్పణ సిద్ధాంత చింతామణి దత్తరత్న ప్రదీపికాద్యనేక గ్రంథకర్తయునునగు ఇమ్మడి శ్రీనివాసాచార్యుఁడును వెంకట నాయకుని ఆస్థాన కవులుగా, ఆచార్యులుగా పేరుపెంపుల నార్జించినవారు. ఇమ్మడి అణ్ణయాచార్యుల తృతీయపుత్రుఁడగు ముమ్మడి వెంకటాచార్యుఁడు తన యలంకారకౌస్తుభము కృత్యాదియందు తాను బహిరీ బిరుదాంకితుఁడగు పామిభూపాలుని పుత్రుఁడగు వెంకటనాయకుని గురువునని చెప్పుకొనినాఁడు.

'శ్రీమాననీయ బహిరీబిరుదాంక పామి
భూపాలపుత్ర వర వేంకటనాయకస్య
స్వస్తి ప్రశస్తి మపతో గురురేవ
కుర్వేఽలంకారకౌస్తుభ మనన్యకృతో క్తిలక్ష్యమ్'

ఇతనిదేయగు శృంగారతరంగిణి కృత్యవతరణిక యందును—
'....బహిరీ పామనాయక కుమార వేంకటపతినాయక మహాసభాన పాండిత్య గురుత్వ భూషణేన విరచితమ్' అని ఈ విషయ మామ్రేడితముచేయఁబడినది.

కాటవ్వ తరువాత సంస్థానము నేలిన పెదనాయకుఁడు దేవబ్రాహ్మణ భక్తితత్పరుఁడు. భారత రామాయణము లితని నిత్య పారాయణ గ్రంథములు. బ్రాహ్మణుల కనేకాగ్రహారములు దానము చేసినవాఁడు. పూనాలో వేదవిదులైన బ్రాహ్మణులకు శ్రావణదక్షిణక్రింద పదివేలరూప్యములొసఁగిన నెఱదాత. పెద నాయకుని పెద్దకొడుకగు వెంకటప్ప పండిత పోషణమున తండ్రిని మించిన తనయుఁడు. సురపురము కైఫీయత్తును వ్రాయించిన మెకంజీ దొరగారి సాహాయ్యకుఁడయిన వెంకటరావుగారి 1819 ఆగష్టు 24వ తేదీ నాఁటి డైరీ ప్రకారము సురపుర సంస్థానాధీశ్వరుల వంశావళి వివరములు నాఁటి సంస్థాన పాలకుఁడగు వెంకటప్పనాయకుని మీఁద వేంకట విలాసమను గ్రంథమును కూర్చుచుండిన కవీశ్వర రాఘవాచార్యులుగారి వ్రాఁతలనుండి సేకరింపఁబడినట్లు స్పష్టపడుటచే 'వేంకటవిలాస'మను గ్రంథము వేంకటప్పనాయకుని యశోవిలాస ప్రచురమగు గ్రంథమైయుండవచ్చునని యూహింపవచ్చును. పాండవాశ్వమేధ చంపూ గ్రంథకర్తలును, కవిసార్వభౌమ శతావధాని బిరుదాంకితులును అగు వరుకూరు వేంకటశాస్త్రిగారును, శతాధిక గ్రంథకర్తలగు పురుషకారి కేశవయ్య గారును సురపుర సంస్థానకవులలో సుప్రసిద్ధులు.

సురపుర సంస్థానము 700 గ్రామములు కలది. ఇందు అగ్రహారములు,

జాగీరులు కలిపి నూటపదునైదు గ్రామములు. అహోబలస్వామి, మైసూరు పరకాల బ్రహ్మతంత్రస్వామి, రాజగురువు బుక్కపట్టణము వెంకటాచార్యులు, రాజగురువు శంఖపరము కృష్ణమాచార్యులు, రాజవిద్యాగురువు త్రివేది వరదాచార్యులు, రాజపురోహితులు బాగలకోట రాఘవప్ప, పూజారి గోపాలయ్య మొదలగు వారికి సర్వాగ్రహారము లొసంగిన సంస్థానమిది. సంస్థాన విద్యా గురువులగు కామసముద్రము అప్పలాచార్యులు, పల్లిపాద కేశవయ్య మొదలగు వారికిని మడులు మాన్యములిచ్చి మన్నించిన సంస్థానమిది. స్థానిక దేవతోత్సవ సమయములందు పరీక్షా ప్రదర్శనములు, చర్చాసభలు నేర్పఱిచి కవి పండిత నర్తక గాయకాదులకు భూరిసంభావనలిచ్చి ఆర్షధర్మమును కళాసంస్కృతులను వికసింపఁజేసి విశిష్టప్రతిపత్తిని గడించిన సంస్థానమిది.

## ఉపజీవ్య గ్రంథసూచి


1. గోలకొండ కవుల సంచిక, ప్రస్తావన.

2. కందుకూరి బాలసూర్యప్రసాదరాయబహద్దరు, ఆంధ్రవిజ్ఞానము 2, పుటలు 701, 702; 4, పు. 1837.

3. డా. బిరుదురాజు రామరాజు, మరుగుపడిన మాణిక్యాలు, పుటలు 89–93.

4. J. D. B. Gribble, A History of the Deccan, Luzac & Co., London, Vol. II, 1924, pp. 239–244.

5. Col. Malleson, History of Indian Mutiny, Vol. V, pp. 85–88.

6. Meadows Taylor, Story of My Life, Chapter VII.

7. Ellis Dowson, History of India, Vol. VII, p. 337.

8. Sarkar, Aurangazeb, Vol. V, pp. 214–217, 219–234.

9. M.A.M.P., Vol. I, Relations with Neighbouring States and Provinces, p. 11, f.n. 1.

10. Dr. V. Raghavan, The Surapuram Chiefs and Some Sanskrit Writers Patronised by Them, J. A. H. R. S., Vol. XIII, pp. 11–33, 91, 92.

11. Freedom Struggle in Hyderabad, Vol. II, 1956.

12. Sarojini Regani, Nizam-British Relations, 1724–1857, Secunderabad, 1963.

# పరిశిష్టము

ముఖ్యభాగమున పేర్కొనిన సంస్థానములు కాక మఱికొన్ని చిన్న సంస్థానముల, ఎస్టేటుల చరిత్రము, వాని సాహిత్య పోషణ వివరములు సంగ్రహముగా నీ క్రింద అకారాద్యనుక్రమమునఁ బ్రదర్శితము. మఱి పాతిక పైచిలుకు సంస్థానముల చరిత్రము అఱగొఱగా సంకలిత మయినను గ్రంథ విస్తర భీతివలనను, సామగ్రీలోపమువలనను ఇందుఁజేర్పలేదు.

## అన్నదేవరపేట

అన్నదేవరపేట – ప్రక్కిలంక వగైరా ఎస్టేటులు వణిక్ప్రముఖులు, వైశ్య కులజులు, మూరక గోత్రజులునైన పైఁడావారివి. రాజా రెడ్డి నరసింహదేవుగారు శాశ్వతకరనిర్ణయము నాఁటి యీ ఎస్టేటుల హక్కుదారు. పిఠాపుర సంస్థాన పాలకులలో పదునేడవు తరమువారగు రాజా రావు వెంకటనీలాద్రిరావుగారు (1793–1828) ఈ రెండు ముఠాలను ఇనుగంటి చినచిన్నారాయనింగారి కుమారులును, తమ బావమఱఁదియును గోకస గ్రామ వాస్తవ్యులును నగు ఇనుగంటి పాపారాయనింగారి పేర ఖరీదుచేయించి నమోదుచేయించి యుండిరి. ఆ పిమ్మట నీ యెస్టేటులు పైఁడావారికి విక్రయము మూలమున సంక్రమించినవి. ఇవికాక ఆరెంపూడి ముఠా, జగన్నాథపురము మొఖాసాగ్రామములో కొంత, కోటపాడు శివారు రామేశంపేట, గొలుగొండ తాలూకాలోని పెద్దిపాలెం, కైలాసపట్నం మున్నగునవి పైఁడావారి తక్కిన యెస్టేటులు. వీని యన్నింటిమీఁద పేష్కషు పదునాలుగువేలు ; రాఁబడి సుమారొకలక్ష.

పిఠాపుర నివాసి పైఁడా సర్వయ్య యీ యెస్టేటు పాలకుల పూర్వుఁడు. ఆయన మనుమఁడు వెంకన్న. వెంకన్న కడగొట్టు కుమారుఁడు చినచలమయ్య. ఈయన కుమారులగు రామకృష్ణయ్య పిఠాపురము రాజాగారినుండి కొప్పూరును కానుకగా నందినవారు. వీరి కుమారులు రావు బహద్దర్ వెంకటాచలపతి గారు సప్తసంతాన ప్రతిష్ఠాపయిత.* ఏలూరు మోతేవారు, గూటాల మన్యము వారు మున్నగు జమీందారులు పైఁడావారి వియ్యంకులు. వీరేశలింగముగారి సంఘ సంస్కరణోద్యమములకు పైఁడావారు చేదోడుగానుండిరి. కాశీ, కోటిపల్లి, దక్షారామము, భద్రాచలము మున్నగు క్షేత్రములలో పెక్కు సత్ర

*నానారాజన్య – విఖ్యాత జనచరిత్రము, పుటలు 148 – 166.

ములు, కాకినాడలోని అనేక దేవాలయములు, వేదపాఠశాల, ఆయుర్వేద వైద్యశాల వైఁడావారి వితరణ గుణమునకు నిదర్శనములు. కాకినాడలోని రాజావారి కళాశాల, వైద్యకళాశాల, స్త్రీల కళాశాల, రామచంద్రపురము కళాశాల వైఁడావారి విదాన్యతను వర్ణించు సరస్వతీ మందిరములు.

బులుసు ప్రకాశవేదార్థి, పుల్లె దక్షిణామూర్తిశాస్త్రి, పరవస్తు రంగాచార్యులు, భాగవతుల హరిశాస్త్రి, కప్పగంతు రామశాస్త్రి, కాళ్ళకూరి నారాయణరావు, కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి, ఓరుగంటి సోమశేఖరకవి, సుబ్రహ్మణ్యశాస్త్రి, వెంకట నారాయణపాఠీ, అయ్యగారి బాపిరాజశర్మ, మున్నగువారు వైఁడావారి సమ్మానములందిన కవి పండితులలో కొందఱు. స్కాంద పురాణాంతర్గతమగు సంస్కృత భీమఖండము వైఁడావారి యాశ్రితుఁడగు కప్పగంతు రామశాస్త్రిచే పరిశోధితమయి వెలుఁగునకు వచ్చినది. ఇది ముప్పది రెండధ్యాయములుగల క్షేత్రమహాత్మ్యము, పరిష్కర్త పీఠికలో వైఁడావారి వంశ ప్రశంసకలదు.*

వైఁడా వెంకటాచలపతికి ప్రభావతీ పరిణయమను శృంగార ప్రబంధమును గృతియిచ్చిన ఓరుగంటి సోమశేఖరకవి (1818—1903) ద్రావిడ శాఖాబ్రాహ్మణుఁడు ; కౌండిన్య గోత్రోద్భవుఁడు, నరసమాంబా జోగయార్యుల పుత్రుఁడు. మాడుగులకు నాలుగుకోసుల దూరమునఁగల నందిపిల్లియను నగ్రహార మీతని నివాసగ్రామము. శ్రీకృష్ణలీలా విలాసమను నీతని యక్షగాన కృతి 1850 ప్రాంతమున మాడుగుల శ్రీకృష్ణ భూపతి కంకితము. మాడుగుల ఆస్థానకవియును, కృష్ణార్జున చరిత్ర ద్వ్యర్థికావ్య కర్తయునునగు మంత్రిప్రెగడ సూర్యప్రకాశరాయకవి సోమశేఖర కవికి ప్రతిస్పర్థి. సోమశేఖరకవి రచియించిన రామకృష్ణార్జున రూప నారాయణీయమను త్ర్యర్థికావ్యము పూసపాటి నారాయణరాజునకును, రామకథాత్మకమగు నరసభూపాల రాజీయమను కావ్యము నారాయణరాజు తనయుఁడగు నరసభూపాల రాజునకును, హేలావతీ పరిణయమను కుబ్జాకృష్ణ వివాహగాథ న్యాయపతి నరసింహస్వామి పంతులుగారికిని, చిన్నయసూరి బాలవ్యాకరణమునకు పద్యరూపమున వ్రాసిన గ్రంథము జయంతి కామేశం పంతులుగారికిని, తత్త్వాదర్శమను వేదాంతకృతి విశాఖపట్టణము గొడే నారాయణగజపతికిని అంకితములు. నాలుగాశ్వాసములుగల ప్రభావతీ పరిణయమును† శృంగారప్రబంధము వైఁడా వెంకటాచలపతి గారికి అంకితము. హరివంశగాథ ననుసరించి యీకృతి సంధానితము. శ్లేషయమకాది శబ్దాలంకారములతో ప్రతిపద్యచమత్కృతులతో ప్రబంధములు రచియించు మధ్యకాల కవుల కీ కవి తీసిపోవువాఁడు కాఁడని పరిష్కర్తలు చేసిన సిద్ధాంతము. వెంకటనారాయణ పాఠీగారి లఘుటీక కవ్యభిప్రేతముగా గ్రంథాంతమునఁ

*కాకినాడ ముద్రాక్షరశాల, 1879.

†సుజనరంజనీ ముద్రాక్షరశాల, కాకినాడ.

జేర్పఁబడినది

సాహిత్య విశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారి శ్రావణవిజయ మను పది యాశ్వాసముల గద్యరచనము పైఁడా రామకృష్ణయ్యగారి కంకితము. సుగుణ మణియగు నొక వైశ్యకుమారుని యభ్యుదయ కథన మీ శ్రావణవిజయము.

అయ్యగారి బాపిరాజశర్మ రచియించిన కన్యకయను నయిదంకముల రూపకము వెంకటాచలపతి గారికిఁ గృతి. వైశ్యుల యిలువేల్పగు వాసవీకన్య కథ యిందలి యితివృత్తము.

కపిలేశ్వరపురము హిందూ ధర్మశాస్త్ర గ్రంథనిలయమునకు పైఁడా జమీందారులు పోషకులు.

## ఎర్నగూడెము

ఈ యెస్టేటు పాలకుల పూర్వులు గోలకొండ నవాబుల యొద్ద తాబేదారులుగా నుండి విశాఖపట్టణ మండలమునందలి కసింకోటను పాలించు చుండిరఁట. వీరు కుప్పనూళ్ళ గోత్రజులగు వెలమదొరలు. బొబ్బిలి యుద్ధము (క్రీ. శ. 1757) తరువాత చెలికాని రామారాయనింగారను కసింకోట పాలకుఁడు భార్యతోఁగూడ తరలివచ్చి పీఠికాపురాధీశుని యాశ్రయ మపేక్షించి చిత్రాడయను గ్రామమున నివసించెనఁట. బొబ్బిలి యుద్ధమున వీరస్వర్గ మలంకరించిన గోపాలకృష్ణ రంగారావుగారి భార్య మల్లమదేవియును, క్రీ. శ. 1768—1770 ప్రాంతమున పిఠాపుర సంస్థానమును పాలించిన పెదనీలాద్రి రాయనింగారి భార్యయగు జగ్గమాంబయును అక్కచెల్లెండ్రు. వీరు కసింకోట పాలకుల పుత్రికలు. చిత్రాడచేరిన రామారాయనింగారు పిఠాపురమువారితో వియ్యమంది వారి తోడ్పాటువలన ఎర్నగూడెము, గౌరీపట్టణములను ఎస్టేటులను సంపాదించిరి. ఈ పెద రామారాయణింగారికి అయిదవు తరమువారు చెలికాని భావనారాయణింగారు. వీరి భార్య రమణయాంబ. వీరి మూఁడవ కుమారులు, సాహిత్యలోక ప్రసిద్ధులు కావ్యనిధి చెలికాని లచ్చారావుగారు (1885—1923).

లచ్చారావుగారి చెల్లెలు కోలంక — వీరవరము ఎస్టేట్ల జమీందారిణియగు రాజా రావు రామయ్యమ్మారావుగారు. వెంకటగిరి రాజా గోవిందకృష్ణయాచేంద్రుల భార్య రత్నమాంబ లచ్చారావుగారి పినతండ్రి కూఁతురు. 'తన యావత్స్వము వేత్తయై సతము విద్వద్రక్షణార్థమ్ముగా వినియోగించిన మేటి, కావ్యనిధి....'* లచ్చారావుగారు ప్రసిద్ధ రచయితలు, 'కృతులు సేయించి బహు బహూకృతు లొనర్చి కృతులుగైకొని కావించెఁ గృతులు కొన్ని.... సచ్చరిత్రుఁడు చెలికాని లచ్చరావు'.† వీరి రామవిలాస గ్రంథమాలలో జాహ్నవీ

* నానారాజ సందర్శనము, ఉత్తరార్ధము, పు. 231.

† పైది, పుటలు 217, 218.

మాహాత్మ్యము, మిత్రవిందా పరిణయము, రంగనాథ రామాయణోత్తర కాండము, వాల్మీకి చరిత్రము, విజయనందన విలాసము, సీమంతినీ కల్యాణము మున్నగు ప్రాచీన గ్రంథములు ప్రకటితములు. 'ఆంధ్రభాషా విలాసిని' యను వీరి సాహిత్య మాసపత్రికలో తిరుపతి వేంకటకవులు, సత్యవోలు సోమసుందర కవి, కూచి నరసింహము, వంగూరి సుబ్బారావు, పురాణపండ మల్లయ్యశాస్త్రి మొదలగు విద్వాంసుల రచనలు ప్రచురితములగుచుండినవి.

అచ్చారావుగారి రచనములలో ఆధునికాంధ్రకవిచరిత్రము, భగవద్గీతామృత బిందువు, భీష్ముని జీవితచరిత్రము, రామారాయ ఖండనము, స్త్రీనీతి పద్య రత్నావళి మున్నగునవి ముఖ్యమైనవి. కావ్యకళానిధి, తత్త్వవిశారద యనునవి వీరి బిరుదములు. వీరు అనువేలసుపైఁబడిన తాళపత్ర గ్రంథములను సమకూర్చి ఒక ఉత్తమ గ్రంథాలయమును స్థాపించియుండిరి. శృంగారరసా యణభాణ స్తోత్రరత్నావళ్యాది సంస్కృత గ్రంథములను, రుక్మిణీకల్యాణ ప్రభృతి శుద్ధాంధ్ర కావ్యములను రచించిన ద్వివేది నారాయణశాస్త్రి వీరి యాస్థాన పండితులు. వంగూరి సుబ్బారావుగారి ఆంధ్రవాఙ్మయ చరిత్రమునకు వేయినూటపదియాఱులు బహుమతిగా నిచ్చి అచ్చారావుగారు దానిని వెలుఁగు నకుఁ దెచ్చిరి. వీరు గ్రంథాలయ సర్వస్వాది పత్రికలకు పోషకులుగా నుండిరి.

కావ్యనిధి, ఆంధ్రసాహిత్య సరస్వతి, విద్యాభూషణ బిరుదాంకితులగు చెలికాని వెంకటనరసింహారావుగారు అచ్చారావుగారి అన్నగారి కుమారులు. వీ రాంధ్రమున అనేక గద్యపద్య గ్రంథములను సంధానించిరి. పిఠాపురము దాఁపునఁగల లక్ష్మీనరసాపురము వీరి కాపురము.

## కసింకోట

పూర్వమిది చికాకోలు సర్కారులోని ఫౌజుదారీ విభాగము. 1802 నాఁటి శాశ్వత పరిష్కార కాలమున విజయనగర పాలకులచే కొనుగోలు చేయఁబడి యుండినది. ఇందు ఎనిమిది జిరాయితీ గ్రామములుండినవి. దీని రాఁబడి ఇరువది నాలుగువేలు; పేష్కషు పదునాలుగువేలు. మెళుపాక, గంటావారిపాలెము మున్నగు ఎస్టేటులుకూడ అనంతర కాలమందు కసింకోట యెస్టేటుదారులకు చెంది యుండినవి. 1804 లో వీనిని వెంకటాచలము పంతులు గారు ఖరీదుచేసిరి.

గండు సోమనాథశాస్త్రి, తోపల్లి వేంకటరామసిద్ధాంతి, ప్రసిద్ధ వైణికులు తుమురాడ సంగమేశ్వరశాస్త్రి (1876 — 1931)* కసింకోట సంస్థాన కవి పండితులు. సోమనాథశాస్త్రి వ్యాకరణ శాస్త్రమునందును, ఆంధ్రగీర్వాణ సాహిత్యముల యందును ప్రవీణులు; సంస్కృతాంధ్ర కవులు. భీమ విక్రమ మను వ్యాయోగము శాస్త్రిగారి రచనము. వెంకటరామ సిద్ధాంతిగారు ఆస్థాన

* సత్యవోలు రాధామాధవకవి, త్రిలిఙ్గ, 1931, ఫిబ్రవరి 2, పు. 14.

సిద్ధాంతులు. రాణి మహాగ్ని చిన్న నృసింహకవిగారి తిథికల్పవల్లికి వెంకటరామ సిద్ధాంతిగారు మంజరియను వ్యాఖ్యను రచియించి ప్రకటించిరి.

## కాండ్రేగులవారు

గజ్జరమను వ్యవహారనామముగల గోదావరీ మండలమునందలి ఎస్టేటు కాండ్రేగులవారిది. కాండ్రేగుల జోగిపంతులు (1762–1765) అను వ్యవహార నామముగల శ్రీనివాస జగన్నాథరావు బహద్దరుగారు ఈ యెస్టేటు సంపాదకులు. వీరి మాతామహులగు జిల్లేళ్ళవారు పూర్వమునుండియు రాజమండ్రి సర్కారులలో మొజుందార్, సెరిస్తదారులుగా వ్యవహరించినవారు. జోగిపంతులు, అతని తమ్ముఁడు వెంకటరాయఁడు మచిలీపట్టణములోని ఇంగ్లీషు కుంఫిణీవారి ఛీఫ్ ఇన్ కవున్సిలు నొద్ద దుబాసీలుగానుండి వారికి తలలో నాల్కగా వర్తించినవారు.

ఇంగ్లీషు కుంఫిణీవారికిని, నిజాము నవాబు నిజామలీఖాను (1761–1803) నకును ఉత్తర సర్కారుల కౌలు విషయముగా జరిగిన వ్రాయబారము లను చాకచక్యముతో నిర్వహించిన జోగిపంతుల సేవలకు సంతసించి నిజాము నవాబు పంతులకు అతని సోదరులకుకూడ వారి పూర్వుల యుద్యోగములను గౌరవలాంఛనములను ప్రసాదించియుండెనఁట. దీనికి కుంఫిణీవారి యామోద ముద్రయును లభించియుండినదఁట. జోగిపంతులు తరువాత నితని వంశీయులు దీని పరగణాలోని మఱికొన్ని సీమలను సంపాదించి యెస్టేటును నిర్వహించిరి. వెంకటరాయఁడు, జగ్గప్ప, గోపాలరావు మున్నగువారీ యెస్టేటును పాలించిన వారు. 1853 లో ఈ యెస్టేటు కుంఫిణీ సర్కారులో కలిసిపోయినందున వారికులకు 'లపణను'లు మాత్రము మిగిలినవి.

సంస్థాన సంపాదకుల సంతతికిఁ జెందిన రాజా కాండ్రేగుల శ్రీనివాస జగన్నాథరావు పంతులుగారు గొప్ప విద్యాపోషకులు: సంస్కృత విద్యాలయ స్థాపకులు. కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారిని పోషించిన ప్రముఖులలో వీరొకరు. శ్రీపాదవారి గణేశపురాణము జగన్నాథరావు పంతులుగారి కంకితము. ఇది వ్యాసోపపురాణములలో నొకటిగా పరిగణితము.

జగన్నాథరావుపంతులుగారు తొలుతనుండియు రాజమహేంద్రవరము నందలి ఆంధ్రేతిహాస పరిశోధకమండలి సభ్యులు; రాజపోషకులు. తమ పూర్వులగు జోగిపంతులుగారు ఇంగ్లీషు కుంఫిణీవారి దుబాసీగాను, కార్యకర్త గాను వ్యవహరించిన కాలమునందు ఆయనకును, కుంఫిణీకిని నడచిన యుత్తర ప్రత్యుత్తరములకు సంబంధించిన విలువయిన చారిత్రక సంపుటములను పరిశోధకమండలి కొసఁగి జగన్నాథరావుపంతులుగారు చరిత్రరచనమునకు బహూపకారమొనర్చిరి.

## కాశీపురము

జయపురము విక్రమదేవవర్మగారు తమ అనుయాయులయిన 'ముఖీ' వారి కొసఁగిన సంస్థానము ఇది. దీనిని శృంగవరపుకోట జమీందారీ యని కూడ వ్యవహరింతురు. ఇది కొండజమీందారీలలో నొకటి. విజయనగరము పెద విజయరామ గజపతికి బొబ్బిలియుద్ధమునఁ దోడ్పడిన ముఖీ కాశీపతిరాజు* ఈ సంస్థానపాలకుల పూర్వులలో నొకఁడు. ఇతనికి వీరభద్రరాజు, వీర ముకుందరాజు, రాజభూపాలరాజు అని ముగ్గురు కుమారులు. రాజభూపాలరాజు తనయుఁడు వీరభద్రరాజు. విజయనగరమువారిపై జరిగిన కొండజమీందారుల కుట్రలలో చేరుటవలన కాశీపురము జమీందారీ విజయనగరసంస్థానములో నొక భాగమయి యొక తాలూకా యయినది.†

పద్మనాభయుద్ధమునకు పిమ్మట కాశీపురము పూర్వపాలకుల వారసుల కప్పగింపఁబడక కుంఫిణీస్వాధీనముననే కొంతకాలముండినది. ఆ పిమ్మట నొక సనదు మూలముగా విజయనగర సంస్థానములో కలిసినది. పూర్వపాలక సంతతివారికి కొంతకాలము అల్పమగు తవుజీ ముట్టుచుండెడిది. చివరివాఁడగు ముఖీవీరభద్రరాజు కుట్రదారుఁడను నెపమున రాయలసీమలోని గుత్తికోటలో నిర్బంధమున నుండి మరణించెను.

పేరివంశమువారి మూలపురుషుఁడగు పేరి సర్వేశమఖి గోదావరీతటము నందలి అయినవిల్లి చెంతనున్న వీరపల్లిపాలెము వాస్తవ్యులు. వీరు ముఖీరాజుల కోరికమీఁద కాశీపురము దివానమునకు వచ్చి పండితపదవి నలంకరించి అయిదు మాన్యములను బహుమతిగా నందికొనిరఁట. వీరికుమారు లేవురలో ద్వితీయుఁడగు జగన్నాథుఁడు వేదమునను, ధనుర్వేదమునను అద్వితీయుఁడఁట.

కాశీపురము జమీందారులలో నొకఁడగు రాజభూపాలరాజు విజయనగరమువారి నెదిరింప నిశ్చయించినపుడు అడిదము సూరకవి చెప్పిన చాటువుగా నీ క్రింది పద్యము ప్రచారములో నున్నది :

'విజయరామ మహారాజ వీరుఁ డేలు
పట్టె ముట్టికించె రాజభూపాలరాజు.
కడమ మాటలకేమి యీ కాలమునను
బుట్టె నవ్వేను ; బుఱితోఁక గొట్టె గటచె'.

కాశీపురము జమీందారుల దివాను పొణుగుపాటి వేంకటమంత్రి (1720–1780). ఇతఁడు గోలకొండ వ్యాపారి తెగకుఁ జెందిన బ్రాహ్మణుఁడు, శ్రీవత్సగోత్రుఁడు, వీరరాజపుత్రుఁడు, కవిపండితాభిమాని. ఇతనిపై అడిదము

*'....ఘనయశోనిధి ముఖీకాశీపతి క్షమాధవమౌళి యొకి కొంత వాహినితోడ.... విజయరామరాజ క్షమాపతుఁ బ్రోలు వెల్వడి ' పం.నా. 1–160.

†పద్మనాభ యుద్ధము, 64.

సూరకవి చెప్పెనని ప్రతీతిగల చాటువులు పెక్కు లున్నవి. మచ్చునకు వానిలో కొన్ని :

'వెన్నెలవలె కర్పూరపుఁ
దిన్నెలవలె నీదు కీర్తి దిగ్దేశములన్
మిన్నందె పన్నె కెక్కెను
ఛిన్నావా పొణుగుపాటి వేంకటమంత్రీ'

'వలరాచ పనికిఁ గాదా
వెలవెలఁదుక పాన్పుఁ ద్రొక్కి విటుఁడు సహించున్
చలమేల రాఁగవాడికి
విలసద్యశ పొణుగుపాటి వేంకటమంత్రీ'

శృంగవరపుకోట జమీందారుల దివానగు పాత్రుని మహంతి కృష్ణ మహంతి పట్నాయకుగారు అండలూరి శరభకవి రచించిన ముక్తిచింతామణి యను పద్యగ్రంథమునకు కృతిభర్తలు.

## కిర్లమపూడి

ఇది గోదావరీమండలములోని ఎస్టేటులలో నొకటి; ఒకనాఁడు పెద్దాపురము సంస్థానములోని ఒక మఠా. సర్కారువారి ఏలములో పిఠాపురమువారి చేతికి వచ్చినది. ఆ పిమ్మట పిఠాపురముపాలకులతోడి చుట్టఱికమువలన ఇను గంటివారి స్వాధీనమునకు వచ్చినది. ఎస్టేటులోని కొంతభాగముమాత్రమే చిరకాలము ఇనుగంటివారి వశమున నుండినవి. తక్కిన భాగములు తుని, బొబ్బిలిపాలకుల స్వాధీనములో నుండినవి.

పిఠాపురము సంస్థానపాలకులలో పదునేడవుతరమువారయిన వేంకట నీలాద్రిరాయణింగారి కాలము (1793–1828) న అనేకములగు చిన్నచిన్న జమీందారీ లేర్పడినవి. నీలాద్రిరావుగారు ఇనుగంటి చినచిన్నరాయణింగారి పుత్త్రికయైన వేంకటరమణయ్యమ్మను వివాహమాడిరి. ఈమెవలన సంతానము కలుగకుండుటవలన తమ తోడియల్లుఁడును, చిత్రాడవాస్తవ్యులును నగు రావు వెంకయ్యగారి పుత్త్రుని దత్తునిగా స్వీకరించి తమ తండ్రిగారగు బుచ్చి వెంకట రాయణింగారిపేరు పెట్టిరి. ఈ బాలుఁడకాలమరణము నొందుటచే మరల నీతని సోదరుఁడగు బుచ్చితమ్మయ్య యను బాలుని దత్తపుత్త్రునిగా స్వీక రించిరి. ఆ పిమ్మటఁ గొంతకాలమునకు వెంకటరమణయ్యమ్మరాణిగారికి, నీలాద్రిరాయణింగారికి మనోవైకల్యములు తటస్థించుటచే రాణిగారు పిఠాపురము వదలి దత్తపుత్త్రుని వెంటఁదీసికొని తమ పుట్టిల్లు గోరసగ్రామమున కేఁగిరి. బుచ్చితమ్మయ్యగారి పెంపుడుతల్లిగారైన యీ వెంకటరమణయ్యమ్మ పెద్దాపురము సంస్థానమునకు చెందియుండిన కిర్లమపూడి యెస్టేటును ఖరీదుచేసి

యుండిరి.

ఈ బుచ్చి తమ్మయ్యగారి భార్య బుచ్చి సీతయ్యమ్మగారు. ఈమె తనయ యగు వెంకయాంబ ఇనుగంటి వెంకటనృసింహరాయల భార్య. వీరి పుత్రులు రాజగోపాల వెంకటరామ చిన్నారావు దొరగారు. ఈ చిన్నారావుగారి పెదతల్లి తనయులు బుచ్చితమ్మయ్యగారు. సోదరులిరువురును కవిపండిత పోషకులు. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు కిర్లమపూడి యిలాకా భూములను ఇజారాకు సాగుచేసి ఆయిదాఱువేలు శిస్తు బకాయిపడి, కవిపేరు, దేవునిపేరు, జమీందారుని పేరు ఇమిడ్చి బహుశ్లోకగర్భితముగా శిస్తు బకాయిని తీర్చు మనునట్లు నొక్క సీసపద్యమును రచించి రాజా యినుగంటి బుచ్చితమ్మయ్య గారి యెదుట చదివి వివరింపఁగా రాజాగారు సంతసించి బకాయిని మాపు చేయించి సత్కరించిరఁట.* వీరి యాశ్రితుఁడగు సత్యవోలు కామేశ్వరరాయ కవి పోషకుల యనుమతిమేరకు విశ్వగుణాదర్శము వచనమునను, ఋతుసంహార కావ్యమును పద్యరూపమునను, రతిమన్మథ నాటకమును నాంధ్రీకరించెను; కాదంబరి నాటకమును రచించెను. తరువాతి ప్రభువులగు వేంకటరాజగోపాల సూర్యారావు బహద్దరుగారికిని వీ రాశ్రితులు. సంగీత విద్యావిశారదులు, సరసాంధ్ర కవితాచతురులు, వామన రుక్మిణీపరిణయ నాటక కర్తలు, గీతగోవిందాంధ్రీ కర్తలునగు సత్యవోలు సోమసుందరరాయకవి (1851—1936) కామేశ్వర రాయకవిగారి సోదరులు.

తిరుపతి వేంకటకవులలో నొకరగు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారి యభ్యుదయమున కీ సంస్థానపాలకులు మూలకారకులు. చర్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి నాదరించి పోషించినది కిర్లమపూడి పాలకులే. సంస్థానపాలకుల గృహదైవము రాజగోపాలమూర్తి వెలసిన ధర్మవరమునందు బుచ్చి సీతయ్యమ్మగారు నెల కొల్పిన ధర్మపాఠశాలలో బ్రహ్మయశాస్త్రిలుగా రుపాధ్యాయులుగా నుండిరి. తార్కిక శిఖామణి తణికెళ్ళ లక్ష్మీనృసింహ శాస్త్రిగారు నీ పాఠశాలయందే సంస్కృత విద్యాబోధకులుగా పనిచేసిరి. తిరుపతి వేంకటకవుల కీ యాస్థానమున వార్షికములుండెడివి.

'ఒక్క కిర్లమపూడికిఁ దక్క వార్షి
కమున కంచును మేమెట కయినఁ జనుట
యిప్పటికి లేదు....'

అని ఉర్లాము సమ్మాన సందర్భమున వేంకటశాస్త్రిగారు పలికిన పలుకులు కిర్లమపూడి సంస్థానాధిపతుల విశిష్టతను, వితరణశక్తిని నిరూపించునట్టివి.

'శ్రీ నొప్పారెడి నీదు వర్ణనకునై చేయూఁప శబ్దార్థముల్
"నేనే వచ్చెద నేనె వచ్చెదను నేనే వత్తు నేవత్తు నే

*శ్రీకృష్ణ స్వీయచరిత్రము, పు. 140.

నేనేనే" యని వచ్చి మీఁదఁబడు మే మెద్దానిఁ గైకొందు మె
ద్దానిన్ వీడుదుమోయి చిన్ననృపతీ! దానప్రధానాకృతీ'
—(నానారాజ, పు. 64)

అనునది తిరుపతి వేంకట కవులొనర్చిన ప్రశంసాపద్యము.

కిర్లమపూడి జమీందారులు చర్లబ్రహ్మయ శాస్త్రిగారిని కాశికి పంపి సర్వశాస్త్రములు చదివింపఁజేసినట్లు క్రింది చెళ్ళపిళ్ళవారి పద్యము వలనఁ దెలియుచున్నది :

'అంచితులౌ భవజ్జనకు లాదరమొప్పఁగఁ గాశిలోనఁ జె
ప్పించిన సర్వశాస్త్రములఁ బెంపుగ నధ్యయనం బొనర్చి రా
జించెడు చర్లవంశ వరనీరధిశారదచంద్రు సార్థతో
దంచిత బ్రహ్మయాభిద బుధాగ్రణి శిష్యుఁడ వేంకటాఖ్యుఁడన్'

## కొండూరు

ఇది పంటరెడ్ల కోవకుచెందిన రేబాలవారి యెస్టేటు. మోపూరు వాస్తవ్యులయిన రేబాల పట్టాభిరామరెడ్డిగారి యార్వురు పుత్రులలో నాలవవారు లక్ష్మీనరసారెడ్డి (1868–1917) అభ్రకము వ్యాపారమున లక్షలార్జించి 1910 లో కాళహస్తి సంస్థానభాగమగు కొండూరు ఎస్టేటును పం్రెండువేల సాలుసరి రాఁబడిగల దానిని కొని జమీందారులయిరి; 1916 లో రావుబహద్దరు బిరుదమునందిరి.

వేదము వారి సర్వంకష వ్యాఖ్యారచనమునకు, తత్ప్రచురణమునకు లక్ష్మీనరసారెడ్డిగారే కారకులు 'ఆంధ్ర నైషధమున కతి విపులార్థముల్ వ్రాయించి భాషకు బాసటయ్యె'. నెల్లూరు విద్యాసంస్థలలోఁ జదువు విద్యార్థులకు విద్యార్థి వేతనములు చెల్లించు నిమిత్తము పేష్కషుపోను సాలీనా రూ. 2,860 ల నికరమగు ఆదాయముగల యొక యెస్టేటు గ్రామమును ప్రత్యేకించి లక్ష్మీనరసారెడ్డిగారు తమ విద్యాభిమానమును బ్రదర్శించిరి. వీరి తమ్ముని కుమారులగు పట్టాభిరామరెడ్డిగారును కవిపండిత పక్షపాతులు; వేదము వారి గృహవసతికగు వ్యయమును వీరు భరించిరి.

## కోటరామచంద్రపురము

ఇది గోదావరీ మండలములోని ప్రాచీన సంస్థానములలో నొకటి. ప్రసిద్ధాంధ్ర క్షత్రియ వంశములకుఁ జెందిన కాకర్లపూడివారు దీని పాలకులు. అచ్యుతరామరాజు, రామచంద్రరాజు అనువారు వీరి పూర్వులు. శాశ్వత కర నిర్ణయమునాఁటి జమీందారు కాకర్లపూడి జగన్నాథరాజు. 1803లో నీ సంస్థానము రాఁబడి రూ. 1,78,000 లు; పేష్కషు రూ. 1,24,000 లు.

కాకర్లపూడి వేంకటకృష్ణరాజుగారి సంస్థానాస్థాన విద్వాంసులు శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారు. 'శిష్టకులతల్లజుఁడై తనరారు కృష్ణమూర్తిని శిబికాధిరూఢు నొనరించిరి వీరు'. రాజుగారు శాస్త్రిగారికి అయనవల్లి గ్రామములో పదిపుట్ల భూమిని మాన్యముగా నిచ్చిరఁట. కాకర్లపూడి రామచంద్రరాజు, జగన్నాథరాజు సోదరులు కృష్ణమూర్తి శాస్త్రిగారిని తమ యాస్థానకవిగా పోషించినవారు. 'అష్ట కకుబ్మహీశ్వర సభాంతర సన్నుత కీర్తిశాలి.... కవికోటి శిఖామణి....' యని సమకాలికులగు కవుల మెప్పులనందినవాఁడు శిష్టు కృష్ణమూర్తికవి.* శాస్త్రిగారి సర్వకామదాపరిణయము అను ప్రబంధము జగన్నాథరాజునకు కృతియిచ్చు సంకల్పముతో రచియింపఁ బడినదఁట. శాస్త్రిగారి ప్రతిస్పర్ధియగు పిండిప్రోలు లక్ష్మణకవి కపట ప్రబంధమువలన కృతిసమర్పణ మాఁగిపోఁగా కృష్ణమూర్తి కవిగారి కపమానము జరిగెనని పుక్కిటి పురాణము. కృతి సమర్పణము నిర్విఘ్నముగా జరిగెననియు కృతిభర్తలు కృతికర్తకు రూ. 4,000 బహుమతి చేసిరనియు కొందఱ వ్రాఁత.†

కాకర్లపూడివారి యాస్థానమున పిడపర్తి శివరామసిద్ధాంతి, కృష్ణసిద్ధాంతి మున్నగువారు ప్రసిద్ధులు. కాకర్లపూడి రామచంద్రరాజుగారి కాలమున శతావధానులు తిరుపతివేంకటకవులాస్థానమునకు వచ్చి సమ్మానములందిరి. అహల్యా చరిత్ర గ్రంథకర్తలగు నెమలూరి వెంకటశాస్త్రిగారు కాకర్లపూడి పెద అచ్యుత రామరాజుగారి ముఖ్యాశ్రితులు.

## గంగోలు

ఇది నవీనమయిన ప్రొప్రయిటరీ యెస్టేటు. పోలవరము ఎస్టేటులోని కొంతభాగమును విడఁదీయఁగా నేర్పడినది గూటాల యెస్టేటు. దీనినుండి కొన్ని గ్రామములను విడఁదీయగా రూపెత్తినది గంగోలు ఎస్టేటు. 1849లో హోతా గంగయ్యగారను శ్రీమంతులు దీనిని ఖరీదుచేసిరి. ఆనాఁటి దీని పేష్కష్ రు. 1,264 లు. గంగయ్యగారికి వాణిజ్యమునందు పెద్దనష్టము వచ్చుటవలన దానిని పూర్తిగా మానివేసి యెస్టేటువ్యవహారములపై శ్రద్ధవహించిరి. 1860—1878 మధ్య ఎస్టేటు అభివృద్ధి నిమిత్తమై చాల పెద్దమొత్తములను పెట్టుబడిపెట్టి, ఇరుగుపొరుగు ప్రాంతములనుండి రైతులను కూలీలను పిలిపించి వారికి అప్పుసప్పులిచ్చి, భూమిబుత్రలిచ్చి, యడవులను గొట్టించి వ్యవసాయ మును వృద్ధిచేయించిరి. 1878 లో గంగయ్యగారు చనిపోఁగా వారికుమారులు వీరభద్రయ్యగారు మైనరగుటచే తల్లి యిరువదియేండ్లపాటు సంస్థాన వ్యవహార

*చాగంటి వెంకటకృష్ణకవి, హైమవతీపరిణయ పీఠిక, R. No. 554.

† కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి, శ్రీకృష్ణాపవాదాపనోదనము, త్రిలిఙ్గ, 1939, జూన్ 19—26, పుటలు 4, 13.

ములను సరిచూచినది.

1898 లో వీరభద్రయ్య పంతులుగారు జమీ పాలనమును స్వీకరించిరి. వీరు సాహిత్యప్రియులు; దేశచరిత్రయన్న వీరికి మిగుల సభిమానవిషయము. వీరు ఆంధ్రేతిహాస పరిశోధకమండలి పోషకులలో నొకరు. రాళ్ళబండి సుబ్బారావుగారి సంపాదకత్వమున పరిశోధకమండలివారు ప్రచురించిన ప్రత్యేక సంచికలకు వీరు భూరిగా విరాళములనిచ్చిరి. అనేక గ్రంథప్రచురణ సంస్థలకు వీరు రాజపోషకులు.

## గంపలగూడెము

వెల్లంకివారి ప్రాచీన సంస్థానములోని యొక యెస్టేటిది. వెల్లంకివారు వెలమవారు. మల్లారావు వీరి మూలపురుషులు. గోలకొండ నవాబుల కాలమున కనకగిరి, జమ్ములవాయి, మేడూరుఘాటు పరిగణాలపై దేశపాండ్యా అధికారులు. వీరికోవలోని వెంగళరావు (1669--1687) నవాబులనుండి సన్నదులను బొందినవాఁడు. వెంగళరావు జ్యేష్ఠపుత్రుఁడు గోపాలరావు. ఔరంగజేబునుండి 1698 లో దేశపాండ్యాగిరీ పట్టమునొందినవాఁడు. గోపాల రావుగారి పుత్రుల హయాములో సంస్థానము నాలుగుచీలికలైనది. జ్యేష్ఠుఁడగు వెంకటరావు గంపలగూడెమునకును, వెంగళరావు కలగర యెస్టేటునకును, పెదరామారావు తిరువూరునకును, జోగయ్యారావు ఇనగడపకును పాలకు లయిరి.

వెంకటరావుగారి మనుమలకాలమున గంపలగూడెము తూర్పు పడమర పంతులని రెండు భాగములయినను తూర్పుపంతువారు నిస్సంతతయినందున నీపంతు మరల పడమటిపంతులో కలిసి యేకమైనది. వెంకటరావు ప్రపౌత్రుఁ డగు రాజావెల్లంకి వెంకటకృష్ణారావు 1886 లో అపుత్రకులుగా మరణించిరి. వీరి కూఁతురు సుబ్బమ్మగారిని పెండ్లియాడుటవలన కోటగిరి జగన్నాథ రాయణింగారు ఎస్టేటున కధికారులయిరి. వీరి దత్తపుత్రులు వెంకటకృష్ణరావు గారు. వీరిని దత్తు స్వీకరించిన తరువాత జగన్నాథరాయణింగారికి సత్యనారా యణ, పార్థసారథి యను నిరువురు పుత్రులు జన్మించిరి. ఈ ముగ్గురును కలిసి యెస్టేటును విభజించికొని నిర్వహించిరి.

వెంకటకృష్ణరావుగారు జాతీయోద్యమమునందు ప్రసిద్ధపాత్రమును వహించినవారు. ఆంధ్రరాష్ట్రీ రాజకీయమహాసభ కధ్యక్షులయి ప్రభుత్వాజ్ఞలను ధిక్కరించి సభలను జరిపినందులకు రాజద్రోహపు నేరముక్రింద ఖైదు శిక్ష ననుభవించినవారు. వీరు కవితాప్రియులు. కర్తలు, కారయితలు. వీరు రచించిన బొబ్బిలివిజయాది నాటకములు ప్రశస్తరచనములు. శేషాద్రిరమణ కవులు వీరి యాస్థానవిద్వాంసులు. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి, దంటు సుబ్బావధాని.

దేవినేని సూరయ్య, దాసరి లక్ష్మణకవి మున్నగు కవిపండితులను కృష్ణరావుగా రనేక సందర్భములలో సమ్మానించిరి. 'సత్కవియై, నృపుఁడైన' కృష్ణరావు గారిని చెళ్ళపిళ్ళవారు బహుముఖముల కీర్తించిరి.* దాసరి లక్ష్మణకవిగారు వీరిని—

'కాళిదాసుఁ డందురు నినుఁ గవితయందు;
దానకర్ణుఁ డఁటందురు ధర్మమందు;
వాసవుఁడ వంద్రు చిరతరైశ్వర్యమందు.
భవ్యగుణసాంద్ర! కృష్ణభూపాలచంద్ర!'

అని కొనియాడిరి. లక్ష్మణకవి కృతములయిన విజయవిలాస భర్తృహరి ప్రబోధ నాటకములను కృష్ణరావుగారు ముద్రింపించిరి. వీరు ఆంధ్రభారతి, గ్రంథాలయ సర్వస్వాది పత్రికలకు పోషకులు.

## గురజ

ఇది కృష్ణామండలములోని కైకలూరు, గుడివాడ తాలూకాలలో విస్తరించియుండిన ప్రాచీనమైన సంస్థానము. 'చార్‌మహల్' అని యీ సంస్థానము మొదటిపేరు. దాదాపు 400 చ. మై. విస్తీర్ణముగలిగి 260 గ్రామములతో కూడియుండినది. సంస్థానపాలకుల నివాసము గురజ గ్రామమగుటచే దీనిని గురజ జమీందారీయనికూడ వ్యవహరించుట కలదు. కానుకొల్లు, చేతవోలు దీనికి పూర్వపు రాజధానులు. కలిదిండి, గుడివాడ, బత్తరజల్లి, పిన్నకోట అను నాలుగు మహళ్ళు లేక పరగణాలతో కూడిన సంస్థానముగావున దీనిని 'చార్‌మహల్' సంస్థానమనెడివారు. సంస్థానపాలకులు పద్మనాయక వంశమునకు చెందినవారు; విప్పర్లగోత్ర విఖ్యాత చరిత్రులు. వీరి యింటిపేరు కమదనవారు. తొలుత ఓరుగల్లు ప్రాంతమున సామంతులుగానుండి అనంతరము నిజాము హయాములో నీ సీమలకు తరలివచ్చిరఁట. వీరు నూజివీడు జమీందారులకు బంధువులు; పూర్వయుగములందు ఆ జమీందారులకు కార్యకర్తలుకూడ.

కమదన గురవయ్య, గొడ్డళ్ళ అయ్యన్న (1738–1759), సుబ్బయ్య, అంకప్ప (1759–1873), రాయన్న, పెదపాపయ్య మొదలగువారు పూర్వపాలకులు. 1764 నుండి సంస్థానమునకు చెడుగడియలు దాఁపురించినవి. అప్పులు పెరిగినందున కాంద్రేగుల, నూజివీడు, మొగలితుర్రు జమీందారులు దీనిని కొంతకాలము కౌలునకుఁ దీసికొనియుండిరి. 1788–1791 మధ్య నిది కుంఫిణీసర్కారు వశమున నుండినది. 1792లో వారసులగు చినపాపయ్య కుమారుఁడు శోభనాద్రిరాయణింగారి కీ యెస్టేటు స్వాధీనమయినది.

* నానారాజ సందర్శనము, పుటలు 181, 182.

అటుపిమ్మట పేష్కషు సరిగా చెల్లలేదను మిషమీఁద 1801—1803 మధ్య మరల ఎస్టేటు కుంఫిణీచేతికి వచ్చినది. బకాయిల వసూలు నిమిత్తము 1813 లో కలిదిండి, బత్తరజల్లి పరగణాలు ఏలము వేయఁబడినవి. ఎస్టేటు పదేపదే జప్తు చేయఁబడుటవలనను, సక్రమపాలనము అరుదగుటవలనను రాఁబడి తరిగి, అప్పులుపెరిగి 1876 నాఁటికి అంతపెద్ద యెస్టేటును ఆరతికర్పూరము వలె హరించిపోయి వారసులకు భరణములు మాత్రము మిగిలినవి. 1876 లో మరణించిన పాపయ్యారావు తొలిపింఛనుదారు. వీరు ఎర్నగూడెము తాలూకా లోని వేగవరము, బొట్టుంపాలెము లను రెం డెస్టేటులను గొనియుండిరి.

పాపయ్యారావుగారి ప్రథమపుత్రు అపుత్రకులుగా గతించుటవలన ద్వితీయ పుత్రులగు వేంకటనరసింహ రామచంద్రరావుగారు పిత్ర్యమగు వేగవరము, బొట్టుంపాలెముల కధికారులయిరి. వీరు సంస్కృతాంధ్రములం దపార పాండిత్యము కలవారు. వీరి జ్యేష్ఠపుత్రులు వేంకట వరదరాజశోభనాద్రి రావుగారు పిత్రుపైతామహమగు పింఛనును స్వీకరించుచు సొంత యెస్టేటులను బర్యవేక్షించుచు గురజయందే కాపురముండిరి. వీరి కాంధ్రమున నిరుపమాన వైదుష్యముండినదఁట.* వీరు సారస్వత సర్వస్వ పత్రికాపోషకులు.

సత్యవత్యుపాఖ్యాన కర్తయగు మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రి మాతామహుని పితామహుఁడయిన కాశీనాథుని మల్లనారాధ్యుఁడు కమదన కుటుంబము వారిచే మడులు మాన్యములను గడించినట్లు 'కమదన శోభనాద్రి మహీంద్రుఁ డిడె వృత్తి యలమర్తి నల శోభనాద్రిపురము' అను సత్యవత్యుపాఖ్యాన కృత్యవతారికవలనఁ దెలియవచ్చుచున్నది.† ఈ శోభనాద్రి 1792—1836 ప్రాంతము వాఁడని యూహింపఁబడినది.

పాపయ్యారావుగారి జ్ఞాతులలో కమదన రామారాయణముగా రొకరు. వీరి కుమారులు పద్మనాభ వెంకటనరసింహారావుగారు. వీరి కుమారులు కమదన వెంకటరావు బహద్దరుగారు. వీరు కవిపోషకులేగాక 'సత్కవీంద్రుల సేవించి సాహిత్యమొక కొంత చవిగొని సరసమైన కవితనల్లనేర్చి' న వారు. శతావధానులు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి, భమిడిపాటి అయ్యప్పశాస్త్రి మొదలగువారు వీరికి విద్యాగురువులు; ఆస్థానకవులు. వైదర్భీపరిణయమను నాటకము వెంకటరావుగారి కృతి.

కమదన కుటుంబమునకుఁ జెందిన జమీందారులందఱును వాఙ్మయోద్ధారకులు. వైదర్భీపరిణయ నాటక కర్తకు పెత్తండ్రులగు వెంకటహనుమంత జగన్నాథరావు, వెంకటరామారావు, జగన్నాథరావుగారి పుత్రులు శోభనాద్రిరావు కృష్ణామండలమునందలి మండవల్లిలో 'ఆంధ్రప్రబోధినీ గ్రంథనిలయము'

* నానారాజన్య — విఖ్యాతజన చరిత్రము, పు. 239.

† సత్యవత్యుపాఖ్యానము, ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు, 1919.

అను ప్రచురణ సంస్థను నెలకొల్పి యనేకాధునిక గ్రంథములను ప్రకటించిరి. ఆంధ్రభారతి, సారస్వతసర్వస్వము మున్నగు సాహిత్య పత్రికలకు వీరు రాజ పోషకులుగా నుండిరి.

## గొల్లప్రోలు

పిఠాపుర సంస్థానమును పాలించిన రావు వెంకట సూర్యారాయణింగారి (1824–1850) కి వెంకయ్యమ్మగారియందు నీలాద్రిరావు, గంగాధర రామా రావు, వెంకట సూర్యనారాయణ, వెంకటరావు అను నలుగురు కుమారులుండిరి. జ్యేష్ఠకుమారులు చిన్నతనముననే మరణించుటచే రెండవ కుమారులగు గంగాధర రామారావు పిఠాపురము జమీందారులైరి. తృతీయ పుత్రు లగు వెంకట సూర్యనారాయణ బొబ్బిలికి దత్తుగా నీఁబడిరి. కనిష్ఠపుత్రులగు వెంకటరాయణింగారి కుటుంబ వ్యయములకై అన్యాక్రాంత మొనరింపకుండు నిబంధనమీఁద పిఠాపురము రాజా గంగాధర రామారావు (1844–1890) తమ్మునికి గొల్లప్రోలు జమీనిచ్చియుండిరి. తూర్పు గోదావరి మండలములోని ఇసుకపల్లి, గొల్లప్రోలు, భోగాపురము నను మూఁడు గ్రామములతోఁగూడిన దీ యెస్టేటు. నాఁటి దాని పేష్కషు సుమారు పండ్రెండువేలు ; ఆదాయము అఱువదివేలు.

వెంకట్రావుగారి సతీమణి చెలికాని వెంకయ్యగారి తనయ యగు రామాయమ్మ. ఈమెను 'ఉండూరురాణి' యని వ్యవహరించెడివారు. ఈమె వలన సంతతి కలుగనందున వెంకటరావుగారు తంగెళ్ళమూడి జమీందారుగారి కొమార్తెయగు వెంకాయమ్మను పెండ్లాడిరి. ఆపిమ్మట కొలఁదికాలమునకు నిస్సంతుగా వెంకటరావు మరణించుటచే ఎస్టేటు రామాయమ్మ, వెంకాయమ్మ యీ యిద్దఱిపేర ఉమ్మడిగా రిజిష్టరయినది. 1889 తో వెంకాయమ్మ మరణిం చుటచే రామాయమ్మ సర్వాధికారిణియైనది.

1886 లో రామాయమ్మ తన చెల్లెలి కుమారుని దత్తుచేసికొనఁగా త న్నీ విషయమున సంప్రతింపలేదను సాకుతో పిఠాపురము రాజాగారు ఆక్షేపణ తెలిపి దత్తును రద్దుచేయవలసినదని దావావేసిరి. కాని న్యాయస్థానమువారి తీర్పు రామాయమ్మగారి కనుకూలముగా వచ్చినది. అంతతో పిఠాపురము రాజాగా రూరకొనక మరణించిన వెంకాయమ్మ వంతుకొఱకు మఱియొక దావా తెచ్చిరి. కేసులోని యంశములు దుర్బలములగుట వలన న్యాయస్థానమువారు రామా యమ్మ కనుకూలముగా తీర్పునిచ్చిరి. ఎస్టేటంతయు రామాయమ్మపేర రిజిష్టరయినది.

రామాయమ్మగారు కాకినాడలోని వేదపాఠశాలకు విరాళమిచ్చిరి. పేద విద్యార్థులకు విద్యాసౌకర్యములు కల్పించిరి.

## గోపాలపురము

ఇది తూర్పుగోదావరిమండలములో నాఁటి ర్యాలితాలూకాలోని ఈత కోట, ఊడిమూడి, కేతరాజుపిల్లి, కొమరాజులంక, గంటి, గోపాలపురము. నరేంద్రపురము, పెదపూడి, పొడగట్లపల్లి, బెల్లంపూడి, వెదురేశ్వరం అను పదునొకండు గ్రామములతో రూపెత్తియుండిన యొక ప్రొప్రయిటరీ యెస్టేటు. ఇది పెద్దాపురసంస్థానమునందలి పలివెల యెస్టేటులోని ఈతకోట పరిగణా యను ఒకఖండము. ప్రకృత మీ యెస్టేటు కొత్తపేటతాలూకాలోని ఒక భాగము; విశాఖపట్టణమండలమునందలి గోపాలపురము ఎస్టేటుకంటె భిన్నము. శాశ్వతకరనిర్ణయము తరువాత ఖరీదుచేయఁబడి చాలచేతులు మాఱినది. ఆంధ్ర క్షత్రియులు, కాశ్యపగోత్రులు, కాకతిసంజ్ఞావిభూషితులు, ఉప్పలపాటి వంశీయులు, ద్వారపూడివాస్తవ్యులు, సూర్యనారాయణేశ్వర జోగిజగనాథరాజుగారు కొచ్చెర్లకోటవారిదయిన యీ యెస్టేటును 1845 లో సర్కారువారి యేలములో ఖరీదుచేసియుండిరి. ఆనాఁటి యాదాయము రమారమి అఱువదిమూఁడువేలు ; పేష్కషు పదునెనిమిదివేలు. తరువాతి రాఁబడి లక్షకు పైఁబడి.

1863 లో జగన్నాథరాజుగారు మరణింపఁగా వారి ధర్మపత్ని జానకయ్యమ్మ 1874 దాఁక జమీవ్యవహారములు సరిచూచి 1874 లో విజయ గోపాలరాజుగారిని దత్తునిగా స్వీకరించిరి. విజయగోపాలరాజుగారు (1864—1928) 1928 దాఁక పాలించి మరణించిరి. వీరికి జోగిజగన్నాథరాజు, సత్య అప్పల వేంకటపతిరాజు అని యిరువురు పుత్రులు. 1950 లో ఈ యెస్టేటు జమీందారీరద్దుచట్టము మేరకు అంతరించినది.

సంస్థానసంపాదకులగు ఉప్పలపాటి జోగిజగన్నాథరాజుగారు సప్త సంతానప్రతిష్ఠాపయితగా ప్రశస్తిని బడసినవారు. వీరిభార్యయగు జానకయ్యమ్మ గారు కూడ పెనిమిటి అడుగుజాడలలో విద్వత్కవిపోషణ మొనర్చిన సాధ్వీ మణి. పొడగట్లపల్లిలో 360 ఎకరముల సుక్షేత్రమయిన మాగాణి ఆదరువుగాఁ గల అన్నసత్రము జానకయ్యమ్మగారి దయార్ద్రబుద్ధికి, త్యాగనిరతికి ప్రబల నిదర్శనము. ఈమె విజయనగర సంస్థానాధీశ్వరుల సలహా నర్థించి వారి సూచనలమేరకు ఉద్దండపండితులను పంద్రెండుమందిని విజయనగరమునుండి పిలిపించి తనపేర నిర్మించిన జానకీపురాగ్రహారము (పొడగట్లపల్లెగ్రామము)న వారికి వృత్తుల నేర్పఱిచినది. ఈ వచ్చిన విజయనగర పండితులలో అప్పన భొట్ల గోపాలశాస్త్రి, అద్దేపల్లి కృష్ణశాస్త్రి ముఖ్యులు. గోపాలశాస్త్రి దక్షిణకాళీ ఉపాసకుఁడు ; ప్రసిద్ధ మంత్రశాస్త్రవేత్త. పొడగట్లపల్లెలోని సంస్కృత పాఠ శాల జానకయ్యమ్మగారి విద్యాదరణమునకు ప్రబల ప్రమాణము.

జగన్నాథరాజుగారి దత్తపుత్రులు రాజా వెంకటవిజయగోపాలరాజ

బహద్దరు. అద్దేపల్లి కృష్ణశాస్త్రి, చావలి రామసూరి మున్నగువారు వీరి యాస్థాన పండిత కవులు. కృష్ణశాస్త్రి (1846–1907) అప్పనభొట్ల గోపాలశాస్త్రి శిష్యులు; కృష్ణామండలము దివితాలూకా తేకుపల్లి నివాసులగు శివావధానుల కుమారులు; వేదశాస్త్రపారంగతులు; గొప్ప పౌరాణికులు. తర్కామృత తరంగిణి యను శాస్త్రగ్రంథము వీరి ప్రసిద్ధ రచనము.

'సీతాకల్పలతాన్వితం దశరథాంభోరాశిజం సోదరో
దారస్కంధ మభీష్టదం సుమనసాం శ్రేణీభిరామోటితం....' అను నొక్క శ్లోకము మీఁద సంస్కృతమునందు అద్వైతమతపరముగ వీరు విపులమగు గ్రంథమును రచియించి విజయగోపాలరాజాంకిత మొనర్చిరి.*

చావలి రామసూరి భారద్వాజగోత్రుఁడు; యజ్ఞమాంబానరసింహార్యుల పుత్రుఁడు; శ్లేషయమక చక్రవర్తిబిరుద విభూషితుఁడు. రామసూరిరచితమగు అలంకారముక్తావళి యను నాలంకారికగ్రంథము విజయగోపాలరాజ యశోభూషణభూషితము. బాలర సుఖవ్యుత్పత్తి సంపత్తి నిమిత్తము శబ్దార్థాలంకారములు లక్ష్య లక్షణపురస్సరముగా ప్రభునామాంకితముగా నిందు వివృతము. అద్దేపల్లి కృష్ణసూరి విరచితరత్నశోభాకర వ్యాఖ్యానముతో నీ కృతి ముద్రితము.

'సారాచారా రామారామాకారాధారా దానాధారా
భామారామా ధారాదారా దానాకాదా ధారావామా'

అను చతుష్షష్టిశ్లోకగర్భితమగు కంకణబంధ మింకలి చిత్రాలంకారవివరణము నందలి చమత్కారచారుశ్రీకములైన శ్లోకములలో నొకటి:

'శ్రీమద్విజయగోపాల యశోభూషణ భూషితం
ముక్తావళీసమాఖ్యానం భూయా దాచంద్రతారకమ్'.

ప్రసిద్ధ జ్యోతిశ్శాస్త్రవేత్తలు పిడపర్తి చినపూర్ణయ్యసిద్ధాంతి గోపాలపురము సంస్థానవిద్వాంసులు. గోపాలపురమున నెలకొనిన విజయగోపాలరాజ గ్రంథాలయము సంస్థానపాలకుల స్మృతిచిహ్నము. విజయగోపాలరాజపుత్రులగు జోగీజగన్నాథరాజుగారు ఆంధ్రేతిహాసపరిశోధకమండలికి రాజపోషకులు.

## గోపాలపేట

ఇది నిజామురాష్ట్రములోని ప్రాచీన సంస్థానములలో నొకటి. సంస్థానపాలకులు జనుంపల్లిగృహనామకులు. వీరిది మోటాటిరెడ్డిశాఖ. వీరి మూలపురుషుఁడు దేశముఖ్ శ్రీవీరకృష్ణభూపతి. ఈతఁడే వనపర్తిసంస్థాన సంస్థాపకుఁడు. వనపర్తిప్రభువులలో విద్వత్కవిపోషకుఁడయి, అష్టభాషాగోపాలరాయ బిరుదవిరాజితుఁడయి వనపర్తికి విద్వత్సంస్థాన మనుపేరు తెచ్చినవాఁడు గోపాలరాయలు. ఈతని దత్తపుత్రుఁడు వెంకటరెడ్డి. వెంకటరెడ్డి తన పాలక

* వివేకవర్ధనీ ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము, 1890.

జనకునిపేర సంస్థానమునందు గోపాలపేట యను గ్రామమును కట్టించి కొన్ని సీమలను జతపఱిచి దాని నొక సంస్థానముగా నేర్పఱిచి దానిని పాలించుటకు తన తమ్ముఁడు రంగారెడ్డిని నియమించెనఁట. ఇట్లు వనపర్తిసంస్థానమునుండి యేర్పడినది గోపాలపేటసంస్థానము.

గోపాలపేటపాలకులలో మొదటివాఁడగు రంగారెడ్డి తన మాతృసంస్థానము పాలకులగు వనపర్తిప్రభువులు, తన సంస్థానమునకు పొరుగున నున్న గద్వాలప్రభువులు పోయినత్రోవలో కేశంపేట యను గ్రామమున వెలసిన దేవుని బ్రహ్మోత్సవముల సందర్భమున కవిపండితసభ లేర్పఱిచి సత్కారములు చేసెడివారఁట ।

వీరి సంతతికిఁ జెందిన జగపాలరావుగారు విద్వత్పోషణమునందాసక్తి కలవారు. ఈయన ధర్మపత్ని రాణి రంగనాయకమ్మగారును కవిపండితులకు ఘనసత్కారములు జరిపించినవారు. తూముగుంటనివాసియును, క్రీ.శ. 1835 ప్రాంతమువాఁడును నగు వెంకటరాజు రేమంతకవి గోపాలపేట సంస్థానకవిగా పేరుమోసినవాఁడు. సంస్థానాధిపతుల కంకితములుగా నీతఁ డనేక గ్రంథములను రచించెనఁట. నేఁటి గోపాలపేట విద్వత్కవులలో బుక్కపట్టణము రాఘవాచార్యులుగారు ముఖ్యులు. వీరు కాశీపండితులు; సుప్రసిద్ధ వైయాకరణులు.

## చిక్కవరము

కృష్ణామండలము గన్నవరము సమీపమునందు అజ్జంపూడి, గరికపట్టు, చిక్కవరము, పెదపులిపాక, పెనుమలూరు. బల్లిపట్టు, బుద్ధవరము, రొయ్యూరు, వల్లపురము. వీరపనేనిగూడెము, వెలినూతల అను పదునొకండు గ్రామములతోఁ గూడియుండిన దీ ఎస్టేటు. సాలుసరి రాఁబడి సుమారు ఎనుబది వేలు; పేష్కషు ఇరువది వేలు. బొబ్బిలి జమీందారుల జ్ఞాతులలో నొకరగు రాజా శ్రీ రావు జనార్దన కృష్ణరంగారావుగా రీ యెస్టేటుదారులు.

బొబ్బిలి పాలకులయిన మహారాజా సర్ శ్రీ రావు వేంకట శ్వేతాచలపతి రామకృష్ణ రంగారావు (1862--1926) గారి ద్వితీయ భార్యాపుత్రిలు రాజా వెంకట కుమార కృష్ణ రంగారావుగారు. వీరి కిరువురు పుత్రిలు. జ్యేష్ఠులు నేఁటి బొబ్బిలి పెదరాజాగా రయిన రావు వేంకట శ్వేతాచలపతి రంగారాయ బహద్దరువారు. ద్వితీయులైన రాజా జనార్దన కృష్ణరంగారావుగారు చిక్కవరము ఎస్టేటును ఖరీదుచేసినవారు.

వీరు కేప్టెన్ ఆర్థర్ మనోరి, ఆంధ్రి విశారద తాపీ ధర్మారావునాయఁడు, డా. వాసిరెడ్డి శ్రీకృష్ణ వంటి ఆదర్శాధ్యాపకుల సన్నిధిని విద్య నభ్యసించి ఉత్తమసంస్కారము నలవఱిచి కొనినవారు, కళాభిమానులు; విద్యాపోషకులు.

తేలప్రోలు జమీందారులు రాజా శ్రీ మేకా వేంకట శోభనాద్రి అప్పారావు బహద్దరుగారి తృతీయ పుత్రిక రాణి సరస్వతీదేవి వీరి సతీమణి.

రాజా జనార్దనకృష్ణరంగారావుగారి కిరువురు పుత్రులు; ఇరువురు పుత్రికలు. పుత్రులలో జ్యేష్ఠులు వెంకట ఆనంద కుమార కృష్ణ రంగారావు (వి.ఏ కే. రంగారావు). కడసారపు కుమారులు గురు ప్రసాద కృష్ణ రంగారావు. వి.ఏ.కే. రంగారావుగారు ప్రసిద్ధ సాహిత్యవేత్తలయిన శ్రీ మల్లాది రామకృష్ణ శాస్త్రిగారి మనసునచ్చిన శిష్యులు. నరాగమాలా మానసోల్లాసాది శీర్షికల ముఖమున సంగీత సాహిత్య లోకమున చిరపరిచితులు; సంగీత సాహిత్య విమర్శకులలో సరసదార్శనికులు.

## చీకటి

కళింగసీమ యందలి ప్రాచీన సంస్థానములలో నిదియొకటి. బాహుదా నదీ పరీవాహభూమి యీసీమ. కృష్ణాపురము, కోటిలింగి, జయంతిపురము, తాతంపర, పాత్రపురము, బొడొపలంక అను ఆఱు ముఠాలుగా నీ సంస్థానము విభక్తము. వైశాల్యము 109 చ.మై., గ్రామములు 129, జనాభా ఇంచు మించుగా 41 వేలు. 1802 నాఁటి రాఁబడి దెబ్బదివేలు. పేష్కషు ముప్పది నాలుగువేలు. 1938 నాఁటి రాఁబడి మూఁడున్నర లక్షలు; పేష్కషు పెరుగలేదు.

పూరికటకపురాజు ఈ సంస్థానమును తనక్రింది సరదారులలో నొకరికి ప్రసాదించియుండిరని చరిత్రము. మూలపురుషుఁడగు కేశవరౌతురాయి లేక వీరకర్దమసింహుఁడు చీకటికోట నిర్మాతయఁట. వీరి కోవలో పదునాఱవవాఁడు జోదుమణిరౌతురాయి (1634—1695). తరువాతి పాలకులలో ముఖ్యులు కృష్ణచంద్ర రాజేంద్రదేవు (1770—1790), రాజా పీతాంబర రాజేంద్రదేవు. పీతాంబరునితోడనే శాశ్వత పరిష్కారము జరిగినది. ఆతరువాత విశ్వం భరుఁడు, కిశోరచంద్రుఁడు, రాధామోహనుఁడు పాలించిరి. రాధామోహన రాజేంద్రదేవుగారి కుమారులు రాజా గౌర చంద్రదేవు బహద్దరుగారు.

గౌరచంద్రదేవుగారు ఆంధ్ర భాషాభిమానులు, రాజమహేంద్రవరము నందలి ఆంధ్రేతిహాస పరిశోధకమండలి రాజపోషకులు. సుప్రసిద్ధ వైయాకరణులును, వేదవిదులును, ఉద్దామ పండితులునునగు బంకుపల్లి మల్లయ్యశాస్త్రి (1876—1946) సంస్కృతభాషలో సీతాకల్యాణము, జానకీ పహ్నిప్రవేశము అను హరికథలు రచియించి చీకటి జమీందారులచే ఘనసమ్మానములంది 'పురాణ వాచస్పతి' యను బిరుదును బడసిరి.

గజపతినగరము ప్రాంతమువారగు పప్పు అప్పలనరసింహశాస్త్రి (1860—1912) చీకటి సంస్థానమున ఆస్థానపండితులుగా నుండిరి. శాస్త్రిగారు

జానపద కళాప్రదర్శనముల విషయమున ఆనాఁడు పెద్ద పేరుపెంపులుగలవారు. ఈయన భామాకలాపమను గ్రంథమును రచియించి కోటలో ప్రదర్శించి సంస్థానాధిపతుల మెప్పులనందినవారు.

## చుండి

నెల్లూరుమండలము కందుకూరు తాలూకాలోని ప్రాచీన సంస్థానమిది. దీని వైశాల్యము 125 చ.మై. ఇందు 36 కోరు గ్రామములు, 5 ఇనాములు, 3 అగ్రహారములు, మొత్తము నలుబది నాలుగు గ్రామములు, నలుబది సివాయి గ్రామములు నుండినవి. 1870 లో సాలుసరి పరిమాణము రూ. 52 వేలు; పేష్కషు రూ. 18 వేలు. చుండి యను గ్రామము సంస్థానపాలకుల నివాస గ్రామ మగుటచే నీ సంస్థానమున కీ పేరు సిద్ధించినది. ప్రోలయ వేమారెడ్డి కడగొట్టు తమ్ముఁడయిన మల్లారెడ్డి వంశీయులు కందుకూరు రాజ్యమును పాలించిన కాలములో వారికి చుండి రాజధానిగా నుండినది. 1427 ప్రాంతములో చుండి విజయనగర సామ్రాజ్యపాలనములోనికి పోయినది. ఆ పిమ్మట విజయ నగర పాలకుల సామంతులగు కామినేనివారి కీ సంస్థానము సంక్రమించినది.

చుండి పాలకులయిన కామినేనివారు బోయలని ప్రతీతి. విజయనగర సేనావాహినిలో బోయరాజులు సాహసశ్రేణికిఁ జేరినవారు. '....ఖండ ఖండ ములుగా చెండి చెక్కాడఁడే దండి బోయలపేట చుండికోట....' అని సింగు పల్లి ముత్తనామాత్యుని (1611–1656) మీఁది చాటువులో చుండిపాలకులు బోయలని పేర్కొనఁబడిరి. కామినేనివారు పద్మనాయక కులస్థులని కొందఱును,* చుండిపాలకులు గవరలని కొందఱును,† చుండి జమీందారులు బోయలేయని మఱికొందఱును‡ భావించిరి. రాఘవ వాసుదేవీయమను ద్వ్యర్థి కావ్యమునకు కృతిభర్తయును, చుండి పాలకుఁడును, కామినేని వంశీయుఁడును నగు బంగారరంగ భూపాలుఁడు వాల్మీకి మునివరుని సంతతికిఁ జెందినవాఁడని స్పష్ట పడుటచేత కామినేనివారు బోయలని నిర్ధారించుట సత్యదూరముగాదు.

వీరి మూలపురుషుఁడు కామినాయకుఁడు. అయన పేరనే తద్వంశమిట్లు

*వేదము వేంకటరాయశాస్త్రి, బిల్హణీయావతారిక, పు. 3; నవులూరి [illegible] కొండయ్య, ప్రాచీనాంధ్రకవులు, విక్రమసింహపురిమండల సర్వస్వము, ద్వితీయ ఖండము, పు. 278.

†పెదకం సీతారామయ్య, గవరల ప్రాచీనచరిత్ర, ప్రథమ సంపుటము, విశాఖ పట్టణము, 1961, పుటలు 221–229.

‡పునుగు శ్రీకంఠం, నెల్లూరుజిల్లాలోని సంస్థానముల చరిత్ర, విక్రమసింహ పురిమండల సర్వస్వము, ద్వితీయఖండము, పుటలు, 69–95; వాదింటపర్తి కృష్ణమూర్తి నెల్లూరుమండల దుర్గములు, పైది, ద్వితీయఖండము, పు. 126.

ప్రఖ్యాతము. కామినేని కులరత్నాకరమున రామానాయఁ డాదిపురుషుఁడు. ఆతఁడు విజయనగర పాలకులచే ఉదయగిరి పాలకుఁడుగాఁ గుదురుకొనిన వాఁడు. ఇతని మునిమనుమఁడయిన అయ్యప్పనాయఁడు చుండికి అమలు దారుఁడు. చుండి తొలుత రెడ్ల యేల్బడిలోనిది. గోలకొండ నవాబుల కెదురు తిరిగిన యీ రెడ్డిపాలకులను నవాబు నాదేశముప్రకారము అయ్యప్పనాయఁ డోడించి, అల్లరులనణఁచి నవాబుదయకుఁ బాత్రుఁడయి యుండినవాఁడు. ఈ రెడ్డిరాజులలో చివరిపాలకుఁడగు పుచ్చకట్ల రామిరెడ్డి నిస్సంతుగా మరణిం పఁగా గోలకొండ నవాబులు అయ్యప్పనాయని చుండికి అమలుదారుగా నియమించిరి.

ఈతని తనయుఁడు తాతనాయఁడు లేక దాదినాయఁడు చుండికి తొలుత అమలుదారుఁడు ; పిమ్మట జాగీరుదారుఁడు. ఇతని కొడుకు శేఖరనాయఁడు. శేఖరనాయనికి లచ్చమాంబవలనఁ గలిగిన పుత్రుఁడు పోలినాయఁడు. ఇతనికి రెండవభార్యయగు వేంగమాంబవలన జన్మించిన నవాబునాయనికి అయిదుగురు భార్యలవలన కలిగిన కుమారులు పండ్రెండుగురు. వీరిలో విశ్వపతి యొకఁడు. విశ్వపతి కుమారుఁడు ముత్తరాజు. ముత్తరాజు పుత్రుఁడే బంగారంక భూపాలుఁడు.

ఆర్కాటు నవాబుల జోక్యమున చుండి సంస్థానములోని కొన్ని భాగ ములు కాళహస్తి సంస్థానమునకు దఖలుపడినవి. ఆ పిమ్మట తక్కిన పడమటి పాళయములతోపాటు చుండి సంస్థానము కుంఫిణీవారి యధీనమునకు వచ్చి నది. కుంఫిణీకాలమున రాజా కామినేని మల్రాజు, రాజా వీరవెంకటప్ప నాయఁడు (1827–1842), రాజా కామినేని బంగారుముత్తరాజు (1842–1870) మున్నగువారు పాలించిరి.*

రాఘవవాసుదేవీయమను† నయిదాశ్వాసముల ద్వ్యర్థికావ్యమును, బిల్హ ణీయమను మూఁడాశ్వాసముల శృంగారప్రబంధమును రచించిన చిత్రకవి సింగరార్యుఁడు బంగారంక భూపాలుని యాశ్రితుఁడుగానుండి అగ్రహారాదిప్రదా నముల నందినవాఁడు. సింగరార్యుఁడు ఆత్రేయగోత్రుఁడు. కోనమాంబా రంగార్యుల పుత్రుఁడు. 'సుపర్వాంధ్రవాగ్జనితానేక విచిత్రకావ్యఘటనాశ్లాఘ్యుఁ' డఁట యీ కవి. రాఘవవాసుదేవీయము చుండిపురవర్యుఁడగు బంగారంక భూపాలున కంకితము. కృతిభర్త వరహనుమత్స్వామిగోత్రవార్ధిశశాంకుఁడఁట. శ్రీశైలమల్లికార్జున పండితారాధ్యకుల ప్రదీపకుఁడగు వీరన పండితారాధ్యుల

* C. D. Maclean, Standing Information regarding the Official Administration of the Madras Presidency, Madras, 1879, p. 15.

†No. 688, ప్రాచ్యలిఖితగ్రంథాలయప్రతి.

శిష్యుఁడు. యాగంటమ ముత్తరాజు లీతని తలిదండ్రులు.

సింగరార్య కవిరచితమగు బిల్హణీయ మను నాంధ్రప్రబంధము కామినేని చన్నభూపాలున కంకితము. కవికృత్యంతరమగు రాఘవవాసుదేవీయావతారికలో 'అనెడు నన్ను బుధులు గొనియాడ బిల్హణంబు మొదలైన కృతుల నాంధ్రమున వింటి; మిపుడు భగవత్కథాప్తి నూహించునట్టి కావ్యము రచింపు శ్లేషోక్తి కవులు మెచ్చ' అని కృతిభర్త సింగరార్యుని కోరినట్లుండుట వలనను, బిల్హణీయ ప్రబంధము ప్రథమాశ్వాసాంతములోని చక్రబంధము నందు కృతికర్తృ కృతిభర్తృ నామములు నిబంధింపఁబడియుండుటవలనను ఇట్లూహింపఁబడినది.

ఇది పండిపెద్ది కృష్ణస్వామికృతమని అవతారికాదులు పేర్కొను చున్నవి. కృష్ణస్వామి ఆనాఁటి ఆర్కాటు నవాబుగారి దివాను; విద్వజ్జన పోషకుఁడు. చిత్రకవి సింగరార్యుని కుమారుఁడును, అమిత కవితావిశేషజ్ఞుఁ డును నగు నారసింహార్యకవి ప్రోత్సాహమున రామాంకితముగాఁ దానీయాంధ్ర ప్రబంధమును సంధానించినట్లు కృష్ణస్వామి కథనము. ధనార్థియగు నారసింహార్యుఁడును, యశోర్థియగు కృష్ణస్వామియును కుమ్మక్కుగాఁ జేసిన కక్కుఱితిపని యిది.* చక్రబంధ నిబంధమును గుర్తింపలేక యిద్దఱును చెడినారు. వారుచేసిన తప్పుమాత్రము మాసిపోలేదు.

మదనాభిరామభూపతి తనయయగు యామినీపూర్ణతిలకను బిల్హణుఁడను పండితకవి ప్రేమించి పెండ్లియాడిన కథ యీ ప్రబంధమునందలి యితివృత్తము. ఇది రసవత్తరమయిన ప్రబంధమని ఆంధ్ర మల్లినాథుల వ్యాఖ్యానము.† 'ఇందలి కథ మనోహరముగను, కవనము రసవంతముగను గొంతవఱ కున్ననుఁ దారాశశాంకమువలెనే ఇదియు నీతిబాహ్యమైనందునఁ జదువఁదగినది కా'దని కందుకూరివారి యభిప్రాయము.‡

చుండిసంస్థానమున నుద్యోగిగానుండిన చుండి కాళయమంత్రి ఎడపాటి ఎఱ్ఱయకవికృతమగు శృంగారమల్హణచరిత్రకు కృతిభర్త. కాళయమంత్రి రామయామాత్య పుత్రుఁడు; చుండిస్థలకరణచంద్రుఁడు; నృపమహాస్థానకవి వర్ణనీయగుణుఁడు. కవికౌండిన్యగోత్రుఁడు; కాళమంత్రికిఁ గూర్చు బంధుఁడు.

మల్హణచరిత్ర మూఁడాశ్వాసముల శృంగార ప్రబంధము; శివమాహాత్మ్య ప్రతిపాదకము. పుష్పగంధి యను వేశ్యను వలచిన మల్హణుని కథ యిందలి యితివృత్తము. ఈ కథ పాల్కురికి సోమనాథకవికృతమగు పండితారాధ్య

*సింగరార్యుఁడే పండిపెద్ది కృష్ణస్వామిపేరు పెట్టెనని కొందఱు. చూ. కవిత్వవేది, ఆంధ్రవాఙ్మయ సంగ్రహము, పు. 232.

†ఆంధ్రబిల్హణీయము, అవతారిక, జ్యోతిష్మతీ ముద్రాక్షరశాల, మద్రాసు, 1914.

‡ఆంధ్రకవుల చరిత్రము, తృతీయభాగము, 1950, పు. 221.

చరిత్రమునందును బ్రపంచితము.* దానినే ఎఱ్ఱయ ప్రబంధోచితముగా నిబంధించినాఁడు.

## చెముడు

కళింగసీమయందలి ప్రాచీనమయిన కొండజమీందారీలలో నిది యొకటి. నేఁటి శ్రీకాకుళముమండలము సాలూరు డివిజనునందు సాలూరునకుత్తరముగా మూఁడుకోసుల దూరమునందును, విశాఖపట్టణమున కుత్తరముగా పాతిక కోసుల దూరమునందును చెముడుగ్రామమున్నది. ఇది చెముడు ఎస్టేటునకు ముఖ్యపట్టణము. ఇందు అంటివలస, కంచులపదము, చెముడు, జమ్మడివలస, పందిరిమామిడివలస, పులిగుమ్మి, బందలుప్పి, బాగువలస, మదతవలస, లచ్చిరాజుపేట, వీరభద్రపురము అను జిరాయితీగ్రామములు, ఇంగిలాపల్లి, లక్ష్మీపురము అను రెండు అగ్రహారములు, ముచ్చెర్లవలస, వెలగవలస అను రెండు మొఖాసాగ్రామములు నుండినవి. 1938 నాఁటి వరంబడి రూ. 16,784లు; పేష్కషు రూ. 4,000 లు.

ఈ సంస్థానపాలకులు 'రణసింహ' బిరుదాంకితులు. వీరి పూర్వులు మొదట జయపురమురాజుగారి కొలువులో సరదారులు. విజయనగరముదివాను పూసపాటి సీతారామరాజుగారి కాలమున తక్కిన కొండజమీందారీలతోపాటు చెముడుసంస్థానమును విజయనగరమువారి స్వాధీనమయినది. కొండజమీందారుల తిరుగుబాటుకాలమునాఁటి చెముడుపాలకుఁడగు లక్ష్మీరాజుగారిని విజయనగరము సీతారామరాజుగారు అధికారమునుండి తొలఁగించి యొకటి రెండు గ్రామములను మాత్రము మొఖాసాలుగా నిచ్చియుండిరి. ఆ పిమ్మట 1794 లో విజయనగరసంస్థాన పాలకుఁడగు విజయరామరాజు పద్మనాభ యుద్ధములో మరణించుదాఁక చెముడురాజకుటుంబమును గుఱించి యేమియును తెలియదు.

1794 లో నార్తరను డివిజను కలెక్టరుగారు చెముడుపాలకుల వారసులగు సోమరాజుగారిని పిలిపించి యెస్టేటును మరల కొలునకిచ్చిరి. ఈ సోమరాజుగారితోడనే శాశ్వతపరిష్కారము జరిగినది. సోమరాజుగారి తరువాత ఆయనకుమారులు జగన్నాథరాజు జమీకి వచ్చిరి. జగన్నాథరాజుతర్వాత ఆయనకుమారుఁడు సోమరాజు, ఆ పిమ్మట 1855 లో సోమరాజుగారి మైనరు కుమారుఁడు కాశీపతిరాజు జమీకి హక్కుదారులైరి. 1855 లో కాశీపతిరాజునకు జమీ సంక్రమించినను అతఁడు మైనరగుటవలన 1855—1866 మధ్య సంస్థానము కోర్టు ఆఫ్ వార్డ్సు పర్యవేక్షణమున నుండినది. 1866 లో యుక్త వయస్సు వచ్చిన కాశీపతిరాజు జమీపాలనము స్వీకరించిరి.

*పండితారాధ్య చరిత్రము, పురాతన ప్రకరణము, పుటలు 358—367.

ఆ తరువాత 1889 లో చంద్రరాజ రణసింహులుబహద్దరు వీరి దత్త పుత్రులు సూర్యనారాయణ రణసింహులుగారలనుండి చెముడురాజకుటుంబము వారి పరంపరాసంబంధులగు కురుపాము జమీందారులు రాజా వైరిచెర్ల సూర్య నారాయణరాజుగారు చెముడు ఎస్టేటును విక్రయించికొనిరి. వారి తరువాత వారి కుమారులు వైరిచెర్ల వీరభద్రరాజుగారీ యెస్టేటును నిర్వహించిరి. ఆ తరు వాత వీరభద్రరాజుగారి కుమారుఁడు వైరిచెర్ల నారాయణగజపతి దీనిని పాలించిరి. అటుపిమ్మట జమీందారీలరద్దుతో నిదికూడ సంతరించినది.

చెముడుపాలకులు కొండరాజులవంశమువారయినను వీరికి తెలుఁగు భాషమీఁద అభిమాన ముండినది. తిట్టుకవితలో దిట్టయగు అడిదము సూరకవి చాటువులలో చెముడుసంస్థాన ప్రసక్తి కలవికూడఁ గలవు.

'ధీరాగ్రణి శివరామ
క్ష్మారమణుండేలు చెముడు శంభరపురమా
పోరామాకొంపిల్లా
పారాదా మంగరాజుపాళెము పట్టా' అను చాటువు వానిలో నొకటి.

చెముడు సంస్థానాధిపతులు ముఖ్యముగా వేదశాస్త్రవిదుల నాదరించిన వారు. ఆంధ్రదేశమునందు ప్రసిద్ధ పండిత కుటుంబమయిన నడిమింటివారికి చెముడు జమీందారులు లక్ష్మీపురమను నగ్రహారమును దయచేయించియుండిరి. నడిమింటివారు కురుపాము సంస్థానాధీశ్వరుల వలనను నగ్రహారాదిక సమ్మాన ములను బడసినవారు.

నడిమింటివారి కుటుంబమునందు సర్వమంగళేశ్వరశాస్త్రి ఆసేతుశీత నగము సర్వతంత్ర స్వతంత్రులుగ, శాపానుగ్రహ సమర్థులుగ, సర్వశాస్త్ర పారంగతులుగ కీర్తి గడించినవారు. శాస్త్రిగారి కుమారులు భగవత్పతంజలి శాస్త్రి నేపాలు మహారాజ సంస్థానాస్థాన విద్వద్వతంసులుగ పెక్కేండ్లుండి సకలసత్కారములను బొందినవారు.

లక్ష్మీపురాగ్రహారమున కీఁబడిన దానపట్టమునందు సర్వమంగళేశ్వర శాస్త్రిగారే దిగువ శ్లోకమును చెప్పి పట్టావ్రాయించిరఁట.

'ఏకైవ భగినీ లోకే సర్వేషామపి భూభుజామ్
నభోగ్యా నకరగ్రాహ్యా విప్రదత్తావసుంధరా'

ఇచట నభోగ్యా, నకరగ్రాహ్యా యనుటలో శ్లేషార్థము నిర్వహింపఁబడినది.

సర్వమంగళేశ్వరశాస్త్రి కృతములని ప్రతీతిగల చాటువులు కళింగసీమలో అనేకము ప్రచారములోనున్నవి. వానిలో కొన్ని చమత్కారచాటువులయినను నిందా కలుషితములగుటచే సభ్యలోకమున పేర్కొనరాని బూతుల బుంగలుగా ప్రసిద్ధివహించినవి. శాస్త్రిగారికి కొందఱువ్యక్తుల యెడలను కొన్ని వర్గముల యెడలను సదభిప్రాయ ముండెడిదికాదఁట! ఆయావ్యక్తులను వర్గములను

దూషించుచు సర్వమంగళేశ్వరశాస్త్రి ఆశువుగాఁ జెప్పిన చాటువులు శతాధికము లుగా నున్నవఁట. వీరికి తురుష్కులన్నను, వైష్ణవులన్నను బొత్తుగాఁబడెడిది కాదఁట. ఈ యిరుతెగలవారిని జెడఁదిట్టుచు ఈయన 'సన్నతీసున్నతీయ' మను పండ్రెండువేల శ్లోక సంఖ్యగల గ్రంథమును రచించెనఁట. వైష్ణవ తురుష్కమత నిందాపరముగాఁ బయివాని కర్థముగూర్చుటకయి కొన్నివేల లాక్షణికవాక్యము లుదాహరించిరఁట. పనికిమాలిన యిట్టి పాడుపనికై తన ప్రతిభా వ్యుత్పత్తులను సర్వమంగళేశ్వరశాస్త్రి పాడుచేసికొనెనని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వాపోయిరి.*

వైకుంఠైకాదశినాఁడు విష్ణ్వాలయములయందు దోసెముక్కలకోసము జరిగెడిపను వైష్ణవ స్వాములవారి వింత తగపులాటలను వర్ణించునది యీ క్రింది శ్లోకము :

'దోశలేశాశయా కేచి త్క్రాశవ త్యైక్రాశవాజనాః
కేశవస్య సమీపేతు కేశాకేశి వితన్వతే'

బూతుసామెతలను దృష్టాంతముగాఁ బెట్టి యీతఁడు ఉదాహరింపరాని బూతు శ్లోకములతో 'లౌకికదృష్టాంత మంజరి' యను నొక గ్రంథమును సైతము నిర్మించెనఁట. ఇవి లోకమున కక్కఱకురాని అక్కరపు ముక్కలని విమర్శ కుల యభిప్రాయము

చెముడురాజా పైరిచెర్ల నారాయణ గజపతిరాజు బహద్దరుగారు రాజమహేంద్రవరము నందలి ఆంధ్రేతిహాస పరిశోధక మండలికి యావజ్జీవ సభ్యులు.

## చెలుకూరు

అమరావతి సంస్థాన పాలకులుగా విశేషఖ్యాతి నార్జించిన రాజా వాసిరెడ్డి వెంకటాద్రినాయని వారికి అయిదవతరము వారయిన వాసుదేవ చూడామాణిక్య ప్రసాద బహద్దరువారు ఈ యెస్టేటున కధిపతులు. చింతపల్లి సంస్థానాధిపులలో నొకరగు రాజా వాసిరెడ్డి చంద్రమౌళి నాయఁడుగారి దత్తపుత్రులు వీరు. దేవరకోట సంస్థానాధీశ్వరులగు రాజా యార్లగడ్డ మల్లికార్జునప్రసాదుగారి అల్లురువీరు. యార్లగడ్డవారి ఆఁడుఁబడుచు రాణి త్రిపురసుందరమ్మ వీరి భార్య.

తెనాలితాలూకా పెదపాలెము వాస్తవ్యులు, భూస్వాములు, వాసిరెడ్డి వెంకయ్యగారి తృతీయ పుత్రులగు వీరు 1905 లో చంద్రమౌళి నాయఁడుగారికి దత్తులు, చంద్రమౌళిగా రా నాఁటికి చింతపల్లి జమీందారులుగా 'లవణసు' దారులు.

త్రిపురసుందరమ్మగారికి పసుపుఁ గుంకుమలక్రింద నెల్లూరి మండలము

* త్రిలిఙ్గ, 1922, డిసెంబరు 23, పుటలు 531, 532.

లోని ముండి సంస్థానములోని చెఱకూరి యెస్టేటును ఆమెతండ్రి దేవరకోట రాజాగారు ఖరీదుచేసి యిచ్చియుండిరి. వాసుదేవ చూడామాణిక్య ప్రసాదుగారి పుత్రిక కనకరాజేశ్వరమ్మ. ఈమె కపిలేశ్వరపురము — కేసనకుఱ్ఱు జమీం దారులగు శ్రీ బలుసు ప్రభాకర పట్టాభిరామారావుగారి భార్య.

వాసుదేవ చూడామాణిక్య ప్రసాదుగారు బందరు బచ్చుపేటలోని వేంకటేశ్వరాలయ ధర్మకర్తలు. దేశీయ శిల్పకళాపోషకులు. సంగీత సాహిత్యాభి మానులు. శతశిల్పి నూతులపాటి నరసింహము వీరి యాదరణము నందినవారు.

## చొల్లంగి

భీమమండలమునందలి సప్తసాగర యాత్రాక్షేత్రములలో చొల్లంగి పవిత్రస్థానముగా సంభావ్యము. కాకినాడకు దక్షిణముగా యానాముపోవు దారిలో కోసున్నరదూరమున సముద్రతీరమున తుల్యభాగా సాగర సంగమము నొద్ద చొల్లంగి గ్రామమున్నది. చొల్లంగి మున్నగు తుల్యాసాగర సంగప్రాంత పుణ్యక్షేత్రాధిపతులు రాజా రావు సుబ్బమ్మారావు బహద్దరురాణిగారు. ఈమె ధవళేశ్వరము వాస్తవ్యురాలు.

'శ్రీ పిఠాపురరాజ్య సింహాసనాధీశ
రావుగంగాధర రామరాయ
బహదర్ మహారాజ సహధర్మిణీమణి
శ్రీ నూజివీడు ప్రసిద్ధరాజ్య
పరివృఢ నారయాప్పారావు రాజేంద్ర
సుత సంశ్రితావన శుద్ధచరిత
తుల్యాబ్ధి సంగద్యుతుల్య చొల్లంగ్యాది
పుర సద్ధరాధిపపూర్ణ విదుషి....'

యయిన సుబ్బాంబికారాజ్ఞి అధికాసక్తితో కొట్ర లక్ష్మీనారాయణశాస్త్రిగారి లక్ష్మీనారాయణీయ*మను శుద్ధాంధ్ర నిఘంటు ముద్రణమునకుఁ దోడ్పడిరి.

## జగ్గంపేట

గోదావరీమండలమునందలి యొక ప్రొప్రయిటరీ యెస్టేటిది. రాఁబడి లక్ష; పేష్కష్ ఇరువదిరెండువేలు.

పిఠాపురము సంస్థాన పాలకులు రావు వేంకటనీలాద్రిరాయణింగారు (1793—1828) తమ బంధుకోటిలో ననేకులకు గ్రామదానములొనర్చి వారిని జమీందారులను గావించిరి. అప్పులపాలయి వేలమునకు వచ్చిన పెద్దాపురము సంస్థానమునుండి నీలాద్రిరాయణింగారు పదునైదు ముఠాలను ఖరీదుచేసి

*రచన 1895 లో. ప్రచురణ: సకలానంద ముద్రాక్షరశాల, కరప, 1907.

యుండిరి. వీనిలో జగ్గంపేటముఠాను తమ్మయ్యగారికిఁ బ్రసాదించియుండిరి. ఆనాఁటి జగ్గంపేటముఠా పేష్కషు ముప్పదిమూఁడువే లుండినది. అనంతర కాలమందు ఈ ముఠానుండి దొంతమూరు, రాయవరము మున్నగు ఎస్టేటులు విడివడి అన్యాక్రాంతములయినవి.

రావు బుచ్చివెంకటరావుగారికి వారసురాలగు వెంగాయమ్మగారినుండి కొన్ని ఎస్టేటులను 1903–1908 లలో బొబ్బిలిరాజాగారు విక్రయించుకొని యుండిరి. ఈమెకు పుత్రసంతతి లేనందున ఎస్టేటు పుత్రికాసంతతికి సంక్రమించినది. వీరు దామెరవంశీయులు. దామెర చినవెంకటరాయల కుమారుఁడు వెంకటసీతారామయ్యబహద్దరుగారు. వీరు పద్మనాయక కులోద్భవులు. వీరిది గాలవరగోత్రము. వీరి పూర్వుఁడగు దామెర చినవెంకటరాయణింగారు వేంకటాచలమాహాత్మ్య కర్త. చినవేంకమాంబా పెదవేంకటరాయల పుత్రుఁ డీతఁడు.

పై వేంకటాచలమాహాత్మ్య కృతికర్తకు పౌత్రులగు దామెర చినవెంకట రాయణింగారు సైతము కవులు. ఈయన శ్రీ దశావతార నుతిశతకము అను పేరుగల సంస్కృతగ్రంథమునకుఁ గర్త. ఇది పాలితేరుగ్రామ వాస్తవ్యుఁడును, జగ్గంపేట యాస్థాన విద్వాంసుఁడును నగు ద్వివేది రామశాస్త్రిగారిచే నాంధ్రీకరింపఁబడినది. మూలకృతికి రామశాస్త్రిగారు ఆంధ్రవ్యాఖ్యానమునుసైతము జోడించిరి. ఆంధ్రానువాద వ్యాఖ్యానములతోఁ గూడిన మూలకృతి కృతికర్త తనయులును, జగ్గంపేట ఎస్టేటు జమీందారులును నగు దామెర వెంకటసీతా రామయ్యబహద్దరుగారిచేఁ బ్రచురితము. అవసానకాలమున కృతికర్త సూర్య సప్తతి యను గ్రంథమునుగూడ రచించియుండిరఁట. ఈతఁడు ప్రసిద్ధులగు తిరుపతి వేంకటకవులచే 'కవితానిధి' యని ప్రస్తుతింపఁబడినవాఁడు.

కావ్యనాటకాలంకారాది సమస్త సాహితీగ్రంథాధ్యాపకులు బొమ్మకంటి నృసింహశాస్త్రులుగారు జగ్గంపేట జమీందారుల యాస్థానము నలంకరించిన మఱియొక విద్వాంసులు. శాస్త్రులుగారు గురుముఖమున తర్కవ్యాకరణాదులు తరిచి చూచినవారు. తిలకసహస్రము, మణిమంజీరము అనునవి వీరి రచనములు.

పరవస్తు వేంకటరంగాచార్యులు (1822–1900) విశాఖపట్టణములో స్థాపించియుండిన 'ఆర్షవిద్యాపాఠశాల'కు జగ్గంపేట జమీందారులు ప్రధాన పోషకులుగా నుండిరి.

## జవ్వాదివారు

జవ్వాదివారు పూర్వపుతరములనుండి జమీందారులు కారు. వీరికుదురున లక్ష్మయ్యనాయఁడుగారే తొలి జమీందారు. వీరి తాత లక్ష్మయ్యగారి హయాము

ంచి జమీందారీఫాయాతో సంస్థాన మర్యాదలను సాగించిన శ్రీమంతుల కుటుంబము వీరిది. లక్ష్మయ్యనాయఁడుగారి కాలమున 1948 లో ఓగిడి, కొమ్మేటిపాడు ఎస్టేటులనుకొని వీరు అక్షరాల జమీందారులే యయిరి.

జవ్వాది సుబ్బమాంబా వెంకయార్యుల ద్వితీయ తనయుఁడు లక్ష్మయ్య నాయఁడుగారు. వీరు పెనుగొండ సాహిత్యపరిషత్తునకు వ్యవస్థాపకాధ్యక్షులగుట వీరి సాహిత్యగోష్ఠి కొక సాక్ష్యము. వీరి యాధ్యక్ష్యమున రూపెత్తిన సరస్వతీగ్రంథమాల నాయఁడుగారి కావ్యప్రకటనాభిలాషకు చక్కని తార్కాణము. ప్రభుమర్యాదాపాలనమునకు వీ రేఁటేఁట ప్రచురించుచుండిన పంచాంగములు ప్రబల నిదర్శనములు. వెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, చిలకమర్తి లక్ష్మీనరసింహము, మల్లాది సూర్యనారాయణశాస్త్రి, తాతా సుబ్బరాయశాస్త్రి, చర్ల భాష్యకారశాస్త్రి, కాశీ కృష్ణాచార్యులు మున్నగు కవి పండితులు వీరిచే సమ్మానితులు.

నాయఁడుగారితోపాటు వారికుటుంబమున పెక్కురు కృతిభర్తలు. వీరి తండ్రియగు వెంకయ్య, అన్న నరసింహమూర్తి, ఇల్లాలు ఆదిలక్ష్మమ్మ, పెద్ద వాడుకు వెంకటరామశాస్త్రి, వియ్యంకులు బందరువాస్తవ్యులు కానిపెద్ది వీరరాఘవయ్యనాయఁడు ఈ యార్వురు కృతిభర్తృత్వమున నిర్వ్యాజ గీర్వాణాంధ్రకృతు లెన్నియో బడసినవి. వీనిలో పంద్రెండింటికి నాయఁడుగారు కృతినాయకుఁడు.

మద్దా వెంకటకవికృతమగు వైదర్భీపరిణయ మను ప్రౌఢ పద్య ప్రబంధము నాయఁడుగారి జనకులగు వెంకయ్యగారి కంకితము. వెంకటకవి ప్రాచీనకవిశ్రేణికిఁ జెందినవాఁడు. సమకాలికులగు మండపాక పార్వతీశ్వర శాస్త్రివంటి విద్వత్కవిపుంగవులచేఁ బ్రశంసల నందినవాఁడు. కలిదిండి నరసింహరాజకృతమగు 'యుగవాణి' యను ఖండకావ్యమును, మద్దా లక్ష్మీ నరసింహరాయవిరచితమగు చంపకమాలికయును, నాయఁడుగారి అన్న నరసింహమూర్తిగారికి కృతి. జామువారివి రచించిన ఖండకావ్యము (మూఁడవ భాగము)ను, ద్రోణంరాజు వెంకటపూర్ణప్రజ్ఞుల చిత్తరంజనదాసు అను జీవిత చరిత్రమును నాయఁడుగారి అర్ధాంగి ఆదిలక్ష్మమ్మగారి కంకితము. తెనుఁగు రాజు పెనుమెచ్చ సత్యనారాయణరాజుగారి 'తపోభూమి' యను గద్యకృతియును ప్రౌఢకవి అమ్మిసెట్టి లక్ష్మయ్యగారి 'అనామిక' యను పద్యకృతియును నాయఁడుగారి కుమారుఁడు వెంకటరామశాస్త్రికి అంకితము.

'తెలగ కులంబునం బొడమి తేటతెనుంగు కవిత్వధారలం గల మధు వెల్లఁ గ్రోలి బహుకావ్య విభుత్వమునంది....' న వారు నాయఁడుగారు, 'కృష్ణలీలాభిఖ్య కృతి స్వీకరించి భాషాభిమానముఁ జూపి యలరితివి'* అను పండిత

* నానారాజన్య — విఖ్యాత జనచరిత్రము, ద్వితీయ ప్రకరణము, పుటలు 284—288.

ప్రశంసలో పేర్కొనఁబడిన కృష్ణలీలాభిధమగు కావ్యస్వరూప స్వభావములు తెలియరాదు. ద్వివేది సత్యనారాయణసూరికృత 'కల్యాణకావ్య' మను పద్య కావ్యమును చెళ్ళపిళ్ళ దుర్గేశ్వరశాస్త్రి అనువదించిన 'అవిమారక' మను భాసనాటకము, గిద్దలూరు గురుస్వామికవి రచించిన 'ఆంధ్రప్రతిభ' యను చారిత్రక రూపకము, వేదాంతకవి విరచించిన 'కష్టకాలం' అను సాంఘికరూపకము, గంటి మొళ్ళ రామానుజాచారి నిర్మించిన 'మాండవి' యను పద్యకావ్యము, కోనేరు తిరుటుంబరావు రచించిన 'పైడిగడ్డ' యను రూపకము, డాక్టర్ శంకర శ్రీరామారావు సంతరించిన 'కబీర్‌సూక్తి ముక్తావళి', కాళహస్తి వెంకట నరసింహారావుగారి 'గీతానువాదము', వాజపేయయాజుల వేంకటసుబ్రహ్మణ్య సోమయాజుల 'లక్ష్మయార్య చంద్రోదయః' యను గీర్వాణకృతియును నాయఁడుగారంకితముపొందిన కృతులు.

'....వాగ్దేవతా సర్వరక్ష పారీణతకున్ మలంచిన కళాసామగ్రియై.... భారతీమూర్తుల్ దిగ్గజులైన సత్కవులు శిల్పుల్, పండితుల్, గాయకుల్... గొలువ దర్బారు....' తీరిన నాయఁడుగారు, '....కవికులాలంకార విఖ్యాతుఁడై ప్రాపైనాఁడయి యెల్లవారలకుఁగాపై వాఙ్మయోద్ధారకాఖ్యాపూర్ణుండయి దాన విర్ణుఁడయి షష్ట్యబ్దోత్సవానంద ముట్టూఁడన్....' కవిపండితుల నాదరించి వెలపొందించిన జవాదివాఙ్మయము జవ్వాదివలె తెలుఁగునేల గుబాళించునని కవిపండితులు కైవారము లొనర్చిరి † అమ్మిసెట్టి లక్ష్మయ్య రచించిన చంద్రగిరి దుర్గము అను పద్య కావ్యమునకు నాయఁడుగారు వ్రాసిన సమీక్ష వారి సాహిత్య సాహిత్యమునకు వినిర్మల దర్పణము.

## టెక్కలి

కళింగసీమయందలి పురాతన సంస్థానములలో నిది యొకటి. వీరు కాదంబరాజ వంశీయులట. నరసింహఖేడి, జయకృష్ణుఁడు రఘునాథజగద్దేవ, రామకృష్ణ జగద్దేవ మున్నగువారీ సంస్థానమును పాలించినవారిలో నాద్యులు. పదునైదవ శతాబ్దమునాఁటి పురుషోత్తమదేవుని సేనానియగు గోపాలదేవుఁడు మొదట సామంతుఁడుగానుండి టెక్కలిరాజ్య పాలకుఁడుగ స్వతంత్రుఁడయిన వాఁడు. పర్లా పాలకుల మెప్పునుపొంది టెక్కలి రాజ్యపాలకులు జగద్దేవ బిరుదమును బడసిరని చరిత్రము.

టెక్కలి పాలకులలో లక్ష్మీనారాయణహరిచందనజగద్దేవ, విద్యా వాచస్పతి, పురాతత్త్వ విశారద బిరుద విరాజితులు. ఇతని తనయుఁడు గోపీనాథహరిచందనజగద్దేవ ప్రాచీన శాసన పరిశోధకులుగా చారిత్రక

† ఆంధ్ర శేషగిరిరావు, జవాదివాఙ్మయము, జవ్వాది లక్ష్మయ్యనాయుఁడు షష్టిపూర్తి సంచిక, పుటలు 28 – 37.

సమీక్షకులుగా సంస్కృతాంధ్ర భాషాభిమానులుగా సరస కళాపోషకులుగా ప్రసిద్ధికెక్కినవారు. ఆంధ్రేతిహాస పరిశోధక మండలికి వీరు రాజపోషకులు.

## తిరుపాచూరు

తిరుపాచూరు ఎస్టేటుదారులు వెలమవారు. ఇనుగంటి గృహనామము. పిఠాపురము, బొబ్బిలి, జటప్రోలు, వెంకటగిరి, మీర్జాపురము, వుయ్యూరు, కపిలేశ్వరపురము మున్నగు జమీందారులు వీరి బంధువులు.

ఇనుగంటి వెంకటరాయణింగారు వెంకటగిరి రాజా సర్వజ్ఞకుమార యాచేంద్రుల అల్లురు; వీరి భార్యయగు రాజ్యలక్ష్మమ్మ వెంకటగిరివారి యాఁడుఁబడుచు. ఈ దంపతుల జ్యేష్ఠ పుత్రులగు రాజా వెంకట కృష్ణారావు (1899–1935) జటప్రోలు రాజా వెంకటలక్ష్మారాయ బహద్దరుగారి యల్లురు. లక్ష్మారాయ బహద్దరుగారి ద్వితీయపుత్రిక సరస్వతి వెంకటకృష్ణారావుగారి భార్య. జటప్రోలు సంస్థానాస్థాన కవియగు వాజపేయయాజుల సుబ్బరాయకవి తిరుపాచూరు వారికిని ఆశ్రితుఁడు. సుబ్బరాయకవి సీతాకల్యాణ సరస్వతీ రామాయణాది ప్రబంధకర్త. ఈతఁడు రచించిన 'రాజా వెంకటకృష్ణారావు బహద్దరువారి జీవిత'మను గ్రంథమున వెంకట కృష్ణారావుగారి విషాదాంత జీవితము చిత్రింపఁబడినది.

భర్తృవియోగ పరితప్తమానసయగు వెంకటకృష్ణారాయల సతి సరస్వతీదేవి భర్తృ దుర్మరణమును పురస్కరించికొని రచించిన 'సతీవిలాప' మను కావ్యము ఆంధ్రసాహిత్య చక్రవర్తి చిలకమర్తివారిచే కీర్తింపఁబడినది. భర్తృవియోగ దుఃఖమును ప్రకటించు నీ కావ్యము రతివిలాప కావ్యఖండికను బోలిన కళాఖండమని కవిపండితులు విద్యావతియగు సరస్వతీదేవి కవితాసృష్టిని శ్లాఘించిరి. శుద్ధాంతకాంతలు చెప్పిన కవిత్వ మంతఃపుర శ్రీలవలెనే ఘోషాగలిగి పరదాలమాటున నణఁగియుండక గ్రంథరూపమున ప్రచురమగుట పరమానంద కరమగు విషయము. అందలి రెండుపద్యములు :

> 'ఎట్టిజపంబు సేసితినొ యెట్టితపంబులఁ బూనియుంటినో
> ఎట్టి విశేషదానముల నిచ్చితినో తొలిబామునందుఁ జే
> పట్టితి మిమ్ముమవంటి గుణవంతుని వీరుని లోకమాన్యునిన్
> గట్టిఁడి బ్రహ్మ నిర్దయతఁగాంచి మిముం విడఁజేసె నక్కటా!'
>
> ... పు. 42

> 'నీ తలిదండ్రులన్న ధరణీధవ! వృద్ధులఁటం చెఱుంగవో
> చేతము దుఃఖదుర్భరతచేఁగదుఁ బొక్కఁగఁ గన్నులుండియున్
> నీ తనుభాగ్యమున్ గనఁగ నేరక వారట సంధులైరి; నా
> థా! తపియింపఁజేయుటలు ధర్మమె జీవితశేష మంతయున్' — పు. 45

## తిరువూరు

ఈ ఎస్టేటుపాలకులు వెల్లంకిగృహనామకులగు వెలమవారు. వీరి పూర్వులు గోలకొండనవాబులయొద్ద సరదారులు; మొగలుపాదుషాల కాలమున దేశపాండ్యాలు. వీరికోవలో దేశపాండ్యా రాజా వెల్లంకి గోపాలరావు ముఖ్యులు. వీరి ఐదుగురు పుత్రులలో మూఁడవవారైన పెదరామారావుగారు తిరువూరు జమీందారులకు వంశకర్త. వీరిపుత్రుల కాలమున తిరువూరు రాజాపేట, నడిమి తిరువూరు, ప్రాతతిరువూరు అను మూఁడు ముఠాలుగా చీలినది. శాశ్వత పరిష్కారముతర్వాత ఇవి మఱి కొన్ని ఎస్టేటులుగా విభజింపఁబడినవి.

తూర్పుతిరువూరు జమీందారులు జగన్నాథరావుగారు చక్కని ఆంధ్ర భాషాపాండిత్యము గలవారు. బెజవాడలోని రామమోహన గ్రంథాలయము తిరువూరు జమీందారు రాజా వెల్లంకి చినవేంకటరావుబహద్దరు జమీందారువారి విరాళమువలన నిర్మితము.

నడిమితిరువూరు—వినగడప యెస్టేటుదారులు రాజా వెల్లంకి చినవెంకట రామారావుగారు తిరుపతివేంకటకవులచే శతావధానములు చేయించి సమ్మానించిన వారు. వావిలకొలను సుబ్బారావుగారి షష్ఠాశ్వాసపరిమితమగు కౌసల్యా పరిణయము అను పద్యప్రబంధమును వీరి సమాదరణమునఁ బ్రకాశితము. రామారావుగారు కోలంకజమీందారిణి రావు చెల్లయ్యమ్మగారి సోదరులు; విద్యా సోదరులు; కవితారసోదరులు.

## తొయ్యేరు

ఈ ఎస్టేటుదారులు నల్లపరాజువారు. ఆంధ్రక్షత్రియులలో ధనంజయ గోత్రులు; కోటసంజ్ఞాంకులు. నల్లమ్మ భక్తులు. వీరి మూలపురుషుఁడు నల్లప రాజు రంగరాజు. ఈ రంగరాజు మనుమఁడగు రామభద్రరాజు నిజామునకు తోడ్పడి మీర్జా, రాజాబహద్దరు, మన్సబ్దారు బిరుదముల నందినవాఁడు. ఈయనసంతతిలోని ఇమ్మడి వెంకటపతిరాజు విజయనగరము పూసపాటి నారాయణగజపతివలన మొయిద, విజయరామపురములను మొఖాసాగ్రామ ములుగాఁ బొందినవాఁడు. ఈ వెంకటపతిరాజు సంస్కృత పారశీకాంధ్ర భాషలలో మీనుమిగిలిన పండితుఁడఁట. ఈయన అశ్వశాస్త్ర మను నాంధ్ర పద్య కావ్యమునకుఁ గర్త. మిక్కిలి మల్లయకవిరచిత పండితరాయశతకము వేంకట పతిరాజున కంకితము*. నల్లపరాజు అచ్యుతరామరాజుగారు విజయనగరము నుండి గంటి సూర్యనారాయణశాస్త్రిగారి సంపాదకత్వమున వెలువడుచుండిన కల్యాణి యను సాహిత్య మాసపత్రికకు మహారాజపోషకులు.

*Rajah Mirza Nallapa Raju Achyuta Rama Raju, History of Nallapa Rajus, J.A.H.R.S., Vol. XII, pp. 237, 238.

## పొంతపాంహాము

కళింగసీమయందలి చిన్న ప్రొప్రయిటరీ ఎస్టేటిది. ఎస్టేటుదారులు త్రిపురానవారు. వీరు తెలగాలు. శ్రీకాకుళముతాలూకాలోని సిద్ధాంత మను గ్రామము వీరి నివాసము. ఈ సిద్ధాంతము లక్ష్మీపుత్రులును, సరస్వతీసేవకులును నగు త్రిపురానవారి సావాసముచే లక్ష్మీసరస్వతుల శుద్ధాంతమఁట. చిట్టెమాంబా వేంకటస్వామిదొరల సంతానము త్రిపురాన తమ్మయదొర (1849–1890). తమ్మయదొరగారి కుమారులు వేంకటసూర్యప్రసాదరాయకవి (1889–1945).

తమ్మయ్యదొరగారు కర్తయుగా, కారయితయుగా చరితార్థులు. 'దేవీభాగవతమ్ముఁ దెలిఁగించి స్థిరయశస్తనుఁడైన కవిలోకచక్రవర్తి, దీనార్థికవి బుధాధీనార్థుఁడై లోకవిఖ్యాతిఁ గన్నట్టి విశ్వదాత....'. సీత, ముఖలింగేశ్వర, పాండురంగాష్టోత్తర శతకములు, నిద్రావిజయము, విటీవిటనటనార్థమాల, కామినీనిర్మోహజననతారావళి మున్నగునవి తమ్మయ్యదొరగారి స్వీయకృతులు. వీ రాంధ్రీకరించిన దేవీభాగవత మముద్రితము. వీరి పాండితీపటుత్వమునకు దేవీభాగవతము ప్రబల నిదర్శనము. హృదయంగమమయిన శైలి వీరి రచనములయందలి విశిష్ట లక్షణము. ముక్కవిల్లి సాంబయ్యశాస్త్రి వీరి యాస్థాన కవి. శాస్త్రిగారు ఉభయభాషాకవితాసామర్థ్యము గలవారఁట. వీరి జానకీశ్వర శతకము మాత్రము ప్రచురితము. వీరు సుకవితాచణులగు సూర్యప్రసాదరాయ కవిగారికి విద్యాగురువులు.

త్రిపురాన వెంకటసూర్యప్రసాదరాయకవి సాహిత్యవ్యవసాయమునందు తండ్రిని మించిన తనయుఁడు. వీరికి భారతీతీర్థమువా రొసఁగిన కవిభూషణ బిరుదమును, 1943 లో ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు ప్రదాన మొనర్చిన కళాప్రపూర్ణ బిరుదమును వీరిపట్ల సార్థకములు. 1927 లో బళ్ళారిలో జరిగిన ఆంధ్ర సాహిత్య పరిషద్వార్షిక మహాసభకు ప్రసాదరాయకవిగా రధ్యక్షులు. ఆ ఠాశ్వాసములు గల నిర్వచన కుమారసంభవము, ఏకపాత్ర నాటికగా దేశీయచ్ఛందము లలో రూపొందింపఁబడిన మొయిలు రాయబారము, నాలు గాశ్వాసముల రఘూదయము, ద్విపదలో తీర్చిన రతివిలాపము వీరి ముద్రితకృతులలో కొన్ని. కిరాతార్జునీయము, నిర్వచన రఘువంశము, ఉత్తరరామచరిత్రము. భారవి కాళిదాస భవభూతి మహాకవుల రచనల కాంధ్రీకృతులు. దేశీయచ్ఛందములలోఁ దీర్పఁబడిన ద్విపాత్రనాటిక శ్రీ భగవద్గీతామృతము కవిగారి కృత్యంతరము. మొయిలు రాయబారము ప్రతిపద చమత్కారభరితమయిన కాళిదాసకృతికిఁ దెలుఁగుసేఁత. 'కట్టుదప్పని స్వాతంత్ర్యగరిమ'ను పుణికిపుచ్చుకొనిన దేశీ రచన మిది. 'ఆంధ్రభాషావిభూష' యని కట్టమంచివారి కితపత్రము. ఈ కృతి జయపుర సంస్థానాధీశ్వరులు విక్రమదేవవర్మగారి స్వీకృతపుత్రిక. సీతాహృద

యానువర్తి శ్రీరామచంద్రమూర్తి కంకితము. 'కృతికర్తయై లసత్కృతిభర్తయై యాంధ్రకవితా ప్రియంభావుకత్వము వహియించి' 'భారతోర్వీ సార్వభౌమ ప్రియకుమార కరదత్త కనకకంకణ విభూషితహస్తు' డయిన సూర్యప్రసాద రాయకవి జయపురసంస్థాన గౌరవాస్థానకవి.

### దొంతి

తెలంగాణము నందలి ప్రాచీనమయిన సంస్థానములలో నిది యొకటి. తొలుత నిది అతి ప్రసిద్ధమైయుండి నడుమంతరముగా అంతరించినది. నేటికిని ఈ సంస్థానపాలకుల సంతతివారు యథాశక్తిగా విద్వత్సమ్మానము సలుపుచున్నారట. మెదకుమండలము, సిద్ధిపేట తాలూకా కుక్కునూరుపల్లి వాస్తవ్యులగు వేంకట పౌండరీకయాజులవారు దొంతి సంస్థాన విద్వాంసులు. వీరు ఘనాంతము యజుర్వేదము నభ్యసించి, పౌండరీకాంత శ్రౌతప్రయోగక్రియములు నేర్చి, సంగీత సాహిత్య జ్యోతిషములయందు అసాధారణమగు ప్రజ్ఞాప్రాభవమును సంపాదించినవారు. దొంతి సంస్థానాధీశ్వరులు వీరిని గౌరవపురస్సరముగా తమ యాస్థానమునకు రావించి యాస్థాన విద్వాంసులుగా నియమించి ఈనాము లిచ్చి సత్కరించిరి. వీరి రచనలలో శ్రౌతసూత్ర వివరణము ప్రధానమైనది. శతావధానులును, ఆంధ్ర పద్మ పురాణ కర్తలును నగు పిశుపాటి చిదంబరశాస్త్రి గారు 1919లో దొంతి యాస్థానములో శతావధాన సభ జయప్రదముగా నిర్వహించి పండిత సమక్షమున సమ్మానము నందిరట.

### నారాయణపురము

తెలంగాణమునందలి నల్లగొండ మండలములోని దీ సంస్థానము. ఈ సంస్థానమునందు పేరుపొందిన విద్వత్కుటుంబము శ్రీరామ కవచమువారు. అనంతశాస్త్రి యను నతడు సంస్కృతాంధ్ర గ్రంథముల ననేకము రచియించెనట. కృష్ణయ్య (1863--1926) యను నతడీ సంస్థానమునం దాస్థాన కవిగా నుండి భానుమతీ పరిణయము, శాకుంతలము, హరిప్రియ అను నాటకములను రచియించిరట. ఈయన నారాయణపురము సంస్థాన చరిత్రమునుగూడ వ్రాసెనట.

### నొసము

ఇది రేనాటి సీమలో కడపమండలమున పేరు పొందిన ఒక పెద్ద పాళయము. శాశ్వతకర నిర్ణయము నాటికే ఈ పాళయగాండ్రు తవుజీదారులు. వీరు మోటాటి శాఖకు చెందిన రెడ్డి బిడ్డలు. దొరవారను బిరుదనామమే వీరి గృహనామముగా వాడుక. జానపద సాహిత్యమున ప్రచార ప్రశస్తుల నందిన జయరామరెడ్డి, నరసింహారెడ్డి మున్నగువా రీ పాళయగాండ్రలో కొలికిపూసల

వంటివారు, సిపాయిల తిరుగుబాటునకు చాల పూర్వమే కుంఫిణీ ప్రభుత నెదిరించిన వీరుఁడు నరసింహారెడ్డి.

ఈయన ఆస్థాన పండితకవి ఓబళాచార్యులు ఆచార్యులుగారి కృతు లేవియును లభ్యము గాలేదు గాని కొన్ని చాటువులు వీరిపేర చెలామణి యగు చుండినట్లు చాటుపద్య మణిమంజరి సాక్ష్యము.* పరరాజులకు అంగిటి విసమును, తలమీఁది అంకుసమును నయిన 'నొసము' ప్రశస్తిని బ్రకటీక రించు చాటువులు కొన్ని మిత్రులు సాళ్వ కృష్ణమూర్తిగారివలన వినియుంటిని గాని వాని కర్తృత్వ మవిజ్ఞాతము.

## పర్తియాల

ఇది ప్రాచీనమైన జూపల్లివారి సంస్థానము. జూపల్లివారు వెలమదొరలు. పర్తియాలయే నేఁటి పరిటాల. పరిటాలకు, బెజవాడకు ఇరువది మైళ్ళ దూరము. పర్తియాల సంస్థానాధీశ్వరులలో సాహిత్య పోషకుఁడుగా వెలుఁగునకు వచ్చిన వాఁడు జూపల్లి వెంకటాద్రి. మహామహోపాధ్యాయ ఎలకూచి బాలసరస్వతి రచించిన చంద్రికా పరిణయ ప్రబంధ రచనమునకు ప్రేరకుఁడీ వెంకటాద్రియే. బాలసరస్వతి ప్రముఖలాక్షణిక చక్రవర్తియే కాక చంద్రికా పరిణయ ప్రముఖ శతాగ్ర ప్రబంధకర్త. రాఘవ కృష్ణ పాండవ కథాయుక్త ప్రబంధ మగు రాఘవయాదవపాండవీయ త్ర్యర్థి కావ్య నిర్మాత. రంగకౌముది నాటకము, బాల సరస్వతీయ మను పేర పండిత లోకమున ప్రసిద్ధినందిన ఆంధ్ర శబ్ద చింతామణి వ్యాఖ్యానము, భాషా వివరణము మున్నగునవి కవి యితర రచనములు.

చంద్రికాపరిణయము ప్రౌఢ ప్రబంధములలో నొకఁటి. కాశిరాజునందిని యగు చంద్రికను భీముఁడు పెండ్లాడిన కథ యిందు వర్ణితము. ఇందలి దొక పద్యము :

'అంతట రుక్మ బాహువసుధాధిప నందన యొక్కనాఁడు శు
ద్ధాంత గృహంబు వెల్వడి విహారగతిం జనుదెంచె నెచ్చెలుల్
చెంతలఁ గొల్వఁ జంచదళిశింజిత రంజిత కుంజ మంజుల
ప్రాంత గిళత్ఫలానవరతాంగజఘోటికిఁ బుష్పవాటికిన్'

చంద్రికాపరిణయ ప్రబంధ కృతిప్రేరకుఁడగు వెంకటాద్రి తండ్రి జూపల్లి లింగన్న. ఈ పాలకునివలన పురస్కృతుఁడుగామి కాఁబోలు రంగ రాజు లింగకవి యను నొక తిట్టుకవి లింగన్నను నిగూఢముగాఁ దిట్టినట్లు.—

'రవికోటి ధామమయమై
నవకాంచన యుతము నగుచు నానాఁటి కొగిన్

* చూ. ద్వి. భా., పుటలు 133, 134.

భువిని శివాన్వితమగు నీ
భవనము జూపట్టె లింగ భవగుణసంగా!'
అని అప్పకవీయము నం దుద్ధృతమైన యీ పద్యమువలనఁ దెలియుచున్నది.

## పాయకరావుపేట

ఈ సంస్థాన పాలకుల పూర్వులు కాకర్లపూడి వాస్తవ్యులగుటవలన వీరి యింటిపేరు కాకర్లపూడివారైనది. వీరు సూర్య వంశీయులగు రాంభద్ర క్షత్రియులు; వాసిష్ఠ గోత్రజులు. కాకర్లపూడి కనపరాజు వీరి పూర్వుఁడు. ఆతని యేడుగురు కొడుకులలో ద్వితీయుఁడు దేవనరాజు. ఆతని ద్వితీయ పుత్రుఁడగు అప్పలరాజు (1612—1626) గోలకొండ నవాబులయొక్క సరదారుగా నుండి యుద్ధనైపుణ్యమునకు పాయకరావు బిరుదమును, ప్రభుభక్తికి కొంత రాజ్యమును నవాబునుండి సంపాదించినవాఁడు. 'పాయకరావు' అని అప్పలరాజుగారు బిరుదము నందినట నిజామ్-ఉల్-ముల్కు వలన అని కొందఱు. ఈ రాజ్యములో అనకాపల్లి, సత్యవరము, మెళుపాక మున్నగు నిజారా లుండినవి. జయపురము విక్రమదేవుగారు సలావత్ పాయకరాయనికి అనకాపల్లి నొసంగినట్లు హిల్ జమీందారుల చరితము (పు. 10) పేర్కొను చున్నది. ఈ సంస్థానమునకు తునికి చేరువలో తాండవనది యొడ్డునఁగల సత్యవరము రాజధాని. అందువలన దీనిని సత్యవర సంస్థాన మని కూడ వ్యవహరించుట కద్దు.

కాకర్లపూడి అప్పలరాజుగారు 1750 లో అనకాపల్లిలో భోగలింగేశ్వర దేవాలయమును నిర్మించినట్లును. ఎలమంచిలికి ఏడు కోసుల దూరమునఁగల ఉపమాక వెంకటేశ్వర స్వామి దేవాలయము ఈ అప్పలరాజుగారి కాలమున (సుమారు 1770) వెలసినట్లును చరిత్రము.* అనకాపల్లి నూకాలమ్మ అప్పల రాజుగారి కొలువులందిన గ్రామదేవత. అనంతర కాలమందు ఈ దేవాలయ ధర్మ కర్తృత్వము సంస్థానపు హక్కులతోపాటు గోడే జమీందారులకు సంక్రమించి నవి.† కాకర్లపూడి పాయకరావు విజయనగరము మొదటి ఆనందరాజునకు తోడి యల్లుఁడఁట. ఈతఁడు యుద్ధరంగమునందు ఆనందరాజునకు సాయపడి విజయములను చేకూర్చినవాఁడు. '... శ్రీకాకుళపుం సరకారుకు .... నిఫహా సరదారుగా' దగు బుస్సీదొరను జూడ వచ్చిన ధరావరులలో '.... విద్విషద పాయకరాయత బాహుశౌర్యుఁడగు పాయకరాయఁడు .... ' (రంగా 1—152) సైత ముండెనఁట. బొబ్బిలి యుద్ధమున పెదవిజయరామరాజుగారికి కళింగ సంస్థానాధిపతులలో 'పొలుపొందఁ గాకర్లపూడి జగన్నాథరాజుగారొక కొంత

* కళింగదేశ చరిత్ర, పుటలు 61, 63.

† పైది, పు. 65.

ఫౌజుతోడ సత్యవరపు పురస్వామియౌ నల రామభద్రరా జొకకొంత బలముతోడ' (రంగా 1-160) తోడ్పడినట్లు తెలియుచున్నది. కాకర్లపూడి జగన్నాథపాయకరాయనింగారు వొడ్డుగల్లుసీమ నేలుచుండినట్లు స్థానికచరిత్ర సంపుటముల సాక్ష్యము.

జగన్నాథపాయకరాయనింగారి తనయులగు గోపాలపాయకరావు రుస్తుమఖాన తనూభవుఁడగు నూరుద్దీన్ హుసేన్ తలకొట్టి విజయనగరాధీశ్వరుని జేజేలందిన మహావీరుఁడు. ఈ గోపాలరావుగారి కుమారుఁడు రామభద్ర పాయకరావు. ఆతరువాత వారిసులు లేనందున పూర్వపాలకుని తల్లికి, భార్యకు సాలీనా పదివేలరూపాయలు చెల్లించుచు సర్కారు పేష్కషును కుంఫిణీకి జమకట్టు షరతుమీఁద నీ సంస్థానము విజయనగరమునకు దఖలుపఱుపఁబడినది. వీరిరువురి మరణానంతరము దత్తపుత్రుఁడను పేర వివాదమునకు దిగిన యొక వ్యక్తి పక్షమున 1832—1834 ప్రాంతములలో కుంఫిణీమీఁద జరిగినపితూరి అణఁచివేయఁబడినది. సత్యవరపు కాకర్లపూడి నరసరాజు అనునతఁడు 1806 లో గొడిచెర్ల శ్రీరామపురము మొండాలను విజయనగరము రాజాగారి నుండి ఖరీదుచేసి అటుపిమ్మట గొడే సూర్యనారాయణరావుగారి కమ్మివేసిరి. 1832 లో మరల కాకర్లపూడి పద్మనాభరాజుగారు వీనిని ఖరీదుచేసిరిగాని శిస్తులు సరిగా చెల్లక ఆ మొదటియేఁడే వేలమునకు వచ్చినవి. వీరి సంస్థానమంతయు అనంతరకాలమున నించుమించుగా గొడే జమీందారుల యాధిపత్యము క్రిందికి వచ్చినది.

కాకర్లపూడివారు కవిపండిత పోషకులగుటయే గాక కృతికర్తలుకూడ. జగన్నాథరాజ గోపాలరాయలకు పూర్వుఁడును, మొదటి పాయకరావు తమ్ముని కుమారుఁడును నగు రామభద్రపాయకరావు——

'పద్మినీ పరిణయ ప్రథిత సత్కృతిఁజేసెఁ
    బ్రతిభానుభావ సమ్మతముగాఁగ
రతిసీలగిరినాథ శతకంబుగావించె
    సుప్రసాద మహత్త్వ దీప్రముగను
నవలేఖినీలేఖ్య కవితానవద్యత
    వెలయించె ననురూపవృత్తిఁదనర
సతతచాటునిబంధ సరసోక్తు లలరించె
    సహృదయహృదయైక సరణిమీఱ
ననుచుఁ గవులు నుతింతు రెవ్వానినతఁడు
సంగరాఖిల శరజాల శమిత విమత
దవహుతాశుఁడు రామభద్ర క్షితీశ
ఘనుఁడు భువనధురంధరఖ్యాతిఁ దనరె' —(1–62)

నని కాకర్లపూడివారి యాస్థానకవి యగు రేకపల్లి సోమప్పకవి రచించిన రుక్మవతీపరిణయ కృత్యవతరణిక మూలమున స్పష్టపడుచున్నది. రేకపల్లి సోమప్ప గోపాలపాయకరావునకు ఆశ్రితుడు. సోమకవికి పూర్వము, కానంపూడి తిమ్మకవి, వెలిచెల గౌతమరాజు గోపాలరాయని ఆస్థానకవులు. తిమ్మకవికి గోపాలరావు దోసలపాడను నగ్రహారమునిచ్చి గౌరవించెనట. తిమ్మకవి మరణానంతరము సోమప్ప ఆస్థానకవి పట్టమును బడసెనట,

'అప్పా రేకపలీ సో
మప్పా ! విబుధాళిపాళి యమ్మరపు లప్పా !
ఒప్పులు నీ కవితలు వె
న్నప్పాలకు సాటివచ్చు నా ! ఛిరి రుచులన్'

అని సమకాలికుల పొగడ్తలనందిన సోమకవికి అడిదము సూరకవి ప్రతి పదమునను ప్రతిస్పర్థి. సూరన సోమప్ప లిరువురును స్పర్థాళువులని అనేక చాటువుల సత్యాకరణము. గోపాలరావు సోమప్ప నాదరించి మడిమాన్యము లొసగి సత్కరించెనట.

సోమప్ప రచించిన రుక్మవతీ పరిణయ* మను నయిదాశ్వాసముల శృంగార ప్రబంధము 'అనవద్య హృద్య ప్రబంధ కథా ప్రసంగ సంగతి నంగీకరించు' గోపాలరాయుల కంకితము. రుక్మిణీకృష్ణుల తొలిచూలగు ప్రద్యుమ్నుడు పుట్టినదాదిగా ఆతడు రుక్మితనయ యగు రుక్మవతిని పరిణయ మాడుటదాక గల గాథ యింధలి కథాశరీరము. సోమప్ప గోదావరీ మండలములోని తాళ్ళపూడి నివాసియగు రేకపల్లి సూర్యనారాయణ సోమయాజుల పుత్రుడు. వేదవేదాంగవేత్త. సకలశాస్త్ర పారంగతుడు. కృతిభర్తయగు గోపాలరావు శ్రీకృష్ణలీలా సుధారస సరసకృతి ప్రముఖ సప్తసంతాన నిరంతరీకృత సంతోష స్వాంతుడట.†

గోపాలరావుగారి కుమారుడు రామభద్ర పాయకరావు. ఇతడుకూడ కవిపోషకుడు వైదరుసు అప్పయ్యకవి యీతని యాస్థానకవి యని పరిశీలకుల యభిప్రాయము. ఈకవి రచించిన ఉపమాక వేంకటేశ్వర శతకమున రామభద్ర పాయకరాయ రాజమౌళినామము ప్రసక్తము. 'నాకవితకు నెంచి వీనిఁబ్రోవుమనుచు. కాకర్లపూడి పాయకరాయ నృపాలమౌళితోనైన సెలవీయరాదో.... ఉపమాక వేంకటేశ' యని కవి దేవునితో మొఱయిడుటవలన

* ఆంధ్ర విజ్ఞానసమితి, విజయనగరము, కాకినాడ ముద్రాక్షరశాల, కాకినాడ, 1940; Triennial Catalogue, Vol. III, Part iii, R. No. 549.

† విశాఖపట్టణము జిల్లా వృత్తాంత సంగ్రహములో ప్రద్యుమ్నాభ్యుదయ రుక్మవతీ పరిణయములను ప్రబంధద్వయము సోమకవి విరచితమని నిరూపించుట ప్రామాదికమని తోచుచున్నది. వాస్తవముగా నీ రెండుపేళ్ళును ఒకేగ్రంథమును నిర్దేశించు పర్యాయవాచకములుగా గ్రహించుట యుక్తము (చూ. పు. 133).

నాఁటికి పాయకరాయ నృపాస్థాన ప్రవేశము కాలేదనుట స్పష్టము. 'విబుధలోకేశ ఉపమాక వేంకటేశ' యను మకుటముగల సీసపద్య శతకమిది. ఇందు ఉపమాకలో వెలసిన అలమేలుమంగావేంకటేశ్వరుల పరిణయకథ వర్ణితము.

'సారస్యమేర్పడ సాహితీ కలశాబ్ధి
శేముషీమంథాద్రిచే మథించి
యా కీర్తి రాకాసుధాకరుఁ గాకర్ల
పూడి వంశాంబుధి పూర్ణచంద్రుఁ
డగు రామభద్ర పాయకరాయ రాజమౌ
ళి కొసంగి, యామాధురీ సుధా ర
సంబు కాకవిదనుజనికాయములఁ గికు
రించి బుధతతి కర్పించి గరిమఁ
గాంచి సాలంకృతయగు శృంగారసీస
శతక రాజలక్ష్మిని సంతసంబుగడక
నుడుగరగనిత్తు నీకు నహో పరాకు
విబుధలోకేశ! యుపమాక వేంకటేశ'

అప్పయ్యకవి 'బళిర కటివేల్ప పసిఁడి దువ్వలువదాల్ప!' యను మకుటముగల సీసపద్యములతో బళిర కటివేల్పు శతకమునుగూడ రచించినట్లు తెలియుచున్నది. ఇందు రాధాకృష్ణుల 'కాయజోపనిషద్గాథలు' వర్ణితము.*

## పార్వతీపురము

ప్రాచీనమైన కొండజమీందారీలలో పార్వతీపుర మొకటి. దీనికే బెలగామని నామాంతరము. బెలగామునకు రాజధాని పార్వతీపురము. బెలగాము జమీందారీకుటుంబమున ప్రసిద్ధ వ్యక్తియగు పార్వతమ్మపేర నిర్మితమయినదఁట పార్వతీపురము! ఈ యెస్టేటు శ్రీకాకుళమండలము పార్వతీపురమునకు సమీపమునందలి పదునాలుఁగు గ్రామములతోఁ గూడి యుండినది. ఇదికూడ జయపురసంస్థానాధిపతులవలన 1796 లో నేర్పడిన సంస్థానము.† జయపుర ప్రభువు రామచంద్రదేవు—

'తనమంత్రియై పేర్మిఁ జను జగన్నాథుని పేరఁ
బెంజెర్వు త్రవ్వించి.... మఱియు నతనికిఁ
దోడరమల్లు ధాటరాజు వీరవరుండను తేజుమీఱు
బిరుదములతోడ బెల్గాము ప్రీతి నిచ్చె....'

—విజయలక్ష్మీ విలాసము, 3—88.

* వంగూరి సుబ్బారావు, శతకకవుల చరిత్రము, 1957, పుటలు 335—340.

† విశాఖపట్టణముజిల్లావృత్తాంత సంగ్రహము, పుటలు 543, 544.

జయపురసంస్థానపాలకుఁడయిన రామచంద్రదేవునకు దివానుగానుండిన వీర తోడరమల్లుధాత్రారాజు జగన్నాథపాత్రుఁడు గొప్ప వ్యవహారవేత్త. ఇతనిసేవలకు మెప్పుగా జయపురమువారు దీనిని ప్రసాదించిరి. 1802 లో పేష్కషు పదివేలు. 1856 నుండి పండ్రెండేండ్లపాటు మేలింగిజమీందారులకు డెబ్బదియైదువేలకు కుదువలో నుండినది.* సంస్థానపాలకులయిన ధాత్రారాజువంశమువారు కాశ్యప సగోత్రులు. మహితశ్రీ వీరవర తోడరమల్లు ధాత్రారాజ బిరుదాంకులు. వీరికోవలో సుందరనారాయణధాత్రారాజు జగన్నాథుని పుత్రుఁడు. ధనంజయుఁడు, విశ్వంభరుఁడు ననువా రీతని పుత్రులు. విశ్వంభరునకు నారాయణ రామచంద్రుఁడు, జనార్దనుఁడు నని యిద్దఱు కుమారులు. వీరిలో జ్యేష్ఠుఁడగు నారాయణరామచంద్రుని కుమారుఁడు శివనారాయణుఁడు. శివనారాయణుని పుత్రుఁడు ధనంజయుఁడు (1865–1888). తన వితంతువునకు దత్తతకు వీలువ్రాసి 1888 లో ధనంజయుఁడు మరణించినాఁడు.

ఈ సంస్థానపాలకులలో విశ్వంభరధాత్రారాజు బుధజనస్తుత్యవిద్యల భోజుఁడుగా కవిసమాజ పరికీర్తితుఁడు. వీరి తరువాత కవిపండితపోషకుఁడుగా ధనంజయధాత్రారాజు మిగులఁ బ్రసిద్ధుఁడు. 'సుకవిమూర్ధన్యసన్నుత సుగుణపాళి శ్రీ ధనంజయరాజ భూనాథమౌళి'. ఇతని యాస్థానమునందు కవిసార్వభౌమ పంతుల బ్రహ్మదేవకవి, కొమ్మోజు సోమనాథ శిల్పాచార్యుఁడు, ముద్దు సీతారామస్వామికవి, ముద్దు లక్ష్మీనారాయణకవి మున్నగు విద్వత్కవులుండిరి.

పంతుల బ్రహ్మదేవకవి కొత్రబాలకవికి మునిమనుమఁడయిన పాపయ కవిచే 'అంతా కవులే చూడఁగ నంతింతో పద్యరచన మల్లుదుమంచున్ భ్రాంతి పడి తిరుగుచుందురు పంతుల బ్రహ్మన్నసాటి పండితుఁడేఁడీ' యను పొగడికను బడసినవాఁడఁట. గదిరాయనివలసగ్రామవాస్తవ్యుఁడగు నీతఁడు ఆరామద్రావిడ బ్రాహ్మణుఁడు; శఠమర్షణ గోత్రజుఁడు. సంస్కృతాంధ్రముల, సంగీత సాహిత్యముల సవ్యసాచి. ఆశుకవితలో అందెవేసిన చేయి; ఉమామహేశ్వర ప్రసాద సమాసాదిత కవితావ్యవసాయి ఉర్లాముజమీందారు కందుకూరు బసవరాజు సభాంతరమందును సై యనిపించికొనిన చతుర రచనావిచక్షణుఁడు. బహు గ్రంథకర్త. ధనంజయమహారాజును బ్రస్తుతించుచు కృతిసర్వస్వము, ధనంజయమహారాజశతకము మున్నగు నాంధ్రకృతులను తారావళ్యాది గీర్వాణ కృతులను ప్రభునామాంకితముగా రచియించినవాఁడు. ధనంజయధాత్రారాజు పేర రచించిన చాటువులును అనేకములు కలవు.† ఈ కవి రచించిన ఇందుమతీ

*Manual of Administration of the Madras Presidency, Vol. III, p. 657.

†చాటుపద్య మణిమంజరి, ద్వితీయభాగము, పుటలు 104–106.

పరిణయ మను మూఁడాశ్వాసముల శృంగారప్రబంధము* ప్రసిద్ధమైనది. ఇతఁ డంతకుమున్నె ధనంజయుని తండ్రియగు శివనారాయణధాత్రాజుపై ననేక కృతు లొనరించినవాఁడఁట. బ్రహ్మదేవకవి తాను 'ప్రతిపద్య హృద్య ప్రబంధానుసంధాన చాతురీ ధౌరేయ చక్రవర్తి, అనుయోగతాలసంయుత సమస్యాపూర్తి' యనియు ధాత్రాజులనుండి సంస్కృతాంధ్ర బిరుదాంక నోట్టంకితములగు గండపెండేరంబులును ద్రికాలఘటికా సస్య ధురంధరయగు నుర్వరియు, నిరుపద్రవ నివాసానుకూల సాలోపాంత సీమాల దివ్య భవనంబును బడసినవాఁడననియుఁ బ్రకటించుకొనినాఁడు. కౌశికగోత్రపవిత్రుఁడును, ముద్దుపిలుఁడును. భరతశాస్త్ర పారావారపారీణుఁడును, ధాత్రాజసంభావితుఁడును నగు సీతారామస్వామికవి యను బుధాగ్రేసరుఁ డీ యిందుమతీపరిణయ కృతి నిర్మాణమున సాయపడినవాఁడఁట.

ఈ ప్రబంధము ధనంజయధాత్రాజాంకితము.

'రాణన్ మించు విశాఖపట్టణపుజిల్లాలో జమీందారు ల
క్ష్మీణౌదార్యమునన్ రిపజ్ఞత గుణశ్రీఁ దావృతుల్ గామి దా
ర్కాణై యుండుటచేత మ త్సుకవితాకిన్యా లలామంబు వి
న్నాణంబొప్పఁగ శ్రీ ధనంజయ ధరానాథున్ వరించెన్ దమిన్'

అని ధనంజయరాజ కృతిపతిత్వ ప్రాశస్త్యమును నిరూపించినాఁడు కవి.

పురాతన మహారాజచూడామణియును, రఘుకులస్వామియును నగు అజభూవరుఁడు స్వయంవరమున నిందుమతిని బరిగ్రహించి పరిపంథిరాజుల విగ్రహమున నిగ్రహించిన చరిత్రము శృంగారరసప్రధానముగా నీ ప్రబంధమునఁ జిత్రితము.† ఇందుమతీపరిణయమునుండి మాదిరికి కొన్ని పద్యములు :

'సరయూతీరమునందుఁ గేతనపటచ్ఛాయాపరిచ్ఛన్న ని
ర్జర కాసార పయోజడీకృతనభస్వన్మాణవోత్సారితాం
బరచారి ప్రమదాశ్రమాంబుకణికావారం బయోధ్యాపురం
బరవింద ప్రియచుంబి గోపురము రమ్యాకార మొప్పుంగడున్'

'సంతతైకాంత సంభోగతాంతలైన
కాంతలకు శ్రాంతిదీర్చి నిశాంతవేళ
మలయు మలయానిలకుమారుఁ డలసలీల
నప్పురంబున రసికు లౌ ననఁగ్రమోల'.

*R. No. 467, R. No. 567, R. No. 569, ప్రాచ్య లిఖితగ్రంథాలయము నందలి కాకితపు ప్రతులు.

†అచంట వెంకటరాయ సాంఖ్యాయనశర్మ, పంతుల బ్రహ్మదేవకవి, కల్పలత పత్రిక, విశాఖపట్టణము, 1921.

బ్రహ్మదేవకవి రచించిన మఱియొక కృతి కృతిసర్వస్వము.* ధనంజయధాత్రాజును బ్రశంసించుచు, కవి సంతరించిన కీర్తనలు, జావళీలు చాటువులు నిందు గలవు.

శ్యామకల్యాణి — చాపుతాళము

ప. సభలోఁ బ్రకాశించే సంసాగ్రేసరు లెవరే సార్వభౌము లెవ్వరే
అ.ప. ఇభరాజగమన రా యిదిగో చూడుచూడు ॥ సభ ॥
....శ్రీ ధనంజయ రాజశేఖరు లౌ నేమొ శోధించి పలుఁ బెల్వ
సుదతీ నిల్వఁగఁ జాల ॥ సభ ॥

'హరితేజా శ్రీ ధనంజయ మహారాజా' యను మకుటముగల కందపద్య కదంబమగు శ్రీ ధనంజయ మహారాజ శతకము† కవికృత్యంతరము.

'వరవృత్తిరీతి గుణపా
క రసాలంకారవిధులఁ గవులఁ దలఁచి నే
విరచించితి నీ శతకము
హరితేజా శ్రీ ధనంజయ మహారాజా' యని కవి తన కృతి ప్రాశస్త్యమును ప్రకటించినాఁడు. బ్రహ్మదేవకవి సంస్కృతమున సంధానించిన కృతి ధనంజయధాత్రాజ ప్రశంసాస్తబకమయి నక్షత్ర నామాంకితములైన ఇరువదియేడు శ్లోకములు గల తారావళి. ధాత్రాజాంకితమగు దేవీస్తవము, ధాత్రాజముద్ర గల అనేక శృంగారగీతములు కవికృతములు సైత మిందు సంగ్రథితములు.

'సతతము సంతసమొసంగు సత్యప్రతికిన్' అను కందపద్య చతుర్థ పాదమును మకుటముగా నిచ్చి శతకమును రచియింప విజయనగర పాలకుఁడు ఆనందగజపతి (1879—1897) యొక పోటిని బ్రకటించియుండె నఁట. ఉత్తమ రచనముగా నిర్ణీతమయిన కృతియందలి ప్రతిపద్యమున కైదు రూపికలు బహూకృతియఁట ! తెలుఁగునేల నాలుగంచులనుండి యించుమించుగా నన్నూఱు శతకము లీ పోటికి వచ్చెనఁట ! చివరినిర్ణయము జరుగకమునుపే ఆనందగజపతీంద్రు లస్తమించుటచే పోటీఫలితము తేలలేదు. 1890 ప్రాంతముల మరణించిన పంతుల బ్రహ్మదేవకవి సంతరించిన శతకమునకే బహుమతి వచ్చినదని కొందఱు వ్రాయుట చింత్యము.‡

ధనంజయుని యాస్థానకవులలో ద్వితీయుఁడు నిఖిల విద్యావిశారదుఁడు

*R. No. 563(a) ప్రాచ్యలిఖిత గ్రంథాలయము కాకితపు ప్రతి.

†R. No. 563(b) ప్రాచ్యలిఖిత గ్రంథాలయము కాకితపు ప్రతి; శతకకవుల చరిత్రము. అనుబంధము, పుటలు 786, 787.

‡ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి, ఆనందవాణీవిజయము, కాశీ కృష్ణాచార్య అభినందన సంపుటము, పుటలు 109, 110.

కామ్మోజు సోమనాథ శిల్పాచార్యుఁడు. మూఁడు ఖండములు గల విచిత్ర రామాయణ మను చంపూప్రబంధ మీతని రచనము. సారశాదా సను బిరుద నామము గల సిద్ధేశ్వరపరిడా ఓఢ్రభాషలో కైసేసిన విచిత్ర రామాయణ మను కావ్యము మాతృకగా చిత్రగుప్త కులోద్భవుఁడైన దెంకాడ గోపీనాథకవి కూర్చిన ఆంధ్ర గద్యగ్రంథ మాధారముగా నీ సోమనాథ శిల్పాచార్యానుకృతి గద్యపద్యాత్మకముగా సంపాదితము.* సోమనాథకవి కాశ్యపసగోత్రుఁడు. ఆపస్తంబసూత్ర తత్పురుష ప్రవర అధర్వణ శాఖలకు చెందినవాఁడు. గుర్వాంబా వీరేశ్వర శిల్పాచార్యుల పుత్రుఁడు. రామయగురునాథుల కగ్రజుఁడు. లక్ష్మణార్య కవిశిష్యుఁడు.

'శ్రీరామభద్రుచరిత్ర మౌ నీ మహా
 కావ్యంబు నిర్మింపఁగాఁ గడంగె
వింధ్యాచలప్రాంత విపిన భూప్రాగ్భాగ
 లాంగలీనామ తరంగిణికిని
బశ్చిమదిశయందుఁ బద్మమందిరకు ని
 వాసమై బుధజనోల్లాసమగుచు
సకల విశిష్ట వంశజులచే విలసిల్లి
 వివిధ యశస్ఫూర్తి వినుతికెక్కు
శ్రీధనంజయ ధాత్రీరాజశేఖరుండు
రమణ బాలింప సుచితవర్తనల సద్వి
భూతిఁ జెలువొందు పార్వతీపురవరాగ్ర
నలిన వనహేళి శ్రీ సోమనాథ సుకవి'.

ఇందలి పూర్వ ద్వితీయోత్తర ఖండములు క్రమముగ 8, 13, 3 ఆశ్వాసములు కలవి. పరమశివాంకిత మీ ప్రబంధము.

పార్వతీపుర సంస్థానమునందే కాక—

'పృథులసాలగ్రామపీఠశోభితమైన
 చారునందాపు రాస్థానమందు
శ్రీ శంకరాన్వయ క్షీరవారిధి శశి
 ఘూర్ఘుండ పాదుషా సకలరాజ
మకుటమాణిక్య రుచిమండిత చరణుఁడౌ
 శ్రీ విక్రమాహ్వయదేవ గజప
తీంద్రుచే మెప్పువహించి మేల్ శాయిమా
 న్వాలకీ మొదలగు బహుమతులను' గాంచినవాఁడఁట సోమనాథకవి.

సహస్రకంధర రామాయణ కర్తయగు ముద్దు లక్ష్మీనారాయణ కవి

*R. No. 506 ప్రాచ్యలిఖిత గ్రంథాలయము కాకితపు ప్రతి.

ధాత్రాజ సంస్థానాశ్రితుఁడు. ఇతఁడు కౌశిక సగోత్రుఁడగు ద్రావిడ బ్రాహ్మణుఁడు. కొల్లూరి బ్రహ్మసూరి, కొల్లూరి కామశాస్త్రి కవికి పినతల్లి కుమారులు. మండపాక కామకవి యాతని విద్యాగురువు. కవికి సమకాలికులగు మండపాక పార్వతీశ్వరకవి, పంతుల బ్రహ్మదేవకవి, ద్వివేది నరసింహుఁడు, చెళ్ళపిళ్ళ నరసింహస్వామి, దూసి వెంకటరామఁడు, కొల్లూరి బ్రహ్మసూరి, కొల్లూరి కామశాస్త్రి, కాకరపర్తి లక్ష్మణకవి, పసుమర్తి కనకమల్లేశ్వరుఁడు మున్నగు వారు సహస్ర కంథర రామాయణావతారికలో నుట్టంకితులు.

'సరస కవీంద్ర వందితవిశంకట సత్కవితావిభాసితున్
గురుతర ధీయుతున్ నృపతికుంజర రంజిత వాగ్విరాజితున్
సురుచిరసాహితీ విభవశోభిత దీప్తగుణ ప్రజాంచితున్
బరమకళాసమున్నతుని బంతుల బ్రహ్మకవి న్నుతించెదన్'

అని బ్రహ్మదేవ కవిని ప్రత్యేకించి ప్రస్తుతించుట గమనింపఁదగినది. ఇదియాఱాశ్వాసముల ప్రబంధము. శ్రీరామపట్టాభిషేకానంతరము జరిగెనని సంభావింపఁబడిన అవాల్మీకమగు రామాయణగాథయిందు వివృతము.*

పార్వతీపురపాలకుఁడు విశ్వంభర ధాత్రాజుగారి మంత్రి పాత్రేరు అప్పయపట్నాయకు. ఇతఁడు సృష్టికరణ కులజుఁడు.

'శ్రీ రాజసింహుల శీతాంశువంశ్యుల
సఖ్యము చేసెనే సత్యసంధుఁ
డభవ వంశస్థులై యలరు శ్రీ విక్రమ
దేవు కార్యములలోఁ దేజరిల్లె
నే మంత్రిశేఖరుం డెనలేని భాగ్యభో
గ్యాయుతుండయ్యె, నేఘనగుణుండు ;
శ్రీ బెలగాంపురీ క్షితినాథునకు జమీ
దెచ్చియిచ్చిన మంత్రిధీరుఁడెవ్వఁ ;
గీ. డతఁడు సర్వరకాతతిహిత విధుండు
వీర విశ్వంభరావనీ విభునిమంత్రి
వరుఁడు ఘనతర పార్వతీపుర నివాసుఁ
డలరె నప్పయమంత్రీంద్రుఁడనగ మఱియు'

తాడూరి కృష్ణశాస్త్రి విరచితమగు గౌతమీ మాహాత్మ్యము† ను క్షేత్రమాహాత్మ్య గ్రంథము అప్పయమంత్రి కంకితము. బ్రహ్మాండ పురాణమునందలి యాఱధ్యాయముల సంస్కృత గ్రంథమునకు మూఁడాశ్వాసముల తెలుఁగుసేఁత యీ కావ్యము. కవి పరాశర గోత్రుఁడు. తాడూరి రామచంద్రార్య పుత్రుఁడు.

*R. No. 483 ప్రాచ్యలిఖిత గ్రంథాలయము, కాకితపుప్రతి.

† R. No. 522 ప్రాచ్యలిఖిత గ్రంథాలయము కాకితపుప్రతి.

## పెందోట

గుంటూరు మండలము పలనాటిసీమలో నాగార్జునుని కొండకు నైరృతి దిశలో మూఁడు పరువుల దూరమున కృష్ణవేణీనదీ తీరమున పెందోటయను పట్టణము పదునేడవ శతాబ్దములో వెలసియుండినది. గోలకొండ పాదుషాల కాలమున విశ్వకర్మకులజులగు ధవశేశ్వర గృహనామకులు పాదుషాలకు సామంతులుగా పెందోట సంస్థానమును పాలించిరఁట. వీరిలో ప్రసిద్ధులగు ధవశేశ్వరము మార్కండేయాచార్యులు గోలకొండ పాలకుఁడు మొహమ్మద్ కులీ కుతుబ్‌షాహి (1580–1611) కి కుడిబుజముగా నుండిన ఆప్త సచివుఁడఁట. ఈయన సోమయాచార్యుల కుమారుఁడు; వీర శైవాగ్రణి. పెందోట పురమున విబుధవరుల కనేకాగ్రహారాదిరములు కల్పించిన కళాపోషకుఁడు.* ఈయన ఔదార్యమును గుఱించియు, ప్రతిభా వైభవమును గుఱించియు ననేక కథలు ప్రచారములోనున్నవి.

శౌనక గోత్రభవులు అఖిలాగమాంతవిదులు అభినవ విశ్రుతకవితా విభవులు, దుర్గా దక్షిణామూర్తి భక్తులునగు తురగారాజకవి, అయ్యంకి బాలసరస్వతియను జంటకవులు మార్కండేయాచార్యుల యాశ్రిత వర్గములోనివారు. 'శాలివాహనశక సంఖ్యాకములునగు పదియేను వందలపై యెనిమిది వత్సరంబుల లోన వసుధాస్థలంబున కుతుబుషాహి నిజాం కుతలనాథు ప్రాభవవేళ మార్కండేయభూపతి ధవశేశ్వరా న్వయభవుఁడు.... పెందోటపురిని నిలిచి.... సప్త సంతానములను గని....' ఈ జంటకవులచే స్కాందపురాణాంతర్గత సనత్కుమార సంహితయందలి విశ్వకర్మ మహిత వైభవాకరమనగు నాగరఖండము నాంధ్రీకరింపఁజేసి కృతినందెను. నాగరఖండ మయిదాశ్వాసములకావ్యము.

మార్కండేయాచార్యులు బెజవాడకు ప్రభువని కొందఱు నిరూపించుట యుక్తియుక్తముగాఁగన్పట్టదు. ఈ జంట కవులలో నొకరగు తురగా రాజకవియును శాపానుగ్రహసమర్థుఁడగు తురగా రామకవియును అభిన్నులని కొందఱు భావించుట విచారణీయము. వీరికి కావ్యమునందలి దొకపద్యము :

> 'కడఁకఁ గనుంగొనంగఁ దొలుకాఱుమెఱుంగులు గ్రుమ్మరింపఁగా
> నడుగిడ గల్లు గల్లుమను హంసకనాదము హంసరావమున్
> దడఁబడఁ బద్మరాగ సముదాయము దావున నేపుచూపి యె
> ల్లెడలఁ బదాగ్రరాగ రుచులీనఁగ వచ్చెను గౌరివేడుకన్' (5–36)

## పెమ్మసానివారు

విజయనగర సామ్రాజ్యమునకు సామంతులుగా, సామ్రాజ్య సేనలో

*రావిపాటి లక్ష్మీనారాయణ, పల్నాటిచరిత్ర, రామకృష్ణ ముద్రాక్షరశాల, నరసరావుపేట, 1953.

సేనానులుగా నుండి ఉదయగిరి రాజ్యములోని గండికోట సీమను పాలించిన పెమ్మసానివారు కమ్మవారు. వీరిది ముసళ్ళ (లేక మసునూళ్ళ) గోత్రము. కడప మండలము జమ్ములమడుగు తాలూకాలో జమ్ములమడుగునకు పడమరగా అయిదాఱు మైళ్ళ దూరముననూ, ప్రొద్దుటూరికి ఇరువది మైళ్ళ దూరముననూ, సముద్రపు మట్టమునకు 1670 అడుగుల యెత్తున పినాకినీ చిత్రావతీ నదుల సంగమ స్థానమునకు దిగువ పెన్నానదికి కుడిగట్టున ఆగ్నేయ దిశలో ఏటి మలుపులో కొండలమీఁదఁ గట్టఁబడిన బలిష్ఠమైన దుర్గము గండి కోట.* గండికోటకు వాయవ్యదిశలో ఇఱుకైన అగాధములో కోసు దూరముమేర గండికోటను చుట్టి పెన్నేఱు ప్రవహించుచున్నది. ఇక్కడ నది వెడల్పు ఇంచుమించుగా ఇరువది బారలు. కొండ క్రిందినుండి కోటయొద్దకు కొండగుట్ట లెక్కుచు నడచినచో ఇంచుమించు ఒక కోసెడు దూరము. కడప మండలములోని బద్వేలు, జమ్ములమడుగు, ప్రొద్దుటూరు, కమలాపురము తాలూకాలు కలిసిన ప్రాంతము గండికోట సీమ. దీనిని పాలించిన పెమ్మసాని వారి చరిత్రమును నిర్మించుటకు ఇనగలూరు, కురివికుళం, గండికోట, తాడి పత్రి, తేళ్ళూరు, తొండూరు, పాలూరు, యాడకి కైఫియత్తులు, పెమ్మసానివారి శాసనములు, చాటువులు, రాయవాచకము, కృష్ణరాయవిజయము మున్నగు సమకాలిక చారిత్రిక రచనములును, పెమ్మసానివారి పోషణమున వెలసిన సాహిత్యమును ముఖ్యమైన ఆధారములు.

ప్రౌఢ దేవరాయల కాలమునుండి రాయసేనానులుగా దుర్గాధ్యక్షులుగా పెమ్మసానివారు ప్రసిద్ధులు. గరుడనారాయణాంక హత్తుమువ్వరగండ హన్ని బ్బరగండ బిరుదవిరాజితులు. పెమ్మసాని తిమ్మానాయఁడు, రామలింగనాయఁడు కృష్ణదేవరాయలకు సమకాలికులు. ఎఱ తిమ్మానాయఁడు సదాశివరాయల కాలముననూ ఇమ్మడి వెంకటపతిరాయల కాలముననూ రాజ్యము చేసినవాఁడు. ఇమ్మడి తిమ్మానాయఁడు ముమ్మడి శ్రీరంగరాయల పాలనము నాఁటివాఁడు. పెమ్మసానివారి వంశములో తిమ్మానాయ నామాంకితులు పలువు రున్నందు వలనను వీరి పాలన కాలములు ప్రస్పష్టము కానందువలనను పెమ్మసాని వంశ చరిత్రను పునర్నిర్మించుట కష్టసాధ్యమైన పని.

ప్రౌఢ దేవరాయల కాలమునాఁటి వెంకటపతినాయఁడు ఈ వంశము వారికి మూలపురుషుఁడుగా సంభావితుఁడు. అనితర సాధ్యములగు రాజకార్య ముల నవలీలగా నిర్వహించి రాయల మెప్పుల నంది యాడకి దుర్గ నిర్మాతగా పేరు పొందినవాఁ డీ తిమ్మానాయఁడు. పెమ్మసాని యను బోనకత్తె స్తన్య పానమువలన పెరిగి పెద్దవాఁ డయినందున మూలపురుషుఁడగు వెంకటపతి నాయఁడు పెమ్మసాని గృహనామకుఁ డయినట్లు యాడకి కైఫియత్తు పేర్కొనుట

* Imperial Gazetteer, Vol. XV, Oxford, 1908, pp. 127, 128.

విశ్వసింపఁదగినదిగాఁ దోఁపదు.

పెమ్మసాని శబ్దమునందలి ఉత్తర భాగమునందలి 'సాని' తెలుఁగువారి గృహనామముల పెక్కింటఁ గన్పట్టుచున్నది. అప్పసాని, అల్లసాని, చలసాని, పెమ్మసాని, లకంసాని, లక్కమసాని మొదలైన యింటి పేళ్లలోని 'సాని'కి అశ్వారోహకుఁడు, అశ్వదళాధ్యక్షుఁడు అని యర్థము. ఈ యింటి పేళ్ళుగలవారి పూర్వులు రాయల రాణువలో దళవాయులుగా పనిచేసి యుండవచ్చు. అశ్వసేన యను నర్థముగల సాహిణీ యను ప్రాకృత భాషాపదము దీనికి సమీప మాతృక. సేన యను నర్థముగల సంస్కృత సాధన శబ్దము మూల మాతృక. సాహిణి మారఁడు ఒక సేనాని యనుట జగమెఱిఁగిన మాట.

ప్రభుభార్య, అంతఃపుర స్త్రీ అను నర్థములుగల సంస్కృత 'స్వామినీ' శబ్దము ప్రాకృతమున సామిణీ, సాణీగా మాఱి తెలుఁగున సానియై వ్యస్తముగ వేశ్య యను నర్థమునను ఎఱుకలసాని, ముదుసలిసాని, రెడ్డిసాని మున్నగు పదములలో స్త్రీ, భార్య అను నర్థములలోను వాడుకపడినది. మీఁది బోనకత్తె కథను విశ్వసించినచో సాని యుత్తరపదముగాఁ గల గృహనామకు లందఱు పెంపక మిల్లే జరిగియుండు ననుట సత్యసమ్మతము గాదు.

పెమ్మసానివారిలో చిట్టచివరి పాలకుఁడు తిమ్మానాయఁడు. ఈయన వెంకటపతినాయని ప్రపౌత్రుఁడు. గిరియప్పనాయని పౌత్రుఁడు. అంకప్ప నాయని పుత్రుఁడు. ఇతనికాలమునందే గోలకొండ నవాబుల సరదారు మీర్ జుమ్లా మోసముతో గండికోటను జయించెను. ఆ పిమ్మట ఆర్కాటు నవాబు పాలించిన అయిదు సర్కారులలో గండికోట ఒకదానికి ముఖ్యపట్టణము. ఆ తరువాత 18 వ శతాబ్దము ఆదిలో కడప నవాబుల ముట్టడి, 1780 లో హైదరాలీ ఆక్రమణము, 1791 లో ఇంగ్లీషు కుంఫిణీ సేనల పశమగుట గండికోట చరిత్రములో ముఖ్య సంఘటనలు.* చెంగల్పట్టు మండలమునందలి కావేటి రాజపురములో నేఁటికిని పెమ్మసానివారి వారసులు ఉన్నారఁట ; 'పెమ్మసాని వంశం కమ్మదనానికీ గడుసుదనానికీ పుట్టిల్లు. వీరిలో వీరరక్తం యెంత కవోష్ణంగా పొంగు లెత్తిందో కావ్య రసలోలుపత్వం అంత మధురంగా చిప్పిలింది.'† పెమ్మసానివారి పోషణలో చెన్నమరాజు చెన్నమరాజు, చిత్రకవి అనంతకవి, ముడియము వెంకటరమణకవి మున్నగువారు ప్రసిద్ధులైన కవులు.

చెన్నమరాజు చెన్నమరాజు (1600—1650) నందవరీకనియోగి. ఆత్రేయ గోత్రుఁడు. సర్వాంబా శేషామాత్యుల పుత్రుఁడు. చెన్నమరాజు పౌత్రుఁడు.

* C.F. Brackenbury, Gazetteer of Cuddapah, Madras, 1915, pp. 191–194.

† గూడవల్లి రామబ్రహ్మం. పెమ్మసాని తిమ్మానాయడు — గండికోట ముట్టడి, పు. 8.

పెమ్మసాని తిమ్మానాయని కీతఁ డాశ్రితుఁడు. ముఖ్యమంత్రి కూడ. వీరి పూర్వులలో నొకఁడగు లక్ష్మీపతి చెన్నమరాజ ప్రధాన శేఖరుఁడు. 'సన్నుత కవిత్వ విద్యాభ్యున్నతి శ్రీనాథ సుకవి పుంగవు కరుణన్ చెన్న'మరిసట్లు చారు చంద్రోదయ ప్రబంధావతారిక ప్రమాణము. చెన్నమరాజు పూర్వులందఱును రాజకార్యదక్షులుగా పే ర్వడసినవారు. తిమ్మానాయని ప్రోత్సాహమున నీతఁడు రచించిన అయి దాశ్వాసములుగల చారుచంద్రోదయమను శృంగారప్రబంధము* తాడిపర్తి పురమున వెలసిన గోపాలకృష్ణున కంకితము. రుక్మిణీ కృష్ణుల కుమారుఁడగు చారుచంద్రుఁడు పుష్కరుఁ డను రాక్షసుని సంహరించి రత్న కేతన పురవరాధీశ్వరుఁ డగు పద్మాకరుని పుత్రిక కుముద్వతి నుద్వాహమాడిన కథ యిందలి యితివృత్తము. ఈ ప్రబంధము నందలి దొక పద్యము :

'పడఁతుకలెల్ల నంత నునుబంగరు చేలలు గట్టి వెండ్రికల్
తడి సడలించి కొప్పులిడి తావులు గుల్కెడుఁ బూపుబెత్తు లిం
పడరఁగఁ బెట్టి మేనఁగలయం గలపంబుఘటించి రత్నపుం
దొడవు లలంకరించి యతినూత్న మృగీమదచిత్రితాస్యలై'

—చతుర్థాశ్వాసము, 54 వ ఆకు, రెండవ వైపు.

లక్షణ సార సంగ్రహ కర్త యగు చిత్రకవి పెద్దన తనయుఁ డగు అనంతకవి ఆముక్తమాల్యదా హరిశ్చంద్ర నలోపాఖ్యానములకుఁ డీకలు వ్రాసి గండికోట దుర్గాధిపతి యగు పెమ్మసాని చినతిమ్మానాయనిచే సమ్మానము లందినవాఁడు. 'గండికోటాఖ్య దుర్గస్థలాధ్యక్షుఁడై పృథ్వి పంతుకు నెక్కు పెమ్మసాని చిన్నతిమ్మ క్షమాపాలశేఖరుండు గౌరవింపఁగ బహుమాన గౌరవముగ మనిన ధన్యుఁడు'. హరిహరశ్లేషోదాహరణము, సకల జీవ సంజీవని, ఇందుమతీ పరిణయము మున్నగునవి అనంత కవి రచించిన గ్రంథములు.

అనంత కవి కుమారుఁడు వెంకటరమణ కవి. సాంబవిలాసము, కుమార గురు విలాసము, అభిమన్యు విలాసము, విద్వత్కవి కర్ణ రసాయన సకల వర్ణనా పూర్ణరామాయణము మున్నగునవి వెంకటరమణకవి రచనములు. అప్పకవి సాంబవిలాసమునుండి నాల్గు పద్యములను లక్ష్యములుగా దన గ్రంథమున నుదాహరించినాఁడు. చిత్రకవి వారు గండికోట సీమలోని వెలలూరు వాస్తవ్యులు. 1510—1560 ప్రాంతమువాఁ డయిన చిత్రకవి పెద్దనకూడ 'ధారుణీశ మాన్యుఁడు' (లక్షణ సార సంగ్రహము. 1—6). చిత్ర కవి వారు భారద్వాజ గోత్రులు. ప్రథమ శాఖీయులు. కాత్యాయన సూత్రులు. రమణకవి రచించిన సాంబవిలాసము నందు సుయోధన పుత్రికకును కృష్ణుని కుమారుఁ

*ఆంధ్ర విశ్వకళా పరిషద్గ్రంథాలయము, తాళపత్రప్రతి 29206, Ms. T 113, C 51 ; ప్రాచ్య లిఖిత గ్రంథాలయ ప్రతులు. D. 512—515.

డైన సాంబునకును జరిగిన పరిణయము వర్ణింపఁ బడినది. ఈతఁడు రచించిన రామాయణము కూడ సలక్షణమైన గ్రంథము.

వెంకటపతిరాయల కాలము (1585–1614) నాఁటి పెమ్మసాని తిమ్మానాయఁడు కూడ కవిపోషకుఁడు. కళాధరోపాఖ్యాన కర్త్రియగు ముడియము వెంకటరమణకవి తిమ్మానాయని యాశ్రితులలో నొకఁడు కవి నందపరీసుఁడు. శ్రీవత్స గోత్రుఁడు. ఓబాంబా వెంకటపతుల పుత్రుఁడు. ఈతని ప్రబంధము దత్తాత్రేయాంకితము.

తేకూరు అగ్రహార వాస్తవ్యులు మల్లుసోమయాజుల కృష్ణశాస్త్రుల కుమారుఁడు కోనంభట్లు వారికి పెమ్మసానివారి వలన తేకూరు శ్రోత్రియముగా చెల్లినది.

## పేరూరు

గోదావరిమండలము కోనసీమలో అమలాపురము తాలూకా అమలాపురమునకు దక్షిణదిశను రెండుకోసుల దూరమున కౌశికీ నదీతీరమున పేరూరు గ్రామమున్నది. బ్రహ్మపురియను నామాంతరమున నీ యగ్రహారము చిరకాలముగ ద్రావిడ బ్రాహ్మణుల కాటపట్టుగనున్నది. పేరూరు జమీందారులు జిల్లేళ్ళ వంశోద్భవులు. పేరూరగ్రహార వాస్తవ్యులు. విశ్వామిత్రసగోత్రజులు. తపస్స్వాధ్యాయ సంపన్నులు. గోలకొండ వ్యాపారితెగకుఁ జెందినవారు. నవాబులను మెప్పించి కోనసీమలో జాలెమూడి మండలమునకు ముజుందారీగిరీని సంపాదించినట్లు చెప్పుదురు. ఇదికాక అమలాపురము తాలూకాలోని విలస, జానుపల్లె, బెజవాడ సమీపమునఁగల కింతాడపాడు వీరి ఎస్టేటులు. వీరి మూలపురుషుఁడు భానుజీరామరుసు. వీరి దత్తకుమారుఁడు రామాజీభానరుసు. తిరుమల వెంకటలక్ష్మీబాయమ్మ, రామాజీభానరుసుల దత్తపుత్రులు వెంకటభానోజీ రామరుసు. వీరు ఆంధ్రవిశ్వకళా పరిషత్తు సెనేటు సభ్యులు; అమలాపురము నందలి కళాశాలా సంస్థాపకాధ్యక్షులు. వీరికి ఆఱుగురు కుమారులు. వీరిలో జ్యేష్ఠుఁడు వేంకట గోపాలరామోజీభానరుసు.

పేరూరి జమీందారుల ఎస్టేటు శ్రీసతికృపార్ద్ర కటాక్షము, శారదా కటాక్షము నొకచోట అరమరికలేక యమరిన సంస్థానమని పండితుల ప్రశంస. వేదవిదులకు, కవిపండితులకు, కళాకారులకు పేరూరు జమీందారులు భూదాన గృహదానములు గావించినవారు. వీరి యాస్థాన విద్వాంసులలో మంథా చన్నయ్యశాస్త్రి, మరువాడ శంభన్నశాస్త్రి, మంథా గోపాలశాస్త్రి మున్నగువారు ప్రసిద్ధులు.

శంభన్నశాస్త్రి (1874–1953) పేరూరునకు చేరువలోగల బుచ్చమ్మాగ్రహార వాస్తవ్యులు. పేరూరు ద్రావిడ బ్రాహ్మణులు. మంథా చన్నయ్యశాస్త్రి

గారియొద్ద కావ్య నాటకాలంకారాదులు పఠించిరి. పిఠాపురాస్థాన పండితులు శ్రీపాద లక్ష్మీనృసింహశాస్త్రిల సాన్నిధ్యమున న్యాయశాస్త్రము నభ్యసించిరి. అభినవగౌతమ, తర్క-వేదాంత విశారద అనునవి వీరి బిరుదులు. ఉర్లాము, కసింకోట మున్నగు సంస్థాన పండితసభలలో బహుమతులఁ బడసినవారు. వేంకట భానోజీరామరుసు ప్రభుపోషితులు. శాస్త్రిగారు దాదాఁపు ఏఁబదియేండ్లు పేరూరు సంస్థానమున పండితులు. కొల్లూరి సోమశేఖరశాస్త్రి. వేదాంతం శేషాద్రిశాస్త్రి. నౌడూరి కామేశ్వరశాస్త్రి. మంథా గోపాలశాస్త్రి వీరి శిష్యులు. సంస్కృత పద్మపురాణమునందలి ఆదిమభూమి బ్రహ్మఖండములను మూఁడు ఖండములు ఆంధ్రవచనమున శాస్త్రిగారిచే అనూదితములు. వెంకట భానూజీ రామరుసు జమీందారుగారి తల్లిగారగు తిరుమ॥ వెంకటలక్ష్మీబాయమ్మగారి ప్రేరణమున నీకృతి యవతరించినది.*

చన్నయ్యశాస్త్రియను వ్యవహారనామముగల మంథా చంద్రశేఖరశాస్త్రి పేరూరు ఆస్థాన విద్వాంసుఁడు. ప్రసిద్ధ జ్యోతిశ్శాస్త్ర వేత్తలగు మంథా గోపాల శాస్త్రిగారు నేఁటికిని పేరూరు జమీందారుల అస్థాన పండితులు. మరువాడ శంభన్నశాస్త్రిగా రాంధ్రీకరింపఁగా వదలిన పద్మపురాణ ఖండములను తెనిఁగించుట పద్యమించి అందలి జాలంధరోపాఖ్యానము మాత్రము తెనిఁగించి విరమించిరి. అనూదితభాగ మింకను ముద్రణము నందలేదు.

అమలాపురము కళాశాలలో ఆంధ్రాధ్యాపకులగు పక్క-లంక లక్ష్మీపతి రావు రచించిన పారిజాత సౌరభ్యమను పది యుల్లాసముల ఆధునికాంధ్ర పద్య కావ్యము కళాశాలా సంస్థాపకులును, పేరూరు జమీందారులును నగు వేంకట భానోజీరామరుసుగారి కంకితము. కృష్ణదేవరాయలు గజపతి తనయను పరిణయమాడిన కథ యీ కావ్యశరీరము.

అల్లవరముగ్రామ నివాసులయిన కామవరపు సూర్యనారాయణగారు వేంకట భానోజీరామరుసుగారి పేరుమీఁదుగా నొకదండకమును రచియించి కృతి యిచ్చిరి.

గంటి సోమశేఖర సోమయాజులు, గంటి అబ్బాయి సోమయాజులు, గంటి లక్ష్మణ సోమయాజులు మున్నగు వేదపండితులు సైతము పేరూరు జమీందారుల సత్కారములనందిరి.

'సాధులు కానివారలు, రసజ్ఞత నేరనివారు, వేద వా
గ్బోధము లేనివా, రతిథిపోషణ మూననివారు, పండితా
రాధనఁ ద్రోయువారు, బుధరంజన సేయనివారు తద్ద్విజ
క్ష్మాధవులందు మచ్చునకుఁ గల్గరు నాఁడును నేఁడు నారయన్'

అను కీర్తి పేరూరు జమీందారులది. వంశక్రమాగత వర్షాశనములు చెక్కు-

* సాధన గ్రంథమండలి, తెనాలి, 1952.

చెదరకుండ నేఁటికిని చెల్లుబడి యగుచున్నవఁట.

వేంకట ధానోజీరామర్సుగారి వితరణగుణమునకు, విద్యాపోషణమునకు అమలాపురము కళాశాల చక్కని తార్కాణము.

## పేర్లవారు

విశాఖపట్టణము గోడే జమీందారుల వారసులయిన అంకితము జమీందారుల వంశీయులనుండి షేక్ మొహమ్మదుపురము జమీందారీలోని కొంత భాగమును విజయనగర వాస్తవ్యులగు పేర్లవారు ఎనిమిదిలక్షల రూపాయిలకు విక్రయించికొనియుండిరి. దీనికే చినవాల్తేరు ఎస్టేటు అనివాడుక. పేర్లవారు విజయనగరమునందలి వైశ్య కులోత్తములలో ప్రధానులు. విశాఖపట్టణము లోని శ్రీధరలవారు, గూటాల జమీందారులు మన్యమువారు వీరి సమీప బంధువులు. శ్రీధరలవారి యాఁడుఁబడుచు గూటాల జమీందారిణి మన్యము మహాలక్ష్మమ్మ. ఈమె చెల్లెలు పేర్లవారి కోడలు. రావుసాహెబ్ పేర్ల రామమూర్తిశ్రేష్ఠిగారు విజయనగర సంస్థానపాలకుఁడగు ఆనందగజపతిచే 'మహాజన్' అను సార్థకబిరుదము నొందినవారు. విశాఖపట్టణములోని కేంబెల్ పుస్తక భాండాగారము రామమూర్తిశ్రేష్ఠిగారి వితరణగుణము వలన అవతరించినది. అదే టౌనుహాలు లైబ్రరీ. ఆలన పాలన సన్నగిల్లుటవలనఁ గాఁబోలు ఇటీవల నిది విశాఖపట్టణము కేంద్ర గ్రంథాలయమునకు తరలింపఁబడినది. రామమూర్తిశ్రేష్ఠిగారు అన్నసత్రములు నెలకొల్పి విజయనగరములో విక్టోరియా మహారాజ్ఞి స్మారకభవనమునకు ధనసాహాయ్యము గావించిరి.

వీరి భార్య జమీందారిణి అన్నపూర్ణమ్మగారు. విజయనగరమున స్థాపితమయిన ఆంధ్ర విజ్ఞానసమితి యను గ్రంథప్రచురణ సంస్థకు ఆర్థికముగా చేయూఁతనిచ్చి మృత్యుంజయ విలాసాద్యాంధ్ర కావ్యములు వెలుఁగునకుఁ గొనితెచ్చిరి. ఈమె దత్తపుత్త్రుఁడు సత్తెయ్యశ్రేష్ఠి. సత్తెయ్య పుత్త్రులు నారాయణశ్రేష్ఠి. రామతీర్థమున వెలసిన సీతారామచంద్రమూర్తికి రజతాస్థాన మందిరమును గట్టించిరి.* పేర్లవారు కపిలేశ్వరపురములోని హిందూధర్మశాస్త్ర గ్రంథనిలయము, బరంపురములోని వేఁగుఁజుక్క గ్రంథమాల మున్నగు సంస్థలకు పోషకులుగానుండి తమ సాహిత్యాభిమానమును బ్రకటించిరి.

## ప్రాకుటూరు

కృష్ణా తుంగభద్రా సంగమస్థానమునకు మీఁదుగా నాలుగు క్రోసుల దూరమున కర్నూలు పట్టణమునకు నెదుటియొడ్డున తుంగభద్రానది ఉత్తర తటమున తెలంగాణమునందలి మహబూబు నగర మండలములోని యొక

* గంటి సూర్యనారాయణశాస్త్రి, రామతీర్థ చరిత్ర, పు. 44.

ప్రాచీనపట్టణము అలంపురము. దోణాచలము--సికిందరాబాదు రైలుదారిలో కర్నూలు తర్వాతి మజిలీ యిది. బాదామిచాళుక్యులు, రాష్ట్రకూటులు, కళ్యాణి చాళుక్యులు, కాలచుర్యులు, కాకతీయులు, విజయనగర రాజులు ఒకప్పుడు ఈ ప్రాంతమును పాలించినవారు. తర్వాత కుతుబుషాహీలు, వారికి దరిమిలా కొంతకాలము మొగలు పాదుషాలు దీనిమీఁద ప్రభుతను నెఱపిరి. ఆ పిమ్మట మొగలు సామ్రాజ్యము క్షీణించుటతో స్వతంత్రుఁడయిన నిజాము పాలనము నకు లోఁబడినది. గోలకొండ నవాబులకు సామంతులుగా రెడ్డి బిడ్డలయిన బిజ్జుల వంశమువారీ సీమను ప్రాకుటూరు రాజధానిగా పాలించిరి. అలంపురము తాలూకాలోని యొక గ్రామము ప్రాకుటూరు.

ప్రాకుటూరి పాలకులగు బిజ్జులవారు రెడ్లలో మోటాటి తెగకు చెందిన వారు. వీరిది వెన్నూళ్ళ గోత్రము. కందనవోలి దేశము వీరి కాణయాచి. దాద భూపాలుఁడు వీరి కోవలో కొలికిపూస. ఇతని కయిదవతరమువాఁడును, ఆంధ్రా నర్ఘ రాఘవ కృతికర్తయు నగు బిజ్జుల చినతిమ్మభూపాలుఁడు పదునేడవు శతాబ్ది నుత్తరార్ధమువాఁడు. చినతిమ్మయ తాతయగు పెదతిమ్మయ గోలకొండ నవాబు లచే సామంతుఁడుగా సమ్మానితుఁడు. 'సిరుల నొప్పు నలంపూరి సీమరెల్ల నాడ గౌడును దేశాయి నాడ కరణము'. కర్నూలు పట్టణములోని కొండారెడ్డి బురుజు నకు కారణపురుషుఁడయిన కొండారెడ్డి చినతిమ్మయకు పినతండ్రి వరుస. బిజ్జుల కుప్పన వీరి కూటస్థుఁడు. కుప్పన కొడుకు ఎఱుగొండక్ష్మాపతి. ఇతని కుమారుఁడే పెదతిమ్మయ. పెదతిమ్మయ పెద్దకుమారుఁడు కృష్ణరాయలు. బచ్చమాంబా కృష్ణరాయల తనూజుఁడు ప్రకృత కావ్యకర్త చినతిమ్మభూపా లుఁడు. ప్రాకుటూరి పాలకులు వనపర్తి ప్రభువులకు దగ్గఱి చుట్టములు. వనపర్తి ప్రభువు జనుంపల్లి వెంకటరెడ్డికి చినతిమ్మయ దౌహిత్రుఁడు; అష్ట భాషాకవి బిరుదాంకితుఁడగు వనపర్తి గోపాలరాయలకు మేనల్లుఁడు. చిన తిమ్మయకు అక్కమాంబ, పేరమాంబ యని యిరువురు భార్యలు.

గీర్వాణ నాటకములను దెలుఁగు చేయుచోఁ బ్రాచీనాంధ్ర కవులు వానిని శ్రవ్య ప్రబంధములుగాఁ గూర్చుచు వచ్చిరి. కాళిదాసుని యభిజ్ఞాన శాకుంతలమును, రాజశేఖరుని విద్ధసాలభంజికయును, కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయమును, జయదేవుని ప్రసన్న రాఘవమును దెలుఁగున శ్రవ్య ప్రబంధములుగా సంధానింపఁబడినవి. దృశ్యకావ్యములను శ్రవ్యకావ్యములుగా మలఁచు మన కవుల పరిపాటి ననుసరించియే కాఁబోలు చినతిమ్మయ సయితము బాల వాల్మీకి బిరుద విరాజితుఁడగు మురారి మహాకవి సంస్కృతమున రచి యించిన అనర్ఘ రాఘవ రూపకమును యథామాతృకముగా ఎనిమిది యాశ్వాస ముల పద్య ప్రబంధముగా నాంధ్రీకరించినాఁడు. తిమ్మయకు కృష్ణకవి యను విద్వత్కవి నన్నయకు నారాయణభట్టువలె నాంధ్రీకరణమునందు సాయపడిన

వాఁడఁట :

'అతనికిఁ బౌత్త్రుఁడై యసదృశాఖిలవిద్యలఁ బ్రౌఢిఁగన్న యా
యతమతి కృష్ణసత్కవి సహాయ కవిత్వ మనస్సమాజ సం
తత భజనాదరుండనగు నాకు నశేషవిశేష వైదుషీ
ప్రతిభ కరస్థలామలక భాస్వరమై తనరారు టబ్రమే'

చినతిమ్మయ విద్యాగురువు 'నిస్సమసారస్వత నిర్మలామృత ఝరీ జాగ్రత్తరంగాబ్ధి పేరమహాసత్కవి'. ఈ పేరయ పౌత్త్రుఁడగు కృష్ణకవియే చినతిమ్మయకు కవితా వ్యవసాయమున తోడ్పడినవాఁడు. మునియాగ రక్షణము మొదలుగా రామపట్టాభిషేకముదాఁకఁగల రామాయణ కథ యిందు వివృతము. అనువాద విధానమును, కవితా రీతియును పండిత హృదయరంజకముగా నున్న వనియు, అతిప్రౌఢమయిన గీర్వాణకృతి కిది యనురూపమైన యనుకృతి యనియు సాహిత్య దార్శనికుల యభిప్రాయము. ఇది ప్రాకుటూరి రామేశ్వరున కంకితము. ఈ ప్రబంధము ముద్రితమని మిత్త్రులు గడియారము రామకృష్ణ శర్మగారు చెప్పఁగా వినుటయేకాని ముద్రిత ప్రతి నాకు లభ్యము గాలేదు.*

ప్రాకుటూరి రామేశ్వరస్వామి యనుపమోత్సవ సందర్భములయందు 'నానాదేశ సమాగతులగు కవిజనులు నానారసోద్యత్ప్రబంధానీకము' గూర్చి చర్చలు నిర్వహించెడివారఁట.

## బంగారిపాలెము

ఈ సంస్థానపాలకులు హస్తినాపురమునుండి వచ్చిన చంద్రవంశీయుల సంతతివారఁట ! అగ్గితిమ్మప్పనాయనివారు వీరి పూర్వులలో నొకఁడు. విజయ నగర చక్రవర్తులకు నీతఁడు పదునాలవ శతాబ్ది మధ్యభాగమున నమ్మినబంటుగా, పాళయప్పట్టు దొరగా ప్రవర్తించినవాఁడు. అక్కప్పనాయఁడు, తాతినాయఁడు, పాపానాయఁడు (వెంకటప్పనాయఁడు), వీరప్పనాయఁడు, ఎఱప్పనాయఁడు పాళయప్పట్టు దొరలుగా ప్రసిద్ధులు, చంద్రగిరి రాజ్యముపై దండెత్తిన ఓఢ్ర గజపతులతోడి యుద్ధములలో విజయనగర ప్రభువులకు తోడ్పడి చక్రవర్తుల నుండి కలికితురాయి సింహతలాటాది వీరాంకన బహుమతులను బడసినవాఁడు వెంకటప్పయనాయఁడు.

పదునేడవ శతాబ్ది మధ్యభాగమువాఁడగు అన్నప్ప పెరుకూరు జాగీరును సంపాదించినవాఁడు. ఇతని కాలముననే మొగలు పాదుషాలకు సామంతులగుట జరిగినది, పదునెనిమిదవు శతాబ్దియందు కర్ణాటకము సుబాలోని మొగలు వైస్రాయి యగు నవాబ్ సాదతుల్లాఖాను నుండి వీరి వంశీయుఁడగు బంగారు నాయనికి రాజా బహద్దరు బిరుదము లభించినది. ఈతఁడే బంగారిపాలెము

*R. No. 629, ప్రాచ్య లిఖిత గ్రంథాలయ ప్రతి.

నిర్మాత. ఈ గ్రామ నామమునుబట్టియే సంస్థానమున కీ పేరు సంక్రమించినది. ఈతని తర్వాత వెంకటప్పనాయఁడు, వీరప్పనాయఁడు, చంద్రశేఖరనాయఁడు, వెంకటవీరప్పనాయఁడు, చంద్రశేఖరనాయఁడు బంగారిపాలెము పాలకులు.

1804 లో బంగారిపాలెము ఇంగ్లీషు కుంఫిణీ స్వాధీనమునకు వచ్చినది. చంద్రశేఖరనాయని కుమారులలో నొకరగు పెద్దరామప్పనాయకునికి నెలవారీ 'లవణసు' నిచ్చుచు వచ్చిరి. కాని యితని తనయుఁడగు రామదాసప్పనాయనికి ఎస్టేటును తిరిగి ప్రసాదించిరి. ఈతని కుమారుఁడు శేషాచలపతిరాజు తర్వాతి జమీందారు. 1905 లో శేషాచలపతిరాజు మరణింపఁగా నీతని తమ్ముఁడగు వెంకటప్పనాయఁడు జమీందారయ్యెను.*

వీరు సప్త సంతాన ప్రతిష్ఠాపయితలు.

## బంటుమిల్లి

తూర్పుగోదావరిమండలము అమలాపురముతాలూకా పల్లంపట్టుప్రాంతములోనున్న 'తురకపాపరము'నకు చేరిన చిన్న ఎస్టేటు బంటుమిల్లి. శాశ్వత కర నిర్ణయమునకు తర్వాత నీ ఎస్టేటు గామోజీవారి కుటుంబమునకు దఖలు పడినది. ఈ ఎస్టేటుదారులు గార్గేయసగోత్రజులయిన మధ్వబ్రాహ్మణులు. గామోజీ హనుమంతరావుగారు వీరి మూలపురుషులు. హనుమంతరావుగారి పుత్త్రులు నరసింహారావుగారు. వీరికుమారులు అన్నాజీరావుగారు. వీరి దత్తపుత్త్రులు నరసింహారావుగారు. వీరికుమారులు వరప్రసాదుగారు. 1895 వరకు ఈ ఎస్టేటు అవిభక్తముగా నుండినది. ఆ తర్వాత అనేకభాగములయి మూలశాఖవారికి ఎస్టేటులోని ఒకపంతుమాత్రము మిగిలినది. అన్నాజీరావుగారి కాలమునందే యీ పంపకములు జరిగినవి. తర్వాత జమీందారీరద్దుచట్టము ప్రకారము ఈ ఎస్టేటు అంతరించినది.

బంటుమిల్లి ఎస్టేటు చాల చిన్నదయినను ఈ జమీందారుల కవిపండిత సమాదరణము, విద్యాపోషణము పరిగణింపఁదగినవి. బంటుమిల్లిగ్రామములో వెనుకటి జమీందారుగారిపేర గ్రంథాలయభవనము నిర్మించి దానికి కొన్ని వేల విలువగల సామగ్రిని, గ్రంథములను బహూకరించిరి. వేదవిదులను, సంస్కృతాధ్యయనతత్పరులగు విద్యార్థులను వీరు పోషించిరి.

## బుచ్చిరెడ్డిపాళెము

నెల్లూరుమండలమునందలి రెడ్లసంస్థానమిది. దొడ్లా యనుపేరుగల రెడ్డి కుటుంబమువా రీ సంస్థానపాలకులు. దొడ్లావారికుటుంబము క్రీ.శ. 1700

* A. Vadivelu, Ruling Chiefs, Nobles and Zamindars of India, pp. 642–645.

ప్రాంతమున ఉత్తరసర్కారులనుండి వలసవచ్చి యిచ్చట స్థిరపడినదని కొందఱ యభిప్రాయము. వీరు దక్షిణాదినుండి వచ్చిరనియు, చెంగల్పట్టు మండలమునందలి గుమ్మడిపూడిచెంతఁగల నెక్కొంఁద్ర మను గ్రామము వీరి యభిజనమని మఱికొందఱ నిరూపణము.*

బుచ్చిరెడ్డిపాళెమును, దీని చుట్టుపట్టులనున్న మఱికొన్ని గ్రామములను మొట్టమొదట దొడ్లా అన్నారెడ్డిగారు కుంఫిణీసర్కారునుండి కౌలునకు తీసికొని సర్వ వ్యవహారములను స్వయముగా పర్యవేక్షించుచు క్రమక్రమముగా ఎస్టేటును వృద్ధిచేయుచు వచ్చిరి. అన్నారెడ్డికుమారుఁడు రాఘవరెడ్డి. వీరి కుమారుఁడు రామారెడ్డి. ఇతఁడు ఉదయగిరితాలూకాలోని శ్రోత్రియగ్రామమగు గొట్టికొండలిని, దువ్వూరిసీమలోని మఱికొన్ని భూములను సంపాదించెను. ఇట్లు అంచెలంచెలుగా విస్తరించుచు పెంపొందిన యీ ఎస్టేటు నిర్వహణము పలువురు ప్రముఖుల దృష్టిలో పడినది. ఆనాఁటి ఆర్కాటునవాబు దొడ్లావారి కుటుంబముయొక్క ప్రాధాన్యమును గుర్తించి సత్కరించెనఁట.

రామారెడ్డిగారు బుచ్చిరెడ్డిపాళెములో కోదండరామస్వామి కోవెలను, సంగంలో సంగమేశ్వరదేవాలయమును, చెన్నూరులో శివాలయమును నిర్మించి వాని సక్రమ నిర్వహణమునకు వలయు నీనాముల నేర్పఱిచిరి. రామారెడ్డి ప్రభుత్వమువారి రెవిన్యూమొత్తములనుగూడ వసూలుచేయుచుండిరి. ఆయన యానాఁడు వసూలుచేసెడి మొత్తము ఆఱులక్షలదాఁక నుండెడిదఁట. ఆ పిమ్మట నాయన పెన్నారుడెల్టాప్రాంతమున కంతటికిని రెవిన్యూ ఉద్యోగులుగా నియమితులయి యెనుబదియైదేండ్ల వయస్సున మరణించిరి.

రామారెడ్డిగారు నిస్సంతగుటవలన వారి తమ్ములు నరసింహారెడ్డిగారు, వారితర్వాత అల్లుఁడగు వెంకటరామారెడ్డిగారును వరుసగా ఎస్టేటుపాలనమును నిర్వహించిరి. వీరి కుదురులో ముఖ్యులయిన పట్టాభిరామారెడ్డిగారు ఉదయగిరి నవాబు గొడవలలో ప్రభుత్వమునకు తోడ్పడి వారి మెప్పులనందిరి. ప్రభుత్వము వారు పట్టాభిరామారెడ్డి తోడ్పాటున కనురూపముగా 1842లో ఉదయగిరి తాలూకాలోని సోమవరప్పాడు అను శ్రోత్రియమును ప్రసాదించిరి. వీరితర్వాత పంపకములవలన ఎస్టేటు పెక్కు చీలికలయినది ఆ పిమ్మట రామచంద్రారెడ్డి, వెంకటరామారెడ్డి, వరదారెడ్డి, శేషారెడ్డి, సుబ్బారెడ్డి మున్నగువారు ఎస్టేటు పాలకులు.

దొడ్లావారు ప్రాచీనసంస్కృతి సముద్ధరణమునందే కాక సాహిత్య పోషణమునందును ఆసక్తిని ప్రదర్శించినవారు. 19వ శతాబ్దియందే దొడ్లావారు 'శారద' యను సాహిత్యపత్రికను నిర్వహించిరి. దొడ్లావారి యాస్థానపండితుఁడు

*విక్రమసింహపురిమండలసర్వస్వము, ద్వితీయఖండము, పుటలు 82, 83. కాని పవరణలో చెంగల్పట్టుమండలములోని పూనమల్లి దొడ్లావారి తొలిపీఠని నిర్ధారితము.

కొండూరు తాతయాచార్యులు గొప్ప వైయాకరణులు. సమస్యాపూరణము వీరి కభిమాన విషయము. వీరి నాదరించిన దొడ్లా వెంకటరామారెడ్డిగా రముద్రిత గ్రంథ చింతామణి యను సాహిత్యపత్రికకు పోషకులు. కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారిని దొడ్లావా రాదరించిన తీరు జగమెఱిఁగిన విషయము.

## మట్లివారు

విజయనగర చక్రవర్తుల అమరనాయకులుగా, అంతరంగికులుగా, మహామండలేశ్వరులుగా మధురాంతక పొత్తపినాటి కధిపతులుగా సిద్ధవటము సీమనుపాలించి ప్రశస్తిగాంచినవారు మట్లివారు. కకుత్స్థ విజయాభిషిక్త రాఘవ కుముద్వతీ పరిణయాద్యాంధ్ర ప్రబంధముల కృత్యవతారికలు, కయిఫీయత్తులు మట్లివారి చాటువులు, శాసనములు వీరి చరిత్రము నెఱుఁగుట కాధారసామగ్రి. రాయసింహాసనముపై తిరుగుబాటొనర్చిన సామంతుల నణఁచుటచే చంద్రగిరి రాజ్యమునందలి పులుగునాటి సీమకు, ఉదయగిరి రాజ్యములోని పొత్తపినాడు, సిద్ధవటము సీమలకు అమరనాయంకరము వీరికి ప్రాప్తమయినది.[1] కడప మండలము తూర్పుప్రాంతములో విస్తరించిన కడప, బద్వేలు, రాజంపేట, సిద్ధవటము తాలూకాలభాగము మట్లివారు పాలించిన సీమగా పరిశీలకుల అభిప్రాయము. కోడూరునకు రెండుకోసులలోఁగల ఎఱ్ఱగుంట్లకోట, కోడూరునకు నాలుగు పరువుల దూరములోఁగల నగరిపాడు, రాజంపేటకు చేరువనుగల చిట్వేలి, సిద్ధవటములలో మట్లివారికి దుర్భేద్యములయిన దుర్గములుండినవి. రాజంపేట సమీపమునఁగల అనంతరాజపురము కొంతకాలము వీరి రాజధాని.[2]

తొలుత వీరి యింటిపేరు వంగలివారు. కడప మండలము రాయచోటి తాలూకా రాయచోటికి ఈశాన్యదిశలో రెండుకోసులదూరమున మాండవ్యనది యొడ్డునఁగల మట్లియను జనపదము వీరితరువాతి యభిజనము. ఈగ్రామ నివాసము కారణముగా అనంతరకాలమున వీరికి మట్లివారను నింటిపేరు సిద్ధించినది.[3] మట్ల, మట్టిలి యనునవి దీనికి రూపాంతరములు. మట్లివారు వైష్ణవ మతానుయాయులు. శ్రీమత్తిరుమల తోడప్పాచార్య చరణ సరసీరుహ సేవాసమారబ్ధ సామ్రాజ్యధౌరేయులు. కాశ్యపగోత్రులు. తెలుగుచోడ శాఖకు చెందిన సూర్యవంశ క్షత్రియులు. ఒరయూరు చోడులకంటె పొత్తపిచోడుల కంటె వీరు భిన్నులని పరిశోధకుల నిర్ణయము,[4] వీరు చోళభూపతుల సామంతు

[1] C. F. Brackenbury, Cuddapah District Gazetteer, Madras, 1915, pp. 38 – 40.

[2] Madras Epigraphical Report for 1916, para 75.

[3] Tirupati Epigraphical Report, pp. 320 – 322.

[4] Tirupati Devasthanam Epigraphical Report, p. 268.

లని మరికొందఱి యభిప్రాయము.* బొమ్మరాజు అను వ్యవహారనామముగల దేవయచోడఁడు వీరి మూలపురుషుఁడు.

గుత్తిసీమ వీరి మొదటి కాణయాచి. బొమ్మరాజునకు సోమరాజు, తిమ్మరాజు అను నిరువురుపుత్రులు. సోమరాజు పౌత్రుఁడగు వరదరాజు కృష్ణదేవరాయల అల్లుఁడని ప్రతీతి. తిమ్మరాజు కుమారుఁడు కోనరాజు. కుటుంబములో చెలరేఁగిన కొన్ని గొడవలవలన కోనరాజు నేఁటి కడప మండలము రాయచోటి తాలూకాలోని పుట్లిగ్రామమునకు తరలివచ్చి స్థిరపడె నఁట. చిన్నాంబా కోనరాజుల పుత్రుఁడు తిమ్మరాజు. ఈ తిమ్మరాజునకు రెండవభార్యయగు ఓబాంబవలనఁ గలిగిన జ్యేష్ఠ పుత్రుఁడు ఎల్లమరాజు. ఈతడు విజయనగర చక్రవర్తులకు తలలోని నాలుక. సిద్ధవటముసీమ పాలకుఁడగు కొండరాజు తిరుపతిరాజు తిరుగుబాటుచేయఁగా రాయల యానతిని తిరుపతిరాజు నణఁచుటచే ఎల్లమరాజు కాలమున సిద్ధవటముసీమ పుట్లివారికి సంక్రమించినది.

ఎల్లమరాజు ఐదుగురు కొడుకులలో కడగొట్టువాఁడు రంగాంబ సుతుఁడు అనంతుఁడు (1550-1614). ఈతనికే పెద్ద అనంతరాజని వ్యవహారము. ఇతడు ఇమ్మడి వెంకటపతిరాయల (1572–1614) కాప్తుఁడు. ఇతని కుమారుఁడు తిరువెంగళనాథుఁడు (1624) బిజాపుర రాజ్యలమును ప్రక్కలించి ఉదయాద్రి, కామలాపురము, పోరుమామిళ్ళ బద్దివోలు పట్టణములను సాధించిన వాఁడఁట.† ఇతనికి చెన్నమాంబవలన కుమార అనంతరాజు (1624–1636), ఎల్లరాజు, చిన్న అనంతరాజు, కోటి రఘునాథరాజు, వెంక టాద్రియని యేవురు కుమారులు. కుమార అనంతరాజు దిగువ తిరుపతిలోని గోవిందరాజస్వామివారి దేవాలయగోపురము నిర్మాత ‡; కకుద్గిరికళ్యాణకృతి ప్రణేత.

చిన్న అనంతుని మూఁడవ కుమారుఁడగు అనంతుఁడు (1636–1650) కుమార అనంతునకు దత్తుఁడు ఈతని కాలముననే మీర్‌జుమ్లా దాడి జరిగినది. అనంతునకు కృష్ణమాంబవలన అనంతరాజు, వెంకటరామరాజు అని యిద్దరు పుత్రులు. అనంతరాజు ననంతరము అతని తమ్ముఁడగు వెంకట

* వేదము వెంకటకృష్ణశర్మ, తెలుగుచోళ భూపతులు, పుట్ల సామంతులు, భారతి, 1960 మార్చి, పుటలు 17–24.

† Madras Epigraphical Report for 1916, para 75.

‡ కపిస్థలము కృష్ణమాచార్యులు, దిగువతిరుపతి గోపురమును గట్టించినవారు, ఆంధ్ర సాహిత్యపరిషత్పత్రిక, రౌద్రి 1920, చైత్ర వైశాఖములు సం. 9, పుటలు 43, 44; 'విజయనగరరాజ్యము తర్వాత మట్ల మైసూరు తంజాపుర్యాది రాజ్యములు....స్వామి కెన్నో కైంకర్యములు జరపినవి' వేటూరి ప్రభాకరశాస్త్రి, అన్నమాచార్య చరిత్ర పీఠిక, తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణము, 1966, పు. 121.

రామరాజు (1683–1700) పాలకుఁడు; ఇతఁడు మొగలులకు సామంతుఁడు. ఇతని తరువాత అనంతరాజు కుమారుఁడయిన తిరువెంగళనాథుఁడు (1700 – 1710) సిద్ధవటము ప్రభువు. ఇతనికి మంగమాంబవలన రాఘవరాజు, వెంకట రామరాజు (1710–1711) అని యిద్దఱు పుత్రులు. అనంతరాజు సోదరుఁడగు వెంకటరామరాజు (1683 – 1700) జ్యేష్ఠ పుత్రుఁడు కుమార అనంతుఁడు. (1712 – 1729), ద్వితీయుఁడు అనంతరాజు (1728 – 1730) కడప నవాబులకు లోఁబడిన పాలకులు. మట్లివారికి కార్వేటి నగరపాలకులకు వియ్యములుండినవి. ఈ శతాబ్దారంభమున కార్వేటి నగరమునేలిన తిరుమలరాజు పట్టపురాణి మట్లివారి యాఁడుఁబడుచు. 1930 నాఁటి వెంకటపతిరాజు మట్లివారి కుదురులో చివరివాఁడు.

వీరి వితరణగుణమునకు, విద్యాసముద్ధరణమునకు వారిపై గల నూఱారు చాటుపద్యములు చక్కని తార్కాణములు. వీరి కుదురున కవులును కవిపోషకులును వర్ధిల్లిరి. రంగాంబా ఎల్లమరాజుల కుమారుఁడగు మట్లి అనంతభూపాలుఁడు విబుధస్తుత కకుత్స్థ విజయప్రబంధాది కావ్యనిబంధన గ్రంథకర్త. ఇతఁడు భవమౌళి ధునీలహరీ ఘుమఘుమిత వచోమహితంబులగు సరసకృతులు చెప్పనేర్చినవాఁడు. కకుత్స్థ విజయము అయిదాశ్వాసముల ప్రబంధము. ఇక్ష్వాకుని మనుమఁడయిన కకుత్స్థుని యభ్యుదయ మిందభివర్ణితము. ఇది అనంతభూపాలుని తండ్రియగు ఎల్లమరాజున కంకితము. ఎల్లమరాజు ఆస్థానమున విద్వత్కవియగు ఉప్పుగుండూరి వెంకటకవి కకుత్స్థ విజయమునకు కృతిప్రేరకుఁడు. అనంతరాజు సవతిసోదరుఁడును దావెమాంబ కుమారుఁడును నగు కోనరాజును కవియఁట!*

హాస్య కళాధురంధరుఁడని పేర్వడసిన కుందవరపు కవిచౌడప్ప మట్లి నరపాలునిఁ గొల్చి పన్నెకెక్కిన కవిగా కవిచౌడప్ప శతకము సాక్ష్యము.

మట్లి తిరువేంగళనాథుని పుత్రుఁడగు కుమార అనంతరాజు కుముద్వతీ కల్యాణ ప్రబంధకర్త. బుధులెల్లరును శేషభోగేంద్రుఁడని కొనియాడఁదగినవాఁడు కుమారఅనంతుఁడు. కుమార అనంతుఁడు విద్యాభోజబిరుద విరాజితుఁడని కుమారానంతభూపాల విజయప్రశస్తి నిరూపించుచున్నది. కాశీరాజతనయ యగు కుముద్వతిని శ్రీరామచంద్రుని తనయుఁడగు కుశుఁడు పరిణయమాడిన గాథ ఈ ప్రబంధమున నిబంధింపఁబడినది. తిరువెంగళనాథుని తండ్రియగు అనంతరాజుకూడ బుధచకోరముల పోషణమువలన సరసకవిరాజ బృందముల

* డా. నేలటూరి వెంకటరమణయ్య, 17-వ శతాబ్దినాటి ఆంధ్రవాఙ్మయ విశేషాలు, వాఙ్మయవ్యాసమంజరి, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు, 1967, పుటలు 340–347.

సన్నుతిని గాంచినవాఁడు.

విద్యారణ్యోత్సవ నైయాయిక చక్రవర్తియును, గురుశబ్దజ్ఞాన ధౌరేయుఁడు (రాఘవాభ్యుదయము, 1—100) ను చింతలపల్లి జోగయ్య కవిపౌత్రుఁడును, మూర్తి కవిపుత్రుఁడును నగు వీరరాఘవుఁడను విద్వత్కవి మట్ల అనంతరాజు గారి యాస్థానమున పండిత సమక్షమున జరిగిన వేదపరీక్షలో నెగ్గి జయపత్రిక నంది వేయిచక్రములను బహుమతిగా బడసినవాఁడని 'ఎవఁడు వేదపరీక్షలిచ్చి మట్ల యనంతరాజుచేఁ గొనియెఁ జక్రములువేయు....' అను మధురవాణీ విలాసకృత్యవతారికా పద్యమువలన స్పష్టపడుచున్నది.

నడిమింటి వెంకటపతి కవికృతమగు అభిషిక్త రాఘవమను ప్రబంధము పండితలోలుఁడగు మట్లి వెంకటరామరాజు (1683 1700) న కంకితము.* అభిషిక్తరాఘవ ప్రస్తావన భాగముమాత్ర ముపలబ్ధము. భోజకృతమగు రామాయణచంపువున కిది యనుసరణమని పరిశోధకుల తలంపు. అవతారికలో మట్లవారి వంశక్రమ మభివర్ణితము. కవి ప్రబంధరచనైక ధురీణమనః ప్రసాదముగలవాఁడు. సకలశాస్త్రము లుపన్నరరాజమూర్తులై మనకోవిదులు ప్రసంగములుసేయ పేరోలగమున్న మట్ల తిరువేంగళాధినేత 'సరసిజ గుంఫిత సత్కవి కవితామృత రసములింపు మిటియింపఁగ....' '....విర్జిత భాషాంధ్రకృతు లాంధ్రకావ్యములుగాఁ జవులూరఁసేయు నేర్పరి' యగు కవినిజూచి తండ్రి సైదోడగు వెంకటరామ విభుపేర అభిషిక్తరాఘవ ప్రబంధము సంకితమొనర్పు మని యభ్యర్థించెనఁట!

కోనసీమ ద్రావిడ శాఖాబ్రాహ్మణుఁడును, కోదండరామయ పుత్రుఁడును. వేంకటేశ్వరమాహాత్మ్యకృతి కర్తయును నగు ములుపాక బుచ్చయకవి తాను 'మట్ల వంశోద్భవక్ష్మాపాల పాలిత గుండ్లూరిపురినుండు గురుయశుండ నాంధ్ర గీర్వాణ ముఖ్యాష్టభాషాకవిత్వాధి నిర్మాణ మహత్వనిధుఁడ. కాళికాదిశ్వర కరుణాకటాక్షభిభాషిత బహుళ ప్రబంధచయుఁడ....' నని చెప్పుకొన్నాఁడు.†

## మందపాటివారు

వీరు ఒంగోలు సంస్థానపాలకులు. విజయనగర సామ్రాజ్య కాలము నుండియు పదునెనిమిదవు శతాబ్ది పర్యంతము ఒంగోలుసీమను పాలించినవారు మందపాటి వంశజులయిన యాంధ్ర క్షత్రియులు. వీరు కాశ్యప సగోత్రులు. కాకతి సంజ్ఞాంకితులు. వీరి మొదటిరాజధాని ఒంగోలునకు పడమరగా నాలుగు పరువుల దూరమునఁగల కొణిజేడు. ఆ పిమ్మట 1706 ప్రాంతముల ఒంగోలు

* కాళహస్తి అంకభూపాలున కిది కృతి యను నిడుదవోలువారి సిద్ధయము విచార ణీయము; తెలుగువిజ్ఞాన సర్వస్వము, సంపుటము 3, పు. 1173.

† No. 355, Descriptive Catalogue of Telugu Mss. Vol. I, Madras, 1915.

ము ఖ్యపట్టణమయినది. మందపాటి అయ్యపరాజు వీరి మూలపురుషుఁడు.

మూర్తిరాజు, పెరుమాళ్లురాజు, వేంకటరాజు మున్నగువారు అయ్యప రాజు పుత్త్రులు. మూర్తిరాజు కుమారుఁడు లింగనరాజు. ఇతనికి రామభద్ర రాజు, రామచంద్రరాజు అని యిరువురు కుమారులు. రామచంద్రరాజునకు రామభద్రరాజు, రఘుపతిరాజు అని యిద్దఱు కొడుకులు. ఈ సోదరులిద్దఱును బొబ్బిలి యుద్ధమున పెదవిజయరామరాజు పక్షమున పోరాడినట్లు రంగారాయ చరిత్రము—

'ధన్యాటోపులు మందపాటి కులరత్నంబుల్ మహారాజ మూ
ర్ధన్యుల్ శ్రీరఘునాథరాజ బలభద్రక్ష్మాపరు ల్మన్న సౌ
జన్య క్రీడలఁబొలుతెంచి శిబికాంచద్ఘతుల్ మీఱ రా
జన్యగ్రామణికిచ్చి రుత్సవముఁ దత్ స్వాంతంబు కాంతంబుగన్' (1-163)

పేర్కొనుచున్నది. దామరాజువారితోడి పోరులయందు రామభద్రరాజు మరణించుటవలనను అతని కుమారుఁడు ఇమ్మడి రామచంద్రరాజు పసివాఁడగుట వలనను రఘుపతిరాజు రాజ్యమునకు వచ్చెను. రఘుపతిరాజు గొప్పవీరుఁడనియు నితనికాలమునందే రాజధాని కొణిజేడునుండి ఒంగోలునకు మాఱినదనియుఁ జెప్పుదురు.

తెట్టుసంస్థాన పాలకులగు వేజెళ్ళవారు ఒంగోలురాజులకు వియ్యంకులఁట. వేజెళ్ళ వెంకటరామరాజు ఒంగోలురాజుల మేనమామ. వీరితనయ అచ్చమాంబ మందపాటి రామచంద్రరాజు భార్య. వెంకటగిరి రాజ్యమునకు పక్కలో బల్లెముగా కొండవీటి రాజ్యమునకు గుండెలో గాలముగా ఒంగోలు రాజ్యము ప్రవర్తిల్లినను ఉద్ధతులమధ్య దీనిమనుగడ దినదినగండముగానుండినది. ఇట్లొత్తికొనివచ్చు నుద్ధతుల నడుమ మందపాటివారి రాజ్యము పేదపడినది. పదునెనిమిదవ శతాబ్దమునందలి రామభద్ర రామచంద్రులను ఒంగోలు రాజన్యులు ప్రఖ్యాతులు.

ఇమ్మడి రామచంద్రరాజు ఆర్కాటు నవాబునుండి రాజా బహద్దరాది బిరుదములు నందినవాఁడు. వీరి దత్తుఁడగు వేంకటరామరాజు (1792–1806) శాశ్వతకర నిర్ణయమునాఁటి పాలకుఁడు. ఈతనికి సాలుసరి 'లవణను' నిచ్చు షరతుమీఁద సంస్థానమును ఇంగ్లీషు కుంఫిణీవారు వశపఱచికొనిరి. వేంకట రామరాజు దత్తులగు రామచంద్రరాజు (1806–1816) వీరి తర్వాత కృష్ణమ రాజు వెంకటనరసింహరాజులు చివరి పించనుదారులు. వెంకటనరసింహరాజు (1822–1842) నకు సంతతియున్నను ఏదోయొక సాకుచూపి సంతతికి 'లవణను' నాఁపుచేసిరి.* గుంటూరు మండలము నరసరావుపేట తాలూకా

*John, A.C. Boswell, A Manual of the Nellore District, pp. 735–736.

సాంతులూరుగ్రామ పరిసరముల మందపాటివారి వంశీయులు నేఁటికిని గలరఁట. సాంతులూరు రైల్వేష్టేషనునకుఁ దూర్పుననున్న రాజువారిపాలెము వాస్తవ్యులు మందపాటి నరసింహరాజుగారియొద్ద ఒంగోలురాజుల వంశవృక్షము గలదఁట.

ఒంగోలురాజుల క్షాత్రశక్తియును విద్వదభిమానము నుద్యోగనిరతియును వారి యశోగాన రూపమున నిలచినది. పూర్వపాలకులలో మందపాటి రాజను రాజు, నారాయణరాజు 'సత్కవీశానుల సన్నుతుల్ గొని యశంబు వహించినవా' రఁట. మందపాటి నారాయణరాజు ప్రేరణమున కవిసార్వభౌమ కూచిమంచి తిమ్మకవి సోదరుఁడగు జగ్గకవి సోమదేవ రాజీయమను చారిత్రిక కావ్యమును సంతరించిన ట్లైతిహ్యము ప్రమాణము. లభించిన సోమదేవరాజీయ లిఖిత ప్రతులు రెండు నసంపూర్ణములు; అవతారికా భాగము లేదు. లభ్యమైన రెండాశ్వాసములలో ద్వితీయాశ్వాసాంత్య భాగమును లేదు. ద్వితీయ ప్రథమాశ్వాసముల యాద్యంతములందలి గ్రంథ భాగములఁబట్టి కవి నామమును గృతి ప్రేరకుని నామమును దెలియవచ్చుచున్నవి. కృతి ప్రేరకుఁడగు మందపాటి నారాయణరాజు కాకతి రుద్రాన్వయము వాఁడఁట.

'శ్రీ కాకతి రుద్రాన్వయ
నాకాధిప మందపాటి నారాయణ భా
త్రీకాంత....' —ద్వితీయాశ్వాసాది.

ఒంగోలును పాలించిన మందపాటి రాజులు క్షత్రియు లనుటలో విప్రతిపత్తి లేదు. కాని కాకతీయులు క్షత్రియులను నంశము వివాదగ్రస్తము. సోమదేవ రాజీయ కృతిప్రేరకుఁడగు మందపాటి నారాయణరాజునకును ఒంగోలు మందపాటి రాజులకును ఒక్క గృహనామ సాదృశ్యము తప్ప తక్కిన సంబంధములు స్పష్టపడుట లేదు. ఈ విషయ మింకను సుపరీక్షితము గావలసియున్నది. సోమదేవ రాజీయము కాకతి రుద్రాన్వయ క్రమమును నిరూపించునట్టి యొక చారిత్రికకావ్యము. ఇది మందపాటి నారాయణ ధారుణీవర నిరంతర పూజిత పాద పంకజునకు సత్యభామాధీశునకు నందగోపాలున కంకితము.

మందపాటివారి కోవకుచెందిన రాజువారిపాలెము వాస్తవ్యులు మందపాటి వెంకటరాజుగారుకూడ కవిపండితాభిమానులు. వీరి ప్రేరణమున ఒంగోలు పండితులు హరితస గోత్రులు, ఆపస్తంబ సూత్రులు అక్కరాజు లక్ష్మీనరసింహ రాయకవి రామచంద్ర విజయమను నాలంకముల చారిత్రిక నాటకమును రచించిరి. ఒంగోలు పాలకులగు మందపాటి రామభద్రరాజు రామచంద్ర రాజులు వెంకటగిరి సంస్థాన పాలకులతో యుద్ధము లొనర్చి విజయము నొందిన కథ యీ రూపకమునందలి యితివృత్తము. నరసింహరాజు తాతతండ్రులు గూడ పండిత పోషకులఁట. వేదవిదుఁడయిన పిచ్చయార్యుఁడు వీరివలన

టూదాన మొందెనఁట. నరసింహరాజు కుమారుఁడగు సీతారామరాజుకూడ కవులను విద్వాంసులను గౌరవించి వారి యాశీః పరిభాష సంపదల సిరిసంపదలఁ బొదలుచున్నవాఁడఁట.

## మందసా

కళింగ సీమలోని పురాతన సంస్థానములలో మందసా యొకటి. నేఁటి మందసా పట్టణము నాఁటి బుద్ధదంతముగల మంజూష యొకటి స్థాపితమయిన పట్టణము కానోపుననియు 'మంజూషా' శబ్దమే వికృతిని బొంది 'మందసా'గా జనుల వాడుకలో నిలిచియున్న దనియు కొందఱ యభిప్రాయము.* మహేంద్రగిరి పర్వత శ్రేణి మందసాను పర్లాకిమిడిని వేఱుచేయుచున్నది. మహేంద్రగిరి శిఖరమునందలి భీమేశ్వరాలయము, పర్వతపాదమునందలి గోకర్ణేశ్వరాలయము ప్రసిద్ధము లయినవి. గోకర్ణేశ్వరుఁడు గంగవంశీయుల కులదైవము. మందసా సంస్థానము వైశాల్యము 132 చ.మై. గ్రామములు 166. ఇందులో దేవస్వ బ్రహ్మస్వములు కలిసి యిరువది. జనాభా 1931 ననుసరించి సుమారు ముప్పది నాలుగువేలు. ఆదాయము రెండున్నర లక్షలు; పేష్కుషు పదుమూఁడు వేలు.

సంస్థాన పాలకుల మూలపురుషుఁడు చంద్రవంశ క్షత్రియుఁడగు పాచేంద్ర బమ్మనసింహుఁడు పాంచాలదేశమునుండి కళింగదేశ సీమలలోని మహేంద్రగిరి ప్రాంతమునకు వలసవచ్చి స్థిరపడిన వాఁడఁట: ఈతఁడు పదుమూఁడవ శతాబ్దమువాఁడని ప్రతీతి. ఈ కోవలో జగన్నాథ రాజమణి రాజదేవు ముఖ్యులు. వీరి కుమారులు రాజా శ్రీ వాసుదేవ రాజమణి రాజదేవు. వీరి తనయులు రాజా శ్రీ శ్రీనివాస రాజమణి రాజదేవు. శ్రీనివాస రాజమణి రాజదేవు మరణించిన తర్వాత వారి భార్య రత్నమాలారాణిగారు కొంతకాలము రాజ్యము చేసి 1934 లో మరణించిరి. 1934 నుండి ఈ ఎస్టేటు కోర్ట్ ఆఫ్ వార్డ్స్ పరమైనది.

జగన్నాథ రాజమణి రాజదేవుగారు సి.ఐ.ఇ. బిరుదాంకితులు. సంస్కృతములో మంచి పండితులు. ఆస్థానమునకు వచ్చు కవి పండితులకు సంస్కృత భాషలో సమస్యల నిచ్చి వారి సరస పూరణములను విని సత్కరించెడివారు. వీరి కుమారులగు వాసుదేవ రాజమణి రాజదేవుగూడ సంస్కృత పండితులు ప్రసిద్ధ సంస్కృత విద్వాంసులగు ముడుంబి రాఘవాచార్యులు, నరసింహాచార్యస్వామి (1841—1927) గారలకు వీరి యాస్థానమున వార్షికము లుండినవి. రాజా శ్రీ శ్రీనివాస రాజమణి రాజదేవు కళ్ళికోట కళాశాలలో చదివి పట్టభద్రు లయినవారు. వీరికి సంస్కృతముతోపాటు తెలుఁగుభాషమీఁదఁగూడ విశేషాభిమాన ముండెడిది. 'నేను మందసా సంస్థానానికి వెళ్ళినపుడా రాజాగారు

* Lakshminarayan Harichandan Jagadeb, The Patteswara Inscription, J.A.H.R.S., Vol. VI, p. 51.

మంచి పాండిత్యం సంస్కృతంలో వుండిన్నీ నా వల్ల వసుచరిత్రను ప్రత్యే కించి కోరి శ్రద్ధగా విన్నారు' -- అని చెళ్ళపిళ్ళవారు కీర్తించిన భాషాప్రియత్వము వీరిది.* వీరు కవితాప్రియులు కూడ. అష్టావధానాదులచే వీరి నలరింపఁజేసి చెళ్ళపిళ్ళవారీ యాస్థానమున సమర్థ్య సత్కారములనందిరి.†

గోమఠము శ్రీనివాసాచార్యులు రచించిన 'కమలాపహరణము' అను పది యంకములుగల ప్రకరణమను రూపకము శ్రీనివాసరాజమణి రాజదేవుగారి కంకితము. 'గులేబకావలీ' అను హిందుస్తానీ నాటకమునను సరించి రచియింపఁ బడిన దీ ప్రకరణము. ఆచార్యులుగారు నటులు, నాటక ప్రయోక్తలు కూడ, నాటకప్రయోగ పితామహులన్నది వీరి బిరుదము. పద్యములకు పాటలకు ఈ నాటకమునందు రాగతాళాదికములు సూచింపఁబడినవి. ప్రత్యంకమును గొన్ని స్థలములు అనఁగా రంగములుగా విభజింపఁబడినది. పది యంకములలో నిరువదిమూఁడు స్థలములు గలవు. 'పెంకెపంతులు' అను నొక ప్రహసనమును సైత మాచార్యులవారు తెలుఁగున సంతరించిరి. ఆంగ్లభాష యందు హరిశ్చంద్ర నాటకమును వ్రాసిరి.

భారద్వాజ గోత్రుఁడును బలరామయార్య పుత్త్రుఁడునగు కణితి భాస్కర మనునతఁడు మందస కోటాధీశ్వరులయిన శ్రీనివాస రాజమణిరాజదేవుగారి యాశ్రితుఁడు. ఈతఁడు మందసాతాలూకాలోని రట్టి గ్రామమునందలి పల్లవ రాయస్వామి నుద్దేశించి నూటతొమ్మిది కందములుగల పల్లవరాయ శతకమును నూటయిరువది యొక్క కంద పద్యములుగల భాస్కరమూర్తి శతకమును రచించినాఁడు.

పరవస్తు వేంకట రంగాచార్యులుగారు విశాఖపట్టణమున స్థాపించిన యార్షవిద్యాపాఠశాలకు మందసా జమీందారులు నూటపదియాఱుల వార్షిక మిచ్చు చుండిరి. వేమూరి జగన్నాథశర్మ విరచితమగు బాలదేవీ భాగవతము మందసా రాజాగారి కంకితము. బారువపట్టణములోని శ్రీ కృష్ణదేవరాయ గ్రంథాలయా విష్కర్తలు మందసా రాజాగారు.

## మాగాము

తూర్పు గోదావరి మండలమందలి అమలాపురము తాలూకాలోని మాగాము గ్రామ మొక చిన్న ఎస్టేటు. క్రీ॥శ॥ 1875 వరకు నిది ద్రావిడ బ్రాహ్మణశాఖకుఁ జెందిన 'కట్టా' గృహనామకుల యధీనములో నుండినది. ఆ పిమ్మట వోలేటివారి కుటుంబము నజమాయిషీక్రిందికి వచ్చినది. వోలేటి

*చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, తెలుఁగులో సొగసులు, ఆంధ్రపత్రిక, సంవత్సరాది సంచిక, 14, తారణ 1944, పు. 51.

†చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, 'కథలు — గాథలు', సంపుటము 3, పు. 243.

వారు ఆర్వేల నియోగులు; గౌతమసగోత్రులు; పిఠాపురసంస్థానోద్యోగులు. వోలేటి రామన్నగారు తొలి ఎస్టేటుదారులు. 1908 లో నీ యెస్టేటులోని కొంత భాగము అన్యాక్రాంతమయినది. ఎస్టేటుదారులలో వోలేటి వెంకటరామారావు గారు చివరివారు.

వీరు విద్యాపోషకులు. సప్తసంతానప్రశస్తిని బడసినవారు. మాగాము గ్రామమునందలి కేశవస్వామి దేవాలయము. జగన్మోహన పుస్తకభాండాగారము వోలేటివారి కీర్తిమూర్తులు. చివరి ఎస్టేటుదారులయిన వెంకరామారావుగారు ఆంధ్రభాషాప్రవీణులు; జాతీయాభిమానులు; ఖాదీ ఉద్యమ నిర్వాహకులయిన స్వచ్ఛంద సేవకులు.

## మాసూరివారు

మాసూరిగృహనామకులగు చిలకలూరిపేట, సత్తెనపల్లి జమీందారులు మాధ్వబ్రాహ్మణులు, భారద్వాజసగోత్రులు, ఆపస్తంబసూత్రులు, యజుశ్శాఖీయులు. మరాట్వాడాలోని మానూరుగ్రామము వీరి మొదటినివాసము. ఇదం బ్రాహ్మ మిదం క్షాత్రమ్మని శాస్త్రోపసేవనముతోపాటు శస్త్రోపసేవనమొనర్చిన వీరు గోలకొండనవాబుల కొలువులో గొప్ప సరదారులు. ఆ పిమ్మట మొగలు పాదుషాల దౌలతులో ముజుందారులుగా, షెరిస్తవారులుగా, దేశపాండ్యాలుగా ప్రసిద్ధులు. పదునాలుగు సముతులుగా, నలువదినాలుగు హవేలీగ్రామములుగా విభక్తమయిన మూర్తుజానగర (కొండవీడు) సర్కారునకు మానూరివారు మొదట ముజుందారులు. ఆ పిమ్మట నూటయఱువది గ్రామములతో కూడిన మాసూరివారి సంస్థానమునకు జమీందారులు. చిలకలూరిపేట పాలకుల నివాసముగా నందివెలుగు, నంబూరు, మూల్పూరులు తాణాగ్రామములుగా నీ సంస్థానము వర్ధిల్లినది. 1779 లో అన్నదమ్ముల వంతులక్రింద మొత్తము సంస్థానము చిలకలూరిపేట, సత్తెనపల్లి జమీలపేర పంపకములయినది. 1846 ప్రాంతముల ఇంగ్లీషుకుంఫిణీ సర్కారుపరమయినది.*

మానూరిజమీందారుల మూలపురుషుడు మానూరి నాగప్ప. ఈతని ప్రపౌత్రుఁడగు కొండలరావు మానూరివారికి కూటస్థుడు. ఈతఁడు మొగలాయి దొరతనమువారినుండి అధికారమునుబడసి మూర్తుజానగరము షెరిస్తదారుఁడుగా, జమీందారుఁడుగా ప్రభుతను వెలయించినవాఁడు. ఈయనకు మొదటి భార్యవలన వెంకన్న, నరసన్న యని యిరువురు పుత్రులు. రెండవభార్యవలన అప్పాజీ, అక్కప్ప యని యిరువురు పుత్రులు. వెంకన్న నిజాముల్ముల్కునొద్ద నుండి సన్నదునుబొంది సర్ దేశపాండ్యగా నుండిరి.† వెంకన్నగారి

*Robert Eric Frykenberg, Guntur District, 1788–1848, Oxford, 1965.

†మానూరివారి వంశచరిత్ర, గుంటూరుమండలసర్వస్వము, పుటలు 130, 131.

తరువాత వారి సవతితమ్ముఁడయిన అప్పాజీ కొంతకాలము జమీపాలకుడు. వెంకన్న నిస్సంతతయినందున తన సొంత తమ్ముని రెండవకుమారుఁడగు వెంకటరావును దత్తుచేసికొనియుండిరి.

అప్పాజీతరువాత జమీకివచ్చిన వెంకటరావునకును సంతతిలేనందున నరసన్నగారి జ్యేష్ఠపుత్రుని పుత్రులగు వెంకటకృష్ణమ్మగారి రెండవకుమారుఁడయిన నరసన్నను దత్తు స్వీకరించిరి. వెంకటరావుననంతరము దత్తుని నిజ జనకుఁడగు వెంకటకృష్ణమ్మయే జమీ కధికారి. ఈతనితరువాత అప్పాజీ కుమారుఁడయిన వెంకటేశము జమీకి పాలకుఁడు. వెంకటేశము హయాములో (1779 ఫసలీ 1129 – శార్వరి) లో నీ జమీ రెండుభాగములుగా చీలిపోయి నది. కొండలరావుగారి ప్రథమభార్యసంతతివారయిన నరసన్నారావుగారికి 79 గ్రామములును, రూ. 1,26,700 లు పేష్కషును గల చిలకలూరిపేట వంతును, ద్వితీయభార్యసంతతివారయిన వెంకటేశముగారికి 80 గ్రామము లును, రూ. 1,26,700 లు పేష్కషును గల సత్తెనపల్లి పరగణాయును వచ్చినవి. 1802 లో విడివిడిగా శాశ్వతపరిష్కారమును జరిగినది.

ఈ జమీ లేర్పడకపూర్వమే వెంకటకృష్ణమ్మగారి కాలమున సత్తెనపల్లి కోట నిర్మింపఁబడినది. వెంకటేశము పదునాలు సంవత్సరములు పాలించి మరణింపఁగా వారి పెద్దకుమారులు వెంకటరమణయ్య జమీకివచ్చిరి. వీరు వృద్ధులయిన పిమ్మట తమ పెద్దకొడుకు అప్పాజీరావునకు జమీపాలనము నప్పగించి యుండిరి. అప్పాజీ నాలుగేండ్లు పాలించి 1810 లో మరణింపఁగా నాతని కుమారుఁడయిన వెంకటరావు మైనరయినందున తాతయగు వెంకట రమణయ్య మీఁదనే జమీభారము పడినది. కాని వెంకటరమణయ్య తాను వృద్ధుఁడననియు, మనుమఁడు పసివాఁడనియు, విశేషించి పుత్రశోకభారమున క్రుంగియుండుటవలన జమీపరిపాలనమును సరిగా తూఁగింపలేననియు, జమీని కోర్టాఫ్ వార్డ్సు వారి పర్యవేక్షణమునకు స్వీకరింపవలసినదనియు కుంఫిణీ సర్కారు నభ్యర్థించినాఁడు.

సంస్థానము అప్పులలో తలమున్కలుగా నున్నందున కోర్టాఫ్ వార్డ్సు పర్యవేక్షణము సాధ్యపడలేదు. మానూరివారి వియ్యంకులగు పత్రి కృష్ణయ్యగారు కొంతకాలమీ సత్తెనపల్లి జమీని కౌలునకు నిర్వహించి వదలిపెట్టిరి. 1817–1820 మధ్య నీ జమీందారి జప్తు గొడవలలో నుండినది. 1820 లో యుక్తవయస్సు వచ్చిన వెంకటరావుగారికి జమీ అప్పగింపఁబడినది. 1834 లో నితఁడు నిస్సంతుగా మరణింపఁగా నీతని పితామహి శేషగిరియమ్మకును, వెంకటరావుగారి పినతండ్రి వెంకటగోపాలరావు (1813–1873) నకును వివాదము నడచి న్యాయస్థానమువారి తీర్పు రాకమునుపే శేషగిరియమ్మ మరణించినందున వెంకటగోపాలరావుగారికి జమీ సంక్రమించినది. ఈతని

పాలనలో తీవ్ర ఋణభారములవలన సత్తెనపల్లి జమీందారి కుంఫిణీ సర్కారు స్వాధీనమయి వారసులకు భరణములేర్పడినవి.

చిలకలూరిపేట మొదటి జమీందారైన నరసన్నరావు 1809 లో నిస్సంతుగా మరణించుటచే వీరి తండ్రిగారగు వెంకటకృష్ణమ్మ జమీ వ్యవహారములు సరిచూచిరి. ఈయన 1815 లో మరణింపఁగా వెంకటకృష్ణమ్మగారి కుమారుఁడు వెంకటనరసింహారావు మైనరయినందున కొంతకాలము కోర్టాఫ్ వార్డ్సు వారి పర్యవేక్షణము ప్రవర్తిల్లినది. 1827 లో జమీ నరసింహారావుగారి చేతికి వచ్చినను పేష్కషు సక్రమముగా చెల్లుబడికాక ఓక్లండుప్రభువు కాలమున 1836 లో జమీ జప్తు అయినది. ఆ దరిమిలా వారసులచేతిలో కొలఁదికాలముండినది కాని వారు సంస్థానమును సరిగా నిర్వహింపలేక పోవుటవలన హార్డింజి ప్రభువు కాలమున 1845 ప్రాంతముల ఈ జమీ సర్కారునకు దఖలు పడి వారసులకు భరణములు మాత్రము దక్కినవి. ఇట్లు సత్తెనపల్లి చిలకలూరిపేట సంస్థానములు రెండును కుంఫిణీసర్కారు కాలమునందే నడుమంతరముగా నంతరించినవి. వెంకటనరసింహారావుగారి ప్రపౌత్రులు మాసూరి వెంకటహనుమంతరావుగారు చిలకలూరిపేట పెద్దకోటలోని నేఁటివారసులు, చిలకలూరిపేటలోని చిన్నకోట వెంకటనరసింహారావుగారి తమ్ముని సంతతి వారగు మాసూరి వెంకటకృష్ణ నరసింహారావుగారి నివాసము.

మాసూరి జమీందారులు ద్వైతులయినను ఇతరశాఖలవారిని నయిత మాదరించుట వీరి విశాలదృష్టికి, ఉదారబుద్ధికి నిదర్శనము. కృష్ణాతటము నందలి పద్దేశ్వరమను గ్రామము ఉత్తరాది మధ్వపీఠమునకును, రెంటపాళ్ళ అగ్రహారము పుష్పగిరి పీఠమునకును, బాపట్ల తాలూకాలోని వడ్డిముక్కల అగ్రహారము విశిష్టాద్వైతులగు మాడభూషివారి కుటుంబమునకును నొసంగిరి. నందివెలుగుగ్రామ పరిసరములందలి కుంచపరము, దేవరపల్లి, సిరిపురములను బ్రహ్మస్వములుగా రూపొందించిరి. చెమళ్ళమూడి కృష్ణసోమయాజులు, ములుకుట్ల శివన్న, వేదాల రంగాచార్యులు, సింగరాజు రామచంద్రుఁడు మున్నగు వేదవిదులు వీరినుండి భూదానముల నందినవారు. మాసూరి జమీందారుల కూటస్థుఁడగు కొండలరాయని తమ్ముఁడు తిమ్మాజీ. వీరి కుమారులు వెంకటదాసు మాసూరివారి జమీలోని నందివెలుగు రాజాకధిపతి. వెంకటదాసు నందివెలుగులోని సీతారామ ఆంజనేయ అగస్త్యేశ్వర దేవాలయముల పునరుద్ధారకుఁడు.

మాసూరి జమీందారులలో కవిపోషకులే కాక కొందఱు కవులుగూడ వెలసియుండుట విశేషము. సత్తెనపల్లి జమీందారు వెంకటేశముగారి కుమారుఁడగు అప్పాజీ అధ్యాత్మరామాయణ పద్య కావ్యకర్త. నృసింహ పురాణమను ద్విపదకావ్య మీతని కృత్యంతరము. వెంకటేశము పౌత్రుఁడును, భారతీదేవి

వెంకటరమణయ్యారావుల ద్వితీయ పుత్రుఁడును. జమీందారు అచ్చన్న దౌహిత్రుఁడును నగు వెంకటగోపాలరావు ప్రసిద్ధకవి. కవి పోషకుని ఉభయ భాషావైదుష్యము, సకలశాస్త్ర నిష్ణాతృత్వము గోపాలరాయల విశిష్టలక్షణములు. రుక్మిణీపరిణయ వాల్మీకీయ ప్రకాశిక కీర్తికాంతాస్వయంవరాది కావ్యములు గోపాలరాయల స్వీయరచనములు. వీనిలో రుక్మిణీపరిణయము ముచ్చతెలుగు కావ్యము; రఘూత్తమాంకితము. నైషధ మాంధ్రపద్య ప్రబంధము. హరిశ్చంద్రీయమను నీతని కృతి సంస్కృత చంపూ ప్రబంధము. వాల్మీకీయ ప్రకాశిక వాల్మీకి రామాయణమునకు యథామూలకమగు వ్యాఖ్యానము. ఇది సత్తెనపల్లి (సత్యభామాపురి) వేణుగోపాలస్వామి కంకితము. యథా వాల్మీకి ములగు ఆంధ్ర రామాయణములను గూర్చి వ్రాయుచు జయంతి రామయ్య పంతులుగారు 'సత్తెనపల్లి జమీందారీ కుటుంబములోని వారగు మానూరి గోపాలరావుగారు పూర్వమే యిట్టి గ్రంథమును రచించిరని వింటిమి గాని యీ గ్రంథము ప్రకటితము కాలేదు.'* అని పేర్కొనుట నిట ననుసంధింపఁదగును. ప్రచురణార్హములగు రుక్మిణీ పరిణయ వాల్మీకీయ ప్రకాశిక గ్రంథముల లిఖిత ప్రతులు మానూరు వెంకట భుజంగశయనరావుగారి యొద్ద శిథిలావస్థలో నున్నవి.

కీర్తికాంతా స్వయంవరమను ప్రౌఢ కావ్యము గోపాలరాయల కృత్యంతరము.† నాఁటి మైసూరు ప్రభువగు చామరాజ వడయరుగారి కుమారులు శ్రీ కృష్ణరాజ వడయరు కథానాయకులుగా సాహసోత్సాహగుల తమోబలయును, అనుకంపకనుజయును నగు కీర్తికాంత నాయికగా రూపొందిన కావ్యమిది. గోపాలరాయలు రచించిన ధర్మశాస్త్రము, రాధామాధవ శతకము మున్నగునవి అనుపలబ్ధములు. గోపాలరాయల పుత్రులు వెంకటభుజంగ రమణయ్యారావు గారు ఒకానొక పారశీకకథను మూలముగా స్వీకరించి 'విబుధజన మనో రంజని' యను పద్య కావ్యమును రచియించినట్లు వినికిడి.

గోపాలరాయల ఆస్థానపండిత కవులలో జూలూరి అప్పయ్య, ఆర్కాటు వెంకటసుబ్బరాయకవి ముఖ్యులు. జూలూరివారు ప్రముఖాంధ్ర కావ్య వ్యాఖ్యాతలుగా సుప్రసిద్ధులు. గోపాలరాయ కృతములగు రుక్మిణీ పరిణయ వాల్మీకీయ ప్రకాశికలకు అప్పయ్యగారు విపుల వ్యాఖ్యానములను సంతరించిరి. గోపాల రాయల రుక్మిణీ పరిణయ కావ్యావతారికలోని పూర్వకవి స్తుతియందు '....ఆంధ్ర కవితాపితామహు నల్లసాని పెద్దనను రామభద్రు సేవించి మఱియు సహజ నన్నయ జూలూరి యప్పనార్య నాధునిక కవిశేఖరు నభినుతింతు' (రుక్మిణీ. 12) అని అప్పయపండితుని గూర్చి కవిపోషకుఁడు గావించిన ప్రశంస గమనింపఁదగినది.

* ఆధునికాంధ్ర వాఙ్మయ వికాస వైఖరి, విద్వజ్జన మనోరంజని ముద్రాక్షరశాల, 1937, పు. 116.

† చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు, 1912.

జక్కరాజు వెంకటసుబ్బరాయకవి సత్తెనపల్లి వాస్తవ్యులు. నందవరీక బ్రాహ్మణులు. శ్రీవత్స గోత్రులు. అప్పమక్కమానాగయాహ్వయుల పుత్రులు. వీరు గోపాలరాయల యాశ్రయమున నుండి పైజయంతీ విలాసమను నామాంతరముగల విప్రనారాయణ చరిత్రమను యక్షగానమును రచియించిరి. గ్రంథ ప్రేరకులగు మానూరి వెంకటగోపాలరాయల అభ్యుదయము నిమిత్తము సంతరింపబడిన యీ యక్షగాన కృతి సత్తెనపల్లి గోపాల ముద్రాంకితము. ఇందలి యవతారికలో మానూరివారి సంస్థాన చరిత్రము విపృతము.

వీరి యాస్థానములో తాటికోల నృసింహాచార్యులు, తాటికోల వెంకటేశాచార్యులు, ఆర్వేల నియోగులగు తుళ్ళూరువారును కవులుగా నుండిరట. శరభరాజీయమను గ్రంథము తుళ్ళూరువారి రచనమని ప్రతీతి. పాండితీ మండితమగు పళ్ళెవారి కుటుంబము తరతరములుగా మానూరి సంస్థానాస్థాన విద్వత్కవి పదవిని బ్రఖ్యాతి నందినదట!

మానూరి జమీందారుల జ్ఞాతులును, నందివెలుగు తాణాదారులును నగు వెంకటదాసు సంతతిలో అయిదవ తరమువారగు మానూరి వెంకటకృష్ణరావుగారు శ్రీ పళ్ళె పూర్ణప్రజ్ఞకవి విరచిత సాధుశీల శతకమునకు కృతిపతి. ఈ వెంకట కృష్ణరావుగారి తమ్ములగు వెంకట సుబ్బారావుగారి తృతీయ పుత్రులు తెనాలి తాలూకా నందివెలుగు వాస్తవ్యులు మానూరి కృష్ణరావుగారు. వీరి రచనములలో కనకదుర్గా తత్త్వనిర్ణయము, నీలకేశవ స్తోత్రము, కనకదుర్గా స్తుతి, ముఖ్యప్రాణ స్తుతి మున్నగునవి ముఖ్యములు. వీరు ఆధ్యాత్మిక గ్రంథ ప్రచురణ సంస్థయగు శ్యామసుందర దివ్యవిజ్ఞాన కోశమునకు వ్యవస్థాపక కర్తలు. సీతారామస్వామి వైభవపరమగు నంది జ్యోతిర్మహాక్షేత్ర మాహాత్మ్య మను సంస్కృత గ్రంథ రచనమునకీ కృష్ణరావుగారు ప్రేరకులు. గుంటూరు వాస్తవ్యులు కవిశేఖర మధ్వశ్రీ పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు రచించిన దీ మాహాత్మ్యము మూఁడధ్యాయములుగల యీ గ్రంథము ఆంధ్రానువాద సహితముగా ప్రచురితము.*

## మొగల్తుర్రు

పశ్చిమ గోదావరి మండలమునందలి పురాతన సంస్థానములలో నిది యొకటి. కటకాధిపతి ప్రతాపరుద్ర గజపతి పూసపాటి రెండవ రాచిరాజు (1500–1550) న కరణముగా ప్రసాదించిన మొగల్తుర్రు ఒకనాఁడు రాచపట్టుగా నుండుటవలన విజయనగరము పూసపాటివారికి మొగలితుర్తి రాజధానిందురని ప్రశస్తి. ఆ పిమ్మట చుట్టుతికమును పురస్కరించికొనియో, ఫౌజుదారుల

* నరసరావుపేట కళాశాలాంధ్రభాషాధ్యాపకులు శ్రీపళ్ళె శ్రీనివాసాచార్యులు సేకరించి పంపిన సామగ్రి ఈ భాగమున చాల ఉపకరించినది.

పర్గణాల ననుసరించియే మొగల్తుర్రు కలిదిండివారికి సంక్రమించినట్లున్నది. మొగలు పాదుషాలచే నీయబడినందున మొగల్తుర్రను పేరేర్పడినదని కొందఱ వ్యుత్పత్తి. కేతకీపురము, కేతనపురము దీని సంస్కృతీకరణ నామములు. పూర్వము పేరూరు సర్కారులోనిది. అత్తిలి, ఆచంట, ఉండి, కాళ్లకూరు, [illegible]ష్టిపల్లి, పేరూరు, మొగల్తుర్రు పరగణాలు, కలిదిండి సీమలో కొంత భాగము ఈ సంస్థానము విస్తరించిన భూభాగము. తూర్పున వసిష్ఠ గోదావరియు పడమర కాళీపట్టణము దగ్గఱఁగల ఉప్పుటేఱును దక్షిణమున సముద్రమును సరిహద్దులుగా ప్రవర్తిల్లిన ఈ సంస్థానము, సుమారు 800 చ. మై. వైశాల్యములో వ్యాపించిన ఈ సంస్థానమునందు 300 గ్రామము లుండెను. ఈనాఁటి సముదాయము సుమారు పండ్రెండున్నర లక్షల విలువ సంపదలు (ఆనఁగా 8 లక్షల రూపాయలు). కంపెనీ సర్కారునకు చెల్లించిన పేష్కసు జమ్మా మూఁడున్నర లక్షల రూపాయలు. రాజా కలిదిండి తిరుపతిరాజుగారి హయాము (1750 1791)లో నిడదవోలు, పెంటపాడు, రాజవల్లి పరగణాలుగూడ ఈ సంస్థానమున నంతర్భాగములుగా నుండినవి.

సంస్థానపాలకులు సూర్యవంశీయులును, ధనంజయసగోత్రులును, [illegible] సంజ్ఞాంకులును, కలిదిండి గృహనామకులును నగు ఆంధ్రక్షత్రియులు. వీరు వైష్ణవమతానుయాయులు. చక్రవర్తులవారు వీరి గురువులు. దంతులూరి, పూసపాటి, పెనుమెచ్చ గృహనామకులగు ఆంధ్రక్షత్రియులు వీరి బంధువులు. కృష్ణామండలములోని కలిదిండి గ్రామ సంబంధమువలన వీరి యింటిపేరు కలిదిండివా రయినది. వీరి పూర్వుఁడగు కుమార నరసింహరాజు అర్ధ [illegible] మూనియై కలిని దండించుటచే 'కలిదిండి' యను గృహనామ మేర్పడినదని వరసావిత్రి చరిత్రమునందలి కృత్యవతరణిక (పీఠిక. 32) నిరూపించుచు చమత్కారవారుణయినను శాస్త్రపరీక్షకు నిలువఁజేని వ్యుత్పత్తి. మొగల్తుర్తి కయిఫీయతు ప్రకారము తొలుత వీరి యింటిపేరు 'జల్లిగడల' వా రనియు, ఆ పిమ్మట 'కలిదిండి'వారుగా మారినట్లు స్పష్టపడుచున్నది.

గోలకొండ నవాబుల హయాములో సర్కారీచేసి వారి యాదరమునకుఁ బాత్రులయి దేశముఖులుగా, జమీందారులుగా ప్రశస్తిఁ గాంచిన జల్లిగడల గంగరాజుగారు వీరి పూర్వులు. వీరి కుమారులు నారాయణరాజు. హరిశ్చంద్ర రాజనునది వీరి ఖితాబు, నారాయణరాజుగారి కుమారుఁడు పెదబాపరాజు. పెదబాపరాజు కొడుకులేనందున తడసారపు కుమారుఁడు గోపరాజు. ఈ గోపరాజునకు బాపరాజు, రామరాజు అని యిరువురు పుత్రులు. బాపరాజునకు చిన్న గోపరాజు జ్యేష్ఠ పుత్రుఁడు. రామాంబారామరాజుల జ్యేష్ఠ కుమారుడు రంగరాజు (1700—1733). ఈ రంగరాజునకు వెంకాంబవలనఁ గలిగిన తనయుఁడు రామరాజు. వరసావిత్రి చరిత్ర ప్రబంధ కర్త. పెదబాపరాజు అయిదవ

పుత్రుఁడగు దేశాహినరసరాజుగారి మనుమలు అయ్యపరాజు. వీరి ప్రపౌత్రులు వెంకటరామరాజు, తిరుపతిరాజులు అనువారు.

వరసావిత్రి చరిత్ర ప్రబంధకర్తయగు రామరాజుగారికాలముననే రుస్తుం ఖాను బెడద వచ్చిపడినది. వీని యౌద్ధత్యమునకాఁగలేక రామరాజు కుటుంబ పరివారసమేతముగా తోటపల్లికొండలలోనికేఁగి, యా పిమ్మట శంకరగిరి మన్యములలో తలదాఁచికొని కొంతకాలమునకు మరణించినట్లు మొగలుతుఋ కైఫీయత్తు కథనము. రామరాజు ప్రవాసము కారణముగా 1733—1750 మధ్య సంస్థానము ఫౌజుదారు ప్రతినిధులగు సర్లష్కరుల స్వాధీనమున నుండినది. 1751 లో పైన పేర్కొనిన దేశాహి నరసరాజు సంతతిలోని కలిదిండి వెంకట రామరాజుగారికి సంస్థానము దఖలుపడినది. ఈ వెంకటరామరాజు మరణా నంతర మీతని తమ్ములు రాజా కలిదిండి తిరుపతిరాజుగారి (1760—1791) పాలనము మొదలయినది. తిరుపతిరాజుగారు 1778 ప్రాంతమున మొగలితుఋ ఎస్టేటును సాలీనా రూ. 93 వేల కౌలునకు కుంఫిణీ సర్కారునుండి తీసికొనిరి. కౌలుబకాయీలను సక్రమముగా చెల్లింపలేని ఏలూరుసర్కారులోని ఆనాఁటి పెక్కుజమీందారులకు తిరుపతిరాజుగారు జామీనుగానుండిరి. పంటలు పండక, సాలుసరి శిస్తులు చెల్లక తిరుపతిరాజుగారు ఇంత పెద్ద మొత్తములను జమ చేయలేకపోయినందువలన 1787 లో సంస్థానము జప్తు అయినది.

తిరుపతిరాజుగారి తరువాత నాతని భార్యలగు భద్రయ్యమ్మ, నరసయ్యమ్మ లకు 1796 నుండి కుంఫిణీవారు నెలకి 200 ల పూలవరహాల లవణాను లిచ్చుచు వచ్చిరి. 1801 లో భద్రయ్యమ్మ పరమపదింపఁగా ఆదేయేఁట నరసయ్యమ్మ గారు చినగోపరాజుసంతతిలో అయిదవతరమువాఁడయిన విజయగోపాల రాజును దత్తుతెచ్చి కుమారతిరుపతిరాజు (1790—1816) అను పేర వ్యవహ రించిరి. ఈ దత్తును కుంఫిణీసర్కారువా రామోదింపకపోయినను ఘరణము మాత్ర మాఁపలేదు. ఈ తరువాతిపాలకులందఱుగూడ కేవలము లవణాసు దారులు. కుమారతిరుపతిరాజుగారి పుత్రులు లక్ష్మీనరసింహరాజుగారు (1810—1876). వీరి కుమారులు కుమారతిరుపతిరాజుగారు. వారికి లక్ష్మీనర సింహరాజు, లక్ష్మీకాంతరాజు అను నిరువురు తనయులు. లక్ష్మీనరసింహ రాజుగారి రెండవభార్యయగు బుచ్చి సీతయ్యమ్మగారి ద్వితీయపుత్రులగు కుమారలక్ష్మీనరసింహరాజుగారు లక్ష్మీకాంతరాజుగారికి దత్తులు. వీరే వర సావిత్రిచరిత్ర ప్రబంధ ప్రచురణకర్తలు. వీరిపుత్రులు కుమారలక్ష్మీకాంత రాజుగారు.

మొగలుతుఋ సంస్థానాధిపతులు చాలమంది సప్తసంతాన ప్రతిష్ఠాప యితలుగా ప్రసిద్ధులు. ఈ సంస్థానమునందలి అంతర్వేదిక్షేత్రప్రాంతము పూర్వము పెద్దాపురము వత్సవాయి జగపతుల పాలిత సీమలలోనిదఁట.

ఇంగ్లీషువారు ఫ్రెంచివారలు పెద్దాపురముకోటను ముట్టడించినపుడిది మొగలుతుర్రు రాజులకు దఖలుపడినదఁట. ఆనాఁటినుండి మొగలుతుర్రుపాలకులే అంతర్వేది లక్ష్మీనృసింహస్వామి దేవాలయమునకు ధర్మకర్తలు. సుల్తానులతరపున నీ ప్రాంతముల సర్వాధికారులుగా పనిచేసిన హసనల్లీ, రుస్తుంఖానులకు అంతర్వేది లక్ష్మీనృసింహస్వామియెడల అమిత భయభక్తులుండెడివఁట; నాఁడు భేదముల ననుసరించి బ్రాహ్మణశాఖావిభజనము గావించెనను పరంపరాయాత ప్రతీతిగల విశ్వేశ్వరోపాధ్యాయులు మొగల్తుర్రు ఆస్థానపండితులఁట. మొగలుతుర్రుపాలకులు ఏర్పఱిచిన బ్రహ్మస్వములలో వేదపండితుల కొసఁగిన దండి అగ్రహారము, శాస్త్రపండితులకు సమర్పించిన కాకరపఱ్ఱు అగ్రహారమును పరిగణింపఁదగినవి.

పరసావిత్రీచరిత్ర ప్రబంధకర్తయగు కలిదిండి రామరాజబహద్దరుగారు మహితపుణ్యసంతతులుగూర్చిన ధన్యజీవి. రామరాజుతండ్రియగు వెంగళరాజు క్షేత్రము 'విప్రసంతతిప్రియంకరుఁ'డని ఉపశ్లోకితుఁడు. వెదజాలరాజు చతుర్థ పుత్రుఁడగు రామరాజు 'సంగీత సాహిత్య సరస విద్యాశీలి'యఁట; బహుభాషా కావ్య నాటకాలంకారశాస్త్ర పరిశ్రమము పరసావిత్రీచరిత్రప్రబంధకర్తయగు రామరాజుగారికి రాజకవిపదమును సమకూర్చినది. విస్తృతరాజకృత్యములలో రామ రాజుగారుమీఁద నొకరు. అంతర్వేది పుణ్యక్షేత్రమున వెలసిన లక్ష్మీనృసింహ శౌరి కలలో సాక్షాత్కరించి. భారతోక్తమగు సావిత్రీచరిత్రమును గథగా స్వీకరించి సతతకీర్తికారణమగు కావ్యము ఘటించి. మొగలుతుర్తి పట్టాభిరామునకు అంకిత మొనరింపుమని ఆ రాజకవి నాదేశించెనఁట. తన స్వప్నవృత్తాంత మును రామరాజు సభాసదులకుఁ దెలుపఁగా వారు భారతీవ్యాహారరూపమగు నీ కావ్యకరణమునకుఁ బ్రోత్సహించిరఁట. ఇది 1726 ప్రాంతముల రచింపఁబడి యుండునని పరిష్కర్తలు కవిరాజ శ్రీ పత్సవాయి నీలాద్రిరాజుగారి నిర్ధారణము.

పరసావిత్రీచరిత్రము* ఆఱాశ్వాసముల ప్రౌఢప్రబంధము. పూర్వ ప్రబంధములందలి సర్వలక్షణములు నిందు సంధింపఁబడినవి. ఆంధ్ర కావ్య సంప్రదాయములగు సుకవిస్తుతి, కుకవినింద—ఇందుఁ గానరాకుండుట విశేషము. మహాభారతమునందలి సావిత్రీసత్యవంతుల వృత్తాంత మిందలి ఇతివృత్తము. మాదిరికి ఇందలి రెండుపద్యములు:

మ. 'కులుకుం బల్కులఁ జిల్కబోదకరణిం గ్రొంజాళువా టూగుటు
య్యెలలో నూగుచుఁ జిన్నికూకటులచే నెంతేని సల్లాపము
ద్దులు సేయం గొమరారు పుత్రిఁ గని సంతోషంబునం బొందుచున్
దలిదండ్రుల్ జెలువొందిరాత్మకృత పుణ్యశ్రేణిగా నెంచుచున్'

— (2-38).

*సీతారామ పవర్ ప్రెస్, నరసాపురం, 1940.

చం. 'పవడపుఁ బేరులన్ గరుడపచ్చల కీల్కడియాలు తాయెతుల్
బవికల మేల్మి గాజులును బన్నసరంబులు బావిలీలు మె
వ్వు వెలయు కెంపురా చెవుల పువ్వులు మున్నగు నట్టి సొమ్ముల
య్యువిదలమిన్న మేన సొగసుప్పతిలన్ ఘటియించి రంగనల్' (5—49).

రాజా తిరుపతిరాజుగారు (1760-1791) సాహిత్యవ్యాసంగముల యందును చక్కని అభిరుచి గలవారఁట. శకుంతలాపరిణయప్రబంధకర్తయగు పెద్దాడ నాగరాజామాత్యుఁడు చిరకాలము వీరి యాశ్రయమున ఆస్థానకవిగా నుండెనఁట! 1790 ప్రాంతమునాఁటి దేవగుప్తాపు రామభద్రకవి తిరుపతిరాజు గారి యాశ్రితులలో నొకరు. దేవగుప్తాపువారు ఆర్వేల నియోగులు. తూర్పు గోదావరిమండలములోని అమలాపురము సమీపమునఁగల దేవగుప్తము వీరి నివాసగ్రామమఁట. 'మహాదేవా భవానీధవా' యను మకుటముగల శతకము రామభద్రకవికృతము. రాజా కలిదిండి కుమారలక్ష్మీనరసింహరాజుగారు కవి పండితపోషకులు, విద్యాసముద్ధారకులు. వరసావిత్రిచరిత్ర ప్రబంధప్రచురణ కర్తలు. ద్రాక్షాపాకమున తీర్చిన ద్విపద భగవద్గీత వీరి రచనము. వీరు తమ దేవిడీలో భద్రపఱుపఁబడిన ప్రాచీన లిఖితగ్రంథములను కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషద్గ్రంథాలయమునకు బహూకరించిరి.*

## మోతేవారు

విస్సన్నపేటాద్యనేకగ్రామస్వాములు మోతేవారు. తాదేపల్లిగూడెము తాలూకాలోని గుండేపల్లి ఎస్టేటుకూడ మోతేవారిది. విస్సన్నపేట ఎస్టేటు నేఁటి కృష్ణామండలము తిరువూరుతాలూకాలోనిది. ఇది జమ్ములవాయపరగణా లోని పదునాలుగు ఎస్టేటుగ్రామములలో నొకటి. గోలకొండ సరదారులగు మెల్లంకివారును, వరిగొండవారును ముస్తఫాన్నగరుసర్కారులోని జమ్మల వాయ పరగణాకు ఉమ్మడిగా దేశపాండ్యాలుగా నుండిరి. పిమ్మట వరిగొండ వారు జమ్మలవాయపరగణాకు శాశ్వతపుకవులుదారులుగా స్థిరపడిరి. వీరిలో వరిగొండ రామన్నగారు పదునాలుగవతరమువారు. వీరపుత్రకులగుటచే దూరస్థ జ్ఞాతియగు వరిగొండ రమణప్పను దత్తు స్వీకరించియుండిరి. శాశ్వతకర నిర్ణయమునాఁటికి రమణప్ప విస్సన్నపేట జమీందారు. ఈతనిభార్య ఏలూరు లోని కావలివారి యాఁడుబడుచు. 1810 లో రమణప్ప నిస్సంతుగా మరణించుచు స్వీకరించిన దత్తు నంగీకరింపక రమణప్ప భార్య కుంపిణీవారి తోడ్పాటున జమీని వశపఱచికొనినది.† అప్పులపాలయిన యీ సంస్థానము

*ఆతిథ్యముతోపాటు మొగలుతుర్తిసంస్థానచరిత్రమునకు సంబంధించిన సామగ్రిని సంపాదించి యొసఁగినవారు మిత్రులు భీమవరము కళాశాలాంధ్రభాషాధ్యాపకులు శ్రీ కలిదిండి వెంకటరామరాజుగారు.

† G.J. Somayaji, Telugu Documents, Andhra University,

ఈమె సోదరుల పరముగా చెల్లుబడియయినట్లున్నది. 1886 లో ఈ యెస్టేటును ఏలూరులోని శ్రీమంతులు మోతేవారు విక్రయించికొనిరి.

మోతేవారు వైశ్యకులోత్తంసులు. మోతే జగ్గయ్యగారు వీరి పూర్వులు. వీరికి రత్నం, అప్పన్న, వెంకటస్వామి అని ముప్వురు పుత్రులు. వెంకటస్వామిగారికి అచ్చయ్య, వెంకయ్య, గంగరాజు అని ముగ్గురు కుమారులు. అపుత్రకులగు రత్నంగారు గంగరాజుగారిని దత్తు తెచ్చిరి. గంగరాజుగారికి రాజ్యలక్ష్మి, ఆండాళు అని ఇరువురు పుత్రికలు. అంజిరత్న రాజకుమార్ గంగరాజుగారి దత్తపుత్రులు. అప్పన్నగారి జ్యేష్ఠ పుత్రులు జగ్గయ్యగారు. వీరి పౌత్రులు నారాయణరావుగారు.

వెంకటస్వామిగారి జ్యేష్ఠ పుత్రులగు అచ్చయ్యగారు 'మనుముఖ ధర్మశాస్త్రముల మార్గములెల్ల గ్రహించి పండితుల్ దనకడ వేఁగుదెంచు నెడలన్ బలుయుక్తులఁ దర్కసంగముల్ కని వడిఁ జేయునేర్పు' గలవారని వీరి యాస్థాన విద్వాంసులు కలువలపల్లి రంగనాథశాస్త్రి ప్రశంస. మోతేవారి కుటుంబములో గంగరాజుగారు మిక్కిలి ప్రసిద్ధులు. రావుబహద్దరు బిరుదాంకితులు. తమ షష్టిపూర్తినాఁడు తులాభారము తూఁగి పాత్రులకు దానమొనర్చుటయేగాక వివిధములయిన దానధర్మముల క్రింద వీరు ఖర్చుపెట్టినది సుమారు ఒకటిన్నర లక్ష. వీరు బందరు జాతీయ కళాశాలకు, కన్యకాపరమేశ్వరి ఉన్నత పాఠశాలకు గొప్ప విరాళము లిచ్చిరి. గ్రంథాలయ సర్వస్వ పత్రికకు, బందరు సరస్వతీ గ్రంథమాలికకు రాజపోషకులు. గాంధి ఆంధ్ర మహా విద్యాలయ స్థాపకులు. ఏలూరులోని అన్నదాన సమాజమునకు శాశ్వత ధర్మకర్తలు. ఏలూరు గోసంరక్షణ సమితి కధ్యక్షులు. ఆంధ్ర రాష్ట్ర జీవకారుణ్య సంఘ సభ్యులు. ఏలూరులోని హిందూ యువజనసంఘమునకు ఏఁబదివేల విరాళ మిచ్చిరి. 'మోతే వంశ్యుఁడు గంగరాజు ధనవన్ముఖ్యుండు సద్దాత....'* యని తిరుపతి వెంకటకవులు గంగరాజుగారి వితరణ గుణమును కీర్తించిరి.

మోతే నారాయణరావుగారు ఆంధ్ర నాటక కళాపరిషత్తు పశ్చిమ గోదావరి జిల్లా శాఖకు అధ్యక్షులు. వీరు ఏలూరునందు సీతారామాంజనేయ నాటక సమాజము అను సంస్థను నెలకొల్పి నటులను, నాటకకర్తలను పోషించిరి. శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి యను కవి వీరి యాశ్రితుఁడు. తిరుపతి వేంకటకవు లాంధ్రీకరించిన మృచ్ఛకటిక నాటకమును ప్రదర్శింపఁజేసి నారాయణరావుగారు చెళ్ళపిళ్ళవారి నాహ్వానించి నూటపదాఱులతో సమ్మానించిరి.† వీరు పంచాంగ కర్తలనుగూడ పోషించిరి.

Waltair, 1957, pp. 1–43.

* నానారాజ సందర్శనము, ఉత్తరార్ధము, పు. 287.

† కథలు–గాథలు, సంపుటము 3, నానారాజ సందర్శనము, ఉత్తరార్థము, పు. 236.

## రాయదుర్గము

విజయనగర సామ్రాజ్యములోని పెద్ద సీమలలో నిది యొకటి. విజయ నగర సామ్రాజ్య పతనానాంతరము పాళయగాండ్ర సంస్థానముగాఁ బ్రసిద్ధము. అనంతపురమునకు పడమరగా అఱువది మైళ్ళ దూరమున రాయదుర్గ మున్నది. నేఁటి రాయదుర్గము తాలూకా కిది ముఖ్యపట్టణము. విజయనగర సామ్రాజ్యము నకు అంకురార్పణము జరిగిన కాలమునందే విజయనగర సామంతుఁడగు భూపతిరావు అను నతడు రాయదుర్గము కొండమీఁద నొక మట్టికోటను గట్టి రాజ్యమును చేసెనఁట. కృష్ణదేవరాయల కాలమున బేడరు (బోయ) తెగకుఁ జెందిన జంగీనాయకున కీ దుర్గము ప్రసాదింపఁ బడెనఁట.

ఈ పాళయగాండ్ర మూలపురుషుఁడు వానరాసి చెంచమనాయకుఁడు. ఇతఁడును, ఇతని కుమారుఁడగు కస్తూరినాయకుఁడును చంద్రగిరి పాలకుల కొలువులో మేటి పదవాళ్ళుగా మెప్పులందినవారు. జంగానాయకుఁ డీ కొండ మీఁద నొక మట్టికోటను, రాజమహాలును నిర్మించి 1564 దాఁక రాజదళవాయిగా ప్రసిద్ధిం చెనఁట. ఆ పిమ్మట నిది బిజాపురము సుల్తానులకు సామంతరాజ్య మయినది. రాజదళవాయి పెదకోనేటి నాయకుఁడు (1635–1670) కొంత కాలము పెనుగొండకు పాలకుఁడు. ఈతని భార్య విఠలాంబిక.* అరవీటి వెంకటపతిరాయల భోగాంగన తనయయఁట. పెదకోనేటి నాయకుని వంశీయులు కొంతకాలము కుందుర్తి, రాయదుర్గము సీమలనుగూడ పాలించినవారు.

పెదకోనేటి నాయకునకు దౌహిత్రుఁడును, లచ్చమాంబా వెంకటప్ప (1680—1700) ల పుత్రుఁడును నగు పెదతిమ్మ భూపాలుఁడు (1700–1732) కర్ణాట రాయదళవాయిగా, కర్ణాటకటక దీక్షాదక్షుఁడుగా ప్రసిద్ధుఁడు. ఈతడు కొంత కాలము రాజ్యము పాలించి విరాగియయి 1723 లో రాజ్యభారమును తమ్ముఁ డగు వెంకటపతి (1723–1746) కప్పగించి 1732 లో పరమపదించెను. ఈ వెంకటపతి హైదరాలీకి చేదోడుగా నుండినవాఁడు. ఈతని పుత్రులగు కోనేటి (1746-1754), రాజగోపాల (1754–1756), తిమ్మప్ప (1756-- 1777) లు క్రమముగా పాళయప్పట్టు దొరలుగా పాలించిరి. కుటిల రాజనీతి కోవిదుఁడగు హైదరాలీచే తిమ్మప్ప ఓడింపఁబడి శ్రీరంగపట్టణమునకు ఖైదీగా కొనిపోఁబడినాఁడు. తిమ్మప్ప మరణానంతరము అతని అన్నయగు రాజగోపాల నాయకుని కుమారుఁడు వెంకటపతి నాయకుఁడు (1777–1787) గద్దె నెక్కెను. ఇతఁడుకూడ టిప్పు సుల్తానుచేత రాజ్యభ్రష్టుఁడై శ్రీరంగ పట్టణము ఖైదులో మరణించెను. ఇతని కుమారుఁడు తిమ్మప్ప (1787–1799) తండ్రివలెనే దుర్మరణము పాలయ్యెను.

* ఉద్దాంబ, విద్దాంబ యని కావ్య సాహిత్య వ్యవహారము.

1799 లో శ్రీరంగ పట్టణము పతనముతో చెఱనుండి విడుదలపొందిన రాజగోపాల నాయకుఁడు (1799–1800 వెనుకటి తిమ్మప్పనాయకుని చెల్లెలగు నిక్కాజియమ్మ కుమారుఁడు) రాయదుర్గమునకు తిరిగివచ్చి సంస్థానమును పూర్వ మర్యాదలతో పాలించుచుండఁగా నిజామువారి సేనాని గొప్ప సేనతోవచ్చి రాజ గోపాల నాయకుని బంధించి హైదరాబాదునకు తీసికొనిపోయి ఆ తరువాత గుత్తిదుర్గమున చెఱయందుంచిరి. 1800 లో రాయదుర్గము కుంఫిణీ వశమయినది. 1837 నుండి తిమ్మప్ప (1787–1799) భార్యకు మాత్రము నెలకు ముప్పది వరహాల చొప్పున కుంఫిణీవారు భరణమిచ్చుచు వచ్చిరి.

రాయదుర్గము పాళయగాండ్రు వైష్ణవ మతానుయాయులు. కోటి కన్యా దానము తిరుమల తాతయాచార్యుల శిష్యులు. వేంకటేశ్వరస్వామి భక్తులు ప్రతిజ్ఞా పరశురామ, సత్యభాషా హరిశ్చంద్రయను హెచ్చరికలు, సమరనిశ్శంక, సామంతబారా మంతలీకరగండ, హత్తుముప్వరగండ, హన్నిబ్బరగండ మున్నగు బిరుదములును వీరికుండినవి.

వసిష్ఠగోత్రుఁడును, ఆశ్వలాయన సూత్రుఁడును, లక్ష్మమాంబా వేంకటా ర్యుల పుత్రుఁడును, రాజాస్థానములలో బహుశావధానము లొనరించి చతుర్విధ కవిత్వ ప్రౌఢిమను ప్రదర్శించి బహువిధ సత్కారములను బడసినవాఁడును, మధుర వాణీవిలాస ప్రబంధ నిర్మాతయునునగు చింతలపల్లి వీరరాఘవకవి (క్రీ. శ. 1660) రాయదుర్గపాలకుల సమ్మానముల నందినట్లు 'జాములో శతకంబు సంధించి కంకణాదులు గొంటి పల రాయదుర్గమునను' అను మధుర వాణీవిలాస కృత్యవతరణిక మూలమునఁ దెలియవచ్చుచున్నది.

రాయదుర్గ పాళయగాండ్రలో ప్రసిద్ధుఁడగు కర్ణాటరామ దళవాయి పెదతిమ్మభూపాలుఁడు (1700–1732) ప్రసన్న వేంకటేశ్వర విలాసమను యక్షగానమునకు కర్త.* కోటి కన్యాదానము తిరుమల తాతాచార్య సంతతికిఁ జెందిన వీరరాఘవాచార్యుల శిష్యుఁడితఁడు. రాయదుర్గమునందు వెలసిన వేంకటేశ్వర స్వామి వీరి కులదైవము. ఈ వేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవ సమయమునందు తిరువీథులు వేంచేయఁగా కనులారఁగాంచి పరవశించిన కళావతి యను వేశ్యకన్య వేంకటేశ్వరుని ప్రార్థించి పెండ్లియాడిన కథ శృంగార రసప్రధానమయిన యీయక్షగాన మందలి యితివృత్తము. రాయదుర్గ విహారి వేంకటేశ్వరునకిది యంకితము. విశిష్ట వైష్ణవభక్తి సంప్రదాయ పరిపుష్టమగు నీ కృతి భావ మాధుర్యమునకు, భాషా సౌందర్యమునకు చక్కని ఉదాహరణము.

*Edited by V. R. Acharya, Bulletin of the Madras Government Oriental Manuscripts Library, Vol. IX, No. 1, 1956, Text, pp. 57 – 79.

## వడ్డాది

విశాఖపట్టణమండలము చోడవరము తాలూకాలో అనకాపల్లికి అయిదు పరువుల దూరములోఁగల పట్టణము వడ్డాది. ఒడ్డవాది, ఒడ్డాది యని శాసన పాఠములందును, కావ్య సాహిత్యమునందును వ్యవహారము. పాలకుల పూర్వులు మత్స్యలాంఛనులు, మత్స్యవంశీయులు; మహామండలేశ్వరులు.* అపునోకాదోగాని ఈ వడ్డాదియే విరాటుని రాజధానియఁట.† విజయ వీరప్రతాప వీర శ్రీజగన్నాథభూపతి దేవవర్మగారి పౌత్రులును, గోపాలభూపతి దేవవర్మ గారి జ్యేష్ఠపుత్రులును నగు శ్రీజగన్నాథ భూపతివర్మ వడ్డాదిపాలకుల సదుదులో ఆధునికులు. వీరు మాడుగుల వాస్తవ్యులు. సంస్కృతాంధ్రాది భాషలలో గొప్పపండితులు. జగన్నాథ భూపతీయంబను అశ్వలక్షణమును, వ్యాయామ శాస్త్రమును గద్యరూపమున వీరు రచించిరి.

వీరి తనయయగు ప్రభావతీదేవియును కవయిత్రియఁట! ఈమె కావ్యస్మృతితీర్థ పురాణం సూర్యనారాయణ తీర్థుల శిష్య.

## వేగాయమ్మపేట

ఇది తూర్పుగోదావరి మండలమునందలి ఎనిమిది గ్రామములతోఁ గూడిన ఎస్టేటు. ఇవి ఎస్టేటు సొంతదారుల పూర్వుల శాస్త్ర పాండితీపటిమను మెచ్చి నిజాము ఈనాముగానిచ్చిన సీమయఁట. 1803 లో వాడ్రేవు సోమప్పగారి పేర నిది సమోదయియుండినది. దీనికి దొడ్డమపేట సంస్థానమనియు నామాంతర ముండినది. దీని వరంబడి రూ. 13 వేలు; పేష్కషు రూ. 9 వేలు. 1879 ప్రాంతముల ఈ యెస్టేటును పాలించిన వాడ్రేవు రంగనాయకమ్మగారు పాలకులలో పదునొకొండవ తరమువారు. ఈమెకు పుత్రసంతతి లేనందున ఏకైక పుత్రికయగు మహాలక్ష్మమ్మగారిని కస్తూరి నరసింహారావుగారి కిచ్చి యిల్లటపుటల్లునిగా నిలిపికొనియుండిరి. ఈ దంపతుల కుమారుఁడు వాడ్రేవు విశ్వసుందరరావుగారు. వీరు లక్కవరము జమీందారులకు బంధువులు.

విశ్వసుందరరావుగారు కవిపండిత పోషకులు. ఈయన మాతామహి వాడ్రేవు రంగనాయకమ్మ జమీందారిణిగారు రామచంద్రపురము తాలూకా యోగమాంబపేటలో బీదవిద్యార్థులకు పాఠశాలను స్థాపించియుండిరి. ప్రసిద్ధులగు వడ్డాది సుబ్బరాయకవిగారు రంగనాయకమ్మగారి సమాదరణమున విద్యాభ్యాసాద్యభ్యుదయముల నందినవారు. సుబ్బరాయకవి రచించిన వసురాయ చాటుప్రబంధము ముద్రణవిషయమున మిగుల ప్రోత్సాహపఱిచి ముద్రాభృతిని

*Epigraphia Indica, Vol. V, pp. 106 - 112.

†ఆంధ్రపత్రిక, అంగీరస ఉగాదిసంచిక, 1932, పు. 309.

సర్వమొసంగి గౌరవించిన కవితార్కికసజ్జనులు విశ్వసుందరరావుగారు. వీరు తిరుపతి వెంకటకవులనుగూడ సత్కరించిరి. కోన వెంకటరాయశర్మ మొదలగు కవి పండితులను గ్రంథ ప్రచురణమునకు బహువిధముల ప్రోత్సహించిరి. విశ్వసుందర రావుగారు ఆంధ్రభారతీయ పరిశోధకమండలికి సహాయులు. కపిలేశ్వరపురము నందలి హిందూధర్మశాస్త్ర గ్రంథనిలయమునకు పోషకులు. వెలనాటి వైదికులు కౌశికసగోత్రులును ఆపస్తంబసూత్రులును శ్రోత్రియశాస్త్ర ప్రవీణులును నాటకా లంకార సాహిత్యపరిపూర్ణులును నగు శ్రీపాద శివరామ సిద్ధాంతిగారు [illegible] పేట సంస్థానపండితులు, పంచాంగకర్తలు.

## సాయపనేనివారు

విజయనగరసామ్రాజ్యములోని డెబ్బదియేడు అమరనాయకములలో దూపాటిసీమ యొకటి. 533 గ్రామముల సంస్థానమిది. దీనిపాలకులు మాదాల గోత్రజులగు సాయపనేనివారు. సాయపనేఁడు వీరి మూలపురుషుఁడు. చామని నాయఁడు, భోగన్ననాయఁడు, గంగయ్యనాయఁడు, మల్లానాయఁడు మొదలగు వారు వీరిపూర్వులు. శేషాచలపతినాయుడు, సుబ్బానాయుడు చివరిపాలకులు. కిలారు, పెమ్మసాని, రావూరి, రావెళ్ళ గృహనామములగు వెలమవారు వీరి బంధువులు.

సాయపనేనివారి పూర్వులందఱును కవిపండితపోషకులైనట్లు, 'నానా దేశాలనుంచి కవీశ్వరులు, భట్రాజులు, పాటలవారు అనేకముగా వస్తూ వుండడము చేతనును వారి పెద్దలు విస్తారంగా దానధర్మాలు చేసినందున వీరు బహుళాగా ప్రశస్తము అయివుండడము....' అను దూపాటి కైఫీయతు ఉద్ధరణమునుబట్టి స్పష్టపడుచున్నది.*

మల్లానాయనిపౌత్రుఁడును, రంగనాథనాయని పుత్రుఁడును, పెమ్మసాని వారి యల్లుఁడును సాయపనేని వెంకటాద్రి పండితకవి. ఇతఁడు సకల సంజీవన మను ప్రౌఢప్రబంధమునకు కర్త. ఇతని పెదతండ్రి వెంకటాద్రి తంగెడ సీమలో అగ్రహారము నేర్పఱచినట్లు 'సాయప వేంకటపతి ఘనాఘన దత్తాగ్ర హార ప్రాగ్దేశాయత దేవాలయమునఁ బాయక వసియించు గోపధామాపతికిన్' (పీఠిక, 99) అను అప్పకవియ షష్ఠ్యంత పద్యము సాక్ష్యము.

## సిరిపురము

హవేలీభూఖండములనుండి రూపొందిన ప్రొప్రయిటరీ ఎస్టేటు.

*దూపాటి కైఫీయతు, Edited by T. Sridhara Murthi and N. Sarveswara Rao, Bulletin of the Govt. Oriental Manuscripts Library, Vol. XIV, p. 20.

1802 లో విజయనగరము రాజాగారిచే కొనుగోలుచేయఁబడి యా పిమ్మట కొన్నిచేతులు మారి బొబ్బిలిపాలకుల బంధువులగు ఇనుగంటివారిచేతి కీ యెస్టేటు వచ్చినది. మహారాజా సర్ శ్వేతా చలపతిరంగారావుగారి మేనమామయును, బొబ్బిలివారి సచివులును అగు ఇనుగంటి సీతారామారావుగారు సిరిపురము ప్రొప్రయిటరు. ఇనుగంటి సీతాంబారాయడప్పగారల వారసులుగా రాజా యినుగంటి గోపాలరావుగారికి అనంతరకాలమునందు ఉంగరాడ, కింతలి, మంతెన ఎస్టేటులుకూడ దఖలుపడినవి. ఈ యన్ని యెస్టేటుల ఆదాయము సుమారు లక్షరూపాయలు; పేష్కషు రూ. 24 వేలు. 1938 నాటి యెస్టేటు సొంతదారు ఇనుగంటి సూర్యారావుగారు. చిత్రాడరాణి భావయాంబ (పిఠాపురము రాజా గంగాధర రామారావుగారి అయిదవుభార్య)గారి యభిమానపుత్రికయగు రాజ్యలక్ష్మి రాజా యినుగంటి సూర్యప్రకాశరాయనింగారి భార్య. సిరిపురము జమీందారులు అన్నవరము దేవస్థానమునకు వంశపరంపరగా ధర్మకర్తలు. చెళ్ళపిళ్ళ వెంకటకవి, దాసరి లక్ష్మణకవి మున్నగు పండితకవులను వీరు సత్కరించిరి. చెళ్ళపిళ్ళవారికి నూటపదార్ల వార్షికముగూడ నుండినది.

## సూదాపాలెము

తూర్పుగోదావరిమండలమునందలి అమలాపురముతాలూకాలోని భీమనపల్లికి చేరువలోని యొక గ్రామము సూదాపాలెము. వోలేటివారి మాగాము ఎస్టేటులోని కొంతభాగమును, అనాతవరము మున్నగు నెస్టేటుగ్రామములలోని కొంతభాగమును జేరి యేర్పడిన దీ యెస్టేటు. ఆగర్భ శ్రీమంతులు సిరంగు సత్తిరాజుగా రీ యెస్టేటు సొంతదారులు. వీరిది తెలగాతెగ. పైడిపాలగోత్రము. కోనసీమలో సిరంగువారిది గొప్ప కుటుంబ. ఈ విషయమే మదాలసావిలాసమునం దిట్లు వివృతము :

శీ. 'మాన్యుత్తముండు సత్తిరాజు దొలుతం మాగాము ప్రొప్రైటర్
మాన్యుండయ్యును నయ్యనాతవరనామ గ్రామ రాజం బసా
మాన్య ద్రవ్యమొసంగి బీతపురసామంతేంద్రునొద్దన్ గొనెన్
....జమీందారన్న ఖ్యాతిన్ గనెన్' —(1–97).
'తన వంశోద్భవు లెవ్వరొందని జమీందారీయు శ్రీకారమున్' (1–153)

గన్నవాఁడు సత్తిరాజు.

కవితాభూషణ విద్వత్కవిశేఖర వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారి మదాలసావిలాసమను మూఁడాశ్వాసముల ప్రౌఢప్రబంధము. సిరంగు సత్తిరాజుగారి యభ్యుదయము నిమిత్తము సత్తిరాజుగారి ధర్మపత్నియగు రంగనాయకాంబగారి స్మృత్యర్థము ప్రచురితము. సత్తిరాజుగారు వెంపరాలవారికి విలువైన మాన్యములొసఁగి సత్కరించిరి. వెంపరాలవారు వెలనాటి వైదికులు. ముని

త్రయ చరిత్ర, శబరశంకరవిలాస, శంకరవిజయాది ప్రౌఢ రచనములు వెంప రాలవారి కృత్యంతరములు. మార్కండేయ పురాణాంతర్గతమగు మదాలసా కువలయాశ్వుల ప్రణయగాథ నితివృత్తముగా స్వీకరించి కవిప్రబంధఫక్కిలో మదాలసావిలాసమనుపేర నిబంధించినాఁడు. కోనసీమవారిది కొబ్బెరకాయపాక మని యొక నానుడి. కాని విద్వత్కవిభూషణులగు వెంపరాలవారి కవిత ప్రసాదగుణభరితమని సాహిత్యవార్శనికుల విమర్శము.

## సైదాపురము

ప్రసిద్ధమయిన పడమటిపాళయములలో నిది యొకటి. నెల్లూరుజిల్లాలో వెనుకటి రాపూరుతాలూకాలో నీ సంస్థానము వ్యాపించియుండినది. గ్రామముల మొత్తము నూటపదియేను. ఇందు 52 జిరాయితీలు, 57 శ్రోత్రియములు, తక్కిన యాఱును అమానిగ్రామములు. బేరీజు ముప్పదివేల వూలవరహాలు. దీని పాలకులు జూపల్లివారను వెలమదొరలు. వీరి మఱియొకకోవ ఉదయగిరి పాళయగాండ్రు. జూపల్లి గోపాలనాయఁడు సర్కారునకు కప్పములు బకాయి పడినందున 1751 లో సంస్థానము సర్కారువశమయినది. ఆ తరువాత 1764 లో ఏలములో దీనిని నరసరావుపేట జమీందారులు రాజా మల్రాజు వేంకటగుండారావుగారు ఖరీదుచేసి ఆఱేండ్లు పాలించిరి. ఆ పిమ్మట తమ అల్లుఁడును, జూపల్లి గోపాలనాయని తమ్ముఁడును నగు మల్లానాయనికి దఖలు పఱిచిరి. మల్లానాయని ఏలుబడిలో సంస్థానము మూఁడేండ్లుండినది. కాని ఆర్థిక స్థితి చక్కఁబడనందున జమీ తిరిగి జప్తునకు వచ్చినది. అటుపిమ్మట మల్రాజు వెంకటగుండారావుగారి భార్య రాణిలక్ష్మమ్మగారి స్వాధీనమునకు వచ్చినది. పేష్కషు బకాయిపేర నరసరావుపేట జమీందారీతోపాటు 1841 లో సైదాపురముగూడ కుంఫిణీకి స్వాధీనమయినది. జూపల్లివారి కవితాపోషణ వివరములు స్పష్టముగా తెలియవుగాని ఈ వంశీయులపేర ప్రచారములోనున్న చాటువులు వీరి పండిత పోషణమును బట్టియిచ్చుచున్నవి.

## హండే అనంతపురము

ఇది అనంతపుర మండలమునందలి అనంతపుర పట్టణ పరిసరముల వెలసియుండిన పాళయగాండ్ర సంస్థానము. ఈ సంస్థాన పాలకులు విజయ నగరమునకు సామంతులుగా, నాడు కావలిదొరలుగా సేవచేసిన హండే వంశీయులు. తాడిమఱ్ఱి, పందికుంటబళ్ళారి, రాయదుర్గము, సురపురము పాలకులవలె వీరును బేడరు తెగకుఁ జెందినవారు. ఈ కుదురునందలి దేవప్పనాయఁడు, విజయనగర సేనావాహినిలో గొప్పసేనాని. హనుమప్పనాయకుఁడు (1510—1583) అళియ రామరాయలకు కుడిబుజమువంటివాఁడు. ఈతఁడే సంస్థాన

సంపాదకుఁడు.

ఈతని తరువాత హంపానాయఁడు, మలకప్పనాయఁడు, ప్రసన్నసిద్ధప్ప నాయఁడు, పవాడప్పనాయఁడు, సిద్ధప్పనాయఁడు, ప్రసన్నప్పనాయఁడు. పవాడప్పనాయఁడు, సిద్ధప్పనాయఁడు మున్నగువారు పాలించిరి. చివరివాఁడయిన సిద్ధరామప్పనాయఁడు (1796–1811) ఇంగ్లీషు కుంఫిణీ ప్రతినిధి మంరోదొరగారివలన భరణమును పొందినవాఁడు.

తిరుమల ఉప్పురపల్లెవారను శ్రీవైష్ణవులు శఠమర్షణ గోత్రజులు. వీరి యాస్థానపండితులుగా నుండిరి. వీరు సంస్థాన పాలకులకు ఆచార్యపురుషులు గూడ. తర్క—వ్యాకరణ సాహిత్యములందు అసాధారణమగు ప్రజ్ఞాప్రాభవములు గలవారు. వీరి కవితావ్యవసాయము ధ్యేయము లోకశ్రేయము.

## ఉపజీవ్య గ్రంథసూచి


1. విశాఖపట్టణము జిల్లా వృత్తాంత సంగ్రహము.
2. అముద్రిత గ్రంథ చింతామణి సంపుటములు.
3. ఆంధ్ర విజ్ఞాన సంపుటములు.
4. గోలకొండ కవుల సంచిక.
5. అక్కరాజు నరసింహారావు, వంగోలు రాజ్య చరిత్ర, వంగోలు, 1926.
6. దాసరి లక్ష్మణకవి, నా జీవిత యాత్ర.
7. తిరుపతి వేంకటకవులు, నానారాజ సందర్శనము.
8. మంత్రిప్రెగడ భుజంగరావు, హైమవతీ పరిణయము.
9. చెలికాని సూర్యారావు, లచ్చారావుగారి జీవిత చరిత్రము.
10. శ్రీరామ్ వీరబ్రహ్మకవి, నానారాజన్యవిఖ్యాత జనచరిత్ర, మచిలీపట్టణము, 1930.
11. కొమాండూరి శఠకోపాచార్యులు, జమీందారీ కమిటీ రిపోర్టు, కాకినాడ ముద్రాక్షర శాల, కాకినాడ, 1939.
12. కొత్త భావయ్య చౌదరి, కమ్మవారి చరిత్రము, నరేంద్రనాథ సాహిత్య మండలి ప్రచురణము, తణుకు, 1962.
13. అయ్యదేవర కాళేశ్వరరావు, నా జీవిత కథ – నవ్యాంధ్రము, 1959.
14. M.A.M.P. Vol. III.
15. A. Vadivelu, The Aristocracy of Southern India, Vols. I and II.
16. A. Vadivelu, The Ruling Chiefs, Nobles & Zamindars of India, 1915.

17. The Annals of Hande Anantapuram, Edited by G. V. Appa Row.

18. V. L. Sastry and M. Venkatarangaiah, Encyclopaedia of the Madras Presidency and the Adjacent States.

19. R. Subba Rao, Correspondence between The East India Company and The Kandregula Family in the Eighteenth Century, J.A.H.R.S., Vol. III, pp. 209-222.

20. Report of the Madras Estates Land Act Committee, Part II.

# సూచి*



*సూచిని నిర్మించుటలో సారథ్యము వహించినవారు : శ్రీయుతులు డా. లకంసాని చక్రధరరావు, వెల్చేరు నారాయణరావుగారలు. చేదోడుగా నుండినవారు : సూరి అప్పయ్య, ఎం. ఆంతోని, పి. వి. హనుమంతరావు, ఎల్. నరేంద్రబాబు, జంపన పెద్దిరాజు, గూడ ప్రభాకరరావు, బూదరాజు రాఘవేంద్రరావు, నేరళ్ళ రామకృష్ణారావు, టి. సత్యనారాయణమూర్తి, మిక్కిలినేని సుశీల, వేములపల్లి శోభనాదేవి, ఏ. వీరరాఘవరావు, ఇర్ల వెంకటేశ్వర్లు.